మహమ్మదీయులచరిత్ర మాత్రమని యర్థముగాదు. ఇది కాల సూచకమైన యొక గుఱుతు. ఈ కాలమునందు హిందూదేశ మందు హిందూరాజ్యము లనేకములు ప్రబలెను. ముసల్మాన్ రాజ్యమునకుఁ బ్రబల ప్రతిస్పర్థులయిన యీ రాజుల యశో గానము చేసినఁగాని యీ కాలపుచరిత్ర పూర్తిగా వర్ణించితి మని చెప్పుట తప్పు. వైభవాదికములలో ఢిల్లీరాజ్యమును గూడ మించినట్టి విజయనగరసామ్రాజ్యమును గుఱించి యిప్పటి చరిత్ర గ్రంథములలోఁ బదిపంక్తులు వ్రాయుదురు! ఇది మిక్కిలి యన్యాయము. నేనట్లు చేయక హిందూరాజుల పౌరుషాదులను మహమ్మదీయుల పౌరుషాదులతోఁ బాటు వర్ణించినాఁడను.

మహమ్మదీయులను మొదటినుండియు నుత్తరమున నెదిరించిన వారు రాజపుత్రులు; దక్షిణమునందు నడ్డగించినవారు విజయనగరరాజులు. కావున వీరి చరిత్రలను సవిస్తరముగా నైదవ యారవ ప్రకరణములలోఁ వర్ణించినాఁడను. మహారాష్ట్రుల చరిత్రకూడ నిందు వ్రాయవలసినదే. కాని యీచరిత్ర కొత్తగా వ్రాయుట కష్టముగాక యుండ విడిచివేసినాఁడను. ఈ గ్రంథము యొక్క మూఁడవ భాగమునందు మహారాష్ట్రుల చరిత్ర సవిస్తరముగా వర్ణింపఁబడును. ఇదివఱ కనుకొన్నట్లు ఈ గ్రంథము మూఁడుభాగములలోఁ గాక నాలుగు భాగములలోఁ బ్రా-

ను. మూఁడవభాగములో మహారాష్ట్రుల చరిత్ర
గములో బ్రిటిషు ప్రభుత్వమును వర్ణింపఁబడును.

వులు ముసల్మానులకు సామాన్యముగా వశుల
లైరి. వారు తురుష్కులను బూ
సార్వభౌమత్వ మనుభవింప నీయలే
ఒకానొకప్పుడోడిపోయినను మరలఁబ్రో
చ్చుకొని తమ స్వాతంత్ర్యమును సంపాదించు చుం
కించి నేను చెప్పుటకంటె విఖ్యాత చరిత్రలేఖకుఁ
ల్యూ. డబ్ల్యూ. హంటర్ వ్రాసినయంశము లిచ్చుట ను
మంచిదని తలఁచి యట్లు చేయుచున్నాఁడను:—

ములోని
ముచేసిరి?

మ్మదీయులకు హిందూదేశము సులభముగా స్వా
మయ్యెనని సామాన్యముగా జను లనుకొ
మాట నమ్మఁదగిన చరిత్రాంశము కాదు.
...మహమ్మదీయులు హిందూదేశమంతఁ
నెప్పుడును జయింపలేదు. గొప్ప రాజ్య
మా రాజులే యెల్లప్పుడు నేలుచుండిరి. మహమ్మదీ
మహోన్నతదశయందున్నప్పుడు కొందఱు హింద
లు ఢిల్లీశ్వరునకుఁ గప్పము కట్టుచు నాతని యాస్థా
సమరాయబారులఁ బంపుచుండిరి. కాని ఢిల్లీశ్వరు
కీయసంపూర్ణ సార్వభౌమత్వము గూ
నూటయేఁబది యేండ్లయినను (౧౫౬౦
౧౭౦౭) దక్కినది కాదు. ఇంతలోనే హిం

య దిగ్వి
ం పూర్ణ

ం మల్ప
నది.

వులు దేశ దిగ్విజయమును మర[illegible]భించిరి. రాజపుత్ర స్థానములోని శౌర్యాగ్ని [illegible] యును దక్షిణమునుండి ముట్టడి వేయుచుండెను. [illegible]దిక్కున సిక్కులను మత సంఘము [illegible] క్షాత్ర వీరులుగా మారఁ జొచ్చిరి. క్రిందిజాతులవారి యుద్ధసామర్థ్యమునకు, బ్రాహ్మణుల రాజనీతి నైపుణ్యంబును జతపఱిచి మరాటావారు హిందూదేశమునం దంతటను దురుష్కరాజులు తమకుఁ గప్పములు కట్టునట్లుగాఁ జేయుచుండిరి. ప్రస్తుతము మన మూహించేయఁ గలిగి నంతవఱకు జూడఁగా నింగ్లీషువారీ శతాబ్ద ప్రారంభమున నడ్డపడి యుండని యెడల మొగలరాజ్యము హిందువుల స్వాధీనమై యుండును'.*

హిందువులుముసల్మానుల యొద్దనుండి తమ దేశమును మరల సంపాదించిరి. ౧౭౦౭ - ౧౭౬౧.

* "The popular notion that India fell an easy prey to the Mussalmans is opposed to historical facts.................At no time was Islam triumphant throughout the whole of India. Hindu dynasties always ruled over large areas. At the height of the Muhammadan power, the Hindu princes paid tribute and sent agents to the Imperial Court. But even this modified supremacy of Delhi did not last for 150 years (1560-1707). Before the end of that brief period, the Hindus had begun the work of re-conquest. The Hindu chivalry of Rajputana was closing in upon Delhi from the south ; the religious confederation of the Sikhs was growing into a military power on the north-west. The Mahrattas had combined the fighting powers of the low-castes with the statesmanship of the Brahmins, and were subjecting the Muhammadan kingdoms throughout all India to tribute. As far as can now be estimated, the advance of the English power at the beginning of the present century alone saved the Mogul Empire from passing to the Hindus."—*Dr. W. W. Hunter's "Indian Empire", 3rd Edition, p. 323.*

ఇట్లు హిందువులు మహమ్మదీయులతో సమానముగాఁ బోరాడిరి. కావున మహమ్మదీయ మహాయుగ చరిత్రలో రెండుభాగములు కలవు. ఒకటి: మహమ్మదీయు లీ దేశమును గెలుచుట. రెండవది: వారిని హిందువు లెదిరించుట. ఈ రెండు భాగములను వ్రాసినఁగాని చరిత్ర పూర్తికానేరదు. నేను నిష్పక్ష పాతబుద్ధితో నీ రెండుభాగములను వర్ణించుటకు యత్నించినాఁడను. పూర్వచరిత్రకారు లొకభాగమును మాత్రము వ్రాసిరి. ఈ కాలపుకథాభాగము వ్రాయునపు డిదివఱకుఁ జరిత్రలు వ్రాసినవారు మహమ్మదీయుల దిగ్విజయములను, హిందువుల పరాజయములను మాత్రము వర్ణించిరి. హిందువులకుఁ గలిగిన జయములును నారోడిపోయిన యుద్ధములలోఁ జూపిన యద్వితీయశౌర్యసాహసస్వదేశాభిమానములును, వారి పరాజయములకుఁ గలమోసము మొదలయిన కారణములును జక్కఁగ వర్ణించినవారు కారు. పానిపట్టు సంగరములో పృథ్వీరాయలకుఁ బరాభవము గలిగెనందురే కాని యందుకుఁ గారణములయిన గృహఛేద మిత్రద్రోహములఁ జెప్పరైరి. ఫతేపూర్ సిక్రీలో బాబర్ సంగరాణాను ఓడించెనని వ్రాయుదురేగాని, యందు బాబర్ చేసినమోసమును, ఒక రాజపుత్రుఁడు చేసిన దేశద్రోహమును వర్ణింపరు! తుదకు

పూర్వచరిత్రకారు లేకదేశపు వ్రాఁతలు వ్రాసిరి.

హిందువుల కీర్తిప్రదము లగు పరాజయములు (Glorious defeats) గూడఁ జక్కఁగ వివరించినవారుకారు.

హిందువుల పరాజయము లభిమన్యుని పరాజయములవంటివి.

బహుయుద్ధములలో హిందువు లభిమన్యునివలెఁ బోరాడి యాశూరునివలెనే మోసమునకు లోనై పరాజితులయిరి. భారతమునందు నభిమన్యు వధప్రకరణము వ్రాయునప్పుడు కవి, కర్ణ దుశ్శాసనాదుల శౌర్యమును మాత్రము వర్ణించి, యభిమన్యుని యుద్ధకౌశలమును వర్ణింపక అభిమన్యుఁడు కౌరవులచేఁ జచ్చెనని వ్రాసినఁ జాలునా? చాలదు గదా? భారతములో నభిమన్యుని యుద్ధము ప్రధానముగాని యాతని చావుకాదు. అయినను ఇదివఱకు హిందూదేశ చరిత్ర వ్రాసినవా రందఱును అభిమన్యుఁడు చచ్చెనందురు; అతని పౌరుషము వర్ణింపరు. నే నదియు సవిస్తరముగా వర్ణించితిని. ఇదియ వారికిని నాకును గల భేదము.

ముసల్మాను చరిత్రకారులు కొన్ని విపరీతములు వ్రాసిరి.

ఇదివఱకు హిందూదేశ చరిత్ర వ్రాసిన మహమ్మదీయులు కొన్ని యసత్యములను వ్రాసినారు. ఇట్టి యసత్యములను నే నచ్చటచ్చటఁ జూపియున్నాను. ముఖ్యముగా నాఱవప్రకరణములో ఫెరిస్తాయను చరిత్రకారుఁడు వ్రాసిన

యంశములను సప్రమాణముగా ఖండించియున్నాను. ఈ చరిత్రకారుఁడు కృష్ణదేవరాయలు పుట్టుటకుఁ బూర్వమే నూటయిరువది యేండ్లక్రింద నాతఁ డుండెనని వ్రాసినాఁడు! కృష్ణరాయని కాలము వర్ణించుటలో నాతనిపేరైన నుదాహరించిన వాఁడు కాఁడు!!

ఇందలివిశేషములు.

ఇదివఱకు నింగ్లీషులో నేమి యితరభాషలలో నేమి మహమ్మదీయ ప్రభుత్వ చరిత్ర వ్రాసినవారందఱును ఫెరిస్తా మొదలయిన మహమ్మదీయ చరిత్రకారుల ననుసరించియే వ్రాసినారు. ఇతర చరిత్రకారులఁ బాటించిన వారు కారు. అందుచేఁ జరిత్రలన్నియుఁ బక్షపాతభూయిష్ఠము లయి యున్నవి. ప్రతివాదిమాటయే వినక వాది చెప్పిన మాటలన్నియు నమ్మియిచ్చిన తీర్పెట్లుండును? నే నీ యాచారమును విడిచి యందఱు చరిత్రకారులు చెప్పినమాటలను గ్రహించినాఁడను. ఇదివఱకున్న చరిత్రలలోని యన్ని యంశములను గ్రహించుటయే గాక సంస్కృతము, తెలుఁగు, మరాఠీ, హిందీభాషలలోని చరిత్ర గ్రంథములందలి విషయములును, ఇతర గ్రంథములలోని చరిత్ర విషయికము లగు నంశములును ఇందు నుదాహరించి యున్నాఁడను. కావున మనము సాధారణముగాఁ జదివెడి యితర చరిత్రగ్రంథములలో లేని యనేకాంశము లిందుఁ జదువరులు చూడఁగలరు.

ఇందలి నూతనాంశములలోఁ గొన్నింటి నిచ్చట నుదాహరించుచున్నాఁడను. (౧) మహమ్మద్ గజ్నీయను వానిని అనంగపాలుఁ డోడించిన సమాచారము (౨౧ వ పుటచూడుఁడి), (౨) మహమ్మద్ గోరీని పృథ్వీరాయ లేడుసారులు పట్టుకొని యేడుమాఱులు ప్రాణదాన మొసఁగుట (౩౧ పుట), (౩) స్థానేశ్వర యుద్ధములో జరిగినమోసము (౩౪-౩౫ పుటలు). (౪) ఔరంగజేబును అయిదారుమాఱ్లోడించి స్వతంత్రుఁడైన ఛత్రసాల్ రాజు వృత్తాంతము (౧౭౧ వ పుట), (౫) అక్కన్న మాదన్నగార్ల చరిత్ర (౨౫౪ పుట), (౬) అక్బరు నోడించిన మీరాబాయి చరిత్ర (౨౯౪ పుట), ఇవిగాక యచ్చటచ్చట నూతనాంశము లనేకములు కలవు. వానినన్నిటిఁ జేర్కొనుట యనావశ్యకము.

నూతన చరిత్రాంశములు.

నూతనాంశములని పైని పేర్కొనినవానిలో మొదటిదియు నాల్గవదియు, నైదవదియునగు చరిత్రాంశములు ముఖ్యములైనవియుఁ గేవల నూతనము లయినవియునై యున్నవి. మొదటిది: గజ్నీ మహమ్మా దెన్నిమాఱులు హిందూదేశమునకు వచ్చినను హిందువుల నోడించెనేకాని యోడి పోలేదని యిదివఱకు వ్రాసిన చరిత్రకారులందఱును వ్రాసియున్నారు. ఇది నిజము

అందు ముఖ్యము లైనవి మూఁడు.

కాదు. ఇతఁడు హిందువులచే నోడింపఁబడుటయేకాక అనంగ పాలునిచేఁ బూర్తిగఁబరాభవింపఁబడె (Vanquished) నని నేను అల్‌బిరూని వ్రాఁతనుబట్టియే చూపినాను. అల్‌బిరూనీ యొక్క చరిత్రలోని యీ భాగము ఎలియట్‌చే రచింపఁబడిన చరిత్రలో (Elliot's History of India as told by its own Historians, Vol II, pp. 12 & 404) భాషాంతరీకరింపఁబడినను ఇతర చరిత్రకారులు దీనిని గప్పిపెట్టిరి, వెల్లడి చేయరైరి. నాల్గవది: ఔవరంగజేబు నోడించిన ఛత్రసాలు రాజుకథ చరిత్రకారులకు నూతనాంశము. ఇది 'భారతవర్ష్' అను మరాటీపత్రికలోనుండి గ్రహింపఁబడినది. ఈ భారతవర్షాధిపతిగారు బుందేల్‌ఖండములోని చరిత్రసాధనముల ననుసరించి యీ కథాభాగమును వ్రాసియున్నారు. అయిదవది: ఇఁక నక్కన్న మాదన్నగార్లను గూర్చిన చరిత్రాంశములుగూడ నేను నూతనముగాఁ గనుఁగొన్నవే. ఇందుఁ గొన్ని స్వయముగను మిత్రులవలనను హైద్రాబాదు రాజ్యములోఁ దెలిసికొనిన విషయములును, కొన్ని మహారాష్ట్రభాషలోని శివాజి చరిత్రనుండియుఁ, గొన్ని 'ప్రెస్‌లిస్టు ఆఫ్ డాక్యుమెంట్స్ ఇన్‌ది ఫోర్టు సెంట్‌జార్జి' అను పొత్తముండియుఁ గనుఁగొనిన విషయములును నగును. అక్కన్న మాదన్న లను పేళ్లుగలవా రెన్నఁడును గోలకొండలో నుండలేదని మైసూరులోఁ బూర్వచరిత్ర

శోధనాధికారి యగు మిస్టర్ రైస్ ఇండియన్ ఆంటిక్వేరిలో వాదించెను! కావున అక్కన్న మాదన్నగార్లను గుఱించిన యీ నూతన పరిశోధనము లాంధ్రుల కామోదావహము లగునుగాక.

ఈగ్రంథము నిష్పక్షపాతబుద్ధితో వ్రాయఁబడినది.

పైని హిందువుల కనుకూలముగాఁ జెప్పిన యంశములను బట్టి నే నీ చరిత్రలోఁ బక్షపాత బుద్ధితోఁ దురుష్కులను గూర్చి సత్యాంశములను వ్రాయక, వారినిగుఱించి మంచి వ్రాయవలసివచ్చినప్పుడు దానిని వదలితి నని కొందఱూహించెద రేమో. అట్లనుకొనుటతప్పు. నే నీ చరిత్ర వ్రాయుటలో 'అయంనిజఃపరోవా' యన్న భేదము పాటింపలేదు. నిష్పక్షపాతబుద్ధితోఁ దురుష్కులు వ్రాసినయంశముల నుదాహరించినాఁడను. ఏ యంశములను వదలలేదు. ఆ మీఁద ఆ యంశము లసత్యములని తోఁచినప్పు డదియు వ్రాసితిని. ఇంతియ. నాయకుఁడు తురుష్కుఁడన్న మాత్రమున నే నెచ్చటను పూజ్యపూజా వ్యతిక్రమము సల్పలేదు. తురుష్కవీరులను, సత్ప్రభువులను, సన్మంత్రులను వారు తురుష్కు లన్న భేదములేక మనస్ఫూర్తిగాఁ

సమబుద్ధికి నుదాహరణములు.

బొగడి యున్నాను. గజ్నీమహమూదు స్వభావవర్ణన (౨౨ వ పుట), నాసిరుద్దీన్ మహమూద్ (౮౮ వ పుట), గ్యాసుద్దీన్

బల్బన్ (౪౫-౪౬ వ పుటలు), ఫిరోజ్ తుఘ్లుఘ్ (౬౮ వ పుట) బాబర్ స్వభావము(౮౫ వ పుట), అక్బర్ (౯౩ వ పుట), వజీర్ మహమ్మద్ గవాన్ (౨౦౯ వ పుట), చాందబీబీ (౨౨౧ వ పుట), స్వామిభక్తి పరాయణుఁడగు అబ్దుర్ రజాకు (౨౬౩ వ పుట), మొదలయిన ప్రకరణములు చూచితి రేని, నా నిష్పక్షపాతబుద్ధి వెల్లడికాఁగలదు. తుదకు హిందువులకుఁ బరమవిరోధి యగు 'ఔరంగజేబుయొక్క యోగ్యత' (౧౭౭ వ పుట) వర్ణించుటలో నాతని దుర్గుణముల వర్ణించుపంక్తులు కొంచముగను సద్గుణముల వర్ణించుపంక్తు లెక్కువగను వ్రాసియున్నాఁడను.

ప్రస్తుతపు హిందూ ముసల్మాను లన్నదమ్ములు.

ప్రస్తుతము హిందూదేశములో హిందూముసల్మానుల సఖ్యతను గుఱించి చర్చ జరుగుచున్నది. దానిని గుఱించి మహమ్మదీయ మహాయుగ చరిత్రకారుఁడ నగు నా యభిప్రాయము తెలుపుట యావశ్యకము. పూర్వమొకప్పుడు హిందూ ముసల్మానులు పోరాడుచుండిరి గనుక వా రెప్పుడును స్నేహితులు కానేర రనుట లోకానుభవము లేనివారు చెప్పవలసిన మాట. దేశములోని జనులు రైలుబండి పెట్టెలోని మనుష్యుల వంటివారు. క్రొత్తవాఁడు పెట్టెతలుపు తెఱవవచ్చినపుడు లోనివారందఱును వానితో ఘోరముగాఁ బోరుదురు. వాఁడు

లోనికిరాఁగానే వాఁడును వానితోఁ బోరినవారును స్నేహితు లగుదురు. ఇదియ దేశములోని జనులపద్ధతి. మొదట నీదేశ మునకు నార్యులువచ్చిరి. వా రనార్యులతో ఘోరముగాఁ బోరిరి. తరువాత వారండఱునుగలిసి స్నేహితులవలె నుండుట నేర్చిరి. తరువాత హూణశకపల్లవాదులు వచ్చిరి. హిందువులు వారితో ఘోరముగాఁబోరిరి. తుద కందఱును గలిసిపోయిరి. మహారాష్ట్రులు ద్రావిడదేశముమీఁదికి దండెత్తిపోయి తంజా వూరిలో రాజ్యమును స్థాపించిరి. అప్పు డఱవవారును మహా రాష్ట్రులును బోరిరి. కాని తరువాత స్నేహితులైరి. కావున మహమ్మదీయులును పునివర్తింపఁబడిన ఆర్యశక మహారాష్ట్రుల వంటివారు. ముసల్మాను లీదేశవాసు లయినందునఁ బ్రస్తుతమున హిందూముసల్మాను లన్నదమ్ములు. పూర్వమందు మరాటా వారు బంగాళమును దోఁచుకొనిరని ప్రస్తుతకాలమందలి బంగాళీ వారు మరాటావారిని ద్వేషించుట యెంతహాస్యాస్పదమో, పూర్వ మౌరంగజేబు హిందువులను బాధపెట్టెననియు, అళియ రామరాజు తురుష్కుల బాధపెట్టెననియు నిప్పటి హిందూ ముసల్మానులు పోరాడుట యంతేహాస్యాస్పదము. కావున హిందు వులు ముసల్మానులకష్టసుఖములు తమవిగానే యెంచవలయును. ముసల్మానులును అట్లే నడచుకొనవలయును. అందువలన నుభ

యులకును మేలు కలుగఁగలదు. లేనియెడల నుభయులకును నష్టము సంభవించుననుటకు సందేహము లేదు.

శబ్దోచ్చారణ.

ఇదివఱకు మనము చరిత్రలన్నియు నింగ్లీషులోఁ జదువుచున్నందున హిందూముసల్మానుల పేళ్లు సరిగా నుచ్చరించుటలేదు. తెలియక కొన్ని మాఱులును, విరగఁబాటు (ఫ్యాషన్) అని కొన్ని సారులును, తప్పుటుచ్చారణలు చేయుచున్నాము. ఈ గ్రంథములో నట్టి యుచ్చారణలను దిద్ది సరియైన యుచ్చారణల వ్రాయ యత్నించి నాఁడను. కావునఁ జదువరులకు నాయుచ్చారణలు క్రొత్తవిగాఁ గానవచ్చును. ఉదాహరణార్థమై కొన్ని శబ్దముల నిచ్చట నిచ్చుచున్నాను:—

| ఇదివఱకున్న యుచ్చారణ. | ఈ గ్రంథమునందలి యుచ్చారణ. |
|---|---|
| డియోగిర్ | దేవగిరి |
| బేబర్ | బాబర్ |
| బండల్ ఖండ్ | బుందేల్ ఖండ్ |
| బీరార్ | బరాడ్ లేక వరాడ్ |
| బీజపుర్ | విజాపురము లేక బిజాపురము |
| ఔఢ్ | ఔధ్ |
| ఔరంగజీబ్ | ఔరంగజేబ్ |
| ఏదిల్ శాహి | ఆదిల్ శాహ |
| సేలిమ్ | సలీమ్ |
| జాడ్ పుర్ | జోధపుర్ లేక యోధపురము. |

ఈ చరిత్ర వ్రాయుటలో నాకు సాధన భూతంబులగు గ్రంథముల నిచ్చటఁ బేర్కొనియెదను. ఈ చరిత్రలోని విషయములను (౧) పరదేశీయులు వ్రాసినయంశములు (౨) హిందువులు వ్రాసినయంశములు అని విభాగింపవచ్చును.

చరిత్రసాధనములు.

మొదటిభాగమునకు నాకు నింగ్లీషు చరిత్ర గ్రంథములు ముఖ్యాధారములు. మిల్లు, హంటర్, వీలర్, టేలర్, ఎల్ఫిన్‌స్టన్, లెత్‌బ్రిజ్, లేన్‌పూల్, బర్నియర్, కెనెడీయను గ్రంథకారులు వ్రాసిన గ్రంథములలోఁ గొన్ని సంస్కరణీయములగు విషయములున్నను ఆ గ్రంథములు చరిత్రాభ్యాసము చేయు వారికి మిక్కిలి యుపయోగకరములు; అత్యావశ్యకములు. వీరందఱును మహమ్మదీయచరిత్రకారుల ననుసరించిరి. ఎలియట్టుచే రచింపఁబడిన 'హిస్టరీ ఆఫ్ ఇండియా ఆస్ టోల్డ్ బై ఇట్స్ ఓన్ హిస్టోరియన్స్' (History of India as told by its own Historians) అనుగ్రంథమును, బ్రిగ్స్ ఫెరిస్తా యనుగ్రంథమును నాకుఁ జాల సాహాయ్యము చేసినవి. ఈ విషయమును గుఱించి చెన్నపట్టణములోనున్న కానిమరా పుస్తకాలయములో నున్న యింగ్లీషుగ్రంథము లనేకములు చూచినాఁడను. వానినన్నిటి నిచ్చటఁ బేర్కొనుట యనావశ్యకము.

ఇంగ్లీషు సాధనములు.

ఇంగ్లీషువారు వ్రాసినచరిత్ర గ్రంథములలో ముఖ్యముగా రెండింటిని గుఱించి మనము వారియెడఁ గృతజ్ఞులమై యుండ వలయును. టాడ్ చే వ్రాయఁబడిన రాజస్థాన చరిత్ర యొక యద్వితీయగ్రంథరాజము. రాజపుత్రస్థానములో దొరకిన సాధనముల నన్నిటి ననుసరించి యీచరిత్రవ్రాయఁబడినది. హిందూదేశము నందు నభిమానము గలవా రందఱును దప్పక దీనిని చదువ వలయును. ఈ గ్రంథమును తెలుఁగుబాసకు సర్ వాల్టర్ స్కాట్టులగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు (రాజమహేంద్రవరము), చక్కని శైలిని దెనిఁగించియున్నారు. తెలుగువారీ గ్రంథమును మిక్కిలి సన్మానింతురుగాత. మిస్టర్ రాబర్ట్ స్యూయెల్ దొరగారిటీవల 'ఫర్గాటన్ ఎంపయర్' (విస్మృత సామ్రాజ్యము) అని పేరుపెట్టి విజయనగర చరిత్రమును ప్రకటించిరి. నన్నిజ్, పేయిన్ అను పేళ్లుగల పోర్చుగీసువా రిద్దఱు కృష్ణదేవరాయల కాలమందు విజయనగరమునకుఁ బోయి యచ్చటి యాచారములను గుఱించియు నాదేశపు చరిత్రయు వ్రాసి తమ దేశములలోని చరిత్రకారునికిఁ బంపియుండిరి. అవి మూఁడువందల యేఁబది సంవత్సరములవఱకు నెచ్చటనో పడియుండి నేఁటికి సిన్హార్ లోప్ అను విద్వాంసుని పరిశ్రమము వలన వెలువడినవి. ఆ చరిత్రాత్మకభాగములనే ఇంగ్లీషులో

అందు ముఖ్యమైనవి రెండు.

భాషాంతరీకరించి స్యూయెల్ దొరగారీవి _స్మృతసామ్రాజ్యమును రచించిరి. ఇందు బరదేశీయులును సమకాలీనులును అగు పోర్చుగీసువారిచే వ్రాయఁబడిన యంశము లున్నందున నవి విశ్వాసపాత్రములు. పరదేశీయులకు హిందువులయెడఁ బక్షపాత ముండుటకుఁ గారణములేదు. కావున నీపోర్చుగీసుచరిత్రకారులు వ్రాసియుంచిన యంశములు పక్షపాతబుద్ధితోఁ దురుష్క చరిత్రకారులు వ్రాసిన యసత్యచరిత్రాంశములను ఖండించుటకుఁ బ్రబలసాధనములై యున్నవి. ఈ గ్రంథము ననుసరించియే తెలుఁగులో బ్రహ్మశ్రీ చిలుకూరు వీరభద్రరావు పంతులుగారు 'జీర్ణకర్ణాట'మను 'కృష్ణరాయ చరిత్ర' రచించి యున్నారు. అదియు నాంధ్రులచే నాదరింపఁబడుటకుఁ దగినది. ఫెరిస్తాచెప్పునంశములును, నన్నిజ్ పెయిన్ వ్రాసిన యంశములును తెనిఁగింపవలసి వచ్చినప్పుడు మరల భాషాంతరము చేయక యీ గ్రంథములోని భాషాంతరమునే యంగీకరించి యున్నాను. విజయనగరమునుగూర్చి 'నెవర్ టుబి ఫర్ గాటన్ ఎంపయర్' అను చక్కనిగ్రంథ మొకటి బ్రహ్మశ్రీ బీ. సూర్యనారాయణరావు,బి. ఏ. గారిచే రచింపఁబడియె. దానిని గూడ నే నుపయోగించుకొంటిని.

రెండవభాగమును గుఱించి యనఁగా హిందువులుచెప్పు కథాభాగమును గుఱించి నేను చూచిన గ్రంథముల విషయమై

వ్రాయవలసియున్నది. మనవాండ్రకుఁ జరిత్ర వ్రాయు నలవాటు లేనందున నీ విషయమై యెక్కుడు గ్రంథములు లేవు. అయినను

ఇతరసాధనములు.

గొన్ని కలవు. వాని నుపయోగించుకొనకుండుటయే మనతప్పు. మహారాష్ట్రభాషలోని ‘ముసల్మానీరియాసత్’ అను గ్రంథమును, బఖర్ అనఁబడు పూర్వచరిత్రవిషయిక గ్రంథములును, పృథ్వీరాజు విషయమై ‘పృథ్వీరాజరాసా’ యనుహిందీ గ్రంథములోని అచ్చుపడిన భాగములును, ‘పృథ్వీరాజచవాణ్’ అను మహారాష్ట్ర చరిత్రయు, రాజపుత్రులను గురించి ‘రాజపుత్రస్తాన్ చా ఇతిహాస్’ అను మహారాష్ట్రగ్రంథమును, భాట్ అనఁబడు భట్రాజుల హిందీకవిత్వములును, విజయనగర చరిత్రను గురించి ‘కృష్ణరాజ విజయము’, ‘నరపతి విజయము’ అను తెలుఁగు గ్రంథములును, ‘అచ్యుత రాయాభ్యుదయము’ నను సంస్కృత కావ్యమును, చెన్నపురిలోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందున్న స్థానిక చరిత్రలును, చూచినాఁడను. ఇవి యన్నియుఁ జరిత్రవిషయిక గ్రంథములు. అట్లు చరిత్రగ్రంథములు కానట్టి ‘జైమినిభారతము,’ ‘వరాహపురాణము,’ ‘మనుచరిత్ర,’ ‘పారిజాతాపహరణము,’ ‘వసుచరిత్ర,’ ‘కళాపూర్ణోదయము,’ ‘తపతీసంవరణోపాఖ్యానము’ మొదలయిన యాంధ్ర ప్రబంధములలోని కృత్యాదిపద్యములు నాకపరిమితసాహాయ్య

మును చేసినవి. ఇవి చరిత్రవిషయికమైన బంగారపు గనులని నా తాత్పర్యము. కులీకుతుబ్ శాహా కృష్ణరాయలయొద్దనుండి పానగల్లు, కొండవీడుదుర్గములను దీసికొనె ననియు హిందువులోడిరనియు మహమ్మదీయచరిత్రకారులు వ్రాసిరి. ఈయంశము లసత్యములని చూపుటకు 'తపతీసంవరణోపాఖ్యానము'ను, 'కళాపూర్ణోదయము'ను లక్షురూపాయల విలువగల సాహాయ్యముచేసినవని చదువరు లాప్రకరణముఁ జూచి తెలిసికొనఁ గలరు. ఆదవాని కల్యాణదుర్గములను రామరాజు జయించిన విషయమై శ్లేషపూర్వకముగా వసుచరిత్రలోఁ జెప్పిన పద్యములు సాధారణజనులకుఁ గావ్యవర్ణనలవలెనున్నను తెలిసిన వారికిఁ జరిత్ర విషయిక దివ్యరత్నము లని శోఁపక మానవు. కావున మనకావ్యముల నన్నిఁటిని మనవాఁరికమీఁదఁ గావ్యములుగాఁ గాక చరిత్రసాధనములుగాఁ జూడ నభ్యసించిన యెడలఁ దెలుఁగుదేశపుఁజరిత్ర యెంతయో వెలువడఁ గలదు.

ఇవి గాక చెన్నపురిలోని కన్నిమరా లైబ్రరీలోనున్న 'ప్రెస్ లిస్ట్ ఆఫ్ డాక్యుమెంట్స్ ఇన్ ఫోర్టు సెంట్ జార్జ్' అను నదియు, ఇండియన్ అంటిక్వేరిలోను, 'ఎపిగ్రాఫియా ఇండికా' యను దానిలోను ప్రకటింపఁబడిన పురాతన శాసనములును చరిత్రశోధనములో నాకు నింతంత యనరాని సాహాయ్యమొనర్చినవి.

$

బ్రహ్మశ్రీ వీ రేశలింగముగారి 'ఆంధ్రకవులచరిత్ర'యు, శ్రీమతి భండారు అచ్చమాంబయక్కగారి 'అబలాసచ్చరిత్ర రత్నమాల'యు నాకుఁ గొంతవఱకుఁ దోడ్పడినవి.

ఈప్రకార మింగ్లీషు సంస్కృతము తెలుఁగు హిందీ మహారాష్ట్రి భాషలలోఁ గల చరిత్రవిషయమైన ముఖ్యగ్రంథములు నా కీగ్రంథమువ్రాయుటకుఁ దోడ్పడిన సాధనములు. ఈ గ్రంథకర్తలయెడ నేను కృతజ్ఞుఁడనై యున్నాఁడను.

ఈ గ్రంథములోని పటములనుగుఱించి కొంచెము వ్రాయవలసియున్నది. న్యాయప్రయాసలకోర్చి విజ్ఞానచంద్రికామండలి

ఇందలి పటములు.

వా రీగ్రంథమునకు ననేక పటములుచేర్చి గ్రంథముయొక్క శోభ హెచ్చించిరి. అందు నాలుగుబొమ్మలు (Blocks) మ-రా-రా-శ్రీ, బి. సూర్యనారాయణరావు, బి, ఏ., యమ్. ఆర్. ఎస్. గారు మాకిచ్చిరి. అందులకై వారి కనేక వందనము లాచరించుచున్నారము.

ఈ గ్రంథమందుఁ గల మహాపురుషుల పటములలో మొదటిది శ్రీ కృష్ణరాయలవారిది. దీనియుత్పత్తి తెలుపుట యావ

కృష్ణరాయలపటము.

శ్యకము. శ్రీ రాయలవారు దక్షిణదిగ్విజయ యాత్రకు వెడలినపుడు తిరుపతిలో స్వామివారినిదర్శించి యిద్దఱు భార్యలతోఁ

గూడి స్వామికిఁ గానుక లర్పించి, తానును తనభార్యలగు చిన్నాదేవి తిరుమలదేవులును స్వామియెదుట భక్తులవలె నిలిచి యున్నట్లు పంచలోహములతోఁ బోఁతపోయఁబడిన విగ్రహములను వేయించిరి. తిరుపతి దేవాలయములోనున్న రాయలప్రతిమయే యిటీవల ననేకులచేఁ బ్రకటింపఁబడిన కృష్ణరాయల పటములకు మాతృక. తిరుపతిలోనున్న ప్రతిమ వైష్ణవభక్తునివలె నెత్తిమీఁదఁ గుల్లాయి మొదలయినవి గలిగి యుండుటచేఁ జూచుటకు నందముగా లేదు. ముఖవికాసము మాత్రము రమ్యముగా నున్నది. కావున ఆ ముఖ వికాసమును గ్రహించి పూర్వపుఁ జరిత్రలో నున్న రాయలవర్ణనమును ననుసరించి ఆపటమును శిరోభూషణాదులచే నలంకరించి మొదట బ్రహ్మశ్రీ, బి. సూర్యనారాయణరావుగారు తాము వ్రాసిన 'ఎప్పుడును మఱవఁదగని సామ్రాజ్యము' (Never-to-be-forgotten Empire) అను గ్రంథములోఁ బ్రకటించిరి. ఈపటమునె గుఱ్ఱముమీఁదఁ గూర్చుండఁబెట్టి బ్రహ్మశ్రీ సోమనాథరావుగారు తాము రచించిన 'కృష్ణరాయచరిత్ర' మను కావ్యములో నచ్చొత్తించిరి. హైద్రాబాదు పట్టణములోని 'శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము' వారు శ్రీ సూర్యనారాయణ రావుగారి పటమును అనుసరించియే యొక పెద్దపటమును వ్రాయించి తమ యాలయములో నుంచిరి.

ఆపటముయొక్క ఛాయాప్రతిబింబమునే మే మీగ్రంథము నందుఁ బ్రకటించినారము. ఇది యీ పటముయొక్క పూర్వ వృత్తాంతము.

పృథ్వీరాజు, రాణా ప్రతాపసింగ్, ఠాకుర్ దుర్గాదాస్ ఈ శూరులపటము లుత్తరహిందూ దేశమం దచ్చుపడిన పటములను బట్టి వ్రాయఁబడినవి.

రాజపుత్ర పటములు.

మోగల్ చక్రవర్తుల పటములు సామాన్యముగాఁ బాఠశాలలలోఁ జదివెడి గ్రంథములనుండి గ్రహింపఁబడినవి.

మోగల్ చక్రవర్తుల పటములు.

గ్రంథ మచ్చుపడునప్పుడు నేను చెన్నపట్టణములో నుండుటకు వీలు లేకపోయినను ఆలోప మేమియు లేకుండ నచ్చుచిత్తులు (Proof sheets) దిద్దుట మొదలయిన యావశ్యక సాహాయ్యముచేసినందులకుఁ బ్రస్తుత మానంద ముద్రాక్షరశాలలోఁ బ్రకటింపఁబడుచున్న యాంధ్రభారతముయొక్క యతిశ్రేష్ఠమైన కూర్పునకు సంపాదకు లగు శ్రీమాన్ తం. తేవప్పెరుమాళ్లయ్య గారి యెడ నే నెంతయుఁ గృతజ్ఞుఁడ నై యున్నాఁడను.

కృతజ్ఞతా విష్కారము.

౧. సుంకువారి అగ్రహారము,
చింతాద్రి పేట.
చెన్నపట్టణము.
8 - 12 - 08.

ఇట్లు;
కొమఱ్ఱాజు - లక్ష్మణరావు.



రాణా ప్రతాపసింగ్.

(ప్రభుత్వకాలము క్రీ. శ. ౧౫౭౨-౧౫౯౭)

(౨౯వ పుట చూడుడి.)

# వి ష య సూ చి క.



## మొ ద టి ప్ర క ర ణ ము.

### ముసల్మానులయుత్పత్తి, వారి దేశమునకువచ్చుట.



## రెం డ వ ప్ర క ర ణ ము.

### అఫ్గాన్ రాజులు.

## మూఁడవ ప్రకరణము.

## మోగల్ ప్రభుత్వము.

## నాల్గవ ప్రకరణము.

## దక్షిణములోనిమహమ్మదీయరాజ్యములు.

## అయిదవ ప్రకరణము.

## రాజపుత్రుల శౌర్యాగ్ని.

## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

## విజయనగరసామ్రాజ్యము.

---

## ఈ గ్రంథములోని పటముల సూచి.

### ౧. దేశపటములు.

## ౨. మహాపురుషప్రతిమలు.



## ౩. పురాతనపట్టణములు, దుర్గములు, కట్టడములు మొదలయినవి.

---

* ఈగుర్తుగల పటములన్ని 'హాఫ్‌టోన్' పద్ధతినఁజేయఁబడిన శ్రేష్ఠమైన ప్రతిమలు.

# మహమ్మదీయ మహాయుగము.

## మొదటి ప్రకరణము.

### ముసల్మానుల యుత్పత్తి : వారిదేశమునకు వచ్చుట.

హిందూదేశమునకుఁ బశ్చిమమున నరబస్థానమను దేశ మొకటి గలదు. దానిని నింగ్లీషులో నరేబియా యనియెదరు. హిందూస్థానమునకును నరబస్థానమునకును నడుమ ౫౦౦ మైళ్ల వైశాల్యము గల సముద్రమున్నది. దీనికిఁ బ్రస్తుత మరేబియాసముద్రమని పేరు. దీనికిఁ బూర్వకాలమందు రత్నాకరమనియుఁ బశ్చిమసముద్రమనియుఁ బేర్లుండెను. క్రీస్తుశకము యొక్క యాఱవ శతాబ్దమందు ననఁగా నేఁటికిఁ బదునాలుగువందల సంవత్సరములకుఁ బూర్వ మీ యరబస్థానములోని జనులనాగరికులుగా నుండిరి. ఇతరదేశములతో సంబంధము లేక యాదేశములోనైనను నొక్కచోట నుండక మేఁత దొరికినచోటికెల్లఁ దమ పశువులఁ దోలుకొనిపోవుచు నూరుద్రిమ్మరులవలెఁ దిరుగుచుండిరి. ఆదేశములోని మక్కా యనుపట్టణముమాత్రము వైభవదశయందుండెను. అచ్చటఁ గాబా యను ప్రసిద్ధికెక్కిన దేవాలయము కలదు. అందు మున్నూటయఱువది విగ్రహము లుండెను. ఆదేశవాసులందఱు నా విగ్రహముల భక్తితోఁ బూజించుచుండిరి.

### మహమ్మద్.

పైని వర్ణింపఁబడిన స్థితిలోనున్న యరబస్థానమందలి మక్కాపట్టణమున మహమ్మదీయమతస్థాపకుఁ డగు మహమ్మద్ క్రీ. శ. ౫౭౦ లో జన్మించెను.

చిన్ననాఁటనుండియు నీతఁ డీశ్వరభక్తితోను, ధర్మచింతనతోను గాలముఁ గడపుచుండెను. ఇరువదియైదవయేట నీతఁడు సిరియాప్రాంతమునకుఁ బోయి యచ్చటఁ గ్రైస్తవమతసిద్ధాంతములను నేర్చుకొనెను. నలువదవయేట నాతఁడు తనకు నీశ్వరసాక్షాత్కార మయ్యె నని చెప్పి, యేకేశ్వర మతము నొకదానిని బోధచేయఁదొడఁగె. అదియే మహమ్మదీయమతము. మహమ్మదు దానికి 'ఇస్లామ్' అనఁగాఁ పరలోకోపాయమార్గ మనియు, ఆ మతమును స్వీకరించిన వారికి 'ముసల్మాను'లనియుఁ బేళ్లు పెట్టెను. 'ఈశ్వరుఁడొక్కఁడు; ఆతని మాత్ర మహమ్మదు; విగ్రహారాధనము చేయఁగూడదు, మద్యపానము చేయరాదు.' అనునవి యామతములోని ముఖ్యసిద్ధాంతములు. ఈతని నూతనమతమును గొందఱు స్వీకరింపసాగిరి. కాని మక్కాపట్టణములోని కాబా దేవాలయమందున్న విగ్రహములఁ బూజింపఁగూడదని యాతఁడు బోధచేయుటవలన నాతనికి శత్రువు లెక్కువయిరి. వారాతనిఁ జంపుటకు యత్నించిరి. అందుచే నాతఁడు క్రీ. శ. ౬౨౨ లో మదీనా యనుపట్టణమునకుఁ బాఱిపోయెను. ఈ ప్రసంగమును సూచించుటకు నప్పటినుండి హిజరీయను శక మొకటి ప్రారంభింపఁబడినది. 'హిజరా' యనఁగాఁ బాఱిపోవుట.

మదీనాకుఁ బోయినప్పుడు మహమ్మదేఁబదిమూఁడు సంవత్సరముల వయస్సు కలిగియుండెను. అచ్చటికిఁ బోయినతరువాత నాతఁడు స్వమతాభివృద్ధి మిక్కిలియుత్సాహముతోఁ జేయసాగెను. అచ్చటఁ బెద్ద మసీదొకటికట్టించెను. అది యిప్పటికిని 'మసీద్ ఉల్ నబీ' యనుపేరిటఁ బఱగుచున్నది. అందు మహమ్మదుసమాధికలదు. మదీనాలో నీమతాభివృద్ధి ప్రబలముగా జరుగఁ జొచ్చినను, అనేకజనులవలన నాతనికిఁ గలుగుచున్న బాధయు హెచ్చఁ దొడఁగెను. ఖురేష్ అనఁబడుజను లాతనిశిష్యులను నెక్కుడుగాఁ బీడింపసాగిరి. అందుచే నాతఁడు చేతఁ గత్తి పట్టవలసినవాఁ డాయెను. ఇంతవఱకు నాతఁడు శాంతముగా ధర్మోపదేశము చేసెను. కాని పరమతస్థులవలనఁ దన

శిష్యులకుఁ గలుగుచున్న బాధఁజూచి యాతఁడు తనశిష్యుల కిట్లుబోధించెను. "ఇదివఱకు శాంతచిత్తముతోడను నమ్రభావముతోడను మతోపదేశము చేయఁబడినది. కాని లోకులు మిక్కిలి దురాగ్రహముకలవారు. పూర్వపు మతోపదేశకులు చెప్పినమాటలు వారు విన్నవారు కారు. కావున నిఁక ముందు మీ బోధ విననివారితోఁ గత్తి చేతఁ బూని పోరుఁడి. యుద్ధమందు జయప్రాప్తి యగునేని శత్రువులధనము మీకు దొరకును; మరణము ప్రాప్తించెనేని పుణ్యముగలిగి స్వర్గసౌఖ్యములు మీకై తెఱవఁబడును." ఈ యుపదేశము ననుసరించి మహమ్మదనుయాయు లందఱును సాత్వికవృత్తిని బరిత్యజించి రాజసవృత్తికిఁ దగిన క్షాత్రతేజమును స్వీకరించిరి! పిల్లివంటి క్షుద్రజంతువుగూడ మిక్కిలిబాధ కలిగినప్పుడు మానవునిమీఁదికిఁ దుముకఁబడునని మన మెఱుఁగుదుము. అట్లే యప్పుడు బలహీనులై, సాధుస్వభావమును గల మహమ్మదీయులు పరులబాధ నోర్వలేక యుద్ధము చేయఁబూని శూరులయి, క్రమక్రమముగా వృద్ధిఁజెంది యూరోప్ ఆసియా ఖండములలోని యనేక దేశములను గెలువఁగలిగిరి! అనఁగా నప్పటి ముసల్మానులను బాధపెట్టినవారు తమనాశమునకుఁ గారకు లగుటయే కాక లోకమునందలి యనేక మతములయొక్కయు, దేశములయొక్కయు స్వాతంత్ర్యమును నాశముచేయు మహాశక్తిని బుట్టించినవారైరి.

క్రమముగా సైన్యములఁజేర్చుకొని మతాభివృద్ధికై మహమ్మదు యుద్ధములఁ జేయుచుఁ దనధర్మమును రాజ్యమును అభివృద్ధి చేయఁదొడఁగెను. యుద్ధములో దొరకిన ధనమును సైనికులందఱును పంచుకొనవలసినదని యీశ్వరాజ్ఞయైనట్లు మహమ్మదు తెలుపఁగా సైనికులు ద్విగుణితోత్సాహులయిపోరాడ సాగిరి. అందుచే మతాచార్యపదమును, మహారాజపదమును మహమ్మదునకు సులభముగాఁ బ్రాప్తమయ్యెను. పారసీకరాజయిన రెండవఖుస్రూ, రూమ్ రాజయి ఇస్తంబూల్ రాజధానిగాఁగల హిరాక్లిటస్, మిసర్ (ఈజిప్ట్) దేశపు రాజు, మొదలయిన పరరాజులయొద్దికిఁ దనదూతలచేత తన మతమును

స్వీకరింపుఁడని శ్రీముఖములఁ బంపెను. పైని బేర్కొనినరాజులలో మొదటి వాఁడుతప్ప కడమయిద్దఱు నాయుత్తరముల నాదరించిరి. కాని మొదటి వాఁడగు పారసీకపురాజుమాత్ర మాయుత్తరమును చించివైచెను. ఆ సమాచారము తెలిసి ‘ నా శ్రీముఖమును వాఁడు చించినట్లే వానిరాజ్యమును నాసైన్యములు చించివేయునుగాత ’ మని మహమ్మదు పలికెను. ఇది పారసీకులకును మహమ్మదీయులకును గలిగిన వైరముయొక్క బీజము.

తరువాత మహమ్మదు ప్రబలసైన్యముఁ జేర్చుకొని మక్కా పట్టణమును స్వాధీనము చేసికొనెను. అప్పుడు కాబా యను మందిరములోనున్న మూఁడు వందలయఱువది విగ్రహములను విధ్వంసము చేసెను. అప్పటినుండియు నా కాబా మందిరము మహమ్మదీయుల ప్రార్థన మందిరమై, యన్నింటికంటెను పరమ పూజ్యస్థానమాయెను. హిందువులకుఁ గాశీక్షేత్రము విశ్వేశ్వరదేవాలయమునువలె మహమ్మదీయులకు మక్కా క్షేత్రమును కాబా మందిరమును ముక్తిప్రదములగు స్థలములని నమ్మిక.

మక్కా స్వాధీనముచేసికొనిన పిదప మహమ్మదు రూమ్ (టర్కీ) దేశము మీఁదికిఁ బెక్కుసారులు దండెత్తిపోయి యందలి యనేకప్రాంతములను జయించెను. ఒకదాడిలో నాతని శరీరమునకు ననారోగ్యత ప్రాప్తించెను. ఈలోకములోని ముఖ్యమతకర్తలలో నొకఁడగు మహమ్మదు, తన నిర్యాణకాలము ప్రాప్తించినదని తెలిసికొని యప్పుడు తనశిష్యులనందఱికి ధర్మోపదేశముఁ జేసి, అరబ్బస్థానములో నొకవిగ్రహారాధకుని నైనను ఉండనీయవలదని యాజ్ఞాపించి, ‘ యీమతము మిక్కిలి యభివృద్ధిఁజెంది మీరు శాశ్వతకీర్తిగలవా రగుదురుగాత ’ మని యాశీర్వదించి, తనభార్యలలోఁ దనకు నత్యంతప్రియురాలగు అయేషా బీబీ యను నామె మందిరములో నామెతొడమీఁదఁ దలపెట్టుకొని క్రీ. శ. ౬౩౨ లో నొక శుక్రవారమునాఁడు కీర్తిశేషుఁ డయ్యెను.

## మహమ్మదీయమతప్రచారము.

మహమ్మదు మరణానంతరమున నాతని మతపీఠమునకును, రాజ్యపీఠమునకును నధిపతులయినవారికి 'ఖలీఫా' లని పేరు. వీరిపీఠమునకు 'ఖిలాఫ' త్తని పేరు. ఈఖిలాఫత్ పీఠము క్రీ. శ. ౬౩౨ మొదలు ౬౬౦ వఱకు మదీనాలోను, ౬౬౦ మొదలు ౭౫౦ వఱకు డమాస్కస్ పట్టణములోను, ౭౫౦ మొదలు ౧౨౫౮ వఱకు బగ్దాద్ లోను ఉండెను. ఈపీఠాధిపతులగు ఖలీఫాలు తమమతమును యుద్ధమూలకముగా నానాదేశముల వ్యాపింపఁజేసిరి. వీరి యరబ్ సైన్యములయొక్క మతావేశము వారి స్త్రీలప్రోత్సాహమునను ద్విగుణిత మయ్యెను! అప్పటి యరబ్ స్త్రీలు తమపతులతో యుద్ధమునకుఁ బోయి వారి శ్రమలో సగము పంచుకొందురు; తమ వీరరసయుతగానములచే వారిశౌర్యమును ప్రజ్వలింపఁజేయుదురు. విజయముచేకొనినవారియానందమును దమసాహచర్యముచే నెన్నియో మడంగులు హెచ్చింతురు!! ఇట్టి సుశీలలగు స్త్రీలకుఁ బరాజయమునొంది నల్లఁబాఱినముఖముఁ జూపుటకువెఱచి యరబ్ వారు ప్రాణములకైననాశపడక పోరాడుచుండిరి. అందుచే వారికి నెచ్చటను జయమే కలుగఁజొచ్చెను. మొదటి ఖలీఫాయగు అబూబకర్ (౬౩౨–౬౩౪)అనువానికాలమున నాతనిసేనానియగు ఖాలేద్ అనువాఁడు ధనసంపన్నమైన డమాస్కస్ పట్టణము స్వాధీనముచేసికొనియె. రెండవఖలీఫాయగు ఉమర్ (౬౩౪–౬౪౪) అనువాఁడు పీఠ మెక్కినసంవత్సరముననే జరుసలేమ్పట్టణమును గెలిచెను. ఈపట్టణమునందుఁ గ్రైస్తవుల మూలాచార్యుఁడగు ఏసుక్రీస్తుయొక్క సమాధి కలదు. అందుచేఁ గ్రైస్తవమతస్థులగు యూరోప్ దేశములోని రాజులకును మహమ్మదీయులకును నందలసంవత్సరములవఱకును మతసంబంధమైనయుద్ధములు (crusades) జరిగెను. కాని జరుసలెంపట్టణముమాత్రము మహమ్మదీయుల చేతినుండి పోయినదికాదు! ఈరెండవ ఖలీఫాకాలములోనే సిరియా, పరిశియా, ఈజిప్ట్ దేశములఁ దురుష్కులుగెలిచి యచ్చటఁ దమమతమును రాజ్యమును

స్థాపించిరి. ఈజిప్ట్ (మిసర్) దేశముయొక్క రాజధానియగు అలెగ్జాండ్రియా పట్టణములో నొక గొప్పపుస్తకభండార ముండెను. దానిని మహమ్మదీయులు తగులఁబెట్టి లోకమునకు నింతంతయని చెప్పుటకు వీలులేనంతనష్టముఁజేసిరి. మూఁడవ ఖలీఫాయగు ఉస్మాన్ అనువాఁడు గొప్పసముద్రసేనను సిద్ధపఱచి భూమధ్యసముద్రపుటొడ్డుననున్న దేశములపైఁ దనయధికారముఁ జూపఁ దొడఁగెను. మాల్టా, గ్రీస్, రోడ్స్ మొదలయిన దేశములు మహమ్మదీయులకు లోఁబడియె. అలీయను నాల్గవ ఖలీఫా మహమ్మదునకు నల్లుఁడు. ఈతని కిద్దఱు కొమారులుండిరి. వారిపేళ్లు హసేన్, హుసేన్. వీరిద్దఱును మహమ్మదునకు దౌహిత్రులు. ఈ అలీకాలములో ఖిలాఫత్ నుగుఱించి కలహములు కలిగి యాతఁడు చంపఁబడియె. ఆతనిపుత్రులు పారసీక (ఇరాన్) దేశమునకుఁ బాఱిపోయిరి. ఖిలాఫత్ పదము దమాస్కస్కుఁ గొంపోఁబడియె. మువాఇయా యనునాతని ఖలీఫాయొక్క కాలములో మహమ్మదు దౌహిత్రులగు హసేన్ హుసేనులు చంపఁబడిరి. (౬౮౦) ఈక్రూరకృత్యసూచకముగా నిప్పటికిని మహమ్మదీయులు పీర్లపండుగు చేయుచున్నారు. క్రీ. శ. ౬౮౫లో అబ్దుల్ మలేక్ అనువాఁడు పదవ ఖలీఫాయయ్యెను. ఈతని సైన్యాధీశుఁడు తరీక్ అనువాఁడు స్పైన్ దేశమును గెలిచి, యాదేశముయొక్క దక్షిణపు కొనమీఁదఁ దనపేరట 'జబల్ తరీక్' అనుకోటఁ గట్టించెను. తరీక్కనువానిచేఁ గట్టఁబడిన కోటయని దీనికర్థము. 'జబల్ తరీక్' అనుమాటయే ప్రస్తుతము జిబ్రాల్టర్ గా మారినది! ఈతని మఱియొక సైన్యాధీశుఁడగు అబ్దుర్రహమాన్ అనువాఁడు స్పైన్ దేశపు క్రైస్తవరాజయిన ర్యాడరిక్ అనువానిని క్రీ. శ. ౭౦౫లో నోడించెను; పిరినిస్ పర్వతములవఱకు రాజ్యమును సంపాదించెను; ట్యూనిస్ప్రాంతముఁ దీసికొని కేరోల్ పట్టణముఁ గట్టించెను. ఈతనిసైన్యములచేఁ గార్థెజ్ పట్టణము కాల్పఁబడియె! తరువాత మహమ్మదీయులు ఫ్రాన్స్ దేశములోనికిఁ జొరఁబడిరి. క్రీ. శ. ౭౩౨లో ఫ్రాన్సు దేశపు రాజయిన చార్లెస్ మార్టెల్ అనువాఁడు వీరినిఁ బరాభవించి వీరు ముందుకుఁ

బోకుండ నడ్డగించెను. ఇది వీరు యూరోప్ ఆఫ్రికా ఖండములలోఁ జేసిన కల్లోలము. ఇదియంతయు మహమ్మదు గతించిన నూరేండ్లలోపల జరిగిన వృత్తాంతము.

పైని వర్ణింపఁబడినకాలములోనే యరబ్ మహమ్మదీయులు ఆశియా ఖండములోని టర్కీ, తుర్కస్థాన్, పారసీకము, అఫ్గానిస్థాన్ అను దేశముల జయించి యచ్చటివారికి మహమ్మదీయదీక్ష నొసఁగిరి. పారసీకు లనేకముగాఁ బోరిరి. కాని తుదకు వారికిఁ గ్రీ. శ. ౬౪౧ లో నహావంద్ యుద్ధమందుఁ బూర్ణపరాజయము కలిగెను. అప్పుడు స్వమతమును విడువఁజాలని యనేక పారసీకకుటుంబములవా రా దేశమునువిడిచి సముద్రమార్గమున హిందూస్థానములోని గుజరాథ్ దేశమునకు వచ్చిచేరిరి. అచ్చటి రాజు శరణాగతత్రాణుఁడగుటచే వారిచే 'గుజరాథీ భాషను గ్రహించెదము; మీరాజ్యమందు గోహత్య చేయము' అని యొప్పందముకొని వారి కాశ్రయ మిచ్చెను. ఇప్పుడు మనదేశమందుఁ గానవచ్చెడి పారసీకులు వారిసంతతివారే.

ఇట్లు అరేబియా దేశములోని యనాగరిక జనులు యూరోప్ ఖండములోని ఘనతఁజెందిన రోమకసామ్రాజ్యమును, సిరియా, స్పేన్, కార్థేజ్, గ్రీస్ మొదలయిన రాజ్యములను, ఆసియా ఖండములోఁ జేరియుండిన పారసీకమును గెలిచి, లోకమునంతను పిల్లక్రింగులుగాఁ ద్రిప్పిరి! కావున నెంతటి బలశాలియుఁ దా నజేయుఁడనుకొనఁగూడదు. ఎంత బలహీనుఁడయినను నేనేమి చేయఁగలనని తలఁపఁగూడదు.

పైని వర్ణించినట్లు మహమ్మదీయులు లోకమునంతయుఁ గాల్చుచుండఁగా దానినిగురించి మనదేశస్థులకు సమాచారమే తెలియదు. సమాచార మెట్లు తెలియును? పరదేశములకుఁ బోయినఁగదా? జాతిపోవునన్న భయముచే మనవారు కూపస్థమండూకము లయిరి. అట్లుగాక యీదేశపు వీరు లితరదేశములకుఁబోవుచుండినయెడల వారి కీవర్తమానము చక్కఁగఁ దెలిసియుండును. యూరోప్

ఆసియా ఖండములలోని యుద్ధములు వారు స్వయముగాఁ జూచియుం దురు. ఈమిడతలదండు తమదేశముమీఁదికి వచ్చునని వారికిఁ బూర్వమే తెలిసి తమరక్షణకుఁ దగినయేర్పాటులు చేసికొనుటకు వీలుండును. కాని నేఁ డందులకుఁ జింతపడినందున లాభ మేమి? ముసల్మానులు దీన్ దీన్ అను రణధ్వనులతో మనగుమ్మములోనికి వచ్చువఱకు వారిసంగతియే మన మెఱుఁగము. అందుచే మనము వారిని వెడలఁగొట్టలేక మనస్వాతంత్ర్యముఁ బోఁగొట్టుకొంటిమి. ఇఁక నా కథాభాగమునకు వత్తము.

## మహమ్మదీయుల మొదటి దాడులు.

క్రీ. శ. ౬౬౪-వ సంవత్సరములో మహాలబ్ అను పేరుగల మహమ్మదీయ సేనానాయకుఁడు ముల్తాన్ వఱకువచ్చి తిరిగిపోయెను. క్రీ. శ. ౭౧౧ లో మహమ్మద్ కాసిమ్ అనువాఁడు సింధుప్రాంతముమీఁదికి దండెత్తివచ్చి యచ్చటి దాహిరనుహిందూరాజునుజంపి రాజ్యము నాక్రమించుకొనియె. కాసీంమరణానంతరమున మహమ్మదీయులను హిందువులు వెడలఁగొట్టి మరల స్వరాజ్యమును స్థాపించిరి. అటుతరువాత మూఁడునూఱుల సంవత్సరములవఱకును హిందూదేశమునకు ముసల్మానులవలన విశేషబాధ కలుగలేదు.

## గజ్నీ వంశము.

(౯౬౭-౧౧౮౬).

క్రమక్రమముగా ఖలీఫాల యధికారము తగ్గెను. వారి చేతిక్రిందనున్న రాజ్యములలో నచ్చటచ్చట స్వతంత్రరాజ్యములేర్పడెను. తొమ్మిదవ శతాబ్దాంతమున బుఖారాపట్టణములో సామానీవంశపురాజులు స్వతంత్రులైరి. వీరుమహమ్మదీయ మతమును స్వీకరించిన పారసీకులు. ఈరాజులు తురకలను (Turks) జయించి వారికి మహమ్మదీయదీక్ష యొసఁగి వారిలో ననేకశూరులను దమసైన్యములోఁ జేర్చికొనిరి. ఈతురకలు మిక్కిలిశూరులు; ప్రాణములకాశింపక పోరాడువారు.

అబ్దుల్ మలిక్ఖాను సామానిరాజునొద్ద అలప్తగీన్ అను తురక బానిసగానుండెను. వాఁడు క్రీ. శ. ౯౬౭ లోఁ దనపరాక్రమప్రభావమున స్వతంత్రుఁడై గజ్నీ పట్టణము రాజధానిగాఁజేసికొని ప్రభుత్వము చేయఁదొడఁగె. అలప్తగీన్ క్రీ. శ. ౯౭౬ లో మరణమందఁగా నాతని యల్లుఁడగు సబక్తగీన్ గజ్నీ రాజ్యమునకు రాజయ్యెను.

## సబక్తగీన్.

(౯౭౬-౯౯౭)

గజ్నీపట్టణము హిందూదేశమునకు మిక్కిలి సమీపముగా నున్నందునను, ఆరాజ్యపు సరిహద్దు పంజాబురాజ్యపు సీమను ఒరిగియున్నందునను, ఈ క్రొత్త తురకరాజ్యమువలనఁ దమకుఁ బెక్కుబాధలు కలుగునని హిందువులకు భయముకలిగెను. అప్పుడు జయపాలుఁడనురాజు పంజాబుదేశమును పాలించుచుండెను. ఆతఁడీ తురకరాజ్యపుపొలిమేరను వెనుకకు నెట్టవలయునని తలఁచి, సింధునదిదాఁటి వారిమీఁదికి యుద్ధమునకుఁ బోయెను. ఉభయసైన్యములును యుద్ధమునకు సిద్ధమైయున్న సమయమున బ్రహ్మాండమైన ముసురుపట్టి గాలివాన వచ్చెను. అప్పుడు శిలారూపమైన మంచుగడ్డలు పడెను. హిమాలయప్రాంత మండలిమంచునకుఁ జలికిఁ దాళలేక హిందూసైన్యము లోడిపోయెను. అందుచే సబక్తగీనునకు సంవత్సరమున కింతకప్పము కట్టెదనని యొప్పుకొని జయపాలుఁడు తిరిగివచ్చెను. కాని యా కప్పమీయనందున సబక్తగీన్ అతనిమీఁదికి దండెత్తివచ్చి యాతని నోడించి పేషావరులోఁ దనసైన్యమునుంచి వెడలిపోయెను. ఈతురుష్కుఁడు క్రీ. శ. ౯౯౭ లో మృతుఁడయ్యెను.

## గజ్నీ మహామూదు.

(౯౯౭-౧౦౩౦)

ఈతఁడు సబక్తగీనునకు నుంపుడుకత్తెయందుఁ బుట్టిన పుత్రుఁడు.

ఇస్మాయి లనువాఁడు సబక్తగీనునకు నౌరసపుత్రుఁడు. కాని యా యౌరస పుత్రుని చెఱసాలలోఁ బెట్టి దాసీపుత్రుఁడగు మహమూదు 'సుల్తాను' ననుబిరుదు వహించెను. హిందూదేశముమీఁది కనేకపర్యాయములు దండెత్తివచ్చి, యి చ్చటి యనేక దేవాలయములను, మందిరములను, పట్టణములను ధ్వంసముచేసి, యసంఖ్యధనమును ఈదేశమునుండి దోఁచుకొనిపోయినతురుష్కులలో నీతఁ డగ్రగణ్యుఁడని చెప్పనచ్చును. ఈతఁడు పండ్రెండుపర్యాయములు హిందూ దేశముమీఁదికి దండెత్తివచ్చెను.

**మొదటిదాడి.** (క్రీ. శ. ౧౦౦౧)—నవంబరునెలలోఁ బదివేలసైన్య ములతో వెడలి మహమూదు పెషావరుమైదానములో విడిసెను. జయపాలుఁడు సింధునదిదాఁటి వానిమీఁదికి యుద్ధమునకుఁ బోయెను. ౨౭-వ నవంబరు దిన మున యుద్ధముజరిగి జయపాలునకుఁ బరాభవముకలిగి యాతఁడును, పదియైదు గురు సేనాధీశులును శత్రువులచేతిలోఁ జిక్కిరి. మహమూదు వారియొద్దనుండి యసంఖ్యధనముఁ దీసికొని వారిని వదలెను. అప్పుడు జయపాలుఁడిచ్చిన యొక కంఠమాలయొక్క వెల ౧౮౦,౦౦౦ దీనారు* లనఁగా నెనిమిదిలక్షలపదివేల రూపాయ లుండెనఁట! మహమూదు గజ్నీ వెడలిపోయెను. పరాజయ దుఃఖముచే జయపాలుఁ డగ్నికాష్ఠముల భక్షించి దేహమువిసర్జించెను. అతని కుమారుఁడగు అనంగపాలుఁడు రాజయ్యెను.

**రెండవదాడి.** (౧౦౦౮)—అనంగపాలుఁడు మహమూదుతో స్నేహ భావముఁజూపుచున్నను, అతనిదాయాదియగు భాట్టియాదేశపురాజు తురుష్కు లను ద్వేషించుచుండెను. ఈతనిపేరు విజయరాయ్. ఈతనిమీఁదికి మహ మూద్ దండెత్తిపోయెను. మొదట హిందువులకే విజయము సంప్రాప్త

* దీనారటంకము వెల రమారమి నాలుగున్నర రూపాయలు.

మయ్యెను. తుదకు మహమూదు మక్కాపట్టణమువైపునకుఁ దిరిగి, మోకాళ్ల మీఁదఁ గూర్చుండి యీశ్వరప్రార్థనచేసి నేఁడు మీకుఁ దప్పక జయమగునని యీశ్వరుఁడు సెలవిచ్చినాఁడని సైనికులతోఁ జెప్పఁగాఁ దురుష్కసైనికు లుత్సాహముగలవారై ఘోరముగాఁ బోరాడి విజయులైరి. విజయరాయఁడు సింధునది యొడ్డునందలి యరణ్యములోనికిఁ బాఱిపోయి యచ్చటనే మృతుఁ డయ్యెను. భాట్టియారాజ్యము తురుష్కులపాలయ్యెను. వా రెంతయో ధనము దోఁచుకొని స్వదేశమునకు వెడలిపోయిరి.

**మూఁడవదాడి.** (౧౦౦౫)—అబ్దుల్ ఫతేలోది యనువానిని మహమూదు, ముల్తాన్ దేశమునకు నధికారిగా నేర్పఱచెను. వాఁ డనంగపాలునితోఁ గలసి మహమూదును లక్ష్యపెట్టక తిరుగఁబడియె. అందుచే మహమూదు పేషావర్ ప్రాంతముమీఁదుగాఁ బంజాబుదేశమునకువచ్చి శత్రువు నోడించెను. అనంగపాలుఁడు కాశ్మీరమునకుఁ బాఱిపోయెను. అబ్దుల్ ఫత్తే శరణుచొచ్చెను. అటు అఫ్‌గానిస్థానములో ఖురాసాన్ ప్రాంతముమీఁదికి ఇలీఖ్ ఖానుఁడనువాఁ డెత్తివచ్చెనని విని మహమూదు త్వరగా వెడలిపోయెను.

**నాల్గవదాడి.** (౧౦౦౮-౯)—మహమూదు వెళ్లినతోడనే యనంగపాలుఁడు తిరిగివచ్చి యనేక రాజపుత్రులను గలుపుకొని తురుష్కుని నోడించుటకు యత్నముచేయఁదొడఁగెను. తురుష్కులచేఁ జేయఁబడిన ధర్మవిప్లవములనను, దేవాలయధ్వంసములనను హిందువులందఱికి మిగులఁ గోపమువచ్చి యనేకులువచ్చి యనంగపాలుని సైన్యములోఁ జేరిరి. దూరదూరములనుండి హిందూస్త్రీలుగూడఁ దమ నగల నమ్మి యీధర్మయుద్ధమునకై ధనమును బంపిరి! మహమూదున కీసర్తమానము తెలిసి వాఁడును గొప్పసైన్యములతోఁ దండెత్తివచ్చెను. ఉభయులకుఁ బోరాటమై హిందువులదియే కొంచెము పైచేయియై యుద్ధము జరుగుచుండఁగా ననంగపాలుని యేనుఁగు బెదరి రణరంగము

నుండి పాఱిపోవచ్చెను. అంతట సేనానాయకుఁడు పాఱిపోయెనని భ్రమించి హిందూసైనికులందఱును చెల్లాచెదరైరి. మహమ్మదీయులకు విజయము ప్రాప్త మయ్యెను. వారంతటితో నూరకుండక నగరకోట దేవాలయముమీఁదికిఁ బోయిరి. అది హిమాలయపర్వతముయొక్క దక్షిణపుటోరంపుమీఁద నుండెను. అచ్చట నగ్నిపర్వత మున్నందున దానిని గొప్ప క్షేత్రముగా నెంచి హిందువు లాదేవాలయమునకుఁ గోట్లకొలఁది ధనము కానుకగా నిచ్చుచుండిరి. అందుచే నచ్చట నపారమగు సంపత్తియుండెను. ఈసమాచారము తెలిసి మహమూదకస్మాత్తుగా నాదేవాలయముపైఁ బడియె. ఈసమయ సంరక్షణార్థమై యెప్పు డచ్చటనుండు సైన్యముకూడ నప్పు డానంగపాలునకు సహాయము చేయుటకుఁ బోయినందున నచ్చటి ధనమంతయు నా మ్లేచ్ఛునకు సులభముగా దొరకెను. అప్పుడచ్చట నేడులక్షలబంగారు దీనార్ నాణెములును, ఏడునూఱుమణు వుల బంగారు వెండి నగలును, రెండునూఱుల బంగారపుకడ్డీలును, రెండువేల మణువుల వెండియు, కెంపులు రవలు పచ్చలు మొదలయిన యిరువదిమణువుల రత్నములును నాదేవాలయములో మహమూదునకు దొరకెనఁట !

మహమూదు తనదేశమునకుఁ బోయి తనవిజయమునకై గొప్పయుత్సవముఁ జేసెను. అందు బంగారపుగద్దియలును, మేజాలునుజేయించి వానిపై హిందూ దేశమునుండి తేఁబడిన రత్నాదులనుంచి, చూచువారికనులకు విందుగావించెను. బీదల కన్నదానమును, సాధువులకు, విద్వాంసులకు, శూరులకు బహుమతులును నొసంగెను. ౧౦౧౦లో మహమూదు సూరవంశజుఁడగు మహమ్మదనువానిని నోడించెను. ఈసూరవంశజులే ముందు మహమూదువంశమును నంతమందించిరి.

**నాలుగుదాడులు.**—క్రీ. శ. ౧౦౧౦ లో మహమూదు ముల్తాను స్వాధీనముచేసికొని ఫతేలోది యనువానినిఁ జెఱపట్టెను. ఇది యైదవదాడి. క్రీ. శ. ౧౦౧౧ లో నీతఁడు స్థానేశ్వరదేవాలయముఁ గొల్లగొట్టెను. ఇది

యాఱవదాడి. ౧౦౧౩లోను, ౧౦౧౪లోను కాశ్మీరముమీఁదికి దండువెడలి పోయినట్లు గానవచ్చెడిని. కాని యచ్చటనుండి యూరకయే రావలసినవాఁ డాయెను. ఇవి యేడవ యెనిమిదవదాడులు.

**తొమ్మిదవదాడి.** (౧౦౧౮)—ఇదియొక గొప్పదాడి. ఇదివఱ కెన్ని పర్యాయములు వచ్చినను మహమూదు పంజాబుదాఁటి వెళ్లలేదు. కాని యీ తడవ గంగానదియొడ్డుననున్న ధనసంపన్నములయిన నగరములను దోఁచుకొను టకు నిశ్చయించెను. ఒకలక్ష గుఱ్ఱపుస్వారులును, ఇరువదివేలు కాల్బలమును వెంటఁదీసికొని యాసాహసికాగ్రగణ్యుఁడకస్మాత్తుగాఁ గనోజ్ పట్టణము నొద్దికివచ్చి విడిసెను. వీరు గ్రామము సమీపించువఱకును వీరు వచ్చుచున్నా రనిన వార్త కనోజురాజగు కువరరాయనికిఁ దెలియనే తెలియదు. అందుచే నచ్చట యుద్ధసన్నాహమేమియు లేదు. తా నామ్లేచ్ఛునితోఁ బోరి గెలుచుట యసంభవమని యోచించి యారాజు వానితో సంధిచేసికొనెను. అంతట మహమూదు మధురానగరమునకుఁ బోయి యచ్చటి దేవాలయములఁ గొల్లగొట్టి స్వదేశమునకుఁ బోయెను. హిందూదేశములోని భవ్యమందిరములఁజూచి యీ తఁడు గజ్నీలో నూతనముగా గొప్పమందిరములను గట్టించెను.

**పదవ పదునొకొండవదాడులు.** (౧౦౨౧; ౧౦౨౩)—కనోజ్ రాజు మహమూదుతో సంధిచేసికొన్నందున నితరరాజపుత్రరాజు లందఱు వానిని బహిష్కరించిరి. బుందేల్ ఖండాంతర్గతమైన కాలింజర్ పట్టణపు రాజు కనోజ్ మీఁదికి దండెత్తిపోయెను. కనోజ్ రాజు మొఱ్ఱవిని మహమూదు వానిసహాయమునకుఁ బరుగెత్తికొనివచ్చెను. కాని వాఁడువచ్చుటకుఁ బూర్వమే కనోజ్ రాజు కలింజర్ రాజయిన నందునిచేఁ జంపఁబడియె. అందుచే మహమూదు కలింజరునకుఁ బోయెను. కాని యందు విశేషలాభము లేక యాతఁడుతిరిగి వెళ్లవలసినవాఁడాయెను అని తురుష్కచరిత్రకారులు వ్రాసి

యున్నారు. అనఁగా మహమూదుకు గొప్పపరాభవము గలిగి యాతఁడు తిరిగి పోయెనని మన మర్థము చేసికొనవచ్చును. ఈతుదముష్కుఁడు పదునొకండవ దాడిలో లాహోరు ప్రాంతమును దీసికొని గజ్నీ రాజ్యములోఁ గలుపుకొనెను.

**పండ్రెండవదాడి.** (౧౦౨౪)—ఇది మహమూదుదాడులలో నగ్రగణ్యమైనది; కడసారిది. కాఠేవాడ్ ద్వీపకల్పమునకుఁ బూర్వము సౌరాష్ట్ర మనిపేరు. అచ్చట దక్షిణమునసైఁ బ్రసముద్రపుఘట్టమ్మున సోమనాథుని దేవాలయము కలదు. ద్వాదశజ్యోతిర్లింగములలో నొక్కటి యని యీ మహాక్షేత్రము మిక్కిలి ఘనతఁ జెందియుండెను. లింగము సముద్రఘట్టమ్మున నున్నందున సముద్రలహరు లా లింగమునకు నభిషేకముఁ జేయుచుండెను. ప్రతిసంవత్సరము కోట్లకొలఁది జనులు దేవుని సేవింపవచ్చుచు నసంఖ్యాధనము నొసఁగుచున్నందునను, వేలకొలఁది గ్రామము లీదేవునికి నగ్రహారములుగా నీయఁబడినందునను నీ దేవస్థాన మొకసంస్థానపు రాజమందిరమువలె నుండెను. వేయిమంది యార్చకు లీదేవునికి నారాధకులుగా నుండిరి. ఇట్టి విఖ్యాతిఁ జెందిన దేవుని విగ్రహముఁ బగులఁగొట్టిన కీర్తి సంపాదింపవలెనని మహమూదుకుఁ బ్రబలమైనకోర్కె పుట్టెను. అచ్చటి యసంఖ్యాధనమును గొల్లగొట్టవచ్చుఁగదాయనియాశ యాతని మఱింత పురికొల్పఁగా నాతఁడు క్రీ. శ. ౧౦౨౪ లో దండువెడలెను.

గజ్నీపట్టణమునుండి సోమనాథదేవాలయము వేయిమైళ్ల దూరమున నుండెను. గజ్నీనుండి సోమనాథుకు వచ్చుటకు రెండుమార్గములు. ఒకటి బోలన్ ఘాజాక్కులను కనుమలగుండా సింధుదేశములోనుండి; రెండవది ఖైబర్ కనుమనుండి పేషావర్, ముల్తాన్, అజ్మీర్ మీఁదినుండి మహమూదీరెండవమార్గమున వచ్చినట్లు కానవచ్చెడిని. ముప్పదివేల గుఱ్ఱపుసేనయు, ముప్పదివేల లొట్టిపిట్టలును వెంటఁదీసికొని మహమూదు బయలుదేరెను. ఈలొట్టిపిట్టలమీఁద గన్నుసామగ్రియు మంచినీళ్లును గట్టుకొనిరి. అక్టోబరులో ముల్తానుజేరి యచ్చటినుండి

యజ్మీరునకుఁ బోయెను. ఆతఁడు వచ్చుచున్నాఁ డనినవార్త యదివఱకుఁ దెలియ నందున నచ్చటిరా జాతనిరాక తెలియఁగనే పాఱిపోయెను. అచ్చటినుండి యాతఁడు గుజ్‌రాత్ లోని అనిహిలపట్టణమునకుఁబోఁగా నచ్చటిరాజుగూడఁ బాఱిపోయెనఁట. అంత మహమూదు తిన్నగా సోమనాథునియొద్దకు వచ్చి చేరెను. ఒకపూజారివచ్చి 'సోమనాథుఁడు మిమ్మునందఱిని సంహరించును' అని చెప్పెను. కాని తురుష్కులు వానిపై బాణములువేసి వానిని బాఱఁదోలిరి.

రెండవదినము శుక్రవారమైనందున మహమూదు 'అల్లాహోఅక్బ'రని యఱచి తన సేవకులకు నధికోత్సాహముఁ గలిగించి దేవాలయము చుట్టునున్న కోటను ముట్టడించియుద్ధమునకుఁ బ్రారంభించెను. కోటలోనివారికిని దురుష్కుల కును పోరు ఘోరమయ్యెను. మూడుదినములవఱకు యుద్ధము జరిగెను. ఇంతలో అనిహిలనగరపురాజును, ఇతరరాజపుత్రులును సోమనాథుని రక్షణార్థమై పరుగెత్తుకొనివచ్చిరి. హిందువులకే జయమగునట్లు గానుపించెను. తురకసైని కులు కాలు వెనుదీయఁజొచ్చిరి. ఈసమాచారముచూచి మహమూదు భూమి మీఁద సాష్టాంగముగాఁబడి దేవునిఁ బ్రార్థించి 'మీకు జయము నిక్క' మని దేవుఁడు సెలవిచ్చెనని చాటించెను. అందుపైఁ దురుష్కులందఱును పదిరెట్లు బలముగలవారై రాజపుత్రులతో ఘోరముగాఁబోరిరి. అందుచే రాజపుత్రు లందఱును విఱిగి చెల్లాచెదరైరి. అంత నాతురుష్కునికే విజయము ప్రాప్తమై యాతఁడు దేవాలయములోనికిఁ బ్రవేశించెను. దేవాలయములో నొక్కదీపమే యున్నందున నది భయంకరముగానుండెను. ఆదేవాలయ మేఁబదియాఱు స్తంభ ములమీఁదఁ గట్టఁబడియె. అందు బంగారుగొలుసులకుఁ గట్టఁబడిన పెక్కుగం టలు వ్రేలాడుచుండెను. అచ్చటి లింగమూర్తి తొమ్మిదియడుగు లెత్తుండెను. మహమూదు గర్భగృహము దాఁటి లింగమూర్తిని సమీపించెను. అప్పుడచ్చటఁ బూజచేయు బ్రాహ్మణులందఱునువచ్చి 'మీరు మాదేవుని ముట్టకున్న యెడల మీకు బంగారపురాసులొసంగెద'మనిరఁట. అందులకు మహమూదు 'విగ్రహము

లమ్మువాఁ డనిపించుకొనుటకంటె విగ్రహములఁ బగులఁగొట్టువాఁ డనిపించు కొనుట నాకధికప్రియ' మని యాలింగమును బగులఁగొట్టెనఁట. అందు నాతనికి రత్నములరాసులు దొరకెనఁట. ఆసనమును, లింగముయొక్క శకలములను, చందనముతోఁ జేయఁబడి మిక్కిలి చక్కని చెక్కడపుఁ బనితనముఁగల దేవాలయపు పెద్దతలుపులను దీసికొని యాతఁడు గజ్నీకిఁ బోవుటకు బయలుదేరెను. ఈరత్నరాసుల విషయమైనకథ నమ్మఁదగిన చరిత్రాంశముకాదని డాక్టర్ హంటర్ యొక్క యభిప్రాయము.

ఈతఁడు తిరిగిపోవునప్పు డెదిరింపవలయునని యనేకరజపుత్రరాజులజమీరునొద్దఁ గాచియుండిరి. ఈసమాచారము తెలిసి యామార్గమునఁ బోనొల్లక సింధుదేశములోని యెడారిమార్గమునఁబోయెను. త్రోవఁజూపువారు హిందువు లయినందున నీమహమ్మదీయులపైఁ గోపముగలవారై తప్పుత్రోవలు చూపిరి. అందుచే నాయెడారిలో నెండకు మలమలమాఁడి యన్నముదొరకక, నీరుదొరకక, కనుపుదొరకక మ్లేచ్ఛసైన్యము లనేకములు మడిసెను. అట్టులనేక కష్టములుపడుచు వారు గజ్నీపట్టణముఁజేరిరి. సోమనాథునిశకల మావిగ్రహాంతకుఁడగు తురుష్కుఁడు గజ్నీపట్టణములోని మసీదునకుఁ బెట్టించెను. రెండుతునకలు మక్కామదీనాలకుఁ బంపెను. సోమనాథుని దేవాలయపు కవాటములను మహమూదుకుమారుఁడాతని గోరీకిఁ (సమాధికి) బెట్టించెను. క్రీ. శ. ౧౮౪౨లో వానిని నప్పటి గవర్నర్ జనరల్ అగు ఎలింబరో హిందూదేశమునకుఁ దెచ్చెను. ప్రస్తుత మవి యాగ్రాకోటలోని యొక చీఁకటికొట్టులోనున్నవి. ఇవి నిజమైన సోమనాథకవాటము లగునని కొందఱును కావని కొందఱును వాదించి యున్నారు.

ఈదాడికి తరువాత మహమూదు తిరిగి హిందూదేశమునకు రాలేదు. అటుపదియాఱేండ్లు బ్రతికి యాతఁడు క్రీ. శ. ౧౦౩౦ లో మధుమేహముచే మరణముఁ జెందెను.



సోమనాథదేవాలయ కవాటము.

పైని మహమూదునుగుఱించి వ్రాసిన యంశములన్నియు నింగ్లీషు గ్రంథముల ననుసరించి వ్రాయఁబడినవి. ఈగ్రంథకారులందఱును తురుష్క చరిత్రకారుల ననుసరించియున్నారు. కావున నీవర్ణనమంతయుఁ బక్షపాత భూయిష్ఠమని చెప్పుటకు సందేహములేదు. అప్పటిహిందువులు వ్రాసియుంచిన

చరిత్ర లేమియులేనందున నందలి కథాంశ మెంతవఱకు నిజమో యెంతవఱకు నసత్యమో తెలిసికొనుటకు వీలులేదు. తురుష్కచరిత్రలలోనైనను నైకమత్యము లేదు. హిందూదేశముపై నాతఁడు పదునొకండు పర్యాయములు దండెత్తెనని యొకఁడును, పండ్రెండుసారులనిమఱియొకఁడును, పదియాఱుసారులని యింకొకఁడును వ్రాసియున్నాఁడు. వారివ్రాఁతలలో నింకను పరస్పర విరోధంబులు కలవు. ఈలియటుఅనుచరిత్రకారుఁడు వీని నన్నిఁటినిఁజూచి, వీనిని సమన్వయించుటకుఁ గొంత యత్నించెను. కాని యది యంతగా యుక్తియుక్తము గాలేదు. దీనినిగుఱించి యెక్కువగాఁ బరిశోధన జరిగినఁగాని నిజము తేలనేరదు.

ఇన్నిసారులు హిందూదేశముపై దండెత్తివచ్చినప్పు డొక్కసారియైనను నాతనికిఁ బరాజయము కలిగినట్లు తురుష్కులు వ్రాసియుండలేదు. ఇది గొప్ప వింత. తమనాయకులకుఁ బరాజయము కలిగినప్పు డానిని దాఁచిపెట్టుట వారి స్వభావమైనందున, నేడవ యెనిమిదవ పదవదాడులలో నాతనికిఁ జక్కని పరాభవము కలిగెనని మన మూహింపవచ్చును.

ఈతఁ డిన్నిపర్యాయము లీదేశముకు వచ్చినను ఇచ్చట రాజ్యస్థాపనము చేసినవాఁడుకాఁడు. అందుచే నాతని కీదేశపురాజులచే ననేకపరాభవములు సంప్రాప్త మయ్యెననియు, నందుచే నాతనికి నిచ్చట రాజ్యము స్థాపించుటకు వీలులేకపోయె ననియు మన మూహింపవలసి యున్నది. కాని యాతనికి దొరకిన రాజ్యమును వదలి వెళ్లినాఁడని తురుష్కులు వ్రాసినవ్రాఁతలు కొంద ఱింగ్లీషువారు నమ్మినట్లు మనము నమ్ముట బాలిశము.

ఇదియుఁగాక మహామూదును పంజాబు రాజయిన యనంగపాలుఁడు పూర్తిగాఁ బరాభవించినందులకు నొక గొప్ప యాధారము నాకుఁ గ్రొత్తగఁ గానుపించినది. అది తురుష్కగ్రంథములోనిదియే గనుక విశ్వాసపాత్రమైనది. అబురిహాన్ అల్ బిరూని అను తురుష్కవిద్వాంసుఁడు తారీఖ్ ఉల్ హింద్ అను

చరిత్రగ్రంథమును వ్రాసెను. అందు 'కాబూల్ దేశములోని బ్రాహ్మణరాజులు' అను వంశమునుగురించి బాగుగ వర్ణించియున్నాఁడు[1]. అనంగపాలుఁడావంశములోనివాఁడు. ఆవంశపు రాజులనుగురించియు అనంగపాలునిగురించియు అల్ బిరూనీ యిట్లు వ్రాయుచున్నాఁడు: "ఈరాజులు మిక్కిలి రాజ్యవిస్తారము గలవారయ్యును, ఉత్తమసద్గుణమండితులుగను, ఆడినమాట తప్పనివారుగను, సత్కార్యాంశేఁ దక్కువకాని ప్రయత్నముతోఁ జూచువారుగను నుండిరి. అమీర్ మహమూదునకు అనంగపాలునకును వైరమున్నప్పు డనంగపాలుఁడు మహమూదునకు వ్రాసిన యీ యుత్తరమునందు దానిని గూర్చి నీ వెఱింగియుండవలసి యున్నది "నీరాజ్యముమీఁదికిఁ దురకలు (Turks) దండెత్తివచ్చిరనియు, ఖురాసాన్ ప్రదేశమంతయు నాక్రమించిరనియు వింటిని. నీయభీష్టమైన నైదువేలగుఱ్ఱములతోను, పదివేల సైనికులతోను, నూఱు ఏనుఁగులతోను నీకు సాహాయ్యము చేయ దలఁచియుంటిని; లేదా నీకిష్టమున్నయెడల నైనఁ జేసిన్నవానికంటె రెండింతలసైన్యములను నిచ్చి నాకుమారునిఁ బంపెదను. నీయనుగ్రహమునకై నే నిట్లు వ్రాయలేదు. నేను నిన్నుఁ బూర్తిగఁ బరాజయించినను అట్టిగౌరవము నాకు వచ్చునని తలఁపఁగూడదని నాయుద్దేశము" ఈయుత్తర మహోదార్యశాలియై యనంగపాలుఁడు మహమూదునకు వ్రాసెనని మహమూద్ యొక్క యాస్థానమందుండిన యల్ బిరూనీ యుదాహరించియున్నాఁడు[2]. కావున నితని యలుకు సరియైన నకలని మనము చెప్పవచ్చును. అనంగపాలుఁడు మహమూదు పూర్తిగఁ బరాజయించెననుటకు నిదికంటెఁ బ్రబలప్రమాణ మేమికావలయును? తాను పూర్తిగ నోడించి వెడలఁగొట్టిన శత్రువునిమీఁదికి నితరశత్రువులు దండెత్తిరాఁగాఁ దనసైన్యము పంపి ధర్మస్వరూపుఁడగు అనంగపాలుఁ డీయుత్తర

---

1. హిందూదేశ కథాసంగ్రహము: ప్రథమభాగము హిందూమయుగము మూడవప్రకరణము, ౧౨౨-౩ పుట చూడుఁడి.

2. Elliot's History of India, Vol. II, pp. 12 & 40.

మహమూదుకు వ్రాసెను. కావున గజ్నీ మహమూదు హిందూరాజులచే ననేక పర్యాయములు పరాభూతుఁ డయ్యెననియు, ఆయంశములను మహమ్మదీయ చరిత్రకారులు కప్పిపెట్టిరనియు, ఇంగ్లీషు గ్రంథకారులును ఆచరిత్రభాగమును బాగుగఁ బరిశోధింపలేదనియు మనము నిశ్చయముగఁ జెప్పవచ్చును. దీనింగూర్చి మహమ్మదీయ చరిత్రగ్రంథములను చక్కఁగఁ బరిశోధించి చూడవలయును.

మొత్తముమీఁదఁ జూడఁగా లోకములోని విఖ్యాతసేనానాయకులలో మహమ్మదొక్కఁడని చెప్పవలసియున్నది. ధైర్యసాహసము లీతని యద్భుతగుణములు. శత్రుసైన్యములు తనసైన్యములకంటె నెక్కుడుగా నున్నప్పుడు వారిని మోసపుచ్చి జయము సాధించు నుపాయంబును, వీలులేనిచోట్లఁ గలిగినగల శత్రువునుగూడఁ దప్పించుకొని పోఁగలుగు నేర్పు తెలిసియుఁ, దనసైన్యములు పాఱిపోవునప్పుడు తన కీర్త్యోత్సాహ తత్పరులైన సైనికులనుఁ దప్పక జయమునొసఁగుదునని యీశ్వరుఁడు నాకొసంగె ననియు బోధించి వారిని మరల యుద్ధమునకుఁ బురికొల్పి జయము సాధించు నేర్పునుగల మహమూదువంటి మహాయోధు లరిది. ఈతఁడు విద్యాభివృద్ధియు శిల్పకళాభివృద్ధియుఁ జేసెను. పరమతము నందు నపరిమితద్వేషమును, ధనమునందు నెడతెగని తృష్ణయు ననుదుర్గుణములు తప్ప నన్యదుర్గుణంబు లీతనియందు లేవు.

మహమూదువంశజులు క్రీ. శ. ౧౧౫౨ వఱకు గజ్నీలో రాజ్యముచేసిరి. వారెవరును ఈదేశమునకు రానందున వారిచరిత్రతో మనకుఁ బనిలేదు. కడపటిరాజయిన బహరామనువానిని గోరీరాజులు జయించినందున నాతనికుమారుఁడగు ఖుస్రూ యనువాఁడు హిందూదేశమునకుఁ బాఱివచ్చి లాహోరులో నేడుసంవత్సరములు రాజ్యముచేసెను. వీనికుమారుఁడగు ఖుస్రూమాలికనువాఁడు గోరీ రాజులచే ౧౧౮౬ లో జయింపఁబడియె. అంతటితో నీవంశ మంతరించెను.

## గోరీవంశము.

(౧౧౫౨-౧౨౦౬).

హిందూదేశముయొక్క స్వాతంత్ర్యమును హరించి తురుష్కరాజ్యము నిచ్చట స్థాపించినవారీవంశమువారు. హిందూకుశపర్వతముయొక్క యుత్తర శాఖాప్రాంతమున గోర్ లేక ఘోర్ అనుమండలము కలదు. అది తమమూల ప్రదేశమని యఫ్ఘాను లెంచెదరు. అచ్చటివారి కింతకుఁ బూర్వమే యరబ్ వారిచే మహమ్మదీయదీక్ష యొసఁగఁబడియెను. అరబ్ వారు వీరి స్వాతంత్ర్యమునుహరించియుండిరి. కానివీరు పోయినస్వాతంత్ర్యమును మరల సంపాదించిరి. గజ్నీమహమూదీమండలమును జయించియుండెను. కాని యాతనిమరణానంతరమున గోర్ లోనుండెడి సూర్ వంశజుఁడయిన అల్లాఉద్దీనను వాఁడు స్వతంత్రుఁడగుటయేగాక, క్రీ. శ. ౧౧౫౨ లో గజ్నీరాజగు బహరాం మను వాని నోడించి, గజ్నీపట్టణముఁ గాల్చి యారాజ్యమంతయు స్వాధీనము చేసికొనెను. ఈతనితరువాత సీతని కుమారుఁడు చంపఁబడెను. ఈతని యన్న కుమారులగు గ్యాస్ఉద్దీన్, శహాబుద్దీ ననువాండ్రు కలిసి రాజ్యము చేయఁ దొడఁగిరి. ఇద్దఱు రాజులుకలసి యైకమత్యముతో రాజ్యముచేసిన యుదాహరణ మిది యొక్కటియ.

## శహాబుద్దీన్ మహమ్మద్ గోరీ.

(౧౧౭౩-౧౨౦౬)

వీరి యిద్దఱిలో శహాబుద్దీ ననువాఁడు హిందూదేశమువీఁదికి ననేకపర్యాయములు దండెత్తివచ్చి, యెన్నియోపర్యాయము లీచటిరాజులచేనోడింపఁబడి పాఱిపాఱి, మరలమరల వచ్చి తుదకు విజయుఁడై యీదేశమునఁ దురుష్క రాజ్యమును స్థిరపఱిచెను. ఈతనికాలమందు నుత్తరహిందూదేశమున శూరులగు రాజపుత్రు లనేకులుండిరి. వారిలోని పరస్పరకలహములే యీదేశపారతంత్ర్య

# మొదటి ప్రకరణము.

మునకుఁ గారణమయ్యెను. ఆయంశము లిచ్చటఁ గొంచెము వివరముగా వ్రాయుట యావశ్యకము.

## అప్పటిరాజపుత్ర రాజ్యములు.

ఆకాలమందు దిల్లీ యజ్మీరు పట్టణములలో చహువాన్ వంశజుఁడగు పృథ్వీరాయఁడును, కనోజ్ పట్టణములో రాథోడ్ వంశజుఁడగు జయచంద్రుఁడును, మేవాడాంతర్గతమైన చితోడ్ దుర్గముమీఁద గుహలోట్ వంశజుఁడగు సమరసింహుఁడును, అబూగడముపై పరమారవంశజుఁడగు జైతుఁడును, పట్టణమను నామాంతరముగల అనిహిలపురములోఁ జాళుక్యవంశజుఁడును గుర్జరాధిపుఁడును అగుభోలాభీముఁడును రాజ్యము చేయుచుండిరి. వీరుముఖ్యులైనవారు. వీరుగాక చిన్నచిన్నరాజులనేకులుండిరి. కాని యెవ్వరికి వారు స్వతంత్రులయి యుండుటచే నెప్పుడును పరస్పరకలహములు కలిగియుండిరి. వీరిలోనిముఖ్యుల పూర్వచరిత్రము నప్పటిసంగతియు నిచ్చట సంగ్రహముగఁ బొందుపరిచెదము.

## కనోజ్.

ఇది బహుపురాతన కాలమునుండియుఁ విఖ్యాతిఁ జెందినరాజ్యము. ఒకప్పుడు దీనికి సార్వభౌమత్వము కలిగియుండెను. వైశాల్యమునుబట్టియుఁ జక్కని మందిరములను బట్టియుఁ గనోజ్ పట్టణము మిక్కిలి ఘనతను వహించి యుండెను. క్రీ. శ. ౧౦౧౮ లో గజ్నీమహమ్మూదీపట్టణమునకు వచ్చినప్పుడు దానిశోభకు వచ్చెరువంది దానినిగురించి యీవాక్యములు వ్రాసెను: "ఇచ్చట వేలకొలఁది మందిరములు గలవు. అవి నిశ్చలభక్తుని నమ్మికవలె దృఢమైనవి. అవి చాలవఱకుఁ జంద్రకాంత శిలలతో నిర్మింపఁబడినవి. ఇవిగాక యసంఖ్య దేవాలయములు కలవు. ఈకనోజ్ పట్టణమునకు నింత చక్కఁదనము వచ్చుటకుఁ గోట్లకొలఁది దీనారులు వెలయై యుండవలెను. రెండువందల సంవత్సరములలోఁగూడ నిట్టిపట్టణముఁగట్టుట దుర్లభము.'' రాజస్థాన చరిత్ర



కనోజ్ పట్టణములోని ప్రాచీనమంటపములు.

కారుఁడగు కర్నల్ టాడ్ అనువాఁ డీపట్టణముఁగూర్చి "ప్రస్తుతపు లండను పట్టణమువలె జయచంద్రుని రాజధానియగు కనోజ్‌పట్టణ మెట్టు మాఱినను పదునైదుక్రోసులు వైశాల్యము కలదైయుండెను" అని వ్రాసియున్నాఁడు. ఆనగరమందు ఆకు లమ్మువారి అంగళ్లు ముప్పదివేలుండెనఁట. మఱి రాజునొద్ద గొప్పసైన్య ముండెను.

ప్రస్తుతచరిత్రవిషయికకాలసమయమున నీపట్టణములో జయచంద్రుఁడను రాజు రాజ్యముచేయుచుండెను. ఇతఁడు దక్షిణదేశముపైఁ బోయి కొన్ని దిగ్విజయములఁ జేసినట్లు 'పృథ్వీరాజరాసా' యను గ్రంథమువలనఁ దెలియుచున్నది. ఈతఁడును అప్పుడు ఢిల్లీశ్వరుఁడుగా నుండిన పృథ్వీరాజును అక్కచెల్లెండ్రకుమారులు. సార్వభౌమాధికారమునకై యిద్దఱికిని స్పర్థకలిగి యుండెను. తాను సార్వభౌముఁడనని స్థాపించుటకై జయచంద్రుఁడు రాజసూయయాగము చేయుటకు నుద్యమించెను. కాని యాతనిసైన్యముల నోడించియు, నాతని బంధువునొకనిఁ జంపి యజ్ఞసమయమున సశౌచము (సూత

కము) వచ్చులాగునఁజేసియుఁ, పృథ్వీరాయఁడాయజ్ఞమునకు విఘ్నము కల్పించెను. ఇదియుఁగాక జయచంద్రుని కన్యయగు సంయుక్తయను నామె నెత్తుకొనిపోయి యాతఁడు వివాహమాడెను. ఈకథాభాగము పృథ్వీరాయ చరిత్రలో విస్తారముగ వర్ణింపఁబడును. ఈకారణములచే జయచంద్ర పృథ్వీరాయలకు నెడతెగని వైరము కలిగెను.

## అన్హిల్‌పుర భీమదేవుఁడు.

గుజరాథ్ దేశములో అన్హిలపురమను పట్టణముగలదు. దానికే పట్టణమని మాఱుపేరు. అప్పుడు 'సోలంకి' వంశజులగు రాజులు రాజ్యము చేయుచుండిరి. 'సోలంఖీ' శబ్దము 'చాలుక్య' శబ్దభేదము. శహాబుద్దీన్ గోరీకాలమందిచ్చట భీమదేవుఁడను రాజు రాజ్యముచేయుచుండెను. ఇతఁడు మిక్కిలిపరాక్రమవంతుఁడు. పెక్కుసేనలు కలవాఁడు. ఈతఁడును జయచంద్రుఁడును గలిసి యుండినయెడలఁ దురుష్కులకు హిందూస్థానదేశమున నాధారము లేకయుండును. కాని యీతనికిని పృథ్వీరాజునకును వైరము తటస్థించెను. ఆకాలమునందు అబూరాజగు తేజసామానునకు ఇచ్ఛనీకుమారియను లావణ్యవతి యగు కూఁతురుగలదు. ఆమెను దనకిమ్మని భీముఁడామెతండ్రికి వర్తమానమంపెను. కాని యాతఁడు తనకన్యను పృథ్వీరాయని కీయఁదలఁచి యాతనిఁ దన సహాయమునకుఁ బిలిచెను. అతఁడు భీమునిపైకెత్తికేఁబోయి యాతనిఁ బూర్తిగఁ బరాభవించెను. ఇట్లు శక్తిగలరాజులు తమసామర్థ్యము లొకరి నొకరు నోడించుటలో వ్యర్థపుచ్చిరి.

## మేవాడ్ రాజ్యము.

ఈరాజ్యముయొక్క పూర్వపు రాజధాని చితోడ్. ఇప్పటిరాజధాని ఉదయపురము. ఈరాజ్యముయొక్క సంపూర్ణచరిత్ర 'రాజపుత్రుల శౌర్యాగ్ని'

యను 5 వ ప్రకరణమునందు వర్ణింపఁబడినది. కావున నిచ్చట వ్రాయనక్కఱ లేదు. పృథ్వీరాజునకు సమకాలీనుఁడగు నీదేశపురాజు సమరసింహుఁడు. ఈతఁడు పృథ్వీరాజుయొక్క చెల్లెలిపెనిమిటి. ఈబావమఱఁదుల కిద్దఱికిని మిగుల స్నేహము. ఈసమరసింహుఁడు సుశీలుఁడు. ప్రశంసనీయమైనట్టియు ననుకరణీయమైనట్టియుఁ బ్రవర్తనకలవాఁడు. ఈతఁడు సైన్యవ్యవస్థలో మిక్కిలికుశలుఁడు. యుద్ధమందు దక్షుఁడని పేరుగాంచెను. ఈతఁడు శాంతుఁడు, గంభీరుఁడు, వక్త. దూరదృష్టియు, సదసద్విచారమును, మిత్రాభిమానమును ఈతని విశేషసద్గుణములు. ఈతఁడు నీతిమంతుఁడును, రాజ్యకార్యవిశారదుఁడును, దయాసంపన్నుఁడు నగుటచేఁ దనసామంతులకును, ప్రజలకును దండ్రి యని కీర్తి వహించెను. ఈవృత్తాంత మీతనికి సమకాలీనుఁడగు చాంద్‌భాట్ అనునతని గ్రంథములోనుండి గైకొనఁబడినది.



చితోడ్ దుర్గము.

## అజ్మేర్ ఢిల్లీ రాజ్యములు.

ఈరెండురాజ్యములకును మేము వర్ణించెడి కాలమునఁ బృథ్వీరాయఁడు రాజుగానుండెను. ఈతని పైతృకరాజ్య మజ్మేర్; దౌహిత్రకము ఢిల్లీ. అజ్మేర్ పట్టణములో చహువాన్ వంశపురాజులు రాజ్యము చేయుచుండిరి. అందు వీసలదేవుఁడనువాఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడై క్రీ. శ. ౧౦౮౭లోఁ దురుష్కులనోడించెను. అప్పుడాతనికి ననేకక్షత్రియరాజులు సహాయపడిరికాని గుజరాథ్ దేశపురాజయిన భీమదేవుఁడు వచ్చినవాఁడుకాఁడు. అందుచే వీసలదేవుఁడాతనిమీఁదికి దండెత్తిపోయి, యాతని నోడించి, యాతనియొద్దనుండి కప్పము దీసికొనెను. విజయసూచకముగా నొకవీసలనగర మనుపట్టణముఁ గట్టించెను. ఈవంశమునందు సోమేశ్వరుఁడను రాజునకుఁ గ్రీ. శ. ౧౧౬౮ లోఁ బృథ్వీరాజు జన్మించెను. ఇఁక నీతనికి ఢిల్లీరాజ్యము వచ్చినవిధము తెల్పెదము.

ఢిల్లీపట్టణమునకుఁ బూర్వపునామము ఇంద్రప్రస్థము. ఇది పాండవాగ్రజుఁడగు ధర్మరాజుచేఁ గట్టింపఁబడియె. మయాసురునిచే నపూర్వమైన మయసభ యిచ్చటనే నిర్మింపఁబడియెను. ధర్మరాజు రాజసూయ యజ్ఞమిచ్చటనే చేసెను. యుధిష్ఠిరుని తరువాత ముప్పదవవాఁడగు క్షేమరాజును జంపి యాతనిమంత్రి యగువిసర్వుఁడు రాజయ్యెను. ఈవంశములో ముప్పదియెనిమిదవవాఁడగు రాజపాలునిఁ జంపి సుఖవంతుఁడనువాఁడు రాజ్యము నాక్రమించుకొనియె. వానిఁజంపి తువరవంశజుఁడగు విక్రమాదిత్యుఁడు ఇంద్రప్రస్థ పురాధీశుఁడయ్యెను. అప్పటినుండి పందొమ్మిది పురుషాంతరములవఱకు నీరాజధాని తువరవంశజులచే నేలఁబడియె. చివరరాజు అనంగపాలుఁడు. ఈతని కాలములోనే యీపురమునకు ఢిల్లీయని పేరుగలిగెను. అనంగపాలునికిఁ బుత్రసంతానము లేదు. ఇద్దరుపుత్రికలుండిరి. అందుఁ గమలాదేవి యనునామెను అజమీరురాజయిన సోమేశ్వరునకు నిచ్చెను. ఈమెకుమారుఁడే పృథ్వీరాజు. అనంగపాలుని రెండవకొమార్తెయగు విమలాదేవిని కనోజ్ రాజయిన విజయ

పాలుని కిచ్చియుండిరి. ఈమెయే జయచంద్రునితల్లి. అనంగపాలుఁడు ముసలివాఁడై బదరికాశ్రమమునకుఁ బోవునప్పుడు తన దిల్లీరాజ్యము దౌహిత్రుఁడగు పృథ్వీరాజునకిచ్చెను. అందుచే నాతఁ డజమీరురాజ్యమునకును దిల్లీరాజ్యమునకును అధిపతియయ్యెను. అనంగపాలుఁ డొక దౌహిత్రునకె రాజ్యమిచ్చినందున రెండవదౌహిత్రుఁడును కనోజ్ రాజును అగు జయచంద్రునకుఁ గోపము వచ్చెను ఇదియే జయచంద్రపృథ్వీరాయల వైరమునకు మొదటికారణము.



అజమీర్ పట్టణము.

నాగోర్ పట్టణమునొద్ద ఖటుపురములోఁ బృథ్వీరాయలకు భూమిలో నెక్కుడుగా ధనముదొరకెను. చందెల్ రాజునకుఁ బృథ్వీరాజునకును వైరము గలిగినందున వారికి యుద్ధముజరిగి యందు చందెల్ రాజు పరాజితుఁడై రాజ్యముఁ గోలుపోయెను. ఈప్రకారము పృథ్వీరాయని రాజ్యవైభవములు దినదినము హెచ్చుటఁజూచి యోర్వఁజాలక కనోజ్ పట్టన్ (అనిహిల్ పురము) రాజులు

శహాబుద్దీన్ గోరీ యనువానిని దమసహాయమునకుఁ బిలిచిరి. వాఁడును వీరిసహాయమునకువచ్చెను. పృథ్వీరాజునకు సహాయముచేయుటకై చితోడ్ గడము నుండి సమరసింహుఁడు వచ్చెను. వీరందఱికిఁ బోరుజరిగి యందు జయచంద్రుని పక్షు మోడిపోయెను. శహాబుద్దీన్ గోరీ పృథ్వీరాజుచేఁ జెఱపట్టఁబడియె. వాని యొద్దనుండి యెనిమిదవేలగుఱ్ఱములఁ దీసికొని పృథ్వీరాజు వానిని విడిచిపెట్టెను. తనసైనికులకు ననేకబహుమతు లొసంగెను.

మఱియొకసారి పృథ్వీరాజు కొద్దిసైన్యముతో సముద్రశిఖరమను పట్టణమునకుఁ బోయి వచ్చుచుండఁగా శహాబుద్దీన్ గోరి యాతని నెదిరించెను. ఆయుద్ధములో నైదువేల తురుష్కులు గోరీతోఁగూడ రాయనిచేతిలోఁ బడిరి. వారి యొద్దనుండి యసంఖ్యాధనముఁ దీసికొని యారాజు వారిని బంధవిముక్తులఁజేసెను.

ఈప్రకారము శహాబుద్దీన్ గోరి పృథ్వీరాయనిమీఁదికి నేడుసారులు దండెత్తివచ్చినట్లును, ఏడుపర్యాయము లాతనిఁ బృథ్వీరాయఁడు పట్టుకొని విడిచిపెట్టినట్లును హిందూగ్రంథకారులు వ్రాసియున్నారు. కాని తురుష్కచరిత్రకారులును, వారినేయనుసరించెడి యింగ్లీషుచరిత్రకారులును క్రీ. శ. ౧౧౯౧లో మాత్ర మొక్కసారి పృథ్వీరాయఁడు గోరీని స్థానేశ్వరక్షేత్రమందుఁ బూర్తిగా నోడించెననియు, నందు గోరీకి గొప్పగాయము తగిలి యాతఁడు తప్పించుకొని పాఱిపోయెననియు వ్రాసియున్నారు. ఆయుద్ధములోఁ బరాజితుఁ డయి పోయి నప్పటినుండియు నాతఁడు మరల హిందూదేశముమీఁదికి దాడి వెడలవలయుననియే రాత్రిందివములును దగినయేర్పాటులు చేయుచుండెను.

ఇట హిందూరాజుల సమాచారముఁ గనుఁగొందము. కనోజ్ రాజయిన జయచంద్రునికి సంయుక్తయనుకూఁతు రుండెను. ఆమెయుఁ బృథ్వీరాయఁడును బరస్పరానురాగబద్ధులైరి కాని తండ్రికి వైరియైనవానిని వరించుటయెట్లు? ఇంతలో జయచంద్రుఁడు రాజసూయముఁ జేయఁదలఁచి, యందులోనే తనకొమార్తెయొక్క స్వయంవరముఁ జేయ నిశ్చయించి దేశదేశరాజుల రావించెను.

అందుకు దిల్లీశ్వరుఁడు పోఁడయ్యె. కావున జయచంద్రుఁడు మిగులఁ గోపించి యాతనితోఁ గలవైరమువలనఁ బృథ్వీరాజు ప్రతిమ నొకదానిని జేయించి దానిని ద్వారపాలకుని స్థలమునందున నిలువఁబెట్టి యాతని నగౌరవించెను. అంత స్వయంవరవిధి ప్రారంభమయ్యెను. " సంయుక్త చేతఁ బుష్పమాలను ధరించి సఖీసహితయై, యామండపమునకు వచ్చెను. రాజకన్య సభకు రాఁగానే రాజపుత్రు లందఱిచూపులు నామెవైపునకే మరలెను. ప్రతిభూపతియు నామెతన్ను వరియింపవలయునని కోరుచుండెను. సంయుక్త మిగుల గంభీర దృష్టితో రాజలోకమునంత నొక్కసారి కలయఁజూచెను. తనకిష్టుఁడగు పృథ్వీరాజచట్టికి రాలేదనియు, ఆయనను బరిహసించుట కాయనప్రతిమ నొకదానినిజేసి ద్వారమునం దుంచిరనియు నామె కంతకుఁబూర్వమే తెలిసి యుండెను. అందువలన నాబాల యొకగడియవఱ కేమియో యోచించి తుదకు దృఢనిశ్చయముగలదియై తిన్నగా నడచి దిల్లీశ్వరునిప్రతిమను సమీపించి యామూర్తి కంఠమునందుఁ బుష్పహారమును వేసెను. దానిఁ గనినతోడనే సభయందంతట నొకటే కల్లోలమయ్యెను. జయచంద్రుఁ డట్టియవమానమును సహింపఁజాలక కోపావేశపరవశుఁడై 'దుష్టురాలగు దీనినిఁ గారాగృహమునందుంచుఁ' డని యాజ్ఞాపించెను. అంత రాజులందఱును నిరాశను బొంది తమతమ నగరములకుఁ జనిరి.

" ఈసంగతియంతయువిని పృథ్వీరాజు పరమానందభరితుఁ డయ్యెను. జయచంద్రుఁడు తన్నుఁబఱిచిన యవమానమును, సంయుక్త తనయందుఁ గనఁబఱిచిన ప్రేమయు నేకీభవించి తన్నుఁ ద్వరపెట్టఁ బృథ్వీరాజు జయచంద్రునిపై యుద్ధయాత్రవెడలెను. ఇట్లాయన శూరులగు యోధులతోఁ గనోజ్ పట్టణము సమీపమున విడిసెను. అచట నున్నకాలముననే యొకరాత్రి మిగుల రహస్యముగాఁ బృథ్వీరాజు సంయుక్తను గలసి గాంధర్వవిధిచే నామెను వరియించెను.

"వీరి వివాహవార్త యొకరిద్దఱు దాసీలకుఁ దప్ప నితరుల కింతమాత్రముఁ దెలియదు. పృథ్వీరాజువచ్చి తనగ్రామము బయల విడియుట విని యాతనిఁబట్టి తెండని జయచంద్రుఁడు మూఁడువేల సైన్యమునంపెను. కహరకంఠీరుఁ డను వాని ముందిడుకొని శత్రుసైన్యములు తమపైపునకు వచ్చుటఁగని పృథ్వీరాజు వారితోఁ బోరుటకు సిద్ధముగానుండెను. తదనంతర మారెండుసైన్యంబు లొంటొంటిందాఁకి మిగుల ఘోరముగాఁ బోరసాగెను. అందుఁ బృథ్వీరాజు సేనానియగు నాతతాయికిని జయచంద్రుని సైన్యాధిపతియగు కహరకంఠీరునకును ద్వంద్వయుద్ధము ప్రాప్తించెను. ఆశూరు లిరువురును సింహనాదములు చేయుచు నొండొరులతో నెక్కుడు పంతంబులు పలుకుచు నొకరినొకరు నొప్పించుచుండిరి. అంతఁ గొంతసేపటికి భటులయొక్కయు, గుఱ్ఱములయొక్కయు, నేనుఁగులయొక్కయు, దేహములనుండి కాలు రక్తము ప్రవాహమై పాఱఁ దొడఁగెను. అట్టిసమయమున కహరకంఠీరుని రోషావేశ మధికమైనందున నాతఁడు తనరథంబుడిగ్గియాతతాయిని తనఖడ్గమునకుఁ బలియిచ్చి, పృథ్వీరాజు కంఠముఁ దెగనేయ నుంకించెను. కహరకంఠీరుని శౌర్యమునకోడి పృథ్వీరాజు బలంబులు చెదరి పాఱిపోవసాగెను. అట్టిసమయమునం దాకస్మికముగా నొక శౌర్యనిధి యచటికివచ్చి, పృథ్వీరాజు కంఠముపైఁ బడనున్న ఖడ్గమును దునియలుచేసి యాతనిఁ గాపాడెను. ఈపరాక్రమవంతుఁ డెవఁడో యొకరాజపుత్రుఁడని చదువరులు భ్రమపడవలదు. అట్లు తనసాహసమువలనఁ బృథ్వీరాజును గాపాడినది యాతనిపత్నియు, జయచంద్రుని కూఁతురును నగుసంయుక్తయే! ఆమె తన భర్తనుగలిసి యాతనితో వెళ్లవలయునని బహుప్రయాసముతోఁ గారాగృహమువెడలి యతియోగ్యమైన సమయమున నాస్థలము ప్రవేశించెను. తానెన్నఁడును సంగ్రామముఁ జూడనిదైనను ఆమె జంకక సమయస్ఫురణ కలదియై తానును యుద్ధముచేసి తన భర్తప్రాణములఁ గాపాడెను. సంయుక్త వచ్చినతరువాత బృథ్వీరాజుబలములు మరలఁ జేరుకొని జయచం

ద్రుని సేనల నోడించెను. తరువాతఁ బృథ్వీరాజు భార్యాసహితుఁడయి డిల్లీ నగరమున కరిగెను.'' * అప్పటినుండియుఁ బృథ్వీరాజునకును జయచంద్రునకును వైర మధికమయ్యెను. అదిగాక గుజరాథ్ దేశపు భీమదేవునకును పృథ్వీరాయ నికిని గలిగిన వైరము చదువరు లెఱిఁగియేయున్నారు. క్షత్రియులలోఁ గొందఱిటు, కొందఱటు నుండిరి. దేశవినాశమునకు మూలమయిన యిట్టి ద్విధా భావ మప్పటిరాజలోకములలోఁ బుట్టెను.

శహాబుద్దీన్ గోరీ హిందూదేశము నెప్పుడు క్రమ్ముదునా యని యెదురు చూచుచుండెను. బైరాగి, గోసాయి, ఫకీర్ మొదలయిన వేషములధరించి యాతనిచారు లీ దేశమునం దిరుగఁజొచ్చిరి. వారివలన గోరీకి నిప్పటి యంతః కలహముల జాడలు తెలిసి వాఁడు యుద్ధమునకుఁ గాల్దువ్వుచుండెను.

ఇటు పృథ్వీరాయని శూరనాయకు లనేకులు కనోజ్ యుద్ధములో మడి సిరి. మిగిలినవారిలో కయమాష్ అనునాతని మంత్రియొకఁడు. "ఈతఁడు ఖటుపురములోని నిధానముఁ దీసెను; ముగ్గలములోని షిడిహారరాజును జంపెను; గోరీమ్లేచ్ఛునిఁ జెఱపట్టెను; బలవంతులైన హిందూరాజులను నుగకి రాజులను నోడించెను; అందఱును చవాన్ రాజునకు భయపడునట్లు చేసెను. ఆతఁడు పెద్దపులివలె భయంకరుఁడయి తనకీర్తిచే నన్ని దేశముల నింపెను'' అని 'పృథ్వీ రాజరాసా' గ్రంథములో వ్రాయఁబడియున్నది. ఈతఁడు పృథ్వీరాజునకు బహిఃప్రాణమైయుండెను. కాని యొకసారి యీతఁడు రాజు భోగకాంతను గామించినందునఁ గోపమువచ్చి రా జీతనినిఁ జంపెను.

యుద్ధములోఁబోఁగా మిగిలిననాయకులలో చాముండరాయఁ డను వాఁ డొకఁడుండెను. ఈతఁడు భీమునివలె మిక్కిలిబలశాలి. ఈతనిచెల్లెలిని పృథ్వీ రాజునకిచ్చినందున నీతఁడు పృథ్వీరాజుకుఁ గుడిభుజముగానుండెను. కాని

* సౌ. భండారు అచ్చమాంబగారిచే రచింపఁబడిన 'అబలాసచ్చరిత్ర రత్నమాల' - ప్రథమభాగము, ౨-వ కూర్పు, ౧౭౮-వ పుట చూడుఁడి.

యొకసారి యాతఁడు రాజునకుఁ బ్రీతిపాత్రమైన యేనుఁగును జంపినందున రాజునకుఁ గోపమువచ్చి యాతఁడు చాముండరాయని గారాగృహమునందుంచెను. అప్పటినుండి శస్త్రమునుబట్టనని యాతఁడు ప్రతిజ్ఞవట్టెను.

హాహులీరాయఁడను మఱియొకవీరుఁడు పృథ్వీరాజునొద్దనుండెను. సంయుక్తను వివాహమాడినతరువాత రాజు విషయలంపటుఁడై యాతని నగౌరవించెను. అందులకు నీతఁడు మిక్కిలి రోషించి గోరీనిఁ బృథ్వీరాయనిమీఁదికిఁ దెచ్చుటకు గజ్నీపట్టణమునకుఁబోయెను! హిందూదేశస్వాతంత్ర్యనాశనమున కివి హేతువులయ్యెను.

ఇచ్చటఁ బృథ్వీరాయని బాల్యస్నేహితుఁడును, చరిత్రకారుఁడును అగు చాంద్ భాట్ అనువానిగుఱించి కొంచెము వ్రాయవలయును. భాట్టనువారు మన దేశమున భట్రాజు లనఁబడియెదరు. రాజులయొద్దనుండి వారియశోవర్ణనముఁ జేయుట వీరిపని. వీరిలోననేకులు కవులని విఖ్యాతిఁజెందిరి. చాంద్ భాట్టనువాఁడు 'పృథ్వీరాజరాసా' యనుకావ్యమును రచించి యందుఁ దన మిత్రుఁడగు ఢిల్లీశ్వరుని చరిత్ర వర్ణించెను. ప్రస్తుతచరిత్రలోని యనేకాంశములందుండియే గ్రహింపఁబడినవి. ఈచరిత్ర చారణీభాషలో వ్రాయఁబడిన లక్షగ్రంథము. చారణీభాష హిందీభాషయొక్క యొకభేదము. ఈచరిత్రయందు ననేకాద్భుతాంశములున్నను నమ్మఁదగినచరిత్రాంశము లనేకములు కలవు. స్థానేశ్వరయుద్ధమప్పుడీకవి దేవీమందిరములోఁ గూర్చుండి యీగ్రంథము వ్రాసెనఁట. ఈగ్రంథము మిక్కిలి పెద్దదియగుటచే నిందులోని కొన్నిభాగములు మాత్రము కలకత్తాలోని యేశియాటిక్ సొసైటివారు ప్రచురించియున్నారు.

## స్థానేశ్వరమహాయుద్ధము.

(క్రీ. శ. ౧౧౯౩)

పైనివర్ణింపఁబడినట్లు రాజ్యపుగుట్టంతయుఁ దెలిసిన హాహులీరాయఁడు స్వామిద్రోహియై శహాబుద్దీనుతోఁ గలిసినతరువాత, వానికిధైర్యమువచ్చి వాఁడు

పృథ్వీరాయనిమీఁదికి దండెత్తివచ్చెను. ఈతఁడు గుజరాథ్ కనోజ్ రాజులును వారిసామంతులునుగోరీకే సహాయము చేసిరి. పృథ్వీరాజునకు సహాయముచేయుటకుఁగూడ ననేకరాజులువచ్చియుండిరి. నూఁటయేఁబది రజపూతవీరులు గంగోదకముఁజేతపట్టి ‘శత్రునిగెలువనైన గెలిచెదము; లేదా స్వదేశస్వాతంత్ర్యములకై రణమందు దేహము నర్పింపనైన నర్పించెదము’ అని శపథములుచేసిరి. పృథ్వీరాజునకు సహాయులైనవారిలోఁ జిత్తూరురాజగు సమరసింహుఁడు ముఖ్యుఁడు. ఈయుభయసైన్యములును స్థానేశ్వరములో ఘోరముగాఁ బోరాడెను. దేశద్రోహులగు హిందూరాజులు గోరీపక్షమునందు నుండుటవలనను, స్వామిద్రోహియగు హాహులీరాయనివలన తురుష్కులు హిందువులబలాబలములనుయుక్తులును బాగుగ నెఱుఁగుటవలనను, తురుష్కులు విజయులైరి; హిందువులకుఁ బరాభవముకలిగెను. వేలకొలఁది క్షత్రియులు హిందూదేశ స్వాతంత్ర్య సంరక్షణమునకై కడసారి ప్రయత్నముఁచేసి పారతంత్ర్యతను జెందిన యీదేశమును జూడఁగూడదని కాఁబోలు రణములో వీరస్వర్గమునకుఁ బోయిరి. మిత్రప్రాయుఁడగు సమరసింహుఁడు మడిసెను. పృథ్వీరాయఁడు తాతార్ ఖానుఁ డనువానిచేఁ జెఱపట్టఁబడియె. ‘నేను శహాబుద్దీన్ గోరీని నేడుసారులు పట్టుకొని యేడుసారులు దయతలఁచి విడిచిపెట్టితిని. కావున నాయుపకారమును స్మరించియైనను నన్ను విడువు’మని పృథ్వీరాజు చెప్పెను. అందుపై తాతార్ ఖానుఁడు ‘కనుకనే నిన్ను విడుచుటకు వీలులేదు. చేతఁజిక్కిన శత్రువును విడిచిపెట్టితినని నీవు చెప్పెడుగర్వోక్తులు నీమూర్ఖతను గనఁబఱచుచున్నవి. వైరి మొదటఁ జేతఁ జిక్కినప్పుడే వానిని నీవు చంపివేసి యుండినయెడల నేఁ డీగతి నీకు ప్రాప్తించియుండదు కదా? నీ మౌర్ఖ్యముయొక్క ఫలము నేఁడు నీకు ననుభవింపక తప్పదు’ అని ప్రత్యుత్తర మిచ్చెను.

‘పృథ్వీరాజుగూడ నాయుద్ధమునందే మడిసెనని కొందఱు చెప్పెదరు. గోరీ విజయుఁడై పృథ్వీరాజును చెఱఁబెట్టి గ్రుడ్లుతీసివేసి, యాతని పాదము

లకు మిక్కిలి బరువులయిన లోహపు బేడీలనువేసి, కారాగృహమునం దుంచె ననియు, నీసంగతియంతయు విని పృథ్వీరాజు మంత్రియు, నతని చరిత్రలేఖకుఁడును మహాకవియునగు చాందుభట్టు, గోరీ యాస్థానమునకరిగి కొన్నిదినములచటనుండి యాతని కృపకుఁబాత్రుఁడై, పృథ్వీరాజును జూచుట కనుజ్ఞ వడసెననియు, అట్లు సెలవంది కారాగృహమున కరిగి పృథ్వీరాజును బలుకరింపఁగా, నాతఁడు కన్నులులేకున్నను మాటను గుర్తించి యాభట్టును కౌఁగిలించుకొనెననియు, అచట వారిరువురు నొకయుక్తివలన నాతురుష్కునిఁ జంప నిశ్చయించుకొనిరనియు, అందుపై చాందుభట్టు గోరీయొద్దకివెళ్లి ప్రసంగవశమున పృథ్వీరాజుయొక్క బాణనైపుణ్యమును వర్ణించుచు, నాతఁ డిపుడు కన్నులులేకున్నను శబ్దము జాడఁబట్టి సూటిగా బాణమువేయునని చెప్పగా, గోరి యావిచిత్రమును గనుటకై యొక సభచేసి యాసభకు పృథ్వీరాజును బిలిపించి,యతనికి నతని విల్లునుబాణములునిచ్చి చమత్కారము మేమయినఁ జూపుమని యాజ్ఞాపించెననియు, ఆమాటనూటినిఁబట్టి పృథ్వీరాజాతనిపై బాణము వేయ నాతఁడు (గోరి) మృతినొందెననియు, తదనంతరము చాందుభట్టు పృథ్వీరాజు లిరువురును దురకలచేఁ బడక యాసభయందే యొకరినొకరు పొడుచుకొని జీవముల విడిచిరనియు, మరికొందఱు చెప్పెదరు. పైని చెప్పఁబడిన శరసంధాన మహోత్సవమంతయు మనదేశముననే జరిగినదని యొకరును, తురకదేశముననే జరిగెనని యింకొకరును వక్కాణించెదరు. వీనిలో నేది నిజమో మనము చెప్పఁజాలము.”[1]

## పారతంత్ర్య ప్రారంభము.

స్థానేశ్వర యుద్ధముతో హిందూదేశముయొక్క స్వాతంత్ర్యముపోయి యప్పటినుండి యీదేశము పరరాజుల స్వాధీనమై పారతంత్ర్యమను సంకెలలచే బంధింపఁబడెను.

---

1. అబలా సచ్చరిత్ర రత్నమాల ౧౮౨వ పుట.

స్థానేశ్వరయుద్ధ మైన వెంటనే గోరీ డిల్లీపట్టణము మీఁదికిఁ బోయెను. తురుష్కుల చేతిలోఁ బడనొల్లక యచ్చటి రాణీసంయుక్త మొదలయిన రాజపుత్ర స్త్రీ లగ్నిఁ బ్రవేశించిరి. డిల్లీ తురుష్కుల స్వాధీనమయ్యెను.

క్రీ. శ. ౧౧౯౪లో గోరీ మరల నీదేశమునకువచ్చి యంతకుఁ బూర్వము దేశద్రోహియై తనకు సహాయముచేసిన కనోజ్ రాజగు జయచంద్రుని గెలిచి యాతని పట్టణముఁ దీసికొనెను. జయచంద్రుఁడు గంగలోఁబడి ప్రాణముల విడిచెను. దేశద్రోహి కిది తగినశిక్ష కాదని యెవరు చెప్పఁగలరు? అంతట రాఠోడ్ వంశజు లచ్చటినుండి రాజపుత్రస్థానమునకుఁ బోయి జోధ్ పుర మను రాజ్యమును స్థాపించిరి. అది యిప్పటికిని గలదు.

శహాబుద్దీన్ మహమ్మదుగోరీ తన సరదారుఁడగు కుతుబుద్దీన్ అను వానిని హిందూదేశములోఁ దన ప్రతినిధిగానుంచి తాను గజ్నీకి వెడలిపోయెను. ఈ కుతుబుద్దీ ననువాఁడు గుజరాత్, గ్వాలేర్ మొదలయిన స్థలములను సాధించెను. చితోడ్ గడముమీఁదికిఁ బోఁగా నచ్చటి రాణి యీతని నోడించెను. ౧౧౯౬లో నీతఁడు బుందేల్ ఖండములోని కాల్పి కలింజరు దుర్గములును, మహమ్మదు బఖ్త్యార్ ఖిల్ జీ యనువానిసహాయమువడసి ఉత్తర బహర్, అయోధ్య, బంగాళా దేశములను జయించెను.

క్రీ. శ. ౧౨౦౨లో గ్యాసుద్దీన్ చనిపోయినందున శహాబుద్దీ నొక్కఁడె రాజ్యమునకు నధికారియయ్యె.

ఈతఁడు క్రీ. శ. ౧౨౦౬లోఁ బంజాబునకువచ్చి సరిహద్దుమీఁది గక్కరనుజనులను గెలిచి వారికి మహమ్మదీయదీక్ష యొసఁగెను. ఆతఁడు తిరిగి వెళ్లునపుడు సింధునదియొద్దను రోహాటకమనుగ్రామము నొద్ద విడిసి, గాలి వచ్చుటకుఁ దన గుడారములఁ దెఱచి యుంచెను. అంతఁ దాఁగియున్న గక్కరు లందుఁజొరఁబడి గోరీనిఁ జంపిరి.

శహాబుద్దీన్ మహమ్మదుగోరి శూరుఁడును, యుద్ధకుశలుఁడును అని చెప్పుటకు సందేహములేదు. కాని గజ్నీమహమూదువలె నీతఁడు బుద్ధిశాలియు రసికుఁడును గాఁడు. మహమూదు విద్యాప్రియుఁడై యనేకవిద్వాంసులకు నాశ్రయదాతయైనందున నాతని ఖ్యాతివిశేషముగా నున్నది. శహాబుద్ధీన్ యుద్ధమునకంటె నన్యమెఱుఁగఁడు. కావున నతని కీర్తి యంతఁగాఁ బ్రసరించినది కాదు.

హిందూదేశములోఁ దురుష్కరాజ్యమును నాటిన గౌరవ మీతనిదేయని చెప్పవలయును. గజ్నీమహమూదు విగ్రహములఁ బగులఁగొట్టి ధనము దోఁచుకొని పోయెనేగాని యీదేశమున రాజ్యమును స్థాపించినవాఁడు కాఁడు. ఈతఁడాకార్యములను జేయుచు నిచ్చట రాజ్యముఁగూడ సంపాదించెను, ఈతని మరణసమయమున మాళవదేశమును, దానిచుట్టునున్న ప్రదేశమును దప్ప మిగిలిన యుత్తర హిందూదేశమంతయు నాతని వశమైయుండెను. సింధు బంగాళీదేశములు పూర్తిగా నాతని స్వాధీనమయ్యెను. ఈప్రాంతముల నేలుటకు నాతఁడు సుబేదారుల నేర్పఱచెను. ఇంకఁ గొన్నిదినములు బ్రతికియున్నయెడల నాతఁడు హిందూదేశముయొక్క ప్రథమతురుష్క చక్రవర్తి యైయుండు ననుటకు సందేహములేదు.

# రెండవ ప్రకరణము.

## అఫ్గాన్ రాజులు.

### బానిసవంశము.

(౧౨౦౬-౧౨౯౦.)

శహాబుద్దీన్ గోరీ చనిపోయిన తరువాత నాతని ప్రతినిధియగు కుతుబుద్దీన్ స్వతంత్రుఁడై రాజ్యమందంతటను తనపేరిట మసీదులలో ఖుత్బా చదివించి నాణెములుచేయఁ దొడఁగెను. ఈతఁడు మొదట గోరీయొద్ద బానిసగానుండెను. కావున నీవంశమునకు 'బానిసవంశ' మని నామము వచ్చెను. ఈవంశములోని పదిమందిరాజు లెనుబదియేండ్లవఱకు రాజ్యము చేసిరి.

### ౧. కుతుబుద్దీన్.

(౧౨౦౬-౧౨౧౦.)

ఈతఁడు మొదట శహాబుద్దీనుకద్ద బానిసగానుండినను తన బుద్ధివైభవముచేతను, యుద్ధకౌశలముచేతను, యజమానుని విశ్వాసమునకును స్నేహమునకును పాత్రుఁడయ్యెను. క్రమముగా శహాబుద్దీనుయొక్క యందఱు సరదారులలో శ్రేష్ఠుఁడై హిందూదేశములో నాతని ప్రతినిధియయ్యెను. శహాబుద్దీనుని మరణము తరువాత నీతఁడు స్వతంత్రుఁడై డిల్లీపట్టణము రాజధానిగా నాలుగేండ్లు రాజ్యముచేసెను. ఈతఁడు న్యాయదృష్టియు సౌమ్యస్వభావమును గలవాఁడు. ఈతఁడు డిల్లీనగరములోఁ గట్టించిన కుతుబ్ మినా రనుజయస్థంభ మిప్పటికిని డిల్లీపట్టణములో లోకులచూపునకు విందై యొప్పుచున్నది. ఈతఁడు క్రీ. శ. ౧౨౧౦ లో మరణమునొందెను.

కుతుబుద్దీన్ ఢిల్లీచుట్టుపట్టురాజ్యమును స్థిమితపఱుచుచుండఁగా భక్త్యార్ ఖిల్ జీ యనుమతియొక సరదారుఁడు బంగాల్ బేహార్ ప్రాంతముల స్వాధీనము చేసికొని గౌడపట్టణములో స్వతంత్రముగా రాజ్యముచేయఁ దొడఁగె.

## షమ్సుద్దీన్ అల్తమష్.

(౧౨౧౦-౧౨౩౫.)

కుతుబుద్దీనునకు ఆరమను నొకకొమారుఁ డుండెను. ఆతఁడు రాజ్యము చేయుటకు నసమర్థుఁ డగుటచే నేప్రాంతాధీశు లాప్రాంతమున స్వతంత్రులుగాఁ జొచ్చిరి. అందుచే ఢిల్లీలోని సరదారులు కుతుబుద్దీన్ యొక్క యల్లుఁడగు నల్తమష్ను రాజ్యమునకు రమ్మని పిల్చిరి. వాఁడు వచ్చి యారమును నోడించి తాను మూఁడవ రాజయ్యెను.

ఈతఁడు బంగాల్ సింహాప్రాంతములలో స్వతంత్రులయిన సుబేదారుల గెలిచెను. ఉజ్జయినీపట్టణమును స్వాధీనముచేసికొని యచ్చటి దేవాలయములఁ బాడుచేసెను. ఈతఁడు క్రీ. శ. ౧౨౩౫ లో మరణముఁజెందెను. మరణసమయమున సింధు గంగానదుల నడుమనున్న ప్రదేశమంతయు నీతనిప్రభుత్వమునకు లోఁబడి యుండెను.

## మోగలులు.

అల్తమష్ రాజ్యముచేయునప్పు డుత్తరమునుండి మోగలు లనుజను లీదేశమునకు రాఁ జొచ్చిరి. వీరు మొదటఁ జైనాతార్తరీ యనఁగా మంగోలియా దేశములోనివారు. అచ్చటినుండి వీరిదండు పశ్చిమదిక్కునకును, దక్షిణదిక్కునకును బ్రసరించెను. లంబాడీలవలె వీరెప్పుడును మూఁకలు మూఁకలుగాఁ దిరుగుచుండిరి. తుపానువలె నదాటుగా నొక్కస్థలముమీఁదఁ బడి దానిని ధ్వంసముచేసి క్షణములో మాయమై పోవుచుండిరి. దేశధ్వంసమే వీరు వచ్చి వెళ్లినమార్గమునకు గుఱుతు. పంద్రెండవశతాబ్దమువఱకు వీరు పూర్తిగా మహామ్మదీయులు కాలేదు. మిక్కిలి యశ్రద్ధ కలిగియుండిరి.

వీరిలోఁ బండ్రెండవ శతాబ్దమున చెంగీస్‌ఖానుఁడనువాఁ డొకఁ డుదయించెను.

## చెంగీస్‌ఖాన్.

ఈయసామాన్యపురుషుఁడు క్రీ. శ. ౧౧౫౪ లో జన్మించి క్రీ. శ. ౧౨౨౭లో మరణముఁజెందెను. ఈతఁ డొక రాక్షసుఁడని చెప్పవలెను. ఇతనియొద్ద నున్నంతసైన్యము, ఈతఁడు సంపాదించినంతదేశము, గెలిచిన దేశములలోని జనులను నీతఁడు పెట్టినంతబాధయు మన మితరచరిత్రలలో నెచ్చటను జూడఁజాలము. పశ్చిమసముద్రమునుండి పూర్వసముద్రమువఱకును హిందూ దేశమునకు నుత్తరమున ఏశియాఖండములో నున్నరాజ్యమంతయు నీతఁడు స్వాధీనముచేసికొనెను. ఈతనిరాజ్య మైదువేలయైదువందలమైళ్ళు పొడవును, మూడువేలమైళ్లు వెడల్పును గొలఁతగాఁ గల విరివికలది. ఈరాజ్యమంతయు హిందూదేశమునకు నాలుగురెట్లుండును. ఈచెంగీస్‌ఖానుఁడు హిందూదేశమునకు రాలేదు. కావునఁ బ్రస్తుత మీతనిచరిత్రతో మనకుఁ బని లేకపోయినను ముం దీతనివంశజులు హిందూదేశములో రాజ్యస్థాపన చేసినందున నా కథా సందర్భముఁదెలియుటకై యీచరిత్ర యిచ్చట వ్రాయఁబడియెను.

## సుల్తానా రజియా.

(౧౨౩౬ - ౧౨౩౯.)

ఇఁక మనము ప్రకృత మనుసరింతము. అల్తమష్ తరువాత నాతని కుమారుఁడగు రుక్న ఉద్దీన్ అనువాఁడు నాల్గు నవాబయ్యెను. కాని వాఁడు దుర్మార్గుఁడగుటచే సరదారులందఱుఁ దిరుగఁబడి అల్తమష్‌కూఁతురగు రజియాయను నామెకుఁ బట్టముకట్టిరి. ఢిల్లీ సింహాసనమునెక్కిన స్త్రీ యీయామె యొకతియే.

సుల్తానారజియా మిక్కిలి పరాక్రమశీల. తండ్రి దూరదేశమునకుఁబోయినప్పుడు డిల్లీలో రాజవ్యవహారమంతయు నామెయే చేయుచుండెను. రాజున

కావశ్యకములగు సద్గుణములన్నియు నామెయందు వసించియుండెను. ఆమె బుద్ధియు, అంతఃకరణమును శౌర్యమును జూచినయెడల స్త్రీరూపమును ధరించిన చిన పౌరుషమేయని చెప్పవలయునని గ్రంథకారులు వ్రాసియున్నారు. ఆమె చక్కఁదనము, కర్తృత్వశక్తి, న్యాయచాతుర్యము, పాటుపడుసామర్థ్యము లద్భుతములు. ఆమె పురుషవేషమువేసికొని ప్రతిదినము రాజసభ నలంకరించుచుండెను. ప్రతికార్యమును స్వయముగాఁ బరిశోధించి చేయుచుండెను. పూర్వమునుండి వచ్చుచున్న కొన్ని దురాచారములమాన్పెను; చట్టముల సవరించెను. ఇట్లన్నివిధముల వ్యవహారదక్షతగలది యయ్యును, ఒకవ్యవహారమునందు నామె పొరపడెను. ఆ పొరపాటే యామె నాశమునకుఁ గారణమయ్యెను. తనకు ప్రీతిపాత్రుఁడైన యొక యబిసీనియన్ బానిసవానికి నామె యధికారమిచ్చినందున నామె సరదారులు తిరుగఁబడి యా బానిసవానిని, ఆమెను, ఆమె తరువాత వివాహమాడిన యామె భర్తను జంపిరి.

రజియాతరువాత నామెతమ్ముఁడగు బహరాం రాజ్యముచేసెను. అతఁడు ౧౨౪౧ లోఁ జంపఁబడియె. తరువాత అల్తమష్‌యొక్క మనుమఁడగు అలాఉద్దీన్ మస్ ఉద్ అనువాఁడు ౧౨౪౩ వఱకు రాజ్యముచేసెను. ఈతని రాజ్యకాలమందు మోగలులు రెండుసారులు హిందూదేశమునకు వచ్చిరి. టిబేటు లోనుండి బంగాళాదేశమున కొకబందిపోటును, పశ్చిమదిక్కున నుండి పంజాబున కొక బందిపోటును వచ్చియుండెను. ఈరాజును పదచ్యుతునిఁజేసి యీతని పినతండ్రియగు నాసిరుద్దీన్ మహమ్మూదనువాఁడు సుల్తానయ్యెను.

## నాసిరుద్దీన్ మహమ్మూద్.

(౧౨౪౬-౧౨౬౬)

ఈతనిప్రభుత్వకాలము ప్రజలకు సుఖావహమయ్యెను. ఈతఁ డల్తమష్ కుమారుఁడు. ఈతని నితనితండ్రి బంగాళా దేశమున కధికారిగా నియమించెను.

కాని యీతఁడు చిన్నవాఁడగుటచేఁ దన సవతితల్లిచేఁ జెఱఁబెట్టఁబడియె. మస్ ఊద్ రాజ్యమునకు వచ్చినప్పు డితనిని బంధవిముక్తునిఁజేసి బైరాక్ ప్రాంతములకు సుబేదారుగా నియమించెను. ఈతఁడు బహుసాధు వృత్తిగల వాఁడు. చెఱసాలలోనున్నపుడు తురుష్కుల వేదమగు కురాన్ యొక్క ప్రతులు వ్రాసి వానినమ్మి జీవనము గడుపుచుండెను. తుదవఱకు నీ నవాబీవృత్తిని వదలిన వాఁడుకాఁడు. తురుష్కులలో బహుపత్నీత్వమున్నను ఈతఁ డేక పత్నీ వ్రతముఁ బాలించెను. ఇంటిపనులన్నియు నితని భార్యయే చేయుచుండెను. ఒకనాఁడాసాధ్వి వంటచేయుచుండఁగా వ్రేళ్లుకాలినందున నామె యొకవంట లక్కను పెట్టుఁడని భర్తను గోరఁగా నాతఁ డొప్పుకొనక యామెతో 'నేను రాజ్యమును గాపాడువాఁడను; రాజ్యమునకు యజమానుఁడనుగాను. కావున నాసొంతవెచ్చమునకుఁ గావలసిన ధనము నిచ్చుభారము రాజ్యముపై వేయుట పాడికాదు. నీవు శాంతచిత్తముతో నీకార్యములఁ జేయుచుండుము. నీకిందు నకు నీశ్వరుఁడు తగిన ప్రతిఫలము తప్పక యిచ్చును' అని చెప్పెను!! ఈతఁడు తాను సంపాదించిన ధనమునకు వచ్చెడి సాధారణపు భోజనమే చేయుచుండెను. తమసౌఖ్యమునకు, తమవారి యాటపాటలకును ప్రజలధన మంతయు వ్యర్థముసేసి, సహింపలేని పన్నులువేసి ప్రజలను బీడించు రాజులును రాజసేవకులు నీసుల్తాను చరిత్రఁ జదివి సిగ్గుచేఁ దలవంపుదురుగాత.

ఈతనిచరిత్ర మన్నివిధములను ప్రశంసనీయమైనందున నీతని రాజ్యము లోఁ బ్రజలకు విశేషముగా సౌఖ్యము గలిగెను. ఈతఁడు తిరుగఁబడిన సరదా రుల నందఱినిఁదీసి క్రొత్తవారి నేర్పఱిచెను; వాయువ్యదిక్కునుండి మొగలులు రాకుండ నచ్చటఁదగిన సైన్యముంచెను. యమునానదియొడ్డున నున్న కొన్ని రాజ్యములను, మాళవప్రాంతమును, బుందేలఖండములోని నరవరరాజ్యమును జయించెను. ఈతనియొద్ద గ్యాసుద్దీన్ బల్బన్ అను బుద్ధిశాలియగు మంత్రి పుంగవుఁ డుండెను. ఈసుల్తాన్ ౧౨౬౬లోఁ గీర్తిశేషుఁ డయ్యెను.

## గ్యాసుద్దీన్ బల్బన్.

(౧౨౬౬-౧౨౮౬)

నాసిరుద్దీన్ మహమ్మూదునకు సంతానము లేనందున నాతనిమంత్రియగు బల్బనునకు రాజ్య మనాయాసముగా లభించెను. ఈతఁడు చిన్నతనమున బానిసవాఁడుగానుండి తన యోగ్యతచే నింతవాఁడయ్యెను. ఈతనికాలములో రాజసభయొక్క మర్యాద లెక్కుడయ్యెను. ఈతఁడు మిక్కిలి వైభవమును సౌఖ్యమును అనుభవించెను. ఈతఁడు విద్వత్పక్షపాతియుఁ బ్రజాహితకరణదక్షుఁడునై యుండెను. తనరాజ్యమునందు మద్యపాన మెవ్వరును చేయఁగూడదని యీతఁడు శాసించెను. ఆశాసనమును ఉల్లంఘించినవారినిఁ గఠినముగా శిక్షించుచుండెను. ఆసమాచార మా సేవకునిభార్య పోయి బల్బనుతోఁ జెప్పుకొనఁగా వాఁడాయపరాధనిఁ బిలిపించి నిండుకొలువులో వానికి దేహాంతశిక్ష విధించెను. ఇట్లే అయోధ్యనవాబొకసారిచేయఁగా వానిని సభలోఁ గొరడాలతోఁ గొట్టించి చంపఁబడినసేవకునిభార్యకు నాతనిని బానిసవానిఁ జేసెను! తన రాజ్యమునందు నెచ్చటను సారాబట్టీలు పెట్టవలదని యాజ్ఞాపించెను!

తోగ్రల్ ఖానుఁ డనుబంగాళా దేశపు సుబేదారుఁడు తిరుగఁబడెను. అందుచే బల్బను వానిమీఁదికిఁ దన సైన్యముల రెండుసారులు పంపెను. కాని రెండుసారులును సుల్తాన్ సైన్యములకే పరాభవము కలిగెను. అందుచే మూఁడవసారి బల్బను స్వయముగా యుద్ధమునకుఁబోయి యాతనిఁ బరాభవించెను. (౧౨౮౩).

బల్బనునకు, సద్గుణములచేతను పరాక్రమముచేతను శోభితుఁడగు మహమ్మూదను కుమారుఁడుండెను. మొగలులు ముల్తానుమీఁదికి దండెత్తిరాఁగా నీమహమ్మూదు వారిమీఁదికిఁబోయి వారిని నోడించెను. కాని యాయుద్ధములోఁదాను హతుఁడయ్యెను (౧౨౮౫). పుత్రమరణదుఃఖమువలన బల్బను ౧౨౮౬ లో మృతుఁడయ్యెను.

ఈ సుల్తాన్ తురుష్కపక్షపాతియైనను మొత్తముమీఁద నీతనిరాజ్యకాలము వర్ణనీయమనుటకు సందేహములేదు. ఈతనికిఁ బూర్వము, ఢిల్లీపట్టణముచుట్టు దొంగతనములు, బందిపోటులు, తిరుగుబాటులు మొదలయినవాని భయము విశేషముగానుండెను. ఆభయములన్నియు నివారణచేసి యితఁ డరణ్యముల నరకించి, వ్యవసాయాభివృద్ధిచేసెను. అనేకదేశములలోని విద్వాంసు లీతనియాస్థానమునం దుండిరి. మొగలు లీతనిఁజూచి భయముఁ జెందుచుండిరి. ఈతఁడు తనకుమారునినిమిత్తము రాజ్యముచేయుపద్ధతులు వ్రాసియుంచెను. వానిలోనియంశము లందఱును జ్ఞాపకముంచుకొనఁ దగినవి. కావున వానిలోని కొన్ని యంశములుమాత్ర మిచ్చట నుదాహరించుచున్నాము.

‘నాయాయుర్దాయమంతయు రాజ్యమేలుటయందుఁ బోయెను. నేను కొద్దిదినములలోనె మరణము నొందుదును. కావున నాయనుభవమంతయు నీయుపయోగార్థము చెప్పుచున్నాను.

‘సింహాసనారూఢుఁడ నయినప్పటినుండియు నేను దేవుని ప్రతినిధిని అని తలఁచి ప్రవర్తింపుము. నీమీఁదఁ బడినకర్తవ్యభారమును జక్కఁగ గుర్తింపుము. దుష్ప్రవర్తనవలన నీగొప్పయధికారమునకుఁ గలంకము తగులనీయకుము. నీచులమీఁదను లోభులమీఁదను నీయనుగ్రహముఁ జూపకుము. వారిని నీయొద్దకుఁ జేరనీయవలదు.

‘వివేక మనుకళ్లెము పెట్టి మనోవికారము లనుగుఱ్ఱములను నీస్వాధీనములో నుంచుకొనుము. క్రోధముచేతిలోఁ జిక్కకుండ జాగ్రత్తపడుము. క్రోధము మనుష్యమాత్రు లందఱికిని శత్రువు. అందులోను రాజులఘాత కదిముఖ్యకారణము.

‘సారాసారవిచారశక్తియు, సత్కార్యాచరణమునందు దక్షతగలబుద్ధియు గలవారిసలహా తీసికొని, మితవ్యయయుక్తమయిన యౌదార్య కార్యములకు నీ బొక్కసములోని ధనమును వెచ్చించుచుండుము.

*    *    *    *    *

"స్వధర్మశీలత, సద్గుణములు, యోగ్యత యనుగుణములు గలవారిని న్యాయాధ్యక్షులుగా నియమింపుము. అందువలన నీన్యాయబుద్ధి రాజ్యమందంతటను ప్రకాశించును.

*    *    *    *    *

చేయఁదలచుకొనని యొకసారి నిశ్చయించి ప్రారంభించినపనిని పూర్తిచేయువఱకును విడువఁగూడదు. పట్టినపని విడిచినవారి మనోదౌర్బల్యము లోకులకు బాగుగఁ దెలియును.'

## కైకుబాద్.

(౧౨౮౬-౧౨౯౦).

ఈతఁడు బల్బను మనుమఁడు. ఈతఁడు దుష్టవర్తనము గలవాఁడు. యమునానదియొడ్డున నొకవిలాసమందిరముఁ గట్టించుకొని యితఁడు విషయసౌఖ్యముల ననుభవింపఁ దొడఁగెను. సరదారులును, ప్రజలును తిరుగఁబడఁ జొచ్చిరి. ఎట చూచినను అరాజకమయ్యెను. డిల్లీలో ఖిల్జీపక్షము, మొగల్ పక్షము అని రెండుపక్షము లుద్భవించి, యందలి ఖిల్జీపక్షపు నాయకుఁడగు జలాలుద్దీ ననువాఁడు కైకుబాదునుజంపి డిల్లీరాజ్యమును స్వాధీనముచేసికొనెను.

ఇట్లు క్రీ. శ. ౧౨౯౦లో బానిసవంశ మంతరించెను. గజ్నీమహమ్మాదుకాలముననుండి యీబానిసవంశ మంతమందువఱకు మూఁడువందలయేండ్లయ్యెను. ఈకాలములోఁదురుష్కు లుత్తరహిందూదేశములోని యనేకహిందూరాజుల గెలిచిరి. ఉత్తరదేశములోని తమరాజ్యమును బలపఱుచుకొనిరి. నర్మదానదిదాఁటి దక్షిణమునకుఁ బోరైరి. దక్షిణదేశములో నాకాలమున ననేక శూరాగ్రేసరులయినరాజు లుండిరి. ఓరుగంటిలోని కాకతీయరాజులును, దేవగిరిలోని యాదవరాజులును వైభవోన్నతియందుండిరి. మఱియు ననేకహిందూరాజులు దక్షిణమునం దుండిరి. కాని యుత్తరదేశమందలి హిందూరాజుల కొక్కఁడును

సహాయము చేయఁడాయెను. ఉత్తరదేశమునం దేమి జరుగుచున్నదియుఁ దెలిసికొనరైరి. తమలోఁ దామైక్యభావమును గుదుర్చుకొని సైన్యముల వృద్ధిపఱిచి చారులను బంపి తురుష్కుల వర్తమానములఁ దెప్పించుకొనుచుఁ దమపైకిఁ దురుష్కులు రాకుండుమార్గమునైనను జేయరైరి. ఇట్లు మిక్కిలి యజాగ్రత్తతో నున్నందువలన దక్షిణములోనిరాజులు తమస్వాతంత్ర్యములను త్వరలోనే పోఁగొట్టుకొని వినాశముఁజెందిరని చదువరులు చూడఁగలరు.

## ఖిల్ జీవంశము.

(౧౨౮౯-౧౩౨౦).

పేషావరునకు నావలనున్న అఫ్గానిస్థాన్ పర్వతప్రాంతములందు ఖిల్ జీలను నొకజాతిజను లుండిరి. గ్రామములు దోఁచుకొనుచుఁ దిరుగుట వీరివృత్తి. రాజుల సైన్యములో వీరు జీతమున కుండుటయుఁ గలదు. బల్బను సైన్యములో నిట్టివా రనేకు లుండిరి. మలిక్ అను సరదారుఁడు తనపరాక్రముచే బల్బనును మెప్పించి సామారాప్రాంతమునకు సుబేదారుఁ డయ్యెను. అతని కుమారుఁడు ఫిరోజ్. ఈతఁడు బానిసవంశములోని చివరవాఁ డగు కైకుబాద్ సుల్తానును జంపి జలాలుద్దీన్ అనుపేరిట ఢిల్లీశ్వరుఁ డయ్యె. ఈతని వంశమునకు ఖిల్ జీవంశ మని పేరు.

## జలాలుద్దీన్ ఖిల్ జీ.

(౧౨౮౯-౧౨౯౫).

ఈతఁడు రక్తపాతముఁజేసి రాజ్యమును సంపాదించినను, రాజ్యారూఢుఁడైన తరువాత సాత్వికవృత్తి నవలంబించెను. అంత పెద్దయధికారమునకుఁ దాను దగినవాఁడనుగానని నటించుచుండె. సింహాసనముమీఁదఁ గూర్చుండక తానంతకుఁ బూర్వము కూర్చుండెడి స్థలముననే కూర్చుండును. లోకులయెడ దయయు నుపకారబుద్ధియుఁ గలిగియుండెను. పూర్వపుస్నేహితులను నెప్పటివలెనే గౌరవించుచుండెను. ఎవరికిని గఠినమైనశిక్షలు విధించినవాఁడు

కాఁడు. ఈతని శాంతస్వభావమును తురుష్క చరిత్రకారు లెక్కుడుగాఁ బొగడి యున్నారు. ఇతని స్వజాతీయులగు ఖిల్జీవారి కీసుల్తా నింత శాంతముగా నుండుట యిష్టములేదు. క్రీ. శ. ౧౨౯౧లో గొప్ప కఱవు సంభవించి వేల కొలఁదిజనులు మడిసిరి.

ఈతనిశాంతస్వభావముఁ జూచి జను లచ్చటచ్చట నల్లరులుచేసి తిరుగఁ బడసాగిరి. అప్పు డీతఁడు కొంత రాజసన్ఫూర్తిని ధరించి యట్టివారి పొగ గడం చెను. మాళవాప్రాంతములోఁ దిరుగఁబడినవారిమీఁదికి స్వయముగా రెండు పర్యాయములు పోయి వారి నోడించి యాప్రాంతమును తన రాజ్యములోఁ గలుపుకొనియె. క్రీ. శ. ౧౨౯౨లో లక్షమొగల్ స్వారులు పంజాబుమీఁదికి దండెత్తివచ్చిరి. వారి నెదిరించుటకై జలాలుద్దీను స్వయముగావెళ్లి మొగలుల నోడించెను. కాని త్వరలోనే యుభయసైన్యములకు స్నేహము కుదిరెను. చంగీజ్ ఖానుని మనుమఁడగు ఉక్తాయతఖా ననువాఁడు జలాలుద్దీనునికూఁతును వివాహమాడెను. ఆఁతఁడు మూఁడువేల మొగలులను ఢిల్లీలో నుంచెను. ఢిల్లీలో వారున్న పేటకు 'మొగల్ పురా' యని యిప్పటివఱకును బేరుగలదు. ఈ మూఁడువేల మొగలులును త్వరలోనే మహమ్మదీయులైరి. ఇంతవఱకు మొగలు లందఱును మహమ్మదీయులు కాలేదు. మహమ్మదీయుల సహవాసమువలన వారందఱును క్రమక్రమముగా మహమ్మదీయు లయిరి.

## అల్లాఉద్దీన్ దక్షిణమును జయించుట.

(క్రీ. శ. ౧౨౯౩).

జలాలుద్దీనునియొద్ద నాతని తమ్ముని కొమారుఁడగు అల్లాఉద్దీన్ అను వాఁడుండెను. వాఁడనేకయుద్ధములయందుఁ దనశౌర్యముఁ జూపినందున నాత నిపై మిక్కిలి యనుగ్రహముకలవాఁడై జలాలుద్దీను, ఆతనిని గంగా యమునా నదుల నడుమనున్న కురా యనుప్రాంతమునకును, అయోధ్యాప్రాంతమునకును సుబేదారుగా నియమించెను. అదివఱకుఁ దురుష్కులు దక్షిణమునకుఁబోలేదు.

అదివఱకు నెవ్వరును జేయనిపని తానుజేసి దక్షిణరాజ్యములను గెలువఁగలయు ననిన కాంక్ష యీఅల్లాఉద్దీనునకుఁ బుట్టెను. దక్షిణములో దేవగిరియను ధనాఢ్యమైనపట్టణము గలదని యాతఁడు విని యచ్చటి ధనమంతయు దోఁచుకొనవలయునని నిశ్చయించెను.

దేవగిరికిఁ బ్రస్తుతము దౌలతాబాదనిపేరు. ఇది ప్రస్తుతము నైజాము రాజ్యములోని యౌరంగాబాదుజిల్లాలో నున్నది. ఢిల్లీపట్టణమునుండి యది రమారమి యేడునందల మైళ్లమీఁదనున్నది. ఆకాలమునందు ఢిల్లీనుండి దేవగిరికిఁ బోవుటకు నెన్నియో యరణ్యములును, అపరిచితస్థలములును దాఁటవలసియుండెను. త్రోవలో ననేకవిధములయిన జనులుండిరి. వారు మార్గము నడ్డగించినను, గుఱ్ఱములకుఁ గావలసినగడ్డియు సైనికులకుఁ గావలసిన ధాన్యమును నీయనియెడల నెవ్వరి సైన్యములయినను మడియవలసినదే. ఇట్టికారణములచే నల్లాఉద్దీను దేవగిరికిఁ బోవుటకు జలాలుద్దీ నిష్టపడినవాఁడుకాఁడు. కాని అల్లాఉద్దీన్ హిందువులస్వభావము వారితో నుత్తరహిందూదేశమునఁ బోరాడినపుడు బాగుగఁ దెలిసికొనెను. హిందువులు సాత్వికప్రవృత్తి ప్రధానులనియు, ధర్మయుద్ధముయొక్క నేమములను దప్పనివారనియు, న్యాయమైన మంచికాని యుద్ధమునకు రారనియు, వారిజోలికిఁ బోనిది వారన్యులజోలికిఁ బోరనియుఁ జక్కఁగ నెఱిఁగినవాఁడగుటచే నేదియో సాకు చెప్పి త్రోవలోని హిందూరాజుల మోసపుచ్చవచ్చునని నిశ్చయించి యెనిమిదివేల సైన్యముఁ దీసికొని క్రీ. శ. ౧౨౯౩లో గంగా యమునలలోనియంతర్వేదిలోనున్న కురా ప్రాంతము నుండి బయలుదేఱెను. బుందేల్ ఖండములోని యరణ్యములోనుండి కొన్నిదినములవఱకుఁ బ్రయాణముచేసి వింధ్యపర్వతమును, నర్మదానదియుఁ దాఁటి యకస్మాత్తుగా దేవగిరియొద్ద విడిసెను. త్రోవలో నంతటను నీతఁడు 'నేను ఢిల్లీసుల్తానునకుఁ దమ్మునికుమారుఁడను. పెత్తండ్రితోఁ బోరాడి రాజమహేంద్రవరపు రాజునొద్ద నుద్యోగము సంపాదించుకొనుటకు వెళ్లుచున్నాను' అని చెప్పెను.

ఈయేడువందల మైళ్లప్రదేశములో నాతనిమాట సత్యమా యసత్యమాయని విచారించినవాఁడుగాని. యీతురుష్కునిముందుకుఁ బోనిచ్చుట దేశోపద్రవకరమని తలఁచి యాతనిని నెదిరించినవాఁడుగాని యొక్కఁడును లేఁడయ్యెను!



దేవగిరి ; దౌలతాబాద్ దుర్గము.

ఆకాలమున దేవగిరిమీఁద యాదవకులజుఁ డగురామదేవరా యనుమహారాష్ట్రరాజు రాజ్యము చేయుచుండెను. కాకతీయరాజులలో రెండవ ప్రతాపరుద్రునివలె సీతఁడును ఈవంశములో మిగుల విఖ్యాతిఁ జెందెను. ఈతఁడు క్రీ.శ. ౧౨౭౧ మొదలు క్రీ.శ. ౧౩౦౯ వఱకు రాజ్యముచేసెను. ఈతనియొద్ద హేమాద్రి యనువాఁడు మంత్రిగా నుండెను. ముగ్ధబోధ మనువ్యాకరణమును రచించిన బోపదేవుఁ డీతని యాస్థానపండితుఁడని చెప్పెదరు. ఇఁకఁ బ్రకృత మనుసరింతము.*

---

* దేవగిరి యాదవులచరిత్ర సవిస్తరముగఁ దెలిసికొనఁగోరువారు హిందూదేశకథాసంగ్రహము-ప్రథమభాగము 4-వ కూర్పు చూడుఁడి.

అల్లాఉద్దీన్ వచ్చుచున్నాఁ డనినవార్తయే రామదేవరావునకుఁ దెలియదు. గ్రామమునకు వెలుపల నున్నదేవుని దర్శింపఁబోఁగా నాతనికి నీమ్లేచ్ఛుఁడు వచ్చెనన్నవార్త తెలిసెను. అప్పు డాతనిసైన్యము లచ్చటలేవు. మరియొక చోటికి యుద్ధమునకుఁ బోయియుండెను. కావున రామదేవరా వాగ్రామములోని కొందఱుజనులను జేర్చుకొని అల్లాఉద్దీనుతోఁ బోరాడి, యోడి కోటమీఁదికిఁబోయి డాఁగెను. ఇప్పటివలె నప్పుడు కోటకుఁ గందకములేదు. తురుష్కులు కోటకు ముట్టడివేసిరి. క్రిందనున్న పట్టణమును దోఁచుకొనిరి. దాఁచినధనముఁ జూపుఁడని ప్రజలను మిక్కిలి భాధలుపెట్టిరి. ‘నేను చిన్న సైన్యముతో ముందువచ్చినాను. వెనుకనుండి సుల్తానుయొక్క సముద్రమువంటి సైన్యము వచ్చుచున్నది’ యని యల్లాఉద్దీన్ రాజును బెదరించెను. ఇంతలో దురదృష్టవశమునఁ గోటలోనిధాన్య మయిపోయెను. ధాన్యపుగోనెలు కోటలోనికిఁ బంపుటకు బదులుగా నుప్పుబస్తాలదివఱకుఁ బంపఁబడియె. కోటలోని వారికిఁ దినుటకు నన్నము లేనందున రాజు వెంటనే యల్లాఉద్దీనునకుఁ గొంత ధనమిచ్చి సంధిచేసికొనెను. రామదేవుని సైన్యము వచ్చినయెడలఁ దనకుఁబరాజయము కలుగునేమోయని భయపడుచున్న తురుష్కుఁ డంతట బయలుదేఱుటకు సిద్ధుఁడయ్యెను. ఇంతలో రామదేవునిసైన్యముఁ దీసికొని యాతని కుమారుఁడగు శంకరదేవుఁడు వచ్చిచేరెను. తండ్రివలదన్నను శంకరదేవుఁడు ‘మా రాజ్యములోని ధనము మాకీయవలసినది’ అని యల్లాఉద్దీనుతో యుద్ధముచేయఁ దొడఁగెను. ఈయుద్ధములో శంకరదేవుఁ డసమానపరాక్రమముఁ గనఁబఱిచెను. తురుష్కులందఱును హతులగు సమయము వచ్చెను. ఇంతలోఁ గోటలోనుండి కొందఱు సైనికులు మరాటావారి సహాయమునకు రావలయునని బయలుదేఱిరి. కాని వారిగుఱ్ఱములవలన లేచినదుమ్మును జూచి యది ఢిల్లీనుండి వచ్చుచున్న మహమ్మదీయుల మహాసైన్యమని యెంచి శంకరదేవునిసైనికులు ధైర్యము విడిచి పాఱిపోయిరి. తురుష్కులు విజయులైరి. కోటలో ధాన్యములేనందున

రామదేవుఁ డామ్లేచ్ఛునకు ఎలిచ్‌పూరు చుట్టునుండు కొంతప్రాంతమును, అపారధనమును నిచ్చి సంధిచేసికొనెను. అల్లాఉద్దీన్ కరాప్రాంతమునకుఁ దిరిగిపోయెను. యుద్ధములోని జయాపజయములు కేవలపౌరుషాధీనములు కావనుటకు నీదేవగిరియుద్ధ మొక దృష్టాంతము.

ఈఅల్లాఉద్దీన్ తన్నుఁగుమారునివలెఁ బెంచిన జలాలుద్దీనును క్రీ. శ. ౧౨౯౫ లోఁ జంపి ఢిల్లీ సింహాసనమును దా నాక్రమించుకొనియె.

## అల్లాఉద్దీన్ ఖిల్‌జీ.

### (౧౨౯౬-౧౩౧౬).

ఈతఁడు రాజ్యమునకు వచ్చినతోడనే జలాలుద్దీనుని యిద్దఱుకొమారులను జెఱఁబెట్టి చంపించెను.

ఈతనిరాజ్యకాలమందు మోగలుల గొప్పసైన్యములు హిందూదేశము మీఁదికి నాలుగైదు పర్యాయములు దండెత్తివచ్చెను. కాని యన్ని పర్యాయములును అల్లాఉద్దీన్‌యొక్క సైన్యము లామోగలులఁబూర్తిగ నోడించి యీదేశమునుండి వెడలఁగొట్టెను.

ఈతఁడు రాజ్యమునకువచ్చిన రెండవయేట (౧౨౯౭) తనసరదారులను గుజరాథ్ దేశమునకుఁబంపి యచ్చటి కర్ణుఁడనురాజును వెడలఁగొట్టి యాతని భార్యను రాజ్యమును స్వాధీనముచేసికొనెను.

## రతనభోర్ జయించుట.

### (౧౨౯౯).

జయపూర్‌రాజ్యములో రతనభోర్ అనుబలిష్ఠమైన దుర్గమొకటి యుండెను. దానిని సాధించుటకు నల్లాఉద్దీన్ తనసరదారులగు ఆలఫ్‌ఖాన్, నుస్రత్‌ఖాన్ అనువారి నిద్దఱినిఁ బంపెను. అచ్చటి రాజగు హంవీరదేవుఁడు ఘోరముగఁ బోరి తురుష్కులను మరలించెను. అప్పుడు స్వయముగా నల్లాఉద్దీన్ యుద్ధమునకుఁబోయెను. ఆసమయమున నాతని యన్నకుమారుఁడగు రుక్న

ఖానుఁడనువాఁడు అల్లాఉద్దీన్ ఒక్కఁడు గానవచ్చినప్పు డాతనిపై బాణములువేసి, యాతఁడు చచ్చెనని తలఁచి, తాను సుల్తాను నని డంకావేయించెను. ఇంతలో నల్లాఉద్దీన్ లేచివచ్చి వానిశిరస్సును ఖండించెను. తరువాత రతనభోర్ చుట్టు ముట్టడివేసెను. దుర్గాధీశుఁడగు హంబీరదేవుఁడు మహాశౌర్యముతో స్వరక్షణముఁ జేసికొనియె. తురుష్కులకుఁ బరాజయముకలుగు సమయమువచ్చెను. ఇంతలో నారాజుయొక్క మంత్రి స్వామిద్రోహియు విశ్వాసఘాతకుఁడును నై కోట తురుష్కులకు నిచ్చివేసెను. తురుష్కులు లోనఁ జొరఁబడి రాజును, నితరజనులను జంపిరి. కోట తురుష్కులచేతిలోఁ బడిన తరువాత, బహుమతికై యెదురుచూచుచున్న యాస్వామిద్రోహినిఁజూచి అల్లాఉద్దీన్ 'మొదటియజమానుని మోసపుచ్చినవాఁడు రెండవయజమానునికి ద్రోహముచేయక యుండునా' యనిపలికి వానికిశిరశ్ఛేదము చేయించెను!

## చితోడ్ గడమును దీసికొనుట.

(౧౩౦౪)

క్రీ. శ. ౧౩౦౩ లో అల్లాఉద్దీన్ రాజపుత్రస్థానములోని చితోడ్ గడముమీఁదికి దండెత్తిపోయి దానిని గెలువలేక తిరిగివచ్చెను. మరుసటి సంవత్సరమునఁ దిరిగి యాగడమును ముట్టడించి దానిని స్వాధీనముచేసికొనెను. అప్పుడు క్షత్రియ వీరులును, క్షత్రియస్త్రీలును చూపిన యశ్రుతపూర్వమైన క్షాత్రతేజముయొక్క వర్ణన మిం దయిదవప్రకరణములోఁ జేయఁబడినది. కావున మరల నిచ్చట వర్ణింప నక్కఱలేదు.

## దక్షిణదేశపు దండయాత్ర.

విజయము సంప్రాప్తమైనకొలఁదిని అల్లాఉద్దీనుకు రాజ్యతృష్ణ యెక్కుడయ్యెను. దక్షిణ దేశమందున్న రాజ్యముల నన్నిటినిగెలిచి యాసేతుహిమాలయ మేకచ్ఛత్రాధిపత్యముగా రాజ్యమేలవలయునని వానికిఁ గోర్కెవొడమె. అందుచేఁ దనసేనానియగు మలీక్ కాఫు రనువానిని దక్షిణమునకుఁబంపెను.

ఈ కాఫురనువాఁడు మొదట ఖంబాయత్ పట్టణములో నొక వర్తకునియొద్ద బానిసగానుండెను. గుజరాథ్ ప్రాంతము గెలిచినప్పు డల్లాఉద్దీన్ ఈకాఫుర్ ను బలవంతముగాఁ బట్టుకొనివచ్చెను. కాని ఢిల్లీశ్వరునికి వీనియందు నను గ్రహము గలిగినందున వీఁడు దినదినాభివృద్ధిఁజెంది సేనానాయకుఁ డయ్యెను.

మలిక్ కాఫుర్ ౧౩౦౩లో ఓరుగంటిరాజ్యముమీఁదికి దండెత్తిపోయెను. కాని సంపూర్ణముగాఁ బరాభూతుఁడై ఢిల్లీకిఁ బాఱిపోవలసినవాఁ డాయెను.

దేవగిరిరాజగు రామదేవుఁ డొప్పుకొనిన కప్పముఁ జెల్లింపనందునఁ గాఫుర్ క్రీ. శ. ౧౩౦౬లో నాతనిరాజ్యముమీఁదికిఁ బోయి యాతనిఁ దీసికొని ఢిల్లీకిఁబోయెను. అచ్చట రామదేవుఁ డాఱునెల లుండి యల్లాఉద్దీన్ వలన మర్యాదనువడసి తనరాజ్యమునకుఁ దిరిగివచ్చెను. అప్పటినుండి యాతఁడు ఢిల్లీరాజులకుఁ దప్పక కప్పముఁ గట్టుచుండెను.

ఈ సేనాధీశుఁడు క్రీ. శ. ౧౩౦౯ లో నోరుగంటికిఁబోయి యచ్చటి రాజును నోడించి యాఁతఁడు ఢిల్లీశ్వరునకుఁ గప్పముకట్టునట్లుచేసెను.

క్రీ. శ. ౧౩౧౦ లో నాకాఫుర్ కర్ణాటకముమీఁదికి దండువెడలెను. దేవగిరి పైఠన్ మొదలగు పట్టణములమీఁదుగా 'ద్వారసముద్ర మనుకర్ణాట రాజధానిని జేరెను. ఈపట్టణము శ్రీరంగపట్టణమునకు వాయవ్యమున నూఱు క్రోసులదూరమున నున్నది. అచ్చట బల్లాలవంశజులు రాజ్యము చేయుచుండిరి. ఆపట్టణముఁ దీసికొని మ్లేచ్ఛుఁ డాక్షత్రియవంశము నంత మందించెను. అచ్చటి నుండి కాఫుర్ రామేశ్వరమువఱకుఁ బోయెను. త్రోవలో నాతని నెదిరించిన వాఁడు లేఁడయ్యెను! ఆతఁడు శ్రీరామేశ్వరక్షేత్రములో మసీదొకటి కట్టించి మహామ్మదీయమతమును తురుష్కరాజ్యమును ఆసేతుహిమాలయము వ్యాపింపఁ జేసినవాఁ డాయెను!

దేవగిరిరాజగు రామదేవుఁడు క్రీ. శ. ౧౩౦౯ లో మృతిచెందెను. ఆతని కుమారుఁడగు శంకరదేవుఁడు రాజయ్యెను. ఆతఁడు ఢిల్లీకిఁ గప్పము

వంప నందునఁ గ్రీ. శ. ౧౩౧౨ లోఁ గాఫుర్ ఆతనిమీఁదికిఁబోయి యాతనిఁ జంపి మహారాష్ట్రదేశమంతయు డిల్లీరాజ్యములోఁ గలిపెను.

## అల్లాఉద్దీనుని గర్వము.

ఎడతెగనివిజయములవలన నల్లాఉద్దీనునకు నహంభావ మెక్కువయయ్యెను. మహమ్మదువలె నూతన మతస్థాపనము చేయవలయుననియు, శికందరుని (అలెగ్సాండర్) వలెఁ బృథ్వియంతయు జయింపవలయుననియు వాఁడు నిశ్చయించెను. రెండవసికందర్ (Alexander the Second) అని పేరుపెట్టుకొని యాపేరిట నాణెములు వేయింపఁ దొడఁగెను. హిందూదేశములో నొక్క ప్రతినిధినుంచి తాను పృథ్వీదిగ్విజయమునకుఁ బయలుదేఱవలయు నని నిశ్చయించెను.

## రాజ్యములోని తిరుగుపాటులు.

అల్లాఉద్దీన్ మిక్కిలి కోపముకలవాఁడు. రాజ్యములో ననేకజను లాతనిని జంపుటకు నెన్నియోసారులు యత్నము చేయుచుండిరి. ఆ సమాచారములు తెలిసినపు డాతఁడు మఱింతకోపమును వహించును. మలిక్ కాఫుర్ దక్షిణములోని చివరదాడి వెడలివచ్చినప్పుడు అల్లాఉద్దీన్ యొక్క వైభవసూర్యుఁ డాకాశమధ్యమం దుండి ప్రచండుఁడై వెలుఁగుచుండెను. సృష్టిక్రమము ననుసరించి యాతఁడస్తాచలము వైపునకుఁ దిగఁజొచ్చెను. తృతీయప్రకృతిగల మలిక్ కాఫుర్ మీఁద నల్లాఉద్దీన్ మిక్కిలియనుగ్రహము గలిగియుండుటచేఁ గడమవారికందఱికిఁ గోపమువచ్చెను. సుల్తానునకును ఆతని భార్యాపుత్రాదులకును వైరము కలిగెను. కాఫుర్, వారినిఁబట్టుకొని కైదులోనుంచెను! గుజరాథ్ దేశమువారు తిరుగఁబడిరి; చితోడ్ గడము స్వతంత్రమయ్యెను. దక్షిణములో రామదేవరాయుని యల్లుఁడగు హర్‌పాలదేవుఁడు కొంతసైన్యమును జేర్చుకొని మహారాష్ట్ర దేశములోనుండి తురకల వెడలఁగొట్టెను. ఈసమాచారములు విని యందు వలనఁ గలిగిన దుఃఖక్రోధముల యుద్రేకమువలన రోగముపుట్టి అల్లా

ఉద్దీన్ క్రీ. శ. ౧౩౧౬ లోఁ జనిపోయెను. కాఫురనువాఁ డీతనికి విష ప్రయోగము చేసెననియు జనాపవాదము గలదు.

## అల్లాఉద్దీన్ స్వభావము.

ఈ బాదుశాహ ఛాందిష్టుఁడు, నిరంకుశుఁడు, నిర్దయుఁడు. ఈతని రాజ నీతి యత్యంతకుటిలమైనది. తన్నుఁ జంపుటకై లోకు లప్పుడప్పుడు యత్నించి నందున లోకులెవ్వరును రాజు నాజ్ఞ లేనిది తమయిండ్లను విందులు వినోదములు వివాహములు చేయఁగూడ దనియు, నొక్కచోఁ గూడఁగూడదనియు శాసించెను. భూమిపన్ను విశేషముగా నెక్కించెను. రైతు ఇట్టిభూమినే, యిట్టి పశువులనే, యిట్టి జీతగాండ్రనే తప్ప నితరుల నుంచుకొనఁగూడదని నిబంధన లేర్పఱిచెను. ఈయీసరకు లీయీధరలకే యమ్మవలసినది యని వర్తకులకుఁ గట్టడచేసెను. నలుదిక్కుల ననేక గుప్తచారులను బంపి ప్రజా జనుల రహస్యవర్తనముఁ గనుఁగొనుచుండెను. ఇట్టి నిబంధనలవలన లోకు లకు నిబ్బంది గలిగి వారికి బాదుషాయెడల నసూయ గలిగెను. ఈతఁడు ధర్మ విషయమై ప్రజలను బాధపెట్టినవాఁడు కాఁడు. ఇప్పటి ప్రభుత్వపువారివలెనే యితఁడు మతవిషయమునం దౌదాసీన్యము నవలంబించెను. తేప తేప మాఱుచుం డెడు లోకాభిప్రాయము ననుసరించి రాజ్యముచేయుటకంటె నొక్కరాజు నిరంకుశప్రభుత్వము చేయుటయే మంచిదని యీతఁడు చెప్పుచుండెను.

ఇట్లింతఱవ్యవస్థలవలనఁ బ్రజలకు మిక్కిలిబాధ కలుగుచున్నను ఈరాజు చండశాసనుఁ డగుటచేఁ బ్రజలకుఁ జోరాదులవలని బాధలుగాని, యితరరాజ్య విషయకబాధలుగాని లేకయుండెను. బాటసారులు నిర్భయముగఁ ద్రోవలలో నిదురించుచుండిరి. ఈ విషయములో నాతని రాజ్యమును ప్రస్తుతపు ప్రభుత్వ ముతోఁ బోల్పవచ్చును. బంగాళమునుండి కాబూలువఱకును, తెలుఁగు దేశము నుండి కాశ్మీరమువఱకును ఇప్పటివలెనే యప్పుడును బంగార మెగురవేయుచు బోయినను అడ్డగించువాఁడు లేకయుండెను.

ఈతఁడాసేతుహిమాలయరాజ్యముఁ బాలించిన మొదటి తురకరాజు. హిందూస్త్రీని వివాహమాడిన ప్రథమయవనుఁడు. ఐశ్వర్యమదాంధులై ప్రాప్తమైన యధికారమును దురుపయోగము సేసి ప్రజాపీడనమును సాధుతాడనమును చేసినవారికి నంతమందు నెట్టికష్టములు వచ్చునో రాజ్య మెట్లు లయించునో కనుఁగొనుటకు నీతనిచరిత్ర యొక ప్రబలమైన యుదాహరణము.

## ముబారిక్ ఖిల్జీ

## (౧౩౧౬-౧౩౨౦).

అల్లాఉద్దీన్ చచ్చినతోడనే యాతని పెద్దకుమారునికన్నులు పెఱికి వానిఁ గైదులోవేసి యాతని కైదేండ్లతమ్ముఁ డొకఁడుండఁగా వానికిఁబట్టముకట్టి మలీక్ కాఫుర్ తానె రాజ్యముచేయసాగెను. కాని వానిరాజ్య మొల్లక వానిసేవకులె వానిని జంపిరి. అల్లాఉద్దీనుని నాల్గవకుమారుఁడగు ముబారిక్ అనువాఁడు తనతోడబుట్టినవారినందఱిఁ జంపి తాను రాజయ్యెను.

ముబారిక్ మూర్ఖుఁడు, నీచుఁడు. వేశ్యా నట విటగాయకాది నీచులతోఁ గలసి యాటపాటలు నడపును. నీచులకు బానిసలకు గొప్పయధికారము లొసఁగెను. మర్యాద కలవారందఱును రాజసభకు వచ్చుట మానిరి. ఈరాజునొద్ద జాతిభ్రష్టుఁడగు ఒకగుజరాతీవాఁ డుండెను. వానిపేరు హసన్. వీనియెడ ముబారిక్కునకు ననుగ్రహము కుదిరినందున వాఁడు క్రమక్రమముగా నెక్కుచుఁ దుదకు ముఖ్యమంత్రి యయ్యెను. అప్పు డీతనికి ఖుస్రూ అని పేరువచ్చెను.

ఈరాజు మూర్ఖుఁడయినను గొన్ని సత్కృత్యము లీతనిచే జరిగినవి. జరాసంధునివలె అల్లాఉద్దిన్ పదునేడువేల జనులఁ గైదీలఁజేసెను. వారి నందఱి నీతఁడు విముక్తులఁ జేసెను. అల్లాఉద్దీనుచే లాగుకొనఁబడిన భూము లెవరివి వారికిచ్చెను. బాధకరములైన పన్నులఁ దీసివేసెను. ప్రజలకుఁ గలయితర బాధలఁ దొలఁగించెను.

క్రీ. శ. ౧౩౦౮ లో నీతఁడా కసరదారుని గుజరాథ్ మీఁదికిఁ బంపి తాను దక్షిణమునందలి దేవగిరికిఁ బోయెను. అచ్చట రామదేవుని యల్లుఁడగు హర్పాళ్ దేవుఁడు తురకలను వెడలఁగొట్టి రాజ్యము చేయుచుండెను. ముబారిక్ వానిఁ బట్టుకొని బాధించి చంపి తురకరాజ్యమును మహారాష్ట్రదేశములో, శివాజి యుదయించునాఁటికు స్థిరపఱిచిపోయెను. మహారాష్ట్రదేశమునకు మరల స్వరాజ్యము వచ్చెను. కాని యప్పుడు తురకలచేతులలోఁబడిన దేవగిరికోటమాత్ర మప్పటినుండి యిప్పటివఱకును మహమ్మదీయుల స్వాధీనతలోనే యుండుట వింతగదా! ప్రస్తుతమది దౌలతాబాద్ అనుపేరిట నైజాంరాజ్యములో నున్నది.

ఖుస్రూ మలబారు దేశమునకుఁబోయి యపరిమితమైనధనముఁ గొల్లగొట్టి తెచ్చినందున బాదుసా సంతుష్టుఁడై తనరాజ్యసూత్రములనుబూర్తిగా ఖుస్రూ చేతిలో వదలిపెట్టెను.

రాజ్యములో నెక్కుడఁ జూచినను తిరుగుబాటు లెక్కుడయ్యె. ఒకరాత్రి బాదుశహాను జంపి ఖుస్రూ రాజ్యారూఢుఁ డయ్యెను.

## ఖుస్రూ, లేక నసూర్ ఉద్దీన్.

రాజ్యారూఢుఁడై ఖుస్రూ నసూర్ ఉద్దీన్ అను పేరుపెట్టుకొనియెను. ఈతని చర్య లద్భుతములు. మొదట హిందువుగానుండి తురుష్కుఁడైన యీతఁడు పరస్పరవిరుద్ధములైనపనులు చేసెను. ఈతఁడు రాజ్యమందంతటను ఖుత్బా చదివించి నాణెములను వేయించెను. ఖుస్రూవంశములోని పురుషుల నందఱిని జంపించెను. అప్పటినుండి తాను హిందువునని చెప్పుచుఁ దురుష్కుల ద్వేషింపసాగెను. ఆతని యనుయాయులందఱును దిల్లీపట్టణములోని యన్ని మసీదులలోను విగ్రహములను స్థాపించిరి. తురకలధర్మపుస్తకమగు కురాన్ మీఁదఁ గూర్చుండఁజొచ్చిరి. బాదుసాయొక్క యంతఃపురమున అనన్వితమైన కృత్యములఁ జేసిరి. ఇట్లు ఈప్రచ్ఛన్న హిందువులు దిల్లీపట్టణమునంతయు నైదు

నెలలవఱకు నల్లకల్లోలముచేసిరి. ఇంతలోఁ బంజాబుదేశములోని సుబేదారగు గజీబెగ్ తుఘ్లఖ్ అనువాఁడువచ్చి ఖుస్రూను జంపి దిల్లి స్వాధీనముచేసికొని గ్యానుద్దీన్ అను పేరుపెట్టికొని రాజ్యము చేయసాగెను.

మొత్తముమీఁదఁ జూడఁగా ప్రచ్ఛన్నవేషముతో ఖుస్రూయనువాఁడు మరల హిందూరాజ్యము స్థాపింపవలయునని యత్నించినట్లు కానవచ్చెడిని. అందుచే ఫెరిస్తా మొదలయిన చరిత్రకారులు వీనినిగుఱించి పెక్కుకల్లలు వ్రాసిరి. ఖుస్రూ మొదట నంత్యజుఁడని ఫెరిస్తా యనెను. కాని యదియబద్ధము. అలీమహమ్మ దనువాఁడు గుజరాథ్ చరిత్ర వ్రాసియున్నాఁడు. అందు ఖుస్రూ మొదట రాజపుత్రుఁడని స్పష్టముగా వ్రాయఁబడియున్నది.

## తుఘ్లఖ్ వంశము.

(౧౩౨౦-౧౪౧౪).

ఇది యీదేశమున రాజ్యముఁజేసిన అఫ్గాన్ తురకల మూఁడవ కుటుంబము. వీరిరాజ్యమునకు నడుమ క్రీ. శ. ౧౩౯౮లో తైమూరులంగు దాడివలనఁ గొద్దికాలము విఘ్నమువచ్చినను తొంబదినాలుగు సంవత్సరములవఱకు నీవంశపువారు డిల్లిలో రాజ్యముచేసిరి. పైని ఖుస్రూను జంపెనని చెప్పిన గ్యాస్ఉద్దీన్ ఈవంశములోని మొదటివాఁడు.

### గ్యాస్ఉద్దీన్ తుఘ్లఖ్.

(౧౩౨౦-౧౩౨౫).

ఈతఁడు లాహోర్ప్రాంతమందలి రైతు అయియుండునని చరిత్రకారులూహించియున్నారు. తన సదాచరణమువలనను పౌరుషమువలనను గొప్పవాఁడయ్యెను. ఈతఁడు ఖుస్రూనుజంపి డిల్లిని స్వాధీనము చేసికొన్నప్పుడు ఖిల్జీవంశజుఁ డెవఁడైన నున్నయెడల రాజ్యమిచ్చెదనని వెతకించెను. కాని యదివఱకే వారందఱును ఖుస్రూచేతఁ జంపఁబడిరి గనుక ఖిల్జీవంశజుఁడెవ్వఁడు దొరకఁడయ్యె. అంత గ్యాస్ఉద్దీస్ పట్టాభిషిక్తుఁ డయ్యెను. ఈతఁ డాడిన

మాట తప్పనివాఁడు, నీతిమంతుఁడు, లోభములేనివాఁడు. ఈతఁ డైదు సంవత్సరములే రాజ్యముచేసినను ప్రజలచే మెప్పువడసెను. రాజ్యపాలనవిషయమై యందఱును దలయూఁచఁదగిన నిబంధనలు చేసెను. అనేకదుర్గములను, భవనములను బాగుచేయించి క్రొత్తవానిఁ గట్టించెను. గొప్పగొప్ప విద్వాంసులఁ బిలిపించి కురాన్‌లోని వచనములను డిల్లిలోని యాచారములను అనుసరించి క్రొత్త చట్టములను జేయించెను. మోగలులవలన రాజ్యమునకు బాధకలుగకుండ హిందూదేశపు ఉత్తరపు సరిహద్దునొద్దఁ దగినయేర్పాటులు చేసెను.

## ఓరుగల్లుమీఁదికి దండెత్తుట.

ఓరుగంటి ప్రతాపరుద్రుఁడు మహమ్మదీయులకుఁ గప్ప మీయుటమానెను. అందుచే బాదుషాయొక్క పెద్దకుమారుఁడైన అలూఫ్‌ఖానుఁడు క్రీ. శ. ౧౩౨౦ లో నోరుగంటికిఁబోయి యాకోటను ముట్టడించెను. ఈఅలూఫ్‌ఖానునినే కాఁబోలు కొందఱు చరిత్రకారు లుల్లూఖాన్ అని యనిరి. ఉభయసైన్యములకును ఘోరముగాఁ బోరుజరిగెను. ముట్టడివేసిన తురకలు హతాశులైరి. అనేకులుమడిసిరి. ఆంధ్రుల యద్భుతప్రతాపమునకుఁ దాళలేక మిగిలిన మ్లేచ్ఛులొకరాత్రి ఎవ్వరితోఁజెప్పక పలాయితులైరి. ఆంధ్రవీరులు వారివెంటఁబడి పాఱిపోవువారిలో ననేకులఁజంపిరి. వారి యుద్ధసామగ్రి నంతయు స్వాధీనము చేసికొనిరి. ఒకతురుష్కసేనానిఁ బట్టుకొనిరి. వాఁడు కారాగృహమునందె యంతమందెను. మఱియొక సేనానిని మరాటీవారు చంపిరి. ఇట్లు తురుష్కులకుఁ బ్రబలపరాభవముకలిగెను. కాని వాండ్రు పట్టినపట్టు వదలనివాండ్రగుటచే మరుసటి సంవత్సరమున మరలవచ్చి యంతఃకలహములచే క్షీణించియున్న ఓరుగంటిని గెలిచి ప్రతాపరుద్రుని జెఱపట్టి దిల్లికిఁ గొంపోయిరి. బాదుషా కొన్నిరోజుల కాతనిని వదలి యాతనిరాజ్య మాతనికిచ్చెను. కాని ప్రతాపరుద్రుఁడు మరల నోరుగంటికిరాలేదనియు గోదావరియొడ్డుననే యుండి తపస్సు చేసికొనియె ననియు నోరుగంటి కైఫీయత్తులో వ్రాయఁబడియున్నది.

## తుఘ్లకాభాద్.

ఈబాదుషహా ఢిల్లియొద్దనే యొక కోటకట్టి దానికి తుఘ్లఖాబాద్ అని తన వంశపుపేరుపెట్టి తనవంశపు కీర్తి యాచంద్రార్కము నుండునట్లుచేసెను. ప్రస్తుత మాకోట మిక్కిలి దురవస్థలోనున్నను దాని పూర్వవైభవమును సూచించు చున్నది. కోటగోడలు మిక్కిలి పెద్దవిగను, గట్టివిగను నున్నవి. కోటలోనికిఁ బోవు రాజద్వారము మొదలయినవన్నియు భూమిలోపల నున్నవి. కోటలోఁ గూర్చుండి శత్రుసైనికులతోఁ బోరాడవచ్చును. అచ్చటనుండి యిష్టమున్న వైపునకు సైన్యముఁ బంపుటకు వీలుండెను. కోటలోని త్రోవలు, బాజారులు, మందిరములు, తోటలు మొదలయినవాని గుఱుతు లిప్పటికిఁ గానవచ్చుచున్నవి. ఆకోటలోనుండిఢిల్లీపట్టణమునకుఁ బోవుటకుభూమిలోనుండి త్రోవయుండెను.

## గ్యాస్ఉద్దీన్ మరణము.

ఈబాదుషాహ తిరుగఁబడిన కొందఱుజనుల నోడించి తిర్హూత్ అనఁగాఁ బురాతనమిథిలాదేశమును స్వాధీనముచేసికొనియె. ఈతఁ డొకసారి బంగాళాదేశమునకుఁ బోయి తిరిగివచ్చినప్పుడు అలఫ్ఖాన్ అను నాతని పెద్ద కొమారుఁడు తండ్రిని మహాగౌరవముతో నూరివెలుపల నెదుర్కొని యాతని కొఱకు నిర్మింపఁబడిన కఱ్ఱగుడారములో దింపెను. ఆగుడార మొక్కసారి యాతనిమీఁదఁ బడినందున నాతఁ డసువుల విడిచెను. (౧౩౨౭) ఈమోస మంతయు నలఫ్ఖానునిచే బుద్ధిపూర్వకముగాఁ జేయఁబడియెనని చరిత్రకారుల యభిప్రాయము.

## మహమ్మద్ తుఘ్లఖ్.

## (౧౩౨౭-౧౩౫౧).

గ్యాస్ఉద్దీనుని పెద్దకొమారుఁడైన అలఫ్ఖానుఁడు 'మహమ్మ' దని పేరు పెట్టుకొని రాజ్యారూఢుఁ డయ్యెను. ఎక్కువగా విద్య నేర్చినవాఁ డైననుసారా సారవిచారమును దూరదృష్టియు లేనియెడల యీమనుజుని పుస్తకసంబంధి

డైన వానిపాండిత్యమంతయు నెట్లు నిష్ఫలమగునో చూడఁదలఁచినవారికి నీ బాదుషా చరిత్రయొక గొప్పలక్ష్యముగా నుండుననుటకు సందేహము లేదు. ఈతఁడు మిక్కిలి విద్వాంసుఁడు. ఈతనికి నరబ్బీ ఫారసీ భాషలలో సాహిత్య పటిమ గలదు. న్యాయశాస్త్రమునందును, గ్రీక్ తత్త్వశాస్త్రమునందును నిపుణుఁడు. వైద్యశాస్త్రములోను ప్రవేశము కలదు. రాజ్యమునకు రాఁగానే యనేక విద్వాంసుల కాశ్రయమిచ్చి యితరరాజులు చూపని యౌదార్యమును జూపెను. ఈతని యద్భుతస్మరణ శక్తినిఁ జూచి లోకు లీతనిని 'ఏక సంథగ్రాహి' యను చుండిరి. ఔదార్యమునందునుగూడ నీతఁడు మంచివాఁ డనిపించుకొనెను. ధర్మ నిష్ఠగలవాఁడై సారా మొదలయిన మాదకద్రవ్యములఁ జూడనైనఁ జూచెడు వాఁడుకాఁడు. ఇవి యీతని సద్గుణములు. ఇఁక దుర్గుణములఁ జూచినయెడల లక్షోపలక్షలు కలవు. ఈతఁ డత్యంతస్వేచ్ఛాచరణమును, తొందరపాటును, అదూరదృష్టియుఁ గలవాఁడు; అసూయామత్సరగ్రస్తుఁడు; పరమక్రూరుఁడు. ఇతనికిఁ గోపమువచ్చినపుడు చూచినయెడల నీతఁడు లోకమంతయు మ్రింగి వేయునా యేమి యనిచూచువారికిఁ దోఁచెడిని. ఈతఁడు స్వార్థమనోరథముల వెంటఁబడగిలి తెలివిమాలిన కార్యములఁజేసి తనరాజ్యమునకుఁ బ్రజలకును అపరిమితములయిన దుఃఖములఁ దెచ్చిపెట్టెను. ఈతనిచరిత్ర వ్రాయుట యనఁగా నితఁడుచేసిన పొరపాటులను లెక్కించుటయే.

## రాజ్యములోని యవ్యవస్థ.

ఈరాజులు దక్షిణదేశమును జయించినప్పటినుండియు రాజ్యముయొక్క వైశాల్య మెక్కువయై, యేకప్రభుత్వముగా నేలెడుభార మధికమయ్యెను. ఇంత కష్టపడినను దక్షిణదేశమువలన ద్రవ్యప్రాప్తివిశేషము కాదయ్యెను. పెక్కు సారు లుత్తరములోనిడబ్బు తీసికొనిపోయి దక్షిణమున వెచ్చింపవలసివచ్చెను. అందుచే బాదుషాహకొచ్చటిధనమును జాలదయ్యె. దేశమంతయు దోఁపిడివలనఁ గడుగఁబడినందునఁ బ్రజలలో బలమేమియు లేకపోయెను. ప్రాణసంరక్షణార్థమై

ప్రజలు రాజుమీఁదఁ దిరుగఁబడిరి. దక్షిణదేశములోఁ దిరుగఁబడినవారిని జయిం చుటకుఁ దనసైన్యము బాదుషా యంపఁగా నుత్తరదేశమునుండి మోగలు లీతని రాజ్యముమీఁదికి దండెత్తివచ్చిరి. యుద్ధముచేయుటకుఁ దనయొద్ద సైన్యములేనం దున మహమ్మదు వారికి ధనమిచ్చి సమాధానపఱిచి వారినిఁ బంపివేసెను. బాదు షాహ మిక్కిలి బీదవాఁడయ్యె. అప్పు డాతఁడు దక్షిణములోనిరాజులతో స్నే హముచేసి యుండినయెడల నాతనికష్టములు తొలఁగి యుండును. కానియట్లు చేయక తనకు డబ్బు కావలయునని ప్రజలపైఁ గఠినమైనపన్నులువేసెను.అందు చే బీదవా రడుగంటిరి; ధనవంతులు తిరుగఁబడిరి. రైతులు వ్యవసాయము మాను కొనిరి. ధాన్యపుధరలు హెచ్చెను. ఇంతలో వర్షముకూడ వెనుకకుఁబోయెను. ఇంకే మున్నది? ప్రజలు మలమలమాడిరి. వేలకొలఁది పట్టణములును, లక్షల కొలఁది పల్లెలును, కోట్లకొలఁది జనులును కుటుంబములును రూపములేకుండ నాశముఁ జెందెను. దేశమంతయు శ్మశానమయ్యెడు వేళవచ్చెను! ఆహా! స్వసౌఖ్యమునందే దృష్టిగలరాజుల పరిపాలనమువలన నిట్టియాపదలు సంభ వించునుగదా!

## రాజధానిని మార్చుట.

ఈసంకటమునుండి తప్పించుకొనుటకై మహమ్మదు డిల్లినుండిలేచి దక్షిణ మందలి దేవగిరి (దేవగడ్)తనరాజధానిగాఁ జేసెను. దేవగిరి యను పేరు మార్చి దానికి దౌలతాబాద్ అని పేరుపెట్టెను. అప్పుడే యీకోట ప్రస్తుతమున్నట్లు కట్టఁబడినది. తాను దౌలతాబాదునకుఁ బోవుటయేగాక డిల్లిలోని ప్రజలనందఱిని నేడువందలమైళ్లమీఁదనున్న యానూతనరాజధానికి రమ్మని బలవంతపెట్టెను. అట్లుచేయుటవలనఁ దన ప్రజలందఱును ఉత్తరదేశములోని కఱవును దప్పించు కొందురనియుఁ దాను దక్షిణములోని రాజ్యములఁ జక్కఁగఁ దనస్వాధీనము చుంచుకొనవచ్చుననియు నాబాదుషా యభిప్రాయము.కాని యందువలన ననేక జనులకు మిగుల బాధకల్గెను. నూతనరాజధానిలో నందఱికి స్థలము దొరకద

య్యెను. అందుచే నసంఖ్యాజనులు హతులైరి. ఢిల్లీపట్టణము పాడుపడెను. ఇట్ల నేకములయిన చిక్కులను జూచి బాదుషాహ మరల రాజధానిని ఢిల్లీకి మార్చెను! దౌలతాబాదునుండి మరల ఢిల్లీకి వచ్చునెడ ననేకులు మడిసిరి.

## రాగినాణెములను బంగారునాణెములుగ వాడుట.

బొక్కసములో ధనము లేకపోయెను. అందులకీ విచిత్రుఁడైనరాజొక యుక్తి కల్పించెను. రాగినాణెములఁ జేయించి వానిని బంగారునాణెములుగా వాడుఁడని ప్రజల నాజ్ఞాపించెను. రాజుచేఁజేయఁబడిన నాణెములవంటివే ప్రజలుచేయసాగిరి. అందుచే మోసమెక్కువయ్యెను. ఇట్టి పనికిమాలిన నాణెములిచ్చి బీదవారుగొప్పవెలగల ద్రవ్యములువర్తకులయొద్దనుండి కొనసాగిరి. ఈదేశములో రాగినాణెములకు సరకుగొని పరదేశవర్తకు లితరదేశములలో బంగారు నాణెముల కమ్మసాగిరి. అందుచే వర్తకులు వర్తకముచేయుట మానిరి. ఇతరదేశములనుండి యీదేశమునకు సరకులు వచ్చుట యాఁగిపోయెను. బంగారమువెల నాలుగురెట్లు హెచ్చెను. రాగినాణెములకు బదులు బాదుషా బంగార మీయలేకపోయెను. వేలకొలఁది వర్తకులు దరిద్రులైరి.

## చీనాదేశముమీఁదికి దాడి.

చీనాదేశమును జయించుటకై యీబాదుషాహ తన తమ్ముని కుమారుఁడగు ఖుస్రూమలీక్ అనువానిని లక్షసైన్యముతోఁ బంపెను. వాఁడు ౧౩౩౭లో బయలుదేరి నేపాల్ దేశపు టరణ్యములలో మిక్కిలి ప్రయాసపడి చీనాదేశపు పొలిమేర నెట్టకేలకుఁ జేరెను. అచ్చటఁ జీనాసైన్యములతోఁ బోరాడి యోడి ఖుస్రుమలీక్ తిరిగి పాఱిపలసినవాఁడాయెను. అప్పుడే వానపడినందున నెచ్చటఁ జూచినను జలప్రళయమయ్యె. అందువలనను చలిగాలివలనను సైనికు లందఱును సమసిరి. ఆదుఃఖవార్త బాదుషాహకుఁ జెప్పుటకుఁ బదిమంది మాత్రము బ్రతికి వచ్చిరి.

తుర్కస్థానమును పారసీకమును జయించుటకై బాదుషాహ యొక్క గొప్ప సేనను గూర్చెను. ఆసైనికులకు నొక్క సంవత్సరమువఱకుఁ గూర్చుండఁ బెట్టి జీతమీయవలసివచ్చెను. ఇంతలో బొక్కసములోని డబ్బయిపోయినం దున వారినందఱిని నిండ్లకుఁ బంపివేసెను. ఇట్లు పనిలేనిసైనికులు దేశమును దోఁచసాగిరి. దేశమునం దెటుచూచినను బందిపోటువార్తలే వినరాఁదొడఁగెను.

## రాజ్యములోని తిరుగుబాటులు.

ఈతఁ డొకపనియైనను సక్రమముగను సాంగోపాంగముగను జేయఁ డయ్యె. సంకటముతోఁబాటు ఈతని క్రోధమును అభివృద్ధికాఁ దొడఁగెను. కర్షాస్పుఁడను నితని యన్నకుమారుఁ డొకఁడు తిరుగఁబాటుచేయఁగా వానిని బట్టి యితఁ డెన్నెన్నియో బాధలుపెట్టి చంపించెను. (౧౩౩౮). ఇతఁడు విధించు శిక్షలన్నియు నిట్లే కఠినముగా నుండెను. ఈతఁడు రాక్షసప్రవృత్తి నవలంబించి మనుష్యులవేఁట యను నొక క్రొత్తవేఁటమార్గమును కల్పించి నిజవినోదార్థమై పెక్కు నిరపరాధులైన బీదవాండ్రను వేఁటాడెను. జమాబంది యను పద్ధతిని నీతఁడే ప్రారంభించెను. గంగా యమునలోని ప్రదేశమున భూమి శిస్తులు పూర్వముకంటెఁ గొన్నిచోట్లఁ బదిరెట్లును, కొన్నిచోట్ల నిరువది రెట్లును హెచ్చించెను. అందుచే నీతని యధికారులు సిస్తు నడుఁగఁబోయినపుడు జనులు గ్రామములను విడిచి పాఱిపోయిరి. అందుచే గ్రామములు పాడుపడి యరణ్యములు పెరిఁగెను. ఈతఁడు వేలకొలఁది జనులఁజంపి వారి శిరంబుల డిల్లీ కోటమీఁదఁ గట్టెను. ఇట్టి ఘోరకృత్యములవలన దేశమంతటను రా జుండఁ గానే యరాజక మయ్యెను. బంగాల్, దక్షిణదేశము, మల్‌బార్ మొదలయిన ప్రదేశములలోనిజనులు తిరుగఁబడి స్వతంత్రులగుటకు యత్నించిరి. తురకలను వెడలఁగొట్టుట కిదియే సమయమని తలఁచి కర్నాటకములోని బల్లాలదేవుఁడును, ఓరుగంటి కృష్ణనాగుఁడును మఱియు ననేకహిందూవీరులును ఘోరముగాఁ బోరి తురకలను దఱిమి తఱిమి దక్షిణమునుండి వెడలగొట్టిరి. దౌలతా

బాద్ తప్ప మ తేమియు దక్షిణమందుఁ దురకల స్వాధీనతలో లేకుండఁ జేసిరి. తుదకు మహమ్మదు స్వయముగా సైన్యములఁ దీసికొని దౌలతాబాదు నకుఁ బోయెను. ఇంతలో గుజరాథ్ దేశములోని జనులు తిరుగఁబడిరని విని యాతఁ డచ్చటికిఁ బోయెను. అచ్చట సింధురాజుతోఁ బోరాడవలయునని యత్నించుచుండఁగా జ్వరమువచ్చి యీవిక్షిప్తుఁ డగుబాదుషాహ మరణముఁ బొందెను (౧౩౫౧).

## స్వతంత్ర రాజ్యములు.

మహమ్మదు తుఘ్లఖ్ యొక్క రాజ్యములో నరాజక మగుటవలన నేదేశపు అధికారు లాదేశమునకు స్వతంత్రప్రభువులై ఢిల్లీశ్వరుని లక్ష్యపెట్టక పోయిరి. బంగాళము, కర్ణాటకము తురకవారిచేతులలోనుండి పూర్తిగా పోయెను. ఆఫ్గాన్, గక్కర్ అనఁబడువారు ఉత్తర హిందూదేశములోని వాయవ్యపుసరిహద్దును స్వాధీనము చేసికొనిరి. మహారాష్ట్రములోనున్న బాదుషాహయొక్క యల్లుఁడగు ఇమాన్ ఉల్ముల్క్ అనువానినిఁ జంపి హసన్ గంగూ యనువాఁడు బహమనీరాజ్యమునకు మూలపురుషుఁ డయ్యెను. ఈరాజ్య చరిత్ర యీగ్రంథముయొక్క నాల్గవప్రకరణములో వర్ణింపఁబడును.

## ఇబ్నబతూతా.

ఆఫ్రికా ఖండములోని లాంజర్స్ నివాసుఁ డగు ఇబ్నబతూతా యను విద్వాంసుఁ డాశియాఖండమును జూచుటకై వెడలి మహమ్మదు రాజ్యము చేయునప్పుడు క్రీ. శ. ౧౩౩౧లో ఢిల్లికి వచ్చెను. ఈపట్టణమును గుఱించియు నీరాజుయొక్క రాజనీతిని గుఱించియు నీతఁ డిట్లు వ్రాసియున్నాఁడు:—

“ఢిల్లి పట్టణమువైభవయుతముగ నున్నది. అచ్చటి మసీదులను, కోటగోడలను బోలినవి పృథ్విలో నెచ్చటను లేవు. అయినను లోకులు దక్షిణమునకు నెడలి పోయి నందునఁ బట్టణము నిర్జనమై యుండెను. మహమ్మదురాజ్యములో వెలుతురు చీకటి,న్యాయము అన్యాయము అనునవి మిక్కిలి వింతగాఁ గలిసి

యున్నవి.' ఈవిద్వాంసుఁడు కొన్నిదినము లారాజ్యములో న్యాయాధ్యక్షుని పనిచూచి చీనాకు రాయబారిగాఁ బోయెను.

## ఫిరోజ్ తుఘ్లుఖ్.

(౧౩౫౧-౧౩౮౮).

మహమ్మదు తుఘ్లుఖ్ చనిపోయిన తరువాత హిందూదేశమునకుఁ గొంత విశ్రాంతి కలిగెను. ఈతని పినతండ్రి కొమారుఁడైన ఫిరోజ్ అనువాఁడు సింహాసన మెక్కెను. రాజ్యమునకు వచ్చిన రెండవయేట నీతఁడు బంగాళమును జయించుటకుఁ బోయెను. కాని వర్ష ప్రతిబంధకమువలన నితఁడు తిరిగివచ్చెను. అటుతరువాత నీతఁడు నూతనరాజ్యమును సంపాదించుటకు యత్నించినవాఁడు కాఁడు. ఇతరరాజ్యముల స్వాతంత్ర్య మపహరించుటకు యత్నించుటకంటె నున్నరాజ్యమును చక్కఁగఁ బరిపాలించుకొనుట మంచిదని యీరాజు యుద్ధములను మానివేసెను. బంగాల్ బహమనీరాజ్యముల స్వాతంత్ర్య మొప్పుకొనెను. ఎల్లప్పుడును ప్రజాహితైకతత్పరుఁడై వారికి మేలగు కార్యములే చేయుచుండెను. అందుచే నితనికీర్తి యజరామరమైనది. యుద్ధవర్ణనలతో నిండియుండుటయే ఘనతయగునేని యితని చరిత్రలో నట్టివర్ణనలు లేవు. ప్రజాసౌఖ్యాభివృద్ధికరమగు పనులే శాశ్వతకీర్తికిఁ గారణ మగునేని యితనిచరిత్రయంతయు నట్టి పనులతోనే నిండియుండెను.

## జనులకు హితప్రదము లగుపనులు.

ఈతఁడు ప్రజలహితమునకై యీక్రింది మందిరాదికములఁ గట్టించె నని తురుష్క చరిత్రకారులు వ్రాసియున్నారు: ౮౦ మసీదులు, ౩౦ పాఠశాలలు, ౧౦౦ ధర్మశాలలు (సత్రములు), ౨౦౦ పట్టణములు, ౧౦౦ సార్వజనికస్నానగృహములు, ౨౦ రాజమందిరములు, ౧౦౦ రోగచికిత్సాలయములు (ఆస్పత్రులు), ౧౦ నక్షత్రశాలలు, ౧౦ పెద్దబావులు, ౩౦ తటాకములు, ౫౦ ఆనకట్టలు, ౧౫౦ వంతెనలు. ఇవిగాక గొప్పకాలువలు త్రవ్వించెను. అందు

మూఁడు ముఖ్యములైనవి. యమునానదిలోనుండి యొక కాలువ తీయించి దానిని పానిపత్ వద్దనుండి బికానీర్ మరుస్థలములోని హంసీ, హుసార్లను గ్రామముల వఱకుఁ గొనిపోయెను. అది యిప్పటివఱకును బాఱుచున్నది. రెండవకాలువ యొకటి త్రవ్వింపఁగా దానివలన ఘాగ్రా సట్లజ్ అనునదులు యమునతోఁ గలుపఁబడినవి. మూఁడవకాలువ సరస్వతీనదిమొదలు కగర్ నదివఱకుఁ ద్రవ్వింపఁబడియె. ఇది జీవనదివలె ననేకసంవత్సరములవఱకుఁ బాఱుచు సర్ హింద్, మన్సూర్ పుర్ ప్రాంతమందలి జనులకు మహోపకారిగనుండెను. ఈకాలువ త్రవ్వునపు డేఁబదివేలజనులు పనిచేయుచుండిరి. ఈకాలువ త్రవ్వు నపుడు పెద్దపెద్ద యెముకలుదొరకెనఁట. అందుమనుష్యుని యస్థిపంజరము (Skeleton) మూఁడుగజముల యైదడుగుల రెండంగుళముల పొడవుండెనఁట!

ఉత్తరహిందూదేశములో నాకాలమున కాలువలేవియు లేకయుండెను. తెలుఁగుదేశములో నున్న కాలువలును, వానివలన వ్యవసాయమునకుఁ గలుగు లాభమును గనుఁగొని యీబాదుషాహ యుత్తరదేశములోఁ గైనిర్మింపఁ బడినట్లు కాలువలు త్రవ్వించెనఁట. ఈసమాచారము తెలుఁగువారికి భూషణా స్పదము.

ఫిరోజ్ ఒక్కచోట నేయుండక ప్రజాక్షేమము గనుఁగొనుటకై ప్రతి సంవత్సరమును రాజ్యములోఁ దిరుగుచుండెను. అనేకస్థలములలోఁ గ్రొత్తక్రొత్త గ్రామములనుగట్టించి వ్యవసాయమధికముగా జరుగునట్లుచేసెను. ప్రజలకు బాధకరములయినపన్నులు తీసివేసెను. అందుచేఁ బ్రజలకు సౌఖ్యముకలిగి వారు తిని కుడుచుటకుఁ గలవారలయిరి. ప్రతిపురుషునియింటను కొంతధాన్య మును, దొడ్డియందుఁ బశువులును, స్త్రీయొడలిపై నగలునుకానుపింపను దొడఁ గెను. వస్త్రప్రావరణమును పూసపోఁగునులేని యిల్లులేదయ్యె. ఆహా! ఏమి వింత! విపరీతపుపన్నులు లేకుండినయెడలఁ బ్రజలు కొద్దిదినములలోనె ధన వంతులగుదురుగదా? సురాజుగలదేశమునకు బీదతన మేలవచ్చును?

## ఈతఁడు వ్రాసిన యాత్మచరిత్ర.

ప్రజల మేలుకొఱకు నీబాదుషాహాచేఁ జేయఁబడిన కార్యము లీతనియాత్మ చరిత్రయందు వివరముగా వర్ణింపఁబడినవి. అవి బహుబోధప్రదములగుటచే వాని నిచ్చటఁ దెనిఁగించుచున్నాము :—

“నేఁటివఱకుఁ జిన్నచిన్న యపరాధములకు నా యపరాధములు చేసిన వారినిఁ జంపుటయు, లేక వారి కాలు సేతుల నఱకుటయు, లేక వారికనులఁ దీయించి బాధపెట్టుటయు, లేక వారిని శూలముపై నెక్కించుటయు, లేక వారిచర్మముఁ దీయించుటయు మొదలయిన క్రూరశిక్షలు విధింపఁబడుచుండెను. కాని నాకు రాజ్యాధికారము నొసంగిన సర్వశక్తిమంతుఁడగు పరమేశ్వరుఁడు మిక్కిలి కృపగలవాఁడై యిట్టి క్రూరశిక్షలను నిలిపివేయుటకు నాకు బుద్ధి యొసంగెను. కావున నే నాజ్ఞాపించునది యేమనఁగా, నేఁటివఱకు నే యే ఢిల్లీశ్వరుఁ డిట్టి నిష్ఠురకృత్యములను జేసెనో, యాయా ఢిల్లీశ్వరునిపై నీశ్వరునికిఁ గలకోపమును బోఁగొట్టుటకై యందఱును ప్రతిదినము దేవదేవునిఁ బ్రార్థింపవలయును.

“చిన్నచిన్న వర్తకులయొద్దినుండి మాయుద్యోగస్థు లిదివఱకుఁ దీసికొనుచున్న బహుమతులను, కట్నములను, బాధకరములగు చిన్నచిన్న పన్నులను ఇఁక ముందునుండి తీసికొనఁగూడదు. బంజరుభూములలోఁ బశువులమేపుటకును, పుష్పములు చేఁపలు మొదలైనవాని నమ్ముటకును, ప్రత్తి యేకుటకును, వంటచేయుటకును, అంగడి పెట్టుటకును, సారాయి నమ్ముటకును, ప్రజలు రాజునకు నిదివఱకుఁ బన్ను నిచ్చుచుండిరి. కాని యీపన్నులన్నియు నిఁక ముందుఁ బ్రజ లీయ నక్కఱలేదు. ఎందుకనఁగా, నిట్టిపన్నులు రాఁబట్టుకొను నధికారులు తమయధికారమును దురుపయోగముచేసి ప్రజలను బాధపెట్టెదరు. అట్లు ప్రజల బాధపెట్టుటకంటె రాజు పన్ను వదలుకొనుట మేలు. ఇప్పుడు ప్రకటనపఱిచిన నియమముల నతిక్రమించి క్రొత్తపన్నులు ప్రజలపైవేయఁబడవు.

"యుద్ధమందు దొరకినధనమును నైదుభాగములుగా విభజించి, యందు నాలుగుభాగములు రాజు తీసికొని యొకభాగము సైనికులకుఁ బంచిపెట్టు నాచార మిదివఱకుఁ గలదు. ఇఁక ముందు నాలుగుభాగములు సైనికులకిచ్చి యొకభాగముమాత్రము రాజు తీసికొనఁగలఁడు. నాస్తికమతము నవలంబించుట, దుర్వ్యసనమును అభివృద్ధిచేయుట, లంచములు తీసికొనుట, ఉద్యోగస్థు లధికారమును దురుపయోగము సేయుట, ఈయపరాధములను చేసినవారిని రాజ్యము నుండి వెడలఁగొట్టఁబడును.

"నన్నుఁ జూచి జనులు వినయము నేర్చికొనవలయునని నేను వెలగల వస్త్రములనుగాని, ఆభరణములనుగాని ధరించుటమానివేసితిని. పూర్వరాజులచేఁ గట్టఁబడిన సత్రములు మొదలైన లోకోపయోగకరములగు వాని నన్నిటిని బాగుచేయించి క్రొత్తవానిని గట్టించుటలో ధనమును వ్యయపఱచుట నాకు విధియని తలఁచెద.

"మహమ్మద్ తుఘ్లఖ్ బాదుషాయొక్క కోపముచే నాశముఁజెందిన వారి వంశజు లెచ్చటనైన నుండినయెడల వెదకించి వారికి వర్షాశనము లొసంగి యాబాదుషాను క్షమించితి మని వారిచే వ్రాయించికొని, అందుపై సన్యాస్యులగువారిచే సంతకముచేయించి ముద్రవేయించి, యాకాగితములను ఆబాదుషా యొక్క సమాధిలోఁ బెట్టించితిని. విద్వాంసులును సన్యాస్యులును అగువారివలన నేను సద్బోధలవినుచు నాచరణమునందునట్లు ప్రవర్తించుటకు యత్నించెద. యుద్ధమందు గాయములుతగిలిగాని, ముసలితనముచేఁగాని, యుద్ధముచేయుటకు నసమర్థుఁడగు సైనికుఁ వాఁడుబ్రతికియుండువఱకు నింటఁ గూర్చుండఁబెట్టి వానిజీత ముపకార వేతనముగా నీయఁబడును. నాకు విషముపెట్టి చంపుటకు రెండుతడవలు యత్నించిరి. కాని యా యత్నములు కొనసాగినవి కావు."

## హిందూ మత ద్వేషము.

ఈ బాదుషాహ యనేకవిషయములలో మంచివాఁ డనిపించుకొనినను

హిందూమతమును గుఱించి మాత్రము మిక్కిలి ద్వేషము కలిగియుండెను. ఇతఁడనేక హిందూదేవాలయములను ప్రతిమలను, పుస్తకములను, ధ్వంసము చేసెను. బ్రాహ్మణులయెడ మిక్కిలి నిష్ఠురభావముకలవాఁడై వారియొద్దినుండి జిజియా యనుపన్ను రాఁబట్టుకొనుచుండెను. పన్నిచ్చుట లేదని యనేక బ్రాహ్మణులు తిరుగఁబడి ప్రాణములఁ బోఁగొట్టుకొనుచుండిరి. కాని యీ మ్లేచ్ఛుఁడా పన్నును దీసివేసినవాఁడు కాఁడు.

## వృద్ధావస్థ.

ఈతఁడు ముసలివాఁడైనతరువాత తనమంత్రియగు ఖాన్ జహాన్ అనువానికి రాజ్యవ్యవస్థ నొప్పగించెను. బాదుషా కొమారుఁడగుమహమ్మద్ అనువానికిని ఆమంత్రికిని వైరము వచ్చినందునఁ దనతండ్రియనుమతిని రాజపుత్రుఁడగు మహమ్మద్ రాజ్యము నేలసాగెను. కాని యీతఁడు రాజ్యపరిపాలనము చేయునప్పుడు రాజ్యములో ననేక యుద్ధములును, కల్లోలములును సంభవించినందున వయోవృద్ధుఁడగు ఫిరోజ్ బాదుషాహ మరల రాజ్యమును స్వయముగాఁ బాలింపఁ దొడఁగె. ఇతఁడు తొంబది వర్షములవఱకు బ్రతికి ౧౩౮౮ లోఁ బరలోకగతుఁ డయ్యెను.

## తరువాతి బాదుషాలు.

ఫిరోజ్ యొక్క మనుమఁడగు గయాసుద్దీన్ అనువాఁ డైదునెలలు రాజ్యముచేసెను. వానిని వానితమ్ములు చంపిరి. అబూబేకర్ అనువాఁడు కొన్నిరోజులు రాజ్యముచేయఁగా నయోగ్యుఁడని తలఁచి యాతనిని సరదారులు రాజ్యమునుండి తొలఁగించిరి; ఫిరోజుని కొమారుఁ డగు మహమ్మద్ అనువానికి రాజ్య మొసంగిరి. ఈతఁడు ౧౩౯౦ మొదలు ౧౩౯౪ వఱకు రాజ్యము చేసెను. తరువాత నీతనిపుత్రుఁడగు హుమాయూన్ రాజ్యారూఢుఁడయ్యెను. కాని యాతఁ డకస్మాత్తుగా మరణముఁ జెందినందున నాతని తమ్ముఁడగు మహమూద్ బాదుషా యయ్యె.

ఇట్లు ఢిల్లికి రాజులైనవా రందఱును అల్పాయువులును, అల్పసామర్థ్యము గలవారు నైనందున ఢిల్లిరాజ్యములో నెచ్చటఁజూచినను అరాజకమై యెచ్చటి యధికారు లచ్చటనే స్వతంత్రులుకాఁజొచ్చిరి. ఖాజాజహాన్ అను వజీరుఁడు బంగాళా దేశమును స్వాధీనముచేసికొని జోన్‌పూర్ పట్టణమును తన రాజధానిగాఁ జేసికొనియె. సారంగఖాన్ అను మఱియొక సరదారుఁడు పంజాబ్ దేశమును లోఁబఱుచుకొనియె. గుజరాథ్ మాళవ ఖానదేశములు మొదలయిన ప్రాంతములలోని యధికారులుస్వతంత్రులైరి. ఢిల్లిపట్టణములో నెల్లప్పుడును పోరాటములు జరుగుచుండెను. ఇట్లు ఢిల్లీశ్వరుఁ డెడతెగని సంకటములచే బాధపడుచు బలహీనుఁడగుట విని, యిదియే మంచి సమయముగాఁ దలఁచి తయమూర్‌లంగ్ అను మొగలుఁడు ఢిల్లిమీఁదికి దండెత్తివచ్చెను.

## చంగీజ్ ఖానుని వంశజులు.

చంగీజ్ ఖానుని గుఱించి యిదివఱకుఁ గొంత వ్రాసియున్నాము. ఆసియా ఖండములోని ప్రదేశమంతయు జయించిన యీమహాపురుషుఁడు ౧౨౨౭లోఁ బరలోకగతుఁ డయ్యెను. తరువాత నాతనిపుత్రుఁడగు ఉక్తాయ్, మనుమలగు గయూక్, మంగూన్, కుబ్లాఖాన్, అనువారు రాజ్యమునకు నధికారులైరి. ౧౨౨౭ మొదలు ౧౨౯౪వఱకు వీరాజులు చీనాదేశమును, హిందూదేశమునకుఁ దూర్పుననున్న మఱికొన్ని దేశములను జయించిరి. జపాన్ దేశమును మాత్రము గెలిచినవారు కారు. కుబ్లాఖ్ తమ్ముఁడగు హులాక్ అనువాఁడు ౧౨౫౮లో బగ్‌దాగ్ లోని ఖలీఫాను వెడలఁగొట్టి ఆలెప్పో,డమాస్కస్ పట్టణములను స్వాధీనముచేసికొనెను. ఉక్తాయనువాని యన్నకుమారుఁడు బాతూ యనువాఁడు యూరోఫ్ ఖండములోని రష్యాలోఁ బ్రవేశించి మాస్కో, కీఫ్ అను పట్టణములను గాల్చెను; జర్మనీకిఁ బోయి సాయిలేషియా, హంగేరి, పోలండ్ మొదలయినప్రదేశములను గెలిచెను. డ్యాన్యూబ్ నదియొక్క యుత్తరపు ప్రదేశమంతయు మొగలులు స్వాధీనముచేసికొనిరి. సర్వియా, బ్యాస్నియా,

బల్గేరియా మొదలైన ప్రాంతములను ధ్వంసముచేయుచు మోగలులు మరల రష్యా దేశమునకుఁబోయిరి. అచ్చట సైబేరియాప్రాంతముపై బాతూ యనువాని వంశజులు మూఁడువందల సంవత్సరములవఱకు రాజ్యముఁజేసిరి. తరువాత రష్యాదేశపువారా రాజ్యమును మరల స్వాధీనము చేసికొనిరి.

కుబ్లా అనువాఁడు పేకిన్ రాజధానిలో రాజ్యము చేయుచుండెను. అతని వంశజులు నూటయేఁబది సంవత్సరములవఱకు నచ్చటనే యుండి చీనాదేశముపై నిరంకుశప్రభుత్వము చేసిరి. కాని చీనాదేశమువారు తిరుగఁబడి మోగలులను వెడలఁగొట్టి నూటయేఁబదిసంవత్సరముల తరువాత తమ స్వాతంత్ర్యమును మరల సంపాదించుకొనిరి. తయమూర్ లంగ్ అనువాఁడు తాను చంగీజ్ ఖానుని వంశజుఁడనని చెప్పుచుండెను. గ్రంథకారులు నాప్రకారమే వ్రాసియున్నారు. కాని మీఁదవర్ణింపఁబడిన రెండు వంశములలో నీతఁ డేవంశమునందుఁ బుట్టినది తెలియదు.

## తయమూర్ లంగ్.

(౧౩౩౬-౧౪౦౫.)

ఈతని పేరు తయమూర్. లంగ్ అనఁగా కుంటివాఁడు. ఈతఁడు యుద్ధములో గాయములు తగిలి నందున కుంటివాఁ డయ్యెను. కావున చరిత్రకారు లీతనిని తయమూర్ లంగ్ అని వ్యవహరింతురు.

ఈతఁడు ౧౩౩౬వ సంవత్సరమున జన్మించెను. ఈతనితండ్రి పది వేల గుఱ్ఱములకు నధికారిగానుండెను.



తైమూర్.

తయమూర్ చిన్ననాఁటనుండియు యుద్ధప్రియుఁడై క్రమక్రమముగాఁ బర రాజుల నోడించుచు ౧౩౭౦లో జగతాయియను మోగలవంశము నంత మొందించి స్వతంత్రరాజ్యమును స్థాపించి సమర్కాండ్ పట్టణమును తన రాజధానిగాఁ జేసికొనియె. అటుతరువాత నీతఁడు పరరాజ్యముల జయింప దండయాత్రకు వెడలెను. పారసీకము పశ్చిమతురకస్థానమును గెలిచి మాస్కో పట్టణమువఱకుఁ బోయెను.

## హిందూదేశముమీఁదికివచ్చుట.

(౧౩౯౮).

తయమూర్ హిందూదేశము మీఁదికి దండెత్తివచ్చుటకుఁ గారణ మెద్దియో తెలియదు. మతాభివృద్ధిచేయుటకు నాతఁడు రాలేదనుట నిశ్చయము. ఏల యన నాతఁడు మహమ్మదీయుఁడైనను ఆ మతాభివృద్ధికిని, తన రాజ్యాభివృద్ధి కిని సంబంధము కలుగఁజేసినవాఁడు కాఁడు. ఈతఁడు రాజ్యాభిలాషచేతనే యీదేశమునకు వచ్చెనని తోఁచెడిని.

౧౩౯౭ వ సంవత్సరమునందు తయమూర్ మనుమఁడగు పీర్‌మహమ్మద్ జహాంగీర్ అనువాఁ డోడలతో వంతెనగట్టి సింధునదిని దాఁటి ఉంచ్ అను పట్టణమును ముట్టడించెను. ముల్తాన్ ప్రాంతమునకు సుబేదారుఁడగు సారంగ్ ఖాన్ ఆపట్టణమునకు సహాయముచేయుటకై వచ్చెను. కాని పీర్‌మహమ్మదు నకు నోడి ముల్తాన్‌దుర్గములో డాఁగియుండవలసినవాఁ డాయెను. పీర్‌మహ మ్మదు వెంటనేవచ్చి యాదుర్గమును ముట్టడించి యాఱునెలలవఱకు నచ్చటనే యుండెను. దుర్గములోని యన్నసామగ్రి వ్యయమై పోయినందున చేయునదిలేక సారంగఖానుఁ డాదుర్గమును పీర్‌మహమ్మదునకు స్వాధీనముచేసెను. అచ్చట పీర్‌మహమ్మద్ గుఱ్ఱములు రోగముచేఁ జచ్చినందున నాతనికి నేమియుఁ జేయుటకుఁ దోఁపకయుండెను. ఇంతలో నాతని తాతయగు తయమూర్ ౧౩౯౮లో నతనికి సాహాయ్యము చేయుటకు వచ్చెను.

సింధునది దాఁటి తయమూర్ మొదట తులుంబ్ పట్టణములోఁ బ్రవేశించి యందలిజనులనందఱిని నఱికివేసెను. ఈపట్టణము చినాబ్ రావి యనునదుల సంగమమునొద్ద నున్నది. అచ్చటనుండి తయమూర్ షహానవాజ్ అను పట్టణమునకుఁ బోయి యచ్చటనున్న ధాన్యములోనుండి తనకు వలయుధాన్యముఁదీసికొని మిగిలినదానినిగాల్చివేసెను.అచ్చటినుండి తన మనుమనియొద్దికిఁబోయెను. తాత మనుమలు గలిసి భాటనీర్ అను పట్టణముమీఁదికిఁ బోయి నిరపరాధులగు నసంఖ్యజనులను సంహరించిరి. అచ్చటినుండి సరస్వతి, ఫత్తేబాద్ రాజపూర్ మొదలైన స్థలముల ధ్వంసముచేయుచు నీమొగలసైన్యములు ఢిల్లిపట్టణమును సమీపించి పానిపత్తను కురుక్షేత్రములో విడిసెను. అప్పుడు ఢిల్లిలోఁ బేరునకుమాత్రము బాదుషా యగుమహమూదునకును, తయమూర్ లంగునకును యుద్ధముజరిగి యందు మహమూద్ పరాజితుఁడై గుజరాథ్ దేశమునకుఁ బాఱిపోయెను.ఢిల్లిపట్టణము తయమూర్ స్వాధీనమయ్యె. అచ్చటి జనులందఱు నతనిశరణుచొచ్చిరి. తయమూర్ ఢిల్లి సింహాసనముపైనెక్కి తనపేరట ఖుద్బా చదివించెను. ఇతఁడు పట్టణమునకు వెలుపలనుండి విజయోత్సవములోఁ నిమగ్నుఁడై యుండఁగా నితని సైనికులు ఢిల్లిపట్టణములోఁ జొరఁబడి యసంఖ్యజనులను నఱికి త్రోవలన్నియు రక్తముతోడను, శవములతోడను నింపివేసిరి. దోఁచుకొనిన ధన మింతయని చెప్పుటకు నలవికాదు.

తయమూర్ పదునైదు దినములవఱకు ఢిల్లిపట్టణములోనుండి దోఁచుకొనిన ధనమంతయు వెంటఁదీసికొని తనదేశమునకుఁ దిరిగి వెళ్లెను. వెళ్లునప్పుడు త్రోవలోఁ గాన్పించిన పట్టణములను గాల్చియు వేలకొలఁది జనులను సంహరించియు దేశమునం దంతటను నగ్నిప్రళయము గావించి మీరత్ హరిద్వార మార్గమున వెడలిపోయెను.

## తయమూర్ యొక్క స్వభావము.

ఆశకు దాసుఁడైనతరువాత మనుజుఁ డెట్టి క్రూరకర్మమునకైనను వెను

దీయఁ డనుటకు తయమూర్ లంగ్ యొక్క చరిత్రయే దృష్టాంతము. ఈతఁ డతిపరాక్రమవంతుఁడు; అతిక్రూరకర్ముఁడు. జనులను సంహరించుటయు, గ్రామములను గాల్చుటయు నితనికి సహజశీలములై యొప్పె. అయిన నితని యందు గొప్పరాజులకు శోభించు నితరసద్గుణములును వాసము చేయుచుండెను. ఇతఁడు దుష్టుఁడైనను అప్రబుద్ధుఁడు కాఁడు. ఇతని చట్టములును రాజ్యవ్యవస్థయుఁ జూచి యూరోపు దేశమువారును మెచ్చుకొనిరి. ఇతని నిష్ఠురమైన రాజనీతి యాకాలమునకుఁ దగినటులే యుండెను. అప్పుడు యూరోపు ఖండములో మిక్కిలి నాగరికతఁ జెందినదని ప్రఖ్యాతిగాంచిన స్పైన్ దేశమునకంటె నీతనిరాజ్య మన్నివిధముల శ్రేష్ఠముగా నుండెననుటకు సందేహములేదు. ఈతనియొద్దకుఁ బంపఁబడిన స్పైన్ దేశపు రాయబారిచే వ్రాయఁబడిన యంశములను బట్టియే మన మీసంగతుల నూహింపవచ్చును.

తయమూర్ నలుబదిసారులు దండువెడలి యనేకరాజ్యముల సంపాదించెను. ఇతఁ డింత గొప్పరాజ్యమును మిక్కిలి దక్షతతోఁ బరిపాలించెను. రాజ్యమం దంతట సుగ్రీవాజ్ఞవలెఁ జెల్లుచుండెను. ఇతని వైభవముఁ జూచి స్పైన్ రాయబారి యాశ్చర్యచకితుఁడయ్యె. ఇతనిపట్టపురాణివెంట మూఁడు నందల దాసీలుండిరి. క్రిందఁబడి పొర్లాడు పావడ నెత్తిపట్టుటకుఁ బదునైదుగురు దాసీలును, తలమీఁది ముకుటమును బట్టికొనుటకు ముగ్గురు దాసీలును వెంటఁ దిరుగుచుందురు.

తయమూర్ ౧౪౦౫ లోఁ బరలోకగతుఁ డయ్యెను.

## తయమూర్ తరువాతి హిందూదేశము.

తయమూర్ వెడలిపోయిన తరువాత ఢిల్లీపట్టణమునఁ గొన్ని నెలలవఱకు నరాజకమై యనేకజనులు గ్రామము విడిచి పాఱిపోయిరి. రెండు నెలలైన తరువాత మల్లూఇక్ బాల్ ఖాన్ అనువాఁడు కొంతపరిశ్రమచేసి పట్టణములోనియల్లరుల నడఁచెను. అప్పుడు మరలజనులుపట్టణములోనికి రాఁజొచ్చిరి. పాఱిపో

యిన మహామూద్ తుఘ్లఖ్ బాదుషాహ తిరిగి ఢిల్లికి వచ్చెను. కాని ఇక్బాల్ ఖానుకిని ఈతనికిని నైకమత్యము గలుగనందున వీరికి యుద్ధము జరిగెను. తరువాత ౧౪౦౫లో ఇక్బాల్ ఖానుఁడు మరణమునొందఁగా మహమూద్ మరల ఢిల్లీసింహాసనము నెక్కెను. కాని ఢిల్లీపట్టణములోఁ దప్ప మఱియెచ్చటను ఆతని యాజ్ఞ చెల్లదయ్యె. మిగిలిన ప్రాంతములన్నియు స్వతంత్రరాజ్యము లయ్యెను. గుజరాథ్ దేశములో ముజఫర్ ఖాన్, అయోధ్యాప్రాంతములో ఖ్వాజా జహాన్, కాల్పి మహోబా మొదలైన స్థలములో మహమ్మద్ ఖాన్, పంజాబులో ఖిజర్ ఖాన్ మొదలైనవాండ్రు సరదారులు స్వతంత్రులై ఢిల్లీశ్వరుని లక్ష్య పెట్టక యుండిరి. అందుచే మహామూద్ పేరునకు మాత్రము బాదుషాహగా నుండెను. ఈతఁడు ౧౪౧౨ లో నీలోకములోని కష్టములను సహింపలేక పరలోకగతుఁడయ్యెను. ఇంతటితో హిందూదేశములో రాజ్యముచేసిన తురక వంశ (Turks) మంతరించెనని చెప్పవచ్చును. మహామూదు పోయిన తరువాత దౌలత్ ఖానులోది అనువాఁడు రాజ్యము నాక్రమించుకొనియె. కాని వానిని నోడించి ఖిజర్ ఖాన్ అనువాఁడు ఢిల్లీశ్వరుఁడయ్యెను. ఈతఁడే సయ్యాదు వంశమునకు మూలపురుషుఁడు.

## సయ్యాద్ వంశము.

(౧౪౧౪-౧౪౫౦).

ఖిజర్ ఖానుఁడు తయమూర్ లంగ్ యొక్క అనుగ్రహము సంపాదించినవాఁ డగుటచే నాతని పేరిటనే రాజ్యము చేయుచుండెను. మంచిరాజనిపించుకొని యీతఁడు ౧౪౨౧లో మరణముఁ జెందెను. తరువాత నితని కొమారుఁడగు ముబారిక్ సయ్యాద్ అనువాఁడు ప్రజానురంజకముగనే రాజ్యము చేసెను. ఆతఁడు ౧౪౩౫లోఁ దనమంత్రిచేఁ జంపఁబడియె. తరువాత నితని కొమారుఁడగు మహమ్మద్ ౧౪౪౫ వఱకును, మనుమఁ డగు అల్లాఉద్దీన్ సయ్యాద్ అనువాఁడు ౧౪౫౦ వఱకును రాజ్యముచేసిరి. తరువాత బహిలోల్ లోదీ యను

వాఁడు రాజ్యము నాక్రమించుకొని లోదీవంశపురాజులలో మొదటివాఁ డయ్యెను.

## లోదీవంశము.

(౧౪౫౦-౧౫౨౬)

లోదీవంశమువారు అఫ్గానులు. మొదట వీరు వర్తకులు. ఫిరోజ్ తుఘ్లక్ రాజ్యములో మిక్కిలి ఘనతను జెంది రాజకీయోద్యోగములలోఁ బ్రవేశించిరి. బహిలోల్ బాదుషా మిక్కిలి శూరుఁడు. ఇతర సరదారులచే నాక్రమింపఁబడిన ఢిల్లీరాజ్యములోని ప్రాంతములను గొంతవఱకు సాధించెను. ముప్పదియెనిమిదిసంవత్సరములవఱకు రాజ్యముచేసి యీతఁడు ౧౪౮౮లో మృతుఁ డయ్యెను.

బహిలోలుని కొమారుఁడైన సికందర్ లోదీ యనువాఁడు తండ్రివలెనే పరాక్రమశీలుఁడై ప్రజలకు మేలు కలుగునట్లు రాజ్యముచేసెను. ఈతని రాజ్యములోఁ బ్రజలు యుద్ధభయములేక శాంతత ననుభవించిరి. ఇతఁడు దయయుఁ బరోపకారబుద్ధియుఁ గలవాఁడు. ప్రజారక్షణార్థమై సంరక్షకభటుల (పోలీసువారిని) నేర్పఱిచెను. గుఱ్ఱపుటంచెలఁ బెట్టించెను. బాటలను (రోడ్లను) వేయించి ప్రయాణమునకు ననేకములైనయుపపత్తులు కలిగించెను. ఇతఁడు విద్వాంసుఁడును, కవిత్వగుణసంపన్నుఁడును, ధర్మశాస్త్రవేత్తయు నైనందునఁ బ్రజలకు నెల్లప్పుడును న్యాయము కలుగఁజేయుచుండెను. అన్నిసద్గుణము లొక్కని యందు నుండఁగూడదని కాఁబోలు నితనియందు హిందూమతద్వేష మను గొప్పదుర్గుణ మొకటి వాసము చేయుచుండెను. మతవిషయమై యీతఁడు హిందువుల ననేకబాధలు పెట్టెను. ఇతఁడు ౧౫౧౭లో నైహికరాజ్యమును విడిచి వెళ్లెను. తరువాత నితనికొమారుఁ డగు ఇబ్రాహీంలోదీ యనువాఁడు పట్టాభిషిక్తుఁ డయ్యెను.

ఇబ్రాహీంలోదీ పరాక్రమహీనుఁడు. ఈతనిరాజ్యమందు నెచ్చటఁ జూచినను బ్రజలు తిరుగఁబడఁ జొచ్చిరి. లాహోరులోని సుబేదారుఁడగుదౌలత ఖాన్ అనువాఁడు దిల్లీశ్వరునితోఁ బోరాడి తయమూర్ వంశజుఁడైన బాబర్ అనువానిని హిందూదేశము మీఁదికి రప్పించెను. క్రీ. శ. ౧౫౨౬-వ సంవత్సరమందు నేప్రల్ ౨౧ వ దినమున పానిపత్ కురుక్షేత్రమునందు బాబరునకును ఇబ్రాహీమునకునుయుద్ధము జరిగి యందు నిబ్రాహీంలోదీ చంపఁబడియె. హిందూరాజ్యము మొగలుల స్వాధీనమయ్యెను. ఈసంగ్రామమునకు మొదటి పానిపత్ యుద్ధమని పేరు.

ఇఁక మొగలప్రభుత్వమును వర్ణింపవలసినది మాకువిధి. కాని యట్లుచేయుటకుఁ బూర్వ మప్పటిదేశకాలవిద్యావర్తకాదులను గుఱించి కొంచెము వ్రాసెదము.

## సింహావలోకనము.

గజ్నీ మహమూదు ౧౦౦౧ లో నీదేశముమీఁదికి మొదట దండెత్తి వచ్చెను. అప్పటినుండి ౧౫౨౬లో బాబర్ దిల్లిపట్టణమును స్వాధీనముచేసికొనువఱకు గతించినకాలము ౫౨౫ సంవత్సరములు. అందుమొదటి ౨౦౦ సంవత్సరములవఱకును పంజాబులోని కొంతభాగము తప్ప హిందూదేశములోని మఱియేప్రాంతమును మహమ్మదీయులకు లోఁబడినదికాదు. ౧౧౯౩లో జరిగిన స్థానేశ్వర యుద్ధము తరువాత నుత్తరహిందూదేశము తురుష్కుల స్వాధీన మయ్యెనని చెప్పవచ్చును. ౧౩౧౬లో మరణముచెందిన అల్లాఉద్దీన్ ఖిల్జీ రాజ్యము చేయునప్పుడు దక్షిణహిందూస్థానములోని యనేకప్రాంతములు తురకలచే నాక్రమింపఁబడియె. కాని కృష్ణానదికి దక్షిణము నందున్న దేశ మనేకసంవత్సరములవఱకు మహమ్మదీయులకు స్వాధీనమైనదికాదు.

ఈ అఫ్గానుల ప్రభుత్వము క్రమముగా బానిసవంశముతో ౧౨౦౬లోఁ బ్రారంభమై లోదీవంశముతో ౧౫౨౬ లో సమాప్తము నొందెను. ఈ ౩౨౦

సంవత్సరములును హిందూదేశమంతయుఁ దురుష్కులచే నొక్కరణరంగముగా మార్చఁబడియె. ఎచ్చటఁ జూచినను, ఎన్నఁడుచూచినను పోరాటములు, యుద్ధములు, రాజవంశములు మాఱుట, ఒక్కరాజ్యము పెక్కురాజ్యము లగుట, ప్రాంతాధికారులు తిరుగఁబడి స్వతంత్రులగుట మొదలైన రణప్రసంగములే కానవచ్చును. అందువలనఁ బ్రజలకు నిమ్మళపాటును సౌఖ్యమును లేకయుండెనని వేఱుగఁ జెప్పవలయునా?

## మతద్వేషము.

ఒకరిద్దఱు బాదుషాలు తప్ప కడమవా రందఱును హిందువులను హిందూమతమును ద్వేషించుచుండిరి. దానిచేఁ బ్రజలకు మిక్కిలి బాధలు కలుగుచుండెను. బాదుషాలవలన దమకు నెన్నిబాధలు కలిగినను హిందువులు తమ మతమును వదలినవారు కారు. రాజభీతిచే మహమ్మదీయులైనవారు లక్షకొక్కరైనను ఉందురో యుండరో. ఇట్లెన్నిసంకటములకైన నోర్చి తమమతమును విడువకయున్నందులకు హిందువుల నెంతయుఁ గొనియాడవలసి యున్నది. పారసీకము తురకస్థానము మొదలైన దేశములలోని జనులందఱును రాజభీతిచే స్వమతమును వదలి మహమ్మదీయమతమును స్వీకరించిరి. కాని యెన్నిసంకటములు వచ్చినను హిందువులుమాత్రము మతభ్రష్టులు కారైరి. ఇంతియకాదు. కాలము పోయినకొలఁదిని హిందువులకుఁ గల పరమతసహిష్ణుతవలన హిందువులకును, మహమ్మదీయులకును సఖ్యత హెచ్చి వారొక్కగ్రామములో నన్నదమ్ములవలె నుండుట సంభవించెను.

హిందువులకు మతవిషయమై కొంతబాధకలిగినను రాజకీయోద్యోగము లనేకములు వారి కీయఁబడుచుండెను. భూమిశిస్తుతో సంబంధించిన యుద్యోగములు విశేషముగా హిందువులకే దొరకుచుండెను. వర్తకముకూడ వారే చేయుచుండిరి.

## గ్రామ సంఘములు.

యుద్ధములవలనఁ బ్రజాపీడనము జరుగుచుండె నని యిదివఱకు వ్రాసియున్నాము. కాని పెద్దపెద్ద పట్టణములలో నుండువారికిని, ఆ పట్టణముల యొద్ద నుండువారికిని దప్ప పల్లెలలో నుండువారికి యుద్ధాదులవలన విశేషబాధ లేకయుండెను. పల్లెలలో జనులు రాజకీయాధికారులువచ్చినప్పుడు వారి కీయవలసినపన్ను నిచ్చి వారినిఁ బంపి గ్రామములోని వ్యవహారము లన్నియు రాజుతో సంబంధములేకుండ తామే చక్కఁబెట్టుకొనుచుండిరి. గ్రామములోనికి దొంగలు మొదలగువారు రాకుండ గ్రామస్థులే తగుఏర్పాటుచేయుచుండిరి. గ్రామములోని పోరాటలను, వ్యవహారములను, దాయభాగవివాదములను గ్రామములోని పెద్దమనుష్యులే విచారించి తీర్చుచుండిరి. గ్రామములోని జనులు కలహించి తీర్పునకు మఱియొక గ్రామమునకుఁబోయి నెరుగరు. ఇట్టి గ్రామసంఘములకే పంచాయితీ లనిపేరు. ఇట్టివి హిందూదేశమందు ననాదికాలమునుండి మహమ్మదీయ ప్రభుత్వ సమాప్తివఱకు జరిగి ప్రస్తుతప్రభుత్వము వచ్చినతరువాత నడుగంటినవి. ఇప్పటివారు గ్రామస్థులను లక్ష్యపెట్టక మూఁడురూపాయిల వ్యాజ్యమునకై ముప్పదిసారులు న్యాయస్థానమునకుఁ దిరుగుచు మూఁడువందలరూపాయిలు వెచ్చించుట మనము చూచుచున్నాము. ఇదియెంతయు శోచనీయము. మనవాండ్రు గ్రామసంఘములను మరల స్థాపించి యికఁ ముందైనను ఇంటిగుట్టు వెలిపుచ్చకుందురు గాక!

## వర్తకము.

రాజ్యములోని యెడతెగని యుద్ధములవలన మధ్య హిందూదేశములో వర్తక మంతగాఁ బ్రబలినట్లు కానరాదు. కాని సముద్రపుటొడ్డున నున్న దేశములలో వర్తకము విశేషముగా జరుగుచుండెను. మార్కోపోలో యను వేనిస్ పట్టణపువర్తకుఁడు హిందూదేశమునకు వచ్చియుండెను. ఆతఁడు వ్రాసియుంచిన వర్ణనవలన మన మప్పటివర్తకమును గుఱించియు, నితరాంశములను

గుఱించియుఁ దెలిసికొనవచ్చును. ఆతఁ డీదేశములోఁ బూర్వపశ్చిమ సముద్రముల యొడ్డునఁ దిరిగి కన్యాకుమారియొద్దఁ దనవృత్తాంతమును వ్రాసెను. ఆతని కచ్చట మనుష్యులవంటి కోఁతులు కానుపించెనఁట. అది శ్రీరాములవారి వానరసేన కాదు కదా! పూర్వసముద్రపుటొడ్డున నాకాలమందు కాయల్ అను గ్రామము విఖ్యాతవర్తకస్థలమై యుండెను. అచ్చటికిఁ బారసీకము నుండియు, అరబస్థానము నుండియు గుఱ్ఱములు దిగుమతి యగుచుండెను. చీనాదేశమునుండియు పెక్కుసరకులు వచ్చుచుండెను. చెన్నపట్టణమునొద్ద సెంట్ తామస్ అను క్రైస్తవసాధువుయొక్క దేవాలయ ముండెను. ఈసాధువు క్రీ. శ. ౧-వ శతాబ్దములో దక్షిణహిందూదేశమునకు వచ్చి యనేకహిందువులకుఁ గ్రైస్తవదీక్ష యొసంగెనఁట.

ట్రావెన్కూర్ రాజ్యములో క్విలాన్ అనునది గొప్పవర్తకస్థలమై యుండెను.

కొంకణదేశమును గుఱించి మార్కోపోలో యిట్లు వ్రాసియున్నాఁడు:

"వర్తకవిషయములో నీ ప్రాంతమందలి బ్రాహ్మణులకుఁ గల చాతుర్యము లోకములో మఱి యెవ్వరికిని లేదు. ఎట్టి కష్టములు సంభవించినను వారబద్ధములాడరు. మద్యమాంసముల నంటరు. యజ్ఞోపవీతములను ధరించెదరు. వారు తమ భార్యలయెడ విశేషానురక్తులై యుందురు. వారు ప్రతిమాపూజకులు. శకునములను నమ్ముదురు. చల్లతో నన్నము తిని వారు విశేషకాలము వఱకు బ్రతికియుండెదరు. కొందఱు నూటయేఁబది, రెండువందల యేండ్ల వఱకు బ్రతికియుండిరఁట."

గుజరాథ్ దేశములో తోళ్లవర్తకము, అల్లికపని, క్రోషాపని చక్కఁగఁ జేయుచుండిరి. ఠాణా, ఖంబాయత్, సోమనాథ్ మొదలైన స్థలములు వర్తకమునకై విఖ్యాతిఁ జెందియుండెను.

# మూఁడవ ప్రకరణము.

# మొగల్ ప్రభుత్వము.

## బాబర్.

(౧౫౨౬ - ౧౫౩౦).

ఈతని సంపూర్ణనామము జహీరుద్దీన్ మహమ్మద్ బాబర్. ఈతఁడు తెయమూర్ లంగ్ వద్దనుండి యాఱవ పురుషుఁడు. ౧౪౮౨ లో నీతఁడు జన్మించెను. పండ్రెండు సంవత్సరములవాఁడైనప్పు డీతనితండ్రి పరలోకగతుఁడైనందున జ్ఞాతులందఱును రాజ్య మపహరించి యాతనిని వెడలఁగొట్టిరి. కొన్నిదినము లరణ్యములోఁ గడపి స్వదేశము విడిచి యాతఁడు ఆఫ్గానిస్థానమునకుఁ బోయెను. అచ్చట సైన్యములను గూర్చుకొని కాబూల్ రాజ్యమును సంపాదించెను.



బాబర్.

ఆరాజ్యపుసీమ హిందూదేశము నంటియుండెను. ఢిల్లీ బాదుషాలయొక్క పౌరుషహీనతను విని మధ్యాసియాలోఁ బోయిన రాజ్యమునకు బదులు హిందూరాజ్యమును సంపాదింపవలయు నని యాతఁడు హిందూదేశము మీఁదికి రెండుసారులు దండెత్తివచ్చెను. కాని పరాజితుఁడై తిరిగి వెళ్లెను. ఎన్ని విఘ్నములువచ్చినను ధైర్యము విడువక మరలమరల యత్నించుటః మొగ

లుల స్వభావమైనందున బాబర్ ౧౫౨౬ లో హిందూదేశమునకు వచ్చి పానిపత్ రణక్షేత్రములో ఇబ్రాహీం లోదీనిఁ జంపి డిల్లీ సింహాసనము నెక్కె నని యిదివఱకే వ్రాసియున్నాము.

ఇట్లు దిల్లీపట్టణమును స్వాధీనముచేసికొని బాబర్ రాజపుత్రుల జయించుటకువెడలెను. అప్పుడు రాజపుత్రస్థానములోని మేవాడ్ రాజ్యమునకు సంగరాణా యధిపతి యైయుండెను. అతఁడు శూరాగ్రేసరుఁడు. మోసములేనిది యాతనిని జయించుట యసంభవమని తలఁచి రాజపుత్రసైన్యములో భేదము కల్పించి బాబర్ ౧౫౨౭లో సంగరాణాను సిక్రీయుద్ధములో నోడించెను. ఈ సమాచారమంతయు నైదవప్రకరణములో వివరముగా వర్ణింపఁబడినది. బాబర్ ౧౫౨౮లో బుందేల్ ఖండములోని చెందేరిదుర్గమును స్వాధీనముచేసికొనెను. తరువాత నీతఁడు బహార్ ప్రాంతము నాక్రమించుకొనియె. ౧౫౩౦లో నీతఁడాగ్రా పట్టణములో సమాధిస్థుఁ డయ్యెను.

## బాబర్ స్వభావము.

ఈతఁడు నాలుగైదుసంవత్సరములే రాజ్యముచేసెను. అయినను చరిత్రకారు లీతనిని గొప్పరాజుగా నెంచుచున్నారు. ఈతఁడు చిన్నతనమునందు ననేకసంకటముల ననుభవించి స్వపరాక్రమముచేతనే రాజయ్యెను. అద్భుతరణశూరుఁడనియు, నుత్తమసేనానియనియు నీతఁడు ఖ్యాతిఁ జెందెను. ఈతని సైన్యములోని కట్టుదిట్టములు బహుప్రశంసనీయములు. దాడివెడలినప్పు డితఁడు సామాన్యభటునివలె నన్నిపనులును జేయును. ఇతఁడు విద్యాప్రియుఁడు. చక్కఁగఁ గవిత్వముఁ జెప్పను. విద్వాంసులను, రసికులను, కవులను, చిత్రకారులను బిలిపించి గౌరవించును. ఇతఁడు తనయాత్మచరిత్రను తురుష్కభాషలో వ్రాసియుంచెను. అందువలనఁ జరిత్రాంశములు కొన్ని తెలియును. బాబర్‌కు మొదట మద్యపానవ్యసనము కలదు. కాని సిక్రీయుద్ధములో సంగరాణాను గెలిచినయెడల మద్యమును ముట్టనని దేవునికి నీతఁడు మ్రొక్కి, విజయుఁడై

యప్పటినుండి త్రాగుట మానెను. ఇతనితల్లి మిక్కిలి తెలివికలది. ఆమె తల్లియుఁ బ్రతిభాశాలినిగా నుండెను. వీరిద్దఱియాజ్ఞలో బాబ రెప్పుడును మెలఁగుచుండెను. మరణసమయమున నీతనిరాజ్యము పశ్చిమమున మధ్యాసియాలోని ఆమూనది మొదలు తూర్పున ఆసామువఱకుఁ బ్రసరించి యుండెను. ఇతని కోర్కె ననుసరించి యితని దేహమును కాబూల్ పట్టణమునకుఁ దీసికొనిపోయి పాఁతివేసిరి.

## హుమాయూన్.

(౧౫౩౦-౧౫౪౦).

బాబరునకు నలుగురుపుత్రులుండిరి. హుమాయూన్, కామరాన్, హిందాల్, మీర్జా, అని వారిపేళ్లు. బాబరునకు వారియందఱి మీఁద సమాన ప్రీతికలదు. మరణ సమయమున నాతఁడు తన పెద్ద కుమారుఁడగు హుమాయూనును పిలిచి "నీవు రాజవైన తరువాత నీతమ్ములను ప్రీతితోఁ జూడు" మని చెప్పెను. హుమాయూన్ రాజ్యమునకు వచ్చినతరువాతఁ దండ్రి యాజ్ఞ ననుసరించి తమ్ములను ప్రేమతోఁ జూచుచుండెను. కామరాన్ అనువానికిఁ గాబూల్, పంజాబ్ దేశముల నిచ్చెను. మిగిలిన యిద్దఱి తమ్ములకుఁగూడఁ గొన్ని దేశముల యధికార మిచ్చెను. హుమాయూన్ సుస్వభావమును, బంధు



హుమాయూన్.

ప్రీతియుఁ గలవాఁడు. కాని రాజుల కుండవలసిన సాహసస్థిరబుద్ధు లాతనికి లేనందున నాతఁడు రాజ్యముఁ గోలుపోవలసినవాఁ డాయెను.

మొదట హుమాయూన్ బుందేల్ ఖండముమీఁదికి దండెత్తిపోయి కలింజర్ దుర్గమును నాక్రమించుకొనియె. మొగలుల ప్రభుత్వ మింకను ఉత్తర హిందూదేశ మంతటను వ్యాపించినదికాదు. లోదీ వంశజులగు కొందఱు ప్రాంత అఫ్గాన్ సరదారులు మొగలులకు లోఁబడక మరల తమరాజ్యమును స్థాపించుటకు యత్నించుచుండిరి. అందు షేర్ ఖానుఁ డొకఁడు. వాఁడు సూర వంశజుఁడు. వాఁడు కాశీయొద్ద చునార్ గడ మనుకోటను స్వాధీనముచేసికొని



చునార్ గడము.

తిరుగఁబడెను. వానిని హుమాయూన్ యుద్ధములో నోడించెను. కాని దయ తలఁచి యపరాధములక్షమించి వానియధికారము వానికి మరల నొసంగెను. ౧౫౩౪ లో హుమాయూన్ గుజరాత్ దేశముమీఁదికి యుద్ధమునకుఁబోయి యచ్చటి బహాదుర్ షహా యనుసుల్తానునిఁ బరాభవించి పెక్కుకోటలను, పట్టణములను ఆక్రమించుకొనియెను.

ఉపకారమును మఱచి షీర్‌ఖానుఁడు మరల ౧౫౩౭ లో హుమాయూనుతో యుద్ధము చేయసాఁగెను. హుమాయూన్ అతనిమీఁదికి సైన్యములతో రాఁగా నాతఁడు వెనుకకు జరుగుచు రెండుసంవత్సరములు గడపెను. తుదకు ౧౫౩౯ లో బక్సరునొద్ద షీర్‌ఖానునికిని, హుమాయూనుకును యుద్ధము జరిగి యందు హుమాయూన్ పరాభూతుఁడై గంగానదిలో నీఁదుచు నావలియొడ్డునకుఁ బోయెను. మరల వారిద్దఱికిని కనోజ్ పట్టణమునొద్ద ఘోరమైనయుద్ధము జరిగినందున హుమాయూన్ పూర్తిగా నోడిపోయి లాహోర్‌పట్టణమునకుఁ బాఱిపోయెను. అచ్చటనున్న యాతనితమ్ముఁడగు కామరాన్ అతనికిఁ జోటిచ్చినవాఁడు కాఁడు. అందుచే నాతఁడు సింధుదేశమునకుఁ బయలుదేఱెను. త్రోవలో హిందాల్ అను తమ్మునియొద్దఁ గొన్నిదినములుండెను. అచ్చట హిందాలుని గురునగు షేఖ్ అలీఅక్‌బర్‌జామీ యనువానికి హమీదా యను రూపవతియగు కన్నియకలదు. హుమాయూన్ ౧౫౪౧ లో నామెను వివాహమాడెను. అచ్చట హిందాలుఁ డాతనికి నేమియు సాయము చేయనందున హుమాయూన్ అచ్చటినుండి బయలుదేఱి, త్రోవలో మిక్కిలి బాధపడుచు ఉమర్‌కోట యనుచోటికిఁ బోయెను. అచ్చటి రాణాప్రసాద్ అను హిందూరాజాతనికి నభయమిచ్చి యాతనిని నచ్చట నుంచుకొనియెను. అచ్చట ౧౫౪౨-లోఁ బదునాల్గవ యక్టోబర్‌దినమున హమీదారాణి ప్రసూతయై భాగ్యశాలియగు కొమారునిఁగనెను. అతఁడు విఖ్యాతిఁజెందిన అక్‌బర్‌బాదుషాహ. పుత్రజన్మమునకు సంతసించి హుమాయూన్ పంచిపెట్టుటకుఁ దనయొద్ద నేమియు ధనము లేనందున వెంటదెచ్చిన కస్తూరినిఁ బంచిపెట్టి 'యీకస్తూరివాసనవలెనే నాపుత్రునికీర్తియన్నిదిశలను వ్యాపించునుగాత' మని చెప్పెను.

ఉమర్‌కోటరాజు సహాయముఁగొని హుమాయూన్ రాజ్యము సాధింప యత్నించెను. కాని విఫలమనోరథుఁడై హిందూదేశమువిడిచి కందహారుకుఁ బోయెను. అచ్చట నాతనితమ్ముఁడగు మీర్‌జాఅస్‌గరీ యనువాఁడు హుమా-

యానుకు సాహాయ్యము చేయక యాతని నెదురించెను. అంతటఁ దనకొమారుని నచ్చట నేవదలి హుమాయూన్ పారసీకదేశమునకు నచ్చటి షాహాయగు తహామస్ప్ అనువానిని సహాయముచేయుమని యడుగుటకుఁ బోయెను. ఇట కామరాన్ అనువాఁడు అగ్బర్‌ను తీసికొనిపోయి కాబూల్ పట్టణములో నుంచెను.

హుమాయూన్ పారసీకరాజు సాహాయ్యమునువడసి సైన్యములను వెంటఁ దీసికొనివచ్చి కందహార్ పట్టణమును నాక్రమించుకొని మీర్జా ఆస్కరీ యను తనతమ్ముని చెఱపెట్టెను. అచ్చటనుండి కాబూల్ పట్టణమునకుఁ బోయి కామరాన్ అను తమ్మునిఁ బట్టుకొని కనులుతీయించెను (౧౫౪౫). కాబూల్ దేశములో నైదుసంవత్సరములుండి యచ్చటిరాజ్యమును స్థిరపఱుచుకొని ౧౫౫౫ లో హిందూదేశముమీఁదికి దండెత్తివచ్చి సూర్‌వంశజుఁడగు మహమ్మద్‌షాహ అనువాని నోడించి హిందూదేశసామ్రాజ్యమును మరల సంపాదించెను.

## సూర్ వంశము.

హుమాయూన్ ఢిల్లీరాజ్యమును గోలుపోయి యజ్ఞాతవాసములోనున్న పదియైదు (౧౫౪౦-౧౫౫౫) సంవత్సరములకాలములో ఢిల్లీపట్టణమును సూర్‌వంశజులగు మహమ్మదీయు లేలిరి. అందు మొదటివాఁడు షీర్‌షాహ యనఁబడు షీర్‌ఖానుఁడు. ఈతఁడు హుమాయూనును ౧౫౪౦ లో నోడించి ౧౫౪౫ వఱకు రాజ్యముచేసెను. ఈతఁడు శూరుఁడు, వివేకి, దూరదృష్టిగలవాఁడు. ఇతఁ డైదుసంవత్సరములు మాత్రము రాజ్యముచేసినను, ఆకాలమందును శత్రువులతో నెడతెగక పోరాడవలసినవాఁ డైనను, ప్రజలకు హితప్రదములగు కార్యములనేకములు చేసెను. బంగాళా దేశమునుండి సింధుదేశమువఱకు రెండువేల మైళ్ల యంతరముగలదు. ఇట్టి రెండువేలమైళ్ల త్రోవలో రెండుమైళ్ల కొక్క–

బావి త్రవ్వించి సత్రముఁ గట్టించెను; త్రోవకు రెండువైపుల వృక్షములను వేయించెను; గుఱ్ఱములయంచెలు పెట్టించెను; అనేకములగు నన్నసత్రములను వేయించి బాటసారుల బాధలఁ దొలఁగించెను. హిందూదేశములో రూపాయి యనువెండి నాణెమును ఉపయోగపఱిచినవాఁ డీతఁడే. ఈతఁ డల్పాయువున్న గలవాఁడు కానియెడల నింకను గొప్పకార్యములను జేసియుండును. ౧౫౪౫లో నీతఁడు కలింజర్ దుర్గమును ముట్టడివేసినపు డకస్మాత్తుగాఁ గాలి చచ్చెను.

షేర్‌షాహ కొమారుఁడగు సలీంషాహ తొమ్మిది సంవత్సరములవఱకు (౧౫౪౫-౧౫౫౩) రాజ్యముచేసెను. తండ్రివలె నాతఁడు యుద్ధకుశలుఁడు గాకపోయినను ప్రజాహితాచరణ దక్షుఁడనుటకు సందేహములేదు. అతని తరువాత నతనికొమారునిఁ జంపి యతనిబావమఱఁదియగు మహమ్మద్ షాహ సూర్ అనువాఁడు రాజ్యారూఢుఁ డయ్యెను. హిమూ యను హిందూవర్తకుఁడొకఁ డతని మంత్రిగానుండెను. ఈ హిమూ శౌర్యము, సాహసము, స్వామిభక్తియను సద్గుణములచే శోభితుఁడై యుండెను. మహమ్మద్ షాహ దుర్వ్యసనాసక్తుఁడై యున్నను హిమూసాయముచేఁ గొంతవఱకు సూర్‌వంశజులైన యితర రాజులతోఁ బోరాడుచుండెను. మహమ్మద్ షాహ బావమఱఁదియగు ఇబ్రాహీం ఖానుఁడు ఢిల్లీపట్టణమును నాక్రమించుకొనినందున మహమ్మద్ షాహ చునార్ గడమునకుఁ బోయెను. అహమ్మద్ ఖాన్ సూర్ అనువాఁడు ఇబ్రాహీంఖానుని నోడించి సికందర్ షాహ అను బిరుదునామమును వహించి ఢిల్లీపట్టణము నేల సాగెను.

## రెండవ పానిపట్ యుద్ధము.

(౧౮-వ జూన్ ౧౫౫౫).

పైని వర్ణించినట్లు సూర్‌వంశపురాజు లొకరితో నొకరు పోరాడుచుండ

నదియే మంచిసమయముగదాయని హుమాయూన్ పదునైదువేల యశ్వసైనికులను వెంటఁదీసికొని కాబూల్ పట్టణమునుండి బయలుదేఱెను. ఆతనికుమారుఁడగు అక్బర్ గజ్నీనుండియు వజీరుఁడగు బహీరాంఖానుఁడు కందహార్ నుండియు సైన్యములతోవచ్చి హుమాయూనును పెషావర్ యొద్దఁ గలిసికొనిరి. వీరిని నెదిరించుటకు సికందర్ సాహా తార్తార్ ఖానునిఁ బంపెను. వానిని నక్బర్ బహరాంఖానులు గలిసి యోడించి ఢిల్లీపట్టణమును సమీపించిరి. తుదకు సికందర్ సాహా స్వయముగా నెనుబదివేలసైన్యముల వెంటఁదీసికొని యుద్ధమునకు వెడలెను. ఉభయసైన్యములకును పానిపత్ గ్రామసమీపమున ఘోరమైనపోరు జరిగెను. అందు హుమాయూన్, అక్బరు, బహీరాంఖాన్ ఈముగ్గురును స్వయముగా యుద్ధముచేసి తమతమ యుద్ధకౌశలమును జూపిరి. అందులోఁ బదుమూఁడు సంవత్సరముల వయస్సుగల అక్బర్ చూపినశౌర్యమును చరిత్రకారులు విశేషముగా వర్ణించియున్నారు. ఆయుద్ధమునందు సూర్ సాహా పూర్తిగ నోడి పాఱిపోయెను. హిందూరాజ్యమంతటికిని హుమాయూన్ మరలఁ బ్రభువయ్యెను. ఈయుద్ధము క్రీ. శ. ౧౫౫౫-వ సంవత్సరములో ౧౮-వ జూన్ తేదిని జరిగెను. దీనికి రెండవ పానిపత్ యుద్ధమని పేరు. మొదటి పానిపత్ యుద్ధములో జయించి, బాబర్ విజయుఁడై ఢిల్లీశ్వరుఁ డయ్యెననియుఁ జదువరు లెఱిఁగియున్నారు. ఈ రెండవపానిపత్ యుద్ధములో గెలిచి హుమాయూన్ జూలై నెలలో ఢిల్లీశ్వరుఁడయ్యెను. అంతటితో ఆఫ్గానులప్రభుత్వము పూర్తిగఁబోయి మొగల్ వంశజులు హిందూదేశమునకుఁ బూర్తిగ నధిపతులైరి. కాని రాజ్యసౌఖ్యము ననుభవించుటకు నాఁతడు మిక్కిలికాలము బ్రతికినవాఁడు కాఁడు. సంకటములను ననుభవించినందున బలహీనుఁడై రాజ్యమువచ్చిన యాఱునెలలలోఁ బరలోకగతుఁడయ్యెను. (౨౫ జనవరి ౧౫౫౬) మరణ సమయమునం దాతనికి వయస్సు ౫౧ సంవత్సరములు.

## హుమాయూన్ యొక్క గుణదోషములు.

'హుమాయూన్ బాదుషాహ మిక్కిలి సజ్జనుఁడు. పవిత్రాచరణమును సదయాంతఃకరణమును, బంధుపరివారవాత్సల్యమును గలవాఁడు. కాని 'అతి సర్వత్ర వర్జయేత్' అను నుపదేశము నెఱుంగనివాఁడగుటచే నాతనిసద్గుణములే యాతనికిఁ బ్రతిబంధకములయ్యెను. సద్గుణాతిరేక మెప్పుడును దుర్గుణమగునన్న



రీ, దిల్లి

నియమము ననుసరించి యీతనియందుఁ గలగుణములన్నియు దోషములై యితనికి నందువలన బాధకలిగెను' అని యొకచరిత్రకారుఁడు వ్రాసి యున్నాఁడు. తనతమ్ములమీఁద నత్యంతదయచూపి వారికి స్వతంత్రాధికార మిచ్చినందున గృహకలహములు పెరిఁగి యీతఁడు రాజ్యముఁ బోఁగొట్టుకొనెను. సజ్జనునికిఁ గావలసిన సర్వసద్గుణము లీతనియందున్నను రాజునకుఁగావల

సిన మనోనిశ్చయ మీతనికిలేదు. అందువలననే యనేకసంకటముల ననుభవించెను. ‘ఆతఁడు తీవ్రబుద్ధిగలవాఁడు. దృఢనిశ్చయములేమి, విచారశూన్యతలను దుర్గుణములును, ఔదార్యము, దయ, సౌజన్యము లనుసద్గుణములును అతనియందు వాసముచేయుచుండెను. కాని క్రమక్రమముగా నౌదార్య మనునది దుర్వ్యయముగను, సౌజన్యమనునది దుర్బలత్వముగను మాఱి యాతనియొద్ద ముఖస్తుతిచేయువా రనేకులు చేరిరి. ఆతనికి విద్యాభిరుచి యున్నందున విద్వాంసుల కతఁ డాశ్రయమిచ్చెను. అతఁడును నతనితమ్ముఁడగు హిందాలుఁడును కవిత చెప్పుచుండిరి. గణితజ్యోతిషశాస్త్రములను నాతఁ డభ్యసించెను’ అని యీతనిగుఱించి యొక గ్రంథకారుఁడు వ్రాసియున్నాఁడు. తన తండ్రియైన బాబర్ యొక్క యాత్మచరిత్ర నీతఁడు మరల వ్రాసి యచ్చటచ్చట నూతనాంశములను జేర్చెను. మొత్తముమీఁద శౌర్యాదిగుణములచే నీతఁడు బాబరునకుఁ దగినకొమారుఁడనియు, నౌదార్యవిద్యా ప్రియత్వములచే నక్బరునకుఁ దగినతండ్రి యనియుఁ జెప్పవచ్చును.

## అక్బర్.

(౧౫౫౬-౧౬౦౫).

### పూర్వచరిత్ర-రాజ్యారోహణము.

హిందూదేశములోఁ బ్రభుత్వముచేసిన మొగల్ చక్రవర్తులలో నన్నివిధములను అక్బర్ బాదుసాహ శ్రేష్ఠుఁడు. ఇంతియకాదు. లోకములో సర్వశ్రేష్ఠులని విఖ్యాతిఁ జెందిన రాజపుంగవులలో నీతఁ డొక్కఁడని తప్పక చెప్పవలసియున్నది.

హుమాయూన్ ఉమర్ కోటలో నజ్ఞాతవాసమం దుండఁగా ౧౫౪౨-లో నక్బర్ పుట్టెనని చదువరులిదివఱకే యెఱిఁగియున్నారు. ఒకసంవత్సరము వాఁడైనప్పు డీతఁడుపినతండ్రియగు కామరాన్ చేతఁ జిక్కెను. హుమాయూను

నకును, కామరానునకును యుద్ధము జరిగినకాలమందు గుండుతగిలి యీతఁడీల్గవలయుననిన యుద్దేశముతో కామరాన్ ఇతనినిఁ గోటగోడమీఁదఁ గూర్చుండఁ బెట్టెను. కాని యదృష్టవశమున నీతనికొక దెబ్బయైనను తగిలినది కాదు. పినతండ్రిచే నీతఁడు పెక్కుసారులు కఠినకారాగృహమునం దుంపఁబడెను. ఈతనిఁ జంపుటకు నీతనిశత్రువు లెన్నియో యుపాయములఁ బన్నిరి. కాని వాని నన్నిఁటినిఁ దప్పించుకొని యక్బర్ తండ్రినిఁ గలిసికొనెను.



అక్బర్

సంకటములలోఁ బెరిఁగినందున అక్బర్ చిన్నవాఁడు విద్యాభ్యాసము చేయలేదు. కాని కష్టములలోఁ బుట్టిపెరిఁగినందునఁ గలిగిన యనుభవమే యాతఁడు గొప్ప విద్యగా గ్రహించెను. ఆయనుభవవిద్యయే యాతనికి రాజ్యముచేయు నప్పుడు మిక్కిలి యుపయోగకారి యయ్యెను. హుమాయూన్ వద్ద బహరాంఖానుఁడను స్వామిభక్తిగల సరదారుఁ డొకఁడుండెను. ఎన్నికష్టములు వచ్చినను అతఁడు హుమాయూనును విడిచినవాఁడుకాఁడు. ఆబహరాంఖానుఁ డక్బరునకు గురువుగను, పాలనకర్తగను నుండెను. హుమాయూన్ మరణమొందినప్పు డక్బరాతనియొద్ద లేఁడు. బహరాంఖానునివెంటఁ బంజాబుమీఁదికి దండెత్తి పోయియుండెను. హుమాయూన్ మరణించిన సమాచారము తెలిసినతోడనే బహరాంఖానుఁ డక్బరునకుఁ బట్టాభిషేకముఁ జేసెను. అప్పు

డక్బరు పదుమూఁడేండ్ల మూడునెలలవాఁడు. అందుచే నాతని మంత్రిగా బహరాంఖానుఁడే రాజ్యము చేయఁదొడఁగె. అక్బరు రాజ్యమునకు వచ్చి నప్పుడు ఢిల్లీ, ఆగ్రా యను రెండుప్రాంతములుమాత్రము ఢిల్లీశ్వరునకు లోఁబడి యుండెను. మిగిలిన ప్రాంతములలోని యధికారు లందఱును స్వతంత్రులై యుండిరి. అట్టి చిన్నరాజ్యముగల అక్బర్ ఏఁబదిసంవత్సరములలో ఆఫ్ఘానిస్థాన్ నద్దనుండి ఆసాంవఱకును, దక్షిణమందు అహమ్మద్ నగరమువఱకును వ్యాపించిన గొప్పరాజ్యమును సంపాదించి యేకచ్ఛత్రముగఁ బరిపాలించెను.

## సూర్ వంశపు శత్రువుల నోడించుట

పానిపత్ యుద్ధములోఁ బూర్తిగఁ బరాజితులైనను సూర్ వంశపు రాజులకు రాజ్యకాంక్ష పూర్తిగ పోయినదికాదు. పాఱిపోయిన సూర్ సాహు పఠానుల సైన్యములను జేర్చుకొని పంజాబులో నుండెను. ఢిల్లీపట్టణములోఁ గొన్ని దినములు ప్రభుత్వముచేసి యచ్చటినుండి పాఱిపోయిన మహమ్మద్ సాహ సూర్ ఆదిలీయనువాఁడును, వాని హిందూమంత్రియైన హేమూ యనువాఁడును మూర్పు ప్రాంతములో సైన్యములతో యుద్ధమునకు సిద్ధముగా నుండిరి. హుమాయూన్ కాలములోఁ గ్రొత్త మొగల్ సర్దారులకు జాగీరు లిచ్చినందున ప్రాఁత ఆఫ్ఘాన్ సర్దారులకుఁ గోపమువచ్చి వారు తిరుగఁబడుటకు సిద్ధముగా నుండిరి. మొగల్ సైన్యములు ముప్పదివేలును, ఆఫ్ఘాన్ సైన్యము లక్షవఱకును నుండెను. కష్టభూయిష్ఠమైన యీరాజ్యభారమంతయుఁ బదునాలుగేండ్ల పిల్లవాని మీఁదఁ బడెను!

బహరాంఖానునికి అక్బర్ 'ఖానఖానాన్', అనఁగా రాజాధిరాజు అను బిరుదునొసఁగి యాతనికి సర్వాధికార మిచ్చినను, తా నన్నిసంగతు లను స్వయముగాఁ జూచుచు, బహరాంఖానుని వెంటనుండి రాజ్యపరిపాలన విధమును నేర్చుకొనుచుండెను.

అక్బర్ ఖానఖాను లిద్దఱును సైన్యములతోఁ బంజాబునకు దండువెడలి అంబాలా పట్టణమునొద్ద సికందర్ షాహను నోడించిరి. వా రుత్తరమునకుఁ బోవుటచూచి మహమ్మద్ షాహ తనమంత్రియగు హిమూసాయముఁ దీసికొని పూర్వహిందూదేశమందలి పట్టణముల నాక్రమించుకొనుచు ఆగ్రాపట్టణము మీఁదుగా దిల్లీపట్టణమునకుఁబోయి దానిని స్వాధీనముచేసికొనియె. మంత్రి పుంగవుఁడగుహిమూ విక్రమాజితుఁడను నామమునుధరించి దిల్లీరాజ్యము చేయఁ దొడఁగెను. ఈసమాచారము తెలిసి యక్బర్ దిల్లీమీఁదికి వచ్చెను. హిమూ తనసైన్యములతో నక్బరును నెదిరించెను. ౧౫౫౬లో ౫-వ నవంబర్ దినమున నుభయసైన్యములకును యుద్ధము జరిగి యందు హిమూ చెఱపట్టఁబడియె. ఈ హిందువును కత్తితో నఱకవలసినదని బహరాంఖానుఁ డక్బరునకు చెప్పెను. కాని యాబాలకుఁ డట్టి క్రూరకర్మము చేయుటకు సంశయింపఁగా బహరాంఖానుఁడే హిమూతలఁ ద్రుంచెను. హిమూ మిక్కిలి పరాక్రమ వంతుఁడును, స్వామిభక్తిపరాయణుఁడును అగు హిందూసేనానాయకుఁడు. స్వపరాక్రమముచేతనే దిల్లీశ్వరుని ముఖ్యమంత్రిత్వము నడపెను. ఈతనిప్రభావముచేతనే సూర్వంశజు లింతకాలమువఱకు మొగలులతోఁ బోరాడఁగలిగిరి.

ఇట్లు సూర్వంశజులఁ బరాభవించి యక్బర్ నిర్భయుఁడై దిల్లీపట్టణముఁ బ్రవేశించి తనతండ్రిసింహాసనము నెక్కెను. సికందర్ షాహ శరణు చొచ్చినందున నాతనిక్షమించి యాతనిపుత్రునికిఁ దనయొద్ద గొప్పయుద్యోగ మొసఁగెను.

## తన సరదారుల తిరుగుబాటుల నణఁచుట.

## (౧౫౫౯ - ౧౫౬౬).

**(అ) బహరాంఖాన్:**—అక్బర్ పదునెనిమిదివత్సరములవాఁ డగు వఱకు రాజ్యసంబంధమైన యధికారమంతయు బహరాంఖానుని చేతులలోనే యుండెను. కాని పెద్దవాఁ డైనకొలఁదిని అక్బరునకుఁ గొంతకొంత యధి

కారమిచ్చుటకు మాఱుగా బహరాంఖానుని నిరంకుశత్వమే హెచ్చుఁదొడఁగెను. అందుచే నక్బర్ రాజ్యాధికారమంతయుఁ దనచేతికిఁ దీసికొని బహరాంఖానునిఁ దొలఁగించెను. అందుపై ఖానుఁడు కోపించి తిరుగఁబడి యుద్ధముచేసెను. అక్బర్ సైన్యములు వానిని నోడించినందున వాఁడు బాదుషాను శరణుచొచ్చెను. అందుపై వానిని క్షమించి యక్బరు వానికిఁ దన సభలో నొకయధికార మిచ్చియుంచెను. కాని వాఁ డచ్చట నుండనొల్లక మక్కాకుఁ బోవుటకు వెడలఁగా సూరత్ పట్టణములో నాతఁ డొకతురుష్కునిచేఁ జంపఁబడియె (౧౫౬౧). అతని కొమారుఁడగు మీర్జాఖానుఁడనువానికి నక్బర్ గొప్పయుద్యోగ మొసంగెను. అతని తెలివిచూచి కొన్నిదినములకు నాతనికి ఖానఖానాన్ అను బిరుదునుగూడ నిచ్చెను.

(ఆ) ఆదంఖాన్:—ఈతఁ డక్బరునొద్దనుండిన యొకసరదారుఁడు. మాళ్వాప్రాంతమునకు నధికారిగా నున్న బాజ్ బహాదుర్ అనువాఁడు తిరుగఁబడినందున వానిని సాధించుటకు ఆదంఖానుఁ డంపఁబడియె. వానిని సాధించి యాదంఖానుఁడు వాని సొత్తంతయుఁ దీసికొని తన యింటిబొక్కసములోఁ జేర్చుకొనెను. అంతటితో నూరకుండక యాదుష్టుఁడు బాజ్ బహాదుర్ యొక్క భార్య నభిలషింపఁగా నాసాధ్వి యాత్మహత్య చేసికొనియె. ఈ సమాచారము లన్నియుఁ దెలిసి యక్బర్ మిగులఁ గోపించి యాదంఖానుని అధికారభ్రష్టునిఁజేసి వాని ధనమంతయుఁ దీసికొనియెను. అప్పటికిని వాఁడు తనదుర్గుణముల వదలనందున నక్బరుచేఁ జంపింపఁబడియె (౧౫౬౧).

(ఇ) ఖాన్‌జమాన్:—షేరీఖానుఁ డనుశత్రుఁడు బంగాళా దేశములోను, అయోధ్యా ప్రాంతములోను ప్రజాక్షోభము చేయుచున్నందున వానిమీఁదికి నక్బర్ తనసరదారుఁ డగు ఖాన్ జమాన్ అనువాని నంపెను. జోధపురమువఱకు వచ్చిన శత్రువును పరాభవించి వాఁడు స్వతంత్రుఁ డగుటకు యత్నించెను. వానితో మఱికొందఱు స్వామిద్రోహు లగుసరదారులు

కలిసి అయోధ్యాప్రాంతమందు యుద్ధభేరివేసిరి. అందుపై నక్బర్ స్వయముగా వర్షాకాలమునందు నయోధ్యాప్రాంతమునకుఁబోయి రాత్రిసమయమునందు గంగానదిని దాఁటి శత్రువులపై నకస్మాత్తుగాఁ బడి వారిని నోడించెను. ఖాన్ జమాన్ ఆయుద్ధమందుఁ జంపఁబడియె (౧౫౬౬).

(ఈ) **మహమ్మద్ హకీం మిర్జా:**—ఇతఁడు అక్బర్ యొక్క సవతితమ్ముఁడు ; కాబూల్‌లో రాజ్యముచేయుచుండెను. కాని యచ్చట నుండి సులేమాన్ అనువానిచే వెడలఁగొట్టఁబడినందున పంజాబ్ ప్రాంతమును స్వాధీనముచేసికొన యత్నించెను. అందుపై ౧౫౬౬-వ సంవత్సరమునందు నవంబర్ నెలలో నక్బర్ పంజాబీదేశమునకుఁ బోయి హకీమును వెడలఁగొట్టెను.

పైని వర్ణింపఁబడినవారు గాక మఱి యనేకులు సరదారులు తిరుగఁబడిరి. అందు ఉజీబక్ సరదారులు ముఖ్యులు. వారి నందఱిని నక్బర్ ౧౫౬౦ మొదలు ౧౫౬౪ వఱకుఁ దనబుద్ధిప్రభావమువలన నణఁగఁద్రొక్కెను. ఏ పనినైనను నతిశీఘ్రముగాఁ జేయు చుఱుకుదనమును, శత్రువుల క్షమించు నౌదార్యమును అక్బరునందు విశేషముగా నీకాలములోఁ గాన్పించెను.

## అక్బరుచే జయింపఁబడిన రాజ్యములు.

(౧౫౬౧ - ౧౬౦౦).

### (అ) రాజపుత్రరాజ్యములు.

(౧౫౬౧ - ౧౫౪౦).

అక్బర్ కాలమువఱకు రాజపుత్రులు తురుష్కులకు లోఁబడినవారు కారు. మిక్కిలి బలవంతులును, హిందూదేశములోని కొంతభాగమునకు నధిపతులును అగు రాజపుత్రులు వశులైనఁగాని యేసామ్రాజ్యమును హిందూదేశమందు సుస్థిరము కానేరదని తెలిసికొని రాజపుత్రులను సఖ్యసంబంధములచేతను మఱి యన్యోపాయములచేతను స్వాధీనము చేసికొనవలయు నని

యక్బర్ నిశ్చయించెను. రాజపుత్రుల రాజ్యములను తీసికొనినందున లాభము లేదని తలఁచి వారితో సంబంధబాంధవ్యములు చేయఁదొడఁగెను.

ఇట్లు యుద్ధముచేతఁ గొందఱిని, బాంధవ్యముచేతఁ గొందఱిని వశ పఱచుకొనెను. అందు ముఖ్యమైనవాని నీక్రింద వివరించెదను.

(౧) జయపూర్:—౧౫౬౧ లో నక్బర్ రాజపుత్రస్థానమునకుఁ బోయెను. అప్పుడు జయపురాధీశ్వరుఁడగు బిహారీమల్లుఁడు అక్బరునకుఁ దన కూఁతునిచ్చి వివాహము చేసెను. ఇతఁడు మహమ్మదీయులతో సంబంధము చేసిన మొదటి రాజపుత్రుఁడు. అప్పటినుండి జయపూర్ రాజులు అక్బర్ సైన్యములో గొప్పగొప్ప యధికారములు వడసి యనేక యుద్ధములలో శౌర్యముఁజూపి యక్బరునకు ననేక రాజ్యములఁ గెలిచియిచ్చిరి. బిహారీమల్లుని కొమారుఁడు భగవాన్ దాసుఁడు. ఆతనికొమారుఁడు మానసింహుఁడు.

(౨) జోధపూర్:—అక్బర్ కాలమందు మాల్ దేవుఁడనురాజు జోధ పురములో రాజ్యము చేయుచుండెను. ఇతఁడక్బర్ తండ్రియగు హుమాయూనును సంకటసమయమున చెఱపట్టవలయునని యత్నించియుండెను. అందుచే నక్బ రాతనికోటయగు మేఢ తాను సాధించెను. అప్పుడు మాల్ దేవుఁడు అక్బరునకు శరణుచొచ్చెను. ఆతనికిఁ దనసైన్యములో గొప్పయధికారమిచ్చి తనసభలోఁ దనకుఁ గుడివైపునఁ గూర్చుండునట్లేర్పాటు చేసెను.

(3) మేవాడ్:—చితోడ్ గడముమీఁద రాజ్యము చేయుచున్న మేవాడ్ రాజు రాజపుత్రులలో శ్రేష్ఠుఁడు. ఆతనిని జయించినఁగాని నిజమైనసార్వభౌమ త్వము తనకు రాఁజాలదని తలఁచి యక్బర్ చితోడ్ గడముమీఁదికి దండెత్తిపో యెను. అక్బర్ చితోడ్ గడముమీఁదికి రెండుసారులు దండెత్తెననియు, అందు మొదటితడవ నచ్చటిరాణియగు ఉదయసింహునిభార్యయైన వీరాబాయిచే నోడింపఁబడి వెడలిపోయెననియు, మరల రెండవసారివచ్చి చితోడ్ గడమును గెలిచెననియు హిందూచరిత్రకారులు వ్రాసియున్నారు. కాని యక్బర్ ౧౫౬౭

లో నొక్క సారిమాత్రము చితోడ్ గడము మీఁదికిఁ బోయినట్టును, అప్పుడే దానిని సాధించినట్టును మహమ్మదీయచరిత్రకారులు వ్రాసియున్నారు. ఈయుద్ధములను గుఱించి యైదవప్రకరణములోని ఉదయపురచరిత్రలో వివరముగా వ్రాయఁబడియున్నందున నిచ్చట విస్తరింపలేదు.

చితోడ్ గడము అక్బరునకు స్వాధీనమైనను రాజపుత్రులుమాత్రము స్వాధీనులుకారైరి. ఉదయసింహుఁడు చితోడ్ నుండి వెడలి ఉదయపురమను మఱియొక రాజధానిని స్థాపించెను. ఉదయసింహుని కొమారుఁడైన ప్రతాపసింహునకును, అక్బరునకును జరిగిన యుద్ధప్రసంగముయొక్క వర్ణన యైదవ ప్రకరణములోఁ జూడనగు.

(౪) **గడామండలమును జయించుట:**—(౧౫౬౪) అక్బరుచే జయింపఁబడిన రాజ్యములలో నిదియొకటి. కాని దీనినిగుఱించి మహమ్మదీయ చరిత్రకారులును ఇంగ్లీషుగ్రంథకారులును వ్రాసినవారుకారు. అయినను గడా మండల మనురాజ్యమును అప్పుడు దుర్గావతియను శూరవనిత పాలించుచున్నట్టును, ఆమె యక్బరుసేనానితో మిగులశౌర్యముతోఁ బోరాడినట్లును, ఆయుద్ధమునందు నామె గతప్రాణయైనందున నారాజ్యమును అక్బరు స్వాధీనముచేసికొన్నట్టును జబ్బలపురమునొద్ద శిలాశాసన మొకటి యున్నందున నీసమాచారము నిజమనియే చెప్పవలసియున్నది. ఈరాణిదుర్గావతినిగుఱించి సౌ- భండారు - అచ్చమాంబగారు బహుశోధనచేసి అబలాసచ్చరిత్రరత్నమాలలో వ్రాసినయంశము లిచ్చట నుదాహరించుచున్నాము.

## రాణిదుర్గావతి.

“పదునాఱవశతాబ్దమున బుందేల్ ఖండు సంస్థానములోఁ బ్రసిద్ధికెక్కిన రాజులలోఁ బ్రథముఁడగు చందేల్ రాజునకు రూపగుణ సంపన్నురాలగు నొకకన్య గలిగెను. ఆమెపేరు దుర్గావతి. ఆమె రూపగుణములకీర్తి దిగంతముల నిండి, యనేకరాజపుత్రులామెకొఱకు చందేల్ రాజును ఆశ్రయించుచుండిరి.

కాని యీరాజపుత్రులు తనకూఁతునకుఁ దగినవారుకారని యెంచి, చందేల్ రాజు వారికేదో యొకకారణముచెప్పి పంపుచుండెను. ఒకసారి గడామండల సంస్థానాధిపతియగు గోండురాజు దుర్గావతినిఁ దన కిమ్మని యామెతండ్రిని వేఁడెను. ఈగోండురాజుయొక్క శౌర్యసాహసములనుగుఱించి చారులచే వినినది గావున దుర్గావతియు నాయనయందు బద్ధానురాగయై యుండెను. గోండులు జాతియందును, విద్యయందును, నాగరికతయందును రాజపుత్రులకంటెఁ దక్కువ వారు. గోండువా రార్యులుగారు; అనార్యులు. గనుక నిట్టినీచకులజునికిఁ దమ శ్రేష్ఠవంశపుఁగన్య నిచ్చుటకు చందేల్ రాజునకు నిష్టములేకపోయెను. కాని యప్పుడు గోండురాజు మిక్కిలి బలవంతుఁడుగానుండెను. ఈరాజుపాలించెడి గడామండలరాజ్య మంతగా గొప్పదికాకపోయినను,నితఁడు మిక్కిలిబలవంతుఁ డైనందున నితనికి ననేకరాజులు సాయముగా నుండిరి. ఇట్టిరాజుతోఁ బోరి గెలుచుట దుర్లభమనియు, దుర్గావతి మనస్సాతనియందుఁ జిక్కినదనియు నెఱిఁగి, చందేల్ రాజు గడామండలేశ్వరునకుఁ దనకన్యకనిచ్చి మహావైభవ ముతో వివాహముచేసెను.

"వివాహము జరిగినతరువాత నత్తవారింటికివచ్చినప్పుడు దుర్గావతి తండ్రి రాజ్యమునందున్న బీదసాదలకనేకులకు శాశ్వతజీవనము లేర్పఱచెను. అందువలన వారందఱామెను దమపాలిటిదైవ మని భావించి యామె కనేకములైన దీవన లొసంగిరి. ఆమె గడామండలమునకు వచ్చినతరువాత నామెభర్త, రాజ్యవిచా రణ మేమియుచేయక, యామెయందే యధికానురాగము కలవాఁడై సదా నర్మదానదీతీరమునను, అచ్చటనున్న యుద్యానవనములయందును విహరించుచు కాలము వ్యర్థపుచ్చుచుండెను. అనేకపర్యాయములు దుర్గావతి రాజ్యమునుబాగు గా నేలుఁడని రాజునకు సూచించెను; కాని విషయాసక్తుఁడయిన రాజామాట లను లక్ష్యపెట్టినవాఁడుకాఁడు. అంతఁ గొంతకాలమునకు దుర్గావతీరాణి గర్భ వతియయి యొకపుత్రునిఁ గనెను.ఆపుత్రునికిఁ బదిసంవత్సరముల ప్రాయము వచ్చి

నప్పుడు రాజుగా రేదోరోగముచేత మృతినొందిరి. అప్పుడు రాజ్యపాలన మంతయు దుర్గావతిమీఁదఁ బడినందున నామె తనకుమారుని సింహాసనాధీశుఁ జేసి, యతనిపేరిట రాణిగారు తామే రాజ్యము చేయఁజొచ్చిరి. ఆమె తనపెని మిటివలెఁగాక, మిగులదక్షతతో, న్యాయముతో, రాజ్యపరిపాలనముఁ జేయుచుఁ బ్రజలను సంతోషపెట్టుచుండెను.

“ఇట్లు తనప్రజలను సుఖపెట్టుచు, పరరాజులతో వైరములేక యైదాఱు సంవత్సరములు రాణిగారు రాజ్యముచేసినతరువాత మొగలాయి రాజైన యక్బరుబాదుషా ఆమెకీర్తివిని, యిట్టిరాజ్యము పరిపాలించెడి రాణి మనకు నంకితురాలుగా నుండవలయునని నిశ్చయించెను; ఇట్లుతలఁచి యక్బరు అసఫ్ ఖాన్ అనుప్రసిద్ధవీరుని ౧౫౬౪-వ సంవత్సరమున దుర్గావతిరాజ్యముపైకిఁ బంపెను. అక్బరు సకలసద్గుణ సంపన్నుఁడని చరిత్రకారులు చెప్పెదరు. అతని యందు ననేకదుర్గుణము లుండినను, ఇతర యవనప్రభువులతోఁ బోల్చి చూచిన యెడల నతఁడు దేవసమానుఁడే యని చెప్పుటకు సందేహములేదు. కాని యిట్టి మహాత్మునిఁగూడ రాజ్యకాంక్ష వదలినదికాదు. రాణిదుర్గావతి యక్బరునేమి, ఆయన రాజ్యములోని ప్రజలనేమి యెంతమాత్రము బాధపెట్టినదికాదు. వారి జోలికైన నెన్నఁడు పోయినదికాదు. ఇట్టులుండఁగా నాయబలమీఁదికి సైన్య మంపుట మహత్త్వాకాంక్షగాక యేమి? ఇట్లు అసఫ్ ఖానుశూరుఁడు (అవును. అబలతో యుద్ధమునకుఁ దలపెట్టినవాఁడు శూరుఁడే!) తనపై దండెత్తి వచ్చు చున్నాఁడన్న మాటవిని, దుర్గావతి భయపడక, మహాధైర్యముతో యుద్ధము నకు సిద్ధతచేయసాగెను. మహాప్రయత్నముచేసి కొద్దికాలములోనే ౫౦౦ కరు లను, ౫౦౦౦ తురంగములను, గొప్పకాల్బలములను సిద్ధముచేసెను. తాను పురుష వేషము ధరించి, ఆయుధములను బుచ్చుకొని, యేనుఁగుపైనెక్కి ప్రత్యక్షదుర్గ వలె యుద్ధభూమికి వెడలెను. ఆమెనుజూచి సైనికులకందఱికి నుత్సాహము గలిగి వారిశౌర్య మినుమడియై వారు శత్రుసైన్యముపై నడరి యతిధూర్తులగు

యవనసైనికుల ననేకుల రూపుమాపి, మఱునాఁ డాసేనాధిపతిని యమసదనమున కనుపనిశ్చయించిరి. కాని డిల్లీశ్వరునిచే మహావీరుఁడని ప్రఖ్యాతినిఁగాంచిన అసఫ్ ఖాన్ కొద్దిసైన్యముతో నీమెను జయించుట దుస్తరమని తెలిసికొని, మఱునాఁ డింకను సైన్యమునుగూర్చుకొని, తమయొద్దనున్న ఫిరంగీలన్నియు నగ్రభాగమునందుంచి, గోండుసైనికులపై నకస్మాత్తుగావచ్చి, తనసామర్థ్య మంతయును వారిపైఁ జూప వారు చీకాకుపడి, శత్రువులమార్కొన శక్తులు కాకయుండిరి. ఇట్టిదురవస్థఁ జూచి దుర్గావతికుమారుఁ డల్పవయస్కుఁడయ్యును, అభిమన్యుకల్పుఁడుగాన, తానుముందై 'వెఱవవల' దని సైనికులకు ధైర్యమిచ్చి, శత్రువులను మార్కొనెను. ఇట్లు కొంతసేపు మహాధైర్యముతోఁ బోరాడి యాబాలశూరుఁడు బాణఘాతముచే మూర్ఛిల్లెను. అప్పుడు సైనికులందఱుఁ జింతాక్రాంతులై యాదుఃఖవార్త నింకొకవైపున తురకలను మర్దించుచున్న దుర్గావతికిఁ దెలియఁజేసిరి. ఆమాటవిని, దుఃఖించుట కదిసమయముకాదని యెంచి, రాణిగా రిసుమంతైనను జలింపక, పుత్రవాత్సల్యము వాపి, తనసేనాధిపతికి నిట్లు వర్తమానముచేసెను. "ఈసమయము ధైర్యమునువదలి దుఃఖించుచుఁ గూర్చుండఁ దగినదికాదు. శత్రుహననము మన ముఖ్యకర్తవ్యము. ఈశ్వరేచ్ఛవలన నైనకార్యమునకు వగవఁబనిలేదు. కాన పిల్లవానిని శిబిరమునకుఁ గొనిపోయి తగినయుపచారములు చేయుఁడు. నేనిప్పుడు యుద్ధమును విడిచి వచ్చుటకు వీలులేదు. రణయజ్ఞము సమాప్తముచేసి, ప్రాప్తియున్న మరలఁ జూచెదను." ఈ యనుజ్ఞప్రకారము సైనికులు కార్యమును జరిపిరి.

"యుద్ధమునందుఁ గొంతసేపు వారికి జయమును, కొంతసేపు వీరికి జయమును గలుగుచు, తుద కెవరు గెలుతురో నిశ్చయించుటకు వీలులేకయుండెను. ఇట్లు కొంతసేపుభయపక్షముల సమానముగా యుద్ధముజరిగి, అదిహిందువుల స్వాతంత్ర్యనాశనకాలముగాన, తురుష్కులకే యాధిక్యమువచ్చెను. గోండుసైనికులు పోరాడి పోరాడి, యుత్సాహహీనులైరి. గోండులెల్లుత్సాహహీను

లైరో,అట్లట్లు మ్లేచ్ఛుల బలము హెచ్చుచుంబోయెను. తమరాజ్యమును గోండు దేశమునందు స్థాపింపవలయునన్న దృఢేచ్ఛగలవారుగనుక 'దీన్‌దీన్' అను రణ శబ్దముచ్చరించుచు ఘోరముగా గోండుసైన్యములను దెగటార్చిరి. ఇట్లు భయం కరమైన హననయజ్ఞము జరుగంగ, మూఁడువందల సైనికులతోడ దుర్గావతిరాణి మాత్రము బ్రతికి భయంకరముగాఁ బోరాడుచుండెను. ఆమెను మార్కొనుటకు అసఫ్‌ఖాన్ దుర్గావతియొద్దికి స్వయముగావచ్చెను. కాని యామె రౌద్రమును జూచి భయమంది, దూరముపోయి, అచటనుండి యామెపై బాణవర్షమును గురిపింపఁదొడఁగెను. ఆమె యాబాణముల నన్నిఁటినిఁ దునిమెను. కాని యందొకబాణము శిరస్సునందు గ్రుచ్చుకొనఁగా నామె మఱింత క్రోధా విష్టమానసయై, ఆబాణమును తానె పెఱికివైచి, మఱింత రౌద్రముతో యుద్ధము చేయసాగెను !! అప్పు డామెశరీరమంతయు రక్తమయమైన సంగతిచూచి, ఆమె డస్సినదని తెలిసికొని, స్వామిభక్తిగల యొక సేవకుఁ డామెను సమీపించి యిట్లనియె. "అమ్మా! మీరిఁక యుద్ధమును జేసినందు వలన లాభమేమియు లేదు. కొద్దికాలములోనే శత్రువులు మిమ్ము చెఱఁబెట్టఁ గలరు. వారిచేతులలోఁ బడక శీఘ్రముగా నిచ్చటనుండి పలాయనము చేయుట మేలు; దమకొకయిబ్బందిలేక నేనావలకుఁ దీసికొనిపోయెదను." ప్రియ సేవకుఁడు పలికిన యీవచనములు విని ఆమె చింతించి, శత్రువులు నిజముగా సమీపించుచున్నారని చూచి, పవిత్రమైనదేహము మ్లేచ్ఛులచే నపవిత్రమగు నన్నమాట మాత్రము తలఁపునకు రాఁగా సహింపలేక విషణ్ణవదనయై, తనసేవ కునిఁ జూచి యిట్లనియె. "ఓరి నీవన్నమాట నిక్కము. ఇదిగో నాచేతనున్నఖడ్గ ముంగొని, యిచ్చటనే నాశిరశ్ఛేదము చేయుము; నేను క్షత్రియకన్యను; కాన పగరకువెన్నిచ్చి, చనుట నాకనుచితము. ఈశరీరమును శత్రు లంటఁగూడదు. కాన నీవన్యథా విచారముచేయక నాతలఁ దునుముము. అందుచే నేను వీరస్వర్గ మును బొందుదును. నాయాజ్ఞవిని నన్ను సంకటమునుండి కాపాడినందున

నీకును బుణ్యమే గలుగును; పాపము గలుగనేరదు.'' ఈమాటను విన్నతోడనే స్వామిసేవాపరాయణుఁడయిన యా సేవకుఁడు నిశ్చేష్టితుఁడై యేమియుఁదోఁచక నిలుచఁబడెను. కొంతసేపట్లునిలువఁబడి వాఁడిట్లనియె. "తల్లీ! నావిన్నపమాలకించి, ఈయేనుఁగునెక్కుఁడి. అతిశీఘ్రముగా మిమ్ము శత్రువుల బారినుండి తప్పించి, యవతలకుఁ గొనిపోవుదును. నేను స్త్రీవధచేయఁజాలను.'' అప్పుడారాణిగారు మిక్కిలివిచారించి, మ్లేచ్ఛులుతన్నుసమీపించుటఁగని, తనఖడ్గమునకు మ్రొక్కి దానితోఁ దనంతటఁదానే పొడుచుకొని రణభూమియందే ప్రాణములు విడిచెను!!! రాణిగారిశవము మ్లేచ్ఛులచేఁ బడకుండ నామెసేవకుఁడు భద్రపఱిచి, తానును యుద్ధముచేసి యచటనే మృతుఁడయ్యెను! రాణిగారి కుమారుఁడును పరలోకగతుఁడయ్యెను. ఇట్లొక తురక బాదుషాయొక్క రాజ్యలోభముచేత గోండు సంస్థానములోని నిరపరాధులగు జనులందఱు హతులైరి. ఆహా! రాజ్యలోభమెట్టిఘోరకృత్యములను జేయునో చూడుఁడి.

ఈగుణశూరురాలైన దుర్గావతియొక్క సమాధి జబ్బలపురముపద్ద నున్నది. ఆ సమాధియొద్దనే యీమెగుణాగ్రగణ్యాత్మకమైన శిలాశాసనము కలదు. అచ్చటికిఁ వెళ్లిన బాటసారులందఱును ఆసమాధిని మహాభక్తితోఁ జూచి యీశూరనారిని గణించిపూజకభావమును వహించెదరు. పరమధార్మికుఁడైన యొక ఇంగ్లీషుబాటసారి దీనినిగురించి యిట్లు వ్రాసియున్నాఁడు. "దుర్గావతియొక్కసమాధి యాపర్వతదేశములందు నిర్మింపఁబడినది. అచ్చట రెండు పాషాణస్తంభంబు లున్నవి. వానినిఁ జూడఁగానే వెనుకజరిగిన యుద్ధము మూర్తిమంతముగాఁ గనుల యెదుటఁ గానఁబడును. ఆగిరిశిఖరముమీఁద నిప్పటికిని భయంకరమైన రణఘోషము రాత్రిపూట వినవచ్చునని యచ్చటిలోకులు నమ్మెదరు. నిర్జనమయ్యును రమణీయమగు నీస్థలమునకు వచ్చెడిబాటసారులు క్షేమపూర్వకముగా రాణిగారిసమాధిని దర్శించెదరు. ఆమె పరాక్రమ శ్రవణముచే విస్మయాచిత్తులై యానందముతో నామెసమాధినిఁ బూజించెదరు. అస్థలమునందుఁ

ప్రకాశమానము లైనగాజుతునుక లనేకము లున్నవి. ఆగాజుతునుకలే రాణిగారికి బాటసారు లర్పించెదరు. ఈపూర్వాచారము ననుసరించి, నేనును దుర్గావతియొక్క దివ్యగుణములను అభినందించుటకై యొక గాజుతునుక సమాధికి నర్పించితిని.'' అవును. ఇట్టి యలౌకికశౌర్యమేరికి నభినందనీయము గాకుండును? క్షత్రియులకు నత్యంత శ్రేయస్కరమైన ధర్మమును నాచరించి స్వర్గద్వారమునందుఁ జొచ్చినవారు పురుషులైనను, స్త్రీలైనను సర్వజన వంద్యులే.''

౧౫౬౯ లో రతనభోర్ కలింజర్ అను దుర్గములను అక్బర్ సాధించెను. ౧౫౭౦ లో కల్యాణమల్లుఁడను బికానేర్ రాజు అక్బరునకుఁ దన కొమార్తె నిచ్చి వివాహముచేసెను. అక్బర్ రాజపుత్రస్థానములోని పైని వర్ణింపఁబడిన యుద్ధములలో నుండఁగా నాతనికి సిక్రీపట్టణమందుఁ బుత్రుఁడు కలిగెను. సిక్రీలోని షేఖ్ సలీం అనువాని యనుగ్రహమువలనఁ బుత్రుఁడు పుట్టెనని తలఁచి యాతనికి నక్బర్ సలీం అని పేరుపెట్టెను. ౧౫౭౦ లో నాతనికి మురాద్ అను రెండవకొమారుఁడు కలిగెను. సిక్రీపట్టణములో నిద్దఱుపుత్రులు పుట్టినందునను, తన కెల్లెడలను జయముకలుగుచున్నందునను అక్బర్ సిక్రీయను చోట ఫతేపూర్ సిక్రీ అను గొప్పపట్టణమును గట్టించెను. ౧౫౭౨లో నక్బరునకు మూఁడవకొమారుఁడు కలిగెను. వానిపేరు ధ్యానియల్.

(అ) గుజరాథ్:—(౧౫౭౨-౧౫౭౩)—గుజరాథ్ దేశము అరాజకమైయుండెను. అనేకులు రాజ్యమునకై యొకరితోనొకరు పోరాడుచు ఢిల్లీశ్వరుని లక్ష్యముచేయకయుండిరి. అందుచే నక్బర్ ౧౫౭౨-వ సంవత్సరమందు సెప్టెంబర్ నెలలో ఢిల్లీనుండి బయలుదేరి గుజరాథ్ దేశములోని పట్టన్ అను నగరము నొద్ద విడిసెను. అచ్చటి సుల్తానుఁడగు ముజఫర్ షాహ యక్బరునకు శరణాగతుఁ డయ్యెను. అంత అజీజ్ కో యనువానిని సుబేదారుగా నేర్పఱచి సురత్, భడోచ్, చాంపానేర్ అనుస్థలములయందు నున్న మీర్జావంశజులైన

శత్రువులను గెలిచెను. అచ్చటనుండి వారు పంజాబునకుఁ బాఱిపోఁగా నక్బర్ సైన్యములు వెంటఁ దగిలి వారిని సంహరించెను. ౧౫౭౩లో గుజరాథ్ దేశమందుఁ దిరిగి కలవరములుపుట్టఁగా నక్బర్ రెండువేలసైన్యములను ముందుఁబంపి తాను మూఁడునందలసైనికులతో వెడలి యత్యంత స్వల్పకాలములోఁ బట్టణమును గుజరాథ్ దేశపు రాజధానిని జేరెను. అతఁడు తొమ్మిదిదినములలో నాలుగువందల యేబదిమైళ్లు ప్రవాసముచేసెను! ఇంత చుఱుకుఁదనముగలరాజును విజయలక్ష్మి వరించుట యాశ్చర్యమా? అహమదాబాదులోనున్న శత్రుసైన్యములకుఁ బూర్తిగఁ బరాభవము కలిగెను. అక్బర్ ఢిల్లీకిఁబోయి గుజరాథ్ దేశపు ఆదాయమును గుఱించి తగినయేర్పాటు చేయుటకు తోడర్‌మల్ అనురాజకార్యనిపుణునిఁ బంపెను. అతఁ డచ్చటిభూములఁ గొలిపించి వానికి ధరలేర్పఱిచి రాజునకుఁ బ్రజలకు సౌఖ్యము కలుగునట్లు చేసెను.

(౩) బంగాళాదేశము:—(౧౫౭౫-౧౫౭౬) దావూద్‌ఖానుఁ డను వాఁడు బంగాళాదేశము నాక్రమించుకొని ఢిల్లీశ్వరుని లక్ష్యముచేయక యుండెను. ఇంతియకాదు. అక్బరుతో యుద్ధముచేయుటకు సైన్యములను చేర్చుకొనఁ దొడఁగెను. ఈసమాచారము తెలిసినతోడనే యక్బర్ వర్షాకాలమైనను వేయినావల సిద్ధపఱిచి సైన్యములతో గంగానదినిదాఁటి, బంగాళాదేశముచేరెను. అంత దావూద్‌ఖానుఁడు పాఱిపోయెను. మునియంఖాన్, తోడర్‌మల్ అనువారి నచ్చటనునిచి అక్బర్ తిరిగి తనరాజధానికిఁ బోయెను. బంగాళాదేశములో నుంపఁబడిన సైసగదారులు దావూద్‌ఖానుతో మూఁడుసారులు యుద్ధముచేసి, వానిని బట్టుకొని చంపివేసిరి. ౧౫౭౫లో బంగాల్, బహార్, ఓఢ్యా యను మూఁడుప్రాంతములును పూర్తిగా ఢిల్లీశ్వరునకు స్వాధీనమాయెను. అచ్చట మునియంఖానుఁడు సుబేదారుగా నుంపఁబడియె. వాఁడు కాలధర్మమునొందఁగా రాజామానసింహుఁడు బంగాళాదేశమునకు సుబేదారుఁ డయ్యెను. ఆదేశములో మరలఁ గొన్నికలవరములు పుట్టెను. కాని

యక్బర్ సైన్యములచే ౧౫౯౨ లో నవియన్నియుఁ బూర్తిగా నణఁపఁబడెను.

(ఈ) కాబూల్ (౧౫౭౯)—క్రీ.శ. ౧౫౭౫-వ సంవత్సరము మొదలు మూఁడు నాలుగేండ్లవఱకు యుద్ధాదులెవ్వియు లేనందున నక్బర్ ప్రజానుఖకరముగ రాజ్యమేలెను. కాని ౧౫౭౯-లో నాతని సవతియన్నయుఁ గాబూల్ దేశమునకు రాజును అగు మహమ్మద్‌హకీమ్మనువాఁడు పంజాబ్ మీఁదికి దండెత్తివచ్చి రాజా మానసింహుని నోడించినందున అక్బర్ స్వయముగా వానిమీఁదికి యుద్ధమునకుఁ బోయెను. అంత హకీం కాబూల్ దేశమునకుఁ బాఱిపోయెను. వానిని వెంబడించుటకుఁ తనకొమారుఁ డగు మురాద్ అను వానిని నక్బర్ పంపఁగా యుద్ధమందు మురాద్ ఓడింపఁబడియె. దానిమీఁద అక్బర్ స్వయముగా కాబూలునకుఁబోయి హకీమునోడించి వాఁడుశరణు వేఁడినందున వానికే మరల కాబూల్ దేశపు టధికారము నొసంగెను. కాని వాఁడు మరల తిరుగఁబడునేమోయని జయపురరాజైన భగవాన్‌దాసుని నచ్చట నునిచి వచ్చెను. ౧౫౮౬ లో మహమ్మద్‌హకీం కాలధర్మము నొందఁగాఁ గాబూల్ రాజ్యమంతయు సంపూర్తిగ అక్బరునకు సంక్రమించెను.

(ఉ) కాశ్మీరము (౧౫౮౭)—కాశ్మీరమువంటి భూలోకనందన వనమును స్వాధీనముచేసికొనవలయునని యక్బ రెన్నిదినములనుండియో కోరుచుండెను. కాశ్మీరములో ననేకకల్లోలములు కలవని విని యక్బర్ ౧౫౮౬-లోఁ దనసైన్యముల జయపురాధీశుఁడగు భగవాన్‌దానునివెంట నిచ్చిపంపెను. కాని యందువలన విశేషలాభము కలిగినదికాదు. అచ్చటిత్రోవలు మిక్కిలి చిన్నవిగను, కఠినములైనవిగను, పర్వతారణ్యములతో నిండినవిగను ఉండెను. దానిచే భగవాన్‌దానునకు జయము కలిగినదికాదు. మఱుసటిసంవత్సరమున అక్బర్ కాశింఖానుఁ డనువానిని గాశ్మీరముమీఁదికిఁబంపఁగా నాతఁడు కాశ్మీర రాజును చెఱపట్టి తీసికొనివచ్చెను. వానికి బహార్ దేశములోఁ గొంతజాగీరిచ్చి

యక్బర్ కాశ్మీరదేశమును దనరాజ్యములోఁ జేర్చుకొనెను. ౧౫౮౭ లో అక్బర్ స్వయముగాఁ గాశ్మీరదేశమునకుఁబోయి యచ్చటి రాజ్యాంగవిషయిక వ్యవస్థయేర్పఱచి, యచ్చటినుండి కాబూలునకుఁ బోయెను.

(ఊ) అఫ్గానులతోఁ బోరాట (౧౫౮౯)—పెషావర్ కునావల నున్న యఫ్గానులను జయింపనలయునని యక్బరునకు నిచ్చ వొడమెను. ఈ యఫ్గానులు యుసఫజైజాతివారు; హిందూకుశపర్వతముయొక్క గుహాలలోఁ గాపురము చేయుచుండిరి. అక్బరుయొక్క బాల్యస్నేహితుఁడగు జైన్ఖాన్ కోకాయును రాజాబీర్బల్ (వీరబలుఁడు) అనువాఁడును, అఫ్గానులమీఁదికి యుద్ధమునకుఁబోయిరి. ఈమొగలసైన్యములు పర్వతప్రదేశములోఁ బ్రవేశించిన తోడనే, పార్వతీయులగు అఫ్గానులు లాసైన్యములను ముట్టడించి, తిరిగి వెళ్లుటకు వీలులేకుండ మార్గముల నడ్డగించిరి. రాజా బీర్బల్ ఎనిమిదివేల సైన్యములతో యుద్ధరంగమునందు మడిసెను. ఈ సమాచార మక్బరునకుఁ గాబూలులో నుండఁగాఁ దెలిసి, రాజ్యకార్యకుశలుఁడగు బీర్బల్ యొక్క మరణమునకు మిక్కిలి చింతించి వెంటనే లాహోరుపట్టణమునకు వచ్చెను. ఖైబర్ కనమలనుండి రాజాతోడర్మల్, రాజామాన్సింగ్ అనువారలు సైన్యములతో నఫ్గానులమీఁదికిఁబోయి కొంతవఱకు జయము సంపాదించిరి. కాని మొత్తముమీఁద ఢిల్లీశ్వరుఁడగు రారాజునకు నీయుద్ధమువలన విశేష లాభము కలిగినదికాదు. అఫ్గానులతో నొకవిధముగ సంధిచేసికొని, యక్బర్ తనసైన్యములఁ బిలిపించుకొనియె. ఈవర్ణన చదివిన యే చదువరికి మొన్నయింగ్లీషువారికిని జాఖాఖేలులకును జరిగినయుద్ధము జ్ఞప్తికి రాకయుండదు?

(ఋ) సింధు దేశము (౧౫౯౨)—అక్బరుచే నేర్పరుపఁబడిన గుజరాథ్ దేశపుసుబేదారుఁడగు మీర్జా అజీజ్ కోకా యనువాఁడు ౧౫౮౯లో కాఠేవాడ్ ప్రదేశములోని జాంనగరపు రాజును జయించుటకు యత్నించి విఫలప్రయత్నుఁ డయ్యెను.

మఱుసటిసంవత్సరమునం దాతఁడు జునాగడ్ అను రాజ్యము నాక్రమించుకొనెను. సింధుదేశములో రాజ్యముచేయుచున్న పారసీకజాతి సరదారులొకరితోనొకరు పోరాడుటచూచి యక్బరదియే మంచిసమయమని తలఁచి, యుత్తరపుదిక్కునుండి తనసైన్యములను సింధుదేశముమీఁదికిఁ బంపెను. ఆసైన్యములతోఁదనసైన్యములనుజేర్చి కోకాయనువాఁడు సింధుదేశమును ౧౫౯౨లో జయించెను. శరణనిన జానీబేగ్ అను పారసీకసరదారునకు నక్బర్ సైన్యములో గొప్పయుద్యోగ మీయఁబడెను.

(ఋ) కందహార్ (౧౫౯౫)—పారసీకరాజుయొక్క సాయమునుఁబడసి హుమాయూన్ కందహార్ రాజ్యమును గెలిచెనని యిదివఱ కాతని చరిత్రలో వ్రాసియున్నాము. ఆరాజ్యము పారసీకరాజునకు నిచ్చునట్లు మొదట హుమాయూన్ ఒప్పుకొనినను, రాజ్యము దొరకినతరువాత నిచ్చినవాఁడు కాఁడు. అందుచే నాతనికాలములోనే పారసీకరాజా రాజ్యము నాక్రమించుకొని ౧౫౯౫వఱకు ననుభవించెను. ఆసంవత్సరములో అక్బర్ తనసైన్యముల నంపి కందహార్ రాజ్యమును స్వాధీనము చేసికొనెను.

ఆకాలమందు షహాఅబ్బాస్ అనువాడు పారసీకమునకు రాజుగా నుండెను. స్వరాజ్యములోనాతనికిఁ బెక్కుపనులుండినందున నాతడు కందహార్ రాజ్యమును మరల సంపాదించుటకు యత్నించినవాఁడుకాఁడు.

కందహార్ స్వాధీనముచేసికొనినప్పటినుండియు నక్బర్ హిందూదేశమునఁ జక్రవర్తియయ్యెనని చెప్పవచ్చును. సింధునదికిఁ బశ్చిమముననున్న పూర్వార్జిత రాజ్యమంతయు నాతఁడు వశపఱుచుకొనెను. కాశ్మీరము, బంగాళము, బహార్, ఓఢ్యా, ఆసాందేశములన్నియు నాతనికి లోఁబడెను. ఉదయపుర రాజుతప్ప మిగిలిన రాజపుత్రరాజు లందఱును, గుజరాథ్ దేశపు నవాబును, అక్బరుయొక్క సార్వభౌమత్వమును నొప్పుకొనిరి. చంద్రగుప్త చక్రవర్తితప్ప నర్మదానదికి నుత్తరమున నింత విశాలరాజ్యమును నేలినరాజు లేఁడు. ఇట్లుత్తరము

నందలి రాజ్యముల నన్నిటిని లోఁబఱుచుకొని యక్బర్ దక్షిణదేశములోని. రాజ్యముల సాధింప సమకట్టెను.

(౪) దక్షిణదేశములను సాధించుటకు యత్నించుట. (౧౫౯౫-౧౬౦౦)—ఆకాలమందు దక్షిణదేశములో అహమ్మద్‌నగర్, బీజాపురము, గోలకొండ, ఖాన్‌దేశము అను తురకరాజ్యములు ప్రబలియుండెను. వీనిరాజులందఱును మొదట ఢిల్లీశ్వరుని సేవకులైన బహమనిరాజులకు సేవకులయి నను స్వతంత్రులై ఢిల్లీశ్వరుని లక్ష్యముచేయకయుండిరి.అందుచే వీరినిలోఁబఱచుకొనుట యావశ్యకమని రారాజుతలఁచెను. ౧౫౬౪లో తాలికోటయుద్ధము నందు విజయనగరరాజుల నోడించి యీదక్షిణములోని సుల్తానులందఱు నారాజ్యమును పంచుకొనిరి. ౧౫౭౨లో అహమ్మద్‌నగర్ నవాబు వరాడ్ (బీరార్) ప్రదేశమును నాక్రమించెను. ఇట్లీ దక్షిణములోని నవాబులు దిన దినము ప్రబలులగుటచూచి, సహింపనోపక, రారాజు తనకొమారుఁడగు మురాద్ అనువానిని దక్షిణములోనికిఁ బంపెను. కాని శూరవనితయగు చాంద్‌బీబీయను నామె తనయప్రతిమప్రతాపమునుజూపి మోగలులతో సమానముగాఁ బోరాడెను. ఉభయసైన్యములకును లాభములేక యనేక దినములవఱకు యుద్ధముజరిగిన తరువాత వరాడ్‌ప్రాంతము మోగలులకిచ్చి, సంధి చేసికొనెను. కాని వరాడ్‌దేశముపై దక్షిణములోని యనేక రాజులు తమహక్కునుజూపి, గోదావరీతీరమునందలి సుపాయను గ్రామమునొద్ద మూఁడురోజులు ఘోరముగాఁ బోరాడినందున, నారాజ్యము మోగలులకు వశపడినదికాదు. ౧౫౯౭లో అబుల్‌ఫజల్ అనువానిని గొంతసైన్యముతోఁ దక్షిణమునకుఁ బంపెను. ఆసంవత్సరమునందే అక్బర్ పుత్రుఁడగు మురాద్ వరాడ్‌దేశములోఁ గాలధర్మము నొందెను. ౧౫౯౯ లో అక్బర్ స్వయముగా అహమ్మద్ నగరముమీఁదికి దండెత్తివచ్చెను. చాంద్‌బీబీని నెవ్వఁడో దుష్టుఁడు చంపివేసినందున నరాజకమై అహమ్మద్ నగరము రాజుచేతికిఁ

జిక్కెను (౧౬౦౦ జూలై). కాని అహమ్మద్ నగరరాజ్యముమాత్రము ౧౬౩౭ వఱకు మొగలులకు స్వాధీనము కాలేదు. అక్బర్, ఖాన్ దేశపుసుల్తానుని గెలిచి యాదేశమంతయును, షీర్ గడ మనుదుర్గమును నాక్రమించుకొని, వరాడ్ ఖాన్ దేశములకుఁ దనపుత్రుఁడగు ద్యానియల్ అనువానిని నధికారిగను, ఖానఖానాన్ అనువానిని వానికి వజీరుగను నేర్పఱిచి తాను బిజాపూర్, గోలకొండ నవాబులయొద్దనుండి యప్పనంబులఁ గైకొని రాజధానికి వెడలిపోయెను.

## చరమకాలమందలి విపత్తులు.

## (౧౬౦౧-౧౬౦౫).

పుత్రుఁడైన మురాద్ కాలధర్మము నొందినందున అక్బరునకు మిక్కిలి దుఃఖముకలిగెను. అతఁడు దక్షిణ దండయాత్రనుండి వచ్చినతోడనే యతని పెద్దకొమారుఁడగు సలీం అనువాఁడు తిరుగఁబడెను. అతని కప్పటికి ముప్పది సంవత్సరములు వయస్సుండెను. మద్యపానము, నల్లమందు తినుట మొదలైన దుర్వ్యసనములచే నతఁడు దుర్వృత్తిఁ గలవాఁడాయెను. అక్బరునకుఁ బ్రాణప్రియుఁడగు అబుల్ ఫజల్ అను పండితుని నతఁడు ద్వేషించుచుండెను. అక్బర్ దక్షిణమునకుఁ బోవునపుడు అజ్మీర్ ప్రదేశపు టధికారమును, ఉదయపూర్ రాజుతో యుద్ధముచేయు పనియు, యువరాజగు సలీమునకుఁ జెప్పిపోయెను. తండ్రి దక్షిణమునకుఁ బోవుటచూచి యాతఁడు ప్రయాగ కోటలోని బొక్కసమును స్వాధీనముచేసికొని సైన్యములఁ జేర్చుకొని తండ్రికిఁ బ్రతిస్పర్థియై బాదుషాహబిరుదు వహించెను. ఈ సమాచారము తెలిసి యక్బర్ పుత్రునకు నుపదేశముచేయుచు లేఖల నంపెను. కాని యందువలన నేమియు లాభముకలిగినది కాదు. ఇంతలో నాసలీం తనతండ్రికి బహిఃప్రాణమగు అబుల్ ఫజల్‌ను జంపించెను (౧౬౦౨). ఈ సమాచారము తెలిసి యక్బర్ మిక్కిలి చింతాక్రాంతుఁడై రెండుదినములవఱకు నిద్రాహారము లెఱుఁగక యుండెను. అతని రెండవకొమారుఁడగు ఖుస్రూయొక్క తల్లి మానసింహుని

చెల్లెలు. ఆమె విషమునిని ప్రాణములు విడిచెను. అప్పటినుండి ఖుస్రూ యనువాఁడు కాలాగ్ని రుద్రుఁడై యెదుటఁ గాన్పించిన వారినందఱిని బాధ పెట్టఁ దొడఁగెను. పెద్దకొమారుఁడగు సలీమునొద్దకిఁ బోయి యాతనికి బుద్ధి చెప్పవలయునని తలఁచుచుండఁగా అక్బరుతల్లి కాలధర్మము నొందెను. అంత గొంతకాలమునకు పశ్చాత్తాపము కలిగి సలీం తండ్రియొద్దకు వచ్చెను. దక్షిణమునందున్న అక్బరుయొక్క కొమారుఁడగు డ్యానియల్ సురాపాన దుర్వ్యసనమువలన ౧౬౦౪ లో లోకాంతరగతుఁ డయ్యెను.

ఇట్లెడ తెగని విపత్తులు వచ్చినందున నక్బర్ శరీరము చింతచే దినదినము క్షీణింపఁజొచ్చెను. ౧౬౦౫-వ సంవత్సరమందలి సెప్టెంబర్ నెలలో అక్బర్ మంచముపట్టెను. అప్పుడు తనతరువాత తనపుత్రులలో రాజ్యము చేయువాఁ డెవ్వఁడని నిశ్చయించుట యాతనికి నావశ్యక మయ్యెను. తన పెద్దకొమారుఁడగు సలీం అనువాఁడే రాజ్యమునకు నర్హుఁడని మొదటినుండియు నక్బర్ యొక్క యభిప్రాయముకాని ఖుస్రూ యనువానికి మానసింహుఁడు మేనమామ; అజీజ్ అను మఱియొక సరదారుఁడు పిల్లనిచ్చినమామ; కావున వీరిద్దఱును ఖుస్రూకు రాజ్యము రావలయునని యత్నించుచుండిరి. కాని తన పెద్దకుమారునకే రాజ్యముండవలయునని యక్బర్ గట్టిగాఁ జెప్పినందున వారును సలీం పక్షములోఁ జేరిరి. తుదకుఁ దనయపరాధముల క్షమింపవలయునని చుట్టునుండినవారిని గోరి తనకొమారునకుఁ దగుబోధచేసి ౧౬౦౫-వ సంవత్సరమునందు ౧౩-వ అక్టోబర్ దినమున నామహాచక్రవర్తి ఆగ్రాపట్టణములో దేహమునుచాలించెను. అప్పుడాతనికి నఱువదిమూఁడు సంవత్సరములు వయస్సు. ఆతని పెద్దకుమారుఁడగు సలీం తన ముగ్గురు కొమారులతోఁ గలిసి యక్బర్ ప్రేతమును మోసికొని కోటవెలుపలకుఁ దీసికొనిపోయెను. అచ్చటినుండి నాలుగుమైళ్లమీఁదనున్న సికంద్రా యనుచోటికిఁ గొందఱు సరదారులు మోసికొనిపోయి సమాధిచేసిరి.

అక్బర్ మరణముతో మోగల్ సామ్రాజ్య నాటకముయొక్క ప్రథమాంకము సమాప్తమయ్యెను. ఆసామ్రాజ్యము అక్బరువలన దృఢపఱుపఁబడి యప్పటినుండి

నూటయేఁబది సంవత్సరములవఱకు ననన్యసామాన్యవైభవము ననుభవించెను. ఈ మహాసామ్రాజ్యమును మొగలులయొద్దనుండి నూటయేఁబది సంవత్సరముల తరువాత వశపఱుచుకొనిన మహాశక్తి యొకటి యీయక్బరుకాలముననే యుదయించుట వింత కదా! ఈస్టిండియాకంపెని యనునదియే మహాశక్తి. క్రీ. శ. ౧౬౦౦లో నింగ్లండుదేశమందు హిందూదేశముతో వర్తకము చేయుటకు నీస్టిండియాకంపెని యనువర్తకసంఘ మొకటి స్థాపింపఁబడియె.



అక్బరుయొక్క గోరీ (సికంద్రా).

ఈ యింగ్లీషువర్తకులే హిందూరాజ్యమును సంపాదించిరి. ఆ చరిత్రయంతయు బ్రిటిషు మహాయుగ మనుప్రకరణమునందు సవిస్తరముగా వర్ణింపఁబడును.

## రాజ్యవ్యవస్థ.

ప్రజాసౌఖ్యమే పరమోద్దేశముగా రాజ్యమును బాలించిన లోకవంద్యులగు చక్రవర్తులలో నక్బర్ అగ్రగణ్యుఁడనియే చెప్పవలసియున్నది. అక్బర్ యొక్క రాజ్యతంత్రమును సవిస్తరముగావర్ణించుచు నాతని మిత్రుఁడును, విద్వాం

నుఁడును అగు అబుల్ ఫజల్ అనువాఁ డొకగ్రంథము వ్రాసియుంచినాఁడు. ఆగ్రంథమునకు 'ఐనేఅక్బరీ' అనిపేరు. అక్బరుయొక్క యైశ్వర్యమును, ప్రజాప్రీతియు, సాధుస్వభావమును, రాజకార్య కౌశలమును, ప్రయోజకత్వమును నాగ్రంథమువలనఁ దెలియును. 'లోకులయాచార వ్యవహారముల సంస్కరించుట, వ్యవసాయము నభివృద్ధిచేయుట, సైన్యమును నితర రాజ్యాంగములను సువ్యవస్థితముగానుంచుట, లోకోపయోగకరములైన కార్యములఁజేసి జనులను సంతుష్టాంతరంగులఁ జేయుట, ఆదాయమును జక్కఁబఱిచి మితవ్యయము చేయుట, యనునవి ప్రజల సౌఖ్యమునకై రాజుచేయవలసిన పనులని యండఱును నొప్పుకొనువిషయము. ఈసంగతులను మఱవక రాజ్యముచేసినరాజు వైభవశాలియగు ననుటకు సందేహములేదు!' అని యీగ్రంథాదిని వ్రాయఁబడినది. అక్బరు చరిత్రయంతయు నీవాక్యములకు లక్ష్యభూతము.

ఈతని రాజ్యములో భూమిపన్నును గుఱించి చేయఁబడిన నిబంధనల విషయమై ముందు వ్రాయఁబడును. పన్ను ఒకరిమీఁద విశేషముగాఁబడి యొకరిమీఁదఁ దక్కువపడక యందఱికి సమానముగా నుండునట్లు చేయుట యితవి రాజ్యాంగస్థులోని యొక విశేషము. ఇతఁడు వర్షములులేని సంవత్సరములోఁ బన్ను రాఁబట్టుకొనవలదని శాసించెను. పూర్వమునుండి జరుగుచు లోకులకు బాధకరముగానున్న చిల్లరపన్ను లనేకములు తీసివేసెను. నగరములో మోసము లేకుండ తూనికలను కొల్తలను సిసలుపఱిచెను. అంతకుఁబూర్వము రాజకీయాధికారులకుఁ బ్రజలయొద్దనుండి కొన్ని బహుమతులు దొరకుచుండెను. వానినాపి యధికారులకు నెలజీతముల నిర్ణయించెను. అందుచేఁ బ్రజలకు గలుగుబాధలు తొలఁగెను. రాజ్యములోని యొక్కొకయధికారిచేయవలసిన పనులన్నియు స్పష్టముగ నిర్ణయింపఁ బడినందున వారిస్వేచ్ఛాచార మడుగంటెను. అధికారులను గుఱించి యక్బరుచేఁ జేయఁబడిన నిబంధనలుకొన్ని యిచ్చట నుదాహరించుచున్నాను.

సుబేదార్ :— ఇతఁడు ప్రాంతాధికారి. ప్రస్తుతపుగవర్నర్ వంటివాఁడు. ఇతఁ డీక్రిందినియమముల ననుసరించి యధికారము చేయవలయును. ప్రజా సౌఖ్యమునకై విశేషజాగరూకుఁడై యుండవలయును; దీర్ఘాలోచనచేయక యొకరికిని దేహాంతశిక్ష విధింపరాదు; వ్యాజ్యమునకై వచ్చినవారికి నాలస్యము చేయక తీర్పుచెప్పవలెను; విపన్నావస్థలోనుండువాఁడు చెప్పుసంగతులన్నియు వినవలెను; వానిని శిక్షింపరాదు; బాటసారులకు బాధలేకుండ త్రోవలు రక్షింప వలయును; పాటుపడు కాఁపువానిస్నేహితుఁ డీతఁడని జనులు తలఁచునట్లు సుబేదారుఁడు నడచుకొన వలయును.

కాజీ (న్యాయాధీశుఁడు):— ఇతఁడు లోభపక్షపాతము లనఁబడు దుర్గుణములను కలలోనైనఁ దలఁపఁగూడదు. అపరాధమన్న నెద్దియో, నిరపరాధమన్న నెద్దియో చక్కఁగ నెఱిఁగి తన యాచరణ పరిశుద్ధముగా నుంచుకొన వలయును.

కొత్వాల్ :— ఇతఁడు గ్రామసంరక్షణచేయు నధికారి. ప్రస్తుతపు పోలీస్ సూపరింటెండెంట్ వంటివాఁడు. ఇతఁడు పవిత్రాచరణమును, సత్య ప్రవర్తనమును గలిగియుండవలెను; నిరుద్యోగు లగుసోమరులకు నేదియైన పని కల్పింపవలెను; తక్కువబరువు గలనాణెములు బొక్కసమునకు నిచ్చువాని యొద్దనుండి తక్కువపడిన మొత్తము మాత్రము తీసికొనవలెను; ఎక్కువ తీసి కొనఁగూడదు; లోకులు మద్యపానము చేయకుండుటకుఁ దగినయేర్పాటులు చేయవలెను; కాని యట్లుచేయునపుడు రహస్యస్థలములలో లోకు లేమిచేయు చున్నది కనుఁగొనుటకు విశేషముగా యత్నింపఁగూడదు; సహగమనము చేయనొల్లని స్త్రీని సహగమనము చేయుటకు నామెబంధువులు బలవంతపెట్ట కుండఁ గాపాడవలయును.

పన్ను రాఁబట్టు నధికారులు:— తాము కాఁపులకు నాప్తులమని యెప్పుడును జ్ఞాపక ముంచుకొనవలయును. కాఁపులను స్వాయముగాఁజూచి

మాటాడవలయును. ఇతరులమాటలు విని వ్యవహారము చేయఁగూడదు. కాఁపులకు వలయునపుడు గొంతధన మిప్పించ్చి వీలువెంటఁ గ్రమక్రమముగా రాఁబట్టుకొనవలయును. ఏర్పడిన పన్నుకంటె నెక్కుడు తీసికొనఁగూడదు. పన్ను రాఁబట్టుకొనుటకుఁ బ్రజలను బాధింపఁగూడదు.

## జమాబంది.

జమాబంది యనఁగాఁ బ్రజలయొద్దనుండి రావలసిన పన్నుయొక్క మొత్తమును నిర్ణయించుట. ప్రజాహితమునకై యక్బరుచేఁ జేయఁబడిన పనులలో జమాబంది పద్ధతి ముఖ్యమైనది. ఇది యింతవఱకును గొప్పవిద్వాంసులచేఁ గొనియాడఁ బడుచున్నది. ప్రస్తుతపు రాజ్యకర్తలకుఁ గూడనిది కొంతవఱకు మార్గదర్శకమయ్యెను. రాజా తోడర్ మల్ అను అక్బరుయొక్క హిందూ మంత్రీశ్వరుఁడీపద్ధతి నేర్పఱిచెను. రాజా తోడర్ మల్లుఁడు జమాబందిపని సూర్ వంశజుఁడగు షీర్ షహాయొద్ద నేర్చుకొనెను. భూమివిషయమై యక్బరుచేఁ జేయఁబడిన సంస్కరణములన్నియు షీర్ షహాచేఁ బ్రారంభింపఁబడి యుండెను. ఆపద్ధతులను జక్కఁగఁ దెలిసిన తోడర్ మల్లుఁడు అక్బరునకుఁ బ్రాణప్రియుఁడై యుండెను. ఈతోడర్ మల్లును గుఱించి అబుల్ ఫజల్ అనుగ్రంథకారుఁ డిట్లువ్రాసియున్నాఁడు. 'సత్యక్రియత్వము, సత్ప్రవర్తనము, ధైర్యసాహసములు, ఒక్కొక్కపనిని జక్కఁగ నెఱుఁగుట, తనయధికారములోని పనులన్నియుఁ గ్రమముగ నడచు నట్లేర్పాటుచేయు చాతుర్యము అనుసద్గుణములయందు తోడర్ మల్లును మించినవాఁడు మఱి యొకఁడుండఁడు. భూమిపన్నువిషయమై అక్బర్ రాజ్యములోఁ జేయఁబడిన ప్రశంసనీయములైన పద్ధతులను గుఱించి తోడర్ మల్లునే ప్రశంసింప వలసియున్నది. తోడర్ మల్ మొదట రాజ్యములోని భూమియంతయుఁ గొలిపించెను. అనఁగా 'సర్వే' చేయించెను. తరువాత భూములయొక్క యోగ్యతనుబట్టి యుత్తమ, మధ్యమ కనిష్ఠ భూములనియెడు తరగతు లేర్పఱచెను. ఒక్కొక పొలముయొక్క

వందొమ్మిది సంవత్సరముల యాదాయమునుబట్టి యాభూమిపన్ను నిర్ణయింపఁ బడెను. ఆదాయములోని మూఁడవభాగము పన్నుగ విధింపఁబడియె. షీర్ షహాచే విధింపఁబడిన పన్నింతెకంటెఁ దక్కువ యనుటకు సందేహములేదు. కాని యక్బర్ రాజ్యములో నేలపన్నుతప్పఁ దక్కినపన్నులన్నియు విడిచి పెట్టఁబడియె. అధికారులకు నిచ్చుచున్న బహుమతు లీయవలదని యతఁడు శాసించెను. ఇజారా పద్ధతివలన నిజారాదారులు ధనవంతులగుటయు, రైతులు దరిద్రులగుటయుఁ గని యాపద్ధతిని మాన్పి రైతులయొద్దనుండి పన్ను తానే రాఁబట్టుకొనఁజొచ్చెను. అక్బర్ రాజ్యములో రైతే భూస్వామిగ నుండెను. రైతు పన్నిచ్చుచున్నంతవఱకు వానిని భూమినుండి వెడలఁ గొట్టుటకు నెవ్వరికిని నధికారము లేకయుండెను. భూమిని గొలుచుట, తరగతు లేర్పఱుచుట, పన్ను నిర్ణయించుట, ప్రతిగ్రామములోని రైతులయొక్కయు వారీయవలసిన పన్నుయొక్కయు లెక్కలు క్రమముగానుంచుట మొదలైన జమాబందికి సంబంధించిన యంశములన్నియు నిప్పటి రాజ్యకర్తలగు నింగ్లీషు వారు అక్బర్ యొద్దనుండియే నేర్చుకొనిరి.

## రాజ్యవిభాగములు.

అప్పటి రాజ్యములోని గొప్ప విభాగములకు సుబాలనియు నందలి యధి కారులకు సుబేదారులనియు పేళ్లు. అప్పటి సుబా లిప్పటి ప్రెసిడెన్సీల వంటివి; అప్పటిసుబేదారు లిప్పటిగవర్నర్ల వంటివారు. అక్బర్ రాజ్య మీ క్రిందిపదునాఱు సుబాలుగా విభజింపఁబడి యుండెను. ౧. కాబూల్, ౨. లాహోర్, 3. ముల్తాన్, ౪. సింధ్ (టట్టా), ౫. గుజరాథ్, ౬. మాల్వా, ౭. అజ్మీర్, ౮. ఢిల్లీ, ౯. ఆగ్రా, ౧౦. అలహాబాద్ (ప్రయాగ), ౧౧. ఔధ్ (అయోధ్యా), ౧౨. బహార్, ౧౩. బంగాల్, ౧౪. వరాడ్ (బీరార్), ౧౫. ఖాన్ దేశ్, ౧౬. అహమ్మద్ నగర్. ఓఢ్యా, కాశ్మీరము లను రెండుసుబాలు వెనుకనుండి రాజ్యములోఁ జేర్పఁబడెను. ఈప్రదేశములందలి సుబేదారులు

సైనిక సంబంధమైనట్టియు, ప్రజాపరిపాలన సంబంధ మైనట్టియు, జమాబంది సంబంధ మైనట్టియు సర్వాధికారములు కలిగియుండిరి. అన్నిసుబాల యాదాయము కలిసి పదునాలుగుకోట్ల రూపాయలు వచ్చుచుండెను.

## సైన్యవ్యవస్థ.

అక్బరుయొక్క సైన్యవ్యవస్థయు మిక్కిలి ప్రశంసనీయముగా నుండెను. ఆసైన్యములో నైదువేలకంటె నెక్కుడుసైన్యమునకు నధిపతి యగువానికి 'అమీర్' అనియు, నైదువేలకంటె తక్కువ సైన్యమునకు నధిపతి యగువానికి 'మన్‌సబ్‌దార్'అనియు బిరుదునామము లుండెను. అమీర్, మన్‌సబ్‌దారులు కలిసి ౪౧౫గు రుండిరి. అందు ౫౧ మంది హిందువు లుండిరి. వీరుగాక చిన్న చిన్న యధికారు లనేకు లుండిరి. ఇట్టివారి సంఖ్య ౧౪౦౦ నలుకుండెను. రాజపుత్రుఁడగు సలీం పదివేలసైన్యములకు నధిపతియగు అమీరుగను, రెండవకొమారుఁడగు మురాద్ ఎనిమిదివేలకును, మూఁడవ కొమారుఁడగు ద్యానియల్ ఏడువేలకును అధికారులై యుండిరి. రాజపుత్రులకుఁ దప్ప సాధారణముగా నితరులకు నైదువేలకంటె నెక్కుడుసైన్యముల మీఁది యధికారము దొరకుట లేదు. సలీం పుత్రుఁడైన ఖుస్‌రూయనువానికి నైదువేల సైన్యాధికార మీయఁబడెను. మన్‌సబ్‌దారునకు నెలకు నూటరేఁబది మొదలు లేదువందలరూపాయల వఱకును, అమీరులకు నంతకంటె నెక్కుడుగను జీతము లుండెను. అమీర్, మన్‌సబ్‌దారుల పేళ్లన్నియు ఐనే అక్బరీ గ్రంథములో వివరముగా నీయఁబడియున్నవి. వానిని జూడఁగా హిందూదేశములోని మహమ్మదీయులకంటె తురక, పారసీక, అరబ్బీదేశములలోని మహమ్మదీయు లెక్కుడు గౌరవింపఁబడుచుండిరని కాన్పించుచున్నది.

ఈ యధికారుల చేతిక్రిందనున్న సైన్యముల కర్చునిమిత్తమై వీరికి జాగీరులొసంగు పద్ధతి పూర్వమునుండి యుండెను. కాని యందువలనఁ బ్రజలకు

బాధ కలుగుచుండెను. అధికారు లిష్టమువచ్చినంత ధనమును ప్రజలయొద్దనుండి రాఁబట్టుకొనుటయే గాని తగినంతసైన్యమును నుంపక పోయిరి. అందుచే నక్బరాపద్ధతినిమాన్పి యధికారులకు రొక్కమొసఁగుచు వచ్చెను. రొక్కమిచ్చుటకుఁ బూర్వ మాయధికారియొద్ద నియమితసైనికులు కలరా లేరాయని నిశ్చయపఱచుకొనుచుండెను. ప్రతిసైనికుని ముఖచర్యను గనఁబఱచు పట్టికయొకటి వ్రాయించి యుంపవలయునని నియమించెను. గుఱ్ఱములసంఖ్య తగ్గఁగూడదనియు, గుఱ్ఱములు మాఱుపడఁగూడదనియు వానిపై రాజముద్రతోఁ గాల్చుచుండిరి. ప్రతి యధికారియుఁ దనసైన్యములోని పశువులవివరమును, నితరవస్తువులవివరమును చూపు పట్టిక యొకటి యుంపవలయునని అక్బర్ శాసించెను. ప్రతి మన్ సబ్ దారుని యొద్దను తుపాకిబంట్లకంటె రెండింతలు కాల్బలమును, వారికంటె రెండింతలు గుఱ్ఱపుసైనికులును మిగిలినవారు విల్లనంబులు గలవారుగను నుండిరి. అక్బరుయొక్క సైన్యమంతయుఁ గలిసి యింతయుండెనని చెప్పుటకు వీలులేదు. అయినను ఆతనియొద్ద రెండులక్షలసైన్య ముండెనని కొంద ఱూహించి యున్నారు.

అక్బర్ సైన్యములో మోగల్ సైన్యమనియు, రజపుత్ సైన్యమనియు ముఖ్యవిభాగములు రెండు. అందు పైనివర్ణింపఁబడిన రొక్కపుపద్ధతి మోగల్ సైన్యములను గుఱించినది. రజపుత్ సైన్యమనఁగా రాజపుత్రుల సైన్యమని యర్థము. వారికిమాత్రము పూర్వమువలెనే జాగీరు లీయఁబడుచుండెను. ఈ జాగీరులు వంశపరంపరగా జరుగుచుండెను. మొదట రాజపుత్రులుబాదుషాసైన్యములో నుండుటకు నిష్టపడినవారుకారు. కాని వారిని అక్బర్ అమీరులతోసమానముగాఁ జూచినందున వారు దిల్లీశ్వరునిసేవ నంగీకరించిరి. అక్బర్ రాజపుత్రులయెడ మిక్కిలి గౌరవభావమును కలిగియున్నందున వారును స్వామిభక్తితో నాతనికొఱ కనేకయుద్ధములు చేసి యనేక రాజ్యముల గెలిచియిచ్చిరి.

## న్యాయవిచారణ.

న్యాయవిచారణచేయుటకు మీర్ ఆదిల్, కాజీ అనునిద్ద అధికారులుండిరి. అందు ధర్మనిర్ణయము (Point of Law) చేయుట కాజీయొక్క పని. కలహాంశములను (Facts) నిర్ణయించి తీర్పుచెప్పుపని మీర్ ఆదిల్ అనువానిది. మనుధర్మశాస్త్రమును, మహమ్మదీయధర్మశాస్త్రములను అనుసరించి యక్బర్ తన శిక్షాస్మృతి నేర్పఱచెను. ఏనాదివాండ్రను వశపఱుచుకొని ప్రస్తుతపు పోలీసు వారుచేయు గ్రామసంరక్షణవిషయమైన పనివాండ్రచేఁ జేయించెను. కొత్వా లనువాఁడు వారిమీఁది యధికారి. పల్లెలలోని వ్యవహారములన్నియు గ్రామస్థులే చక్కఁబఱుచుకొనుచుండిరి.

## లెక్కలు.

తన రాజ్యములోని యాదాయవ్యయములయొక్క వివరము చక్కఁగఁ దెలియుటకును, అధికారులు ధన మపహరింపకుండుటకును, తన రాజ్యములోని యన్నికచేరీలలోను లెక్కలశాఖ యొకటి నిర్మించెను. ఈశాఖవారు దినదినము లెక్కలును, నెలలెక్కలును, మూఁడునెలలలెక్కలును ఆయా కాలములందు వ్రాసి పంపుచుండిరి. తన బొక్కసములోని రత్నములు మొదలైన వెలగల వస్తువుల గుర్తులతోఁ బట్టిక వ్రాయించి వానివెల నిర్ణయించెను. ముత్యపుహారములను గట్టించి, ముడియొద్ద ముద్రలువేయించెను. నాణెములు చేయుటకై టంకశాలఁ గట్టించెను. నాణెముల లోహములో మోసములేకుండ బహు జాగరూకతతో స్వయముగాఁ జూచుచుండెను. ఈ నాణె మింతమందము ఇంతవెడల్పు కలిగి యుండవలయునని యతిసూక్ష్మనియమము లేర్పఱిచెను.

## జాగరూకత

తన్ను సంబంధించిన పనులన్నియు మిక్కిలి జాగరూకతతోఁ జేయుచు, నక్బర్ వానిని గుఱించి యతిసూక్ష్మ నియమములను జేసెను. ఏనుఁగులు, గుఱ్ఱములు మొదలగు వానియాహారమును గుఱించియు, నాతఁడు విచారించు

చుండెను. ఏనుఁగులకు నాహారము సరియైనది మావటివాండ్రు పెట్టనందున నవి చిక్కుటచూచి, యేయే యాహారలోపమున నేనుఁగెంతెంత చిక్కునో కనుఁగొని, యట్టి యేనుఁగులను పదునాఱు వర్గములుగా విభజించెను. అందువలననే యాతనిసూక్ష్మబుద్ధి సంతతజాగరూకతయు వెల్లడి యగుచున్నవి. అక్బర్ తన భోజనపానాదులను గుఱించి మిక్కిలి జాగ్రత్తతో వర్తించుచుండెను.

## సంస్కరణములు.

అక్బరుచేసిన సంస్కరణములలో మొట్టమొదటిది పక్షపాతములేక మతభేదమునెంచక తనప్రజలనందఱిని సమానముగాఁ జూచుట. అందులకుఁ బూర్వము హిందువులకు విధింపఁబడిన 'జజియా' పన్ను తీసివేసెను. సహగమనమును మాన్పెను. హిందువులలోని యతిబాల్యవివాహమును మాన్పుటకు యత్నించెను. పరమతమునెడల మహమ్మదీయులకుంగల దురభిమానమును నిషేధించెను. హిందూమహమ్మదీయపారసీకాది మతములఁ బరిశీలించి నూతనమతమొకటి స్థాపించెను. స్త్రీపునర్వివాహమును అభివృద్ధిచేయవలయు నని యత్నించెను.

## అక్బరుయొక్క ధర్మమతము.

మొదట నక్బరునకు మహమ్మదీయమతమునందు కొంత విశ్వాసము కలదు. కొమారుఁడు కలుగవలయు నని యాతఁడు అజిమీర్ పట్టణములోని పీరుకు మ్రొక్కి, మ్రొక్కు చెల్లించుటకు రెండువందలమైళ్లు నడచివెళ్లెను. కాని ౧౫౭౪ లో అబుల్ ఫజల్ అను వానితో స్నేహము కుదిరినప్పటినుండియు నాతనికి మహమ్మదీయమతమునందు నౌదాసీన్యము కలిగెను. పారసీకవర్షారంభమునందు నౌరోజాయను నుత్సవము చేయఁబడును. అట్లు చేయుట మహమ్మదీయగురువులకు ధర్మవిరుద్ధమని తోఁచినను, అక్బరు ఆయుత్సవములను జేయుచునేయుండెను. ఏడువారములును ఏడువర్ణముల దుస్తుల ధరించి, యక్బరు సప్తగ్రహములను బూజించుచుండెను. ఆతఁడు తన రాజపుత్రవంశపురాణు

లతోఁ గూడి యజ్ఞములను నితర హిందూధర్మవిధులను జేయుచుండెను.

ఆ కాలమందలి మతగురువులకు ఉల్మా లని పేరు. రాజసభలో వారికి మిక్కిలి గౌరవ ముండెను. రాజ్యములోని మతసంశయము లన్నిటినిఁ దీర్చు వారు వీరే యైనందున తమమతమును నంగీకరింపని జనులను వీరు మిక్కిలిబాధ పెట్టుచుండిరి. బాదుషాహ మతాభిమానమును వదలి పరమతముల ననుసరించుట చూచి వారికి మిక్కిలికోపము వచ్చెను. కాని వారుచేయు నక్రమములఁజూచి వారియెడ రాజునకును, ప్రజలకును తిరస్కారభావము కలిగెను.

అప్పుడు హిందూదేశమందలి మహమ్మదీయులలో షియా, సునీ, సూఫీ అను మూఁడుపథము లుండెను. ఒక పథమువారు మఱియొకపథమువారితోఁ బోరాడుచుండిరి. మనవారు కొందఱిప్పుడు వీరభోగవసంతరాయఁడు పుట్టు నని తలఁచినట్లు అప్పటి మహమ్మదీయులు మతోద్ధారకుఁ డొక్కఁడు పుట్టు నని ప్రతిదినమును ఎదురుచూచుచుండిరి. వీరుగాక పశ్చిమసముద్రమున నున్న పోర్చుగీజ్ రాజ్యమైన గోవాపట్టణములో రోమన్ క్యాథలిక్ క్రైస్తవ మత గురువులు తమమతమును బోధింపసాగిరి. ఉత్తరహిందూదేశమున గురునానక్ అనువాఁడును కబీర్ అనువాఁడును రామరహీము లిద్దఱును ఒక్కటియేయని ప్రతిపాదించు నూతనపథముల నేర్పఱిచిరి.

## మతములస్థితి.

పైని వర్ణింపబడినట్లుండఁగా షేక్ ముబారిక్ అను మహమ్మదీయుఁడు మత సంస్కారణము బోధింపసాగెను. అతఁడు మొదట సునీపథములోని వాఁడు. ఉత్తరహిందూదేశమంతయుఁ దిరిగి యనేకగురువులయొద్ద విద్యాధ్యయనము చేసి ప్రాణముగల జ్ఞానభాండారమని బిరుదువహించెను. కొన్నిదినములకు సునీపథమును విడిచి షియాపథమును స్వీకరించి యాగ్రాపట్టణములో రాజు వలనఁ గొంతసహాయము వడసి కాపురముండెను. అచ్చట నధ్యాపకుని పని చేయుచుండెను. ఇతనికి ౧౫౪౭లో అబుల్ ఫైజీ యను పెద్ద కొమారుఁడును

౧౫౫౧లో అబుల్ ఫజల్ అను చిన్నకొమారుఁడును పుట్టిరి. ఇతఁడు సంస్కరణాభిలాషి యగుటచే ధర్మగురువు లితనిని పతితుఁడనియెంచి బాధలుపెట్టసాగిరి. ఇందుచే నితఁ డచ్చటనుండి పాఱిపోయెను. ఇతనికుమారులు మాత్రమాగ్రాలోనే యుండిరి. వారప్రతిమవిద్వాంసులై యప్పటిజనులకు నెంతయు వంద్యులైరి. పెద్దవాఁడగు ఫైజీ సూఫీపథములోని విఖ్యాతకవియు, నీశ్వర



అక్బరుయొక్క మహలు.

భక్తుఁడును అయ్యెను. ఎల్లప్పుడు నేదియో యోచించుచునే యుండును. ఒకప్పుడు పుష్పముల సువాసనాసౌందర్యములందు నిమగ్నుఁడై చక్కని కవిత చెప్పుచుండును; మఱియొకప్పుడు భక్తిపురస్సరమైన యీశ్వరస్తవము చేయుచుండును. అతనిచే రచింపఁబడిన పద్యము లక్బరుచెవినిఁబడఁగా నాకవినిఁ బిలిపించుకొని యాబాదుషాహ తనయొద్ద నుంచుకొనెను(౧౫౭౪). అప్పుడు ముబారిక్ తనకుమారులయొద్దికి వచ్చెను.

ముబారిక్ యొక్క రెండవకుమారుఁడగు అబుల్ ఫజల్ అప్రతిమ విద్వాంసుఁడు. అనుపమేయ లౌకికవ్యవహారదక్షుఁడు. బాదుషాహకును ఇతనికిని

స్నేహముకలిగి యది మిక్కిలి దృఢమయ్యెను. ఇతని యుపదేశమువలననే యక్బరునకు సకలమతములయందు సమానభావముకలిగెను. మొగల్ చరిత్రయను నభోమండలమునందు అక్బర్, అబుల్ ఫజల్ అను వారిద్దఱును సూర్యచంద్రులవంటివారు. ఆకాలమునందలి యితరపండితులకంటె వీరిరువురును దూరదృష్టియు, నౌదార్యమును, పరమతసహిష్ణుతయు, తత్వజ్ఞానమును గలిగియుండిరి.

అబుల్ ఫజల్ కును, అక్బరునకును స్నేహముకలిగినప్పుడు బాదుషాహ యొక ధర్మసంకటములో మునిఁగియుండెను. ఆగ్రాపట్టణములోని సునీమతస్థులగు న్యాయాధీశు లనేకజనులకు షియామతమును స్వీకరించినందులకై దేహాంతశిక్ష విధించియుండిరి. ఆశిక్ష ననుసరించి వారిని వధింపుమని అక్బర్ బాదుషాహను పీడింపసాగిరి. ఈధర్మాధికారులందఱును మతగురువులైనందున వారిమాటతీసివేయుటకు బాదుషాహ భయపడుచుండెను. కాని యన్యమతమును స్వీకరించినందులకై జనులనువధించుట దోషమని తలఁచుచుండెను. ఇట్లక్బరేమి చేయుటకును దోఁపకయుండఁగాఁ జనచంద్రికి శత్రువులగు ఉల్మాలను సాధించి వారియధికారమును రూపుమాపుట కిది మంచిసమయముకదా యని తలఁచెను. కాని స్వానపహారకుఁడగుటచే నొకయుక్తిని బన్నెను. బాదుషాహ యెదుట నుల్మా లందఱును దమతమపాండిత్యములను గనఁబఱచుచు ధర్మవిషయమై తమకుఁగల మతభేదములను గుఱించి వాదవివాదములు జరుగునట్లేర్పాటుచేసెను.

## మతవివాదసభలు.

ఈసభలు జరుగుటకై యక్బర్ ౧౫౭౫ లో ఫతేపూర్ సిక్రీపట్టణమునందు భవ్యమైన మందిరమొక్కటి కట్టించెను. అందుఁ బ్రతిగురువారమునాఁడును ఉల్మాలందఱును తమతమ మతములఁ బ్రతిపాలించుచుండిరి. ఆవాదములలోఁ బ్రశ్నలడుగు నధికారము అబుల్ ఫజల్ కును, తీర్పుచెప్పు నధికారమక్బరునకును నుండెను. వాదవివాదసభలోనికిఁ గ్రమక్రమముగా నన్య మత

స్థులును రాసాగిరి. ఆసభ చతుశ్శాలలుగా విభజింపఁబడి, యొక్కొక్క శాలలో నొక్కొక్కమతమువారు గూర్చుండుచుండిరి. ఇతరజనులును వచ్చి యుపన్యాసముల వినుచుండిరి. ప్రశ్నలడిగి యబుల్ ఫజల్ వాదమును ప్రారంభించును. బాదుషాహ గాంభీర్యముతో వాదమంతయు వినుచుఁ జక్కఁగ సంభాషించినవారినిఁ గొనియాడుచు బహుమతు లొసంగుచుండెను. సున్నీ, షియా, సూఫీయనుమహమ్మదీయమతస్థులును బ్రాహ్మణ, బౌద్ధ క్రైస్తవ, యహూది, పారసీక మతగురువులును తమతమ మతాధిక్యతను ప్రతిపాలింపసాగిరి. ప్రతి వాఁడును భయమునువిడిచి స్పష్టముగ తనయభిప్రాయములఁ దెలుపుచుండెను. ఒక్కొక్కపర్యాయము వాదవివాదము చేయువారు బిగ్గరగా నఱచి యొకరి నొకరు తిట్టుకొని యల్లరిచేయుచుండిరి.

కొన్నిదినములవఱకు వాదవివాదములు జరిగినతరువాత మహమ్మదీయ మతాధికారులకు నొక రెండుగ్రంథములలోని యంశములుతప్ప మఱేమియుఁ దెలియదని యక్బరునకుఁ దెలిసెను. ఆమతాధికారులలోను మతవిషయమై యొక సత్యము లేదని యాతఁడు కనుఁగొనెను. అందుచే నాతనికి వారియందుఁగల శ్రద్ధ తగ్గెను. అంతకుముందే మతవిషయమై మొల్లాలందఱును గలిసి చెప్పినయంశము నందఱును నొప్పుకొనుచుండిరి. ఇఁకమీఁద వారిలో వారికి మతభేదము కలిగినప్పుడు బాదుషాహ చేయుతీర్పు నొప్పుకొనవలయునని యక్బర్ నియమించెను. వారందులకు మొదట నొప్పుకొనకపోయిరి. కాని విధి లేక తుదకు నొప్పుకొనుచు కాగితముమీఁద సంతకములు చేసిరి (౧౫౭౯). ఇట్లు మతవాదవివాదములు ప్రారంభించిన నాలుగు సంవత్సరములలో మహమ్మదీయధర్మగురువుల యధికారమంతయు లోపించి యబుల్ ఫజల్ కోర్కెకొనసాగెను. క్రమక్రమముగా మహమ్మదీయమతమునందలి శ్రద్ధ పోయి కొన్నిదినములవఱకు క్రైస్తవమతమునందు నభిమానము కలిగెను. గోవాపట్టణమునుండి క్రైస్తవమతగురువులు వచ్చి యాతనికి బైబిలుగ్రంథము బోధించిరి. దాని

నాతఁడు శ్రద్ధతోఁజదివెను; వారిని గౌరవించెను; వారికి భజనమందిర మొకటి కట్టి యిచ్చెను. కాని క్రైస్తవదీక్షనుమాత్రము స్వీకరించినవాఁడుకాఁడు. ఇట్లన్నిమతములను పరిశోధించి సకలమతసారమగు నొక నూతనమతమును స్థాపించెను.

## నూతనమతస్థాపన.

కొన్నిరాజకారణములవలన నక్బర్ ౧౫౮౫ లో ఆగ్రాపట్టణమును వదలి లాహోర్ పట్టణమును రాజధానిగాఁ జేసికొనెను. అంతకుఁ బూర్వమే యొక నూతన మతమును స్థాపించెను. ఆమతమునకు 'దీనె ఇలాహి' యని పేరు పెట్టెను. సృష్టిలోని చమత్కారములను జూచి సృష్టికర్తయొక్క మాహాత్మ్యమును గనుఁగొన వలయు ననెడి సిద్ధాంతము ననుసరించి యీనూతన మతమేర్పడియె. లాహోరు పట్టణమునకుఁ బోయినతరువాత, నక్బరు మహమ్మదీయమతమును బహిరంగముగా వదలి, నూతనమతమును లోకులకు బోధ చేయసాగెను. అందుచే మహమ్మదీయు లాతనిని ద్వేషింపసాగిరి. అతఁడనేకములగు మసీదులను గుఱ్ఱపుశాలలుగా మార్చెను. హిందువులమీఁదిజిజియాపన్ను తీసివేసెను. రాజసభలో జాతినిబట్టిగాని, మతమునుబట్టిగాని యదివఱకు సరదారులలో నుండిన భేదము మాన్పెను. ప్రాతఃకాల, మధ్యాహ్న, సాయాహ్నములను, త్రికాలములయందు సూర్యోపాసన చేయుచుండెను. సంవత్సరమున కొకసారి నూతనాగ్నిని వేల్చి పూజించెను. ఈనూతన మతమునకు నక్బరే యాచార్యుఁ డయ్యెను. అంతకుఁ బూర్వము రాజమందిరములో జరుగుచున్న మహమ్మదీయ మతసంబంధమైన యుత్సవముల నాపివేసెను. పారసీకశకమును, ఉత్సవములును తనరాజ్యములోఁ బ్రారంభించెను. గోహత్య, గోమాంస భక్ష్యముల వర్జించెను. గడ్డము పెంచుట, పినతండ్రికొమార్తెను వివాహమాడుట మొదలగు మహమ్మదీయుల యాచారముల నిషేధించెను. ౧౫౮౩లో తిలకము ధరింపఁ దొడఁగెను. నూతనమతమును స్వీకరించిన వారికి 'అల్లాహోఅక్బర్'

అను మంత్రమును బోధించుచుండెను. ఈవాక్యములోని అక్బర్ శబ్దమునకు రెండర్థములు గలవు. అక్బరనఁగా గొప్పవాఁడని యర్థము; అక్బరనఁగా బాదుషాహ పేరు. కావున నావాక్యమునకు 'ఈశ్వరుఁడు గొప్పవాఁడు' 'అక్బరే యీశ్వరుఁడు' అని రెండర్థము లగుచుండెను. క్రొత్తగా నక్బరుచే నేర్పఱుపఁబడిన మతమును స్వీకరించినవారి పేళ్లు అబుల్ ఫజల్ వ్రాసి యుంచినాఁడు. అందు బీరబల్ అను హిందూమంత్రియొక్క పేరు కానవచ్చుచున్నది. ఈనూతన మతస్థాపనమునకు బీరబలుఁడే బాదుషాహను ప్రోత్సాహపఱిచెను. ఇతని బోధనలననే యక్బరునకు సూర్యోపాసనయందు శ్రద్ధకుదిరెను. పొలములలోని పైరులు, తోఁటలలోని ఫలవృక్షములును, సకలప్రాణికోటికి జీవనాధార మైన ప్రకాశమును, సూర్యునివలననే మనకుఁ గలుగుచున్నందున నాతఁడీశ్వరాంశమని యితఁడు బాదుషాహకు బోధించెను. అట్లే యగ్ని, జలము, ధేనువు, వృక్షములు మొదలగువానియందు నీశ్వరాంశమున్న దని యీతని సిద్ధాంతము.

ఇట్లక్బరు నూతనమతమును స్థాపించి యందులకుఁ దాను మతగురువైనను, తన మతమును స్వీకరింపుఁడని జనులను బాధపెట్టినవాఁడు కాఁడు. పరమత సహిష్ణుతయే పరమధర్మ మని యాతని తాత్పర్యము. 'ధర్మ మతములనుగుఱించి జనులను బాధపెట్టినందున లాభము లేదు. బాధ కలిగినంతవఱకు జనులు తమ మతముల దాఁచియుంచెదరు. బలవంతపఱిచినందున లోకుల నిజమైన యభిప్రాయము మాఱనేరదు' అని యబుల్ ఫజల్ వ్రాసెను. ఇది యక్బర్ మతము.

పరమత సహిష్ణుతలోను, ఇతరవిషయములలోను అక్బరును అశోక చక్రవర్తితోఁ బోల్చవచ్చును. తండ్రి పోయినపు డుభయులును శత్రువులతోఁ బోరాడుచుఁ బంజాబులో నుండిరి. తరువాత రాజ్యములోని కల్లోలముల నణఁచి, రాజ్యమువిస్తారము చేయుటకు నుభయులకును గొంతికాలము పట్టెను.

నర్మదానదికి నుత్తరమందున్న హిందూదేశమంతయు నుభయులకును బూర్తిగ స్వాధీనమయ్యెను. పరమత సహిష్ణుత, తామే శ్రేష్ఠుల మనుకొనిన మతగురువుల గర్వమడఁచుట, యనేకమతముల పండితుల వాదవివాదములఁ జూచుట, మాంసాహారమును వర్జించుట యనువిషయము లీయుభయచక్రవర్తులకును సమానముగాఁ జెల్లును. అక్బర్ యొక్క పరమత సహిష్ణుతను గుఱించి యాంగ్లకవివరుఁడగు టెనిసన్ ఇట్లు వ్రాసియున్నాఁడు: 'పరమతస్థుల బాధపెట్టుట మాని, సకలమతముల సమానభావముతోఁ జూచి యక్బర్ మన ట్యూడర్ వంశపు రాజులకు సిగ్గు వచ్చునట్లు చేసెను.'

## అక్బర్ గుణావగుణములు.

మొత్తముమీఁద నీ బాదుషాహ యప్రతిమరాజు అని చెప్పుటకు సందేహము లేదు. ఈతనియందు ననేకవిశేషగుణము లుండెను. 'వినవలె నెవ్వరు సెప్పిన। విని నంతనె తమకపడక వివరింపవలెన్। విని కని వివరము తెలిసిన। మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో వేమా॥' యను పదములోని తత్త్వము నీ బాదుషా చక్కఁగ నెఱిఁగియుండెను. ఒకరి యనుమతి ననుసరించి పోవుట రాజులలో నుండు సాధారణదుర్గుణము. అది యీతనియందు లేదు.

బాణసంధానమునం దీతఁడు నిపుణుఁడు. ఖడ్గముతోఁ బోరాడుటయందుఁ జారీణుఁడు. ఈతనికి 'సంగ్రామ' మనుకత్తిగలదు. దానితో నీతఁడు వేలకొలఁది శత్రువులను సంహరించెను.

అక్బరునకుఁ జిన్ననాఁడు విద్యనేర్పనందున సింహాసనారూఢుఁ డగు సమయమున నాతనికిఁ జదువుటయు, వ్రాయుటయు రాదు. తరువాత నాతఁడు విద్యనేర్చెను. అనేకగురువులయొద్ద ననేకశాస్త్రముల నభ్యసించెను. దేశచరిత్రలు చదువుటయందు నతనికి మిక్కిలియభిలాష గలదు. ప్రతిపుస్తకమును మొదటినుండి తుదవఱకుఁ జదువును. ప్రతిదినమును ఒకవిద్వాంసుఁ డాతనికిఁ బుస్తకములఁజదివి వినిపించును. దిన మేపుటవఱకుఁ జదువునో యాపుటము

మీఁద బాదుషాహ తేదివేసియుంచును. కొన్నిగ్రంథము లాతఁడు మరల మరలఁ జదువును.

ప్రజలకు న్యాయము కలుగఁజేయవలయు నని యాతఁ డెల్లప్పుడును తత్పరుఁడై యుండును. తానున్న గ్రామములోని గొప్పవ్యాజ్యము లన్నియుఁ దానే విచారించును. రాజు సమ్మతిలేనిది కఠినశిక్షలు ప్రజలకు విధింపఁబడఁగూడదని యాతని శాసనము. మూఁడు పర్యాయములు బాదుషాహ తన సమ్మతిని గనఁబఱుపనిది యెవ్వరికిని దేహాంతశిక్ష విధింపఁబడుటకు వీలు లేక యుండెను. ప్రతిదినమును ఒక్కసారి రాజసభ జరుగును. అందు నక్బర్ తన ప్రజలమొఱ లాలకించును; వారొసఁగిన కట్నములను కానుకలను స్వీకరించును. ఇట్టి సమయములయందు నాతఁడు సింహాసనము మీఁదఁ గూర్చుండక ప్రక్క నిలిచియుండును. జనసామాన్యమును అతఁడు మిక్కిలి ప్రేమతోఁ జూచును. గొప్పవారగు సరదారులుమాత్ర మాతనికి భయపడుచుందురు. అతిని యంతఃకరణమునందుఁ గాఠిన్య మృదుత్వము లను విరుద్ధగుణములు నివసించియుండెను.

రాజ్య వ్యవహారమునకు సంబంధించిన యనేకవిద్యల నక్బర్ నేర్చియుండెను. తుపాకులు, ఫిరంగులు మొదలైన యుద్ధసాధనములఁ జేయుట యెఱిఁగి కోటయొక్క యావరణములో ఫిరంగులఁజేయు కర్మశాల యొకటి స్థాపించి, తన కనుల యెదుట నాపనులఁ జేయించుచుండెను. అచ్చటఁ జేయఁబడిన ప్రతిఫిరంగికిని నొకపేరు పెట్టెను.

పౌరుష సూచకములగు కుస్తీపట్లు, కసరత్, వేఁట మొదలైన యాటల యెడ బాదుషాహకు విశేషప్రీతిగలదు. వేఁట నిమిత్తమై యనేకములైన గుఱ్ఱములను, ఏనుఁగులను, లొట్టిపిట్టలను పెంచి వానికి నావశ్యకమైన విద్యల నేర్పెను. ఆ మృగముల నన్నింటికి వేర్వేఱు పేళ్లు పెట్టి యాపేళ్లతో వానిని గుర్తించుచుండెను. చిఱుతపులులకుఁగూడ వేఁటాడుట నేర్పఁబడియుండెను.

అక్బర్ రాత్రిసమయములందు మూఁడుగంటలకాలము మాత్రము శయనించును. పగలు కొద్దికాలము నిద్రపోవును. మిగిలిన కాల మంతయు రాజ్యకార్యమునందునో, విద్వద్గోష్ఠియందునో కడపుచుండును.

తానుచేసిన ప్రతికార్యమును వ్రాసి యుంచుటకు నక్బర్ కొందఱు లేఖకుల నేర్పఱిచెను. ఈ లేఖకులకు బాదషాహీతవారీఖు లనిపేరు. పెద్దపెద్ద పట్టణములలోను, ఇతర గ్రామములలోను జరుగు వర్తమానములఁ దెలుపుటకుఁ గొంద ఱధికారుల నియమించెను. రాజమందిరములో నొక గంటకట్టి దాని గొలుసుచివర వీథిలో నుండు నట్లేర్పాటుచేసెను. బాదుషాహయొద్ద మొఱ్ఱ పెట్టుకొనఁ దలఁచినవారు దానిని లాగినఁ జాలును. బాదుషాహ ప్రత్యక్ష మగుచుండెను.

అక్బరునకు మిక్కిలి శోధకబుద్ధి కలదు. ఎంతయో ధనము వ్యయముచేసి యాతఁడు గంగానదియొక్క యుగమమును గనుఁగొనెను. మానవునికి నీశ్వరభక్తి జన్మతః స్వాభావికముగాఁ బుట్టునని కొందఱును, చుట్టునున్న తలిదండ్రులు మొదలయినవారు నేర్పినందున మానవునికి నీశ్వరభావము పుట్టును గాని యది స్వాభావికము కాదని కొందఱును వాదించుటఁ జూచి, నిజముఁ గనుఁగొను నిమిత్తమై యిద్దఱు బాలురను పుట్టినప్పటినుండియు నేకాంతమందుంచి వారికి నాహారము మాత్రము పెట్టించుచు, మనుష్య సంసర్గము లేకుండఁ జేసెను. కాని తుదకు నా శిశువులు మూఁగవారైనందున నేమియుఁ గనుఁగొనుటకు వీలు లేకపోయెను.

## కొన్ని దుర్గుణములు.

చరిత్రకారులకుఁ బక్షపాతముతోఁ బనిలేదు. ఉన్నది యున్నట్లు వ్రాయుట వారిపని కావున నీమహాపురుషునియందుఁ గలదుర్గుణములఁ గొన్నింటి నిచ్చటఁ జేర్కొన వలసియున్నది. ఒకప్పు డీ బాదుషాహ క్రూర స్వభావమును గనఁబఱుచుచుండెను. తన సేవకులు చిన్న చిన్న పనులలోఁ జొరఁ

బడినను వారి కనేకపర్యాయములు దేహాంతశిక్ష విధించెను. మతాంతర మును స్వీకరించిన తరువాత మహమ్మదీయులను మిక్కిలి నిష్ఠురభావముతోఁ జూచుచుండెను. చిత్తోడ్ గడమును స్వాధీనముచేసికొనిన తరువాత నచ్చట నున్న నిరపరాధులగు స్త్రీ వృద్ధాను బాలకులను గూడ నశింపఁజేసెను. రాజ్యమునకు వచ్చిన తరువాతఁ బదునెనిమిదవయేట రెండువేలజనుల శిరస్సులఁద్రుంచి యొక గుట్టగాఁ జేర్పించెను. కాని యివి యన్నియుఁ బూర్వవయస్సులోఁ జేసిన పనులు. అబుల్ ఫజల్ తో స్నేహము కుదిరిన తరువాతఁ గ్రమక్రమముగా నాతని స్వభావము మాఱెను. ఈవిషయమందును మన మీచక్రవర్తిని అశోక చక్రవర్తితోఁ బోల్పవచ్చును.

అక్బర్ బాదుషాహయందు మఱి యొకదుర్గుణ ముండెను. ఆతఁడు కొంతవఱకు విషయలంపటుఁ డనవచ్చును. ఆతనికి ననేకభార్యలు కలరు. పదు నొకండ్రకంటె నధికభార్య లుండిరని చరిత్రలవలనఁ దెలియుచున్నది. అయి నను నాతఁడు పరస్త్రీల నభిలషించుచుండె నని యీ క్రింది కథానకము వలనఁ దెలియుచున్నది.

## నౌరోజా డేర్స్.

అక్బర్ సకలజనులకును, దనకును మనోరంజనము గలుగుటకై ప్రతి సంవత్సరము తన నగరము నందుఁ గొన్ని దినములు గొప్పయుత్సవములు జరపు చుండెను. ఆ యుత్సవము తుదిదినమునం దచట సర్వము స్త్రీమయముగానే చేయఁబడుచుండెను. ఆ స్త్రీ ప్రపంచములో ఆడువారును, పాడువారును, అమ్ము వారును, కొనువారును, ఇతర మైనయుత్సవములఁ జేయువారును, చూచు వారును అందఱు స్త్రీలే! ఆ దినము పురుషులకు ఆ యుత్సవము జరుగుచున్న స్థలమునకు వెళ్లుటకు ననుజ్ఞ లేక యుండెను. కాన నాఁటిదినము బాదుషాహ యొక్క యంతఃపురము నందలి స్త్రీలును, ఇతర రాజపత్నులును ఆయుత్సవము నందు నిరాతంకముగాఁ దిరుగుచుండిరి. అచటికిఁ బురుషు లెవ్వరును రాకుండ

కట్టు దిట్టములు చేయఁబడినను అక్బరుమాత్రము స్త్రీవేషమున నచట నితరుల కెఱుఁగ రాకుండునట్లు సంచరించుచుండెను.

“ఆయుత్సవమునకు నొక సంవత్సరము పృథివీరాజుభార్య వచ్చెను. కాని యా యుత్సవమునవలన నామె కెంతమాత్రము సంతోషము కలుగలేదు. ప్రచ్ఛన్న వేషముతో నుండిన బాదుషాహ యత్యంతరూపవతియగు నామగువను గని మిగుల మోహితుఁడై, యామె మఱలి వెళ్లు మార్గమున నామె రాక నిరీక్షించు చుండెను. ఇంతలో నాసాధ్వీమణి మఱలి తన నగరునకుఁ జనుట కై బాదుషాహకాచుకొని యుండిన మార్గమునఁ బోవఁ దొడఁగెను. అట్లు వచ్చు నుందరిని నకస్మాత్తుగా నా డిల్లీశ్వరుఁ డరికట్టెను. తన్ను నరికట్టినవాఁడు అక్బరనియు, దురుద్దేశముతో నాతఁ డట్లుచేసె ననియు నాకాంత తెలిసి కొనెను. అంత నామె తనవలెనే యితర స్త్రీల నెందఱినో కపట స్త్రీవేష ధారియగు బాదుషాహ చెఱుప యత్నించి యుండు నని తలఁచి క్రోధావేశ పరవశురాలయి మిగుల రోషముతోఁ గన్నులనిప్పులురాల తనగుప్త ఖడ్గమును చేతధరించి మిగుల ధైర్యముతో “పవిత్రమగు క్షత్రియవంశమును కలంకమయము చేయఁ దలంచిన దుష్టుని బారినుండి నాపాతివ్రత్యమును సంరక్షించుకొని యా ద్రోహిని నాచేతిఖడ్గమునకుఁ బలి యియ్యఁగలను” అని పలికెను. ఇట్లు గంభీరస్వరముతోఁ బలికిన ధైర్యవతిపలుకులు విని బాదుషాహ కొంతపడి చిత్రప్రతిమవలె చేష్టలుదక్కి నిలువఁబడి, తదనంతర మాతఁడు విజ్ఞానవంతుఁ డగు ప్రభువగుటచేఁ దన యజ్ఞానమునకు సిగ్గుపడి, యా కాంతకు నమస్కరించెను. నాఁటినుండియు బాదుషాహపశ్చాత్తాపపరుఁడై యామెను తన సహోదరినిగా నెంచుచుండెను”.

ఇట్టిదోషములు కొన్ని యున్నను అక్బరునందు సద్గుణములు విశేష ముగా నుండుటవలన ‘ఏకోహిదోషో గుణసన్నిపాతే, నిమజ్జతీందోః కిరణేష్వి

వాంకః' అను కాళిదాసోక్తి ననుసరించి యాతనిని మహాపురుషుఁ డని చెప్ప వలసియున్నది.

## దినచర్య.

రాజభవనమునకు వెనుకభాగమున నొకగవాక్ష ముండెను. ప్రతిదినము ప్రాతఃకాలమున బాదుషాహా యాగవాక్షము నొద్దికివచ్చి సూర్యునిఁ బూజించును. అప్పు డక్బరును పూజించుటకై యసంఖ్యాజనులు గూడుదురు. ఆ పూజావిధానము పూర్తియైన రెండు మూఁడుగంటల తరువాత బాదుషాహా యాగవాక్షము నొద్దికివచ్చి క్రింద జరుగుచున్న కుస్తీపట్లను, సైన్యముల వ్యూహరచనాకౌశలమును పరీక్షించును. మధ్యాహ్నము రాజసభకుఁ బోవును. అచ్చట సింహాసనముపై నెక్కి న్యాయవిచారణ చేయును. ఆ సభయందే పరదేశములనుండి వచ్చిన రాయబారులను, తన మాండలికరాజులను, సర దారులను గౌరవించును. సాయంకాలమందు రహస్యమందిరములో నాప్తసచి వులతోడ మంతనము చేయును. ఈరహస్యమందిరమునకు ఘుసాల్ ఖానా యనిపేరు. ఆవశ్యకము లైన రాజవిషయములు చర్చకు లేనప్పుడు ఇతర విష యములను చర్చించును.

## చిత్రకళాభిరుచి.

చిత్తరువులు వ్రాయు విద్యనుగురించి యక్బరునకు మార్మికజ్ఞానము కలదు. చిత్రకారుల ననేకులరావించి గౌరవించి యావిద్యను అభివృద్ధి పఱిచెను. వారమున కొక్కసారి చిత్రకారులు తాము వ్రాసినపటములను బాదుషాహా యొద్దికిఁ బంపుదురు. వానియోగ్యత ననుసరించి యాతఁడు వారికిఁ బహు మతులొసంగును. అతని యాస్థానమునందు విఖ్యాతిఁజెందిన చిత్రకారులు పదునెనిమిదిమంది యుండిరి. పుస్తకములలో వర్ణనసంబంధమైన పటములఁజేర్చి పుస్తకముల శోభయు, ఉపయోగంబును నభివృద్ధిచేయు నాచారము నక్బ రుచేఁ బ్రారంభింపఁబడియె. తనరాజసభలోని ప్రఖ్యాత పురుషులపట

ములఁ దీయించి యొక పుస్తకముగాఁ గట్టించెను. 'పరమేశ్వరుని నెఱుంగు విశేష సామర్థ్యము చిత్రకారులకుఁ గలదు. ఒకానొకమనుష్యుని ప్రతిమ వ్రాసి యందు జీవముఁబోయు సామర్థ్యము తనకు లేదనియు, ఈశ్వరునకుమాత్రము గలదనియుఁ జిత్రకారుఁడు చక్కఁగ నెఱుంగును. అందుచే నీశ్వరునిసామర్థ్య మాతనికి బాగుగఁ దెలియును' అని యక్బర్ వ్రాసియున్నాఁడు. సంగీత విద్యయందుఁ గూడ నాతఁడు ప్రవీణుఁడు.

## విద్యాభిరుచి.

అక్బర్ ప్రతిదినమును గ్రంథములు చదివించి వినుచుండె నని వెనుక వ్రాసి యున్నాము. అట్లాతఁ డరబ్బీ పారసీకభాషలలోని గ్రంథములన్నియుఁ జదివె నని చెప్పినను జెప్పవచ్చును. ఎట్టి కఠినగ్రంథమునైనను అన్వయించి యర్థము చెప్పఁ గలిగినట్టిసాహిత్యజ్ఞాన మాతనికి నాభాషలలోఁ గలిగెను. అనేక సంస్కృతగ్రంథములను, గ్రీకు గ్రంథములను పండితులచేఁ బారసీక భాషలోనికి భాషాంతరీకరింపఁ జేసెను. బదావ్గానీ యనుపండితుఁడు రామాయణ మహాభారతములను అక్బరుకొఱకుఁ బారసీభాషలో వ్రాసెను. అక్బరు నొద్ద గ్రంథసంగ్రహముకూడ విశేషముగా నుండెను. ఫైజీ యనుపండితుని యొద్ద ౪౬౦౦ గ్రంథములుండెను. అక్బరునొద్ద నంతకంటె నెక్కుడు గ్రంథములుండె నఁట! అక్బరు నా స్థానమునందు ననేకపండితులును కవులును ఉండిరి. అందు అబుల్ ఫైజీ, అబుల్ ఫజల్, బదావ్గానీ యనువారు ముఖ్యులు. అతనిసభలో ౩౪మంది షేక్ అను సాధువులు, ౬౯ మంది విద్వాంసు లగు పండితులును, ౧౫మంది వైద్యులును, ౧౫౩ మంది కవులును నుండిరి.

## శరీరసామర్థ్యము.

అక్బర్ మిక్కిలి పొడుగువాఁడును గాఁడు, మిక్కిలి పొట్టివాఁడును గాఁడు. విశాలమైన వక్షస్థలమును, దీర్ఘబాహువులును గలవాఁడు. మిక్కిలి శరీర సామర్థ్యమును, ధైర్య సాహసములును గలిగియుండెను. మావటివానిని

జంపి పాఱిపోవు నేనుఁగుమీఁద చంగు మనియెగిరి కూర్చుండి దానిని వశ పఱుచుకొనును.

## వైభవము.

మిక్కిలి విశాల మైనరాజ్యమునకు నధిపతి యై యందులకుఁ దగినట్లు అక్బర్ మహావైభవమును అనుభవించెను. అతఁడు రాజ్యములోఁ దిరుగు సమయమున నాతనివెంట నుండు శిబిరమును జూచినయెడల నది గదలుచున్న యొక మహాపట్టణమువలెఁ గాన్పించును. అక్బరుయొక్క వైభవమునుజూచి గోవానుండి వచ్చిన క్రైస్తవమతగురువు లచ్చెరువొందిరి. అతఁడు లాహోర్ పట్టణమునకుఁ బోవునపు డతనివెంట నైదువేలయేనుంగు లుండెను. ఆయేనుఁగుల ఫాలభాగమునకు నినుముతోఁ జేయఁబడిన పలకలును, తొండమునకు కత్తులును, దంతమునకు చిన్న కత్తులును కట్టఁబడియుండెను. ఒక్కొక యేనుఁగుమీఁద నలుగురు చాపధారులుగాని, తుపాకీవాండ్రుగాని కూర్చుండి యుండిరి. గోనా వాండ్రిట్టి వైభవమునుజూచి దిగ్భ్రమఁజెందిరి.

## కొద్దిలో స్వభావవర్ణన.

మొత్తముమీఁద విచారించిచూడఁగాఁ బ్రజాహితమునకై పాటుపడిన నృపశ్రేష్ఠులలో నక్బరొకఁ డనుటకు సందేహములేదు. అందఱి యంతః కరణములను ఆకర్షించుకొనుటకు బాదుషా రేయుంబగలు యత్నించుచుండును. ఎన్ని సంకటములు వచ్చినను మనస్సు చలింపనీయక యెప్పుడును సంతోష వృత్తి కలిగియుండును. పరమేశ్వరునికి నిష్టమగు సత్ప్రవర్తనయే కలిగియుండును. తత్త్వజ్ఞానవిషయమైన గహనవిచారములలో నెల్లప్పుడును మగ్నుఁడై యుండును. ఎవ్వఁడువచ్చి యేమిమొఱ్ఱ పెట్టుకొనినను సావధానచిత్తుఁడై వినును. కోపము వచ్చినప్పుడు తగనిపనులను చేయఁడు. అతఁ డనేకశారీరక మానసికనిబంధనములను ఏర్పఱచుకొనెను. లోకులు తన్ను ఆక్షేపింపఁగూడ దని తనబాహ్యాచరణమును గుఱించి అతఁడు మిక్కిలి దక్షుఁడై యుండెను.

ఎట్టిజాతి మతములు గలవారినైనను జూచి పరిహసింపఁడు. చేయఁదలఁచిన పనిని పూర్తిగఁ జేయునేకాని సగముచేసివిడువఁడు. మరలమరల నీశ్వర ధ్యానముఁజేసి తన ప్రవర్తనము పరిశుద్ధముగ నున్నదోలేదో పరీక్షించుకొనును. అందఱుజనులకు సుఖము కలుగఁజేయవలయునని కోరుచుండును. కావున విశేషముగా దేహాంత శిక్షలు విధింపఁడు. ప్రతిదినము రెండుసారులు సకల జనులకుఁ గాన్పించును. నడిమి వారెవ్వరు నక్కఱలేకయే లోకుల కష్ట నిష్ఠూరముల వినును. లోకులను సంతుష్టులఁజేయుట తన సుఖమునకు ముఖ్య సాధనమని యెంచును; అని ఐనెఅక్బరీ అనుగ్రంథములో అబుల్ ఫజల్ వ్రాసి యుంచినాఁడు.

## మోగల్ రాజ్యమును స్థిరపఱచుట.

అక్బర్ చేసిన మహాకార్యములలో రాజ్యమునందుఁగల భిన్నజాతుల వారినందఱినిఁ జేర్చుకొని వీలయినంతవఱకు వారికి నైక్యమును, రాజ్యమునందు నభిమానమును గలుగఁజేసి మోగలరాజ్యమునకు స్థైర్యముకలుగఁజేయుట ముఖ్య మైనది. మోగలులు, అఫ్గానులు, రాజపుత్రులు మొదలయిన వీరుల నందఱినిఁ జేర్చి మహావైభవోన్నతులచే శోభిల్లు మోగలసామ్రాజ్యమును స్థాపించెను. అంతకుఁ బూర్వపు మహమ్మదీయరాజ్యములన్నియు క్షణజీవితములు కలవి. ప్రజలకు బోధ కలుగఁజేయునవి. ప్రజాహితమునందె లక్ష్యముగల యీసా మ్రాజ్య మట్టిదికాదు. మతవిషయిక స్వాతంత్ర్యమును పూర్తిగఁగలిగి ప్రజలు నిర్భయులై తమతమ కార్యములను నెఱవేర్చుకొనుచుండిరి. అందుచే దేశమభి వృద్ధి కాఁ దొడఁగెను. కలాకౌశలములు బాగుపడెను. వర్తక మభివృద్ధి యయ్యెను. అక్బర్ కుమారుఁడును, మనుమఁడును అగు జహాంగీర్ షాజహా నుల ప్రభుత్వకాలమందు నీసామ్రాజ్యవైభవము విశేషముగా హెచ్చెను. ఇట్లు లోకులను బాధపెట్టు క్షణభంగురమైన రాజ్యపద్ధతిని మాన్పి లోకక్షేమైక

దక్షతగల సుస్థిరసామ్రాజ్యమును స్థాపించిన యామహానుభావుని నెంత కొనియాడినను తక్కువయే.

ఈనూతన రాజ్యస్థాపనములో నాతఁడు ముఖ్యముగా రాజపుత్రుల సహాయమును నమ్మియుండెను. వారిసహాయములేనిది యీ దేశములో సుస్థిరరాజ్యమును బడయుట యసంభవమని యెఱిఁగి వారితో స్నేహముచేసెను. ఏఁబదిరాజపుత్రరాజు లాతనికి నెప్పుడును సహాయము చేయుచుండిరి. ఇట్లు హిందువులతో స్నేహమును, వారిని గౌరవించుటయు, హిందూమహమ్మదీయులయెడ భేదములేక పక్షపాతముచేయక యందఱిని సమానముగాఁ జూచుటయు నిచ్చట రాజ్యముచేయఁ దలఁచిన వారికుండవలసిన గుణమని యాబాదుషాహ సోదాహరణపూర్వకముగాఁ జూపెను.

## అప్పటి యూరోపు ఖండము.

అక్బర్ హిందూదేశములో రాజ్యముచేయుచున్నపు డింగ్లండులోరాజ్యము చేయు రాణిపేరు ఎలిజాబేత్. ఈమె ౧౫౫౮ మొదలు ౧౬౦౩ వఱకు రాజ్యముచేసెను. ఇంగ్లండ్ దేశములోను, యూరోప్ ఖండములోని యితర దేశములలోను ఆకాలమందు పరమతద్వేషము విశేషముగా నుండెను. క్యాథలిక్ పంథమువారును, ప్రాటెస్టెంట్ పంథమువారును, ఎవరికి వీలయినప్పుడు వా రితర మతస్థులను జంపుచుండిరి. ౧౫౭౨ లో సెంట్ బార్థోలోమి సంహారము జరిగెను. ౧౬౦౦ లో రోముపట్టణమందు బ్రూనో యనువానిని గాల్చిరి. లూథర్, కెప్లర్, మొదలయిన గొప్పవిద్వాంసులకుఁగూడ భూతప్రేతముల మీఁదను, మంత్రములమీఁదను, శేతపోళ్లమీఁదను నమ్మికయుండెను. ఈ విషయమై విచారించినను అప్పటిహిందూదేశము యూరోప్ దేశముకంటె శ్రేష్ఠమైన దనుటకు సందేహములేదు. అప్పటి యూరోప్ ఖండములోని రాజ్యవ్యవస్థను రాజులయొక్క ప్రజాహితతత్పరతను గుఱించి విచారించిన యెడల అక్బర్ రాజ్యమునకంటె హీనముగనే యుండెనని చెప్పవలసి

యున్నది. ఫ్రాన్సు దేశములోని ప్రజలు మిక్కిలి దరిద్రులైయుండిరి. ఇంగ్లండులోని ప్రజలుగూడ అక్బరుయొక్క ప్రజలకంటె నెక్కుడుసుఖము గలవారై యున్నట్లు కానరాదు. తనరాజ్యములోని యనేకము లైనపన్నులఁ దీసివేసియు రైతులకు నప్పిచ్చియు వలయునప్పుడు ధాన్య మొసంగియు నక్బరు ప్రజల రక్షించుచుండెను. ఈప్రజావాత్సల్య మెక్కడ? యూరోపు దేశములోని రాజులకును బ్రజలకును గలకలహములెక్కడ?

## అప్పటిజనులనీతి.

అబుల్ ఫజల్ తన యస్వితీయచరిత్రగ్రంథమగు ఐనెయక్బరీలో నాకాల మందలి హిందువులను గుఱించి యిట్లు వ్రాసియున్నాఁడు. 'మొత్తముమీఁద హిందూజనులు స్వధర్మనిరతులు, స్నేహపాత్రులు, విద్యార్జనరతులు, న్యాయ ప్రియులు, కృతజ్ఞులు, సత్యవాదులు, స్నేహయోగ్యులు, విశ్వాసపాత్రులు' అనుటకుసందేహము లేదు. పరకీయులను వారు మన్ననతోఁ జూతురు. కార్య నిర్వాహణమందు మిక్కిలి చిక్కతఁ గలిగియుందురు. ఇతరులవ్యవహారములో జోక్యము కలుగఁజేసికొనరు. యుద్ధములోనుండి పాఱిపోవుట యన నేమియో వారెఱుంగరు. ఈశ్వరునికొఱకు మతముకొఱకు దేహమునర్పించు టకు వెనుదీయరు.

## హిందూజనుల కున్న తోద్యోగములు.

అక్బరుకాలములో నేమి యితరమొగలచక్రవర్తులకాలములలో నేమి హిందూ మహమ్మదీయులని విభేదము చేయక రాజకీయవిషయికమహోన్నతో ద్యోగములుకూడ హిందువుల కీయఁబడుచుండెను. గ్రామకరణీకము మొదలు మంత్రిత్వము, ప్రాంతాధిపత్యము అనఁగా గవర్నరుపని, సైన్యాధిపత్యము మొదలయిన సకల రాజకీయోద్యోగములును హిందువుల కీయఁబడుచుండెను.

క్రింది యుద్యోగములుమాత్రము హిందువులకిచ్చి పైతరగతిగలయుద్యోగము లన్నియు మహమ్మదీయులకు నీయవలయు నని నిబంధన లేదు. అందుచే నక్బరు కాలములో నెందఱో హిందువులు ప్రాంతాధికారులుగాను సైన్యాధీశులుగను మంత్రులుగను ఉండి విఖ్యాతిఁ జెందిరి. అట్టివారిలో ముఖ్యులయిన వారినీక్రింద సంగ్రహముగా వర్ణించెదను.

**రాజాబీర్ బల్:—**ఇతఁడు బ్రాహ్మణుఁడు. కొందఱు చరిత్రకారు లీతని విషయమై వ్రాయునపుడు రాజాబీర్ బల్ సింగ్ అనివ్రాసి, యితఁడు క్షత్రియుఁ డని సూచించినారు. కాని యది పొరపాటయి యుండును. ఈ మంత్రిపుంగవుఁడు సంగీతసాహిత్యకవిత్వములలో నసమానప్రజ్ఞ గలవాఁడు; ఔదార్యమునకై పొగడ్తగన్న మహాదాత. అక్బరున కీతనియందు నెక్కుడుప్రీతియు గౌరవమును గలిగియుండెను. తెనుఁగుదేశమునందు మర్యాదరామన్నను గుఱించి కవులుచెప్పుకొనినట్లు, ఇతని వ్యవహారచతురత, న్యాయవిచక్షణత, మొదలయినసద్గుణములను దెలుపు అక్బర్ బీర్ బల్ వినోదకథ లనేకములు నేఁటికిని జెప్పుకొనియెదరు. ఇతండు కొంతసేనకు నధిపతిగా నుండెను. ౧౫౮౬లో నితనిని ఇసుఫ్ జై అఫ్గానులమీఁదికి కంపఁగా నితఁడు వారితో ఘోరముగాఁబోరి యెనిమిదివేల సైనికులతో వీరస్వర్గమునకుఁ బోయెను. ఈమహాపురుషుని చరిత్ర మనకింతకంటెఁ దెలియదు.

**రాజాతోడర్ మల్:—**ఇతఁ డక్బరు మంత్రులలో ముఖ్యుఁడుగా నుండెను. రాజ్యములోని యాదాయవ్యయములనియమన మీతని స్వాధీనములో నుండెను. అనఁగా నిప్పటి ఫైనాన్స్ మినిష్టరు వంటివాఁడు. వెనుక వర్ణింపఁబడిన జమాబంది పద్ధతిని నేర్పఱిచినవాఁ డీతఁడే. అందువలన నేఁటివఱకును మనదేశములో నున్న భూసంబంధ మైన యమరకపుపద్ధతుల కీతఁడే మూలపురుషుఁడని చెప్పవలసియున్నది. కావుననె యసామాన్యరాజకార్యనిపుణుఁడని యితనిని ఇప్పటివఱకును జనులు పొగడుచున్నారు. జమాబంది (Land

Revenue System), ఆదాయవ్యయము (Finance), నాణెములు (Currency) అను విషయముల కన్నిటికిని ఇతఁ డధిపతిగా నుండెను. ఈతనిసత్య సంధత్వ మత్యంతవర్ణనీయమని అబుల్ ఫజల్ వ్రాసియుంచిన వాక్య మిది యిక్కడ నుదాహరింపఁబడినది. ఈ సుగుణములతోఁబాటు ఇతనియందు నసామాన్యశౌర్యము కూడఁగలదు. ఇతఁడును మానసింహునిగలిసి ఖైబరుకనుమలో అఫ్గానుల నోడించెను. ఇతఁడు ౧౫౮౯లో ౧౦ వ నవంబరు దినమునఁ గీర్తిశేషుఁడయ్యెను. ఈవర్తమాన మక్బరునకుఁ గాబూల్ దేశములో నుండఁగాఁ దెలిసి యతఁడు మిగులఁజింతించెను.

తోడర్ మల్ కాయస్థజాతివాఁడుగాఁ గానవచ్చెడిని. ఇతనికి స్వమతమునందు నధికప్రీతియు నిష్ఠయుఁ గలిగియుండెను; స్నాన సంధ్యాదేవతార్చనాదికములు శ్రద్ధతోఁ బ్రతిదినమును తప్పక చేయును. ఒకప్పుడీతఁ డక్బరుతోఁ బంజాబుదేశమునకు తోంపరిగాఁ బోవుచుఁ దన దేవతార్చనపెట్టెను మఱచెను. అందువలన నా పెట్టె దొరకువఱకును భుజించినవాఁడు కాఁడు!

రాజాభగవాన్దాస్:—ఇతఁ డంబర్ రాజ్యమునకు రాజు. ఈ రాజ్యమునే ప్రస్తుతము జయపూర్ అనియెదరు. ఇది రాజపుత్రస్థానములో నున్నది. ఇతఁడు పంజాబుదేశమునకు సుబేదారుగా నియమింపఁబడెను. ౧౫౮౯లో నితఁడు లాహోర్పట్టణమందు మృతినొందెను. ఇతఁడు బుద్ధిశాలి, శూరుఁడు, స్వామికార్యతత్పరుఁడు. కావున నితనిమరణము వలన రాజు మిక్కిలి చింతాక్రాంతుఁ డయ్యెను.

రాజా మానసింగ్:—ఈశూరాగ్రేసరుఁడు జయపురాధీశుఁడగుభగవాన్ దాసుని తమ్మునికొమారుఁడు, దత్తపుత్రుఁడు. అక్బరున కితఁడు కుడిభుజముగానుండెను. అక్బరునకుఁ బ్రాప్తమైనరాజ్యములోని సగమురాజ్య మీతఁడు సంపాదించినాఁ డనిన అతిశయోక్తికానేరదు. అందుచే రాజసభయందు నితనికిఁ గల గౌరవ మితరసరదారులలో నెవ్వరికిని లేకయుండెను. ఇతఁడును తోడర్

మల్లుఁడును కలిసి అఫ్గానులను ఓడించిరని యిదివఱకే వ్రాసియున్నాము. అక్బర్ నూతనమతమును స్వీకరించఁగాఁ గాబూల్ దేశస్థులు తిరుగఁబడిరి. వారిని అణఁచుటకు మానసింగ్ సుబేదారుగా నఫ్గాన్ దేశమునకుఁ బంపఁబడియె. ఇతఁడును, ఇతని రాజపుత్రసైనికులును అఫ్గానులను ఓడించి వారిని వశపఱచుకొనిరి. కొన్ని దినముల తరువాత నఫ్గానువారు మొఱపెట్టుకొనఁగా మానసింహుఁడు బంగాళా దేశమునకు సుబేదారుగాఁ బంపఁబడెను. అచ్చట నితఁడు ౧౫౮౯ మొదలు ౧౬౦౪ వఱకుఁ బ్రభుత్వము చేసి



రాజామానసింగ్.

యెంతయో ఖ్యాతినడసెను. ఇతని ప్రభుత్వమును చరిత్రకారు లెంతయుఁ గొనియాడియున్నారు. కాని యచ్చట అఫ్గానిజాతివారి ప్రాముఖ్య ముండెను. వారు హిందూద్వేషులు. అందుచే వారికిని మానసింహునకును వైరము కలిగినందున నతఁడు బంగాళాదేశముమీఁది తన యధికారమును మానుకొనెను. కాని మానసింహుని యోగ్యతయు, నతఁడు తన కొనర్చిన మహోపకారమును దలంచి యక్బర్ అతనికి నేడువేలమన్సబ్ ఒసఁగెను. ఇట్టి మన్సబుకు 'అమీరీ' అను పేరును, ఆయధికారము కలవానికి 'అమీర్' అను బిరుదునుగలదు. చక్రవర్తివంశజులు కానివారికి నైదువేల మన్సబుకంటె నెక్కుడు మనసబ్ ఈయఁగూడదని యదివఱకు నియమముండెను. కాని మానసింహునివిషయమై

గల గౌరవాధిక్యతవలన అక్బర్ పై నియమమును బాటింపక యాతనికి నేదు వేల మనసబిచ్చెను. ఇట్లక్బర్ కాలములో యోగ్యతగల హిందువులకు నత్యుచ్చ రాజకీయోద్యోగము లీయఁబడుచుండెను. * ఈమానసింహుఁడు జయపుర రాజ్యమును ౧౫౮౯ మొదలు ౧౬౧౫ వఱకు నేలెను. అక్బర్ పోయినతరు వాత నితఁడు పదేండ్లవఱకు బ్రతికియుండెను.

## జహాంగీర్ బాదుషాహ.

(౧౬౦౫ - ౧౬౨౭).

అక్బర్ కాలధర్మమునొందిన తరువాత అతని పెద్దకొమారుఁడగు సలీం అనువాఁడు జహాంగీర్ అనుబిరుదువహించి సింహాసనము నెక్కెను. జహాంగీర్ అను శబ్దమునకు జగజ్జేత యని యర్థము. జహాంగీర్ పరాక్రమ వంతుఁ డనుటకు సందేహములేదు. కాని తండ్రిసద్గుణము లేమియు నత నికిఁ బట్టుపడినవి కావు. మొదట నతఁడు ప్రజల కుపయోగకరములగు కొన్ని పనులు చేసినందున నతఁడు ప్రజాపాలనదక్షుఁ డగునని యందఱు ననుకొనిరి. కాని క్రమక్రమముగా బాదుషాహ విషయాసక్తుఁడును మద్యపానరక్తుఁడు నయినందున వారి యాశలన్నియు నిరాశలయ్యెను. ఈ బాదుషాహచే వ్రాసియుంపఁ బడిన దినచర్యాగ్రంథమును జూడఁ



జహాంగీర్

* It is thus evident that Hindoos of rank now (at the time of Akbar) shared the highest offices with the Moghuls :—Meadows Taylor.

గా నితఁడు మిక్కిలి బుద్ధి వైభవశాలి యని చెప్పకతప్పదు. కాని పైని చేర్కొనఁబడిన దుర్గుణములచే నీతనిబుద్ధివిశేషము వికసించినది కాదు. అక్బరుచే నేర్పాటుచేయఁబడిన రాజ్యపద్ధతి ననుసరించియే యీతఁడు నిఱు వది రెండుసంవత్సరములు రాజ్యముచేసెను. ఇతని ప్రభుత్వకాలమంతయు నీతని పుత్రుల తిరుగఁబాటులతోను, వారి పరస్పర కలహములతోను, నూర్ జహాన్ అను స్త్రీయొక్క ప్రీతికథలతోడను నిండియున్నది.

## జహాంగీర్ యొక్క కొమాళ్లు.

జహాంగీరునకు ఖుస్రూ, పర్విజ్, ఖురం, షహార్యా అను నలుగురుపుత్రులుండిరి. అందు ఖుస్రూ అనువాఁడు సద్గుణవంతుఁడు. అక్బరున కీతనియందు మిక్కిలిప్రేమ. అందుచే మొదటినుండియు నితనికిని నితనితండ్రి యగుజహాంగీరునకును పడదయ్యె. అందుచే జహాంగీర్ రాజ్యమునకు వచ్చిన కొద్దిదినములకే ఖుస్రూ తండ్రిమీఁదఁ దిరుగఁబడెను. కాని యందు నాతఁ డోడి తండ్రి చేతికిఁ జిక్కెను. అప్పటినుండి యాతఁడు చెఱసాలలో నుండెను. దక్షిణదేశములోని యుద్ధమునకై యితఁడు దక్షిణదేశమునకుఁ బంపఁబడి యచ్చటనే చంపఁబడెను. ఖురం అనువాఁడే ముందు షాహజహాన్ అను బిరుదుతో బాదుషాహ యయ్యెను. ఇతఁడు రాజపుత్రకన్యకకుఁ బుట్టినవాఁడు. మిక్కిలి రాజ్యాభిలాషకలవాఁడై ౧౬౨౩ లోఁ దండ్రిమీఁదఁ దిరుగఁబడి బంగాళా దేశమును జయించి మహాబత్ ఖానుఁ డనువానిచే నోడింపఁబడి పాఱిపోయి తండ్రి మరణమువఱకు నచ్చటచ్చట నజ్ఞాతవాసములో డాఁగియుండెను. ఇతనికి ఉదయపూర్ రాజులు సహాయులైయుండిరి. అజ్ఞాతవాసములో నుండఁగా నాతఁడు కొన్నిదినము లుదయపురములోను, కొన్నిదినములు దక్షిణదేశములోను నివసించి యుండెను. పర్విజ్ అనువాఁడు మద్యపానాసక్తుఁడు; ఖురముచేఁ జంపఁబడియె. ఇట్లు పుత్రులవలన జహాంగీరున కేమియు సౌఖ్యము లేకపోయెను.

## నూర్ జహాన్.

### (౧౫౭౫-౧౬౪౫).

జహాంగీర్ బాదుషాహ రాజ్యముచేసె ననివ్రాయుటకంటె నతని పట్టపు రాణియగు నూర్ జహాన్ బేగమే ప్రభుత్వముచేసె ననివ్రాయుట మేలు. ఈమెతండ్రి పారసీకదేశస్థుఁడు. స్వదేశమునందు జీవనాధారము లేనందున నతఁ డక్బరుకాలములో డిల్లీపట్టణమునకు వచ్చెను. అచ్చటఁ దన కౌశల్యముచే నతఁడు బాదుషాహయొద్ద నుద్యోగము సంపాదించెను. అతిరూపవతి యగు నతనికొమార్తెను రాజపుత్రుఁడగు సలీం వివాహమాడఁ దలఁచెను. కాని యక్బరు తనకు నిష్టము లేనందున నామెను నింకొకసరదారునకిచ్చి వివాహముచేసి గొప్ప యుద్యోగమొసఁగి, వారిని బంగాళాదేశమునకుఁ బంపెను. జహాంగీర్ రాజ్యమునకు వచ్చినతోడనే నూర్ జహానుయొక్క భర్తనుజంపించి యామెను రాజభవనములోనికిఁ దీసికొని వచ్చెను. నాలు గైదుసంవత్సరముల వఱ కామె బాదుషాహను వివాహ మాడుటకు సమ్మతించినదికాదు. తుదకు ౧౬౧౧ లో నామెను జహాంగీర్ వివాహమాడెను. అప్పటినుండి రాజ్యపాలనమంతయు నామెయే చేయుచుండెను. జహాంగీర్ ఆమెకు నూర్ జహాన్ అని పేరుపెట్టి యామెయాజ్ఞకు లోఁబడి యుండెను. నూర్ జహాన్ అనఁగా జగత్ప్రకాశమని యర్థము. నూర్ జహాన్ తనకులభించిన యధికారమును దురుపయోగపఱచినది కాదు. బాదుషాహయెడ మిక్కిలి ప్రేమగలిగి యాతనిత్రాగుబోతుతనము మాన్పుట కెంతయుఁ బ్రయత్నించెను. రాజభవనములోని యన్ని సంగతులను స్వయముగాఁ గనుఁగొనుచుండును. ఆమె బోధనలననే బాదుషాహ యనేక దుర్గుణముల మానెను. అక్బరువలె గొలుసుకట్టఁబడిన యొకగంట రాజమందిరములో నుంచి, యాగొలుసును వెలుపలనుండి కదలించినవారి మొఱ స్వయముగా వినుచుండెను. ఆమె యనాథబాలుర ననేకులఁ బెంచెను. జహాంగీర్ ప్రభుత్వముయొక్క చివరకాలమునమాత్ర మామెరాజ్యములోఁ గొన్ని కల్లోలములఁ బుట్టించెను.

## రాజపుత్రులతో యుద్ధము.
### (౧౬౧౩-౧౬౧౪).

జహాంగీర్ తన కొమాళ్లి నుదయపురరాజుల మీఁదికిఁ బంపి యాతనిని వశపఱచు కొనెను. ఈ వృత్తాంత మంతయు నుదయపురచరిత్రములో వివరముగా వర్ణింపఁబడును.

## అహామ్మద్ నగరమును గెలుచుట.

అక్బర్ కాలములో నాతఁ డహామ్మద్ నగరమును వశపఱచుకొని యచ్చట ఖానఖానాన్ అనువానిని సుబేదారుగా నుంచెను. కాని మాలికంబర్ అనువాఁడు మరల అహామ్మద్ నగరమును గెలిచి మొగలుల వెడలఁగొట్టెను. అందుచే జహాంగీర్ తనకుమారుఁ డైన ఖురం అనువానిని దక్షిణదేశము జయించుటకై పంపెను (౧౬౧౬). బాదుషాహ స్వయముగాఁ గొంతవఱకుఁబోయి మాండవగడమునొద్ద విడిసియుండెను. ఖురంతనశౌర్యమును జూపిమాలికంబరును పరాభవించి అహామ్మద్ నగరమును స్వాధీనముచేసికొనెను. అతఁడు మాండవగడమునకుఁ బోయి తండ్రికి నమస్కరింపఁగా నతఁడు తనకుమారుని మిక్కిలి గౌరవించి యాతనికి ~~జహాంగీర్~~ అనుబిరుదు నొసంగెను.

ఇట్లు అహామ్మద్ నగరమును స్వాధీనముచేసికొనినను అది మిక్కిలి దినములు దక్కినది కాదు. షాహజహాన్ వెడలిపోయినతోడనే మాలికాంబర్ మరల మొగలసైన్యముల నోడించెను. అందుచే ౧౬౨౦ లో మరల షాహజహాన్ దక్షిణమునకు వచ్చెను. ఈసారి యాతఁడు తనయన్నయగు ఖుస్రూను తనవెంటఁ దీసికొనివచ్చి చంపించెను. మాలికాంబరును కొంతవఱకు గెలిచి రాజ్యము కొంతసాధించెను. కాని యంతలో నుత్తరదేశమునకు వెడలవలసి వచ్చినందున దక్షిణదిగ్విజయమును మాని వెడలిపోయెను (౧౬౨౩).

## అంతఃకలహాములు.

నూర్ జహానునకు ఆసఫ్ ఖానుఁ డనుతమ్ముఁడు కలడు. అతనికొమార్తెయగు ముంతాజ్ మహాల్ అను నామెను ఖురంకు అనఁగా షాహజహానునకు నిచ్చి

యుండిరి. కావున ఖుర్రంకు రాజ్యము రావలయునని ఆసఫ్ ఖానుఁడు యత్నించుచుండెను. నూర్ జహానునకు మొదటి పెనిమిటివలన నొక కూఁతురుకలదు. ఆమెను ఖుస్రూకిచ్చి వివాహము చేయవలయు నని నూర్ జహాన్ యత్నించెను. కాని యంతకుఁ బూర్వమే వివాహమైన యాయేకపత్నీనిరతుఁడు నూర్ జహాన్ కూఁతును వివాహమాడుటకు నొప్పుకొనలేదు. అందుపై నైదవరాజపుత్రుఁ డగు షహార్ యార్ అనువానికిఁ కూఁతునిచ్చి నూర్ జహాన్ వానికే రాజ్యము రావలయునని యత్నింపసాగెను. మహాబత్ ఖానుఁ డను సైన్యాధీశుఁడు మొదట నూర్ జహానుకు ననుకూలుఁడైనను, వెనుక ప్రతికూలుఁడై యతనిని జహాంగీర్ అగౌరవపఱచినందున ౧౬౨౬ లో యుద్ధముచేసి జహాంగీర్ నూర్ జహానుల చెఱపట్టెను. నూర్ జహాను తెలివివలన వారుభయులును చెఱ విడిపించుకొని మహాబత్ ఖానుని నాశమొందింపవలయు నని దక్షిణములోనున్న షాహజహాన్ మీఁదికి యుద్ధమునకుఁ బంపిరి. కాని షాహజహాన్ మహాబత్ ఖాను లొక్కటైరి. ౧౬౨౭ లో బాదుషాహ దేహారోగ్యము నిమిత్తమై కాశ్మీరమునకుఁ బోయి యచ్చటనే పరలోక గతుఁడయ్యెను. అంత షాహజహాన్ దక్షిణము నుండి పరుగెత్తుకొనివచ్చి బాదుషాహ యయ్యెను. నూర్ జహాన్ యొక్క యధికార మంతయు నంతటితో సమాప్తి నొందెను.

## జహాంగీర్ రాజ్యవ్యవస్థ.

మొత్తముమీఁద జహాంగీర్ ప్రభుత్వము ప్రజలకు సుఖప్రదమే యయ్యెను. మదిరాసక్తుఁడు కానప్పు డెన్నియో మంచిపనులఁ జేయును. విద్యలను విద్వాంసులను గౌరవించెను. మతమును గుఱించి యొవరిని బాధపెట్టినవాఁడు కాఁడు. ఇతనికి సమకాలీనుఁ డగు నింగ్లండురాజు పేరు రెండవజేమ్సు. అతనికంటె జహాంగీర్ నూఱురెట్లు మంచి వాఁడనుటకు సందేహములేదు. మధ్యవర్తులతో సంబంధములేక ప్రజలమొఱ లాలకించుటకు నాతఁ డొక న్యాయశృంఖల యను బంగారపుగొలుసు చేయించెను. అది యఱువదియడుగుల

పొడుగును, ఆఱువది బంగారపుగంటలును గలిగియుండెను. దాని యొక చివర బాదుషాహ కూర్చుండుస్థలమునకును, రెండవది వీథిలోను గట్టఁబడియుండెను. సృష్టిసౌందర్యముఁజూచి యితఁడు మిగుల నానందించుచుండును. వేఁటాడుటలో నీతఁడు ప్రవీణుఁడు. ప్రొఫెసర్ డాసన్ అనువాఁడీతని గుఱించి యిట్లు వ్రాసియున్నాఁడు. "ఇతని స్వీయచరిత్రమును బట్టి చూడ నితఁడసామాన్య పురుషుఁడని చెప్పవలెను. ఇతఁడు తనదోషములను దుర్గుణములను స్పష్టముగ నొప్పుకొని యున్నాఁడు. ఇతని స్వీయచరిత్రమును జదివినయెడలఁ జదువరులకు నితనియోగ్యతను గుఱించియు, బుద్ధివిశేషంబును గుఱించియు మంచి యభిప్రాయము కలుగకమానదు. రత్నములు, పుష్పములు, కళాకౌశల్యములు మొదలగువానిని గుఱించి యితని కెక్కుడుప్రీతి. ఇతఁడు మృగయావినోదము నందుఁ బ్రవీణుఁడు. మద్యమును సేవింపనపు డితఁడు తన యౌదార్యమును న్యాయప్రియతను బాగుగఁ గనఁబఱుచుచుండెను. కాని రాజ్యారూఢుఁడగుటకుఁ బూర్వము మదిరాసక్తుఁడై యనేక క్రూరకృత్యములఁ జేసె ననుటకు సందేహము లేదు." మొత్తముమీఁద నితఁడు మిక్కిలి యోగ్యుఁడయ్యెనని వ్రాగు డెక్కుడగుటచే నయోగ్యుఁడయ్యెనని చెప్పవలసియున్నది.

## ఇంగ్లీషు రాయబారులు.

వర్తకము చేయవలయు నని నయుద్దేశములో నీబాదుషాహ ప్రభుత్వములోనే ఇంగ్లీషు వారీదేశములోఁ బ్రప్రథమమున గాలుపెట్టిరి. ౧౬౦౮లో క్యాప్టన్ హాకిన్స్ అను నింగ్లీషువాఁడు సూరత్ పట్టణమునకు నోడపై వచ్చి యచ్చటనుండి జహాంగీర్ రాజధానియగు ఆగ్రాపట్టణమునకుఁ బోయి రెండు మూఁడుసంవత్సరముల వఱకు నచ్చటనుండి బాదుషాహను నచ్చటి యితరసరదారులను నాశ్రయించి వారికి బహుమతులను గేరట లంచములొసంగి యింగ్లీషు వారీదేశములో వర్తకము చేసికొనుటకు సెల వొసంగవలయు నని కోరెను. కాని యప్పు డెవ్వఁడో దూరదృష్టిగల భవిష్యద్వేత్త ఇంగ్లీషువారికి

నిప్పుడు చోటిచ్చినయెడల వారు త్వరలోనే మనరాజ్యమును హరించెదరు.' అని చెప్పెనఁట! అందుచే నా యింగ్లీషువాఁడు విఫలమనోరథుఁడై ౧౬౧౧ లో వెడలిపోయెను. అతఁడు మొగల్ ప్రభువులయొక్క వైభవమును గుఱించి యింగ్లండునకు వ్రాసిన సమాచారములం జదివి వా రాశ్చర్యచకితులైరి. అప్పు డింగ్లండ్, స్కాట్లండ్ దేశములలోనిపన్ను కోటిరూపాయలకంటె నెక్కుడు లేదు. ఫ్రాన్సుదేశపు రాజైన పరాక్రమశాలియగు పదునాల్గవ లుయి యనువాని యాదాయము అయిదుకోట్లను మించకుండెను. అందుచే జహాంగీరు నాదాయ మిఱువదికోట్లకంటె నెక్కుడు కలదని విని యూరోపుదేశస్థులు జహాంగీరును దేవేంద్రునిగాఁ దలఁచిరి. 'జహాంగీరు దినదినము ౫౦౦౦ రూపాయలు వెచ్చించును; ఇఱువదికోట్లాతని బొక్కసములో నెప్పుడును నిలిచియుండును. గుఱ్ఱములు, ఏనుఁగులు, లొట్టిపిట్టలు, లేళ్లు, గానముచేయుపక్షులు మొదలైనవి యాతనియొద్ద నిన్నిగలవని లెక్కించుటకు శక్యముకాదు; క్షణములో నిఱువదియైదువేల సైన్యము వచ్చి నిలుచును; ఎనిమిదిరోజులవ్యవధి యిచ్చినయెడల మూఁడులక్షలసైన్యము యుద్ధమునకు సిద్ధమగును'. అనిన వర్ణనలువిని యింగ్లండు దేశములోని జను లాశ్చర్యమగ్నమానసులై హిందూదేశమును నందనవనముగా భావించి యచ్చటిధనమును వర్తకముచేనార్జింప నుపాయముల యోజింపసాగిరి.

౧౬౧౫ లో సర్ టామస్ రో యను రాయబారి యింగ్లండుదేశమునుండి సూరత్ పట్టణమునకు వచ్చెను. అతఁడు జేమ్సురాజునొద్దనుండి బాదుషాహాకు నొక యుత్తరము తెచ్చెను. అతఁడును క్యాప్టన్ హ్యాంకిన్సువలెనే యాగ్రా పట్టణమునకుఁబోయి యచ్చటి బాదుషాహాకును, ఇతర సరదారులకును, కట్నములు, కానుకలు, లంచములు నిచ్చి యింగ్లీషువారిని నీదేశములోనికిఁ జొరఁ బెట్టవలెనని యత్నించెను. కాని యాతనికోర్కె ఫలించినదికాదు. ఈయింగ్లీషు రాయబారు లిద్దఱును హిందూదేశములోఁ దాముచూచిన విశేషము లన్నియు సవిస్తరముగా వ్రాసియుంచినారు. అవిచదువుట కెంతయు నింపుగనుండును.

## షాహజహాన్ బాదుషాహ.

(౧౬౨౮-౧౬౫౮).

### రాజ్యారోహణము.

౧౬౨౮-వ సంవత్సరము నందు ౨౬-వ జనేవరిదినమున షాహజహాన్ సింహాసనము నెక్కెను. అతఁ డాగ్రాపట్టణమునకు వచ్చువఱకు నతని మామయగు ఆసఫ్ ఖానుఁడు నూర్ జహాన్ మొదలయిన పరపక్షీయులఁ జెఱఁబెట్టెను. ఇతఁడు తన తమ్ముఁడగు షహార్యారుతోఁ బోరి యాతని నోడించి యాతనిని మఱియొక యన్నకుమారుల నిద్దఱినిఁ జంపెను.



షాహజహాన్.

ఈబాదుషాహ మిక్కిలి వైభవమును, సౌఖ్యమును అనుభవించెను. రాజ్యారోహణ సమయమునందు నితఁడు కోటియేఁబదిలక్షలరూపాయలువెచ్చించిగొప్ప యుత్సవము చేసెను. మక్కా,మదీనాలలోని దేవాలయములకు లక్షలకొలఁది వెలగలకానుక లంపెను. అందు గోలకొండనుండి తేఁబడిన రత్నమొకటియుండెను. దాని వెల లక్షయేఁబదివేల రూపాయలు.

షాహజహాన్ ముప్పది సంవత్సరముల వఱకు రాజ్యము చేసెను. అందాద్యంత కాలము క్రూరకర్మములతోను యుద్ధములతోను నిండియున్నది. మధ్య కాలము సుఖముగానే కడచెను. రాజ్యము సంపాదించుటకు నతఁడు యుద్ధము చేసి యనేకజ్ఞాతులఁ జంపెను. తుద కాతనిపుత్రు లాతనితో యుద్ధముచేసి రాజ్యముఁ దీసికొనిరి.

రాజ్యారూఢుఁడైన తోడనే షాహజహాన్ తన మామయైన ఆసఫ్ ఖానును సాదుల్లాఖానుఁ డను వానికిని మంత్రిత్వపదవు లొసఁగెను. సేవకుల జీతము నభివృద్ధిచేసెను. మిత్రుల కనేకులకు నాశ్రయమిచ్చెను. ఆసఫ్ ఖానుఁడు రాజ్యకుశలుఁడని విఖ్యాతిఁ జెందిన మంత్రిపుంగవుఁడు. అతఁడు పోయిన తరువాత సాదుల్లాఖానుఁడు ముఖ్యమంత్రి యయ్యెను. ఇతఁడు మొదట హిందువుగానుండి మహామ్మదీయమతము నవలంబించెను. మహాబత్ ఖాన్ అను వాఁడు సేనాని యయ్యెను.

## ఖాన్ జహాన్ లోదీ తిరుగఁబడుట

(౧౬౨౮-౧౬౩౦).

షాహజహాన్ బాదుషాయైనతోడనే ఉజ్ బక్ అనుజనులు కాబూల్ దేశముమీఁదికి నెత్తిపచ్చిరి. వీరసింహుఁడను రాజపుత్రుఁడు బుందేల్ ఖండ ములోఁ దిరుగఁబడెను. వారిని బాదుషాహసైన్యములు వెంటనే యోడించెను. కాని వీనికంటె భయప్రదమైన తిరుగుఁబాటు ౧౬౨౮లో నొకటి జరిగెను. ఖాన్ జహాన్ లోదీ యనువాఁడు జహాంగీర్ ప్రభుత్వకాలములో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన సేనాధిపుఁడు. షాహజహాన్ బాదుషాహ యతనిని అగౌరవ పఱిచినందున నతఁడు రెండువేలసైన్యములతో దక్షిణమునకుఁబోయి మలి కంబరుతోఁ గలిసి బాదుషాహమీఁదఁ దిరుగఁబడెను. అంత షాహజహాన్ భీతిఁజెంది స్వయముగా సైన్యముల వెంటఁదీసికొని దక్షిణమునకుఁబోయి లోదీని నోడించెను. వాఁడు కలింజర్ యుద్ధములో శూరునివలెఁ బోరాడి వీర స్వర్గమునకుఁ బోయెను.

## దక్షిణరాజ్యముల మీఁదికి దాడి.

(౧౬౩౦-౧౬౩౨).

లోదీనిఁ బరాభవించి షాహజహాన్ వెంటనే ఢిల్లీకిఁ బోయినవాఁడు కాఁడు. దక్షిణములోని అహమ్మద్ నగర్, బిజాపూర్, గోలకొండ రాజ్యము

లను గెలువవలయు నని యతఁడు దక్షిణమునందే యుండెను. ౧౬౨౯,౧౬౩౦ సంవత్సరములలో దక్షిణదేశమందు గొప్పకఱవు వచ్చినందున నతఁడు విశేషదేశము జయింపలేదు. ౧౬౩౦ లో దౌలతాబాద్ దుర్గము నాక్రమించుకొనెను. గోలకొండ నవాబు కప్పముకట్టుటకు నొప్పుకొనిరి. ౧౬౩౨ లో మహాబత్ ఖానునకు దక్షిణములోని సర్వాధికారమిచ్చి బాదుషాహ ఢిల్లీకి వెడలిపోయెను. మహాబత్ ఖానుఁడు అహమ్మద్ నగర్ సైన్యముల నోడించి, పట్టణమును స్వాధీనముచేసికొని, నవాబును చెఱపట్టి గ్వాలేర్ పట్టణమునకుఁ బంపెను. మఱియొకయుద్ధములో మహాబత్ ఖానుఁడును, సుజా యను రాజపుత్రుఁడును పరాజితులై బర్హాణపురమునకుఁ బాఱిపోయిరి. అచ్చటినుండి బాదుషాహయొక్క యాజ్ఞ ననుసరించి వారు ఢిల్లీకివెళ్ళిరి. అంత నహమ్మద్ నగర రాజ్యమును నుద్ధరించుట కిదియే మంచి సమయమని తలఁచి షహాజీ భోఁసలా యను మరాటాసరదారుఁడు సైన్యములఁ జేర్చుకొని యహమ్మద్ నగరరాజును స్వతంత్రునిఁ జేసెను. అందుచే ౧౬౩౫ లో బాదుషాహ స్వయముగా మరల దక్షిణమునకు వచ్చెను. తనసైన్యములను రెండుభాగములుగా విభజించి యొక్కభాగమును విజాపురము మీఁదికిఁ బంపెను. అచ్చట రణదుల్లాఖానుఁడను సైన్యాధీశుఁడు మోగల సైన్యముతో ఘోరముగాఁ బోరాడెను. కాని తుదకు వారితో సంధిచేసికొనెను. అట్లే షాహాజీసైన్యములు నోడిపోయినందున అహమ్మద్ నగరరాజ్య మంతయుంది మోగల్ రాజ్యములోఁ గలిసిపోయెను.

## కందహార్.

జహాంగీర్ ప్రభుత్వకాలమందుఁ గందహార్ రాజ్యమును పారసీకులు స్వాధీనముచేసికొని యుండిరి. షాహజహాన్ ప్రభుత్వములో నచ్చటి దుర్గాధీశునకు లంచమిచ్చి మొగలు లాదుర్గమును మరల స్వాధీనముచేసికొనిరి. మర్దాన్ ఖానుఁ డను పేరుగల యాదుర్గాధీశుఁ డటుతరువాత హిందూదేశములో గొప్ప

యుద్యోగములఁ జేసెను. ఢిల్లీపట్టణమునకు జలమునిచ్చెడి కాలువ నాతఁడు త్రవ్వించెను. దాని కిప్పటికిని అలీమార్దాన్ కాలువ యని పేరు. ౧౬౪౯లో పారసీకులు కందహార్ దేశమును మరల స్వాధీనము చేసికొనిరి. దానిని సాధింప వలయు నని ౧౬౪౯ లో రాజపుత్రుఁడగు ఔరంగ్ జేబును, ౧౬౫౩ లో రాజపుత్రుఁడగు దారా యనువాఁడును, ఘోరముగాఁ బోరిరి. కాని విఫల మనోరథులై కందహారునకు నొక చరమనమస్కారము చేసి హిందూదేశము నకు వెడలిరావలసిన వారైరి.

## బల్ఖ్ ప్రదేశము.

ఇది అఫ్గానిస్థానములోని యొకభాగము. అది బాబర్ ప్రభుత్వము లోనిది. అటుతరువాత నచ్చటియధికారు లప్పుడప్పుడు స్వతంత్రు లగుచుండిరి. జహాంగీర్ ప్రభుత్వ సమయమందు నది నజర్ మహమ్మ దనువానిచే నాక్ర మింపఁబడియె. ౧౬౪౪ లో బల్ఖ్ మీఁదికి అలీమర్దాన్ ఖానుఁడు షాహ జహానుచేఁ బంపఁబడియె. అతనికి సహాయము చేయుటకై ఉదయపూర్ రాణాయగు జగత్సింహుఁడు పదునాలుగువేల సైన్యములతో బల్ఖ్ దేశము నకుఁబోయి రాజపుత్ర శౌర్యమును అఫ్గానులమీఁద జూపెను. రాజపుత్రు లతో మురాద్ ఔరంగజేబులుగూడ నాదేశమునకుఁబోయి యుద్ధములు చేసి శత్రుల నోడించిరి గాని యచ్చటి యరణ్యములలో వారి సైన్యములకు మిక్కిలి బాధ కలిగెను. అనేక సైనికులు మడిసిరి. ధన మపరిమితముగా వెచ్చింపఁ బడెను. అందుచే నచ్చట నుండుట సాధ్యము కాదని బల్ఖ్ ప్రదేశము నజర్ మహమ్మదుకే యిచ్చివేసి ఔరంగ్ జేబ్ తిరిగివచ్చెను. త్రోవలో హిందూ కుశ పర్వతము మీఁదనుండు అడవి జనులు మొగలుల సైన్యమును మిక్కిలి బాధపెట్టిరి (౧౬౪౭).

## పోర్చుగీజు వారిని నణఁగఁ ద్రొక్కుట.

యూరప్ దేశమువారిని తనరాజ్యములోనికి రానిచ్చుట తప్పని యీబాదు

షాహా యభిప్రాయమై యుండెను. క్రైస్తవులయెడ నితనికి సహాయకలదు. ఇతనిభార్య యగు ముంతాజ్ మహాల్ అనునామె కూఁతుఁ లిద్దఱిని మత గురువులు క్రైస్తవులుగా మార్చినందున నామె క్రైస్తవులను మిక్కిలి ద్వేషించుచుండెను. ఇదియుఁగాక షాహాజహాన్ బాదుషాహకు పోర్చుగీజు వారిమీఁదఁ గోపము వచ్చుటకు మఱియొక కారణము కలిగెను. చిత్తగావ్ అను గ్రామములోని సముద్రపు దొంగలు బంగాళాఖాతములోని రాదారి యోడలను దోఁచుకొనుచుండిరి. అట్లు వారు దోఁచుకొనకుండఁ బోర్చుగీజువారు చేయవలసిన దనియు, నందులకుఁ బ్రతిఫలముగాఁ బోర్చుగీజువారు హుగ్లీలో సర్తకపుసరకులు పెట్టుకొనుటకు గిడ్డింగి కట్టుకొనవచ్చుననియు జహాంగీర్ కాలములో నేర్పాటు జరిగెను. ఆప్రకారమున వారు గిడ్డంగిమాత్రము కట్టుకొనిరి. కాని సముద్రపుదొంగలను అణఁచుటకు మాఱుగా వారితో స్నేహము చేసి, వారికి దోఁపిడివలన వచ్చులాభములో భాగమును దీసికొనుచుండిరి. ఇంతియ కాదు. ఆసముద్రపుదొంగ లోడలలోనిజనులను పట్టుకొని బానిసలుగా నమ్ముచుండిరి. హుగ్లీరేవులోని పోర్చుగీజువారట్టిబానిసలను కొనుచు నితరదేశములకుఁ దీసికొనిపోయి మాఱుబేరములకు నమ్ముచుండిరి. పరదేశ వర్తకులయొక్క యిట్టి దుష్కృత్యములను జూచి యే రాజూరకుండును? ౧౬౩౨ లో షాహాజహాన్ తనసైన్యములను హుగ్లీమీఁదికిఁ బంపి యచ్చట పోర్చుగీజు వారినందఱిని చెఱపట్టి వారిసొత్తంతయు దోఁచుకొని, వారిని నాగ్రాపట్టణము నకుఁ దెప్పించెను. వారిలోని సుందరులైన తరుణస్త్రీలను తన రాణివాసములో నుంచుకొని యితరస్త్రీలను దనసరదారులకుఁ బంచి పెట్టెను. పిల్లవాండ్రందఱికి మహమ్మదీయదీక్ష నిప్పించెను. పెద్దవారిలో ననేకులఁ జంపించెను. కొందఱు మహమ్మదీయులై ప్రాణములు రక్షించుకొనిరి. ఇట్లు హుగ్లీలోని పోర్చుగీజువా రందఱును నాశముచెందినను చిత్తగావ్ లోని పోర్చుగీజువారు మాత్రము సముద్రపు దొంగలపని చేయుచుండిరి. ఔరంగ్ జేబ్ ప్రభుత్వ

సమయములో బంగాళా దేశమునుండి పోర్చుగీజువారు పూర్తిగ వెడలఁ గొట్టఁబడిరి.

## ముంతాజ్ మహల్.

ఈమె నూర్ జహాన్ యొక్క యన్నయగు ఆసఫ్ ఖానుని కూఁతురు. నూర్ జహాన్ వలెనే మొదట మఱి యొకపురుషునికి భార్యయైయుండి పిదప బాదుషాహాకు భార్యయయ్యెను. ఈమెకు మొదటిపేరుఅర్జుమంద్ బాను. నూర్ జహాన్ యొక్క తెలివి చక్కఁదనమును, తండ్రి యగు ఆసఫ్ ఖానుని తారతమ్యజ్ఞానము వ్యవహారకుశలత సత్యప్రియత లామెకుఁ బట్టువడియుండెను. అనేక సద్గుణములు కలదియగుటచే నామె స్త్రీరత్న మని పేరు వడసెను. తనభర్తయొక్క దృష్టి పరస్త్రీయందుఁ బడకుండ నామె యిఱువది సంవత్సరములవఱకుఁ గాపురముచేసి ౧౬౩౧ లోఁ గాలధర్మమునొందెను. మరణ సమయమందు నామె తన పెనిమిటి మఱల వివాహముచేసికొనఁ గూడదనియు, లోకులకుఁ దన పేరెప్పటికిని జ్ఞాపకముండు నట్లేదైన నొకకార్యము చేయవలసిన దనియుఁ బతినిఁ గోరెను. పత్నీవ్రతుఁడగు నాబాదుషాహ మఱల వివాహము చేసికొనలేదు. ఆమె గోరీమీఁద అనన్యసామాన్యమైన తాజ్ మహాల్ అను మందిరమును గట్టించెను.



ముంతాజ్ మహాల్.

## షాహజహాన్ సంతానము.

ఈ బాదుషాహకు ముంతాజ్ మహాల్ వలనఁ బదునాల్గురు సంతానము కలిగెను. అందు నెనిమిదిమంది చిన్ననాఁటనే గతించిరి. ఆఱుగురు మాత్రము పెద్దవారైరి. అందు నలుగురు పుత్రులు. ఇద్దఱు పుత్రికలు. వారి పేళ్లును జనన మరణసంవత్సరములును ఈక్రింద నిచ్చుచున్నాము.

### పుత్రులు.

| పేళ్లు. | జన్మము. | మరణము. |
|---|---|---|
| దారా. | ౧౬౧౫. | ౧౬౫౯. |
| సుజా. | ౧౬౧౬. | ౧౬౬౦. |
| ఔరంగజేబ్. | ౧౬౧౮. | ౧౭౦౭. |
| మురాద్. | ౧౬౧౪. | ౧౬౬౧. |

### పుత్రికలు.

| | | |
|---|---|---|
| జహాన్ ఆరా. | ౧౬౧౪. | ౧౬౮౧. |
| రొషనఆరా. | ౧౬౧౭. | ౧౬౭౧. |

రాజపుత్రులలోఁ బెద్దవాఁడగు దారా ధర్మశాస్త్ర మందును, తత్త్వజ్ఞానము నందును పారంగతుఁడు. అతఁడౌదార్యసాహసములు గలవాఁడు; పాశ్చాత్యశాస్త్రములఁగూడ నభ్యసించెను! అనేకసంస్కృతగ్రంథములను పారసీక భాషలోనికి మార్పించెను. అతనికి మహామ్మదీయమతమునందు ననూాయగలదు. ఫ్రెంచ్ ఫాద్రీ యొకఁడును హిందూ సాధు వొకఁడును అతనికి గురువులు. ఈసద్గుణముల తోఁబాటు అతనియందుఁ గొన్ని దుర్గుణములు వాసముచేయు చుండెను. అతఁడు స్తుతిప్రియుఁడు, గర్వము గలవాఁడు, అతని మనసులో నేమాటయును దాఁగుటలేదు.

రెండవ కొమారుఁడగు సుజా శూరుఁడు, కార్యనిర్వాహణచతురుఁడు. కాని యితరులను నమ్మఁడు. ఢిల్లీపట్టణములోఁ దనవారలనుంచి యచ్చటి సమా

చారము లెప్పుడును గనుఁగొనుచుండెను. యశోవంతసింహుఁడు మొదలైన ప్రబల హిందూరాజులతో స్నేహము సంపాదించెను. పారసీక రాజుతో ప్రత్యుత్తరములు జరుపుచుండెను. ఇన్ని గుణములను బాడుచేయు నుత్తర దుర్గుణ మొకటి యాతని యందుండెను. అతఁడు ఇంద్రియనిగ్రహ మెంత మాత్రము నెఱుఁగఁడు; ఎల్లప్పుడును విషయాధీనుఁడై యుండును.

మూఁడవపుత్రుఁడు ఔరంగ్‌జేబ్. అందఱికంటె నితఁడు వ్యవహార చతురుఁడు, ఇంగితజ్ఞుఁడు, దూరదృష్టికలవాఁడు. అసత్యకపటముల నాశ్రయించి యెంతకఠినకార్యముల నైన సాధించుటకు సమర్థుఁడు. తన యన్నదమ్ముల నందఱిఁ జంపి రాజ్యము నాక్రమించు కొనవలయునని మొదటినుండి యితని మనసులోనున్నను దానిని వెలిపుచ్చక భూషణముల ధరించుట మాని విరాగివలె నుండి సంసార మసారమనియు రాజ్యము దుఃఖహేతువనియుఁ బలుకుచుఁ గురాన్ గ్రంథము నెప్పుడును బఠించుచుండెను.

నాలుగవపుత్రుఁడగు మురాద్ ధైర్యసాహసములం దసామాన్యుఁడు. కాని వట్టిమూర్ఖుఁడు. ఇతని ధైర్యమునకుఁ దోడు వివేక ముండినయెడల నితఁ డద్వితీయపురుషుఁడై యుండుననుటకు సందేహము లేదు.

ఈ నలుగురు పుత్రులలోని యొక్కొకని గుణధర్మ మొక్కొక శబ్దములోఁ జెప్పవలయునన్న మొదటివాఁడు గర్విష్ఠుఁడు; రెండవవాఁడు విషయలంపటుఁడు; మూఁడవవాఁడు కపటి; నాలవవాఁడు మూర్ఖుఁడు అనిచెప్పినఁ జాలును.

షాహజహానుని పెద్దబిడ్డపేరు జహాన్‌ఆరా. ఈమాటకు జగద్భూషణమని యర్థము. ఆమె సుస్వరూపము, ఆనందప్రవృత్తియుఁ గలయువతి. ఆమెయెడఁ దండ్రికి మిక్కిలి యనురాగముగలదు. రాజ్యవిషయమైన యంశములను గూడ నామెతోఁ జెప్పి యామెయభిప్రాయమును దీసికొనుచుండెను. అందుచే రాజ్య మునం దంతటను ఆమెకు విశేషగౌరవము కలుగుచుండెను. ఆమెకు దారా

యను తమ్మునియెడ మిక్కిలి ప్రేమ కలదు. ఆమె జీవితకాలమంతయు నవివాహితగానుండి తండ్రికష్టకాలములలోఁగూడ నాతనికి సేవచేయుచునుండెను.

రెండవ కూఁతురగు రొషన్ ఆరా తనయక్కను దారాను ద్వేషించుచు ఔరంగ్ జేబ్ మీఁదఁ బ్రేమగలిగియుండెను. ఈమె సుస్వరూపవతి కాదు. ఈమెకు రాజ్యములో గౌరవమును లేదు. కాని యీమె రాజభవనములో జరుగు రహస్యసమాచారము లన్నియు నౌరంగ్ జేబునకుఁ దెలుపుచుండెను.

సాహాజహాన్ ప్రభుత్వముయొక్క యుత్తర భాగమంతయు నాతని పుత్రుల కలహములతో నిండియున్నది. బాదుసాహ ముసలివాఁడైనకొలఁదిని అతని పెద్దకుమారుఁడగు దారాచేతులలో రాజ్యతంత్రమును విడిచిపెట్టెను. పెద్దకుమారునిమాత్రము తనయొద్దనుంచికొని సుజాను బంగాళాదేశమునకును, ఔరంగ్ జేబును దక్షిణదేశమునకును, మురాదును గుజరాథ్ దేశమునకును సుభేదారులుగాఁ బంపెను. వీరందఱును తమతమయధికారము క్రింది దేశములలోని యాదాయమంతయుఁ దామే వెచ్చించుచుఁ దక్కిన తోఁబుట్టువులఁజంపి తాము బాదుసాహలు కావలయునని యనేకోపాయములఁ బన్నఁజొచ్చిరి.

## గోలకొండమీఁదికి దండువెడలుట.

మీర్ జుమ్లా యను పారసీకదేశస్థుఁడు మొదట దిల్లీశ్వరునియొద్ద నుద్యోగముచేసి, దారాయొక్క కోపమునకుఁబాత్రుఁడై, గోలకొండకువెడలిపోయెను. అచ్చటి నవాబుయొక్క యనుగ్రహము సంపాదించి గొప్ప యుద్యోగములోఁ బ్రవేశించెను. కాని యచ్చటను రాజకోపమునకుఁ బాత్రుఁడైనందున స్వామిద్రోహియై యాదేశముమీఁదికి దండెత్తిరావలసినదని యౌరంగ్ జేబునకు వ్రాసెను. అంత నాతఁడు నిష్కారణముగను, అకస్మాత్తుగను గోలకొండమీఁదికి యుద్ధమునకు వచ్చెను. మొగల్ సైన్యములతోఁబోరాడుటకుఁ దగినసైన్యములు లేనందున కుతుబ్ సాహ యాతనితో సంధిచేసెను.

## అన్నదమ్ములకలహాములు.

౧౬౫౭లో షాహాజహానునకు రుగ్మత సంభవించెను. అంత నాతనిపుత్రుల లోఁ గలహాములు ప్రారంభమయ్యెను. అతఁడు బ్రతికి యుండఁగనే చచ్చినాఁడని వదంతి చేసి, దక్షిణములోనున్న ఔరంగ్‌జేబ్ నీకే రాజ్యమిచ్చెదని మురాద్ అనుతమ్మునిని గలుపుకొని మీర్‌జుమ్లాను వెంటఁదీసికొని యాగ్రామీఁదికి యుద్ధమునకుఁ బోయెను. తండ్రి బ్రతికియున్నాఁడనియు నాగ్రాపట్టణముమీఁదికి రావలదనియు దారా యెన్ని సారులు వర్తమానములంపినను వినక వారిద్దఱు ఆగ్రాపట్టణమునకువచ్చి ధారాసైన్యములను బరాభవించి, షాహాజహానును చెఱఁబెట్టిరి. దారానుజాలు పాఱిపోయి యచ్చటచ్చట లోకాంతరగతులైరి. మురాదును మోసముచేఁ జంపి యౌరంగ్‌జేబ్ తాను బాదుషాహ యయ్యెను. షాహాజహాన్ కొలుసాలలో నెనిమిదిసంవత్సరములవఱకుండి ౧౬౬౬లో మరణముచెందెను.

## షాహాజహాన్ యోగ్యత.

ఈబాదుషాహనుగురించి యూరోపియన్ బాటసారు లనేకులు వ్రాసియున్నారు. ఇతఁడు రసికుఁడు. రాజవిలాసములలో నెల్లప్పుడును నిమగ్నుఁడై యుండెను. ఇతని యాదాయము ముప్పదికోట్లనుమించియుండెను. ఇతనియొద్ద సాదుల్లాఖాన్ అల్లామీ యనువాఁడు వజీరుఁడుగా నుండెను. అతఁడు మహమ్మదీయదీక్షవహించిన హిందువు. అతఁడు స్వామికార్య నిర్వాహణ పారీణుఁడు. అతనినిజూచి యితరులు నేర్చుకొనవలయును నని యౌరంగ్‌జేబ్ కూడ వ్రాసియున్నాఁడు. షాహాజహాన్ కాలములో వ్యవసాయము విశేషముగా వభివృద్ధిఁ జెంది ప్రజలు మిక్కిలి సుఖపడుచుండిరి. రాజా బహారీమల్లుఁ డీతని రాజ్యమును గుఱించి యిట్లు వ్రాసియున్నాఁడు. "షాహాజహాన్ ప్రభుత్వకాలమందు సస్యాభివృద్ధి యెక్కుడుగానయ్యెను. ఏప్రదేశమునకు నక్బర్ కాలములో మూఁడులక్ష లాదాయముండెనో యాప్రదేశమునకే యిప్పుడు పదిలక్షల

యాదాయము వచ్చుచున్నది. రాజ్యవిస్తీర్ణ మెక్కుడుగానున్నను కలహములు విశేషముగాలేవు. న్యాయవిచారణకు వారములో నొక్కదినముచాలును. బుధవారమునాఁడు న్యాయవిచారణ జరుగును. ఆదినమునందైనను నిలుపది వ్యాజ్యములకంటె నెక్కుడుండవు.' ట్యావర్నియర్ అనుగ్రంథకారుఁ డీతని రాజ్యపాలనను గురించి యిట్లువ్రాసియున్నాఁడు. 'షాజహాన్ తనప్రజలను రాజు



జుమ్మామసీదు, డిల్లి.

వలెఁ బరిపాలింపఁడు; తండ్రివలెఁ బరిపాలించును. తండ్రితనపుత్రులను ప్రేమించిన ట్లాతఁడు ప్రజలను ప్రేమించును... ఇతర మహమ్మదీయరాజులవలె ప్రజలపై వసత్యారోపణములు చేయఁడు. ధనవంతుల యైశ్వర్యముపైఁ గన్నువేయఁడు. అందుచేఁ బ్రజలందఱును భయములేక యుందురు'.

ఈబాదుషాహ మితవ్యయశీలుఁడు. అందుచే నీతనియొద్ద చరమదశలో నిలువదినాలుగుకోట్ల రూపాయలు నిలువయుండెను. పట్టణములలోని ప్రజలును పల్లెలలోని ప్రజలును ధనధాన్యవంతులై సౌఖ్యముల ననుభవించు చుండిరి.

ఇంతమంచిరాజును నతనిపుత్రుఁడగు ఔరంగ్‌జేబ్ పదచ్యుతునిఁ జేసి చెఱసాల నుంపఁగాఁ జూచి ప్రజలెట్లుసహించిరో తెలియకున్నది. ఎన్నియో వందల సంవత్సరములనుండి పరతంత్రులై ప్రజలకు రాజకీయవ్యవహారములతో సంబంధము లేనివారైనందున నెవ్వఁడు రాజైన మనకేమియని యూరకుండిరి కాఁబోలును.

## మందిరములు.

కోట్లకొలఁది ధనము వెచ్చించి లోకైకసుందరము లైన దివ్యభవనములను గట్టించినందున నీబాదుషాహయొక్క కీర్తి యజరామరమయ్యెను. ఇతఁడు ఆగ్రాఢిల్లీపట్టణములను మరలఁ జక్కఁగఁ గట్టించెను. ఢిల్లీపట్టణమునొద్ద నొక సుందరమైన పట్టణమును గట్టించి దానికిషాహజహానాబాద్ అని పేరు పెట్టెను. అదిప్రస్తుతము ఢిల్లీపట్టణములోని యొక పేటగానున్నది.

ఢిల్లీపట్టణములో నితఁడు ఒక రాజప్రాసాదమును, దివాన్ ఇఖాస్ అను మహాసభయు, ఢిల్లిలో జుమ్మామసీదు అనునదియు, న్నాగ్రాపట్టణములో మోతీ మసీద్ అనునదియు, గోట్లకొలఁది ధనము వెచ్చించి కట్టించెను.

## తాజ్ మహల్.

కాని యితఁ డాగ్రాపట్టణములో ముంతాజ్ మహల్ అను తనభార్య జ్ఞాపకార్థమై కట్టించిన తాజ్ మహల్ అనుదివ్యమందిరము లోకములోని యద్వితీయభవనమని రెండువందల యేఁబది సంవత్సరములనుండియు జగద్విఖ్యాతిఁ జెందియున్నది. దీనియప్రతిమసౌందర్యములోఁ బోల్పఁదగిన మందిరము మఱి యొకటి భూతలమున లేదని యింగ్లీషు, ఫ్రెంచి మొదలైన యన్యదేశస్థులుగూడ

శొప్పుకొనిరి. ఈమందిరము కట్టుటకు మూఁడుకోట్ల రూపాయలు వెచ్చింపఁ బడియె; ఇరువదివేలజను లిరువదిరెండు సంవత్సరములవఱకుఁ బనిసేయు



తాజమహల్.

చుండిరి. ఆకాలమునందు నీదేశములో శిల్పకల యెంతయభివృద్ధి చెందియుండెనో చూచుట కీ మందిరము చాలును.

## మయూరాసనము.

ఈబాదుషాహ యాఱుకోట్లరూపాయలు వెచ్చించి తాను కూర్చుండుటకై మయూరాసనమును జేయించెను.

## ఔరంగ్ జేబ్.

(౧౬౫౮-౧౭౦౭).

విశాలమైనరాజ్యమును, మహోన్నతవైభవమును, నిరంకుశ ప్రభుత్వమును అనుభవించిన మొగల్ చక్రవర్తులలో నీతఁడు కడపటివాఁడు. విద్వాంసుఁడును, ప్రజ్ఞావంతుఁడును, ధైర్యశాలియు నయినప్పటికిని గపటాచరణమును, పరమతద్వేషమును గలవాఁ డగుటచే నలువదితొమ్మిది సంవత్సరములు రాజ్యముచేసి తుదకు విఫల మనోరథుఁడై పశ్చాత్తాపముతో దేహమును విడిచెను. ఈతని ప్రభుత్వవర్ణనమంతయు నితనికపటాచరణముతోడను, అందువలన నితనికిఁ గలిగిన పరాభవముతోడను నిండియున్నది.



ఔరంగ్ జేబ్.

### ప్రభుత్వవిభాగము.

ఈబాదుషాహయొక్క ప్రభుత్వకాలమును ముఖ్యముగా మూఁడు భాగములుగా విభజింప వచ్చును. మొదటివిభాగము ౧౬౫౮ మొదలు ౧౬౬౮ వఱకు. ఈకాలములోఁ దన శత్రువుల సంహరించి నిర్భయుఁడై నూతనరాజ్యపద్ధతినిఁ బ్రారంభించెను. రెండవభాగము ౧౬౬౯ మొదలు ౧౬౮౧ వఱకు. ఈకాలములో నాతఁడు కాశ్మీరదేశము, డిల్లీ, కాబూల్ మొదలయిన స్థలములలోఁ గాపురముండె మహమ్మదీయమతమును అభివృద్ధిచేయ యత్నించెను. కాని యాతని ప్రయత్నములు కొనసాగినవికావు. మూఁడవ

భాగము ౧౬౫౭-మొదలు ౧౭౦౭-వఱకు. ఈకాలమంతయు నాతఁడు శత్రు రాజ్యముల గెలుచుటకై దక్షిణదేశములోఁ గాలముగడపెను. తుదకు భగ్న మనోరథుఁడై దక్షిణదేశమందే మరణముచెందెను. ఆయా ప్రభుత్వ విభాగ ములు గ్రిందిగా వర్ణింపఁబడును.

## రాజ్యారోహణము.

రాజ్యమునకువచ్చిన రెండవసంవత్సరము (౧౬౫౯) లోఁ దన యన్న యైన దారా నోడించి, పట్టణములోఁ ద్రిప్పి యగౌరవపఱిచి చంపించెను. ౧౬౬౦ లో రెండవయన్నయగు సుజాను నోడించి యారాకాన్ దేశమునకుఁ బాఱఁదోలెను. అచ్చటనే వాఁడు మడిసెను. ౧౬౬౧లోఁ దమ్ముఁడగు మురాదును జెరసాలలోఁ జంపించెను. తనకు సహాయముచేసి రాజ్యమును సాధిం చిన మీర్‌జుమ్లాయను వానిని నమ్మక, యాతనిని ఆసాందేశమునకుఁ బంపెను. ఆతఁడచ్చటఁ దిరుగఁబడునేమోయని యతనికుమారునిఁ దనయొద్ద నుంచు కొనెను. ఆసాందేశపునీరు పడనందున మీర్‌కాసీ మచ్చటనే కాలధర్మము నొందెను. ఇట్లు భయపడవలసినశత్రువు లందఱును ఇహలోకమును త్యజిం చిరి. ఔరంగజేబు కొంతవఱకు నిర్భయుఁడయ్యెను. కొంతవఱ కనుటకుఁ గారణ మే మన నాతని తండ్రియగు షాహజహాన్ బ్రతికియుండువఱకు నాతఁడు పూర్తిగ నిర్భయుఁ డె ట్లగును?

౧౬౬౪ లో నౌరంగజేబు వ్యాధిగ్రస్తుఁడయ్యెను. శరీరము నిమ్మళించిన తరువాత గాలిమార్పుటకై యాతఁడు కాశ్మీరమునకుఁబోవ నిశ్చయించెను. ఇంతలో షాహఅబ్బాస్ అను పారసీకరాజునొద్దనుండి 'షాహజహానును చెఱలోనుండి విడిచి యతనికి రాజ్యమీయవలసినది. లేనియెడల మేముదండెత్తి రాఁగల' మని వర్తమానము వచ్చెను. అంత నాదుష్టుఁ డా సంకటములో నుండి తప్పించుకొనుటకుఁ దండ్రినిఁ జంపివేయ నిశ్చయించెను. తండ్రికిఁ బెట్టు మని యాగ్రాలోని రాజవైద్యునకు విషము పంపెను. కాని యావైద్యుఁ డట్టి

క్రూరకృత్యముఁ జేయలేక తానే యావిషమును భక్షించి ప్రాణములువిడిచెను. ౧౬౬౬ లోని డిసెంబరునెలలో షాహజహాన్ నశ్వరదేహమును వదలెను! అతని మరణకారణము తెలియదు. కాని యౌరంగజేబ్ అతనిని చంపించెనని వదంతికలదు.

తండ్రి మరణముతో నౌరంగజేబ్ భయరహితుఁడై యతనిని తాజ్ మహలులోఁ బెట్టించి యతని యౌర్ధ్వదేహికక్రియలు ఘనముగఁ జేసెను.

## పారసీకరాజు నిగ్రహము.

ఔరంగజేబ్ కాశ్మీరదేశములోఁ బదునెనిమిదినెలల నుండి శరీరారోగ్యము పూర్తిగఁగలిగి తనరాజధానికిఁ దిరిగి వచ్చెను. అతఁడు కాశ్మీరమునకుఁ బోవునపుడు సైన్యమును వెంటఁదీసికొనిపోవుట విని, యతఁడు పారసీక



ఆగ్రాదుర్గము.

దేశముమీఁదికి దండెత్తివచ్చునేమో యని తలఁచి, పారసీకపురాజు యుద్ధమునకు సిద్ధమైయుండెను. ఆసమాచారము తెలిసి యతనికోపమును జల్లార్చుట

కై ఔరంగ్ జేబ్ గొప్పబహుమతుల నొసఁగి యొక రాయబారినిఁ బంపెను. పారసీకరాజు బహుమతులను దీసికొనక యారాయబారిని నగౌరవించి, యొక సేవకునిచే నతనిగడ్డము లాగించి, శక్తికలదేని కాబూల్ మీఁదికి యుద్ధమునకు రావలసినదని చెప్పిపంపివేసెను. ఈవార్తఁ దీసికొని యారాయబారి తిరిగిరాఁగా ఔరంగ్ జేబ్ పారసీకరాజును నీవు సభలోనే యేల చంపలేదని కోపగించి చంపించెను. పారసీకరాజుతో యుద్ధముచేయుట కష్టమని భయపడినవాఁడయ్యును మీఁదికిమాత్రము యుద్ధసన్నాహముచేసెను. ఇంతలో నతని యదృష్టవశమునఁ బారసీకరాజు కాలధర్మము నొందెను.

పారసీకరాజు పోయినతరువాత ౧౬౬౭ లో ఔరంగ్ జేబ్ తనసైన్యములను కాబూల్ మీఁదికిఁ బంపెను. కాని యందువలన లాభము కలిగినది గాదు. ౧౬౭౩ లో అఫ్ గానులు తిరుగఁబడిరి. ఒకమోసగాఁడు తాను ఔరంగ్ జేబ్ అన్నయగు సుజా నని చెప్పి యచ్చటివారి నందఱిని జేర్చుకొని అఫ్ గానుల రాజయ్యెను. ఆ వార్తవిని ఔరంగ్ జేబ్ స్వయముగాఁ గాబూల్ మీఁదికి దండెత్తిపోయెను. కాని యఫ్ గాను లాతనికి స్వాధీనపడినవారు కారు. తుదకుఁ గాసీంఖానుఁడను తనసరదారుని నచ్చటనుంచి తాను వెడలి వచ్చెను. ఆసరదారుఁడు మోసముచేసి యఫ్ గాను లందఱిని సంహరించి యా దేశమును స్వాధీనము చేసికొనెను.

## హిందువులతో వైరము.

౧౬౬౬ లో ఔరంగ్ జేబునకుఁ గల భయములన్నియుఁ బోయి రాజ్యము సుస్థిరమయ్యెను. అందుచే హిందువులనందఱిని మహమ్మదీయులఁ జేయవలయును నని బాదుషాహాకుఁ జిన్ననాఁటినుండి గలకోర్కెఁ దీర్చుకొనుటకు మంచి సమయము వచ్చెను. అందుచే హిందూమతధ్వంసము చేయుటకు నాతఁడు సమకట్టెను. ౧౬౬౯ లోఁ గాశీపట్టణములోని బ్రాహ్మణులు తమ మతము మహమ్మదీయులకుఁగూడ బోధించుచున్నారని విని యాతఁ డచ్చటి హిందూ

మతాధ్యక్షునికి ముట్టుచున్న వర్షాశనముల నాపివేసి, తనరాజ్యములోని హిందూ పాఠశాలలను, మఠములను, దేవాలయములను విధ్వంసము చేయవలసి నదని తన యధికారులకు నాజ్ఞాపించెను. కాశీ, మధుర మొదలైన క్షేత్రముల లోని దేవాలయములఁ బడఁగొట్టించి యందలిప్రతిమల నాగ్రాపట్టణమునకుఁ దెప్పించి మసీదులపునాదులలో వేయించెను. హిందువులు పండుగలు చేసి కొనఁ గూడదనియు యాత్రలకు బోఁగూడదనియు నిర్బంధపెట్టసాగెను. అందుచేఁ బ్రజలందఱును భయభీతులై బాదుషాహామీఁదఁ దిరుగఁబడుటకు యత్నించుచుండిరి. ఢిల్లీపట్టణములో నతఁడు లేనప్పుడు హిందువులు తిరుగఁ బడుచుండిరి. ఒకప్పుడు తనకు మంత్రప్రభావము కలదనిచెప్పెడి యొకస్త్రీ జనులను జేర్చుకొని బాదుషాహాను బదచ్యుతునిఁ జేయుటకు సిద్ధమాయెను. కాని యామె తరువాత నోడింపఁబడియె.

ఢిల్లీపట్టణమునొద్ద నార్నోల్ గ్రామములో సత్నామీ లనుగోసాయి లుండిరి. వారు సత్త్వవృత్తిప్రధానులైనను పరులువారిని బాధించినయెడల రుద్రా వతారమును దాల్చువారు. ౧౬౭౨ లో గ్రామములోని కొత్వాల్ వారిని బాధపెట్టినందున వారు యుద్ధసన్నాహులైరి. బాదుషాహాయొక్క సైన్య మును నోడించి వారు నార్నోల్ గ్రామమును స్వాధీనముచేసికొనిరి. అంతఁ బ్రచండసైన్యముఁ దెచ్చి ఔరంగ్ జేబ్ వారి నందఱిని సంహరించెను.

హిందువులను మిక్కిలిబాధ పెట్టవలయుననియు, నగౌరవింపవలయు ననియు జిజియా యను జుట్టుపన్ను హిందువు లీయవలయునని విధించెను. లక్షల కొలఁది జను లిది యన్యాయమని మొఱ్ఱపెట్టుకొనిరి. శుక్రవారమునాఁ డతఁడు మసీదునకుఁబోవునపుడు వారంద ఱాతనిని నడ్డగించి మనవిచేసికొనిరి. కాని యామదాంధుఁడు వారిని నేనుఁగులతోఁ ద్రొక్కించెను. ఇట్లు హిందూ ప్రజలను లెక్కలేనిబాధలు పెట్టుచున్నందున హిందూరాజు లందఱు నత నికి శత్రువులైరి. ఉత్తరమున రాజపుత్రులును, మధ్యహిందూదేశమునందు

బుందేలులును, దక్షిణదేశమందు మహారాష్ట్రులును స్వతంత్రులై యతనితో ఘోరముగాఁ బోరసాగిరి. ఆచరిత్ర మీఁక్రింద వివరముగా నీయఁబడును.



తాజ్ మహాలులోని చెక్కడపుపని.

## రాజపుత్రులతో యుద్ధము.

ఆకాలమందు రాజపుత్రస్థానములో బహుపరాక్రమవంతులగు రాజులు రాజ్యముచేయుచుండిరి. వారితో నౌరంగజేబ్ స్నేహముచేసి యున్నయెడల

నతనికి నెంతయోలాభము కలిగియుండును. కాని యాస్వమతావేశాంధుఁడు రాజపుత్రులమతము నగౌరవించి వారినందఱిని దనకు శత్రువులఁజేసికొని తన రాజ్యమునకు మోసము తెచ్చుకొనెను. అప్పు డుదయపురములో రాజసింహుఁడను రాణా రాజ్యముచేయుచుండెను. అతఁడు హిందువులను బాధపెట్టుట తప్పని యొక యుత్తరము వ్రాసెను. అది స్వదేశస్వమతాభిమానములచే నిండియున్నది. ఆయుత్తరము వ్రాసినందువలనను, మఱికొన్ని కారణములవలనను, రాజసింహునకును ఔరంగ్‌జేబునకును ప్రబలమైనవైరము తటస్థించెను.

మార్వాడ్ దేశపురాజగు యశవంతసింహుఁడు రాజకార్యనిమిత్తమై కాబూల్ దేశమునకుఁ బోయియుండెను. అతఁడు లేనికాలమం దాతని కూరపుత్రుఁడగు పృథుసింహుఁడు రాజ్యము చేయుచుండెను. ఔరంగ్‌జేబ్ ఒక్కసారి పృథుసింహునిఁ బిలిపించి గౌరవించి తొడుగుకొనుటకు విషవస్త్రముల నిచ్చి యాతనిఁజంపెను. పుత్రశోకముచే యశవంతసింహుఁడు కాబూల్ దేశములోనే కాలధర్మమునొందెను (౧౬౭౮). యశోవంతసింహుని భార్య శిశువులగు తనయిద్దఱు పుత్రులతోడఁ గాబూల్ దేశమునుండి తిరిగి వచ్చునప్పుడు ఔరంగ్‌జేబు సైన్యము లామెను నడ్డగించెను. కాని యాశూరవనిత వారిని నోడించి తన రాటోడ్ సైన్యములతో ఢిల్లీపట్టణము చేరెను. అచ్చట నామెపుత్రులను బాదుషాహ చెఱఁబెట్టెను. దుర్గాదాసుఁ డను యశవంతసింహుని శూరసరదారుఁడు వారిని విడిపించి జోధపురమునకుఁ బంపెను. అచ్చట నామె తన జ్యేష్ఠపుత్రుఁడగు అజితసింహుని రాజ్యారూఢునిఁజేసి ఉదయపురరాజైన రాజసింహునితోఁ గలిసి ఔరంగ్‌జేబుతో యుద్ధముఁజేయసాగెను.

పౌరుషముగల రాజపుత్రు లందఱును దనపైఁ దిరుగఁబడుటఁ జూచి యౌరంగ్‌జేబ్ వారిని సాధించుటకై యుద్ధసన్నాహ మపరిమితముగాఁ జేసెను. ఆసన్నాహమును జూచి యాతఁడు లోకమంతయు జయించునా యేమని

లోకులు తలఁచిరి. కాని సైన్య బాహుళ్యమువలన బాదుషాహాకు విశేషలాభము కలిగినదికాదు. నాలుగుసంవత్సరములవఱకు కాతఁడును ఆతనిపుత్రులును రాజపుత్రులతోఁ బోరాడి యెన్నియో యుద్ధములలోఁ బరాజితులయి రాజపుత్రులకు ననుకూలములైన వరములిచ్చి వారితో సంధిచేసికొనిరి. సంధిలోని యంశములు (౧) ఔరంగ్‌జేబు స్వాధీనతలోనున్న రాజపుత్రుల రాజ్యమంతయు వారికి నిచ్చివేయవలయును. (౨) మతవిషయములో నతఁడు జోక్యము కలుగఁ జేసికొనఁగూడదు; జిజియాపన్ను రాజపుత్రుల నడుగఁగూడదు. (౩) యశ్వంత సింహుని రాజ్యమంతయు నతని కొమారునకు నిచ్చివేయవలయును. (౪) రాజపుత్రులు పూర్వమువలెనే బాదుషాహాకు సంబంధించినపనులు చేయుచుండ వలయును. ఇంతటితో రాజపుత్రులయుద్ధము ముగిసెను. ఔరంగ్‌జేబు బలము క్షీణించెను.

## ఛత్రసాల్ రాజుతో యుద్ధము.

మధ్యహిందూస్థానములో బుందేల్‌ఖండ మనుదేశ మొకటికలదు. అచ్చటి వారిని బుందేలు లనియెదరు. అచ్చట చంపతరాయ్ అనువాఁడు షాహజహాన్ కాలమందు రాజ్యముచేయుచుండెను. అక్బర్ కాలములో బుందేలులు మొగలులకు సామంతులైరి. బుందేల్‌ఖండములోని రాజులందఱిని జేర్చుకొని చంపతరాయ్ స్వతంత్రుఁడగుటకు యత్నించెను. షాహజహాన్ బాకీఖాన్ అనువానిని చంపతరాయ్ మీఁదికిఁ బంపగా నాతఁడాగ్రేసరుఁడై శత్రుష్కానిఁ బరాభవించెను. ఆయుద్ధములో చంపతరాయుని కుమారుఁడగు సత్యాహునుఁ డనువాఁడు వీరస్వర్గముఁ జెందెను. చంపతరాయుని నెటులైన సాధింపవలయునని షాహజహాన్ అనేకయుక్తులఁ బన్నెనుగాని యతని కోర్కి సిద్ధించినదికాదు. అందుపైఁ గోపోద్దీపితుఁడై షాహజహాన్ ఆగ్రానుండి మహబత్‌ఖానుని, దక్షిణమునుండి ఖాన్‌జహానుని, ప్రయాగనుండి అబ్దుల్లా యను వానిని నొక్కపెట్టున నాతనిమీఁదికి బంపెను. కాని

మరాటావారివలెనే బుందేలులును పర్వతముల నాశ్రయించి మొగలుల సైన్యములను మిక్కిలిబాధపెట్టి పెక్కుసారు లోడించిరి. అహమహమికగల మహమ్మదీయశూరాగ్రేసరు లందఱును యుద్ధములోఁ బడిరి. దానిచే చంపతరాయునకు కుంచ్ పరగణా జాగీరుగ నిచ్చి తనయొద్ది సరదారులలో నొక గొప్పయధికారమిచ్చి యాతనితో సంధిచేసికొనెను. తరువాత చంపతరాయుఁడు రాజ్యము సంపాదించు విషయమై ఔరంగ్ జేబునకును, దారాకును జరిగిన యుద్ధములో ఔరంగ్ జేబ్ పక్షమునఁ బోరాడి యతనికి జయముకలిగించెను. కాని మిత్రద్రోహియగు ఔరంగ్ జేబ్ తనకు రాజ్యము వచ్చినతరువాత చంపతరాయుని నగౌరవించినందున నతఁడు తనరాజ్యమునకుఁబోయి ఔరంగ్ జేబుతోఁ బోరాడుటకై సైన్యములఁ జేర్చుచుండెను. ౧౬౬౧లో నాశూరాగ్రేసరుఁడు శత్రువులతోఁ బోరాడుచుఁ బ్రాణములఁ ద్యజించి జన్మసాఫల్యముఁ గాంచెను. ఇతని కొమారుఁడు ఛత్రసాల మహారాజు.

ఆకాలములోని పశ్చిమ హిందూదేశమందలి మహారాష్ట్రుల చరిత్రకును, మధ్య హిందూదేశమందలి బుందేలుల చరిత్రకును గొంత సామ్యముకలదు. ఇద్దఱును స్వదేశస్వాతంత్ర్యమునకై పడరానియిడుములు పడుచుండిరి. ఛత్రసాలుని తండ్రియైన చంపతరాయుని శివాజీతండ్రియైన శహాజీతోఁ బోల్చవచ్చును. వారి కుమారులగు ఛత్రసాల్ శివాజీలు బుందేల మహారాష్ట్రులను స్వతంత్రులఁజేసి మొగల్ ప్రభుత్వమును ధిక్కరించిరి. ఈఛత్రసాలుఁడు ౧౬౫౦లో జన్మించెను. శివాజీవలెనే యితని చిన్నతన మంతయుఁ గష్టములోఁ గడచెను. రామాయణమహాభారతాది కథలను విన్నందున నితనికి స్వదేశస్వమతాభిమానములుగలిగెను. తండ్రి పోయినతరువాత నితఁడు తనదేశమునకుఁ గల పారతంత్ర్యమును బోఁగొట్టుటకుఁ గృతసంకల్పుఁడై సైన్యసన్నాహముచేయఁ దొడఁగెను. ఆకాలమునందే మహారాష్ట్రదేశమును పారతంత్ర్యమునుండి విడిపించుటకు శ్రీశివాజీచేఁ జేయఁబడుచున్న ప్రయత్నములనువిని యా మహా

మహాుని దర్శింపఁగోరెను. స్వదేశోద్ధారణమునకై యవతరించిన యీ యద్వితీయపురుషు లిద్దఱును భీమానదియొద్దనుఁ గలిసికొనిరి. ఛత్రసాలుని యుత్సాహమును, స్వదేశప్రీతియుఁజూచి శివాజీ మిక్కిలి సంతసించి తనమధుర వాక్కులతో స్వాతంత్ర్య ప్రీతియు యవనసంహారనిశ్చయమును మున్నాటికి మఱవ వలదని బోధించి తనకత్తి యతనికి బహుమతిగా నొసఁగి స్వదేశోద్యమమునకు నాతనిఁ బురికొల్పెను. ఆకాలమందలి వాషింగ్టన్ (Washington) విల్లియం ఆఫ్ ఆరెంజి (William of Orange) లనఁదగు నీ స్వదేశభక్తుల సమాగమప్రసంగమును భూషణకవిమిగుల రసవంతముగా వర్ణించియున్నాఁడు.

తరువాత ఛత్రసాలుఁడు స్వరాజ్యము స్థాపించెను. ఔరంగ్‌జేబ్ ఫిదాయీఖాన్ అనువానిని ఛత్రసాలునిమీఁదికిఁ బంపెను. ప్రప్రథమముననే బుందేలు లాతురుష్కునిఁ బూర్తిగఁ బరాభవించిరి. అంత ఛత్రసాలుని నందఱుఁ గొనియాడసాగిరి. అంతకుఁ బూర్వము తురుష్కులతోఁ గలిసియున్న బుందేలులు కూడవచ్చి ఛత్రసాలునికి సహాయము చేయసాగిరి. అతఁడు బాదుషాహా యొక్క రాజ్యమును గొల్లకొట్టి పర్వతదుర్గముల నాక్రమించు కొనసాగెను. క్రమక్రమముగా నతనిరాజ్యము కొలఁదికాలములోనే మిక్కిలి యభివృద్ధి చెందెను. ఇదియంతయు సహింపనోపక ఔరంగ్‌జేబ్ రణదుల్లాఖానునిఁ బ్రచండసైన్యమిచ్చి బుందేల్‌ఖండముమీఁదికిఁ బంపెను. ఉభయసైన్యములకు గడకోట యనుచోట ఘోరమైనపోరు జరిగి మహమ్మదీయు లోడిపోయిరి. రణదుల్లాఖానుఁడు కాళ్లకు బుద్ధిచెప్పి బ్రతికిపోయెను. ఈ పరాభవమునకై బాదుషాహా యెంతయుఁజింతించెను. ఛత్రసాలుఁడు ఢిల్లీమీఁదికి దండెత్తివచ్చునేమోయని భయపడి బాదుషాహా మరల సైన్యములిచ్చి తుహవ్వర్ ఖానునిఁ బంపెను. ఈసరదారుఁడు శూరుఁడు, యుక్తిమంతుఁడు. కాని శూరాగ్రేసరులైన బుందేలుల యెదుట నితని నక్కజిత్తులు పనికివచ్చినవికావు. ఇతఁడును యుద్ధములో నోడి పాఱిపోయెను. ఈసంతతవిజయములచే ఛత్రసాలునికీర్తియు,

వైభవమును నలుదెసలఁ బ్రసరించెను. అతఁడు బుందేల్‌ఖండ మంతయు సాధించి యచ్చట నిరంకుశ ప్రభుత్వము చేయసాగెను. అతనికి సామంతులగు తురుష్క ప్రభువు లనేకులు చౌతాయీ యనునాల్గవవంతు పన్నియసాగిరి.

అంత షేక్ అన్వర్ ఖానుఁ డనువాఁడు ఢిల్లీనుండి ఛత్రసాలు మీఁదికి దండెత్తివచ్చెను. కాని ఛత్రసాలునిచేఁ జెఱపట్టఁబడి యతనికి శరణుఁజొచ్చి లక్షయిఱువదివేలరూపాయ లాతనికి దండుగయిచ్చి విముక్తుఁడయ్యెను. బాదుషాహా నిండుసభలో నాఖానుని నిందించి యతనిబిరుదు లన్నియు నధికారము లన్నియుఁ దీసివేసెను. ఛత్రసాలుని గర్వమడంచు వీరుఁ డొక్కఁడైనఁ దనసభలో లేఁడుగదాయని ఔరంగ్ జేబ్ నిరాశతోఁ బలుకఁగా మీర్జాసదరుద్దీన్ అను వాఁడు తానాపనిచేసెదనని కంకణము గట్టుకొనెను. అతని కన్నియోకపటోపాయముల నేర్పి బాదుషాహా యుద్ధమునకుఁ బంపెను. కాని వాఁడును ఛత్రసాలుని శౌర్యమునకుఁ దాళలేక చేతులాడించుకొనుచుఁ దిరిగి వచ్చెను. ఇట్లనేక మహమ్మదీయయోధులఁ బంపినను కార్యముకానందున తుదకు ఔరంగ్ జేబ్ ఛత్రసాలునితో స్నేహపూర్వకమైన సంధిచేసికొనెను. ఇట్లు మహమ్మదీయుల వెడలఁగొట్టి స్వరాజ్యస్థాపనము చేయునపుడు ఛత్రసాలునకు నాతని గురువగు శ్రీప్రాణనాథప్రభు ఐనుసాధువు తనబోధలచేఁ బ్రోత్సాహము కలిగించుచుండెను. ౧౭౦౭లో ఔరంగ్ జేబ్ మరణము నొందినతరువాత నతని కుమారుఁడును ఛత్రసాలుని స్వాతంత్ర్య మొప్పుకొని యతనివలన ననేకపర్యాయములు సైన్యసాహాయ్యము వడసెను. అటుతరువాత నీఛత్రసాలుని ప్రేరేపణావలననే మహారాష్ట్రులు బుందేల్‌ఖండములోఁ బ్రవేశించిరి. ఆసమాచారము మహారాష్ట్రుల చరిత్రములో సవిస్తరముగా వ్రాయఁబడును. చత్రసాలుఁడు ౧౬౫౦ లో జన్మించి ౧౭౩౩ లోఁ గీర్తిశేషుఁ డయ్యెను.

## మహారాష్ట్రులతో యుద్ధము.

దక్షిణములోనున్న బిజాపూర్, అహమ్మద్‌నగర్ రాజ్యములను సాధింప

వలయునని ఔరంగ్ జేబ్ తలఁచుచుండగా నచట మఱియొక ప్రబలరాజ్య ముదయించెను. మహారాష్ట్రదేశములో ౧౬౨౭-వ సంవత్సరమునందు శ్రీశివాజీ యను నవతారపురుషుఁడొకఁ డుదయించెను. అతఁడు స్వరాజ్యస్థాపనైకతత్పరుఁడై బిజాపూర్ రాజులతోడను మొగలులతోడను బోరాడఁ జొచ్చెను. మొగలులతో నతఁడు పెక్కుమారులు పోరాడి వారిని నోడించెను. ౧౬౬౫ లో నతఁడు ఔరంగ్ జేబుతో సంధిచేసికొని యాతనిఁజూడ ౧౬౬౬ లో దిల్లీపట్టణమునకుఁబోయెను. అచ్చట మోసముచేసి యౌరంగ్ జేబ్ శివాజీని చెఱఁబెట్టెను. కాని యాతఁడా చెఱఁ దప్పించుకొని సుఖముగా స్వరాజ్యమునకు వచ్చి చేరెను. ౧౬౬౭ లో ఔరంగ్ జేబ్ శివాజికి ననుకూలమైనసంధి చేసికొననలసినవాఁడాయెను. ౧౬౭౭ లో శివాజి మొగలసైన్యములఁ బూర్తిగ నోడించెను. ౧౬౭౪ లో శివాజి పూర్తిగ స్వతంత్రుఁడై పట్టాభిషేకము చేసికొనెను. ఇట్లు శివాజి మొగలులరాజ్యములోని యనేకప్రదేశములను స్వాధీనము చేసికొని ౧౬౮౦లోఁ గీర్తిశేషుఁడయ్యెను. తరువాత నాతని కుమారుఁడగు సంభాజీ మహారాష్ట్రులకు రాజయ్యెను. మూఁడవభాగ మందు శివాజీచరిత్ర సవిస్తరముగ వర్ణింపఁబడును. చరిత్ర సందర్భానుసారముగ నిచ్చట సూక్ష్మముగా వ్రాయఁబడినది.

## దక్షిణ దిగ్విజయ యాత్ర.

### (౧౬౮౩ - ౧౭౦౭).

రాజ్యమునకు రాకపూర్వము ఔరంగ్ జేబ్ దక్షిణములో సుబేదారుగా నుండి అహమ్మద్ నగరరాజ్యమును గెలిచెను. గోలకొండవారియొద్దనుండి కప్పము తీసికొనెను. అప్పుడే బిజాపురగోలకొండరాజ్యముల గెలిచి మొగల్ సామ్రాజ్యములోఁ గలిపివేయవలయునని నిశ్చయించెను. కాని యప్పుడు రాజ్యాభిలాషచే నుత్తరహిందూదేశమునకు వెడలిపోయెను. ప్రస్తుత మీరెండురాజ్యములును, క్రొత్తఁగా మహారాష్ట్రులచే నాక్రమింపఁబడిన రాజ్యమును, సాధింప

వలయునని బాదుషాహ ౧౬౮౩ లో ఢిల్లీనుండి బయలుదేఱి దక్షిణమునకు వచ్చెను. అప్పుడాతనివెంటనున్న సముద్రమువంటి సైన్యమును గ్రంథకారు లనేకు లాశ్చర్యముకరముగా వర్ణించియున్నారు. బాదుషాహవెంట నలువదివేల గుఱ్ఱపురౌతులును, లక్ష కాల్బలమును, ఏఁబదివేల లొట్టిపిట్టలును, మూఁడువేల యేనుఁగులు నుండెను. కొందఱు మూఁడులక్షల గుఱ్ఱపురౌతులును, నాలుగు లక్షల కాల్బలములును ఉండెనని వ్రాసియున్నారు. ఈసైన్యమువిడిది ముప్పది మైళ్ల విస్తారము కలిగి యుండెను. అందు రెండునందలయేఁబది సంత లుండె నఁట. ఈసైన్యసముద్రమును దీసికొని బాదుషాహ దక్షిణమునకు ౧౬౮౩లో వచ్చి మరల ఢిల్లీపట్టణమునకుఁ బోలేదు. ౧౭౦౭-వ సంవత్సరములో అహామ్మద్ నగరపట్టణములో మృతిఁజెందువఱకు దక్షిణదేశమందే యుండెను.

పరస్పరకలహములతో క్షీణదశకు వచ్చియున్న బిజాపురరాజ్యమును ౧౬౮౬ లోను, గోలకొండరాజ్యమును ౧౬౮౭ లోను జయించెను. ౧౬౮౯ లో మహారాష్ట్రుల రాజైన సంభాజీనిఁ జెఱపట్టి కండ్లుతీసి బాధపెట్టి చంపించెను. అప్పటినుండి ౧౭౦౧ వ సంవత్సరమువఱకు మహారాష్ట్రులతోఁ బోరాడుచు వారిదుర్గము లనేకములఁ దీసికొనెను. కాని ౧౭౦౨-మొదలు ౧౭౦౫-వ సంవత్సరము వఱకు మహారాష్ట్రవీరులు విజృంభించి పోయినదుర్గముల నన్నిటిని మరల సాధించిరి. తుదకుఁ దా నిఱువదియైదు సంవత్సరములవఱకు దక్షిణమునం దుండినను ఏమియు లాభము కలుగలేదని చూచి తన మనోరథము లన్నియు వ్యర్థమవుటకుఁ జింతించి తనతప్పులను దిద్దుకొనుటకు సమయము లేదని తలఁచి చింతాక్రాంతుఁడును, నిరాశామగ్నుఁడును, పశ్చాత్తప్తుఁడును, భయాక్రాంతుఁడును అగు నాముదుసలిబాదుషాహ ౧౭౦౭-వ సంవత్సరములో అహామ్మద్‌నగర్ పట్టణమునందుఁ గాలధర్మమునొందెను.

## ఔరంగ్‌జేబ్ యోగ్యత.

ఈబాదుషాహ సద్గుణదుర్గుణ పుంజముల మిశ్రణముచేఁ జేయఁబడెను.

ఇతనియందలి సద్గుణములను గొంతవఱకుఁ గనుఁగొందము. ఇతఁడు గొప్పవిద్వాంసుఁడు. ఏయేవిద్యలు రాజపుత్రులు నేర్చుట యావశ్యకమో యావిద్యలను గుఱించి యీతఁడు తనగురువునకు వ్రాసిన యుత్తరమువలనఁ దెలియఁగలదు. అరబ్బీపారసీక భాషలలో నీతఁడు పండితుఁడు. ఇతఁడు తనపుత్రికలకుఁ గూడ విద్య నేర్పెను. ఒకపుత్రిక యరబ్బీపారసీక భాషలఁ జక్కఁగ నెఱిఁగియుండెను. మఱియొకకూఁతునకు కురాన్ గ్రంథమంతయు ముఖగతమై యుండెను. ఇతనియందుఁ గల రెండవసద్గుణ మింద్రియనిగ్రహము. ఇతఁ డెన్నఁడును మద్యపానము చేయలేదు. మహమ్మదీయు లెవ్వరును తనరాజ్యములో మద్యపానము చేయఁగూడదని శాసించెను. అట్లు చేయువారి కాలుసేతులు ఖండించునట్లు ఆజ్ఞాపించెను. అట్లే తనరాజ్యములోని గాయనవాద నాదులు నాపివేసెను. నాచ్ అనఁబడు నృత్యవిద్యను నెవ్వ రభ్యసింపఁగూడదని విధించినందున ననేక వారకాంతలకు నుపవాసము సంభవించెను. వారినందఱిని వివాహముచేసికొనుఁడని యాజ్ఞాపించెను. మతవిషయము తప్ప మఱియేవిషయమైన వ్యాజ్యములు వచ్చినప్పుడును క్రమమైనతీర్పు చెప్పును. ప్రజలను బాధపెట్టిన యధికారులను గఠినముగా శిక్షించెను. ఇవి యితనియందలి సద్గుణములు.

ఇఁక దుర్గుణములను జూడఁబోయినయెడల నవి యసంఖ్యములు కలవు. కపట మీతనియందలి మొదటి దుర్గుణము. మనోవాక్కాయకర్మములఁ ద్రివిధముగానుంచుట యీతని స్వభావవిశేషము. రాజ్యతృష్ణ, రాక్షసవృత్తి, క్రూరస్వభావమీతని భ్రాతృపితృమిత్ర హత్యలవలననే విదితము. కృతజ్ఞతయనుమాట యీతనికిఁ గలలోనైనఁ దెలియదు. తనకుసాహాయ్యముచేసిన మీర్ జుమ్లా, యశోవంత్ సింగ్, చంపతరాయ్ మొదలయిన వారివిషయమై యితఁడుచేసిన యపకార మాసురప్రకృతులకుఁదగినది. ఇతనిదుర్గుణములలో హిందూమతద్వేషమనునది మిక్కిలిగొప్పది. అందువలన నితనికి దేశములోని శూరులందఱును శత్రువులైరి. రాజ్యమంతయు శిథిలమై యితనితరువాతఁ దుత్తునియలైపోయెను.

## అతని యాదాయము.

భూమిపన్నువలన నీతనికి ౮౩కోట్ల రూపాయలును, తక్కిన పన్నులవలన ౭కోట్ల రూపాయలును మొత్తముమీఁద ౯౦కోట్లు యాదాయముండెను. ఆదాయమునకుఁ దగినట్లు వ్యయమును విశేషముగా నున్నందున ఔరంగ జేబు మరణ సమయమందు బొక్కసములోఁ బదుమూఁడులక్షల కంటె నెక్కుడు ధనములేదు.

ఔరంగజేబు రమారమి యేఁబది సంవత్సరములవఱకు రాజ్యముచేసినందు నను, రాజకార్యకుశలుఁడైనందునను, అతనియొద్ద శిష్యత్వముచేసి రాజ్యవ్యవ హారములలో నారితేఱినవా రనేకులుండిరి. అయోధ్యనవాబుల మూలపురుషుఁ డగు సాదత్ కాన్, హైదరాబాదునవాబులకు మూలపురుషుఁడగు నిజాం ఉల్ము లుక్, బంగాల్ సుబేదారులకుఁ గూటస్థుఁడగు మర్షిద్ కులీఖాన్, దక్షిణదేశ ములోఁ బ్రసిద్ధివహించిన దావుద్ ఖాన్ పన్ని మొదలయిన తురుష్కరాజ్య కార్యధురంధు లనేకులు ఔరంగ్ జేబ్ వద్దనే రాజనీతి నేర్చుకొనిరి. వీరు ముందుకాలములో ననేకరాజకీయ వ్యవహారములఁ జేసిరి.

## బహాదుర్ షాహా.

(౧౭౦౭-౧౭౧౨).

ఔరంగ్ జేబ్ మరణముఁజెందినపు డాతని పెద్దకొమారుఁడగు ముఅజ్జమ్ అనువాఁడు కాబూల్ దేశములోను, అజీమనువాఁడు తండ్రియొద్ద నహమ్మద్ నగరములోను, మూఁడవవాఁడగు కామ్‌బక్ష్ విజాపురములోను నుండిరి. అందుఁ బ్రతివాఁడును రాజ్యపదమునకై యత్నింపసాగెను. సైన్యాధీశుఁడగు జాల్ ఫికర్ ఖాన్ అజీమునకు సహాయుఁడుగా నుండెను. వారిద్దఱును సైన్య ములతో డిల్లీమీఁదికిఁ బోవసాగిరి. ఈసమాచారము తెలిసి కాబూల్ దేశము నుండి ముఅజ్జమ్ సైన్యములతో వచ్చెను. వానికి రాజపుత్రులు సహాయులైరి. ఆగ్రాపట్టణమునొద్ద నన్నదమ్ములకు యుద్ధమై యందు అజీమ్ చంపఁబడెను.

మఅజ్జమ్ బహదుర్ షాహ యను పేరుతో బాదుషాహయయ్యెను. తరువాత దక్షిణమునకుఁబోయి హైద్రాబాదునొద్ద యుద్ధములో కాంబక్షును జంపి నిర్విచారుం డయ్యెను. మరాటీవారిరాజగు శాహూ ఔరంగ్ జేబుయొక్క చెఱలో నుండఁగా నతనిని విడిచి, యాతనిరాజ్య మాతనికిచ్చి తనకుసహాయునిగాఁ జేసికొనియెను. దావూద్ ఖాన్ పన్నీయను వానిని దక్షిణదేశపు నుబేదారుగా నేర్పఱచుకొని జుల్ఫికర్ ఖానుని తనసభలో నుంచుకొనెను.

## శిఖ్ఖులోకులతో జగడములు.

ఈ బాదుషాహకాలములో జరిగిన ముఖ్యచరిత్రాంశము శిఖ్ఖులతోఁ బోరాడుట. శిఖ్ఖులయుత్పత్తిని గుఱించి యిచ్చటఁ గొంత వ్రాయవలసియున్నది.

హిందువులును మహమ్మదీయులును పంజాబుదేశములో మూఁడునాలుగు వందలయేండ్లవఱకును గలిసియున్నందున వారియాచారవిచారములలోఁ గొంత వఱకు సామ్యముకలిగెను. హిందూమహమ్మదీయ సాధుపురుషులు గూడ నీ యుభయుల నైకమత్యమునే బోధింపసాగిరి. ఇట్టి విఖ్యాతసాధు వొకఁడు ౧౪౬౯లో నుదయించెను. అతనిపేరు నానక్. హిందూమహమ్మదీయ మతములలోనుండి కొన్ని సిద్ధాంతములను దీసికొని యితఁడు నూతనమతమును స్థాపించెను. దానికే సిఖ్ మతమనిపేరు. సిఖులనఁగా శిష్యులనియర్థము. మత విషయములో దురాగ్రహము పనికిరాదనియు, మనస్ఫూర్తిగా నెవ్వఁడారాధన చేసినను అయ్యారాధన ఈశ్వరు నందఁగలదనియు ఈనూతనమతములోని సిద్ధాంతములు. క్రమక్రమముగా నీమత మభివృద్ధినొందెను. వీరి మతగ్రంథమునకు 'గ్రంథసాహెబ్'అనిపేరు. అదిపంజాబీ (గురుముఖీ) భాషలోవ్రాయంబడియున్నది. నానక్ తరువాత నేర్పడిన ముగ్గురుగురువులు సాధువృత్తి గలవారు. వారిని మొగల చక్రవర్తులు గౌరవించు చుండిరి. వారికిఁ గొన్నిజాగీరులును నొసఁగిరి. నాల్గవగురువు పద్దమండియు నీమతాధికారులు సాధు

వృత్తిని విడిచి రాజవృత్తిని నవలంబించిరి. అనేకరక్షకభటులను వెంటనుంచుకొనసాగిరి. అందుచే మొగల చక్రవర్తులకును వారికిని వైరమువచ్చెను. ఎనిమిదవగురువగు తేగ్ బహద్దరను వానిని డిల్లీకిఁ బిలిపించి యౌరంగ్ జేబ్ చంపించెను. అందుచే సిక్కులు తిరుగఁబడిరి. తొమ్మిదవ గురువగు గురుగోవింద్ అనువాఁడు యుద్ధముచేసి యోడి యరణ్యములోనికిఁ బాఱిపోయెను. అచ్చటనె యతఁడు ౧౭౦౮లోఁ జంపఁబడెను.

అప్పటినుండి సిక్కులు తమసౌమ్యవృత్తిని వదలి యుద్ధప్రియులయిరి. బందా యనువానిని దమగురువుగఁ జేసికొని వారు మతయుద్ధములను జేయసాగిరి. మొగలులపైఁ దిరుగఁబడి మసీదులను ధ్వంసముచేసిరి. పట్టణములనుగాల్చివేసిరి. ఈసమాచారము లన్నియు ముఖ్యముగా సర్ హింద్ అనుచోటజరిగెను. అప్పుడు బహదుర్ షాహ వారిమీఁదికి దండెత్తెను. అతనిసైన్యము లనేకులగు సిక్కులనఱికివేసెను. బందా యనువానిని బట్టుకొని డిల్లీకిఁదీసికొనివచ్చి బాధలు పెట్టిచంపిరి. అప్పటినుండి సిక్కులు ముప్పదిసంవత్సరములవఱకు కూరకుండిరి. తరువాతఁ గ్రమక్రమముగా వారికి దేశాభిమానము కలిగి వారిలో ననేక రాజ్యము లుద్భవించెను. తుదకు రణజిత్ సింగను మహావీరుఁడు వారినందఱిని నేకచ్ఛత్రము క్రిందికిఁదెచ్చిన కథాభాగము బ్రిటిషుప్రభుత్వవర్ణనలో వివరముగా వర్ణింపఁబడును.

బహాదుర్ షాహానుగుఱించి విశేషము వ్రాయవలసినదిలేదు. అతనికి సాహసధైర్యములులేవు. కాని యాతఁడు కొంతవఱకు సువిచారము కలవాడును, మిత్రప్రియుండును అని చెప్పవలెను. రాజ్యమునకు వచ్చునప్పుడే యాతఁడు వృద్ధుఁడు. కావున నైదుసంవత్సరములు మాత్రము రాజ్యముచేసి యాతఁడు ౧౭౧౨ లోఁ గాలధర్మము నొందెను.

## జహాందర్ షాహా.

(౧౭౧౨).

ఇతఁడు బహాదుర్ షాహ పెద్దకొమారుఁడు. జుల్ ఫికర్ ఖానుని సహాయము

వలన రాజ్యారూఢుఁ డయ్యెను. ఇతఁడు క్రూరుఁడును దుర్వ్యసనాసక్తుఁడును అయినందునఁ దన సరదారుల నందఱిని నగౌరవించెను. అందుచే నితని తమ్మునికుమారుఁడగు ఫరుఖ్ సియర్ అనువాఁడు బంగాళమునుండి ఢిల్లీపట్టణమునకుఁబోయి జహాందరును, జుల్ ఫికర్ ను జంపి తాను రాజయ్యెను.

## ఫరుఖ్ సియర్.

(౧౭౧౩ - ౧౭౧౯).

బహార్ ప్రాంతమునకు నధికారియగు సయ్యాద్ హుసేనల్లీ, ప్రయాగప్రదేశమునకు నధికారియగు సయ్యాద్ అబ్దుల్లా యనుసరదారు లన్నదమ్ములు. వీరిసహాయమువలననే యీ బాదుషాహకు రాజ్యము ప్రాప్తించెను. అందుచే నతఁడు అబ్దుల్లా యనువానికిఁ దన ముఖ్యమంత్రిత్వమును, హుసేనల్లీకి సైన్యాధిపత్యమును నొసంగెను. అందుచే నీసయ్యాద్ సోదరులిద్దఱును సర్వాధికారముకలవారలయి, బాదుషాహానుగూడ లక్ష్యముచేయరైరి. వారిని నాశముచేయ వలయునని బాదుషాహ యత్నించెను. కాని యాతని యుపాయము లన్నియు నాతనికే చెఱుపుచేసెను. రాజపుత్రులందఱును నైకమత్యముకలవారలై మొగలుల యధికారమును ధిక్కరించివేసిరి. ఈస్టు ఇండియాకంపెనికి బంగాళాదేశములో నీబాదుషాహ కొన్నిస్థలము లిచ్చెను. ఇంతలో సయ్యాద్ సోదరులకును ఇతనికి మిక్కిలివైరము కలిగెను. వారిబాధ తప్పించుకొనుటకై వారిలో నొక్కఁడగు హుసేనల్లీ యనువానిని దక్షిణదేశమునకు సుబేదారుగాఁబంపెను. కాని వాఁడచ్చట మరాటావారితో స్నేహముచేసి వారిసైన్యములను, బాలాజీ విశ్వనాథ్ అను పేష్వాను వెంటఁదీసికొని ఢిల్లీపట్టణముమీఁదికిఁ బోయి తన యధికారమును మరలస్థాపించెను (౧౭౧౭). ఇట్లు మరలఁ బూర్ణాధికారము కలవారలై ౧౭౧౯ లో ఫరుఖ్ సియరును జంపించి యాఱునెలలలో నిద్దఱు రాజపుత్రుల సింహాసనస్థులఁ జేసిరి. కాని వా రేకారణమువలననో మృతులైరి. తుదకు మహమ్మద్ షాహాయనువానిని బాదుషాచేసిరి. కావున నీసయ్యాద్ సోదరు

[illegible] 'రాజనిర్మాత' (King makers) అని పేరువచ్చెను. ఫరుఖ్ సియర్ వ్యసనాసక్తుఁడు, నీచుఁడు. క్షీణించుచున్నట్టి రాజ్యమును బాగుచేసికొను సామర్థ్య మీతనియందు లేదు.

## మహమ్మద్ షాహా.

(౧౭౧౯ - ౧౭౪౮).

ఇతఁడు రాజ్యమునకువచ్చిన కొలఁదికాలములోనే సయ్యద్ సోదరుల నోడించి, చంపించెను. ఇతఁడు రాజ్యకార్యకుశలుఁడు కాఁడు. రాజ్యవ్యవహారములయందు నితనికి లక్ష్యమె లేకయుండెను. ఎప్పుడును విలాసమగ్నుఁడై యుండును. ఇతనికాలమునందే మొగల్ సామ్రాజ్యము తునకలు తునకలుగా విభాగమగుటకుఁ బ్రారంభమైనది.

## దక్షిణహైద్రాబాద్.

దక్షిణములో నిజామ్ ఉల్ములుక్ అనువాఁడు స్వతంత్రరాజ్యమును స్థాపించెను. ఇతఁడు ఔరంగ్ జేబు శిక్షలోఁ బెరిఁగినయోధ. రాజకార్య కుశలుఁడు. ఇతని మొదటిపేరు కమరుద్దీన్ ఖాన్. ఇతనికి ఔరంగ్ జేబ్, చింకిలిజ్ ఖాన్ అనుబిరుదు నిచ్చెను. జుల్ ఫికర్ ఖానునితోఁ బోరాడునెడ సయ్యద్ సోదరుల కితఁడు సహాయము చేసినందున వారీతనికి ఆసఫ్ జాహా, నిజాం ఉల్ ముల్క్ అనుబిరుదుల నొసఁగిరి. నిజామ్ అను నామమె యితనివంశజుల కిప్పటికిని జరుగుచున్నది. మొగల్ సామ్రాజ్యముయొక్క యవసానదశలో నిజాం ఉల్ములుక్ వంటి చతురుఁడును, దూరదృష్టికలవాఁడును, రాజకార్య కుశలుఁడును మఱియొకఁడు లేఁడు. మొగలురాజ్యము పడిపోకుండఁగ నుండుటకు నితఁడు కొంత యత్నించెను. కాని యందువలన ముసలిదైన మొగలరాజ్యమునకు నేమియు లాభములేదని యెఱిఁగి, వీలయినయెడల నాత్మలాభమైనఁ జేసికొనవలయునని తలఁచి యితఁడు దక్షిణదేశమునకు సుబేదారుగావచ్చెను. ఇతనిని జంపవలెనని బాదుషా యత్నించెను. కాని యది సిద్ధించినదికాదు.

నిజామ్‌ఉల్ముల్క్ ౧౭౨౪వ సంవత్సరము మొదలు హైద్రాబాదులో ఢిల్లీశ్వరుని లక్ష్యముచేయక స్వతంత్రుఁడై రాజ్యముచేయసాగెను. మాళవా, గుజరాథ్ దేశములను గూడ స్వాధీనముచేసికొనవలయునని యత్నించెను. కాని యితని కోర్కె ఫలించినదికాదు. నిజామునకు మరాటావారు ప్రబలప్రతిస్పర్ధులైరి. వారు ప్రబలులై హిందూదేశమంతయు నాక్రమించుకొనియెదరని దూరదృష్టి కలవాఁడగుటచేఁ గనుఁగొని యితఁడు మొదటినుండియు మరాటావారిని నడఁప యత్నించెను. కావున, పూనాపెష్వాలకును హైద్రాబాద్ నిజామునకును ఎడతెగనివైరము కలిగెను. ఆకథాభాగమంతయు మహారాష్ట్రుల చరిత్రలో వివరముగా వర్ణింపఁబడును. నిజాం ఉల్ముల్క్ ౧౦౪-సంవత్సరముల వయస్సు వాఁడగు వఱకు బ్రతికి ౧౭౪౮ లోఁ గాలధర్మము నొందెను.

గుజరాత్, మాళవ, వర్హాడ్ ప్రదేశముల గెలిచి మరాటావారు ఢిల్లీమీఁదికిఁ బోయిరి. వారితోఁ బోరాడు సామర్థ్యము లేనందున బాదుషా వారడిగిన వరములన్నియు వారికిచ్చి వారినిఁ బంపివేసెను.

## నాదిర్ షాహాయొక్క దాడి.

మొగలరాజ్యము మీఁదికి విపత్తులపై విపత్తులు రాఁజొచ్చెను. అందుఁ బారసీక రాజగునాదీర్ షాహాయొక్క దాడి యనునది పిడుగువంటిది. నాదిర్ షాహా స్వపరాక్రమముచేఁ దనరాజ్యసీమ నభివృద్ధిపఱిచి ౧౭౩౯ లో ఢిల్లీమీఁదికి నపరిమితసైన్యములతో దండెత్తివచ్చెను. అతఁడుఢిల్లీశ్వరుఁడైన మహమ్మదు షాహాను పరాభవించి చెఱఁబెట్టి రాజప్రాసాదములోఁ బ్రవేశించియుండెను. కొన్నిదినముల తరువాత ఢిల్లీలోనికొందఱుమూర్ఖులు నాదిర్ షాహానుజంపిరిమని యసత్యపువదంతివేసిరి. అందుమీఁద ఢిల్లీపట్టణములోని జనులు నాదిర్ షాహాయొక్క జనులను జంపసాగిరి. ఈసమాచారము తెలిసి నాదిర్ షాహా యుగ్రుఁడై ఢిల్లీలోని జనులనందఱిని నఱకవలసినదని తన సైనికులకు నాజ్ఞయిచ్చెను. అంత ఢిల్లీపట్టణములో జరిగిన చిత్రవధప్రకారము వినినయెడల వెట్టి

ప్రారకర్తునికైనను శరీరము గగుర్పొడుపక మానదు. పీనుఁగుల గుట్టలతోను నెత్తురు సెలయేళ్లతోను డిల్లీపట్టణము నిండెను. ముప్పదివేలకంటె నెక్కుడు జనులు చంపఁబడిరి! తుదకు బాదుషాయగు మహమ్మదుషాహ చేతులు జోడించి కనుల నీరు తెచ్చుకొని యాచిత్రవధనునాపుఁమని నాదిర్ షాహను వేఁడెను. అందుపై హిందూదేశపు చక్రవర్తిప్రార్థన నంగీకరించితిమని యాతఁడు డిల్లీపట్టణవాసులవధ మాన్పెను. రెండు నెలలవఱకు నాదిర్ షాహ డిల్లీ పట్టణమును దోఁచుకొనుచుండెను. ఆలోభియగు నాదిర్ షాహ, బాదుషాహ మొదలు బీదవాని వఱకు నందఱిని దోఁచుకొనెను. ఇట్లు దోఁచుకొనిన ధనము వెలతొమ్మిది



నాదిర్ షాహ.

కోట్లని కొందఱును, ముప్పదికోట్లని కొందఱును వ్రాసియున్నారు! డిల్లీ సామ్రాజ్యమునకు భూషణాస్పదములగు మయూరాసనమును, కోహినూర్ వజ్రమును ఆతఁడు తీసికొనిపోయెను. పారసీకమునకుఁ బోయినతరువాత నతఁడు ౧౭౪౭ లోఁ జంపఁబడెను.

అదృష్టహీనుఁడగు మహమ్మదుషాహ ౧౭౪౮లోఁ గాలధర్మము నొందెను.

## అహమద్ షాహ.

(౧౭౪౮ - ౧౭౫౪).

ఇతఁడు మహమ్మదుషాహ కుమారుఁడు. చుట్టును శత్రువుల్ లుద్భవించినను

శ్రద్ధవహింపక విషయమగ్నుఁడై యున్నందునఁ దనరాజ్యమును నాశము చేసికొనెను. ఈతని రాజ్యకాలమందు అఫ్ గానిస్థానపురాజయిన అహమ్మదుషాహ అబ్దాలీ యనువాఁడు హిందూదేశముమీఁదికి రెండుసారులు దండెత్తివచ్చెను. ఈ అహమ్మదుషాహ నాదిర్ షాహయొద్ద నుద్యోగములోనుండెను. నాదిర్ షాహ గతించిన తరువాత నితఁ డఫ్ గానిస్థానములో స్వతంత్రరాజ్యమును స్థాపించెను. ఇతఁడు హిందూదేశముమీఁదికి ౧౭౪౮ లో నెత్తివచ్చెను. ఇతనిని సర్ హిందు వద్ద అహమదుషాహ రోడించెను. ఈతఁడు ౧౭౫౧ లో మరలవచ్చెను. అప్పుడు బాదుషాహ యితనికి లాహోర్ ముల్తాన్ ప్రదేశములిచ్చి యితనిని సాగనంపెను. సఫ్దర్ జంగ్, నిజాంఉల్ముల్కుయొక్క మనుమఁడగు గాజీఉద్దీనునకును గలహములు ముదిరి యందు బాదుషాహ యాహుతియయ్యెను. గాజీ ఉద్దీన్ అనువాఁడు ౧౭౫౪ లో బాదుషాహను జంపి యతనిపుత్రునికి అలమ్‌గీరని పేరుపెట్టి యతని సింహాసనాధీశునిఁ జేసెను.

## రాజ్యము తుత్తునకలగుట.

మహమ్మదుషాహ కాలములోనే సింధునదికిఁ బశ్చిమముననున్న హిందూ రాజ్యమంతయు నాదిర్ షాహ తీసికొనెను. రాజపుత్రు లదివఱకే స్వతంత్రులైరి. దక్షిణములోని హైద్రాబాదు అదివఱకే చీలిపోయెను.

బంగాళా ప్రాంతమును ౧౭౦౭ మొదలు ౧౭౨౬ వఱకు ముర్షిదు ఖులీఖానుఁడు సుబేదారుఁడుగాఁ బాలించి కీర్తిఁగాంచెను. అటుతరువాత వాతనియల్లుఁడగు సుజాఖానుఁ డనువాఁడు ౧౭౩౯-వఱకు నాదేశమును బాలించెను. తరువాత మహమ్మదుషాహ బంగాళా సుబేదారుగా అలీవర్ధీఖానునిఁ బంపెను. ఈఅలీవర్ధీఖానుఁడు ముందు ఇంగ్లీషువారివిషయమై విఖ్యాతుఁడయ్యెను. ఆచరిత్రభాగ మింగ్లీషు మహాయుగములో వివరముగా వర్ణింపఁబడును. ఈయలీవర్ధీ ఖానుఁడు ౧౭౫౬ వఱకు బంగాళాదేశమును స్వతంత్రరాజుగాఁ

పాలించెను. తరువాత సురాజుద్దౌలా నవాబయ్యెను. ఆకథాభాగమంతయు నిచ్చట వ్రాయుట యనావశ్యకము.

బంగాళాదేశము వలెనే అయోధ్యాప్రదేశముగూడ స్వతంత్రమయ్యెను. ౧౭౩౯ వఱకు సాదత్ ఖాన్ అనువాఁడు అచ్చట సుబేదారుగానుండెను. తరువాత నతనికొమారుఁడగు సబ్ దర్ జంగ్ సుబేదారుపనిఁ జేసెను. అతఁడును అతనివంశములోని కొందఱు పురుషులును ఢిల్లీశ్వరులకు వజీరులుగా నుండిరి. ౧౭౫౪ నుండి అయోధ్యాప్రాంతములోని సుబేదారులు ఢిల్లీశ్వరులను లక్ష్యముచేయక స్వతంత్రప్రభువులైరి.

## రెండవ అలంగీర్.

## (౧౭౫౪-౧౭౬౫).

ఈబాదుషాహ పేరునకు మాత్రము చక్రవర్తిగానుండెను. రాజ్యసూత్రము లన్నియు గాజీఉద్దీన్ అనువానిచేతిలో నున్నందున బాదుషాహకును, అతనికిని వైరము సంభవించెను. గాజీఉద్దీనుకు సహాయముచేయు నిమిత్తమై మరాటావారువచ్చి ఢిల్లీపట్టణములోఁ బీఠము పెట్టిరి. బాదుషాహను తమచేతిలో నుంచుకొని రాజ్యమంతయుఁ దామే చేయసాగిరి. ఇట్లు ఢిల్లీలో రెండుపక్షములయ్యెను. ఒకటి గాజీఉద్దీన్ మఱియు మరాటాలుకలిసినది; రెండవది రోహిలాలు అహమ్మదుషాహ అబ్దాలీ, ఇతరులగు తురకలును గలిసినది. అబ్దాలీ యనువాఁడు ౧౭౫౬లో పంజాబుమీఁదికి దండెత్తివచ్చెను. వాఁడు ఢిల్లీ, మథురా పట్టణములను దోఁచుకొని వేలకొలఁది జనులను సంహరించి వెడలిపోయెను. మరాటావారు పంజాబుదేశమును స్వాధీనముచేసికొనిరి. అందుచే అబ్దాలీ ౧౭౫౯ లో హిందూదేశములోనికి వచ్చెను. ౧౭౬౧ లో మరాటావారికిని అబ్దాలికిని పానిపట్ వద్ద ఘోరమైనయుద్ధము జరిగి యందు మరాటావారోడిపోయిరి. ఈసమాచారము మహారాష్ట్రులచరిత్రలో సవిస్తరముగా వర్ణింపఁబడును. ఈయుద్ధకల్లోలములోనే రెండవ అలమ్‌గీర్ బాదుషా చంపఁబడెను.

## షాహాఆలమ్.

(౧౭౬౧ - ౧౮౦౬).

డిల్లీపట్టణములోఁ బైని వర్ణింపఁబడినకల్లోలములు జరుగుచుండఁగా ఆలమ్గీరు బాదుషాకొమారుఁ డొకఁడు బంగాళాదేశమునకుఁ బాఱిపోయి యింగ్లీషువారి నాశ్రయించి యుండెను. తండ్రి చంపఁబడెనని వినినతోడనే యతఁడు బంగాళాదేశములోనే షాహాఆలమ్బిరుదు వహించి పట్టాభిషిక్తుఁడయ్యెను. ఒకవైపు ఇంగ్లీషువారు, మఱియొకవైపు మరాటావారు, ఇంకొకవైపు అయోధ్య నవాబు, ఇట్లీముగ్గు రాబాదుషాను తమయాజ్ఞలో నుంచుకొనవలయునని యత్నించుచుండిరి. ఇందెవరుతన్ను డిల్లీపట్టణము చేర్చెదరో వారియాజ్ఞలో నుండెదనని యాతండొప్పుకొనెను. మరాటావారతని డిల్లీకిఁ దీసికొనిపోయిరి (౧౭౭౦).

ఆకాలమునందు డిల్లీపట్టణములో నసంఖ్యాకల్లోలములు జరుగుచుండెను. ఇష్టమువచ్చినవాఁడు నలుగురుజనులను జేర్చుకొని తిరుగఁబడుట సహజమైయుండెను. డిల్లీపట్టణములో రోహిలావాండ్రప్రాబల్య మెక్కుడయ్యెను. వీండ్రు అఫ్గన్ దేశస్థులు. వీండ్రు బాబర్కు సహాయులుగ నుండినందున వీరి కతఁడు గంగకుఁ దూర్పునను, హిమాలయమునకు దక్షిణమునను గొంత ప్రదేశమిచ్చియుండెను. దానికే రోహిల్ ఖండమని పేరు. వీండ్రు బాదుషాహ యొక్క సైన్యములో నుద్యోగముచేయుచుండిరి. వీరిలో నజీబ్ ఖానుండను వాఁ డిరువదిసంవత్సరముల వఱకును డిల్లీవ్యవహారములలోఁ బ్రముఖుఁడైయుండెను. అహమ్మద్ షాహ అబ్దాలీని హిందూదేశమునకుఁ బిలిపించి మరాటావారిని పానిపతుయుద్ధములోఁ బరాభవించినవాఁడితఁడే. ౧౭౭౦లోఁ గాలధర్మమునొందఁగా నితని కుమారుఁడగు జాబెతఖాన్ డిల్లీలోని వ్యవహారములఁ జూచుచుండెను. ఈతనికుమారుఁడైన గులాంకాదరనువాఁడు బాదుషాహమీఁదఁ దిరుగఁబడి డిల్లీపట్టణములోఁ జేయరాని ఘోరకృత్యములఁ

చేసెను. బాదుషాహను, అతనికుటుంబములోని జనులను కాళ్లతోఁదన్ని, కొఱడాదెబ్బలు కొట్టి, వృద్ధుఁడైన యాబాదుషాహయొక్క కనులు దీయించెను. సింహాసనమును తన్ని యగౌరవపఱిచెను. తుదకు బాదుషాహ మరాటా వీరుఁడగు మహాదజీశిండె యనువాని సాయముఁ దీసికొని గులాంకాదరుని బట్టుకొని చంపించెను. ౧౮౦౩లో మరాటావారికిని ఇంగ్లీషువారికిని యుద్ధము జరిగెను. ఇంగ్లీవారు విజయులై డిల్లీపట్టణమును స్వాధీనముచేసికొనిరి. బాదు షాహకుఁ గట్టడిచేసి యతనిరాజ్యమంతయుఁ దీసికొనిరి. ఇట్లు మొగలు సామ్రాజ్య మస్తమించెను. సజ్జనుఁడును, పాపభీరుఁడును అగు షాహఆలమ్ ౮౩ సంవత్సరములవఱకుఁ బ్రతికి ౧౮౦౬ లో గాలధర్మము నొందెను.

## వంశావసానము.

షాహఆలముకొమారుఁడైన అక్బర్ ఇంగ్లీషువారి యొద్దనుండి కట్టసిరూ కలు తీసికొనుచు బాదుషా యను పేరుమాత్రము ధరించుచు ౧౮౩౭ లోఁ గాల ధర్మమునొందెను. ఇతనికొమారుఁడు మహమ్మద్ బహదుర్ షాహ. ఇతఁడు ౧౮౫౭ వఱకును ఇంగ్లీషువారియొద్దనుండి కట్టడి పైకమును దీసికొను చుండెను. కాని ౧౮౫౭ లో హిందూదేశమం దుద్భవించిన సిపాయిల తిరుగఁబాటులో నితండు చేరెను. అందువలన డిల్లీయుద్ధములో నితనికొమా రులను, ఇతనిమనుమలను జంపియితనిని చెఱపట్టి, యింగ్లీషువారు బర్మాదేశ మునకుఁ దీసికొనిపోయి యుంచిరి. ఇతఁ డచ్చటనే మృతినొందెను. అంత మొగలుచక్రవర్తులవంశ మంతరించెను.

## సింహావలోకనము.

సింహావలోకనమనఁగా వెనుకకుఁ దిరిగిచూచుట. మొగలసామ్రాజ్యము లోని చక్రవర్తుల జీవితాంశము లిదివఱకు వర్ణింపఁబడినవి కాని, దేశచరిత్ర యనఁగా రాజులజీవితములు మాత్రముకాదు. అప్పటిజనుల స్థితిగతులును విద్యావిభవములును గనుఁగొనుటయు నావశ్యకము. కావున మనము కొంచెము

సింహావలోకనము చేసి పదునాఱవ, పదునేడవ, పదునెనిమిదవ శతాబ్దముల లోని జనులస్థితిఁ గనుఁగొందము. అప్పటి జనసామాన్యపు స్థితినిఁ గనుఁగొను టకు నాయా శతాబ్దములలో నీదేశమునకు వచ్చినపరదేశీయు లయిన బాట సారుల వ్రాఁతలు ముఖ్యాధారములు. టెరీ, డిలాలేల్, ట్యావర్నియర్, థివెనాట్, ఫ్రాయర్, హ్యామిల్టన్, మనుకి మొదలయిన పాశ్చాత్య ప్రవాసు లనేకు లీదేశమునకు వచ్చిరి. వారు వ్రాసియుంచిన ప్రవాసవర్ణన లప్పటిదేశ స్థితిని తెలుపును.

## ప్రభుత్వము.

మొగలరాజులు మొత్తముమీఁద నిరంకుశులనియె చెప్పవలసియున్నది. కాని యూరోపుఖండములోఁ బ్రభువులు నిరంకుశులుగా నుండినపుడు ప్రజ లకుఁ గలుగుచుండినంతబాధ యీదేశములోనిప్రజలకుఁ గలుగలేదు. ఒక్క యౌరంగజేబు తప్ప మిగిలిన చక్రవర్తు లందఱును ప్రజలకుఁ బూర్తిగా మత స్వాతంత్ర్య మొసఁగిరి. ఇదియుఁగాక యెంత నిరంకుశుఁడైనను బాదుసాహ మంత్రులను ధిక్కరించునట్టి స్వేచ్ఛాచారము కలవాఁడుకాఁడు. హిందూప్రజ లకు బాధకలుగక సౌఖ్యమే కలుగుటకు మఱియొకకారణము కలదు. ప్రభు త్వము మహమ్మదీయులదియైనను హిందువు లనేకులు గొప్ప గొప్పరాజకీయో ద్యోగములలోనుండిరి. ప్రస్తుతపు గవర్నరుతో సమానమైన సుబేదారువంటి యుద్యోగములును, సైన్యాధిపత్యములును, ముఖ్యమంత్రిత్వములును హిందూ మహమ్మదీయ పక్షపాతములేకుండ హిందువుల కీయఁబడెను. రాజా తోడర్ మల్, రాజామాన్‌సింగ్, రాజా జయసింగ్, రాజా రామ్‌సింగ్ మొదలైన హిందూసరదారు లనేకులు మొగలు ప్రభుత్వములో ఘనత వహించిరి. కావున హిందూ ప్రజలకు బాధకలుగుటకుఁ గారణము లేకపోయెను.

## ప్రజాసౌఖ్యము.

మొగలు ప్రభుత్వకాలములోఁ బ్రజలమొద్దనుండిరాజులు రాఁబట్టు

పన్ను విశేషబాధకరముగా లేకయుండెను. కొందఱింగ్లీషు గ్రంథకారు లప్పటిపన్ను లిప్పటిపన్నులకంటె నెక్కుడు బాధకరముగా నుండెనని వ్రాసియున్నారు. కాని యవి నిరాధారములగు నూహలు. అప్పటి ధనధాన్యసమృద్ధియు, ప్రజాసౌఖ్యమును జూడఁగాఁ బ్రజలు బహుస్వల్పమైన పన్నులిచ్చుచున్నట్లు కానవచ్చుచున్నది. ౧౬౧౬ మొదలు ౧౬౧౯ వఱకీదేశమందున్న రెవరెండ్ టెరీ యనువాని వ్రాఁతలను బట్టిచూడఁగా నప్పుడు దేశములో ధనధాన్యసమృద్ధియు ప్రజాసౌఖ్యమునకుఁ గావలసిన వస్తువుల నన్నిటిని దేశమందే నిర్మించు సామర్థ్యమును, తృప్తియు, ధనమును దేశమునుండి వెలుపలకుఁ బోకుండుటకు నిబంధనలును, సత్యసంధత్వమును, ఈదేశమునందు విపులముగ నుండెనని కానవచ్చెడిని. పదునెనిమిదవ శతాబ్ద మధ్యమున బంగాళాదేశములో నెచ్చటఁజూచినఁ గాలువలున్నందున దేశమంతయు సమృద్ధిగనుండెను. కాలువనీటితోఁ బ్రజ లన్నిపంటలను బండించుచుండిరి. చెఱకుతోఁటలును, పట్టుపురుగు చెట్లను విశేషముగాఁ బ్రజలు వేయుచుండిరి. అచ్చటిభూమియు నుత్కృష్టమైనందునఁ గొద్ది కష్టముతో మంచిపంటలు పండుచుండెను. అచ్చట పైసకు సేరు చొప్పున బియ్యమిచ్చుచుండిరి. ఇతర ధాన్యములును, కూరగాయలును, పండ్లును అపరిమితముగ నుండెను. పాలు మాంసద్రవ్యములు మొదలైనవన్నియు బహుస్వల్పమైన వెలకు దొరకును. ౧౬౬౩ మొదలు ౧౬౬౮ వఱకు నీదేశమందున్న నీబ రనువాఁడు 'ఈదేశస్థులు రోగములులేక యారోగ్యస్థితిలో నుండి బహుకాలము బ్రతికెదరు' అని వ్రాసియున్నాఁడు. ఇట్టివర్ణన లనేకములుగలవు. వానినిబట్టిచూడ నప్పటిప్రజలు సౌఖ్యము ననుభవించుచుండిరనియే చెప్పవలసియున్నది. ఒకవేళ కొందఱింగ్లీషుగ్రంథకారులు వ్రాసినట్లప్పటిపన్నులు కొంచెమధికముగానుండెనని యెంచినను ఆధనమంతయు దేశములోనే నిలిచియుండి యీ దేశస్థులలోనే యొకరివద్దనుండి మఱియొకరివద్దకుఁ దిరుగుచున్నందునఁ బ్రజలకు దారిద్ర్యావస్థ అంతగా పట్టకుండెనుగాఁ

బోలు. దేశములోనిధనము పరదేశములకుఁ బోఁగూడదని యప్పటిరాజులు కట్టుదిట్టములు చేసియుంచిరఁట. అట్టిదేశములోని పైకమును దీసికొనిపోవుట యొకయపరాధముగా నెంచఁబడుచుండెను. అందుచే దేశములోని ప్రజలు దినదినాభివృద్ధిఁ జెందిరని తోఁచుచున్నది. మొత్తము మీఁద మొగలు ప్రభుత్వములోని ప్రజ లాకాలపు యూరోపుదేశములోని ప్రజలకంటె నేవిషయములోను దక్కువవారు గారని చెప్పవచ్చును.

## అప్పటిబాటలు.

పదునేడవ పదునెనిమిదవ శతాబ్దములలో సైన్యములు నడచుటకును, వర్తకపుసరకులు పోవుటకును మార్గములుండెను. ఆకాలములోని యూరోపుదేశమందలి బాటలను వీనితోఁ బోల్చిచూచినయెడల హిందూదేశములోని బాటలు నూఱుమడుంగులు మంచివని చెప్పకతప్పదు. ఆకాలమందు విశేషముగా వాడుకలోనున్న బాటలలో నీక్రిందివి కొన్ని—౧. కాబూల్, లాహోర్, ఆగ్రా, అలహాబాద్, ఢాకా (డెక్కా) యీపట్టణములను గలుపునది; ౨. ఆగ్రా, అహమదాబాద్, సూరతులను కలుపునది; ౩. ఆగ్రా, బర్హాంపూర్, గోలకొండ, మచిలీపట్టణములను కలుపునది; ౪. డిల్లీ, మథురా, ఆగ్రా, వాలేర్, బర్హాంపూర్, అజంటా, ఔరంగాబాద్, పూనా పట్టణములను కలుపునది. జను లీమార్గములందు బండ్లమీఁదఁగాని, గుఱ్ఱములమీఁదఁగాని, ప్రవాసము చేయుచుండిరి. ధనవంతులు మేనాలలోఁ బోవుచుండిరి. వర్తకపుసరకు లెడ్లమీఁదఁదీసికొని పోఁబడుచుండెను. ధాన్య మొకదేశమునుండి మఱియొక దేశమునకు లంబాడీవాండ్రు ఎద్దులమీఁదఁ జేర్చుచుండిరి. ఒక్కొక లంబాడీవానియొద్దఁ బదివేలయెద్దులుండెను. త్రోవలలోఁ జోరభయ ముండెనుగాని మొత్తముమీఁద ఫ్రాన్సు, ఇటలీ దేశములోని ప్రవాసమునకంటె హిందూదేశములో నాకాలమందు ప్రవాసముచేయుట యెక్కుడువీలుగను సుఖకరముగను నుండెనని, ౧౬౪౧ మొదలు ౧౬౬౭ వఱకు నీదేశములో

వర్తకము కొఱకు సంచారముచేసిన జాన్ బాప్టిస్టా ట్యావర్నియర్ అను వాఁడు వ్రాసియున్నాఁడు. ఖంబాయత్ వద్దనుండి భడోచ్ వఱకు నుండు ప్రదేశములో దిరాశియా అను జనులుండిరి. వారిరాజు బాటసారులయొద్ద నుండి మనుష్యుల కొక యరరూపాయి తీసికొనును. అట్లు పన్నిచ్చినవారిసొత్తేమయినను బోయినయెడల వాఁడచ్చుకొనును. వీరైనంతవఱకు వారిసొత్తే సంపాదించిపెట్టును. సూరత్ పట్టణమునుండి యాగ్రాకుఁ బోవు లంబాడీల యొద్దనుండి మనుష్యునకుఁ బదిరూపాయలు చొప్పున పన్నురాఁబట్టుకొని, వారికి విందుచేసి తనసరిహద్దువఱకు గుఱ్ఱపుస్వారుల వెంట నిచ్చి పంపునట.

## అంచెలు.

మొగలు ప్రభుత్వములోని యన్నిస్థలములనుండియు ఎప్పటివర్తమానము లప్పుడు తెలియుటకై యంచలపద్ధతి యేర్పరుపఁబడెను. సాధారణముగా మనుష్యులయంచెలమీఁద నుత్తరములు పోవుచుండెను. మిక్కిలి శీఘ్రముగాఁబోవలసినవి యొంటెలయంచెలమీఁదఁ బోవుచుండెను. ప్రభుత్వపు వారి యంచెలు గాక వర్తకులయంచెలుకూడఁ గలవు. ఒకప్పుడు ప్రభుత్వమువారికిఁ దెలియుటకుఁ బూర్వమే యనేకసమాచారములు వర్తకులకుఁ దెలియుచుండెను.

## వర్తకము.

దేశములోను నితరదేశములతోను వర్తకము విశేషముగా జరుగుచుండెను. అన్నివిధములైన ధాన్యములు, ప్రత్తి, నల్లమందు, ఊర్ణము, పట్టు మొదలైనవి యప్పటివర్తకవిషయమైన సరకులు. పట్టుబట్టలు, ఊర్ణవస్త్రములు, నూలుబట్టలు నేయుటలో హిందూదేశవాసులకు నప్రతిమప్రజ్ఞ కలిగియుండెను. అట్టి ప్రజ్ఞ యాకాలమందలి యితరదేశజనులకు లేదని చెప్పినను జెప్పవచ్చును. కాశ్మీరశాలువులు, ఢాకా మల్లుబట్టలు, బందరు టద్దకపుచీట్లు, బనారస్ పట్టుబట్టలు మొదలైనసరకులు కోట్లకొలఁది ప్రతిసంవత్సరము యూరోపుదేశ

మునకుఁబోవుచు సాధనమంతయు హిందూదేశమునకు వచ్చుచుండెను. ఇట్లు ధనము దేశములోనికి వచ్చుటయే కాని పరదేశమునకుఁబోవుటలేనందున దేశము ధనసంపన్నముగుచుండెననుటకు సందేహము లేదు.

## జనులనీతి.

అప్పటిజనులు విశ్వాసపాత్రులనియు, అల్పసంతుష్టులనియు, సత్యప్రియులనియు గ్రంథకారులు వ్రాసియున్నారు. ఒట్లు పెట్టుకొనుటకుఁగాని, ప్రమాణములు చేయుటకుఁగాని యప్పటివారికి నిష్టములేదు. వ్యాజ్యమునకై న్యాయస్థానమునకుఁ బోవుహిందువు 'అవుతోడు నిజము చెప్పుచున్నాను. అసత్యమాడినయెడల నాకు గోమాంసము భక్షించినదోషము వచ్చును గాక' మని యొట్టు పెట్టుకొనవలెను. అందుచే హిందువులు వ్యాజ్యమునకుఁ బోవుటయే మానిరి.

అప్పటి గుజరాథ్ దేశములోని వారికి నిప్పటివలెనే భూతదయ కలదు. అహమదాబాద్ ఖంబాయత్ పట్టణములలోఁ బశువునకై వైద్యశాలలుండెను. నిరాశ్రితములును, రోగగ్రస్తములు నయిన పశువులనిమిత్తమై యొక పాంజర్ పోల్ అను స్థలము కట్టఁబడియుండెను. ఖంబాయత్ లోని ధనవంతులైన వర్తకులందఱును బాదుషాహాకుఁ గొంతధనమిచ్చి యాపట్టణములో గోవధ జరుగకుండ నేర్పాటు చేసికొనిరి. అచ్చట గోవధ చేయువానికి దేహాంతశిక్ష విధింపఁబడుచుండెను.

## భక్తిప్రధానమతముల యభివృద్ధి.

పదునాల్గవశతాబ్దము మొదలు పదునెనిమిదవశతాబ్దాంతము వఱకు నీదేశమందు భక్తిప్రధానములైన వైష్ణవసంప్రదాయము లనేకములు పుట్టినవి. తురుష్కు లొక్కవైపు హిందూమతోచ్ఛేదము చేయుటకు యత్నించుచుండిన కాలములోనే హిందూఘుతవృక్షమునకు నూతనపల్లవములు పుట్టి యభివృద్ధిఁ జెందుట మిక్కిలి యాశ్చర్యకరము. అందువలన నెంతబలవంతుఁడైనను ఈదేశమునందలి ప్రజాశక్తిని ఖండించివేయలేఁడని స్పష్టపడుచున్నది. మహమ్మదీయ

కాలములోఁ బుట్టిన నూతనవైష్ణవ సిద్ధాంతములను, వానిని స్థాపించినవారిని గుఱించియుఁ గొలఁదిగా నిచ్చట వ్రాయుచున్నాము.

## రామానందుఁడు.

ఇతఁడు పదుమూఁడవశతాబ్దాంతముననో పదునాల్గవశతాబ్దాంతముననో యుండెను. ఇతఁడు రామానుజశిష్యపరంపరలో నైదవవాఁడఁట. రామభక్తియే ప్రధానమనియు, జాతిభేదముతో సంబంధములేదనియు జనులకు బోధించెను. ఇతని ద్వాదశశిష్యులలో నొకఁడు సాలెవాఁడు, ఒకఁడు మంగలవాఁడు, ఒకఁడు మాదిగవాఁడు. ఇట్లనేకజాతులవా రుండిరి.

## కబీర్.

(౧౩౮౦ - ౧౪౨౦).

ఇతఁడు రామానందశిష్యులలో నొక్కఁడు. తురకయయ్యును రామభక్తి గలవాఁడు. రామ్ రహీములకు భేదములేదని చెప్పి హిందూమహమ్మదీయ మతములను నొక్కటిచేయ నితఁడు యత్నించెను. ఇతఁడు గొప్పకవి. హిందీ భాషలో నితఁడు చెప్పినపద్యము లనేకములు కలవు. అవి భక్తిరసముతోడను, అర్థగాంభీర్యముతోడను నిండియున్నవి. నిర్లోభత్వముచేతను, సత్యవృత్తి ప్రాధాన్యముచేతను నితఁ డసామాన్యభగవద్భక్తుఁడని ఖ్యాతిఁ జెందెను. ఇతని సంప్రదాయములోఁ జాతిభేదమును విగ్రహారాధనయు లేవు. ఈసంప్రదాయ మిప్పటికిని ఉత్తర హిందూస్థానములో నున్నది. కాశీలో కబీర్ మఠమొకటి కలదు. ఇతని శిష్యులుచేసిన కవిత్వము లనేకములు కలవు.

## చైతన్యుఁడు.

(౧౪౮౬ - ౧౫౩౪).

ఇతఁడు బంగాళాదేశమందలి నవద్వీప (నడియ) గ్రామములోని యొక బ్రాహ్మణుని కుమారుఁడు. ఇతఁడు ౧౪౮౬ లో జన్మించెను. ఇతఁడు వల్లభాచార్యుని కొమార్తెను వివాహమాడెనఁట. ఇరువదినాలుగు సంవత్సరముల వాఁ

దైనతోడనే సంసారమును ద్యజించి భక్తిమార్గములోఁజేరి జనులకు విష్ణుభక్తిని బోధింపసాగెను. చైతన్యుఁడును, నతనిశిష్యులును, సంస్కృతములోను బంగాళీ భాషలోను వ్రాసినగ్రంథము లనేకములుకలవు. బంగాళాదేశమువా రాగ్రంథములను విశేషముగా గౌరవించెదరు. ఇతఁడు ౧౫౨౭ లోఁ గాలధర్మము నొందెను. ఇతనిని ఓడ్రబంగాళాదేశములలో విష్ణుమూర్తి యవతారమని పూజించెదరు. ఇతని సంప్రదాయము స్వీకరించినవారికి గోసాయి లనిపేరు. బంగాళాదేశములో నట్టివారిసంఖ్య ప్రస్తుతకాలమునందు నిరువదియైదువేలను మించియున్నది. ఈతని సంప్రదాయములో స్త్రీలను గూడ చేర్చుకొనిరెదరు. అట్టి స్త్రీలు సాధారణముగ విద్యనేర్చియుందురు. ఘోషాపద్ధతి కఠినముగాఁ బాటింపఁబడు బంగాళాదేశములో నాఁడు క్రైస్తవబోధకురాండ్రు వచ్చుటకుఁ బూర్వము చైతన్యసంప్రదాయములోని స్త్రీలే రాణివాసములోని స్త్రీలకు విద్యనేర్పుచుండిరి. వల్లభాచార్యులవారితో సంబంధము కలిగియున్నందున ఈతఁడాంధ్రుఁ డని తోఁచు చున్నది.

## వల్లభస్వామి.

(౧౪౭౯ - ౧౫౩౦).

ఇతఁడు వెలనాఁటి యాంధ్రబ్రాహ్మణుఁడు. కృష్ణపూజయే ప్రధానముగాఁగల శుద్ధాద్వైతమను వైష్ణవసంప్రదాయమును గుజరాథ్ దేశములో స్థాపించి యందుకు ముఖ్యగురువయ్యెను. అందుచే నీతనిని వల్లభాచార్యులనియెదరు. కృష్ణపూజయు, గురుభక్తియు నీసంప్రదాయములోఁ బ్రధానవిషయములు. వల్లభ మతము గృహస్థమతము. ప్రస్తుత మామతస్థులందఱును వల్లభాచార్యులవారి సంతతివారు. వివాహాదులనిమిత్తమై మాత్ర మాంధ్రదేశమునకు వచ్చుచుండెదరు. వల్లభాచార్యులమతమునకు శుద్ధాద్వైతమని పేరున్నను ఆతఁడు శంకరాచార్యులకుఁ బ్రబలశత్రుఁడు.

## నానక్.

ఇతఁడు పంజాబుదేశమందు ౧౪౬౯ లో హిందూమహమ్మదీయ మతములకు సమన్వయము చేసి యొకమతమును స్థాపించెను. ఇతనిని గుఱించియు నీతని మతమునుగుఱించియు నిదివఱకుఁ గొంత వ్రాసియున్నాము. ముందు నాల్గవభాగములో విశేషముగా వర్ణింపఁగలము. కావునఁ బ్రస్తుతము విస్తరముగా వ్రాయుట యనావశ్యకము.



నానక్.

పైని వర్ణింపఁబడిన వారుగాక ఉత్తరహిందూస్థానమందును బంగాళా మహారాష్ట్ర దేశములలోను ఘనతఁ జెందిన సాధుపుంగవు లనేకు లుద్భవించి భక్తియే ప్రధానమని బోధించి జాతిభేదములు పాటింపఁ గూడదని యొఱఁగించి సంఘ సంస్కరణమునకు దారిచూపించిరి. ఇంతియకాదు. దేశభాషలలో గ్రంథములు రచించినఁగాని, జనసామాన్యమునకుఁ దెలియ నేరదని తలఁచి దేశభాషలలో రసవంతములైన కావ్యములను నిర్మించిరి. వానివివరము ముందు చెప్పఁబడును.

## సంస్కృతవాఙ్మయము.

మహామ్మదీయప్రభుత్వకాలములో సంస్కృతభాషకు రాజాశ్రయము లేకపోయినను ఆకాలమందు ననేకవిషయములమీఁద సంస్కృతగ్రంథములు నిర్మింపఁబడెను. విక్రమాంకదేవచరిత్ర కర్తయైన బిల్హణుఁడు, సప్తశతీకారుఁడైన గోవర్ధనుఁడు, 'కావ్యప్రకాశ' మనుసాహిత్యగ్రంథమును రచించిన మమ్మ

తుఁడు, మొదలైనవారు మహమ్మదీయ ప్రభుత్వముయొక్క ప్రథమదినముల లోనివారని చెప్పవచ్చును. అప్పయ్య దీక్షితులవారును, జగన్నాథపండిత రాయ బిరుదాంకితకవియును పదునేడవశతాబ్దములోనివారు. అప్పయ్యదీక్షి తులవారు ద్రావిడులు. జగన్నాథపండితులవా రాంధ్రులు. అప్పయ్యదీక్షితుల వారు మిగుల విద్వాంసులని ప్రఖ్యాతిఁజెంది యనేకరాజసభలలో వాదములం చేసి బహుమతులును, బిరుదులును పడసిరి. ఇతఁడు వైష్ణవులకుఁ బ్రబలప్రతి స్పర్థియైన శైవుఁడు. ఇతఁడు న్యాయవేదాంతాలంకారాది విషయములమీఁద నెనుబదినాలుగు గ్రంథములు వ్రాసెనఁట. అందు అలంకారవిషయిక చిత్రమీ మాంసాకువలయానందగ్రంథములును, వేదాంతవిషయముపై వృత్తివార్తికసిద్ధాంత లేశగ్రంథములును విఖ్యాతిఁజెందియున్నవి. ఇవిగాక నీతనిచే రచియింపఁబడిన శివార్చనచంద్రిక, శివతత్త్వవివేకము, శివమణిదీపిక మొదలైన శైవగ్రంథములును, నామసంగ్రహ శబ్దప్రకాశము లను కోశములును, మధ్వమతకుఠార రామానుజ మతవిధ్వంసము లను ఖండనగ్రంథములును విశేషఖ్యాతిఁ జెందియున్నవి. ఈతఁడు చిదంబరములో లింగైక్యమును జెందెను. జగన్నాథపండితుఁడు వేఁగినాటి తెలుఁగుబ్రాహ్మణుఁడైనను ఢిల్లీశ్వరునియాస్థానమునందుఁ బండిత రాయబిరుదముపడసి యుత్తరహిందూదేశమునందే ప్రఖ్యాతిఁజెందెను. ఇతఁడు విద్వాంసుఁడును, కవియునైయున్నాఁడు. ఇతనికవిత్వములో రసములొల్కు చుండును. గంగాలహరీ, భామినీవిలాసము లను నీతనికావ్యములు జగద్వంద్య ములు. ఇతఁడు సాహిత్యశాస్త్రములో రసగంగాధరమను గ్రంథరాజమును నిర్మిం చెను. అది యాశాస్త్రవిషయమై గొప్పప్రమాణముగా నెంచఁబడుగ్రంథము.

పదునాఱవ పదునేడవ శతాబ్దములలో వ్యాకరణ శాస్త్రసంబంధమై మిక్కిలి కృషి జరిగెను. భట్టోజిదీక్షిత నాగోజిభట్టు లనుపండితు లిద్ద ఱీ శాస్త్రమును విశేషముగా నభివృద్ధిపఱిచిరి. పాణినీయవ్యాకరణము విద్యార్థు లకు సుబోధకరముగునట్లు భట్టోజిదీక్షితులవారు సిద్ధాంతకౌముది యను గ్రంథ

మును రచించెను. అది బాలావబోధమునకై యత్యుపయోగకరమైన గ్రంథ మగుటచే వెంటనే విద్వన్మాన్యమయ్యెను. సంస్కృతవ్యాకరణము నేర్చుకొనఁ దలఁచిన వారిప్పటికిని మొదట నీగ్రంథమునే చదివెదరు. ఈ గ్రంథముగాక 'ప్రౌఢమనోరమా', 'వైయ్యాకరణభూషణ', 'శబ్దకౌస్తుభ' ములను మూఁడు గ్రంథములను వ్యాకరణవిషయములైనవానినే రచించెను. నాగోజీభట్టు వ్యాకరణశాస్త్రము మీఁద 'భాష్యప్రతీపోద్యోత' మను ముప్పదివేల గ్రంథములను, సిద్ధాంతకౌముదీ టీకారూపమైన 'లఘుశబ్దేందుశేఖర', 'బృహచ్ఛబ్దేంబుశేఖర'ము లను గ్రంథములను, మఱికొన్ని గ్రంథములను రచించెను. ఇతనిచే రచియింపఁబడిన ధర్మశాస్త్రవిషయక గ్రంథములును గొన్నిగలవు.

రాజాశ్రయము లేనందున మనజ్యోతిషము మహమ్మదీయమహాయుగములో నభివృద్ధి చెందినదికాదు. కాని యీశాస్త్రమును గుఱించి పదునేడవ పదునెనిమిదవ శతాబ్దములలో జయపురాధీశ్వరుఁడైన జయసింహుఁ డనువాఁడు చేసిన పరిశ్రమ మిచ్చట నుదాహరించుట యావశ్యకము. ఇతఁడు హిందూ యవనయూరోపియన్ జ్యోతిశ్శాస్త్రముల నభ్యసించి యందలి లెక్కల ననుసరించి వేసినగ్రహగణితము దృక్ప్రత్యయమునకు రానందున, గ్రహగతులను వీక్షింపవలయునని జయపురము, దిల్లీ, కాశీ, మథుర, ఉజ్జయినీ పట్టణములలో నక్షత్రశాలలు కట్టించెను. వీనికే వేధశాలలని పేరు. జయప్రకాశము, యంత్ర సమ్రాట్; చిత్తి యంత్రము, వృత్తషష్ఠాంశము మొదలగు నూతనయంత్రములు నిర్మించి గ్రహగతుల నిరీక్షించుటకు ననేక జ్యోతిష్కుల నేర్పఱిచి తొమ్మిది సంవత్సరములవఱకు గ్రహవీక్షణముచేసి గ్రహగతులను కనుఁగొను నూతన నియమములను గనిపెట్టెను. ఆకాలమునందు యూరోపుదేశములోని జ్యోతిష్కులు గ్రహగతిస్థితుల నెంత సూక్ష్మముగాఁ గనుఁగొనుచుండిరో, యంతకంటె నితఁడధికసూక్ష్మత సాధించెనని చెప్పిన నితనియోగ్యత చదువరులకుఁ దెలియఁగలదు. యూక్లిడ్ కృతమైన రేఖాగణితములోని పదునైదుగ్రంథముల

నితఁడు సంస్కృతములో వ్రాయించెను. ఇతఁడు ౧౬౯౯ లో రాజ్యమునకు వచ్చి ౧౭౪౩ లోఁ గాలధర్మము నొందెను.

## దేశభాషల యభివృద్ధి.

మహమ్మదీయ ప్రభుత్వకాలములో హిందీ, బంగాలీ, మరాటీ, తెలుఁగు మొదలైన దేశభాషలలో ననేక రసవంతములయినకావ్యము లుద్భవించెను. హిందీభాషలోఁ బదునాఱవశతాబ్దమునందు తులసీదాస్ అనుభక్తుఁడు రామాయణము రచించెను. ఈ గ్రంథము తుల్సీరామాయణ మనుపేర మిక్కిలి విఖ్యాతిఁ జెందియున్నది. వేలకొలఁది హిందుస్థానీజనులు దీని నెప్పుడును భక్తితోఁ బాడుచుండెదరు. ఇతఁ డీగ్రంథమును ౧౫౭౫ లోఁ బ్రారంభించెను. ఈ కవి ౧౬౨౪ లోఁ గాలధర్మము నొందెను. పదునాఱవ శతాబ్దములో సూర్దాస్, నాభాజీ, కేశవదాస్ మొదలైన కవులు జన్మించిరి. పదునేడవ శతాబ్దములో బిహారీలాల్ అనుకవి సత్ సహాయ్ అనుగ్రంథమును రచించెను. ఈకవులందఱును భక్తులు. ఈశ్వరభక్తిచే గ్రంథరచన చేసిరిగాని రాజాశ్రయమువలనఁ గాదు. ఇందుచేతనే హిందీ, బంగాలీ, మరాటీ మొదలైన గ్రంథములలో భక్తిరసమే ప్రధానము. శృంగారరస మంతగా నుండదు. ఇదియే యాకావ్యములకును, ఆంధ్రకావ్యములకును గలభేదము.



# నాల్గవ ప్రకరణము.

## దక్షిణమ్ములోని మహమ్మదీయ రాజ్యములు.

ఇదివఱకు వ్రాయఁబడిన మూఁడుప్రకరణములలో మహమ్మదీయుల యుత్పత్తి మొదలు డిల్లీశ్వరులయిన మొగలచక్రవర్తుల వంశావసానమువఱకు జరిగిన హిందూదేశ చరిత్రభాగము వర్ణింపఁబడినది. అందు ముఖ్యముగా డిల్లీ పట్టణము రాజధానిగాఁ గల సార్వభౌమరాజులను గుఱించియే విశేషము వ్రాయఁబడినది. కాని యీకాలమందే హిందూదేశముయొక్క యనేక ప్రదేశములలో ననేకరాజులు డిల్లీశ్వరులను లక్ష్యపెట్టక స్వతంత్రులుగా రాజ్యము చేసిరి. వారిలోఁ గొందఱు మహమ్మదీయులును, గొందఱు హిందువులును గలరు. అట్టివారిలో ముఖ్యులయిన రాజులను గుఱించి యీ గ్రంథములో సంక్షేపముగానైన వ్రాసినం గాని మహమ్మదీయమహాయుగమును మేము పూర్తిగా వర్ణించినవారము కాఁజాలము.

డిల్లీబాదుషాహాలకుఁ బ్రతిస్పర్థులుగా నున్న మహమ్మదీయరాజులలో దక్షిణదేశములోని బహమనీ వంశపురాజులును, ఆవంశములో నుండి చీలిన గోలకొండవిజాపురము మున్నగునైదురాజ్యములును ముఖ్యములైనవి. ఈరాజ్యముల చరిత్రకును ఆంధ్రదేశచరిత్రకును ఎడతెగని సంబంధముకలదు. కావున నీచరిత్రభాగమును ఆంధ్రులు చక్కఁగఁ దెలిసికొనవలయును. ఈ నాల్గవ ప్రకరణములో నీదక్షిణములోని మహమ్మదీయ రాజ్యములచరిత్ర వర్ణింపఁబడును

ఉత్తరదేశమందలి మహమ్మదీయ నిరంకుశప్రభుత్వమునకు నంకుశములయిన వారు రాజపుత్రులు. కావున వారిచరిత్ర నైదవ ప్రకరణమునందు వర్ణింపఁబడును. దక్షిణములోని తురుష్కరాజులను ఘోరముగా నెదిరించినవారు

విజయనగర ప్రభువులు. వీరి యశోవర్ణన మాఱవప్రకరణమందుఁ జేయఁబడును. ఉత్తర దక్షిణదేశములలోని నవాబుల నందఱినిఁ జెదరఁగొట్టి నూతనరాజ్యమును సాధించినవారు మరాఠీవారు. వీరి చరిత్రను సవిస్తరముగాఁ దెల్పుచు నీ హిందూదేశ కథా సంగ్రహముయొక్క మూఁడవభాగ మను స్వతంత్ర గ్రంథ మొకటి వ్రాయఁబడును. కావునఁ బ్రకృత మనుసరింతము.

## బహామనీ రాజ్యము.

(౧౩౪౭-౧౫౨౫).

డిల్లీపట్టణములో మహమ్మద్ తుఘ్లఖ్ రాజ్యము చేయుచుండఁగా దక్షిణ దేశములో నతని సైన్యాధీశుఁడగు హసన్‌గంగూ అనువాఁడు తిరుగఁబడి స్వతంత్రుఁడయ్యెను. ఈ హసన్‌గంగు అనువాఁడు మొదట డిల్లీపట్టణములో గంగూయను బ్రాహ్మణునియొద్ద బానిసగా నుండెను. ఈ బ్రాహ్మణుఁడు నవాబువద్ద జ్యోతిష్కుఁడుగా నుండెను. ఒకదినము పొలము దున్నుచుండఁగా హసనుకు భూమిలో ధనముదొరకెను. అది వాఁడు తీసికొని పోయి యజమానునకిచ్చెను. వాని సత్యసంధత్వమునకు మెచ్చి యతఁడు వానిని నవాబునొద్దికిఁ దీసికొనిపోయి పదివేలగుఱ్ఱములకు నాధిపత్య మిప్పించెను. 'నీకుముందు రాజ్యప్రాప్తియున్నది, అప్పుడు నన్ను మఱవవలదని చెప్పి యాతనిని గంగూబ్రాహ్మణుఁడు పంపివేసెను. మొదట వాఁడు దిల్లీశ్వరునికై యనేక యుద్ధములుచేసి శత్రువులగెలిచి, దిల్లీశ్వరునివలన జాఫర్‌ఖాన్ అను బిరుదును వడసెను. అతఁడు ౧౩౪౭ లో అల్లాఉద్దీన్ షాహ అని పేరు పెట్టుకొని స్వతంత్రుఁడయ్యెను.

## హసన్ గంగూ అల్లాఉద్దీన్ షాహ.

(౧౩౪౭-౧౩౫౮).

ఇతఁడు తాను రాజయినతరువాతఁ దనపూర్వపు యజమానుఁడగు గంగూ బ్రాహ్మణునిఁ దనకోశాధ్యక్షునిగా నేర్పఱిచెను. అతని జ్ఞాపకార్థమై తనను

హాసన్ గంగూ అనియు, తనవంశమునకు బహామనవంశ మనియుఁ బేళ్లుపెట్టెను. బహామన్, బహ్మన్ శబ్దములు బ్రాహ్మణ శబ్దభవములు. ఇతఁడు మొదటఁ గపటముచేసి దక్షిణదేశములోని హిందూరాజులందఱును తనకు సహాయులగు నట్లుచేసి, తనపని యైనతోడనే వారితో స్నేహము చాలించెను. ఇతఁడు హిందూమతద్వేష్టకాఁడు. కలబరగి (గుల్బర్గా) పట్టణమును హాసనాబాదని పేరుపెట్టి తన రాజధానిగఁజేసికొనెను. పదునొకండు సంవత్సరములవఱకు రాజ్యముచేసి యీబహామనీరాజ్యసంస్థాపకుఁడు కాలధర్మమునొందెను.

ఈ క్రొత్తరాజ్యము ముఖ్యముగా మహారాష్ట్రదేశములో వ్యాపించెను. దీని కుత్తరమున నర్మదానదియుఁ, బశ్చిమమున సహ్యాద్రి పర్వతమును, దక్షిణమునఁ గృష్ణానదియుఁ, దూర్పున తెలుఁగుదేశమును, గోండువనమును *హద్దులుగానుండెను. ఈరాజ్యముయొక్క పొలిమేర నంటుకొనియే మాళవ దేశములోను, ఖాన్‌దేశములోను నూతన మహమ్మదీయరాజ్యములేర్పడెను. కృష్ణానదికి దక్షిణమునఁ దుంగభద్రా తీరమునందు ౧౩౩౬ లో, అనఁగాఁ గలుబరగిలో బహామనీరాజ్యము స్థాపింపఁబడుటకుఁ బదునొకండు సంవత్సరములు పూర్వము, విజయనగరరాజ్యము స్థాపింపఁబడెను. ఇదియె మిక్కిలి ప్రబలి బహామనీరాజ్యమునకుఁ బ్రబలప్రతిస్పర్థియయ్యెను. కలబురగ పట్టణము విజయనగరమున కుత్తరమునను, ఓరుగంటికిఁ బశ్చిమమునను నూటయేఁబదిమైళ్లమీఁద నుండెను. బహామనీరాజ్యచరిత్ర యనఁగా వారికిని విజయనగర రాజులకును జరిగిన యుద్ధములవర్ణన.

## మహమ్మద్ షాహ.
### (౧౩౫౮-౧౩౭౫).

అల్లాఉద్దీనుకు దావూద్ మహమ్మదులను ఇద్దఱుకుమార లుండిరి. వారిలో మహమ్మదనువాఁడే రాజ్యముచేయవలయునని అల్లాఉద్దీన్ ఏర్పాటుచేసినందున

* మధ్యపరగణాలలోని కొంతభాగమునకు గోండువనమని పేరు.

మహమ్మద్ రాజయ్యెను. ఇతఁడు తనతండ్రిచేఁ జేయఁబడిన నాణెములను కరఁగించినందుకు ననేకహిందువులఁ గఠినముగా శిక్షించెను. ఓరుగంటి రాజును, విజయనగరరాజును ఒక్కటియై యీతనితో యుద్ధముచేయ సాగిరి. మహమ్మద్ షాహ స్వయముగా యుద్ధమునకుఁబోయి బెల్లముకొండయొద్ద నోరుగంటి యువరాజును సైన్యాధీశుఁడును అగు వినాయకదేవునిఁ జంపెను. అపార సంపత్తిదోఁచుకొని తిరిగివచ్చునప్పు డాతని సైన్యములో ననేకసైనికులు హతులైరి.

ఢిల్లీబాదుషాహ మీఁదఁ దిరుగఁబడునప్పుడు హాసన్ గంగూకుఁ దా మొసంగిన సాయము తమకే కీడై, యింటిప్రక్క బహమనీరాజ్యమను ప్రబలశత్రుని తెచ్చిపెట్టెనని హిందూరాజుల కప్పుడు తెలియవచ్చెను. అందుచే వారప్పుడు ఢిల్లీలో రాజ్యముచేయుచున్న ఫిరోజ్ తుఘ్లఖ్ అనువానికి బహమనీ రాజుమీఁదికి దండెత్తి రావలసినదనియు, తాము సాహాయ్య మొనర్చెదమనియుఁ దెలియఁజేసిరి. కాని గృహకలహములచే వ్యాప్తుఁడైయున్న ఫిరోజ్ యుద్ధమునకు వచ్చినవాఁడుకాఁడు. ఈ వర్తమానము మహమ్మద్ షాహకుఁదెలిసి యతఁ డోరుగంటి మీఁదికియుద్ధమునకుఁ బోయెను. ఓరుగంటి రాజీదాడి సహింపలేక యతనికి ముప్పదిమూఁడుకోట్ల రూపాయలను గోలకొండ దుర్గమును నిచ్చి సంధి చేసికొనెనని తురుష్కచరిత్రకారులు వ్రాసియున్నారు. కాని మిక్కిలి చిన్నసంస్థానములకు నధిపతియైన వినాయకదేవుఁడు మూఁడుకోట్ల రూపాయ లిచ్చె నన్నమాట నమ్మఁదగినదికాదు. అతని రాజ్యమంతయు నమ్మినను మూడుకోట్లువచ్చునా యని సంశయింప వలసియున్నది. ఇఁక ముందెన్నడును ఓరుగంటి రాజులను బాధపెట్టనని యాతని వలనఁ గాగితము వ్రాయించుకొని ఓరుగంటిరాజు మహమ్మద్ షాహకు రత్నములు చెక్కఁబడిన గొప్పసింహాసనమొకటి యిచ్చెనఁట. బహమనీ వంశములోని ప్రతిరాజు ఆసింహాసనము నెక్కి దానిని నూతనరత్నములతో నలంకరించుచుండెను. అది తొమ్మిది యడుగులు పొడవును మూఁడడుగులు వెడల్పును

గలిగియుండెను. ఒకప్పుడు దానివెల నాలుగుకోట్ల రూపాయలని లెక్క వేయఁబడెను!

ఈ రాజు విజయనగరరాజగు కృష్ణరాయనితో యుద్ధము చేయపోగెను. కృష్ణరాయఁడు బహమనీరాజులది యైన ముద్గలదుర్గమును నాక్రమించుకొని యచ్చటి తురుష్కులనందఱినిఁ జంపివేసెను. ఈ వర్తమానము తెలిసి యొక లక్ష హిందువుల సంహరించెదనని మహమ్మద్ షాహ ప్రతిజ్ఞ చేసెనట. తరువాత జరిగిన యుద్ధములో విజయనగరరాజోడిపోయెను. డెబ్బదివేల హిందువులు సంహరింపఁబడిరి. ఈయుద్ధములో విజయనగరమువారు ఫిరంగుల నుపయోగించిరఁట. ఆదవనియొద్ద మరల నొక యుద్ధము జరిగెను. అందు భోజమల్లుఁడను వాఁడు విజయనగరరాజునకు సైన్యాధీశుఁడుగనుండెను. యుద్ధములో గాయపడి యతఁడు పాఱిపోయినందున నతని సైన్యములు విరిగెను (౧౩౬౬). మహమద్ షాహ అయిదు లక్షల హిందువుల సంహరించి రాయలతో సంధి చేసికొని వెడలి పోయెనఁట.

పై కథాభాగము పెరిస్తా యనుతురుష్క చరిత్రకారుని గ్రంథమునుండి గ్రహింపఁబడినది. ఈ గ్రంథకారుఁడు నిజము వ్రాయక పక్షపాతము వహించి హిందువుల యపకర్షమే విశేషముగా వ్రాయుచుండును. అందువలన నితఁడు వర్ణించినయంశములు నిజమని నమ్ముటకు వీలులేదు. పైనీయఁబడిన కథాంశము లోని యొక యసత్యమును జూడుఁడు. మహమ్మద్ షాహతోఁ బోరాడిన విజయనగరపురాజు కృష్ణరాయఁడని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. ౧౫౦౯ వ సంవత్సరము మొదలు ౧౫౩౦ వ సంవత్సరమువఱకు రాజ్యము చేసిన కృష్ణదేవ రాయఁడు ౧౩౫౮ మొదలు ౧౩౭౫ వఱకు రాజ్యము చేసిన మహమ్మద్ షాహతో నెట్లు పోరాడును? ఇందువలననే ఫెరిస్తా వ్రాఁతలు నమ్మఁదగినవి కావనియు, మహమ్మదీయుల యుత్కర్షము చూపుటకు నతఁడు లేనిపోనికథల నల్లి చరిత్రము వ్రాసెననియు మన మూహింప వచ్చును.

మహమ్మద్ షాహాకు సమకాలీనుఁడు బుక్క-రాజు. అతనికిని మహమ్మద్ షాహాకును యుద్ధములు జరిగెననియు, ఒకప్పుడువీరును ఒకప్పుడువారును గెలిచిరనియు, హిందువులు గెలిచినప్పుడు తురుష్కులను, తురుష్కులు జయించినప్పుడు హిందువులను విశేషముగా సంహరించిరనియు మనము పైవర్ణనవలనఁ దెలిసికొన వలెను.

మొత్తము మీఁద మహమ్మద్ షాహ తెలివితో రాజ్యము నేలెను. ప్రజల సుఖదుఃఖముల నెఱుంగుటకై యతఁడు తన రాజ్యములో నప్పుడప్పుడు తిరుగుచుండును. పదునేడు సంవత్సరములు రాజ్యముచేసి యతఁడు ౧౩౭౫ లోఁ గాలధర్మము నొందెను.

౧౩౭౫ మొదలు ౧౩౭౮ వఱకు ముజాహిద్ అనువాఁడును, తరువాత నొక్క-సంవత్సరమువఱకు దావూద్ షాహ అనువాఁడును రాజ్యము చేసిరి. ముజాహిద్ షాహ విజయనగరరాజుతోఁ బోరాడి యతని నోడించియనేక దుర్గముల నాక్రమించి యసంఖ్యధనమును దీసికొని వచ్చెనని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు.

## మహమూద్ షాహ.

(౧౩౭౮-౧౩౯౭).

ఇతఁడు అల్లాఉద్దీన్ యొక్క- కనిష్ఠపుత్రుఁడు. ఇతఁడు దయాశీలుఁడు, సద్గుణవంతుఁడు, న్యాయైకవర్తననిరతుఁడు. ఇతఁడు మహమ్మదీయుఁడైనను ఏకపత్నీవ్రతమును బరిపాలించెను. తాను విద్వాంసుఁ డగుటచే నరబ్బీ పారసీక దేశములలోని విద్వాంసుల రావించి గౌరవించు చుండెను. ఇతఁడు పరోపకారకృత్యము లనేకములుచేసెను. పెద్దపెద్దపట్టణము లన్నింటిలోఁ బాఠశాలలును, అనాథాలయములును గట్టించెను. గ్రుడ్డివారికి మనోవర్తు లేర్పఱిచెను. రాజ్యమునం దంతటను బోధచేయుటకై మహమ్మదీయమతగురువులను నేర్పఱిచెను. కఱవు వచ్చినప్పుడు పదివేలయెడ్లను పెట్టి యితరదేశములనుండి ధాన్యము తెప్పించుచుఁ బ్రజల కందఱికి చౌకగా ధాన్య మిప్పించెను.

ఈతని ప్రభుత్వ కాలములో యుద్ధాదులు లేక ప్రజలు నెమ్మదియు సౌఖ్యము ననుభవించిరి. ఇతనికి దక్షిణ దేశములోని అరిస్టాటల్ అని పేరు కలిగెను. ఇతఁడు ౧౩౯౭ లోఁ గాలధర్మము నొందెను.

ఇతనితరువాత నితనికుమారు లిద్దఱు రాజ్యారూఢు లైరి కాని కొంతకాలములోనే పదచ్యుతులైరి. ఇతనియన్న యగు దావూద్ ఖానుని కుమారుఁడైన ఫిరోజ్ షాహా సింహాసనాసీనుఁ డయ్యెను.

## ఫిరోజ్ షాహా.

### (౧౩౯౭ - ౧౪౨౨).

ఈతని కాలములో బహమనీ రాజ్యము మిక్కిలి వైభవదశ ననుభవించెను. ఇతఁ డనేకభాషల నేర్చి యుండెను. తన యంతఃపురములో నానాదేశపు స్త్రీలను దెచ్చి యుంచెను. భీమానదియొడ్డున ఫిరోజాబాద్ అను నగరమును గట్టించి యందుఁ దనయంతఃపుర స్త్రీలకై యొకమందిరము కట్టించెను. అది యిప్పటికిని మంచిస్థితిలో నున్నది.

ఇతఁడు రాజ్యము చేయునప్పుడు డిల్లీపట్టణము మీఁదికి తయమూర్ లంగ్ దండెత్తి వచ్చెను. అతఁడు దక్షిణమునకు వచ్చు నేమోయని భయపడి యీతఁ డాతనిసార్వభౌమత్వము నొప్పుకొనుచు నాతని యొద్దకుఁ దనరాయబారుల నంపెను. తయమూర్ లంగ్ అందులకు సంతసించి యాతనికి బహుమతు లంపెను.

కేరళరాజైన నరసింహరాయఁ డీతనితో యుద్ధముచేసి మొదటఁ గొన్ని యుద్ధములలో విజయుఁ డయ్యెను. కాని తుదకు నోడి ఫిరోజ్ షాహాతో సంధి చేసికొనెను.

ఎప్పటివలె విజయనగరరాజులతో యుద్ధము ప్రారంభ మయ్యెను. కృష్ణానదియొక్క యుభయతీరములమీఁద నుభయ సైన్యములు విడిసెను. విజయనగరసైన్యము లభేద్యమైనందున తురుష్కు లొక మాయోపాయమునుబన్నిరి. ఫిరోజ్ సైన్యములోని యొకకాజీ (న్యాయాధికారి) మాలువేషము వేసి

శాని యొకభోగము మేళముతోఁ గలిసి విజయనగరరాజపుత్రుని శిబిరము నకుఁ బోయెను. అచ్చట నాటచూచుటలో నిమగ్నుఁడైన రాజపుత్రునిఁ జంపెను. అంత సైన్యములన్నియుఁ గలవరపడి పాఱిపోయెను. తురుష్కులు విజయులైరి. హిందువులు సంధిచేసి కొనవలసిన వారైరి. ౧౪౦౭ లోఁ దురుష్కులు విజయనగరరాజును మఱియొకసారి యోడించిరి. ఈనబాబు ౧౪౧౭ లోఁ దెలుఁగుదేశము మీఁదికి దండెత్తి రాఁగాఁ దెలుఁగువా రీతని సైన్యముల నోడించి యితని వజీరుఁడగు మీర్ ఫజ్ ఉల్లా అనువానిని జంపి, మఱి యన్యవిధముల ననేకబాధలు పెట్టి యదివఱకుఁ దురుష్కులు తమ్ముఁ బెట్టిన బాధలకుఁ బూర్తిగఁ గసి తీర్చుకొనిరి. ఈ గొప్ప పరాభవముచే ఫిరోజ్ షాహ మతిపోయి భ్రాంతుఁ డయ్యెను. ఇతఁడు ౧౪౨౨ లోఁ గాలధర్మము నొందెను. కేరళ రాజైన నరసింహరాయఁడును, విజయనగరపు దేవరాయఁడును తమ యాఁడుబిడ్డల ఫిరోజ్ షాహకిచ్చి వివాహము చేసిరని ఫెరిస్తా వ్రాసినాఁడు. కాని యాహిందూద్వేష్టయొక్క మాట సాత్యాంతరము లేనిది మనము నమ్మటకు వీలులేదు.

## అహమ్మద్ షాహవల్లి.

(౧౪౨౨-౧౪౩౫).

వీఁడు ఫిరోజ్ షాహ తమ్ముఁడు. వల్లీ యనఁగా సాధు వని యర్థము. ఇతఁడు మహమ్మదీయ సాధువుల మిక్కిలి మన్నించి వారి కనేక వర్షాశనము లిచ్చినందున నితని కీపేరువచ్చెను. ఫెరిస్తాకల్పితకథప్రకార మీతఁడు కేరళ విజయనగర రాజుల నోడించెను. ౧౪౨౪ లో నోరుగంటి మీఁదికి దండెత్తి పోయి యచ్చటిరాజును జంపి యారాజ్యమునంతను నాక్రమించుకొనెను. అనేక హిందువుల బలవంతముగాఁ దురుష్కులఁ జేసెను. అతని కారాజ్యములో రత్నములగని దొరకెనఁట. అది పరిటేలగని యని యనేకుల యభి ప్రాయము. ౧౪౨౭ లో మాళవదేశపు సుల్తానుతోఁ బోరాడి యీతఁడు

విజయుఁ డయ్యెను. బీదర్ పట్టణ మొకటికట్టించి యచ్చటికిఁ దన రాజధానిని మార్చెను.

## అల్లాఉద్దీన్ షాహా.

(౧౪౩౫ - ౧౪౫౭).

ఇతఁడు బీదర్ పట్టణములోనే రాజ్యారూఢుఁ డయ్యెను. ౧౪౪౩ లో నితనికి విజయనగరము వారికిని మూఁడు ఘోరమైనయుద్ధములు జరిగి తుద కితఁడే విజయుఁ డయ్యెనని ఫెరిస్తా వ్రాయుచున్నాఁడు. ఇతఁడు శంకరరాయ్ అను మరాటాసరదారుని మీఁదికిఁ దనసైన్యము లంపఁగా నాతఁడును సిర్కే యను మఱియొక మరాటా వీరుఁడును కలసి తురుష్కసైన్యములో నొక్క సైనికుఁడైన లేకుండ నందఱిని నఱికి వేసిరి.

ఈతనియొద్ద నున్న తురుష్కసరదారులలో దఖ్ఖనీ తురుష్కులనియు, పరదేశీ తురుష్కులనియు రెండుతెగ లేర్పడెను. వీరిపోరాటలోనే బహమనరాజ్య మంత మొందెను. దఖ్ఖనీతురుష్కు లనఁగా బహుకాలము నుండియు దక్షిణ దేశమునందే కాఁపురముండిన తురుష్కులు. అట్లుగాక క్రొత్తగా అరబ్బీ పారసీకాది దేశములనుండి వచ్చినవారు పరదేశీ తురుష్కులు.

అల్లాఉద్దీన్ షాహా మంచి మాటకారి యనియు ధూర్తుఁడగు రాజ్యకర్త యనియు, విద్యాభోక్త యనియుఁ బేరొంది ౧౪౫౭ లోఁ గాలధర్మము నొందెను.

ఇతని తరువాత ౧౪౫౭ మొదలు ౧౪౬౩ వఱకు హుమాయూన్ షాహా నిజాంషాహా లను నిద్దఱురాజులు రాజ్యముచేసిరి. వారిరాజ్యకాలములో విశేషములంతగా లేవు.

## రెండవమహమ్మద్ షాహా.

(౧౪౬౩ - ౧౪౮౨).

ఇతఁడు రాజ్యమునకు వచ్చినప్పుడు తొమ్మిదిసంవత్సరముల వాఁడు. ఇతని రాజ్యకాలములో మహమ్మద్ గవాన్ అనువాఁడు ముఖ్య మంత్రిగానుండి యన్ని వ్యవహారములను జక్కఁబెట్టుచుండెను. మహమ్మద్ షాహా చరిత్ర యంతయు నీమహమ్మద్ గవాన్ చరిత్రతో నిండియున్నది. ఈ మహమ్మద్ గవాన్ స్వామిభక్తపరాయణుఁ డగు రాజకార్య ధురంధరుఁడని విఖ్యాతి వడసెను. కావున నితనిచరిత్ర యిచ్చటఁ గొంచెము వివరముగా వ్రాయఁ దలఁచినారము.

## వజీర్ మహమ్మద్ గవాన్.

ఇతఁడు పారసీకదేశములో జన్మించెను. ఇతనివంశజు లచ్చటి మంత్రులుగా నుండిరి. సుల్తాన్ తహమస్ప్ అనువాఁడు తన్నుఁ జంపునేమో యని మహమ్మద్ గవాన్ స్వదేశమును విడిచి వర్తకము నిమిత్తమై వెడలెను. అనేక దేశములు తిరిగి యచ్చటచ్చటి విద్వాంసులతో స్నేహము చేసెను. నలువది మూఁడు సంవత్సరముల వయసుగలవాఁడై యుండఁగా దక్షిణ హిందూదేశములోని విద్వాంసులఁ జూచుటకై దాభోళ్ అను మరాటీదేశమందలి రేవులో దిగి బేదర్ పట్టణమునకుఁ బోయెను. అచ్చటినుండి డిల్లీపట్టణమునకుఁ బోఁదలఁచెను. కాని యతని యలౌకికగుణములను జూచి అల్లాఉద్దీన్ షాహా యతనికి నొకసరదారుపని యిచ్చెను. అతఁడు స్వపరాక్రమముచేఁ గ్రమక్రమముగా నభివృద్ధిచెంది ముఖ్యమంత్రి యయ్యెను. అతని యౌదార్యమును గుఱించిన విఖ్యాతి ఆసియాఖండములో యన్ని దేశములలోను బ్రసరించి యందువలన యనేకవిద్వాంసులకు ఫలప్రాప్తి యయ్యెను. అతఁడు స్నేహప్రియుఁడు, న్యాయ విచారణయందు మిక్కిలి పేరొందిన వాఁడు, గొప్పకవి,

గణిత శాస్త్రములో మిక్కిలి ప్రవీణుఁడు. బీదర్ పట్టణములో నతఁడు తన ధనముతో భవ్యమైన పాఠశాల యొకటి కట్టించెను.

౧౪౬౨ లో మాళవ దేశపు సుల్తాను దక్షిణ దేశము మీఁదికి దండెత్తి వచ్చెను. అతనితోఁ బోరాడి గవాన్ ఆతని నోడించెను.

కొంకణ దేశములో దాభోళ్, చౌల్, జున్నర్, కోలాపూర్, వాయీ మొదలైన ప్రదేశము లన్నియు నదివఱకే బహమనీ రాజులకు లోఁబడెను. కాని మఱికొందఱు రాజులు లోఁబడక యుండిరి. అట్టి రాజులలో విశాలగడమను నామాంతరముగల ఖేళణాయను గడమునకు నధిపతియైన శంకరరాయఁడొకఁడు. అతనిని మఱి యితరులను జయించుటకై ౧౪౬౯ లో మహమ్మద్ గవాన్ గొప్ప సైన్యమును వెంటఁదీసికొని వెడలెను. శంకరరాయఁడు సముద్రము వఱకు రాజ్యమును మూఁడువందల యోడల సముద్ర సైన్యమును గలిగినవాఁ డగుటచే మహమ్మదీయ వర్తకులను మిగుల బాధించుచుండెను. అందుచే నతనితో రెండుసంవత్సరములవఱకు ఘోరముగాఁ బోరి మహమ్మద్ గవాన్ ఖేళణా దుర్గమును నాక్రమించుకొనియె. విజయనగరము వారి రాజ్యములోనిదియగు గోవాపట్టణమును ఆతఁడు ౧౪౭౨ లో నాక్రమించుకొనెను. ఇట్లు సముద్రము నంటుకొనియున్న కొంకణ దేశమంతయుఁ దురుష్కుల పాలయ్యెను.

పైని వర్ణింపఁబడిన విజయముల వలన మహమ్మద్ గవానుని కీర్తి విస్తరించెను. షాహ యతనిని మిగుల గౌరవించి యధిక సంపత్తి యొసంగెను. కాని యతఁడు విరక్తుఁడగుటచే నాధనమంతయు బీదలకుఁ బంచి పెట్టి యతఁడు బీదవానివలెనే యుండఁ జొచ్చెను.

ఓఢ్ర దేశపురాజైన అంబరరాయఁ డనువానిని అతని తమ్ముఁడగు మంగళరాయఁడు మిగులబాధ పెట్టుచుండెను. ౧౪౭౧ లో మహమ్మద్ గవాన్ అంబరరాయనికి సాహాయ్యముచేసి వాని తమ్ముని నోడించి వానివలన కొండ

పల్లి రాజమహేంద్రవరములను మహమ్మద్ షాహ కిప్పించెను. ఈ యుద్ధములో ననేక మహమ్మదీయసరదారులు తమ తమ శౌర్యములఁ జూపి విఖ్యాతులై గొప్ప గొప్ప యధికారముల వడసిరి. నిజాం ఉల్ ముల్క్ అను బిరుదుగల మలిక్ హాసన్ బహీరీ యనువాఁడు తెలుఁగు దేశమునకు సుబేదారుఁ డయ్యెను. ఇమాద్ ఉల్ ముల్క్ అను బిరుదుగల దర్యాఖానుఁడు వరాడ్ (Berar) దేశమునకు సుబేదారుఁ డయ్యెను. యూసూఫ్ ఆదిల్ ఖానుఁ డనువాఁడు దౌలతాబాదునకు సుబేదారుఁ డయ్యెను. ఇతఁడు ఖాన్ దేశములోని యనేక ప్రదేశములను గెలిచి బహమనీ రాజ్యములోఁ గలిపెను. ఈ సరదారు లంద ఱును పరదేశీయులైన తురుష్కులు. అందుచే వీరియుత్కర్షమును జూచి దక్కనీతురక లోర్వలేక పోయిరి. ౧౪౭౨ లో బేల్ గాం రాజైన వీర కర్ణరాయఁడు గోవాపట్టణమును దీసికొన యత్నించెను. కాని మహమ్మద్ షాహ యతని మీఁదికిఁ బోయి బేల్ గాము నాక్రమించుకొనియెను. అచ్చటి నుండి తిరిగి వచ్చునప్పుడు మహమ్మద్ షాహ తల్లియైన మాయీరాణి కాల ధర్మము నొందెను. ఆకాలపుస్త్రీలలో నీమె కొనియాడం దగినది. ౧౪౭౩-౭౪ వ సంవత్సరములలో దక్షిణదేశమందు గొప్ప కఱవు తటస్థించెను.

మహమ్మదీయ సైన్యములు ౧౪౭౭ లో ఓఢ్రదేశము మీఁదికిని, కర్ణా టాంధ్ర దేశముల మీఁదికిని దండెత్తిపోయి క్రొత్తదేశముల నాక్రమించు కొనియెను. కాంచీ దేవాలయమును దోఁచుకొని యపారసంపత్తిని దీసికొని వచ్చెను. ఈకార్యము లన్నియు మహమ్మద్ గవాన్ యొక్క శౌర్యము చేతనే జరిగినందున మహమ్మద్ షాహకు నతనియందుఁ బ్రేమహెచ్చెను. 'విస్తీర్ణమైన రాజ్యమును మహమ్మద్ గవాన్ వంటి మంత్రియు ననుపమం డపూర్వవస్తువు లీశ్వరుఁడు నాకు దయతలఁచి యిచ్చె' నని షాహ చెప్పు చుండెను. ఇట్లు గవాన్ మాహాత్మ్యము హెచ్చుచున్నందున నతనికి శత్రువులు కలిగిరి.

ఇతరసరదారుల ద్వేషము హెచ్చుటకు మఱియొకకారణముం గలిగెను. గవాన్ కాలమున రాజ్యవిస్తార మెక్కుడయ్యెను. అందుచే రాజ్యము చిన్నదిగా నున్నప్పుడు అల్లాఉద్దీన్ హసన్ గంగూకాలములోఁ జేయఁబడిన రాజ్యవ్యవస్థయంతయు మార్చవలసి వచ్చెను. పూర్వము రాజ్యమంతయు నాలుగు సుబాలుగా విభజింపఁబడెను. ప్రస్తుతము మహమ్మద్ గవాన్ రాజ్యమును ఎనిమిది సుబాలుగా విభజించెను. ఆయా యధికారులు నడచుకొనవలసిన నియమములను దృఢముగా నేర్పఱిచెను. అంతకుఁ బూర్వము సైనికులకు సరియైన జీతమియ్యక యధికారులే ధనమంతయు నపహరించు చుండిరి. ముందటు జరుగకుండఁ దగిన నిబంధన లేర్పఱుపఁబడెను. అందుచే నంతకుఁ బూర్వము నిరంకుశులుగా నుండిన యధికారుల కందఱికి మహమ్మద్ గవానునిపై కోపము హెచ్చెను.

రాజ్యములోని న్యాయసైన్య విద్యాదానాది విషయములనుగూడ మహమ్మద్ గవాన్ సంస్కరించెను. భూములు కొలిపించి రైతు లీయవలసిన పన్నును స్థిరపఱిచెను. ౧౪౭౦-వ సంవత్సరములో బహామనీరాజుల సైన్యమునకు ముట్టుచుండిన జీతము ౧౮౩౦ లో నింగ్లీషువారి సైన్యములకు నీదేశములో ముట్టుచుండిన జీతముకంటె నెక్కుడుగానుండెను. ఇదియును గాక యాకాలమందు నిప్పటికంటె రూపాయి వెల యెక్కుడుగానుండెను. ౧౪౭౦ లో ౫౦౦ లగుఱ్ఱపు సైన్యము నుంచుటకు సంవత్సరమునకు ౩,౧౫,౦౦౦ రూపాయలు వ్యయమగుచుండెను. ౧౮౩౦ లో నంతసైన్యమునకే ౨,౧౯,౦౦౦ రూపాయలు మాత్రము వెచ్చింపఁబడుచుండెను. సొంత గుఱ్ఱమును ఆయుధములునుగల గుఱ్ఱపు రౌతునకు ౧౪౭౦ లో నెలకు ౪౦ రూపాయలు వేతనము ముట్టుచుండెను. అట్టివానికి ౧౮౩౦ లో ౨౦ రూపాయలుమాత్ర మిచ్చుచుండిరి. ఇట్లు గవాన్, రాజ్యములోని యన్ని వ్యవహారములను చక్కఁబెట్టెను. రాజ్య తంత్రములోని యొక్కొక శాఖవారి కృత్యములను ఇతర

శాఖలవారు పరీక్షించునట్లు కట్టు దిట్టములు చేయఁబడినందున రాజ్యములోని యధికారులకు నన్యాయము చేయుటకు వీలులేదయ్యెను.

గవానుని యధికారము హెచ్చిన కొలఁదిని శత్రువులుగూడ హెచ్చిరి. వారందఱును ఒక కుట్రపన్నిరి. మహమ్మద్ షాహ మీఁదికి దండెత్తి రావలసిన దని ఓఢ్రరాజునకు మహమ్మద్ గవాన్ ఒక యుత్తరము వ్రాసినట్లును, దానిని వారలు త్రోవలోఁ బట్టుకొనినట్లును కథ కల్పించి, యొకయసత్యపు టుత్తరమును షాహకుఁ జూపించిరి. అప్పుడు వాఁడు తప్పత్రాగియుండి గవానును తన యొద్దకుఁ బిలిపించి మూర్ఖుఁడై చంపించెను (౧౪౮౧). అప్పుడాతనివయస్సు ౭౮ సంవత్సరములు. తాను నిరపరాధినని యెంతచెప్పినను షాహవిననవాఁడు కాఁడు. తుదకు నిట్టి దుష్కృత్యమువలన నీ కీర్తికిఁ గళంకమువచ్చి నీరాజ్యము పోఁగలదనిచెప్పి యతఁడు ప్రాణములువిడిచెను. షాహ తన్నుఁ బిలిపించి నప్పుడు అతనియొద్దకుఁ బోవలదని యెందఱుమిత్రులు చెప్పినను వినక తనసత్య సంధత్వమునే నమ్మి యతఁడు షాహయొద్దకుఁ బోయెనఁట.

## మహమ్మద్ గవానుని యోగ్యత.

ఇతఁడు హిందూదేశమందలి సత్పురుషులలోను, సన్మంత్రులలోను ఒక్కఁ డని చెప్పవలసియున్నది. ఆకాలమందు హిందూదేశమందలి తురుష్కులలో నంత విద్వాంసుఁడును రాజకార్యనిపుణుఁడును లేఁడని చెప్పవచ్చును. స్వార్థ సాధనమునం దెంతమాత్రమును దృష్టిలేక రాజకార్యమే పరమార్థముగా నెంచి యకృత్రిమస్వామిభక్తితో నితఁడు రాజ్యకార్యములను నడపెను. ఇద్దఱు బాల రాజుల కాలములో నితఁడు మంత్రిగానుండి వారినిఁ బెంచి పెద్దవారినిఁ జేసి బాగుపఱిచెనేగాని, సొంతమునకేమియు లాభమును సంపాదించిన వాఁడు కాఁడు. ఇతని వలననే యభివృద్ధిఁజెందిన సరదారు లనేకులు రాజద్రోహులై స్వతంత్రులైరి. అట్టిస్థితిలో నీతనికి స్వలాభమునందుఁ గోర్కెయుండినయెడల బహమనీ రాజ్యమంతయు నాక్రమించుకొనుట యసాధ్యముకాదు. కాని

రాజభక్తియే ప్రధానముగాఁగల యీమహాత్ముఁడు గ్రుడ్డి గవ్వనైన నన్యాయముగా సంపాదించిన వాఁడుకాఁడు. ఔదార్యము, నిష్పక్షపాతము, యుద్ధనైపుణ్యము, న్యాయబుద్ధి, పరోపకారచింత, స్వామిభక్తి మొదలైన యనేక సద్గుణములతో విభూషితుఁడైనందునఁ జరిత్ర గ్రంథములలో నీతని కీర్తి యజరామరమైయున్నది. ఇతని సత్వగుణప్రాధాన్యముఁ జూపుటకై చరిత్రకారులెన్నియో యితిహాసములు వ్రాసియున్నారు. ఇతఁడు ప్రతిదినమును బీదర్ పాఠశాలకుఁబోవును. కొంకణదేశ దిగ్విజయమునుండి తిరిగి వచ్చినప్పుడు మహమ్మద్ షాహాయు నతని తల్లియు నెదురేగి యతనికి స్వాగతమిచ్చిరి. షాహ తన యొంటిమీఁదియంగీ దీసి గవానునికిఁ దొడిగెను. రాజమాతయు నతనిని గౌరవించి యపరిమితసంపత్తునిచ్చెను. వారు వెడలిపోయిన తరువాత మహమ్మద్ గవాన్ తనయింటిలోనికిఁబోయి యేడ్వసాగెను. గ్రామములోని బీదల నందఱినిఁ బిలిపించి వారికాధనము పంచిపెట్టెను. అట్లేలచేసితివని లోకులడుగఁగా 'రాజుస్వయముగా నన్నుఁజూచుటకు వచ్చినందునను, రాణి నన్ను అన్నాయని పిలిచినందునను నేను వివేక భ్రష్టుఁడనైతిని. అందువలన నాకు మిక్కిలి చింతకలిగి దుఃఖమునకుఁగారణమైన యీసొత్తును నేనందఱికిఁ బంచిపెట్టితిని' అని జవాబు చెప్పెనఁట! ప్రతిశుక్రవారమును మాఱువేషమువేసికొని యాతఁడు పట్టణములోఁ దిరుగుచు లోకులకు దాన ధర్మములు చేయుచుండెను. దూరదేశములందున్న విద్వాంసులకుఁగూడ నాతఁడు బహుమతులు పంపుచుండెను. రాజుచే నక్రమముగఁ జంపఁబడిన మహమ్మద్ గవానుని యోగ్యత యిట్టిది.

గవానునియొద్ద ధనమపరిమితముగా నున్నదని షాహతలఁచి యతని ధనాగారమును స్వాధీనముచేసికొనెను. కాని యతనికి ధనము లభించినదికాదు. గవానునియొద్ద రెండుబొక్కసము లుండెను. ఒకటి రాజును సంబంధించినది. రెండవది బీదలది. మొదటి బొక్కసములో సైన్యవ్యయమునకై నిలిచియున్న ౨౫౦౦౦ రూపాయ లుండెను. రెండవదానిలో ౩౦౦ లుండెను. ఇవిగాక

యాతనియొద్ద దొరకిన వస్తువులు శయనించుటకు నుంచుకొనిన రెండుచాపలు, వంటసాలలోనున్న మృత్పాత్రలు పుస్తకాలయములో మూఁడువేల పుస్తకము లుండెను. ఆపుస్తకములన్నియు నతఁడు పాఠశాలకు నిచ్చివేసెను. ప్రతి దినమును తనభోజనమునకై రెండు రూపాయలు తీసికొని మిగిలిన ధనమంతయు దానముచేయుచుండెను. పారసీకదేశమునుండి వచ్చునప్పుడు నలుబదివేల రూపాయ లాతఁడు వెంటఁదీసికొని వచ్చెను. దానితో వర్తకముచేయుచు వచ్చిన లాభమంతయుఁ బరోపకారములో వెచ్చించెను. ఈ యంశము లన్నియు షాహకు చక్కఁగఁ దెలిసి, యతనికిఁ దాఁజేసినకృత్యమునకై మిక్కిలి పశ్చాత్తాపము కలిగి యతఁడా చింతతోఁ ద్వరలోనే మృత్యుముఖమునఁ బడెను.

## మహమ్మూద్ షాహ.

### (౧౪౮౨-౧౫౧౮).

ఈతని కాలములో బహమనీరాజ్యము వినాశముచెందెనని చెప్పవచ్చును. ఇతని యాస్థానమందలి దఖ్ఖనీ పరదేశితురుష్కుల కలహములు ముదిరి రాజధానిలో నిరువది దినములవఱకు రక్తపాతము జరుగుచుండెను. సుబేదారు లందఱును స్వతంత్రులై వేఱువేఱు రాజ్యముల నిరంకుశులుగాఁ బరిపాలింప సాగిరి. ఈరాజు మిక్కిలి వ్యసనాసక్తుఁడైనందున నితనియాజ్ఞ నెవ్వరును వినరైరి. ఇతఁడు ౧౫౧౮ లోఁ గాలధర్మమునొందెను. ఇతని ప్రభుత్వకాలములోనే బహమనీ రాజ్యములోనుండి యైదురాజ్యము లేర్పడెను. వాని పేర్లు:— ౧. బేదర్ లోని బేరీద్‌షాహీ, ౨. వరాడ్ దేశములోని ఇమాంషాహీ, ౩. అహమ్మద్ నగరములోని నిజాంషాహీ, ౪. విజాపురములోని ఆదిల్‌ష్షాహీ, ౫. గోలకొండలోని కుత్బ్‌షాహీ.

మహమ్మూద్‌షాహకు తరువాత ౧౫౨౬-వఱకు ముగ్గురు నలుగురు బహమనీ రాజులైరి. కాని వారందఱును రాజ్యములేని రాజులు; సేవకులులేని ప్రభు

వులు. స్వతంత్రులైన సుబేదారుల నాశ్రయించుకొని జీవనము గడుపుకొనిరి. కావున వారిని గుఱించి విశేషము వ్రాయనక్కఱలేదు.

ఇఁక బహమనీరాజ్యములోనుండి చీలిన యైదురాజ్యముల చరిత్ర సంగ్రహముగా వ్రాయఁబడును.

## ౧. బేదర్‌లోని బేరీద్‌శాహి.

(౧౪౯౨ - ౧౬౫౬).

బహమనీరాజ్యమునకు రాజధానియైన బేదర్‌లో ౧౪౯౨లో కాసీంబేరీద్ అనువాఁడు స్వతంత్రముగా రాజ్యముచేయఁ దొడఁగెను. ఈ కాసీం మొదట మహమ్మద్ షాహయొద్ద బానిసగానుండెను. అసుల్తాను కాలములో మరాటావారు తిరుగఁబడినప్పుడు కాసిం మిక్కిలి శౌర్యముతో వారి నణఁచినందున రాజానుగ్రహమునకుఁ బాత్రుఁడై సరదారుఁడయ్యెను. ఇతఁడు ౧౫౦౪వ సంవత్సరమువఱకు రాజ్యముచేసెను. ఈవంశములోని రెండవరాజు అమీర్ బేరీద్ అనువాఁడు. ఇతఁడు ౧౫౪౯ వఱకు రాజ్యముచేసెను. ఇతని రాజ్యములోఁ గొంతభాగము విజాపూర్ రాజు తీసికొనినందున నాలుగైదులక్షలుచెల్లు రాజ్యముమాత్ర మీతనికి నిలిచియుండెను. మూఁడవరాజు అలీబేరీద్‌షాహ. ఇతఁడు ౧౫౬౨ వఱకు రాజ్యముచేసెను. ఈవంశములో షాహబిరుదును ధరించిన మొదటిరా జీతఁడు. ఇతని రాజ్యములోఁ గొంత భాగము అహమ్మద్‌నగర రాజైన నిజాంషాహ తీసికొనెను. ౧౫౬౯ వఱకు నితని ప్రథమపుత్రుఁడైన ఇబ్రాహీం బేరీద్‌షాహయును, ౧౫౭౨ వఱకు నితని చిన్నకొమారుఁడైన రెండవకాసీం అను వాఁడును రాజ్యముచేసిరి. క్రమక్రమముగా నీరాజ్యము చిన్నది యగుచువచ్చెను. ౧౬౫౬ లో ఔరంగ్‌జేబ్ దక్షిణదేశమునకు సుబేదారుగా వచ్చినప్పు డీ రాజ్యమును బూర్తిగా నాశమొందించెను. మహమ్మద్ గవానునిచే ౧౪౭౨ లోఁ గట్టింపఁబడిన పాఠశాలామందిరమును ధ్వంసముచేసెను.

## ౨. వరాడ్ దేశములోని ఇమాంశాహి.
### (౧౪౮౪ - ౧౫౭౨).

ఈవంశస్థాపకుని పేరు ఫత్తే ఉల్లాఇమాద్ షాహ. ఇతఁడు మొదటఁ దెలుఁగు బ్రాహ్మణుఁడు. విజయనగర రాజ్యములోనివాఁడు. తురుష్కులు రాజ్యముమీఁదికి దండెత్తిపోయినప్పుడు వీనిని జెఱపట్టి తెచ్చి వీనికి మహమ్మదీయదీక్ష నొసఁగిరి. అప్పటినుండి వీఁడు మహమ్మద్ గవాన్ యొక్క యనుగ్రహమువలనఁ గ్రమక్రమముగ నభివృద్ధిచెంది ఇమాద్ ఉల్ముల్క అనుబిరుదును వరాడ్ దేశమునకు సుబేదారు నధికారమునుబడసెను. ఇతఁడు ౧౪౮౪ లో స్వతంత్రుఁడై ఇమాద్ షాహ యనుబిరుదువహించి యా సంవత్సరమునందే కాలధర్మమునొందెను. ఇతని కుమారుఁడగు అల్లాఉద్దీన్ ఇమాద్ షాహ ౧౪౮౪ మొదలు ౧౫౨౭ వఱకు రాజ్యముచేసెను. ఇతఁడు గావిల్ గడమను గ్రామమును తన రాజధానిఁ జేసికొనెను. ఈకోట మిక్కిలికఠినమైనచోటఁ జక్కఁగఁ గట్టఁబడియున్నది. అచ్చటఁ గట్టఁబడిన మసీదిప్పటివఱకును చెక్కుచెదరకయున్నది. ఈరాజునకును నిజాంషాహి రాజునకును వైరమువచ్చి యితఁడు ఖానదేశ గుజరాత్ దేశముల రాజులసాయము వడసెను. అందుకు వారికితఁడు తనరాజ్యములోని కొన్నిగ్రామముల నిచ్చెను.

అల్లాఉద్దీన్ ఇమాద్ షాహయొక్క కుమారుఁడైన దర్యా ఇమాద్ షాహ అనువాఁడు నిజాంశాహీరాజులతో సంబంధబాంధవ్యములు చేసెను. ఇతని రాజ్యకాలములో యుద్ధాదికము లేమియులేక ప్రజలు నెమ్మదిగానుండిరి. అల్పవయస్కుఁడగు నితనికొమారుఁడు రాజ్యమునకురాఁగా తోఫల్ ఖానుఁడను ధూర్తుఁడగు సరదారుఁడొకఁడు రాజ్యము నాక్రమించుకొనియెను. ౧౫౭౨ లో మూర్తిజా నిజాంషాహ అనువాఁడు దండెత్తివచ్చి తోఫల్ ఖానుని ఇమాద్ షాహ వంశజులనుజయించి వరాడ్ దేశమంతయు నిజాంషాహీ రాజ్యములోఁ గలుపుకొనియె.

## ౩. అహమ్మదనగరపునిజాంశాహి.
## (౧౪౯౦-౧౬౩౭).

అహమ్మద్‌నిజాంషావహా. (౧౪౯౦ - ౧౫౦౮). విజయనగరములో తిమ్మప్ప బహిరూ (భైరవుఁడు) అను నొకబ్రాహ్మణుఁడుకలఁడు. అతని కొక కుమారుఁ డుండెను. తురుష్కులు దండెత్తివచ్చినప్పుడు వానిని బట్టుకొని పోయి తురుష్కునిఁజేసిరి. వాఁడు మహమ్మద్ గవాన్ యొక్క యనుగ్రహమును బడసి గొప్పయధికారముల సంపాదించి మలిక్ నాయిబ్ నిజాంఉల్ముల్క బహిరీ యను బిరుదావళులతోఁగలిసినపేరు గలవాఁడయ్యెను. వానికుమారుఁ డగు అహమ్మద్ షాహ స్వతంత్రుఁడై అహమ్మద్‌నగరము రాజధానిగా నూతన రాజ్యమును స్థాపించెను. స్వతంత్రుఁడగుటకుఁ బూర్వ మతఁ డనేకదుర్గములను జయించెను. అందు శివనేరిదుర్గ మొకటి. ఆదుర్గములో నతనికి ధనముదొరకెను. తరువాత నతఁడు చందన్‌వందన్, లోహగడము, తోరణా మొదలైన దుర్గము లనేకములు సాధించి రాజాపురమువఱకుఁ గొంకణదేశమును స్వాధీనపఱచుకొనెను. తరువాతికాలములో నీ దుర్గములన్నియు శివాజీచే గెలువఁబడి నందున మిక్కిలి విఖ్యాతిఁజెందినవి. అహమ్మద్ నిజాంషాహ జున్నర్ అను పట్టణములోనుండి రాజ్యమును చక్కఁగా నేలుచుండెను. ఇతఁడు తనప్రజలకు నెట్టిభయమును లేకుండఁ బాలించెను. అందుచే నితని రాజ్యములోని యొకచోటినుండి మఱియొకచోటికి బంగారము నెగరవేసికొనుచు పోయినను భయములేకుండెను. ఇతనిని గెలిచి యితనిగర్వ మణఁపవలయునని బహమనీ రాజు యత్నించెనుగాని యాతఁడే యోడిపోయెను. ఇతఁడు ౧౪౯౪ లో అహమ్మద్‌నగరమునుగట్టించి దానినే తనరాజధానిని జేసికొనెను; దౌలతాబాదను దుర్గమును ముట్టడించి సాధించెను. ఇతఁడు ౧౫౦౮లోఁ గాలధర్మము నొందెను. ఇతని సద్గుణములను వర్ణించుటకు నే నసమర్థుఁడనని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. ఇతఁ డేకపత్నీవ్రతమును బాలించెను. ఇతని ప్రభుత్వకాల

ములో లోకులు కుస్తీపట్లుపట్టుట సాముగరడీలుచేయుట మొదలైన పౌరుష సూచకములగునాటల విశేషముగా నేర్చుకొనసాగిరి. ఈరాజు మహమ్మదీయుఁడైనను హిందూవంశజుఁడైనందున నితనిసద్గుణములకు హిందువులుగూడ సంతసింపవలసియున్నది.

బుర్హాన్ నిజాంషాహ (౧౫౦౮-౧౫౫౩). ఈతఁడహమ్మద్ షాహ కుమారుఁడు. రాజ్యారూఢుఁ డయినప్పు డీతఁ డేడుసంవత్సరములవాఁడు. ముఖమలఖానుఁ డనుమంత్రి యీతనికి విద్య నేర్పెను. ఇస్మాయిల్ ఆదిల్ షాహ యొక్క కూఁతు నీతనికిచ్చి వివాహముచేసిరి. అయినను మామయల్లుండ్రకుఁ బోరాటకలిగి యల్లుఁడే యోడిపోయెను. ఇమాద్ షాహిరాజుతో యుద్ధము జరిగి యందుఁగూడ నీతనికి పరాభవము కలిగెను. తుదకీ మహమ్మదీయరాజుల కందఱికిని సఖ్యముకలిగెను. ఈతనియొద్దఁ గంబరశేనుఁడను బ్రాహ్మణుఁడుచాల కాలమువఱకు ముఖ్యమంత్రిగ నుండెను. గుజరాథ్ దేశపురాజునకును ఈతనికిని స్నేహముకలిగెను. మరాటూవా రీతనిప్రభుత్వకాలములోనే ప్రసిద్ధికెక్క సాగిరి. సంభాజీచిట్నీ సనువాని కీరాజు 'ప్రతాప్ రావ'ను బిరుదునిచ్చి, యాతనిని పరరాజులయొద్ద రాయబారిగా నేర్పఱిచెను. విజయనగరము నేలుచున్న రామరాజు ౧౫౩౦లో నీరాజుమీఁదికి దండెత్తి యీతని నోడించెను. తరువాత నీతఁడు రామరాజుతో స్నేహముచేసి యాతని సాహాయ్యముఁ దీసికొని విజాపురరాజులపై ననేకపర్యాయములు దండెత్తిపోయెను. ఈషాహకు నైదుగురు పుత్రులుండిరి. ఈతఁడు ౧౫౫౩ లోఁ గాలధర్మము నొందెను.

హుసేన్ నిజాంషాహ (౧౫౫౩ - ౧౫౬౫). ఈతని ప్రభుత్వకాలములో నన్నదమ్ములకు వివాదములు కలిగెను. విజాపుర గోలకొండ విజయనగర రాజు లీతనిమీఁదికి దండెత్తివచ్చిరి. వారిదాడి కోర్వలేక యీతఁడు వారితో సంధిచేసికొనెను. రామరాజు తురుష్కులందఱిని మిక్కిలిబాధ పెట్టినందున విజాపుర గోలకొండ అహమదనగరములోని తురుష్కరాజు లందఱును

ఒక్కౖరి. హుసేన్ నిజాంషాహాకు చాందబీబీ యనుకూఁతు రుండెను. ఆమెను ఆదిల్ షాహాకిచ్చి వివాహముచేసెను. తరువాత నీతురుష్కరాజు లందఱును గలిసి ౧౫౬౫ లో తాలికోట యుద్ధమందు రామరాజు నోడించిరి. ఈవర్తమానమంతయు విజయనగరరాజ్యచరిత్రలో సవిస్తరముగా వర్ణింపఁబడును. ఈరాజునొద్ద నాలువందలఫిరంగు లుండెనఁట.

ముర్తజానిజాంషాహ (౧౫౬౫-౧౫౮౬). ఈతఁడు చిన్న వాఁడుగా నున్నప్పు డీతనితల్లియగు ఖుజానుల్తానా యనునామె రాజ్యము చేసెను. ఈతఁడు ౧౫౬౯ లో స్వయముగా రాజ్యముచేయఁ దొడఁగెను. బిజాపురముమీఁదికి యుద్ధమునకుఁబోయి వారిసైన్యాధీశుని నీతఁడు చంపెను. వరాడ్ (బీరార్) దేశపురాజును, సైన్యాధీశునిఁజంపి యారాజ్యము నాక్ర మించుకొనియెను. ఖాన్ దేశపు సుల్తానుని నోడించి యాతఁడు కప్పము కట్టు నట్లు చేసెను. ఈతఁడు విశ్వాసపాత్రుఁడును స్వామిభక్తుఁడును అగు తన మంత్రి ననావశ్యకముగాఁ జంపించెను. ఈమంత్రి పేరు చంగిజ్ ఖానుఁడు.

ఈనవాబుతరువాత మిరన్ హుసేన్ - ఇస్మయిల్ నిజాంషాహాలను నిద్దఱు సుల్తానులు ౧౫౮౬ మొదలు ౧౫౯౧ వఱకు రాజ్యముచేసిరి. తరువాత రెండవబురాణ్ నిజాంషాహ అనువాఁడు నాలుగు సంవత్సరములు (౧౫౯౧-౧౫౯౪) రాజ్యముచేసెను. ఈప్రభుత్వముల కాలములో ఆస్థానమందలి సర దారులలోఁ గలహములు మెండయ్యెను. దక్షిణదేశీయులు పరదేశీయులు అని రెండుకక్షలుపుట్టి యెవరికి నధికారమువచ్చినప్పుడు వా రితరులను బాధపెట్టఁ జొచ్చిరి. ౧౫౯౪ లో మియాన్ అంజా అనువాఁడు అహమ్మద్ అను వానిని సుల్తానునుజేసెను.

## చాందబీబీ.

అహమ్మదనినవాఁడు నిజాంవంశజుఁడు కాఁడని వాదముద్భవిల్లెను. అందుచే మిఅన్ మంజా అనువాఁడు అక్బర్ బాదుషాహ కుమారుఁడగు మురాద్

అనువానిని తన సహాయమునకుఁ బిలిచెను. ఇట్లు మొగలులు అహమద్ నగర రాజ్యమును మ్రింగుటకు సిద్ధులయివచ్చిరి. కాని యప్పుడు చాందబీబీ యను శూరవనిత యీరాజ్యమును తనశౌర్యోత్సాహములచేఁ గాపాడి యజరామర కీర్తిని సంపాదించెను. ఈప్రసంగపు వర్ణనయు, నీమెచరిత్రమును కీర్తిశేషురా లయిన సౌ. భండారు-అచ్చమాంబయక్కగారి గ్రంథములోనుండి గ్రహించు చున్నాఁడను.

"ఈశూరవనితకు నిజామ్‌షాహిలో మూఁడవపురుషుఁడగు హుసేన్ నిజామ్ షాహ తండ్రి. ఆదిల్ షాహిలో నాల్గవపురుషుఁడగు అల్లీ ఆదిల్‌షాహ భర్త. వీరిరువురికిని పరస్పరకలహములు కలిగి యుండెను. కాని అహమ్మద్ నగర విజాపూరు, గోలకొండలకుఁ ప్రభువు లయినతురకషహాలు కూడి విజయ నగరముపై దండు వెడలుటకు నిశ్చయించుకొనినకాలములో, అహమ్మద్‌నగర మునకు నధిపతియయిన హుసేన్‌షాహ, విజాపురమున కధిపుఁడయిన అల్లీ షాహతో సఖ్యము చేయఁ దలఁచి తనకూఁతురగు చాందబీబీని నతనికిచ్చి వివాహము చేసెను. తదనంతరము తాలికోటలో క్రీ. శ. ౧౫౬౫-వ సంవత్సరమునం దీమహమ్మదీయులకును విజయనగరాధీశ్వరుఁడగు రామరాజు నకును యుద్ధముజరిగి విజయనగర సంస్థాన మడుగంటె ననుసంగతి హిందూదేశ చరిత్రము చదివినవారి కందఱకును విదితమే గాని స్త్రీలగు చదువరులకు నీషా హీలసంగతి దిన్నఁగాఁ దెలిసినంగాని ప్రస్తుత చరితము బోధపడదుగాన వాని వివరము, నిందుఁ గొంత సంగ్రహముగాఁ దెల్పెద:—

క్రీ. శ. ౧౫౨౬-వ సంవత్సరమున బ్రాహ్మణీ రాజ్యమను తురకరాజ్య మంత్యదశకు వచ్చెను. అప్పుడు దక్షిణమున నైదుగురు తురుష్కులు స్వతంత్రు లయిరి. వారిలో విజాపురమునందు రాజ్యము చేయువారిని 'ఆదిల్ షహాల'ని యు, గోలకొండయందలి రాజుల వంశమును 'కుదుబ్ షహాల'నియు, వర్హాడ (బీరారు) రాజులను 'ఇమాద్‌షహాల'నియు అహమ్మదనగర ప్రభుత్వమువారిని

నిజామ్‌షహా'నియు, అహమదాబాదు నందలి వారిని 'బరీద్ షహా'నియు బిలుచుండిరి. కాని కొన్ని దినములయిన పిదప 'ఇమాద్ శాహి' 'బరీద్ శాహీలు' రెండును నాశమునొంది 'ఆదిల్ శాహి' 'నిజామ్‌శాహి' 'కుతుబ్ శాహీలు' మూఁడుమాత్రము నిలిచెను. శాహి యనఁగా రాజ్యమనియు శాహ యనఁగా రాజనియు నర్థము.

భర్త జీవితకాలమునందు చాందబీబీయొక్క చాతుర్యమంతగాఁ దెలియకుండెను. ఈమె భర్తయగు అల్లీ మిగులభోగముల ననుభవించుచు రాజ్యమునం దంతమాత్రము దృష్టిలేక యుండెను; ఇట్లుండఁగా క్రీ. శ. ౧౫౮౦ వ సం. వత్సరమునం దొకదినమునం దాతఁడు అజాగ్రత్తగానున్న సమయమునం దొకఁ డకస్మాత్తుగా నతనిఁ జంపెను. తదనంతర మాతని తమ్మునికొడుకగు రెండవ యిబ్రాహిమ్ ఆదిల్ శాహ సింహాసనారూఢుఁ డయ్యెను. అతఁడు ౯ సంవత్సరముల బాలుఁ డగుటవలన నాతని పెత్తండ్రిభార్యయగు చాందబీబీయే కమిాల్ ఖానను మంత్రి సాహాయ్యమువలన రాజ్యము నేలుచుండెను. కొన్ని దినము లయినవెనుక కమిాల్ ఖానునకు రాజ్యకాంక్ష మిక్కుటమయ్యెను. దానింగని చాందబీబీ కిశ్వరఖానను సరదారునిసాహాయ్యముచే వానిఁ జంపి కిశ్వరఖానునకు దివాణగిరి నిచ్చెను. కాని కొంతకాలమునకు వాఁడును కృతఘ్నుఁడయి రాణిమిాఁదఁ గొన్నిదోషముల నారోపించి యామెను సాతార కిల్లాలో కైదుచేసియుంచెను. చాందబీబీని కైదుచేసినపిదప కిశ్వర్ ఖానురాజ్యమునం దంతటను విశేషసంక్షోభము చేయసాగెను. దాని నెవరును మాన్పలేక యుండఁగా యెకసాల్ ఖానను సిద్దీసరదారుఁ డొకఁడు వాని నచటినుండి వెడలఁగొట్టి చాందబీబీని విడిపించి తెచ్చెను. తదనంతర మామె యెకసాల్ ఖానను వజీరుగా నేర్పఱిచి రాజ్యము నేలుచుండెను. అప్పుడాతఁడు ప్రాఁతనౌకరుల నందఱిని దీసి క్రొత్తవారిని నియమించెను. అక్కాలమునందు విజాపురమునందలి జనులు మంత్రిత్వము ఉన్ ఉల్ ముల్క సిద్దీకియ్యవలెనని

కొందఱును, అబ్దుల్ హాసనను దక్కనీతురకకియ్యవలెనని మఱికొందఱును ఇట్లు రెండుపక్షములుగా నుండిరి.

ఇట్లు రాజ్యములో నంతఃకలహంబులు జరుగుచుండఁగా మూర్తిజా, నిజామ్ శాహా, కులీకుతుబ్ శాహా వీరిద్దఱును అహమ్మదనగరముపైకి దండువెడలి దానిని సమీపించిరి. అప్పుడచటఁ బ్రజలలో బొత్తిగా నైకమత్యము లేకయుండి నందున వైరులకు మిగుల యుక్తిగా లోకులను సమాధానపఱిచి అబ్దుల్ హాస నునకుఁ బ్రధానిత్వమిచ్చి రెండుపక్షముల వారిని నొకటిగాఁజేసి శత్రువులు మరలిపోవునట్లు చేసెను! శాహాలు తమతమనగరముల కరిగినపిదప దిలార్ ఖానను సిద్దీ మిక్కిలి గర్వించి అబ్దుల్ హాసనును జంపించి తానే ప్రధాని యయ్యెను.

ఇట్లీరాజ్యమున నొకసంవత్సరముపై నాలుమాసములలో ముగ్గురు మంత్రు లైనను నొకఁడైను నెగ్గకుండెను. దిలార్ ఖాన్ సిద్దీ మిగుల చాతుర్య వంతుఁడై నందున నతఁడు తనకు రాజ్యకాంక్ష కలిగియు దానిని వెలిపుచ్చక మిగుల జాగ రూకుఁ డయియుండెను. ఇతఁడురాజ్యవ్యవస్థను మిక్కిలిచక్కఁగాఁ జూచెను గాని చాందబీబీ యచటనుండిన తనయాట లేమియు సాగవని తెలిసికొని ఇబ్రాహీమ్ ఆదిల్ షహా చెల్లెలగు ఖుదీజా సుల్తానాయను రాజపుత్రిని మూర్తి జానిజామ్శాహా కొడుకగు మిరాన్ హుసేనుని కిప్పించి క్రీ. శ. ౧౫౮౪-వ సంవత్సరమున ఖుదీజా సుల్తానాకుఁ దోడు చాందబీబీని నిజామ్షాహీకిఁ బంపి బాలరాజును నాశ్రయహీనునిఁ జేసెను.

చాందబీబీ నిజామ్షాహీకి వచ్చినపిదప నచట నైదాఱు సంవత్సరము లలో మూర్తిజానుజంపి యాతని కొడుకగు మిరాన్ హుసేనును, అతనినిఁజంపి యాతని పినతండ్రియగు బురాణశాహాయును, అతని వెనుక నాతని పుత్రుఁడగు ఇస్మాయెల్ శాహాయును, తదనంతర మాతని తమ్ముఁడగు ఇబ్రాహీమ్ నిజామ్ షహాయును రాజ్యముచేసిరి. ఇబ్రాహీం మరణానంతరమునం దతని పుత్రుఁడగు

బహాదుర్ను కారాగృహమునందుంచి మి ఆన్ అను దక్షిణితురకమంత్రి నిజామ్ షాహిలోని వాఁడని చెప్పఁబడు అహమ్మ దనువానిని సింహాసనముపై నుంచి తానే రాజ్యముచేయ మొదలుపెట్టెను. ఈ అహమ్మదునకు రాజ్యము నిచ్చుట సిద్దీ సరదారుల కిష్టములేక బహాదురునకు సమవయస్కుఁడగు నొకబాలునిఁ దెచ్చి వానినే రాజ్యార్హుఁడని చెప్పఁదొడఁగిరి. ఇట్లు వారు రెండుపక్షముల వారై సైన్యసహితులగుటఁ గని మిఆన్ మంజూ మిగుల చింతించి అక్బర్ బాదుషా కొడుకగు మురా దనునాతనికి మీరు నాకు సాయము చేసినచో అహమ్మదనగరము మీస్వాధీనము చేయుదునని వర్తమానమునంపెను. కాని మురాద్ సైన్యసహితుఁడయి వచ్చులోపల అహమ్మదనగరమునం గల రెండుపక్షముల వారికిని యుద్ధముజరిగి సిద్దీలను మిఆన్ మంజూ ఓడించెను. కానఁ దా ననిన ప్రకారము అహమ్మదనగరము మురాదునకిచ్చుటకు సమ్మతింపఁడయ్యె. అంత నా రాజపుత్రుఁడు యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. ఆసమయమున నీప్రధాని సైన్యమునంతను ఆదిల్ షహా, కుతుబ్ షహాలను సహాయమునకుఁ బిలువఁబోయెను. అతఁ డరిగినపిదప బహాదుర్ రాజ్యమని చాటించి చాందబీబీ రాజ్యమును తానే నడపుచుండెను.

ఆసమయమునం దిద్దఱు ముగ్గురు రాజ్యము తమకే కావలయునని యనుట వలన నచటి జనులు రెండు మూడు పక్షములుగా నుండిరి. ఇట్టిసమయమున చాందబీబీ తన దృఢనిశ్చయమును విడువక, నేహంగ్ఖానునకు నుషహా అల్లీ సిద్దీకిని వర్తమానముల నంపి వారిని రాజధానికిఁ బిలువనంపెను. చాందబీబీ యాజ్ఞాప్రకారమున వారిరువురును వచ్చుచుండఁగా త్రోవలో శత్రువులు వారిని రానీయక నిలిపిరి. నేహంగఖాన్ మాత్రము శత్రుసైన్యము నుపాయముగాఁ జీల్చి రాజధానిం బ్రవేశించెను.

ఆదిల్ శాహ, కుతుబ్ షహాలు మురాదునిరాక విని, అతఁడు ప్రధమమునందు నిజామ్శాహిని గెలిచి పిదప తమపైకివచ్చునని భయపడి విపులసైన్యములతో నిజామ్శాహికిఁ దోడుగా వచ్చుచుండిరి. ఈసంగతి విని మురాద్ వారు

వచ్చినచో గెలుపొందుట కష్టమని తలఁచి గ్రామమును చుట్టుముట్టి బురుజులను బడఁగొట్ట యత్నించుచుండెను. మురాద్ సైనికులు బురుజులను బైటినుండి త్రవ్వి గూడుచేసి యాగూఁటిలో తుపాకిమందునుంచి దానికి నగ్నిని రవులు కొల్ప యత్నించుచుండిరి. కాని చాతుర్యవతియగు చాందబీబీ లోపలినుండి బైటివఱకు రంధ్రములు వొడిపించి వా రాగూటిలోనుంచు మందు నవలికిఁ దీయించుచుండెను. ఇంతలో వా రొకబురుజునకు నిప్పంటించినందున నా బురుజుతోఁగూడ ననేకసైనికులు నాశమునొందిరి. అంత నా త్రోవను మొఘ లులు పట్టణములోనికిఁ జొరనుంకింపఁగా నదివఱ కధిక శౌర్యముతో యుద్ధము చేయుచున్న నిజాముసైన్యములు ధైర్యమును విడిచి పాఱఁదొడఁగెను. అప్పుడు చాందబీబీ ధైర్య మవలంబించి, కవచమును ధరియించి మోముపై ముసుకువేసి కొని చేత ఖడ్గమును ధరియించి "నాబొందిలో ప్రాణము లుండఁగా పట్ట ణము పగవారిచేఁ జిక్కనీయ" నని కూలినబురుజు వైపునకుఁ బరుగెత్తెను. దానింగని సైనికు లధికశౌర్యసాహసములు గలవారలై మరలి శత్రువులతోఁ బోరసాగిరి. ఆదినమంతయు యుద్ధము జరిగెను గాని చాందబీబీ శత్రువులను పట్టణములోనికిఁ జొరనీయకుండెను. అప్పు డామె యొక్కెడఁజూచినను దానయై బహుశౌర్యముతోఁ బోరాడెను. ఆసమయమునందలి యామె శౌర్యమునుగని శత్రుసైనికులు సహిత మాశ్చర్యపడిరని ప్రత్యక్షముగాఁ జూచిన యొకసైనికుఁడు వర్ణించెను. అప్పుడు మురాద్ తనకు గెలుపు దొర కుట దుస్తరమని తెలిసికొని "మాకు వర్హాడప్రాంతము నిచ్చినయెడల మేము మాదేశమునకుఁ బోయెద" మని చాందబీబీకి వర్తమాన మంపెను. త్వరగా రాజ్యమునందలి యితరసైనికులువచ్చి తనకుఁ దోడుపడు లక్షణము లేమియు నగపడనందున వర్హాడప్రాంతము చాందబీబీ వారికినిచ్చి సంధి చేసికొనెను.

తదనంతర మామె బహదుర్‌ను కారాగృహమునుండి విడిపించి తెచ్చి యతనికిఁ బట్టాభిషేకముఁ గావించెను. అంత నామె అహమ్మదనగరమును నాతని

ప్రధానిగా నేర్పఱచి యాపిల్లవాని పేర తాను రాజ్యము నేలుచుండెను. కాని అహమ్మద్ ఖానునకు రాజ్యకాంక్ష మిక్కుటమైనందున అతఁడు చాందబీబీ మాటను సాగనీయకుండెను. ఈసంగతి సైనికులకుఁ దెలియఁగా వా రాతనిఁ బట్టి బంధించి చాందబీబీ స్వాధీనము చేసిరి. తదనంతర మాతనిపని నేహాంగ ఖానను నాతని కిచ్చినందున చాందబీబీ రాజ్యము నురక్షితముగా నేలఁదొడఁ గెను. కాని త్వరలోనే నేహాంగఖాను రాణికి వైరియయ్యెను. ఈసమయము ననే మురాద్ కాలము చేసెను. అంత నక్బరుపాదుషా తనచిన్న కొమారుఁ డగు డానియల్ అను నాతనిని మురాద్ పనిమీఁదికిఁబంపి యతనికి నజీరునిగా ఖాజా ఖానను వానిని బంపెను. అప్పు డక్బరు బర్హాణపురమునకు వచ్చి డానియల్ ను క్రీ. శ. ౧౫౯౯-వ సంవత్సరమున అహమ్మద్ నగరముపైకి యుద్ధమున కంపెను.

ఈసమయమునందు నిజామ్‌శాహీలో మిగుల నవ్యవస్థగా నుండెను. చాందబీబీవంటి చాతుర్యవతి రాజ్యము చేయుచున్నను ఆసమయమునం దామెకు నచట విశ్వాసార్హులగువా రెవ్వరును లేకయుండిరి. కాన నామె యేమియుఁ జేయలేక యుండెను. నేహాంగఖాను చాందబీబీతో నేమి యాలోచించి వైరులను త్రోవలో నాటంకపఱుపఁబోయెను. కాని శత్రువు లాతఁ డుండుత్రోవను రాక మఱియొకత్రోవతో వచ్చి పట్టణమును ముట్ట డించిరి. అప్పుడు చాందబీబీ తనయాజ్ఞను వినువా రెవ్వరునులేక యప్పటికి రాజధానిని విడిచి బాలరాజును గొని జున్న రను గ్రామమునకుఁ బోవ నిశ్చ యించెను. కాని యామె సమీపముననుండు హమీద్ ఖా ననువాని కాయా లోచన సరిపడక చాందబీబీ పగవారికి రాజ్య మిచ్చుచున్నదని యూరంతటను చాట మొదలుపెట్టెను. అది విని దక్షిణీతురకలు నిజమని తలఁచి హమీద్ ఖానును ముందిడుకొని కొందఱు భటులు చాందబీబీ యంతఃపురముఁ జొచ్చి యామెను జంపిరి. ఇట్లు హిందూస్థానపు ఇతిహాసములోఁ బ్రసిద్ధురాలయిన

స్త్రీరత్నముయొక్క చరిత్రము ముగిసెను. ఈమె ప్రథమమునందు విజాపురమున మఱింది కొమారుఁడగు ఇబ్రాహీమ్ ఆదిల్ షహా చిన్నతనమున నతనికొఱకు ఆదిల్ షాహిని రక్షించెను. పిమ్మట అహమ్మద్ నగరమునఁ దనతమ్ముని మనుమఁడగు బహాదురుకొఱకు నిజామ్‌షాహీ సంరక్షణమును మిగుల కుశలతతోఁ జేసి సార్వభౌముఁడగు అక్బరుయొక్క కుమారుని సైన్యములను దిరుగఁ గొట్టెను. కాని తుదకు రాజ్యమునం దంతటను మూర్ఖు లుండుటవలన నామె యోగ్యత నెఱుఁగక మిగుల నన్యాయముగా నామెను జంపిరి. నేఁటివఱకును దక్షిణమున స్త్రీలశౌర్యమునుగూర్చి ప్రసంగించు నప్పుడు అచటివారు చాందబీబీయొక్క శౌర్యమునే ప్రథమమున శ్లాఘింతురు.

చాందబీబీ విషయమై యొకచరిత్రకారుఁ డిట్లు వ్రాసియుంచినాఁడు: "దక్షిణ హిందూదేశములో జన్మించిన పరాక్రమ వంతులలో నీమె యొకతె. ఆమెవంటి స్త్రీరత్నము లుద్భవించుట యరుదు. ఆమె రూపమునందుఁ జక్కనిది. అల్పవయస్సులోనే భర్తృవియోగదుఃఖము ప్రాప్తించినను, మరణము వఱకును పవిత్రాచరణమునందె దృష్టి కలిగియుండెను. అహమ్మదనగర విజాపుర రాజ్యములోఁ బ్రసంగము వచ్చినప్పుడు తనకర్తవ్యము నీమెచేసెను. ఆమె యప్రతిమశౌర్య మనేకపర్యాయములు ప్రజ్వలించెను. ఆమెకు దుఃఖప్రదమగు మరణము ప్రాప్తించినందులకు నందఱు జనులును చింతించెదరు; నేఁటి వఱకును ఆమెను సన్మానపూర్వకముగా స్మరించెదరు."

చాందబీబీచే రాజుచేయఁబడిన బహాదుర్ షాహాను మొగలులు ఆగ్రాకోట లోఁ జెఱఁబెట్టిరి (౧౬౦౦). ఇంతటితో నహమ్మద్ నగరరాజ్య మంతరించె నని చెప్పవచ్చును. కాని యారాజ్యములోని కొందఱు సరదారులు మూర్తజా అనువానికిఁ బట్టాభిషేకముచేసి యహమ్మదనగర రాజ్యమును మఱికొన్ని దినములవఱకు రక్షింప యత్నించిరి. అట్టి సరదారులలో వజీర్ మలిక్ అంబర్ అనువాఁడు ముఖ్యుఁడు.

## మలిక్ అంబర్.

ఇతఁడు హబ్షీ (Abyssinian) జాతివాఁడు. మొదటి మూర్తజా నిజాంషాహాయొక్క మంత్రియగు చంగీజ్ ఖానునియొద్ద నీతఁడు మొదట సరదారుగానుండి యభివృద్ధిఁ జెందెను. పైనివర్ణించినట్లు మొగలులు ౧౬౦౦లో నహమ్మదనగర రాజ్యమును గెలిచిన తరువాత నీతఁడు దౌలతాబాదు దుర్గమునకు నాలుమైళ్ల మీఁద ఖడకీ యను గ్రామములో గొప్పమందిరములు కట్టించి, రాజవంశములోని మూర్తజాయనువానికిఁ బట్టముకట్టి, యాగ్రామమును నిజాంషాహివారి రాజధానిని జేసెను. ఈపట్టణమునకే తరువాతి కాలములో ఔరంగజేబు అవరంగాబాద్ అని పేరుపెట్టెను. మలిక్ అంబర్ వద్ద గొప్పగొప్ప మరాటా సరదారులుకూడ నుండిరి. శివాజియొక్క పితామహుఁడగు మాలోజీ భోన్సలే, మాతామహుఁడగు లఖూజీ జాధవరావు ఇతనియొద్ద సరదారులుగా నుండిరి. వీరి నండతిని సహాయులుగాఁ దీసికొని, మాలికాంబర్ మొగలుల నోడించి వారాక్రమించుకొనిన రాజ్యమును తిరిగి సంపాదించెను. ఢిల్లీశ్వరుని సరదారుఁడగు ఖానఖానాన్ అనువాని నోడించి అహమ్మద నగరము స్వాధీనము చేసికొని, వానిని బరహాణ్ పురమువఱకును వెడలఁగొట్టెను. తరువాత నాతఁడు దేశస్థితిని బాగుపఱుపఁ జొచ్చెను. నిజాంషాహిలోని భూములన్నియుఁ గొల్పించి, భూముల యాదాయములనుబట్టి పన్ను లేర్పఱిచెను. ఉత్తరదేశములో రాజా తోడరమల్లుఁడుచేసిన యేర్పాటు లీతఁడు దక్షిణమునఁజేసి ప్రజల యాశీర్వచనమునకుఁ బాత్రుఁడయ్యెను. గ్రామము లిజారా కిచ్చుపద్ధతి మానివేసెను. ఏరయి తెంతప న్నియ్యవలయునో స్పష్టముగాఁ దెలిసినందున నుద్యోగస్థులు వానియొద్దనుండి యెక్కుడు పన్ను తీసికొనుటకు వీలులేక పోయెను. కొన్ని సంవత్సరములవఱకుఁ బన్నులేకుండ భూములనిచ్చి యనేక భూముల నమరక పఱిచెను. అందుచేఁ బ్రజలు బాగుపడి పన్నులు తప్పక యీయసాగిరి.

గుజరాత్ దేశపు సుబేదారుఁడగు అబ్దుల్లాఖానుఁడు వచ్చి పోరాడ నాతనిని మలికంబర్ ఓడించెను. అందుమీఁద ౧౬౧౭లో జహాంగిర్ బాదుషా తన కుమారుఁడగు షాహజహాన్ అనువానిని మలిక్ అంబర్ మీఁదికి ముందు పంపి తానును దండెత్తివచ్చెను.

మరాటీ సరదారు లనేకులు చీలి మొగలులలోఁ గలిసిరి. అందుచే మలికంబరుఁడోడి ఢిల్లీశ్వరునకు నహమ్మదనగరమును, కొంతరాజ్యము నిచ్చెను. షాహజహాన్ కాశ్మీరమునకుఁబోఁగా మలికంబర్ తానోడిన రాజ్యమును మరల సంపాదించెను. తరువాత నీవర్తమానము తెలిసి షాహజహాన్ మరలవచ్చి పోయిన రాజ్యమును తిరిగి జయించెను. అటమీఁద మలికంబర్ ఢిల్లీశ్వరునితోఁ బోరాడలేదు. స్నేహభావముతోడనె యుండెను. తనశక్తికొలఁదిని పడిపోవుచున్న నిజాంషాహి రాజ్యమును కాపాడెను. ఈ మంత్రిపుంగవుఁ డెనుబదిసంవత్సరములు బ్రతికి ౧౬౨౬లోఁ గీర్తిశేషుఁడయ్యెను. స్వామిభక్తి, రాజ్యచాతుర్యము, న్యాయప్రవర్తనము, ఈశ్వరభక్తి, ఔదార్యము, శౌర్యము లనుగుణములకై యీతఁడు జగద్వంద్యుఁ డనుటకు సందేహము లేదు.

మలికంబర్ మరణానంతరమున నిజాంషాహియొక్క యాస్థానమందు ననేక కలహములు కలిగెను. షహాజీ మొదలయిన మరాటీ సరదారులు తిరుగఁబడిరి. ౧౬౩౦లో గొప్పకఱవు వచ్చినందున నసంఖ్యప్రజాక్షయమై రాజ్యమంతయుఁ బాడుపడెను. కొలఁదికాలములోనే మొగలసైన్యములు దండెత్తి వచ్చెను. ౧౬౩౩ లో నహమ్మద నగరరాజ్యము మొగలులు స్వాధీనము చేసికొనిరి. బాలరాజును తీసికొనిపోయి ఢిల్లీపట్టణములోఁ జెఱఁబెట్టిరి.

ఇంతయైనను మఱియొక కుఱ్ఱవానిని రాజునుజేసి నిజాంషాహిని నిలువఁ బెట్టవలయునని శివాజితండ్రియగు షహాజీభోన్సలేయను మరాటీ సరదారుఁడు ౧౬౩౩ మొదలు ౧౬౩౭ వఱకు యత్నించెను. కాని తుదకు నాతఁడును మొగలులకోడి విజాపురము వారియొద్ద సరదారయ్యెను.

## ౮. విజాపురములోని ఆదిల్ శాహి.

(౧౪౮౯-౧౬౮౬).

ఈ రాజవంశము రమారమి రెండువందల సంవత్సరములవఱకుఁ బ్రభుత్వముచేసెను. దీనికి మూలపురుషుఁడు యూసుఫ్ ఆదిల్ శాహా అనువాఁడు. ఇతఁడు ౧౪౮౯ మొదలు ౧౫౧౦-వఱకు రాజ్యముచేసెను. ఇతఁడు తురుష్కస్థానములోని యొక గొప్పవంశములోని వాఁడని కొందఱు చరిత్రకారులు వ్రాసియున్నారు. ౧౪౫౯-లో నితఁడు హిందూదేశమునకు వచ్చి మహామదు గవాన్ వద్ద నుద్యోగములోఁ బ్రవేశించి క్రమక్రమముగా నభివృద్ధిచెందెను.



విజాపురములోని యొక రాజవీధి.

ఇతఁడు విజాపురమునకు సుబేదారుగానుండి బహమని వంశజుఁడగు మహమదుషా మృతిచెందిన తరువాత స్వతంత్రుఁడయ్యెను. ఇతఁడు విజాపురములో ననేక సుందరమందిరములను గట్టించి యాపట్టణమునకు మిగుల వన్నె తెచ్చెను. ఇతఁడు తన జీవితకాలమంతయు యుద్ధమును జేయుచు నెక్కుడురాజ్యము సంపాదించెను. ఇతనిరాజ్యమునకు నుత్తరమున సీరానదియు, దక్షిణమున తుంగభద్రానదియు, తూర్పున భీమా కృష్ణానదులును, పశ్చిమమున గోవా మొదలు

బొంబాయివఱకునున్న పశ్చిమసముద్రమును పొలిమేరలై యుండెను. ౧౫౧౦ లో పోర్చుగీసువారి స్వాధీనతలోనున్న గోవాపట్టణము సాధించెను. ఇతఁడు ౭౬ సంవత్సరములవఱకు బ్రతికి ౧౫౧౦ లోఁ గాలధర్మము నొందెను.

యూసుఫ్ అదిల్‌శాహాతోఁ బోల్చుటకు మహమద్‌గవాన్‌తప్ప సమకాలీనపురుషుఁడు మఱియొకఁడులేఁడు. ఇతని శౌర్య విద్యావ్యవహార చాతుర్యములను సద్గుణములు వర్ణనీయములు. ఇతఁడు ముసద్దీ పని స్వయముగా చేయుచుండెను. మతవిషయమై హిందూ మహమ్మదీయులయెడల సమభావము కలిగియుండెను. హిందువులమీఁదను విశేషముగా మహారాష్ట్రులమీఁదను ఇతనికి నెక్కుడనుగ్రహముకలదు. వారికితఁడు గొప్పయుద్యోగముల నొసఁగెను. రాజ్యవిషయిక మైన దస్తరవంతయు మహారాష్ట్రభాషలోనే వ్రాయుఁడని యాజ్ఞాపించెను. విజాపురదుర్గమును ఈతఁడేకట్టించెను. ఇతని మరణానంతర మితనికుమారుఁ డగు ఇస్మాయిల్ రాజయ్యెను.

ఇస్మాయిల్ ఆదిల్‌శాహ (౧౫౧౦-౧౫౩౪)—తండ్రి పోయినపుడితఁడు ౯ సంవత్సరములవాఁడు. ఇతనిపాలకుఁ డగు కమాల్‌ఖానుఁ డితనినిఁ జంప యత్నించెను. కాన రాజమాతచే నాతఁడే చంపింపఁ బడియె. బేదర్, బరార్, అహమద్‌నగర్ రాజ్యములలోనిరాజులును బహమనీరాజును గలిసి, యితనిమీఁదికి దండెత్తివచ్చిరి. కాని యుక్తి ననుసరించి యితఁడు వారిలో మిత్రభేదముకల్పించి, వారి నందఱి నోడించెను. పోర్చుగీసువారు గోవాపట్టణమును తీసికొనిరి. ౧౫౨౦ లో కృష్ణదేవరాయలవారితని స్వాధీతలోనున్న రాయచూర్ దుర్గమును అనన్యసామాన్య పరాక్రమముతో స్వాధీనము చేసికొనిరి. అప్పుడాదుర్గమును విడిపించుటకై యిస్మాయిల్ ఆదిల్‌శాహ గొప్పసైన్యముతో వెళ్లెనుకాని కృష్ణరాయని శౌర్యమునకుఁ దాళలేక పూర్తిగఁ బరాభూతుఁడై తిరిగిచూడక పాఱిపోయెను. ఈకథాభాగము కృష్ణరాయని చరిత్రలో వివరముగా వర్ణింపఁగలము. ఇతఁడు బేదర్‌రాజైన

బుర్హాన్ బేరీద్ శాహాను బూర్తిగానోడించెను. ఇతఁడు ౧౫౩౪ లో మరణమునొందెను. ఇతఁడు విద్వాంసుఁడు, దయావంతుఁడు, న్యాయదృష్టి గలవాఁడు రసికుఁడు, కావ్య ప్రియుఁడు. తన యుద్ధభటులతోఁగూడి యితఁడు కష్టముల కోర్చి పాటుపడుచుండెను.

మొదటియిబ్రాహిం ఆదిల్ శాహ (౧౫౩౪ - ౧౫౫౮)—ఇస్మాయిల్ పోయినతరువాత నాతని పెద్దకొమారుఁడగు మల్లు అనువాఁడు రాజయ్యెను. కాని వాఁడు దుర్వ్యసనాసక్తుఁడగుటచే సరదారు లాతనిఁదొలఁగించి యాతని తమ్ముఁడగు ఇబ్రాహీమును సింహాసనాసీనునిఁ జేసిరి. ఇతఁడు మహమ్మదీయుల లోని షియాపంథమును వదలి సునీపంథమును స్వీకరించెను. పరదేశీయులగు తురుష్కుల సైన్యములోనుండి తొలఁగించెను. వా రందఱును విజయనగరమునకుఁ బోయి యచ్చటి రాజునొద్ద సైనికులుగానుండిరి. ఇతనికిఁ బూర్వమున్న సుల్తానుదప్తరు నంతయుఁ బారసీలోనికి మార్చియుండెను. దాని నితఁడు మరల మరాటిలోనికి మార్చెను.

అనేక మరాటావారికి గొప్ప గొప్ప యుద్యోగముల నొసఁగెను. అప్పటి నుండియే మరాటావారు మిగుల నభివృద్ధిఁజెందిరి. ఇతఁడు విజయనగరమును పాలించుచున్న రామరాజుతోఁ బోరాఁడి యాతనినోడించె నని మహమ్మదీయ గ్రంథకారులు వ్రాసియున్నారు. ౧౫౪౩ లో నిజాంశాహ, కుతుబ్ శాహ, రామరాజులు కలిసి, యితనిరాజధాని మీఁదికివచ్చిరి. అప్పు డితనిమంత్రియగు సదఖానుడు యుక్తిచే నిజాంశాహ రామరాజులతో సంధి చేసికొని కుతుబ్ షాహతోఁ బోరాడి యాతనినోడించి గోలకొండకుఁ బాఱఁదోలెను. కొన్ని దినములలోనే యిబ్రాహింశాహకు నిజాంషాహవలనఁ బరాభవము కలిగెను. ఈయుద్ధములోను, తరువాత జరిగినయుద్ధములలోను నిజాంశాహకు రామరాజు [illegible]ము చేసెను. ఇతఁడు ౧౫౫౮ లో మరణముచెందెను.

అలీఆదిల్ శాహా (౧౫౫౭-౧౫౮౦)—ఆదిల్ శాహా రాజులవిద్దైన కల్యాణీ, సోలాపురము లను రెండుదుర్గములను హుసేన్ నిజాంశాహా స్వాధీన పఱుచుకొనియుండెను. అందుకు రామరాజుయొక్క సాహాయ్యమును వేఁడుటకై యితఁడు విజయనగరమునకుఁ బోయెను. అచ్చటనుండి రామరాజు సైన్యముల వెంటఁదీసికొని యాతఁడు ౧౫౫౮ లో నిజాంశాహిరాజ్యముమీఁదికి దండు వెడలి దేశమంతయుఁ గాల్చివేసెను. అందుపై నిజాంశాహా కల్యాణీ దుర్గమును అలీ ఆదిల్ శాహాకు నిచ్చి సంధిచేసికొనెను. ఈయుద్ధములో రామరాజుయొక్క హిందూసైనికులు తురుష్కులను మిక్కిలిబాధలు పెట్టిరి; గొప్ప మసీదులను మందిరములను పడఁగొట్టిరి. ౧౫౬౧ లో మరల రామరాజు సాయముదీసికొని కుతుబ్ శాహా ఆదిల్ శాహా లిద్దఱును నిజాంశాహిరాజ్యమును దోఁచుకొని రాజధానియైన అహమ్మదనగరమునకుఁ బోయి తమకు ననుకూలమైన సంధిచేసికొనిరి. ఈ యుద్ధములో విజయనగర సైన్యములు తురుష్కులకుఁ గోపమువచ్చునట్టి క్రూరకృత్యము లనేకములు చేసిరఁట.

తనకు సాయమొనర్చిన హిందూరాజైన రామరాజు ప్రబలుటచూచి యోర్వలేక మిత్రద్రోహియగు ఈ అలీ ఆదిల్ శాహా తురకరాజులగు నిజాంశాహా, కుతుబ్ శాహా, బేరీద్ షాహా లనురాజులను కలుపుకొనెను. ఇదివఱకుఁ బోరాడుచున్న ఈతురుష్కరాజులకు నిష్కళంకమైన యైకమత్యము కలుగవలయునని ఈయాదిల్ శాహా తనచెల్లెలిని హుసేన్ నిజామ్‌శాహా కుమారున కిచ్చెను. హుసేన్ నిజామ్‌శాహా కూఁతురైన చాందబీబిని తాను వివాహమాడెను. ఈతురుష్క రాజులందఱును కలిసి ౧౫౬౫లో తాలికోట యుద్ధమందు రామరాజును జంపి యాతనిసైన్యముల నోడించిరి. అంతటినుండి విజయనగరరాజ్యభాస్కరుఁ డస్తమించెను. తరువాత ఆదిల్ శాహా నిజాంశాహాలకు మరల యుద్ధముకలిగి ఆదిల్ శాహా రాజ్యములోని కొంతభాగమును నిజాంశాహా తీసికొనెను. ౧౫౭౧లో ఆదిల్ శాహా నిజాంశాహా లిద్దఱును, పోర్చుగీసు

వారి మీఁదికి దండెత్తి వెళ్లిరి. కాని పరాభూతులయి తిరిగివచ్చిరి. ౧౫౬౮-లో అలీ ఆదిల్ శాహ ఆదవాని దుర్గమును గెలిచెను. ఇతఁడు ౧౫౮౦ లో నొక కొజ్జాచేఁ జంపఁబడియె. ఈరాజునొద్ద నొక మహారాష్ట్ర బ్రాహ్మణుఁడు రాజ్యములోని యాదాయ సంబంధమైన మంత్రిగా (Finance Minister) నుండెనని చెప్పిన నితఁడు హిందూముసల్మానుల సమానభావముతోఁ జూచుచుండెననియు, హిందువులకు గొప్పగొప్ప యుద్యోగముల నొసంగుచుండె ననియు వేఱచెప్పవలయునా? ఈరాజు సత్కార్యాచరణమునం దపారసంపత్తిని వెచ్చించెను. గగనమహాల్, జుమ్మామసీద్, షహాబురుజ్ మొదలైన చక్కని మందిరములఁ గట్టించెను. కోటచుట్టు పెద్దగోడ పెట్టించెను. గొట్టములో నీళ్లు తెప్పించి యన్ని వీథులలోఁ గొళాయిలు పెట్టించెను.

రెండవ యిబ్రాహీం ఆదిల్ శాహ(౧౫౮౦-౧౬౨౭)—ఇతఁడు అలీయొక్క తమ్మునికొమారుఁడు. రాజ్యమునకు వచ్చినప్పు డితఁడు తొమ్మిది సంవత్సరములవాఁ డగుటచే కామిల్ ఖానుఁడను మంత్రియు చాందబీబీయను నామెయు రాజ్యవ్యవహారములు చూచుచుండిరి. తరువాత ననేకమంత్రులు మారిరి. రాజ్యవ్యవస్థలో నిట్టికల్లోలములు పుట్టుట చూచి అహమదనగర గోలకొండ నవాబు లదియే మంచి సమయమని తలఁచి విజాపురముమీఁదికి దండెత్తి పోయిరి. ఆపట్టణమును ముట్టడించి యొక సంవత్సరమువఱకు యుద్ధముచేసిరి. కాని అబుల్ హుసేన్, దిలావర్ ఖాన్ అను వార లప్రతిమశౌర్యముఁ జూపి నందున నిజాం కుతుబ్ శాహాలు వచ్చినత్రోవను మరలి పోవలసినవారైరి. దిలావర్ ఖాన్ ముఖ్యమంత్రి యయ్యెను. కాని రాజు పెద్దవాఁ డైనకొలఁదిని వాతని కధికార మియ్యక యతనిని కట్టులోనుంచెను. అతఁ డొకసారి పాఱిపోయి స్వతంత్రుఁడయ్యెను. అందుచే భయపడి దిలావర్ ఖాన్ అహమద్ నగరమునకుఁ బాఱిపోయెను. అతనివెంట విఖ్యాతచరిత్రకారుఁడగు ఫెరిస్తా యుండెను. తుదకు దిలావర్ ఖానుని మోసముచే విజాపురమునకు రప్పించి,

యతనికన్నులు దీయించి యిబ్రాహింశాహా యాతనిని చెఱబెట్టించెను. వాఁడచ్చటనే పదిసంవత్సరములుండి మృతినొందెను.

ఈ రాజుకాలమునందు రాజ్యసంపద మిక్కిలి యభివృద్ధి యయ్యెను. ఇతఁడు ప్రజలకు హితమగునట్లు రాజ్యముచేసెను. ఇతనికాలమునందు అక్బర్ బాదుశాహా సైన్యములఁదీసికొని అహమద్ నగరముమీఁదికి దండెత్తివచ్చెను. అప్పుడు ఈరాజు అహమద్ నగరసాహాయ్యమునకుఁ బంపిన సైన్యములను మొగలులు సుపాయను గ్రామమునొద్ద నోడించిరి. ౧౬౦౩లో నీరాజు అక్బరునకు ననేకబహుమతు లంపియుఁ, దనకూఁతును అగ్బర్ కుమారుఁడగు ద్యానియల్ అనువానికి నిచ్చియు నాతనితో సంధిచేసికొనెను. ఇతఁడు ౧౬౨౬ లోఁ గాలధర్మము నొందెను.

విజాపురరాజులలో నితఁడు శ్రేష్ఠుఁడు. ఇతఁడు కలహప్రియుఁడు కానందున లోకప్రియుఁడయ్యెను. ఈరాజు తనదేశమును ప్రజలను బాగుచేయుటకై మిక్కిలి పాటుపడెను. తోడరమల్లుఁ డుత్తరదేశమునందు నేర్పఱిచిన భూవిషయిక నియమములనే యితఁడు దక్షిణమున నేర్పఱిచెను. ఇతఁడు భూములఁ గొల్పించి యేర్పఱిచిన పన్నులవివర మిప్పటివఱకును అచ్చటచ్చటఁ గానవచ్చెడిని. ఇతఁడు మహమ్మదీయుఁడైనను ఇతరమతములయెడ సమబుద్ధి కలిగియుండెను. గొప్పగొప్ప యుద్యోగము లితఁడు మరాటా వారికిచ్చెను. క్రైస్తవుల యుపయోగార్థమై యీతఁడు కట్టించిన క్రైస్తవ మందిరము లిప్పటికిని గానవచ్చుచున్నవి. పరమత సహిష్ణుతలో నితఁ డీతనిసమకాలీనుఁడైన అక్బరుకంటె నొకవన్నె యెక్కుడని చెప్పవలయును.

ఇతఁడు విజాపురములో గొప్పమందిరములను గట్టించెను. ఇతనిచేఁ గట్టింపఁబడిన మసీదొకటి యిప్పటికిని ఆకాలపు శిల్పశాస్త్రముయొక్క నైపుణ్యమును జూపుచున్నది. ఈమసీదు కట్టుటకు ముప్పదియారు సంవత్సరములును, ఏఁబదిరెండులక్షల రూపాయలును పట్టెను. ఈరాజు బొక్కసములో ధన

మెక్కుడుగా నుండెను. ఇతనియొద్ద నెనుబదివేలస్వారు లెప్పుడును యుద్ధము చేయుటకు సిద్ధముగానుండిరి. ఇతని రాజ్యపు పొలిమేర మైసూరు దేశమువఱకు వ్యాపించియుండెను.

మహమ్మద్ ఆదిల్ శాహ (౧౬౨౬-౧౬౫౬)—దక్షిణదేశపు చరిత్రలో నీతనిప్రభుత్వము ముఖ్యమైనది. ఈకాలమున మొగలసైన్యములు దక్షిణమునకు వచ్చి అహమ్మదనగర విజాపురరాజ్యములను జయింపవలయునని ఘోరముగాఁ బోరసాగెను. ఇటు దక్షిణమునందు మహాగాష్ట్రులు ప్రబలి శివాజివంటి రణశూరుఁడు వారిలోఁ బుట్టినందున వారు స్వాతంత్ర్యమునకై యత్నముచేయసాగిరి.

ఈకాలమున షాహజహాన్ ఢిల్లీశ్వరుఁడుగా నుండెను. అతనిసైన్యములు వచ్చి విజాపురమును ముట్టడించెను. కాని మురార్ రావను మరాటాసరదారుఁ డాదిల్ షాహకై ఘోరముగాఁ బోరాడి మొగలులఁ బాఱఁదోలెను. తరువాత ఢిల్లీశ్వరుఁడు మహబత్ ఖానుఁ డనువానిని సైన్యముతో మరల దక్షిణదేశమునకుఁ బంపెను. వాఁడు దౌలతాబాద్ దుర్గమును స్వాధీనము చేసికొని నిజాంశాహిని అంతమందించెను. అప్పుడు ఆదిల్ శాహ నిజాంశాహకు సాహాయ్యముచేసెనని కోపముతో మొగలసైన్యములు విజాపుర రాజ్యము మీఁదికిఁ బోయెను. అప్పుడు మరల నిజాంశాహినినిలుపఁ బెట్ట యత్నించుచున్న షాహాజీభోన్సలేయొక్క సాహాయ్యముఁ దీసికొని విజాపురాధీశుఁడు మొగలుల వెడలఁగొట్టెను. ౧౬౩౫ లో షాహజహాన్ బాదుషా స్వయముగా విజాపురము మీఁదికి దండెత్తివచ్చెను. అప్పుడు షహాజీ రణదుల్లాఖాను లిద్దఱును మొగల సైన్యములను మిక్కిలి బాధలు పెట్టిరి. కాని తుదకు ఆదిల్ శాహ ఢిల్లీశ్వరునితో సంధిచేసికొన వలసినవాఁ డాయెను. అందువలన వానికి మొగలులచే గెలువఁబడిన నిజాంశాహీలోని కొంతభాగము మొగలు లిచ్చిరి. అతఁడు ఢిల్లీశ్వరునకుఁ గప్పము గట్టునట్లు ఒప్పుకొనెను. శహాజీ

నిజాంషాహీ పునరుద్ధారణవిషయమైన యాశనువిడిచి విజాపురము వారియొద్ద సరదారుఁడుగా నుండెను. తరువాత నీతనికుమారుఁడైన శ్రీశివాజీ విజాపురము వారి దుర్గము లనేకములు తీసికొనెను. అందుపై నీరాజు శహాజినిఁ జెఱఁబెట్టి మూఁడుసంవత్సరములవఱకు నుంచెను. కాని తుదకు ఢిల్లీశ్వరునియాజ్ఞ ననుసరించి విడిచిపెట్టెను. ఈకథాభాగమంతయు 'మహారాష్ట్రుల యభ్యుదయము: విజృంభణము' అను మూఁడవభాగములో వివరముగా వర్ణింపఁబడును. ఈశాహ ౧౬౫౬ లోఁ గాలధర్మము నొందెను.

మొగలులతో సంధిచేసికొనిన తరువాత నీరాజు ప్రజాపాలనమునందు మిక్కిలి దక్షుఁడైయుండెను. కొంచెము విలాసపురుషుఁడైనను ప్రజారంజనమందు శ్రద్ధకలిగియుండెను. ఇతరదేశపురాజు లీతనిని మిక్కిలి గౌరవించుచుండిరి. ఈతనిసైన్యములో నెనుబదివేలస్వారులును రెండులక్షల యేఁబదివేలకాల్బలమును, అయిదువందల యేనుఁగులును ఉండెను. ఇతనియాదాయ మిరువది కోట్లరూపాయలు. ఈతనియెదుట నవరత్నఖచితములగు శిరస్త్రాణంబులుగల వేలకొలఁది సరదారులు లీనభావముతో నిలుచుందురు. ఈతఁడు ప్రయాణము చేయునపుడు వెండి బంగారపునగలతో నిండియున్న యేనుఁగు లనేకములు వెంటనడుచును. గ్రామములో నితఁడు తిరుగునపుడు పౌరు లీతనిమీఁద సువర్ణ రజతపుష్పంబులు చల్లుచుండిరి. తేప తేప వెండిబంగారపునాణెములలోఁ దులఁదూఁగుచు నానాణెములన్నియు బీదలకుఁ బంచిపెట్టును.

ఇతఁ డొకమసీదు కట్టించెను. దానిశిఖరమంత పెద్దశిఖరము మఱియొకటి లేదఁట. ఈశిఖర మేశాస్త్రీయపద్ధతి ననుసరించి నిలువఁబడినదో! ఇది పాశ్చాత్య శిల్పపద్ధతి మించినదని యాశాస్త్రములో పండితుఁడగు ఫర్గ్యూసన్ వ్రాసియున్నాఁడు.

ఈ రాజునొద్ద ననేక శతఘ్నులు (ఫిరంగీ: తోఫ్) లుండెను. అందు ముల్క్-ఇ-మైదాన్ (రణరంగపురాజు) అనునది ముఖ్యమైనది. అది ప్రస్తు

తము విజాపురములో నున్నది. ఇప్పుడు దానిని మహాంకాళి యనియెదరు. ఇది మొదట పరిండాయను దుర్గముమీఁద నుండెను. పూర్వ మాకోట అహ మ్మద నగరరాజులకు లోఁబడియున్నప్పుడు ఈ ఫిరంగీ పోఁతపోయింపఁ బడె నఁట. దీనిని నిజాంశాహ తాలికోట యుద్ధమునకుఁ దీసికొని పోయెనఁట. ఇది యష్టధాతువులతోఁ జేయఁబడినది. ఇది ౬౦ పుట్లు బరువున్నదని కొంద ఱును, ౪౦ పుట్లు అనఁగా ౩౯౦౦౦ రత్తల్ బరువున్నదని మఱి కొందఱును వ్రాసియున్నారు. ఇది ౧౪ అడుగులు పొడువుండును; దీని పరిఘము ౧౪ అడుగులున్నది; దీనిమూతియొద్దనున్న తొఱ్ఱయొక్క వ్యాసము రెండడుగుల నాలుగంగుళములు; మంద మొకయంగుళమున్నది.

రెండవ అలీ ఆదిల్ శాహ (౧౬౫౬ - ౧౬౭౨)—ఇతఁడు రాజ్యారూఢుఁడైనపుడు దక్షిణములో ఔరంగ్ జేబ్ సుబేదారుగానుండెను. తన యాజ్ఞ వడయకయే యలీ రాజయ్యె నని ఔరంగ్ జే బీతనితోఁ బోరాడఁ జొచ్చెను. అప్పుడే యీ రాజ్య మస్తమింపవలసినది. కాని యింతలో డిల్లీశ్వరుఁడగు షాహజహాన్ రోగగ్రస్తుఁడయ్యె ననినవార్తవిని ఔ రంగజేబ్ విజాపురమువారితో సంధి చేసికొని వెడలిపోయెను (౧౬౫౭). తరువాత నవరంగజేబు దిల్లీశ్వరుఁడై తన సైన్యములను విజాపురము మీఁదికిఁ బంపెను. ఆసైన్యముల కధికారి జయసింహుఁడు. వాఁ డనేకపర్యాయములు విజాపురపువారిచే నోడింపఁబడి తుదకుఁ బలాయితుఁ డయ్యెను.

శివాజీ యధికముగాఁ బ్రబలినది యీతని ప్రభుత్వకాలమునందే. శివాజిని జయించుటకు నీతఁ డనేక సైనికులఁ బంపఁగా వారినందఱిని శివాజీ యోడించెను. అందు అఫ్ జుల్ ఖానుఁ డొకఁడు.

ఈతఁడు ప్రబల శత్రువులతో నెప్పుడును పోరాడవలసినవాఁ డయినను స్వప్రజాహితైక తత్పరుఁడై యుండెను; కవులను విద్వాంసులను గౌర వించెను. ఈతనియొద్ద ధర్మాజీపండిత్ మొదలయిన మహాశాస్త్రు లనేకులు గొప్ప యుద్యోగములో నుండిరి.

సికందర్ అలీ ఆదిల్ శాహా (౧౬౭౨-౧౬౮౬)—ఇతఁడు రాజ్యమునకు వచ్చినప్పు డయిదేండ్లకుట్టువాఁడు. ఇటు మరాటావారు, అటు ఔరంగజేబ్ అను కత్తెరలోఁ జిక్కి, యాస్థానమునందుఁ దగినమంత్రులు లేనందున నీతఁడు తన రాజ్యమును గోలుపోయెను. ౧౬౮౩ లో అవరంగజేబు స్వయముగా దక్షిణ దండయాత్రకు వెడలి విజాపురము వారితో యుద్ధముచేయుచు విజాపురమును ముట్టడించెను. అప్పుడు రాజు పదునాలుగు సంవత్సరములవాఁడు. తగిన మంత్రులుగాని, సేనాధీశులుగాని లేనందున యుద్ధము చేసినందున లాభము లేదని తలఁచి సికందర్ అలీ ఆదిల్ శాహ ఢిల్లీశ్వరునకు శరణుచొచ్చెను. అంత నౌరంగజే బాతనిని చెఱఁబెట్టించి సంవత్సరమునకు లక్ష రూపాయ లాతనికిఁ గట్టడిచేసి, విజాపుర రాజ్యము నాక్రమించుకొనియెను (౧౫వ అక్టోబరు ౧౬౮౬). తరువాత ౧౭౦౧ లో నౌరంగజేబ్ ఈసికందర్ శాహాను చంపించెను.

ఇట్లు నూటతొంబది యేడేండ్లవఱకు వైభవముతో ప్రభుత్వముచేసిన విజాపురపు ఆదిల్ శాహివంశ మంతరించెను.

ఈ ఆదిల్ శాహరాజులు మొత్తముమీఁద న్యాయదృష్టియు, ప్రజాక్షేమతత్పరతయుఁ గలవారు. హిందూముసల్మానులయెడ భేదభావము లేక సమదృష్టికలవారు. వీరి ప్రభుత్వకాలములోనే పెక్కుమరాటి సరదారుల వంశములు విఖ్యాతి చెంది ఘనతవహించెను. వీరి రాజకీయవ్యవహారము లన్నియు మహ్రాటిభాషలో జరుగుచుండెను. అందుచే దేశభాషయగు మరాటి మిక్కిలి యభివృద్ధి చెందెను. వీరి రాజ్యము ప్రజలకు సౌఖ్యకరముగానుండె ననుటకు సందేహము లేదు.

## ౫. గోలకొండలోని కుతుబ్ శాహి.

## (౧౫౧౨-౧౬౮౭).

### పూర్వపీఠిక.

గోలకొండ దుర్గము ప్రస్తుతము హైద్రాబాదు పట్టణమునకు నాలు

మైళ్లమీఁదనున్నది. అది పూర్వము మట్టికోటగా నుండి యోరుగంటి రాజ్యములోఁ గలిసి యుండెను. ఆరాజ్యమును బహమనీరాజులు ౧౪౨౨ లో స్వాధీనముచేసికొనిరి. అప్పటి నుండియు బహమనీ రాజుల రాజ్యములోని తూర్పుభాగమునకు నది రాజధానియై యుండెను. దానికి 'తెలంగాన్' లేక 'గోలకొండ సుబా' యని పేరుండెను. ఈప్రదేశమునందుఁ బూర్వరాజులచే విస్తీర్ణతటాకంబులును గాలువలును త్రవ్వింపఁబడినందున నాదేశమంతయు సస్యసమృద్ధిచే శోభిల్లుచుండెను. ఈప్రదేశమునకు బహమనీ రాజుమంత్రి యగు మహమద్ గవాన్ అనువానిచే కులీ కుతుబ్ ఉల్ముల్క్ అనువాఁడు సుబేదారుగా నియమింపఁబడెను.

కులీ కుతుబ్ శాహ (౧౫౧౨ - ౧౫౪౩)—ఇతఁడు పారసీకదేశమందలి యొక గొప్పకుటుంబములోని వాఁడు. బహమనీరాజగు మహమద్ శాహ యితనికి నాశ్రయమిచ్చెను. క్రమక్రమముగా నభివృద్ధి చెంది యితఁడు గోలకొండకు సుబేదారుఁ డయ్యెను. ౧౫౧౨లో నితఁడు స్వతంత్రుఁ డయ్యెను. ఇతఁ డధిక పరాక్రమవంతుఁడు. తన శౌర్యముచే కులీ కుతుబ్ శాహ తూర్పు తెలుఁగు నాఁడంతయు నాక్రమించుకొనెను. తనరాజ్యపు సీమను తూర్పు సముద్రమువఱకుఁ గొంపోయెను. బరీద్ శాహ నోడించి మెతుకుదుర్గమును ఆక్రమించెను. సీతాపతిరాజు నోడించి కంబము మెట్టు గ్రామమును తీసికొనెను. ఇది ప్రస్తుతము నైజాము రాజ్యములో నున్నది. దీనికి నిపుడు కమ్మం మెట్టు అని పేరు. ఈకుతుబ్శాహ పానగల్లు, గొయ్యలకొండ మొదలైన దుర్గము లనేకములు సాధించెను. ఈయంశమునే అద్దంకి గంగాధరకవి తన తపతీసంవరణోపాఖ్యాన మనుగ్రంథములో నిట్లు వర్ణించి యున్నాఁడు:—

సీ. పడమటను సవాయి - బసవనిగాఁజేసి,
యచట గొయ్యలకొండ - నానరించె,

శమదిమల్లాఖాను - దక్షిణంబునఁగొట్టి,
హరియించె బానుగ-ల్లాదిగిరుల।
నుత్తరంబున బరీ - దోడి పాఱఁగఁదోలి,
మెతుకుదుర్గం బాక్ర- మించి మించె।
బ్రథమదిక్కున నొడ్డి - పాత్రసామంతుల,
ధట్టించి కంబము - మెట్టఁ గొనియె॥
గీ. నతని బొగడంగఁ దగదె యా - చతురసీతి।
రూఢిగిరి దుర్గలుంఠన - ప్రౌఢతేజు।
వాహశిఖరాధిరోహరే - వంతమూర్తి।
కుతుబశాహినిత్యాపాలు - గుణవిశాలు॥

కృష్ణదేవరాయని మరణము తరువాత సీకుతుబ్‌శాహ కొండపల్లిని సాధించి నట్లు గాన వచ్చుచున్నది. ఇతఁడు ౧౫౩౪లో గొయ్యాలకొండను నాక్ర మించినప్పుడు ముఖముపై గాయముతగిలి కురూపియయ్యెను. మొత్తము మీఁద ఇతఁ డెబువది దుర్గముల సాధించెను; మహావైభవముతో నెబువది సంవత్సర ములవఱకు రాజ్యముచేసెను. అందు ౧౬ సంవత్సరములవఱకు బహమనీరాజుల కును బేదారుగను, మిగిలిన ౪౪ సంవత్సరములు స్వతంత్రరాజుగను పరిపాలిం చెను. ఇతనిని నితని రెండవ కుమారుఁడగు జంషీద్ అనువాఁడు చంపించెను.

జంషీద్ కుతుబ్ శాహ (౧౫౪౩-౧౫౫౦)—ఇతఁడు తన పెద్ద యన్నకనులు తీయించి తాను రాజయ్యెను. ఇతని ప్రభుత్వకాలములో వర్ణనీయ విషయములు విశేషముగాలేవు. ఇతనియొద్ద జగదేవరావను మరాటాసర దారుఁడొకఁడు సర్వాధికారము వహించియుండెను. ఈరాజు ౧౫౫౦లో మరణము నొందఁగా నితని కుమారుని రాజ్యముమీఁదఁ గూర్చుండఁబెట్టిరి కాని జంషీద్ తమ్ముఁడగు ఇబ్రాహీం అనువాఁడు విజయనగరమునుండి వచ్చి రాజ్యము నాక్రమించుకొనెను.

ఇబ్రాహీం కుతుబ్ శాహా (౧౫౫౦ - ౧౫౮౦)—ఇతఁడు కులీ కుతుబ్ శాహాయొక్క నాల్గవకుమారుఁడు. తనయన్నయగు జంషీద్ రాజ్యము చేయుచుండఁగా నతఁడు తన్నుఁ జంపునేమోయని భయపడి యితఁడు విజయ నగరమునకుఁ బాఱిపోయెను. అచ్చట నీతనిని మన్నించి రామరా జితనికి



కొండపల్లి దుర్గము.

జాగీరొసంగి జంషీద్ మరణమువఱకును నితని నచ్చటనే యుంచుకొనెను. అన్న పోయిన తోడనే యన్నకుమారుని నోడించి యితఁడు గోలకొండకు రాజయ్యెను.

ఇతఁడు రాజ్యాసనాసీనుఁడైనప్పు డీతని నభినందించుచు ననేకరాజు లుత్తరములు వ్రాసిరి. అప్పటి రాజులలోఁ బరస్పరమైత్రి కుదిరెను. నిజాంశా

హాకును కుతుబ్ శాహాకును స్నేహమయ్యెను. ఆదిల్ శాహా, కుతుబ్ శాహా, రామ రాజులు స్నేహితులైరి. ఇట్లందఱును స్నేహితులైనందున ఒకానొకఁడు మఱియొకనిమీఁదికిఁ బోఁదలఁచెనేని యితరరాజులందఱును వానికి బుద్ధిచెప్పి మాన్పుచుండిరి. ఇబ్రాహింకుతుబ్ శాహా నిజాంశాహాతో స్నేహముచేసి బేరీద్ శాహిని రూపుమాపఁ దలఁచెను. అందుపై రామరాజీ క్రిందియుత్తర మతనికి వ్రాసెను. 'విజాపురరాజులును అహమద్ నగర్ రాజులును ఎన్నియోదినముల నుండి పోరాడుట మీ రెఱిఁగియేయున్నారు. ఈయుద్ధములో నుభయులును సమానులైనందున నెవరికి నేమియు లాభము కలుగలేదు. పైనివర్ణించిన యుద్ధములో మీతండ్రి యేమియు సంబంధము కలుగఁజేసికొనినవాఁడు కాఁడు. ప్రస్తుతము మీరు నిజాంశాహాతోఁగలిసి విజాపురరాజుతో యుద్ధముచేయఁ దలఁచినట్లు తెలిసినది. ఇబ్రాహిం ఆదిల్ శాహా మాకు మిత్రుఁడు. మీకాతఁ డేమియు నపకారముఁజేయలేదు. మీకును మాకును బహుదినములనుండి స్నేహముకలదు. అందుచేతనే మీకిట్లు వ్రాయుచున్నాను. పరధనాపహారణము చేయుటకై మీరేర్పఱుచుకొనిన కట్టులోనుండి తొలఁగుఁడి. మీరు మీసైన్యమును తిరిగి పిలుపించుకొనుఁడి. అందుచే వారిరువురికిని సంధికలిగి బహుకాలమునుండి జరుగుచున్న యుద్ధమాఁగిపోఁగలదు'.

పదునాఱవశతాబ్దమునందు రాజులొండొరుల కిట్టియుత్తరములు వ్రాసికొనుచుండిరి. ఈయుత్తరమునుజూచి కుతుబ్ శాహా యుద్ధమును మాని రామరాజును కలిసికొని రాజులందఱికిని మైత్రి కుదిర్చెను.

ఇతనిప్రభుత్వకాలములో మహారాష్ట్రులుప్రబలిరి. రాజ్యసంపాదనలో నితనికి జగదేవరావను మరాటాసరదారుఁడు సహాయుఁడుగా నుండెను. అందుచే శాహా యతనికి ముఖ్యమంత్రిత్వమొసఁగెను. రాయరావను మఱియొక సరదారుఁడు ఇతనియొద్దనే ఘనతకెక్కెను. ఇట్లిద్దఱు మరాటాసరదారులు గొప్పయుద్యోగములలో నుండుటవలన ననేకమరాటావారు రాజకీయోద్యోగ

ములలోఁ బ్రవేశించుటకు వీలుకలిగెను. అదిచూచి తురుష్కసరదారులోర్వ లేక శాహాకు మరాటావారిమీఁద చాడీలు చెప్పసాగిరి. అందుపై శాహ శాయరావును చంపించెను. జగదేవరావు తనసైన్యమును వెంటఁదీసికొని గోలకొండనుండి పాఱిపోయి దేశమంతయు దోఁచుకొనుచు నిజాంశాహాయొద్దకుఁ బోయెను. అచ్చటఁగొన్నిదినములుండి జగదేవరావు మరలఁ గుతుబ్‌శాహి రాజ్యములోనికి వచ్చెను. ఆతనివెంట మరాటి, అరబ్బి, ఇరాణి (పారసీక), హబషీ సైన్యములుండెను. కుతుబ్‌శాహ యాతనిమీఁదికి ముస్తఫాఖానునిఁ బంపెను. ఆయుద్ధములో జగదేవునితమ్ముఁడగు వెంకటరావుపడెను. అంతజగదేవరావు విజాపురరాజునొద్దకుఁ బోయెను. ఇబ్రాహీం కుతుబ్‌శాహ హుసేన్ నిజాంశాహాలు కలిసి విజాపురముమీఁదికి దండువెడలిరి. అప్పుడు విజాపురనవాబు రామరాజుయొక్క సాహాయ్యమును గోరెను. అందుపై రామరాజు తనతమ్ముఁడైన వెంకటాద్రిని నాతని తోడునకుఁ బంపెను. వెంకటాద్రి జగదేవరావులు కలిసి కుతుబ్‌శాహ నిజాంశాహాల సైన్యములను జెండాడిరి. తెలుఁగుసీమలోని నాయకుల సాహాయ్యమునుబొంది జగదేవరావు ఆంధ్రదేశములోని రమారమి యన్ని దుర్గములను సాధించెను. అందుచేఁ గుతుబ్‌శాహ భయపడి జగదేవునకు, గణపురా పానగల్లు లనుదుర్గములనిచ్చి యాతనితో సంధిచేసికొనెను. ఈజగదేవరావుచరిత్ర మనకింతవఱకె తెలియును; తరువాతి చరిత్ర తెలియదు. శివాజికాలములో స్వాతంత్ర్యలాభమునకై జరిగిన యత్నమునకు నీజగదేవరావుచరిత్ర పూర్వరంగమని చెప్పవలసియున్నది.

౧౫౬౫లో నీయిబ్రాహీం కుతుబ్‌శాహ యితర తురుష్కరాజులతోఁ గలిసి మిత్రద్రోహియై, సంకటసమయమందుఁ దన్నురక్షించిన రామరాజు మీఁదికి యుద్ధమునకుఁ బోయి, తాలికోటయుద్ధములో నాతనిఁజంపి, తన్ను పోషించిన విజయనగరపట్టణమును ధ్వంసము చేసెను.

౧౫౬౮లో నితఁ డనేకహిందూరాజులన్ను జయించెను. విజాపుర రాజ్యములోని మరాటావా రీతనిరాజ్యమునకు బాధకులగఁజేయఁగా నీతఁడు

వారితోఁ బోరాడి వారిని మరలించెను. విజయనగరరాజులకు సామంతులుగా నుండి యప్పుడారాజ్య మస్తమించుటచే స్వతంత్రులయినరాజులను గెలిచి యీతఁడు తనకు సామంతులను జేసికొనియెను.

ఈప్రభుత్వపుఁ జివరను మురార్ రావను మహారాష్ట్రబ్రాహ్మణుఁడు ముఖ్య మంత్రిగానుండెను. ఈతఁడు సర్వాధికారమునువహించి, దక్షిణదేశములోని హిందువుల దేవాలయముల దోఁచుకొని ధనమంతయు గోలకొండకుఁ జేర్చెను. ఈ వార్తవిని నవాబునకు మిక్కిలిచింతకలిగి దానిచే శరీరమునకు రుగ్మతకలుగఁగా నాతఁడు ౧౫౮౦లోఁ గీర్తిశేషుఁడయ్యెను. అప్పు డితనికి ౫౧ సంవత్సరముల వయస్సు. ఈతనికి ముప్పదిమంది సంతానముగలిగెను. వారిలో నార్గురు పుత్రులును, పదముగ్గురు పుత్రికలు నీతనిమరణకాలమందు బ్రతికియుండిరి.

ఈనవాబు విద్వాంసుఁడు, జయశాలి, ప్రజాహితైకతత్పరుఁడు. ఈతఁడు వెడలిన యేదండయాత్రలోను ఈతనికి నపయశస్సు రాలేదు. యుద్ధమునకుఁ బోవునప్పుడుకూడ విద్వాంసులతో సంభాషించి, ప్రజలకు మేలయినచట్టముల నేర్పఱుచును. రాజ్యవ్యవస్థ యుత్కృష్టముగానుండెను. దొంగతనమే వృత్తిగాఁ గల యెఱుకు, ఏనాది జాతులవారిని శిక్షలోఁబెట్టి బాటసారులకు భయము లేకుండఁజేసెను. ఈతనిరాజ్యములో గ్రుడ్డిముదుసలియైనను బంగారపుముద్ద నెత్తి పైనుంచుకొని నిర్భయముగఁ బ్రయాణము చేయఁగలఁడను ఖ్యాతివహించెను. కొండవీడు, రాజమహేంద్రవరము, కాసింకోండ యితనిరాజ్యములోని ముఖ్య మైన ఠాణాలనిచెప్పిన నీతని రాజ్యవిస్తార మెక్కుడుగా నుండెనని వేఱుగఁ జెప్పవలెనా? ఇతఁడు సుందరములైన మసీదులును, ప్రాసాదములును అనేకములు గట్టించెను; పెక్కుతోఁటలు వేయించెను; విస్తీర్ణతటాకములఁ ద్రవ్వించెను. గోలకొండ దుర్గప్రాకారము, ఇబ్రాహింబాగ్ అనుతోఁట, ఫుల్ బాగ్ (పుష్పోద్యానము), లంగరులు (భిక్షాగృహములు), ఇబ్రాహిం పట్టణతటాకము, హైద్రాబాదులోని హుసేన్ సాగర్ బడవల్ పద్ధియామల్లె

మొదలైన వన్నియు నితని ప్రభుత్వకాలములోనే నిర్మింపఁబడెను. అందుచే నీరాజ్యము రెండవ యీజిప్టని ఖ్యాతివహించెను. అరబ్బస్థాన్, తురుకస్థాన్, ఈరాన్ (పారసీకము) మొదలయిన దేశములనుండి యనేకవర్తకులు వచ్చుచుండిరి. అందుచే దేశములోని వర్తకము విశేషముగా నభివృద్ధియై గోలకొండలో దొరకనివస్తువు లే దనినఖ్యాతివచ్చెను. ప్రజలకష్టసుఖము లీ నవాబెంతశ్రద్ధతోఁ గనుఁగొనెనో యంత శ్రద్ధతో యే తురుష్కరాజును గనుఁగొన లేదని యొకగ్రంథకారుఁడు వ్రాసియున్నాఁడు.

## దేశభాషాభివృద్ధి.

ఈనవాబు విజయనగరములో డాఁగియున్నప్పుడు రామరాజు నాస్థానములోని బట్టుమూర్తిమొదలయినకవుల సహవాసముచే నాంధ్రగీర్వాణభాషల నభ్యసించెను. అందుచే నితఁడు రాజ్యమునకు వచ్చినప్పటినుండియు నాంధ్రకవీశ్వరుల నాదరించి యాభాషను అభివృద్ధి చేయుటకై యత్నించెను. తురుష్కుఁ డయ్యును తెనుఁగు విషయమై యింతయభిమానము గలిగియుండుట వింతగదా! అద్దంకి గంగాధరకవి, పొన్నిగంటి తెలగనార్యులను తెనుఁగు కవులిద్ద ఱితని యాస్థానమునందుండిరి. గంగాధరకవి నియోగిబ్రాహ్మణుఁడు. ఇతఁడు తపతీసంవరణ మనుకావ్యమును రచించి నవాబునకు నంకితముచేసెను. ఆగ్రంథమునందు ఇబ్రాహిం కుతుబ్‌శాహను 'మల్కిభరాం' అని వాడియున్నాడు. ఈకవి కృతిభర్తయైన నవాబును ఇట్లువర్ణించియున్నాఁడు.

సీ. సకలవేదపురాణశాస్త్రపారగులైన
    యొంటరి విద్వాంసు - లొక్కచోట
సప్తభాషలయందు - సాంధ్యంబు లేకుండు
    పరాంతకారి కవీంద్రు - లొక్కవంక
గజపతి నరపతి - స్వాభర్త లంపిన
    యొడికంపురాయబా - ర్లొక్కదండ

మేరుమందరముల - మించఁగల్గిన మన్ని
యులు దండనాథు లొ - క్కొక్క యెడలఁ
గీ. జేరికొల్వ భద్రాసనా - సీనుఁ డగుచు
రమ్యగుణహారి మల్కిభ - రామశౌరి
భారతక్షీర మయసింధు - బంధమధ్య
లలితపుణ్యకథాసుధా - లహరిఁ దేలి.

గంగాధరకవి కృతికర్తగను ఇబ్రాహీం కుతుబ్‌శాహ కృతిభర్తగను గల యీకావ్యము మిగుల రమ్యముగను ప్రౌఢముగను ఉన్నదనియు, వసుచరిత్రతోఁ బోల్చుటకుఁ దగినదనియు విద్వాంసుల యభిప్రాయము.

'యథా రాజా తథా ప్రజా' యను సామెత ననుసరించి యీనవాబుయొక్క యాస్థానమందలి యితర తురుష్కసరదారులును ఆంధ్రకవుల గౌరవించు చుండిరి. నవాబునొద్ద అమీన్‌ఖానుఁడను సైన్యాధీశుఁడు కలడు. ఇతని కాంధ్ర భాషయెడల మిక్కిలి గౌరవముండినట్లు కానవచ్చుచున్నది. ఇతఁడు పొన్ని గంటి తెలగనార్యునిచే రచింపఁబడిన యయాతిచరిత్రమను అచ్చ తెలుఁగు కబ్బ మును కృతినందెను. ఈకవినిగుఱించి యాంధ్రకవుల చరిత్రలో నిట్లు వ్రాయఁ బడియున్నది: 'ఈ తెలగనార్యుఁ డచ్చ తెలుఁగు గ్రంథములు చేసిన వారిలో మొదటివాఁడు. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; భావనార్యుని పుత్రుఁడు. అచ్చ తెలుఁగునందు గ్రంథములు రచించుట మిక్కిలి కష్టము. ఈకవికిఁ బూర్వమునం దెవ్వరును శుద్ధాంధ్ర భాషలో ప్రబంధములు చేయుటకు ప్రయత్నించినవారై నను లేరు. ఇట్టి గ్రంథరచన కితఁడు మొట్ట మొదటివాఁడే యయినను, ఈకవి రచించిన యయాతిచరిత్రము సర్వవిధముల చేతను కూచిమంచి తిమ్మకవి రచించిన యచ్చ తెలుఁగు పుస్తకములకంటె శ్రేష్ఠ తరముగా నున్నదని నాయభిప్రాయము. ఈయనకుఁ బూర్వమునం దుండిన కవులు కొందఱు తమకృతులలో నక్కడక్కడ నొక్కొక్క యచ్చ తెలుఁగు

వద్యమును వేయుచువచ్చిరి. అట్టివానిని జూచియే జను లత్యాశ్చర్య పడు చుండిరి.' శుద్ధాంధ్రకావ్యములలో మొదటిదియగు నీకావ్యమును వ్రాయించి, కవిని గౌరవించి దానికిఁ గృతినాయకుఁడయిన అమీర్ ఖానుండు తెలుఁగు వారికృతజ్ఞతకు నెల్లప్పుడును పాత్రుఁడు గదా! ఈయమీర్ ఖానుని గురిం చియు, నితని కుమారులనుగురించి యయాతిచరిత్రలో వ్రాయఁబడిన యంశము లను జూడఁగా వారాంధ్రకర్ణాట భాషలను చక్కఁగా నెఱింగియుండిరనియు, నప్పటి రాజులును, రాజకీయోద్యోగస్థులును, ప్రజలభాషను శ్రద్ధతో నభ్య సించుటయేగాక యాభాషలయందుఁ బాండిత్యము సంపాదించు చుండిరనియు నందుచే దుబాషు లక్కఱలేకయే ప్రజల కష్టనిష్ఠురములను జక్కఁగఁ దెలిసి కొనుచుండిరనియు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది.

మహమ్మద్ కులీ కుతుబ్ శాహ (౧౫౮౦ - ౧౬౧౧)—ఇతఁడు ఇభరాంయొక్క మూఁడవ కొమారుఁడు. మొదటనే యితఁడు హిందువులతోఁ బోరాడవలసి వచ్చెను. విజయనగరధ్వంసానంతర మచ్చటిరాజవంశజులు పెను గొండను రాజధానిఁజేసికొని రాజ్యము చేయుచుండిరి. వారిని గెలువవలయునని యీతఁడు యత్నించెను. కాని యాకోర్కె సిద్ధించినదికాదు. ఇతని చెల్లెలిని విజాపురనవాబున కిచ్చి యీతఁడు మహావైభవముతో వివాహము చేసెను. అప్పటినుండియు నీరాజులు వైరముమాని మిత్రులయిరి.

గోలకొండ పట్టణము దినదినమును అభివృద్ధిచెందినను జనసంఖ్య మిక్కిలి యెక్కుడగుటచేతను త్రాగుటకుఁ గావలసిన నీటియేర్పాటు తగినట్లు లేనందు నను, జననివాసమునకు నిబ్బంది గలుగఁజొచ్చెను. అందువలన నీనవాబు గోల కొండకు నైరుతికోశములమీఁద మూసీయను నేటియొడ్డున నొకపట్టణము కట్టిం చెను. అదియే ప్రస్తుతపు నైజాంయొక్క రాజధానియైన హైద్రాబాదు పట్టణము. దీనికి మొదట భాగానగర మనిపేరు. నవాబు భార్యలలో నొక్కతకు భాగాయనిపేరు. ఈమె భార్యకాదనియు, భోగకాంత యనియుఁ

గొందఱు వ్రాసియున్నారు. నవాబు తానుకట్టించిన నగరమునకు మొదట నీమెపేరు పెట్టెను. తరువాత నీనవాబు కుమారుఁడైన హైదర్ అనువాని పేరిట నీనగరమునకు హైదరాబాద్ అని పేరువచ్చెను. గోలకొండకుఁ బైని యొకచోట నేటికి నానకట్టగట్టించి యందలినీరు గొట్టములగుండ భాగానగరమునకుఁ దెప్పించి యీనవాబు జనులకుఁగల బాధను తీర్చెను. చక్కని మందిరము లనేకములుఁకట్టించి పట్టణమునకు శోభ తెచ్చెను. ఈతనిచేఁ



గోలకొండ నవాబుల గోరీలు.

గట్టింపఁబడి జుమ్మామసీద్, చార్ మినార్, రాజసౌధములు, పాఠశాలలు, భిక్షాగృహములు మొదలైన వనేకము లిప్పటివఱకు నున్నవి; అనేకులచేఁ బొగడ్తయుఁ గన్నవి.

ఈనవాబునకుఁ దోఁటలయందు మిగుల శ్రద్ధకలదు. ఇతని సరదారులును ఈతనిని అనుసరించిరి. అందుచేఁ బట్టణముచుట్టును పెక్కుతోఁట లేర్పడెను.

ఈనవాబు తనకాలము సత్కృత్యములలోఁ గడపెను. హిందువులతో ననేకపర్యాయములు యుద్ధముచేసెను. కాని యెందును తాను మొదట యుద్ధమునకు దిగలేదు. రాజధానిలోనుండి లోకసుఖాభివృద్ధికి వలయు

కార్యములను జేయుచుండెను. రాజ్యములోని రైతులకు వ్యవసాయమునకు నీరు దొరకుటకు సదుపాయములఁ జేసెను. ఈతని కాలములో ౭౫ లక్షల హోనులు లోకోపకారములకై వెచ్చింపఁబడెను. నవాబు ఏఁటేఁట ౬౦ వేల హోనులు బీదలకుఁ బంచిపెట్టుచుండెను.

ఈతని యాస్థానమునందుఁ బారసీక రాజుయొక్క రాయబారియు పారసీక రాజునొద్ద నీతని రాయబారియు నుండిరి. మీర్ జుమ్లా అనువాఁ డీతనియొద్ద మంత్రిగా నుండెను.

అబ్దుల్లా హుసేన్ కుతుబ్ శాహా(౧౬౧౧-౧౬౭౨)—ఇతఁడు పూర్వపు రాజునకుఁ బుత్రుఁడు. జహాంగీరు పుత్రుఁడయిన షాహాజహాన్ అహమ్మద నగర రాజ్యము నాక్రమించుకొని, విజాపురము వారివలనఁ గప్పము తీసికొన్నపు డీతఁడును డిల్లీశ్వరునకుఁ గప్పము కట్టుటకు నొప్పుకొనెను. కావున షాహాజహానునకును ఈతనికిని స్నేహము దృఢముగా నుండెను.

## మీర్ జుమ్లా.

ఈతనియొద్ద మీర్ జుమ్లా అనువాఁడు దివానుగా నుండెను. హిందూదేశములో రాజ్యకార్యధురంధరు (Statesmen) లని విఖ్యాతిఁ జెందినవారిలో నితఁ డొక్కఁడు. ఇతఁడు పారసీక దేశములో నొక నూనెవాని కుమారుఁడు. ఒక వర్తకునివెంట నితఁడు హిందూదేశమునకు వచ్చి డిల్లీశ్వరుని సైన్యములోఁ జేరెను. అచ్చటఁ గ్రమముగా గొప్పవాఁడయ్యెను. కాని రాజపుత్రుఁడగు దారాతో నతనికి వైరము వచ్చినందున నాతఁడు డిల్లీ విడిచి గోలకొండకుఁ బోయెను. అచ్చట నొకయుద్యోగములోఁ బ్రవేశించియు, వర్తకము చేసియు నెక్కుడు ధనమును సంపాదించెను. నవాబునకు నానావిధములయిన కట్నములు కానుకలు పంపి, యాతనిని బ్రసన్నునిఁ జేసి యాతని ముఖ్యమంత్రిత్వమును సంపాదించెను. గోలకొండ రాజ్యములోని పరిటేల మొదలయిన వజ్రముల గనులవలన నపారసంపత్తి సంపాదించి తన యొద్ద సైన్యములను

అభివృద్ధి చేసి తన యజమానుఁడే తనకు భయపడునట్లు చేసెను. అందుచే నవాబాతనిని గర్ణాటక దేశమునకుఁ బంపెను. అచ్చట నాతఁడు వజ్రపు గనులలోని వెలగలరత్నము లన్నియుఁ దానుతీసికొని పనికిమాలినరాళ్లు నవాబునొద్దకుఁ బంపుచుండెను. పోర్చుగీసువారికి రత్నములిచ్చి వారిసాహాయ్యముఁ దీసికొని తనయొద్దనున్న ఫిరంగులపై పోర్చుగీసువారిని అధికారులుగా నేర్పఱిచెను. హిందువుల దేవాలయములు ధ్వంసముచేసి యపారసంపత్తినిసంపాదించెను. ౧౬౫౨లో ట్యావర్ణీర్ అను పాశ్చాత్యబాటసారి యీతనిని పెన్నేరు యొక్క యొడ్డున గండికోటలోఁ జూచెను. 'అప్పటికి నాతఁడు గండికోటను సాధించి కొన్నిదినములే యయ్యెను. అచ్చటి వెండి బంగారపుప్రతిమ లాతఁడు కరఁగించెను. పదియడుగుల యెత్తుగల యా టి త్తడిప్రతిమలను గరఁగించి ఫిరంగిచేయించుటకు నాతఁడు యత్నించెను. కాని యవి కరఁగినవికావు. బ్రాహ్మణులు ప్రతిమలకు మంత్రములచేఁ బ్రాణప్రతిష్ఠ చేయుదురుగాన నవి కరఁగవని తలఁచి యట్టిమంత్రప్రభావము లేకుండఁ జేయుఁడనియు లేనియెడల మిమ్ముఁ జంపించెదననియు నాతఁ డనేక బ్రాహ్మణులను భయపెట్టెను. అయినను ఆప్రతిమలు కరగలేదు.' ఈ మీర్‌జుమ్లా కర్ణాటములో నిరంకుశప్రభుత్వముచేసి ప్రజలకు మిగుల బాధ కలుగఁజేసెను. ఈసమాచారము తెలిసి కుతుబ్‌శాహాకుఁ గోపమువచ్చి యాతఁడు మీర్‌జుమ్లాను బిలిపించి శిక్షింపనెంచెను. కాని శాహాయొక్క తల్లికిని మీర్ జుమ్లాకును సంబంధ మున్నందువలన నామె యీసమాచారము మీర్‌జుమ్లాకుఁ దెలిపెను. ఇదియుగాక మీర్‌జుమ్లాయొక్క కుమారుఁడు కొన్ని చేయరానిపనులు చేసినందున వానిని నవాబు చెఱఁబెట్టించి వానిసొత్తంతయుఁ దీసికొనెను. అందుమీఁద మీర్‌జుమ్లా ఔరంగజేబున కిట్లొకయుత్తరము వ్రాసెను:— 'హిందూదేశములోని యత్యంతధనసంపన్నమైన రాజ్యమును మీరు స్వాధీనపఱుచుకొను సమయము వచ్చినది. నేను మొదటినుండియు మొగలుల సేవకుఁడను. వారికి మేలు చేయ

మఱియునిదే గోలకొండకు వచ్చితిని. గోలకొండనవాబు తల్లి మనకు ననుకూలముగానున్నది. కర్ణాటక సైన్యమంతయు నాచేతిలోనున్నది. గోలకొండ సైన్య మంతయు నాకుమారుఁడగు మహమ్మద్ అమీర్ ఖానుని స్వాధీనము. ఇట్టిస్థితిలో మీరు గోలకొండ మీఁదికి నెత్తివచ్చినయెడల రాజ్యము మీకు నవలీలగా స్వాధీనమగును.'

ఈ యుత్తరము చూచినతోడనే యౌరంగజేబునకు నమితానందము గలిగెను. షియాపంథము నవలంబించిన కుతుబ్ శాహాను గెలుచు సంధి దొరకినది గదాయని యాతఁడు సంతసించెను. అప్పు డౌరంగజేబు తన తండ్రియగు షాహజహాన్ చక్రవర్తికిఁ బ్రతినిధిగా దక్షిణములో దౌలతాబాద్ పట్టణములో నుండెను. ఏదోపనిమీఁద వచ్చినట్లు భాగానగరమునకుఁబోయి కుతుబ్ శాహాను మోసముచేసి పట్టుకొనవలయునని నిశ్చయించుకొని యౌరంగజేబు భాగానగరమునకు (హైద్రాబాదుకు) వెడలెను. త్రోవలోఁ దాను బంగాళా దేశమునకుఁ బోవుచున్నానని చెప్పుచుండెను. కాని యొకవిశ్వాసపాత్రుఁడగు సేవకుని వలన ఈ సమాచారము తెలిసికొని కుతుబ్ శాహ భాగానగరము నుండి పాఱిపోయి గోలకొండకోటలోఁ బ్రవేశించెను. ఔరంగజేబు కోటను ముట్టడించెను. మీర్ జుమ్లావచ్చి యాతనిఁ గలిసెను. ఇట్లుండగా ఢిల్లీలో షాహజహాన్ వద్ద నాతని పెద్దకొమారుఁ డగు దారా. మంత్రిత్వము చేయుచుండెను. వానికి నౌరంగజేబు గోలకొండను ముట్టడించిన సమాచారము తెలిసెను. గోలకొండ రాజ్యమును ఔరంగజేబు జయించినయెడల నతఁడు బలవంతుఁడై తన మీఁదఁ దిరుగఁబడు నని తలఁచి దారాయను నాతఁడు తన తండ్రియగు ఢిల్లీశ్వరునిచే నౌరంగజేబునకుఁ దక్షణమే గోలకొండ ముట్టడిలేపి తిరిగి రావలసినదిగా నుత్తరము వ్రాయించెను. అందుపైఁ జేయునదిలేక ఔరంగజేబు ఈక్రింది పద్ధతులు కుతుబ్ శాహాచే నొప్పించుకొని రాజ్యమును నాక్రమింపకయే వెడలిపోయెను: (౧) యుద్ధవ్యయము కుతుబ్ శాహా యీయ

వలయును. (౨) కుతుబ్ శాహా తన కూఁతును ఔరంగజేబు కొమారుఁ డయిన మహమ్మదను వానికిచ్చి, రామగడమను పరగణా యామెకు వరణ మీయవలయును. కుతుబ్ శాహా మరణానంతర మా రాజ్యము మహమ్మదునకు రావలెను. (౩) కుతుబ్ శాహా రాజ్యములోని నాణెములమీఁద డిల్లీశ్వరునిపేరు వేయవలయును. (౪) జుమ్లాఅనువాని సొత్తంతయు వానికిచ్చివేసి వాని కిష్టము వచ్చినచోటికిఁ బోనీయవలయును.

అప్పటినుండియు గోలకొండనవాబు డిల్లీశ్వరునకు సామంతుఁడై సంవత్సరమునకుఁ గోటిరూపాయలు కప్పముకట్టుచుండెను. మీర్ జుమ్లా ఔరంగజేబువద్దఁ జేరి యాతనికి డిల్లీరాజ్యము సంపాదించిపెట్టెను. ఈ అబ్దుల్లా కుతుబ్ శాహా ౧౬౭౨ లో నన఼గా ఔరంగజేబునకు రాజ్యము వచ్చిన సంవత్సరమునసే మరణము నొందెను.

తానీషా లేక అబూహసన్ ఖుతుబ్ శాహా (౧౬౭౨-౧౬౮౭)—ఇతఁడు పూర్వపు సుల్తానునకు మేనల్లుఁడు. ఆతనికూఁతునుగూడ వివాహమాడెను. ఇతఁడు సోమరియు విలాసవంతుఁడును అయినను ప్రజలను బిడ్డలవలెఁ గాపాడినవాఁడు కావున నీతనిని జనులు 'తాన్ శాహ' అన్నగా మంచిరాజని పిలువసాగిరి. ఆమాటయే 'తానీషా' శబ్దముగాఁ దెనుఁగున మారెను. తానీషా నిప్పటికిని తెలుఁగుదేశమువారు భక్తిపూర్వకముగాఁ దలఁచెదరు. ఈనవాబు కనఁబఱిచిన ప్రజాక్షేమతత్పరతయు, హిందూమహమ్మదీయమతముల యెడఁజూపిన సమానగౌరవమును, హిందువుఁడును బ్రాహ్మణుఁడును అగు మాదన్నపంతులవారికి ముఖ్యమంత్రిత్వమును, అక్కన్నగారికి సైన్యాధిపత్యమును ఇచ్చుటయుఁ జూచి జను లీతనియందుఁ బూజ్యభావముకలవారై యితఁడు పూర్వజన్మమందుఁ దపశ్శాలియగు బ్రాహ్మణుఁడనియు, తపోభంగముచేఁ దురుష్కుడై పుట్టె ననియు నొక కథ కల్పించియున్నారు. ఇది యొక

కల్పితకథలైనను ఇందువలన నాకాలమందు నీనవాబు తనసద్గుణములచేఁ బ్రజల కెంత ప్రియుఁడయ్యెనో స్పష్టముగాఁగలదు.

## అక్కన్న మాదన్న గార్లు.

ఈ యన్నదమ్ముల పేళ్లు మన తెలుఁగువారు రెండువందల సంవత్సరముల నుండి గౌరవపూర్వకముగా స్మరించుచున్నారు. అశ్వినీకుమారులవలె వీరిద్దఱి నామములు కలిపి యుచ్చరింపఁబడునే కాని విడివిడిగా నుచ్చరింపఁబడవు. ఈ పేళ్లు మనకు నిదివఱకుఁ దెలిసినను వీరినిగుఱించి మనకేమియుఁ దెలియదు. ప్రస్తుతము కొన్ని పురాతన గ్రంథములును, కాగితములును వెతకిచూడఁగాఁ గొన్ని సంగతులు దెలిసినవి. వీరియింటి పేరు పింగళివారు. ఈపింగళివారిది భారద్వాజ గోత్రము. కావున వీరికిని గౌతమగోత్రుఁడగు పింగళి సూరన్న యొక్క వంశమునకును నేమియు సంబంధములేదు. అక్కన్న మాదన్న గారి వంశజుల మని చెప్పుకొనుపింగళివా రిప్పుడు నైజామురాజ్యములోని యోరుగంటిలోనున్నారు. వీరిద్దఱును మహారాష్ట్రులనియు అక్కన్నగారికి 'ఏకనాథ్ పంత్' అనియు, మాదన్న పంతులుగారికి 'మదనపంత్' అనియుఁ బేళ్లుండె నని కొందఱు మహారాష్ట్ర లిటీవలివారు వ్రాసియున్నారు. కాని అందుకు వారేమియు నాధారము చూపినవారుకారు. నేను చూచినంతవఱకును పూర్వ మహారాష్ట్ర తురుష్కాంగ్ల గ్రంథాదులలో 'అక్కన్న' 'మాదన్న' నామములే వాడఁబడి యున్నవి. ఇదియుఁగాక ప్రస్తుతము మాదన్నగారి వంశజులమని చెప్పెడువారు తెలుఁగువారు కావున వీరు తెనుఁగువారనియే మనము నిశ్చయింపవచ్చును.

అక్కన్నగారన్నయనియు, మాదన్నగారు తమ్ముఁడనియు సామాన్యముగా జను లనుకొనుచున్నారు. కాని యక్కన్నగారు నిజమైన యన్న కాఁడని యొక ఐతిహ్యముకలదు. అక్కన్నగా రొకబీదవాఁడగు బ్రాహ్మణుఁడఁట. మాదన్నగారు మంత్రిత్వము చేయుచుండఁగా అక్కన్నగా రాతని

యింటికివచ్చి ప్రవేశించెనఁట. తనభార్య బంధువుఁడని తలఁచి మాదన్న గారును, భర్తబంధువుఁ డనితలఁచి యాతని భార్యయు అక్కన్నగారిని మిక్కిలిమర్యాద చేయుచుండిరి. అక్కన్నగారు వయస్సులోఁ బెద్దవాఁ డగుటచే మాదన్నగారాతనిని అన్నగారని పిలుచుచుండిరి. లోకులును అట్లే తలఁచుచుండిరి. ఇట్లు కొన్నిదినములు గడచిన తరువాత నొకనాఁడు మాదన్నగారు భార్యతో అక్కన్నగారిని గుఱించి ముచ్చటింపఁగా నాతఁ డామెకు బంధువుఁడు కాఁడని తెలిపెను. అందుపై నతఁ డక్కన్నగారిని మనకుఁగల బంధుత్వము తెలుపుమనఁగా 'నాయనా వినుము. నేను పెద్దమ్మకొమారుఁడను; నీవు చిన్నమ్మకొమారుఁడవు. ఇట్లు మనమక్కచెల్లెండ్ర బిడ్డలముగాన నన్నదమ్ములము సుమా. ఈరహస్యము నీమనస్సులో నుంచుకొనుము. మనమెప్పటియట్ల యన్నదమ్ములవలెఁ బ్రవర్తించెదము' అని యనెనఁట! అక్కన్నగారి బుద్ధిచాతుర్యమునకు మెచ్చి మాదన్నగా రాతనిని అటుతరువాత అన్నగానె చూచుచుండిరఁట. ఈకథయొక్క సత్యాసత్యత్వములు నిర్ణయించుటకు వీలులేక పోయినను, వినుటకు నిది యింపుగానున్నది.

గ్రంథాదులను బట్టిచూడఁగా మాదన్న పంతులుగారే తానీషాయొద్ద ముఖ్యమంత్రిగా నున్నట్టు స్పష్టపడఁగలదు. మొదట అక్కన్నగారి కేవి[illegible]ని యుండెనోకాని ౧౬౮౫లో మహమ్మద్ ఇబ్రాహీం అనువానిని దొలఁగించి 'షాహలష్కర్' అధికారమనఁగా సైన్యాధిపత్యము అక్కన్నగారి కీయఁబడెనని ఫోర్ట్ సెంట్ జార్జికోటలోని యొకదస్తావేజువలన స్పష్టమగుచున్నది.[1] అంతకుఁ బూర్వపు ఇంగ్లీషుదస్తావేజులలో అక్కన్న మాదన్నలను రెండుపేళ్లును జంటగా నుండుటవలన ౧౬౮౫కుఁ బూర్వమునందుఁగూడ అక్కన్న

1. *Vide* Press List of Ancient Records in Fort St. George, dated 17th May 1882; Reference Letters to Fort St. George, Vol. II, *pp* 105-109.

గారు పెద్ద యధికారిగా నుండిరని మనమూహింపవచ్చును. అట్లు లేనియెడల నింగ్లీషువా రీతనికి బహుమతులు పంపుటయెట్లు సంభవించును? రాజ్యాంగ సంబంధమైన యన్ని విషయములలోను అక్కన్న మాదన్న లిద్దఱును గలిసి పనిచేయుచున్నట్లు కానవచ్చుచున్నది.

తానీషాకు నీ మంత్రిపుంగవుల మీఁదఁ బూర్తిగ నమ్మికయుండెను. వారును స్వామిభక్తియుఁ బ్రజానురక్తియుఁ గలవారై ప్రజలకందఱికి సౌఖ్యము గలుగునట్లు రాజ్యమును పాలించిరి. హిందువులగుటచే హిందువులయందు నెక్కుడభిమానము గలవారలై యన్నివిషయములందును హిందువులను మహమ్మదీయులతో సమానముగాఁ జూడసాగిరి. ఉన్నతోద్యోగములన్నియుఁ దురకలకే యీయక యనేక హిందువులకుఁగూడ నిచ్చిరి. పూర్వమువలెఁ దురుష్కులు హిందువులను బాధపెట్టకుండునట్లు గాపాడిరి. అదివఱకు రాజుయొక్కజాతివారమని విఱ్ఱవీగి, తామే శ్రేష్ఠులమని చెప్పుకొనుచు, స్వదేశవాసులగు హిందువులను దిరస్కరించుచున్న తురుష్కులు మాదన్నగారు స్థాపించుచున్న హిందూ ముసల్మానుల సామ్యముఁజూచి యోర్వలేకపోయిరి. అందుచే వారికి ననేకశత్రువు లుద్భవించిరి.

కుతుబ్‌శాహి రాజ్యమును గుత్తుకలో నెప్పుడు వేసికొందునాయని మొగల రాజులు చూచుచుండిరి. అట్లుగాకుండ యజమానుని రాజ్యమును గాపాడవలయుననియు, హిందువుల గౌరవ మధికముచేయుటకై హిందువులయొక్క యభివృద్ధి చేయవలయుననియు మాదన్నపంతులు శ్రీశివాజీకిని తానీషాకును స్నేహము కుదిర్చెను. మాదన్నపంతులుగా రాహ్వానము చేసినందున ౧౬౭౬ లో శివాజీ కర్ణాటక దండయాత్రకు బయలుదేఱినపుడు గోలకొండకుఁ బోయి, తానీషాను జూచి స్నేహము దృఢపఱచుకొనెను. అప్పుడు మాదన్నగారు శివాజీకిని, శివాజీ మాదన్నగారికిని విందులుచేసిరి. ఆమంత్రిపుంగవులు శివాజీ యొక్క స్వదేశప్రీతియుఁ గొనియాడిరఁట. శివాజీ పోయినతరువాత నాతని

కుమారుఁడగు సంభాజికిని తానీషాకును మైత్రిచేసి, వారిద్దఱుఁ గలిసి ఔరంగ జేబుతో యుద్ధము చేయునట్లు మాదన్నగా రేర్పాటు చేసిరి.

మాదన్నగారు ధర్మమునందు మిక్కిలి శ్రద్ధగలవారుగను, విద్వాంసుల నాదరించువారుగను నుండిరి. నిత్యము ప్రాతఃకాలమందు స్నానముచేసి జాము ప్రొద్దెక్కువఱకును శివపూజచేయుచుండిరి. అట్టిసమయమున విద్వాంసులందఱునువచ్చి తమతమవిద్యానైపుణ్యమును జూపి బహుమతులందుచున్నట్లు శివదిగ్విజయ మనుమహోత్తమగ్రంథమునందు వర్ణింపఁబడినది.



పూర్వకాలపు మచిలీబందరు.

తానీషాకుతుబ్‌షా మరాటావారితో సంధిచేసికొనుట విని యౌరంగజేబు తనసైన్యములను గోలకొండమీఁదికిఁ బంపెను. కాని యక్కన్నమాదన్నగార్లు సైన్యములను అనేకపర్యాయము లోడించి పాఱఁదోలిరి. అందుచే నీమంత్రిపుంగవులున్నంతవఱకును డిల్లీశ్వరునివలనఁ గుతుబ్‌శాహ కేమియు నష్టము కలుగలేదు.

ఇట్లు గోలకొండలో సర్వాధికారముతో ప్రభుత్వముచేయుచున్న యీ మంత్రిపుంగవుల యనుగ్రహము వడయవలయునని మన దేశమువారు గాక

ఫ్రెంచి యింగ్లీషువారుఁగూడ విశ్వప్రయత్నములు చేయుచుండిరి. అప్పుడు ఈస్టుఇండియాకంపెనివారు చిన్నవర్తకులు. చెన్నపట్టణము ఒకచిన్నగ్రామము. ప్రస్తుతము జార్జిటౌన్ అనఁబడు స్థలముమాత్రము కంపెనివారి స్వాధీనములో నుండెను. మచిలీపట్టణములో వీరికి నొకగిడ్డంగి (Factory) యుండెను ఈస్థలము లన్నియు గోలకొండవారి రాజ్యము లోనివి. కావున నీభూములకై కంపెనివారు గోలకొండనవాబునకు శిస్తుచెల్లించుచుండిరి. ఇంతియకాక గోలకొండరాజ్యములో నిరాటంకముగా వర్తకము చేసికొనుటకు నవాబు నాజ్ఞ కావలసియుండెను. కంపెనివారికి నౌరంగజేబుతో వైరముండెను. కావున గోలకొండలో సర్వాధికారులయిన అక్కన్న మాదన్నగారి యనుగ్రహము సంపాదించుటకుఁ జెన్నపట్టణములోని యింగ్లీషువాండ్రు విశ్వప్రయత్నములు చేయుచుండిరి. ౧౬౭౮లో తానీషాయు మాదన్నగారును మచిలీపట్టణమునకుఁ బోఁగా నచ్చటి యింగ్లీషువారు వారిని మిగుల గౌరవించి వారియనుగ్రహము వడయుటకై వారికి ననేక బహుమతులొసంగిరి. ౧౬౭౯-వ సంవత్సరపు ఫిబ్రవరినెలలో చెన్నపట్టణపు ఇంగ్లీషువారు తమకు స్యాంథోం (మైలాపూరు), ఎగ్మూరు అను స్థలములం గౌలున కిప్పించునట్లు కోరిరి. ౧౬౮౦ లో పోడేల లింగప్పయనువాఁడు చెన్నపట్టణమునకు సరకులురాకుండ నడ్డగించినందున వాఁడటుచేయకుండ మాన్పవలసినదనియుఁ దమవర్తకమునకు భంగము లేకుండఁ జేయవలసినదనియుఁ గంపెనీవారు అక్కన్నమాదన్న పంతులవారినిఁ గోరిరి. అంత వారు దయామయులై కంపెనీవారిని బాధపెట్టవలదని లింగప్పకు వ్రాసి, యాతనినే తమప్రతినిధిగా నేర్పఱిచి అన్నివిషయములను గుఱించియు నింగ్లీషువారితో నుత్తరప్రత్యుత్తరములు జరుపుచుండుమని యాజ్ఞాపించిరి. ఈ లింగప్పనే ౧౬౮౨ లో మాదన్నగారు కృష్ణానదికి దక్షిణమునందున్న గోలకొండరాజ్యమున కంతకును సుబేదార్ (Governor) గా నియమించిరి. కావున నీలింగప్ప యప్పటిగొప్పసరదారులలో నొక్కఁడని చెప్పవలయును.

౧౬౮౪ సం॥ జూలై నెలలో మెద్రాసుగవర్నరునకు పోడేల లింగప్ప యొక యుత్తరము వ్రాసెను. అందు సంవత్సరపుపన్ను ౧౨౦౦ వరహాలీయవలసిన దనియు, అక్కన్నగారి యోడలవిషయమై కొంతసాహాయ్యము చేయవలసిన దనియు వ్రాసెను. అందువలన అక్కన్నగారికి నోడలున్నవనియు, నాతఁడు సముద్ర వర్తకముచేయుచుండెననియు మన మూహింపవచ్చును. అదివఱకు కంపెనీవారికి నీయఁబడిన ఫర్మాను ప్రకారము విశాఖపట్టణము మొదలయిన స్థలములలో కంపెనీవారికి వర్తకవిషయమైన వీల్లు కలుగఁజేయమని కంపెనివారక్కన్న మాదన్నగారిని ౧౬౮౪ సెప్టెంబరులోఁగోరిరి. వారికనేక బహుమతులను బంపిరి. అక్కన్నగారికిని, దుబాష్ వెంకటాద్రికిని ౨౫-వ సెప్టెంబరు దినమున బహుమతులనంపిరి. ఈ సంవత్సరపు అక్టోబరునెలలో అక్కన్నగారు మచిలీబందరు మొదలయిన స్థలములకుఁ బోఁగా నచ్చటి కంపెనివారాతనిని మిగుల గౌరవించిరి. పోడేల లింగప్ప కంపెనీవారిపై చాడీలు చెప్పినందున అక్కన్నగారికి వారిపై కోపమువచ్చెను. ౧౬౮౪ నవంబరులో మాదన్నగారి కుమారుఁడు మల్లప్పకు వివాహమయ్యెను. అప్పుడు మాదన్నగారికి వీసెఁడు బంగారపుగోలుసులు కావలసివచ్చెను. అందుకు వెలయిచ్చెదనని యాతఁడు తెల్పినను వలదనిచెప్పి చెన్నపట్టణపు ఇంగ్లీషువారాబంగారపుగొలుసు, కానుకగాఁబంపిరి.* ౧౬౮౫-వ సంవత్సరమునందు ౧-వ జనేవరిదినమున సంవత్సరాది కానుకఁ గంపెనీవారు ౮౦౦-వరహాలు మాదన్నగారికిఁ బంపిరి. వారి యనుగ్రహము పడయుట కివి పంపఁబడెనని వ్రాయఁబడియున్నది. † ఇంగ్లీషువారిని ననుగ్రహించుటకును, పరదేశమునుండి వచ్చిన యితరాగంతుకుల (Interlopers) ను గోలకొండ రాజ్యములోనుండి వెడలఁగొట్టుటకును అక్కన్నగారికి పెన్నిరోజా పుట్లరాగియు, ధనమును

* Pub. Cons. Vol. VII pp. 126, 127 as shown in the Press List. † Pub. Cons. Vol. VIII pp. 1-3 (PressList).

ఇచ్ఛేదమని చెన్నపురములోని యింగ్లీషువారు ౧౬౮౩ లో ౧౪-వ ఆగష్టు దినమునఁ దెలియఁజేసిరి. ఇట్లొక్కటా? రెండాకిమాదన్న గారి కుమారుని యుపనయనమునకు, పెండ్లికి, మాదన్న గారి పేష్కారుకు (Secretary) అయినబిడ్డకు, పినతండ్రికి బహుమతులు పంపి వారి యనుగ్రహమును సంపాదించుటకై యీస్టు ఇండియాకంపెనివారు ప్రయత్నించుచుండిరి.

ఈ మంత్రిపుంగవు లప్పుడప్పుడు బెజవాడలో వాసముచేయుచు బీదలకు దానధర్మములు చేయుచుండిరఁట. ప్రస్తుతము బెజవాడ కనకదుర్గయున్న గట్టుమీఁద అక్కన్న మాదన్న గారి సత్రములని యొకానొకస్థలము చూపెదరు. అచ్చట నీయమాత్యశ్రేష్ఠులు బీదవారికి నన్నము పెట్టించు చుండిరఁట. అచ్చటనుండి గోలకొండవఱకు నొకబిలముకలదనియు, అందులో నుండి యక్కన్న మాదన్న గారు గోలకొండకుఁ బోవుచుండిరనియు నొక పిట్టకత చెప్పెదరు. తానీషా కొండపల్లి దుర్గముమీఁదను, అతని మంత్రులగు వీరు బెజవాడలోను అప్పుడప్పుడువచ్చి కొన్నిదినములవఱకు వాసముచేయుచుండిరి.

## రామదాసు.

ఈ సందర్భములో మనము భద్రాచల రామదాసును మఱవఁగూడదు. ఈ భక్తాగ్రేసరుఁడు అక్కన్న మాదన్నగారికి మేనల్లుఁడఁట. ఈతఁడు పుట్టిన స్థలము నేలకొండపల్లి. ఇది నైజాంరాజ్యములోఁ గమ్మము మెట్టునకుఁ బదిమైళ్లమీఁద నున్నది. ఈతనిపేరు గోపన్న. రామభక్తిచే రామదాసను బిరుదువచ్చెను. ఇతఁడు భద్రాచలముతాలూకాకు తహసీలు దారుఁడుగా నుండి గోలకొండ బొక్కసమునకుఁ బంపవలసిన పైకమంతయుఁ బెట్టి శ్రీరామునకు గుడి కట్టించెను. ఇట్లు సర్కారుపైక మపహరించినందులకు నాతనిని పండ్రెండు సంవత్సరములవఱకు గోలకొండలోని చెఱసాలలోఁ బెట్టిరి. రామదాసును ఉంచిన చెఱసాల యిదియేయని గోలకొండ దుర్గములో నొక స్థలము చూపెదరు. ఇతఁ డీయవలసిన పైకమంతయు నితఁడు

చెఱలో నుండఁగా శ్రీరామలక్ష్మణులు తెచ్చి తానీషాకిచ్చిరనియు నంత నీతనికి బంధవిముక్తి కలిగెననియు భావికజనులు చెప్పుకొనియెదరు. అటు తరువాత నితఁడు భద్రాచలములోనే వాసముండి బొందితో వైకుంఠమున కేగెనఁట!

## గోలకొండరాజ్య వినాశము.

పైని వర్ణింపఁబడినట్లు గోలకొండ నవాబగు అబూహాసన్ కుతుబ్ శాహ హిందూ ముసల్మానులని భేదముచేయక యందఱిని సమానముగాఁజూచుచు హిందువులును బ్రాహ్మణులును అగు అక్కన్న మాదన్న గారికి మంత్రిత్వమిచ్చి రాజ్యముచేయుచుండఁగా నారాజ్యములోని తురుష్కులకు నట్టి రామ రాజ్యము విషతుల్యమయ్యెను. అదివఱకుఁదామే సర్వాధికారముచేయుచు హిందువులను ద్రొక్కివేయుట వారికి నలవాటయినందున అక్కన్న మాదన్న గారి యభ్యుదయముఁజూచి వారోర్వలేక పోయిరి. అట్టి మహమ్మదీయులలో మహమ్మద్ ఇబ్రాహీం అనువాఁడు ముఖ్యుఁడు. ఇతఁడు మొదట సాహ లష్కరు (సేనాధిపతి) గా నుండెను. ౧౬౮౨ లో ఇతనిని ఈపనిలోనుండి తొలఁగించి సర్ ఖేల్ పని యీతనికి నొసంగిరి. సాహలష్కరుపని అక్కన్న గారి కీయఁబడెను.

అప్పటినుండియు అక్కన్నమాదన్నగారిని ఎట్లయిన నాశమందింపవలయు నని యీతఁడు నిశ్చయించెను. మాదన్నగారి మడికొలనులో నొక తురక వాఁడు స్నానము చేయఁగా వానిని మాదన్నగారు శిక్షించిరఁట. తురుష్క రాజ్యములోఁ దురుష్కుల కిట్టిశిక్షలు విధించుటయన్యాయమని మొఱ్ఱలిడుచు నాతురుష్కుఁడు ఢిల్లీశ్వరునియొద్దకుఁ బోయెనఁట. ఏదోసాకు చూచి గోల కొండ రాజ్యమును మ్రింగుట కెదురుచూచుచున్న ఔరంగజేబు, బ్రాహ్మ ణులను మంత్రులుగాఁ బెట్టుకొనుటయు, మహమ్మదీయునికిఁ దగనట్లు ప్రవర్తిం చుటయు నను రెండపరాధములు తానీషా చేసెనని చాటించి, వానిమీఁదికి

౧౬౮౫లోఁ దనకుమారుఁడయిన ముఅజ్జం అనువానిని, ఖాన్‌జహాన్ అను సైన్యాధిపునిఁ బంపెను. వారిద్దఱి నెదిరింపం గోలకొండనుండి మహమ్మద్ ఇబ్రాహీం పంపఁబడెను. కాని వాఁడు అక్కన్న మాదన్నగారి మీఁద నున్న ద్వేషమువలన స్వామిద్రోహియై శత్రువులలోఁ గలిసెను. ఆసైన్యము లన్నియు హైద్రాబాద్ పట్టణమును సమీపించెను. ఈవార్తవిని తానీషా భయపడి గోలకొండ దుర్గములోనికిఁ బాఱిపోయి దుర్గద్వారములను వేయించెను. మొగలుసైన్యములు హైద్రాబాద్ పట్టణమును ఇష్టమువచ్చినట్లు దోఁచు కొనెను. అప్పు డాపట్టణములోనుండి మొగలులు తీసికొనినధనము నాలు గైదుకోట్ల రూపాయలకుఁ దక్కువ యుండదని యొకతురుష్కచరిత్రకారుఁడే వ్రాసియున్నాఁడు. ఎంతమంది పురుషులును, స్త్రీలును చెఱపట్టఁబడిరో లెక్కలేదు. ఇట్లు జరుగుచుండఁగా తానీషాకుఁ దెలియకుండ నాతనియంతః పురస్త్రీలు అక్కన్న మాదన్న గారినిఁ జంపించుటకు యత్నములు చేయు చుండిరి. ఒకదినము వారు దివాణమునుండి యింటికిఁ బోవుచుండఁగా కొందఱు దూతలు వారిమీఁదఁబడి వారినిఁజంపిరి. వీరిద్దఱిశిరస్సులు కోసి ఔరంగజేబు పుత్రుఁడైన ముఅజ్జం వద్దికిఁ బంపిరఁట. ఆదినముననే బ్రాహ్మణులనేకులు గోలకొండకోటలోఁ జంపఁబడిరి. ఇట్లు అక్కన్న మాదన్న గారు పోయినందున తానీషాకుఁదగిన సాయముచేయువారెవరును లేకపోయిరి. అందుచే నాతఁడు రెండుకోట్లరూపాయలిచ్చి మొగలులతో సంధిచేసికొనెను. కాని యీసంధి మిక్కిలి దినములవఱకు నిలిచినదికాదు.

౧౬౮౬-వ సంవత్సరమునందలి అక్టోబరులో విజాపురదుర్గమును స్వాధీన పఱచుకొని ఔరంగజేబు గోలకొండను తీసికొన నిశ్చయించెను. కలుబరగీ (గుల్‌బర్గా) లో నున్నయొకానొక సాధువుయొక్క సమాధి చూచుటకు వెళ్లుచున్నానని బొంకి యాతఁడు తన సైన్యములతో గోలకొండను సమీపించెను. తానీషా యాతనికృపకుఁ బాత్రుఁడు కావలయునని యత్నించెను.

కాని 'నీవు బ్రాహ్మణులను మంత్రులుగాఁ బెట్టుకొంటివి; పర మతస్థుఁడగు సంభాజీతో స్నేహముచేసితివి; మహమ్మదీయ మతసిద్ధాంతములకు విరుద్ధముగాఁ బ్రవర్తించితివి. కావున నీతో యుద్ధముచేసి నీ రాజ్యమును తీసి కొందునే కాని సంధిపొసఁగద'ని చెప్పి యౌరంగజేబు గోలకొండకోటను ముట్టడించెను. ఇంక యుద్ధముచేయనిది విధిలేదని తెలిసికొని తానీషా తనవిలాసచర్యలు వదలి, మిక్కిలి ధైర్యవంతుఁడై సైన్యమును చక్కఁబఱుచుకొని యద్భుతశౌర్య ముతోఁ బోరఁజొచ్చెను. ఏడు నెలలవఱకు ముట్టడివారితో ఘోరముగాఁ బోరి వారిలోని యనేక వీరాగ్రేసరులను రూపుమాపెను. కాని భేదోపాయ ములో నారితేఱిన ఔరంగజేబు తానీషాయొక్క సైనికులలో నొక్కొక్కనిఁ జీలఁదీయ సాగెను. ఇద్దఱు సేనాధిపులు తప్ప మిగిలిన వారందఱును స్వామి ద్రోహులై మొగలులలోఁ గలిసిరి. ఇట్లు తానీషాపక్షమందున్నవారు అబ్దుల్లా ఖానుఁడను వాఁడును అబ్దుల్ రజాక్ లారీ యనువాఁడును. వీరిద్దఱికి లంచ మిచ్చి వీరిని వశపఱుచుకొనవలెనని యౌరంగజేబు మిక్కిలి యత్నించెను. తుదకు అబ్దుల్లాఖానుఁడు ధనాశచే స్వామిని విడిచెను. కాని స్వామి భక్తా గ్రేసరుఁడగు అబ్దుల్ రజాక్ మాత్రము సత్యసంధత్వము వదలినవాఁడు కాఁడు. దుర్గముయొక్క యొకానొకద్వారమును కాపాడుచున్న అబ్దుల్లాఖాఁనుడు నాశచే ద్వారమును తెఱచి శత్రువులను కోటలోనికి రానిచ్చెను. అంత ఔరంగజేబు కోట స్వాధీన పఱుచుకొని (౧౬౮౭ సెప్టెంబరు) తానీషాను దౌలతాబాదు దుర్గముమీదఁ జెఱఁబెట్టెను. అతఁ డచ్చటనే కాలధర్మము నొందెను.

ఇచ్చట స్వామిభక్తి పరాయణుఁడగు అబ్దుల్ రజాకును గుఱించి కొంచము వ్రాయవలయును. ఇట్టివా రందఱికిని బూజ్యులు. మొగలులు కోటలోనికిఁ జొరఁబడుచున్నారని తెలిసినతోడనే యాతఁడు కోగిరిలేని గుఱ్ఱముమీఁద శీఘ్రముగా నెక్కి చేతఁగత్తి పట్టుకొని శత్రుసముద్రములోనికిఁ బోయి ఘోర

ముగా యుద్ధముచేయఁజొచ్చెను. వేలకొలఁది శత్రువులు క్రమ్ముకొని కత్తులతో నాతనిని నొప్పింపసాగిరి. నఖశిఖాంతమువఱకు వ్రణములు తగిలినందున నిశ్చేష్టితుఁడై గుఱ్ఱముతీసికొని పోయినచోటికిఁ బోయెను. ఒకానొకతోటలో నాతనిని ఆగుఱ్ఱము పడవైచెను. రెండవదిన మచ్చటివా రాతనిని గుర్తించి యౌరంగజేబు శిబిరమునకుఁ గొంపోయిరి. రాయిగుండెకల యా యౌరంగజేబుకూడ అబ్దుల్ రజాక్ శౌర్యమునకు నచ్చెరు వందినవాఁడయి, యాతనిని మన్నించి 'యిట్టి సేనాధీశుఁడు మఱియొకఁడు తానీషాయొద్ద నున్నయెడల మేము గోలకొండ తీసికొనుట దుర్లభ మైయుండునని, సంభావించి యాతనికిఁ జికిత్స చేయుటకు నిద్దఱు వ్రణవైద్యుల నేర్పాటుచేసెను. అందు నొకఁడు యూరోప్ దేశస్థుఁడు, మఱియొకఁడు హిందువు. వీ రాస్వామిభక్తుని గాయములకుఁ జికిత్సచేసి 'మొత్తముమీఁద నాతని శరీరమందు డెబ్బదిగాయముల లెక్కించితిమి; మఱి గాయము లనేకములు కలవు; కాని గాయముపై గాయము పడినందున లెక్కవేయుటకు వీలులేక పోయె' నని చెప్పిరి!! పదునాఱుదినములాతనికి నుపచారముచేయఁగా నతఁడు కనుల విప్పిచూచెను. అంత నౌరంగజేబు 'నీ యపరాధము లన్నియు క్షమించితిని. మన్సబు మొదలయిన యధికారములను నీ కొసంగెదను. నీ కొమారులను నాయొద్దికిఁ బంపు' మని యాతనికి వర్తమానమంపెను. అందుపై నా శూరాగ్రేసరుఁడు తనకుపచారములు చేయించినందులకుఁ గృతజ్ఞతను గనఁబఱచుచుఁ 'దాను జీవింపననియు, జీవించినను ఉద్యోగము చేయుటకుఁ దనకు సామర్థ్య ముండదనియు, నొకవేళ సామర్థ్యముండినను, తానీషా యుప్పుతిన్న వాఁడెవఁడును వాని శత్రుఁడగు ఔరంగజేబుసేవ చేయఁజాలఁ'డనియు బ్రత్యుత్తరమంపెను. ఆప్రత్యుత్తరము విని ఔరంగజేబు చిన్నఁబోయెనఁట. ఆహా! మొదట లక్షలకొలఁది ధనమును ఉన్నతాధికారమును, ఇచ్చెదనన్న డిల్లీశ్వరుని లంచములనుగూడ ధిక్కరించి, బలహీనుఁడయిన తన యజమానునియందు దృఢభక్తి గలవాఁడై, డెబ్బదిగాయ-

ములు తగిలి ప్రాణావసానకాలము వచ్చినను తనస్వామి కపకారము చేసిన వాఁడగు డిల్లీశ్వరుని సేవలోనుండుటకు నొప్పుకొనక యాతనిని నిర్భయముగా ధిక్కరించిన యీమహానుభావుఁడు భువనైకవంద్యుఁ డనుటకు సందేహము లేదు.

ఇట్లు ౧౫౧౨ మొదలు ౧౬౮౭ వఱకు ౧౭౫ సంవత్సరములు ప్రభుత్వము చేసిన గోలకొండకుతుబ్‌శాహి రాజవంశ మంతరించెను. బహమనవంశపు రాజులకంటెను, అందుండిపుట్టిన యితర మహమ్మదీయరాజ్యముల ప్రభువులకంటెను గోలకొండనవాబులు ప్రజాహితదక్షతయందు మిగులఁ బేరొందిరి. వీరందఱును దీర్ఘకాలము రాజ్యము చేసిరి. ఈరాజవంశములో నొకరిని నొకరు చంపి రాజ్యమును సంపాదించుటలేదు. రాజ్యములోఁ గల్లోలమును ఏమియు లేకయుండెను. ఇదియునుగాక యీరాజులు తురుష్కులయ్యును, హిందువుల యెడను, దేశభాషయందును అభిమానము కలిగియుండిరి. కావుననే తురుష్క రాజ్యమయినను గోలకొండరాజ్యము పోయినందులకుఁ బ్రజలందఱును తల్లడిల్లిరి.



## అయిదవ ప్రకరణము.

### రాజపుత్రుల శౌర్యాగ్ని.

రాజపుత్రస్థానమందు జయపురము, జోధపురము, ఉదయపురము, బికానేర్, జసల్‌మీర్ మొదలయినసంస్థానము లనేకములుకలవు. ఈసంస్థానాధీశ్వరులందఱును పౌరుషమే జీవితముగాఁగల శూరాగ్రేసరులు. కావున నీరాజ్యములయొక్క చరిత్రలు భారతములోని యుద్ధపంచకము వంటివి. వాని నన్నిటిని నిచ్చట వర్ణించుటకు వీలులేదు. గౌరవముచేతను, పౌరుషముచేతను, కులముయొక్క ఘనతచేతను రాజపుత్రరాజ్యము లన్నిటికిని నాయకరత్నంబు నాఁదగు ఉదేపూర్ అనఁబడు ఉదయపుర రాజ్యముయొక్క చరిత్ర యిచ్చట వ్రాసినఁజాలును.

### ఉదేపూర్ సిసోదియావంశము.

అనన్యసామాన్యక్షాత్రతేజంబుతో వెలుంగునట్టి కథానకంబులతోడను, పౌరుషప్రధానంబులగు అద్వితీయ వీర చరిత్రంబులతోడను, స్వదేశస్వమతస్వగౌరవములను రక్షించుకొనుటకై పూలచెండ్లవలెఁ దమశిరఃప్రకరంబుల రణక్షేత్రమున నర్పించిన వీరవర నామసహస్రంబుతోడను, శరణనిన దీర్ఘదుర్మార్గశత్రునినైన రక్షించెడి యౌదార్యప్రసంగములతోడను, వేయిసంవత్సరముల కాలమువఱకు సందులేకుండ నిండియున్న యీమేవాడ్ దేశపుచరిత్ర పూర్తిగ వ్రాయుటకు వేయిపుట లయినను చాలునని తోఁపదు. అందుకు మేమాచరిత మంతయు నేఁబది, యఱువది పుటలలో ముగింప యత్నించుట యొక సాహసంబే. అయినను ఇచ్చట నీచరిత్ర హిందూదేశచరిత్రయొక్క యొక

భాగముగా వ్రాయఁబడుచున్నందున నిది యింతకంటె విస్తరముగ వ్రాయుటకు వీలులేదు.

ఉదేపుర్ అను పేరు 'ఉదయపుర' శబ్దముయొక్క యపభ్రంశము. ఉదేపూర్ పట్టణము రాజధానిగాఁగల దేశమునకు మేవాడ్‌రాజ్యమని పేరు. మేవాడనగా మధ్యదేశము. ఈరాజ్యమునకు మొదట చితోడ్‌గడము ముఖ్యపట్టణముగా నుండెను. తరువాత రాజధాని ఉదేపురమునకు మార్పఁబడెను. అందఱు రాజపుత్రులలోను మేవాడ్‌వంశము మిక్కిలి పురాతనమైనదియు, శ్రేష్ఠమైనదియు నయియున్నది. అచ్చటిరాజులు సిసోదియావంశపు రాజపూతులు (రాజపుత్రులు) సూర్యవంశజులు. అయోధ్యాధిపతియగు శ్రీరామచంద్రుని వంశపువార మని యీరాజులు చెప్పుకొనియెదరు. మొట్టమొదట వీరు పంజాబులోని లాహోరు పట్టణమున రాజ్యము చేయుచుండిరి. అప్పుడు వీరివంశమునకు 'గెహలోట్' వంశమని పేరు. ఆవంశజుఁడగు కనకసేనుఁడను రాజు క్రీ. శ. రెండవ శతాబ్దమధ్యమున లాహోరులో రాజ్యముచేయుచుండెను. ఈతఁడు శ్రీరాముని యొద్దనుండి యిఱువదిమూఁడవ పురుషుఁడఁట. ఈతఁడు సౌరాష్ట్ర దేశముపై దండెత్తిపోయి యచ్చటి పార్‌మార్ వంశపు రాజుల నోడించి యచ్చట వీసనగర మను పట్టణమును క్రీ శ. ౧౪౪ ప్రాంతమున స్థాపించెను. ఈకనకసేనుని వంశజులే వల్లభీపురమును రాజధానిగాఁ జేసికొని వల్లభిశకమును ప్రారంభించిరి. ఈవల్లభీపురము ప్రస్తుతపు భావనగర్‌వద్ద నుండెను. ఈ వంశమునందే శిలాదిత్యుండనురాజు ఉద్భవించి గజ్నిలో రాజ్యముచేసెను. అతఁడు మ్లేచ్ఛులచేఁ జంపఁబడెనఁట. తరువాత ఈగెహలోట్ వంశజులు ఈడర్ అనుచోటఁ గొన్నితరములవఱకు రాజ్యముచేసిరి. గ్రహాదిత్యుఁ డనురాజును భిల్లులు చంపివేసిరి. ఇట్లు చంపఁబడిన గ్రహాదిత్యునకు 'బాపు'అను అల్పవయస్కుఁడగు పుత్రుఁడుండెను. ఈ 'బాపు' అనువాఁడు 'బాప్పారావల్' అనుబిరుదుతో మేవాడ్ రాజులకు మూలపురుషుఁడయ్యెను.

# మహమ్మదీయ మహాయుగము.

## బాప్పారావల్.

తండ్రిమరణసమయమున మూఁడేండ్లవయసుగల 'బాపు'ను ఒకానొకబ్రాహ్మణుఁడు పెంచి పెద్దవానిఁజేసెను. ఈపిల్లవాఁడు క్రమముగ నభివృద్ధిఁజెంది, యప్పుడు చితోడులో రాజ్యముచేయుచున్న ప్రమార్ రాజునొద్ద నుద్యోగము సంపాదించెను. తన శౌర్యాదిగుణములవలన నారాజుయొక్క యనుగ్రహమునకుఁ బాత్రుఁడై యొకగ్రామమును బహుమతిగఁ బడసెను. ఈతఁడు క్రమముగఁ దనసైన్యములను నభివృద్ధిపఱచుకొని, తన యజమానునినే యోడించి, చితోడ్‌గడమునఁ గ్రొత్తరాజ్యమును స్థాపించి, ఉదేపూర్ రాజులకు వంశకర్త యయ్యెను. ఈసమాచారము క్రీ. శ. ౭౨౮లో జరిగెనని కొందఱును, క్రీ.శ. ౭౩౪ లో జరిగెనని కొందఱును వ్రాసియున్నారు. ఈ 'బాప్పా' శ్రీరామచంద్రుని యొద్దనుండి యేఁబదవ తరమువాఁడు.

ఈ రాజు మిక్కిలి పరాక్రమవంతుఁడు. ఈతని కాలములోఁ దురుష్కులయొకగొప్పసేన చితోడ్‌పై దండెత్తివచ్చెను. ఆసేనను ఈతఁడోడించి పాఱఁదోలుటయేగాక, యనేకదేశములపై దండువెడలి, గజ్నివఱకుఁ బోయి, యచ్చట రాజ్యముచేయుచున్న సేలిమ్ అనువానినోడించి, గజ్ని పట్టణమును స్వాధీనపఱచుకొని, సేలిమ్‌యొక్కకూఁతును వివాహమాడెను. గజ్నిపట్టణము పూర్వము క్షత్రియులదియేయనియు, దానిని నడుమ తురుష్కులు స్వాధీనపఱచుకొనుట యక్రమమనియుఁ దలఁచి స్వదేశస్వమతముల యభిమానముచేఁ బ్రేరితుఁడై యీతఁడు గజ్నివఱకు దండెత్తెనని హిందూచరిత్రకారులు వ్రాసియున్నారు.

ఉదేపూరువద్ద ఏకలింగజీ యనుశివుని దేవాలయముకలదు. ఆదేవుని యనుగ్రహము వలననే తన కింతవైభవము వచ్చెనని నమ్మి బాప్పారావల్ ఆదేవుని యందు మిక్కిలి భక్తి విశ్వాసములు కలవాఁడయ్యె. ఇప్పటికిని 'ఏకలింగజీ'

స్వామియే ఉదేపూర్ రాజులకుఁ గులదేవత. ఈదేవునిదే సకలరాజ్యమనియు, ఆతనికిఁ దాము మంత్రులమనియు నీరాజులు చెప్పుచుండెదరు.

బాప్పా నూఱు సంవత్సరములవఱకు బ్రతికెనఁట. ఆతనికి నూటముప్పది యిరుపుత్రు లుండిరఁట. అందుఁ దొంబదియెనిమిదిమంది హిందువులును, ముప్పది యిరువురుమహమ్మదీయులును నుండిరి. ఈతఁడు ఇరాన్ (పారసీకము), తురాన్, ఇస్పహాన్, కందహార్, కాశ్మీరము మొదలయిన యనేకదేశములకుఁ బోయి యచ్చటి రాజులను, సేనానులను నోడించి యచ్చటచ్చట ననేక స్త్రీల వివాహమాడినందున నీతనికి నింతసంతానము కలిగెనని గ్రంథకారులు వ్రాసి యున్నారు. ఈతని హిందూపుత్రులకు 'సూర్యవంశపు అగ్న్యుపాసకు' లనియు, మహమ్మదీయపుత్రులకు 'నాషేర్యపతాను' లనియుఁ బేళ్లుకలిగెను.

## ఖుమాన్.

(క్రీ. శ. ౮౧౨.)

బాప్పారావల్ తరువాత ముగ్గురురాజులు రాజ్యముచేసిరి. వారును శౌర్య ధైర్యాది గుణమండితులయినను, వీరి తరువాత రాజ్యమునకు వచ్చిన అయిదవరాజగు ఖుమాన్ అనువాఁడు మహమ్మదీయులను పరాభవించుటచే మిక్కిలి విఖ్యాతుఁడయ్యెను. ఈతఁడు క్రీ. శ. ౮౧౨లో రాజ్యారూఢుఁ డయినట్లు కానవచ్చెడిని. 'ఖుమాన్ రాసా' యనుగ్రంథమునందు నీతనిచరిత్ర వర్ణింపఁబడినది. ఈతఁడు మహమ్మదీయులతో నిరువదినాలుగు పర్యాయములు పోరాడి వారిని నోడించెను ! ఆకాలమున నుత్తరహిందూదేశమునందు ననేక క్షత్రియరాజు లుండిరనియు, వారికందఱికిఁ గొంతవఱకు స్నేహమును, ఐక మత్యమును గలిగియుండెననియుఁ గానవచ్చుచున్నది. ఎందుకన నీఖుమాన్ రాజునకు సాయమువచ్చిన రాజుల పట్టికలో నలువదికంటె నెక్కుడు రాజులపేళ్లున్నవి. ఇట్టి యైకమత్యత వలననే యప్పుడు వారు తమ యొక్క స్వాతంత్ర్యమును కాపాడఁ గలిగిరి! హా! ఈ యైకమత్యమే స్వాతంత్ర్య

మందు పృథ్వీరాయఁడు మహమ్మదు ఘోరితోఁ బోరాడునపుడు లేకపోయెఁ గదా? అప్పుడే యిట్టి రైక మత్యముండినయెడల నీహిందూదేశచరిత్ర మనమింకొక విధమున వ్రాసియుందుముకదా?

## సమరసింహుఁడు.

### (క్రీ. శ. ౧౧౫౦-౧౧౯౩).

ఈతఁడు బాప్పారావల్ వద్దనుండి పదునేడవపురుషుఁడు. రాజపుత్రచరిత్రకారు లీతనిని 'సామరసీ' యనియెదరు. 'సామరసీ' యనునది 'సమరసింహ' శబ్దభవము. ఈతఁడు తన పేరునకుఁ దగినట్లు శూరుఁడు, బలాఢ్యుఁడు, బుద్ధిమంతుఁడు. ఢిల్లీశ్వరుఁడగు పృథ్వీరాయని చెల్లెలయిన పృథాదేవి ఈతని భార్య. అందుచే నతనికిని, ఢిల్లీశ్వరునికిని మిక్కిలి స్నేహము కలిగియుండెను. ఈతని సాహాయ్యమువలననే పృథ్వీరాయఁ డనేకశత్రువుల జయించెను. తుదకీ వీరుఁడును ఈతని పెద్దకుమారుఁడగు కల్యాణరాయఁడును మాతృదేశముయొక్క రక్షణార్థమై పృథ్వీరాయనికిఁ దోడుపోయి క్రీ. శ. ౧౧౯౩ లో స్థానేశ్వరయుద్ధమందుఁ గాలధర్మము నొందిరి.

## కరుణదేవి.

సమరసింహునకుఁ గరుణదేవియను మఱియొకభార్య యుండెను. ఈమెకు సమరసింహునివలన నొకకుమారుఁ డుండెను. అతనిపేరు కర్ణుఁడు. జ్యేష్ఠకుమారుఁడు తండ్రితోఁగూడ యుద్ధములో మడిసినందున ఈకర్ణుని రాజ్యారూఢునిఁజేసి వాఁడు చిన్నవాఁడగుటచే వీరపత్నియగు కరుణదేవి స్వయముగ రాజ్యముచేయఁ దొడఁగెను. ఈమె రాజ్యము చేయుచుండఁగా మహమ్మదీయు లారాజ్యమునకు మిగులబాధ కలుగఁజేయుచుండిరి. ఈశూరవనిత రాజ్యభారమునంతను వహించినదిగనుక, సైన్యములను బోగుచేసికొని తాను స్వయముగా నగ్రేసరత్వమును వహించి అంభోర్ అనుగ్రామమునొద్ద

మహమ్మద్ ఘోరీయొక్క సైన్యాధిపుఁడగు కుతుబుద్దీన్ అనువానిని బాత్రిగా నోడించెను! స్త్రీయయ్యును, భారతయుద్ధమునందువలె క్షత్రియరాజులందఱును స్థానేశ్వర యుద్ధమునందు మడిసినకొలఁదికాలములోనే యీశూర వనిత తనకొలఁది సైనికులతో కుతుబుద్దీన్ వంటి మహాశూరుని నోడించుట చూడఁగా, మన రాజపుత్రులు తమ స్త్రీలను రాణీవాసములో నుంచక, యుద్ధములలో వారిసైన్యములను రానిచ్చి వారిసాహాయ్యముఁ గూడఁ గొని యుండిన నీదేశము మహమ్మదీయులపాలుగాక యుండునేమో యని తర్కింప వలసియున్నది. ఈ మెకుమారుఁడు కర్ణుఁడు పెద్దవాఁడయి రాజ్యముచేసెను.

## రహూప్.

(క్రీ. శ. ౧౨౦౧-౧౨౩౯).

కర్ణుని తరువాత రహూప్ అనువాఁడు మేవాడ్ రాజయ్యెను. ఈతఁడు సమరసింహుని తమ్ముని మనుమఁడు. ఈతఁడు కర్ణుని దౌహిత్రుని నోడించి యీ రాజ్యము సంపాదించెను. శమ్సుద్దీన్ అనుమ్లేచ్ఛుఁ డీతనిమీఁదికిఁ బోరాటమునకు రాఁగ నాతని నోడించి యాతని మద మడంచెను! ఈమ్లేచ్ఛునకు దేశద్రోహియగు మోకల్ పరిహార్ అను హిందూరాజు సాయముచేసినందున వానిపై నలిగి రహూప్‌రాజు వానిరాజ్యము నాక్రమించుకొని వానికిఁగల 'రాణా' యనుపదవిని తాను ధరించెను. అప్పటినుండి మేవాడ్‌రాజులు తమకదివఱకున్న బిరుదులను విశేషముగా వాడక 'రాణా' పదమునే వాడుచున్నారు.

ఈరాజు మరణానంతరము లక్ష్మణసింహుఁడను వాఁడురాజగువఱకుఁ దొమ్మండ్రు రాజులయిరి. అందు నార్గురు చితోడ్‌లోను, ముగ్గురు గయలోను సంగ్రామమున హతులయిరి. ఆకాలమున గయాక్షేత్రముపై మహమ్మదీయులు దండెత్తి వచ్చినప్పుడెల్లను, దానిని రక్షించుటకై చితోడ్‌గడము నుండి రాజులు వెళ్లుచుండిరి.

## లక్ష్మణసింహుఁడు.

(క్రీ. శ. ౧౨౭౫-౧౩౦౩).

ఈవంశములోని యిరువది తొమ్మిదవవాఁడగు లక్ష్మణసింహుఁడు క్రీ. శ. ౧౨౭౫ లో రాజ్యారూఢుఁడయ్యెను. అల్లాఉద్దీన్ అను ఢిల్లీశ్వరుఁ డీతనికి సమకాలీనుఁడు. ఈమ్లేచ్ఛరాజు చితోడ్ మీఁదికి దండెత్తివచ్చి దానిని ముట్టడించెను. లక్ష్మణసింహుని పినతండ్రియగు భీమసింగునకుఁ బద్మినియను భార్య కలదు. ఈమె సింహలద్వీపపురాజగు హమీరసింగుయొక్క కూఁతురు. సౌందర్యమందును, సద్గుణములందును పద్మినీదేవితోఁ బోల్పఁదగిన స్త్రీయప్పుడు రాజపుత్రస్థానమందు లేదని యామె విఖ్యాతిఁ జెందియుండెను. ఇట్టి సాధ్విని జెఱపట్టుకొని పోవలయునని దురుద్దేశముతో నల్లాఉద్దీన్ అను ఢిల్లీశ్వరుఁడు చితోడ్ దుర్గమును ముట్టడించి విడిసెను. 'పద్మినీదేవిని తనకిచ్చి వేసినయెడలఁ దాను రాజపుత్రులకు నెట్టిబాధయుఁ గలుగకుండ లేచివెడలెద' నని యాదుర్మార్గుఁడు పట్టుపట్టెను. కాని తమ స్త్రీలపాతివ్రత్యము రక్షించుట కంటె నధికగౌరవాస్పదమైన పౌరుషకృత్యము రాజపుత్రులకు వేరొకటి లేనందున రాజపుత్రులందఱును మహాశౌర్యముతోఁ బోరాడసాగిరి. అందుచే నెన్ని దినములు కష్టపడినను మ్లేచ్ఛునకుఁ జితోడ్‌గడము స్వాధీనముకాదయ్యె. అందుకు విసివి 'పద్మినిని నాకొక్కసారి చూపినఁజాలును. నేను వెడలిపోయెదను' అని యానరాధముఁడు రాజపుత్రులకుఁ దెల్పెను. అందుపైఁ 'బ్రత్యక్షముగఁ బద్మినిదర్శనము నీకగుట కలలోనివార్త. నిలువుటద్దములోని యామె ప్రతిబింబము వలయునెడ నీవుచూడవచ్చు' నని రాజపుత్రు లాతనికిఁ దెల్పఁగా నా కామాంధుఁడందులకు నొప్పుకొని, చితోడ్‌గడముమీఁదికివచ్చి యద్దములోఁ బద్మినీదేవి ప్రతిబింబమును జూచెను. రాజపుత్రు లత్యంత నీతిమంతులుగాన నట్లునమ్మి తమయింటికివచ్చిన దుష్టశత్రువును వధింపరైరి. అట్లు వధించియున్న యెడల చితోడ్ దుర్గము మీఁది యొవ్యసంకటములన్నియు నంతటితో సమాప్తిఁ

చెందియుండును. కాని రాజపుత్రులు తమ యసమానపౌరుషముతోఁబాటు, ఆడినమాట తప్పకుండుట, శరణాగతత్రాణబిరుదము, తమ కెంతనష్టమువచ్చినను నమ్మినవానిని ద్రోహము చేయకుండుట మొదలయిన యత్యుచ్చనీతి తత్త్వములను ప్రాణములతోఁబాటు చూచుచుండిరనియు, అందుచే వీర లనేక పర్యాయములు మహమ్మదీయులచే మోసపుచ్చఁబడియుఁ బ్రసంగము వచ్చినపుడు ఆమోసమునే మహమ్మదీయులయెడఁ బ్రయోగింపక చిక్కినపట్టునువదలుచు వచ్చినందున వీరు తురుష్కులకంటె నధికశూరు లయినను అనేక యుద్ధములలో నోడి రాజ్యమును పోఁగొట్టుకొనవలసినవా రయిరనియు ముందు కథానకము వలనఁ జదువరులు చూడఁగలరు.

అల్లాఉద్దీన్ కొండదిగి వెళ్లునపుడు మోసమెఱుఁగని భీమసింగు చాలా దూరమువఱకు నాతని సాగనంపఁబోయెను. కొండమీఁదినుండి మిక్కిలి దవ్వారిగిన పిదప నచ్చట నదివఱకే డాఁగియున్న మ్లేచ్ఛసైనికులు భీమసింగును చెఱ పట్టి తమశిబిరమునకుఁ గొంపోయిరి. ‘పద్మిని నిచ్చినఁగాని భీమసింగును విడువ’ మని అల్లాఉద్దీన్ చితోడ్ గడము లోనివారికిఁ దెలియఁజేసెను! చూచితిరా యాతనిని నీతికిని, రాజపుత్రుల నీతికిని గల తారతమ్యము !

పైని వర్ణింపఁబడినట్లు భీమసింగు శత్రువులచేతులలోఁ జిక్కినందున నాతనిని విడిపించుటకు రాజపుత్రు లొకయుక్తిఁ బన్నిరి. ‘మీరు చితోడ్ ముట్టడి లేపి యొకవైపు మీసైన్యమంతయు విడియునట్లు చేసినయెడలఁ బద్మినీదేవిని మీ యొద్దకుఁ బంపెదము. కాని యామెయోగ్యతకుఁ దగినట్లు ఆమెను మీ శిబిరమువఱకుఁ బంపుటకు ననేక రాజస్త్రీలు మేనాలలోను, పల్లకులలోను వచ్చెదరు; కావున వారిరాణివాసమునకు భంగము లేకుండ నేర్పాటు చేయవలయును’ అని అల్లాఉద్దీన్‌కు వర్తమానమంపిరి. అందుపై నాకాముకుఁడు దుర్గముచుట్టునున్న సైన్యమును లేపి యొకచోటఁ బద్మినిరాకకై యెదురుచూచుచుండెను. అంతఁ దెరలతో మూయఁబడినయేడువందల మేనాలును, పల్ల

[illegible] చితోడ్ నుండి బయలుదేఱి డిల్లీశ్వరుని శిబిరమునకువచ్చి, వానికై విడిగా నేర్పరుపఁబడిన రాణివాసపు గుడారమునందు దిగెను. అంత వెంట వచ్చినవారి కోర్కె ననుసరించి పద్మినితో నొక్కసారి మాటాడివచ్చుటకు భీమసింగునకు సెలవీయఁబడెను. అతఁడు పద్మిని యున్నదనిన గుడారమునకుఁ బోయి, పద్మినిని వీడ్కొని తిరిగి వెళ్లుచున్నారన్న రజపూత్ స్త్రీలయొక్క పల్లకీలోఁగూర్చుండి చితోడ్ గడమునకుఁ బోయెను. భీమసింగింత యాలస్య మేలచేసెనని అల్లాఉద్దీన్ మనుష్యులనుబంపి విచారింపఁగా, రజపూత్ స్త్రీల గుడారములో నొక్కయాఁడుదియు లేక యేడువందల రాజపుత్రవీరులు మేనాలలోనుండి వెలువడి విచ్చుకత్తులతోఁ దురుష్కులనఱకసాగిరి. చితోడ్ నుండివచ్చిన పల్లకీలలో రాజపుత్రులు నటించినట్లు రాజస్త్రీలు లేరు; ఒక్కొక్క మేనాలోనొక్కొక రాజపుత్రభటుఁడు కూర్చుండివచ్చెనని చదువరులు కనుఁగొనియుందురు. భీమసింగుని విడిపించుటకును, అల్లాఉద్దీనును మోసపుచ్చుటకు, పద్మిని మొదలయిన రాజస్త్రీలమానమును రక్షించుటకును ఇది రాజపుత్రులు పన్నినయుక్తి.

ఇట్లు చేయఁబడినమోసమును తెలిసికొని మ్లేచ్ఛులు మిగుల కోపోద్దీపితులై రాజపుత్రవీరులను తఱుముకొని కోటవఱకు వచ్చిరి. ఈ యుద్ధమునందు చితోడ్ లోని విఖ్యాతశూరు లనేకులు మడిసిరి. అయినను కోట మ్లేచ్ఛులకుఁ జిక్కినదికాదు. తుదకుఁ బ్రాణమువిసివి అల్లాఉద్దీన్ ముట్టడిలేపి వెడలిపోయెను.

కాని అల్లాఉద్దీన్ మరల క్రీ.శ. ౧౩౦౩లో చితోడ్ గడముమీఁదికి దండెత్తి వచ్చెను. ఈతడవ అసంఖ్యరాజపుత్రులు తమదేహముల స్వదేశరక్షణార్థమై యర్పించిరి. లక్ష్మణసింహుని పండ్రెండుగురుపుత్రులలోఁ బదునొకండుగురు యుద్ధమందు హతులయి క్షాత్రధర్మమును ప్రతిపాలించిరి. ఇట్లు వీరులందఱు

మడియుటచే రాజపుత్రులకుఁ బరాజయంబును, మ్లేచ్ఛులకు జయంబును గల్గుట నిశ్చయమని యందఱికిని దెలిసెను. అంతఁ దాము బ్రతికియుండఁగఁ దమకోటయుఁ దాము మడిసినతరువాతఁ దమస్త్రీలును శత్రువులచేతఁ బడకుండ 'జోహార్' చేయ నిశ్చయించిరి. 'జోహార్' అనఁగాఁ దమకుఁ దప్పక పరాజయము కలుగునని తెలిసినప్పుడు, తమస్త్రీజనములు శత్రువులచేతఁజిక్కి వారిచే మానభంగముఁ జెందకుండ వారిని మొదట సంహరించుటయు, పిదపమగవారందఱును ఒక్కపట్టున శత్రువులపైఁ బడిపోరాడి మడియుటయు. అట్లు నిశ్చయించినపిదపఁ జితోడ్‌లోని యొకానొక గుహలో నగ్ని పేర్చించి యందు నందఱు రాజపత్నులును, రాజకన్యలును, రాజస్నుషలును, సరదారులభార్యలును, సైనికులభార్యలును, మేవాడ్ భూషణమగు పద్మినీదేవియుఁ బ్రవేశించి, యందఱును మడిసిరి! పిదప లక్ష్మణసింగ్ భీమసింగ్ మొదలయిన వీరులందఱును నిర్భీతులయి శత్రుసైన్యములోనికిఁజొచ్చి యసంఖ్యవీరులఁ ద్రుంచి తాముహతులైరి.

ఇట్లు ఎటుచూచినను అగ్నితోడను, శవములతోడను నిండి భయానకమై నిర్మానుష్యమైన యాకోట మ్లేచ్ఛునకు స్వాధీనమయ్యెను. అల్లాఉద్దీన్ వంటి మానవరూప మహారాక్షసునకుఁగూడ ఆకోటనుజూచి మనమునకుఁ గొంచెము వ్యసనము కలిగెను! వాఁడచ్చటఁ గొన్ని దినములుండి హిందూదేవాలయములను బడఁగొట్టించి మసీదులుకట్టించి, మాలవదేవుఁ డనువానిని అచ్చట నధికారిగా నేర్పఱిచి వెడలిపోయెను.

## హామీర్.

(క్రీ. శ. ౧౩౧౩-౧౩౬౫).

పైనివర్ణింపఁబడిన జోహారులో మేవాడ్ రాజకుల మెల్లనశించెనని చదువరులు చూచియున్నారు. కాని తన పుత్రులలోఁ బదునొకండుగురు యుద్ధములో మడిసినపిదప లక్ష్మణసింహుఁడు తనవంశమంతరించి పోకుండఁగఁ దన

రెండవకుమారుఁడగు అజయ్యాసింహుని సురక్షితమైన స్థలమునకుఁ బంపివేసెను. ఆతఁడుగాక, యాతనియన్నయగు లక్ష్మణసింహుని పెద్దకుమారుఁడును అరుడోర్ సింహుని కుమారుఁడగు హమీరుఁడనువాఁడు తాతముత్తవలయింటఁ బెరుఁగు చుండెను. ఇట్లీవంశజులగు పురుషులిద్దఱు జీవించి యుండిరి. అందు జయ సింహుని చితోడ్ గడములోనుండి సురక్షితస్థలమునకుఁ బంపునప్పుడు 'జీవిత కాలముపఱకు నీవు రాజ్యము చేసి, పిదప దేశముకొఱకు బ్రాణములఁద్యజించిన నీ యన్నయగు ఉరిసింహుని గౌరవార్థమై యాతని కుమారునకుఁ బట్టము కట్టుము' అని లక్ష్మణసింహుఁడాజ్ఞాపించెను.

చితోడ్ లోని మొదటిజోహార్ జరిగిన తరువాత రాజ్యమంతయుఁ దురుష్కుల పాలయినందున నజయ్యాసింహుఁడు కేల్ వాడ్ అనుచోట నజ్ఞాతవాసమునందుండవలసిన వాఁడాయెను. కేల్ వాడ్ అనుస్థల మారావలీ పర్వతముల కనములలోనున్నది. అచ్చట నాతఁడు సజ్జనసింగ్, అను తనకుమారునితోడను, హమీర్ అను తనయన్నకుమారునితోడను కొంతకాలము గడపెను. ఒకనాఁ డచ్చటియొక భిల్లునితో నాతనికిఁ బోరాటరాఁగా నాతఁడు వానిపై నా ముగ్గురుకుమారులను బంపఁగా హమీరుఁడు వానితలఁద్రుంచి పినతండ్రికిఁ దెచ్చియిచ్చెను. అంత నజయ్యాసింహుఁడు మెచ్చుకొని తనతండ్రియాజ్ఞను దలఁచి, యాభిల్లునిశిరములోని రక్తబిందువులతో హమీరునకు బొట్టుపెట్టి, ముందు రాజ్యాధికారము తనపుత్రులకు లేదనియు, అయధికారము హమీరు నదియే యనియు స్థిరపఱిచెను. అజయ్యాసింహుని జీవితకాలములోనే యాతని రెండవ కుమారుఁడు మృతినొందెను. బ్రతికియున్న తన పెద్దకుమారుఁడగు సజ్జనసింహుఁడు రాజ్యముకొఱకు హమీరునితోఁ బోరాడునేమో యని యాతఁడు మేవాడ్ దేశమును విడిచివెళ్లునట్లు ఆజ్ఞాపించెను. పితృభక్తుఁడును, సజ్జనుఁడు నగు నాసజ్జనసింహుఁడు మేవాడ్ దేశమువదలి దక్షిణమునకుఁ బోయి మహారాష్ట్రదేశమందుఁ గాఁపురముండెను. ఈ సజ్జనసింహుని వంశ

ములందే మహారాష్ట్రరాజ్యసంస్థాపకుఁడును, క్షత్రియకులాభరణుఁడును నగు శ్రీశివాజి జన్మించెనని చదువరులు 'మహారాష్ట్రదయము' అను గ్రంథమున భాగములోఁ జూడఁగలరు.

ఇట్లు అజయ్యసింహునితరువాత హామీరుఁడే రాజ్యమున కధిపతియయ్యెను. కాని రాజ్యము మాత్రము లేదయ్యెను! అందుచేత రాజ్యమును, వైభవమును సంపాదించుటకై హామీరుఁడు యత్నింపసాగెను. మహారాష్ట్రరాజ్యము సంపాదించుటకు శ్రీశివాజి ముందు ఎట్లు చేసెనో యట్లే హామీరుఁడు తురుష్క రాజులను బాధపెట్టసాగెను. అతఁడైదువేలభిల్లులను సైనికులుగాఁ జేర్చుకొని మహామ్మదీయ రాజ్యములను దోఁచుకొనుచు దొరకినధనమంతయును ఖేలనా కుఁ దెచ్చుచుండెను. ఖేల్‌వాడ్ అనుస్థలము పర్వతారణ్యప్రదేశములలో నుండుట వలన శత్రువులకు సాధ్యముకానిదిగ నుండుటయే గాక భిల్లసైనికులకుఁ గావల సిన భోజనసామగ్రియు, ఘాసేంధనాదులును విపులముగ దొరకుచుండెను. అచ్చటినుండి పింగళమువలె వెడలి యనేక పట్టణములపైఁబడి వానిని స్వాధీన పఱచుకొనుచుఁ ద్వరలోనే హామీరుఁడు చితోడ్‌గడముతప్ప మిగిలిన రాజ్య మంతయును సంపాదించెను.

అప్పుడు చితోడ్‌గడము ఢిల్లీశ్వరుఁడగు మ్లేచ్ఛుని సేవకుఁడైన మాలవ దేవుని స్వాధీనములో నుండెనని చదువరు లెఱుంగుదురు. ఈ మాలవదేవుఁడు రాజపుత్రవంశపువాఁడే. అతఁడు తన బాలవిధవయగు కూఁతును, ఆమె బాల విధవయని తెలియనీయక, హామీరునకిచ్చి వివాహము చేసెను. వివాహానంతర మీ సమాచారము హామీరునకుఁ దెలిసినను ఆమె సద్గుణములకు మెచ్చి యామెను విడువక జన్మమంతయుఁ దనసహధర్మచారిణిగాఁ గైకొనియె! వీరిద్దఱికి క్షేత్రసింహుఁ డను కుమారుఁడు గలిగెను.

మాలవదేవుఁడును అతని సైనికులును మఱియొకపనిమీఁద నచ్చటికి వెడలి నప్పుడు హామీరుఁడును, అతని భార్యయును చితోడ్ మీఁది యితరసైనికులను

కొనుచుకొని యాదుర్గమును నాక్రమించిరి. ఇట్లు హమీరుఁడు సిసోదియా వంశమురొక్క పోయినరాజధానిని, రాజ్యమును, వైభవము మరలసంపాదించెను. (క్రీ.శ.౧౩౧౩)

మాలవదేవున కీ సంగతి తెలిసి యీయంశమును తనయజమానునికిఁ దెల్పుటకై యాతఁడు డిల్లీకిఁ బోయెను. అప్పుడచ్చట మహమూద్ ఖిల్‌జీ యను వాఁడు రాజ్యముచేయుచుండెను. వాఁడు హమీరును శిక్షించుటకై యొక పెద్దసైన్యమును దీసికొని వెడలెను. కాని యిటు హమీరుఁడు చితోడ్ రాజ్యమునకు వచ్చెనని తెలియఁగనే హిందూరాజుల కందఱికిని అపరిమితానందము కలిగి వారాతని సాహాయ్యమునకువచ్చిరి. తురుష్కరాజ్యము నడుగంట్రత్రొక్కఁ దలఁచిన హిందువు లందఱికిని ప్రాణములువచ్చెను. అందుచే హమీరునిసైన్యము మిక్కిలి బలపడెను. తుదకు హమీర మహమూద్ ఖిల్‌జీ లకు చంబళానది యొడ్డున సింగోలీయను గ్రామమునొద్ద ఘోర సంగ్రామమైయందు మ్లేచ్ఛుఁడు పరాభూతుఁడయి హమీరునిచేతఁ జిక్కెను. వాఁడు మూఁడునెలలవఱకుఁ జితోడ్ గడముపైఁ జెఱసాలలోనుండి, తుదకు హమీరునకు అజమీర్, రణథంబోర్, నాగోర్, సుయీసోపూర్ అను ప్రాంతములను, ఏఁబదిలక్షల రూపాయలును, నూఱుఏనుఁగులును ఇచ్చి బంధవిముక్తుఁడయ్యెను. ఇంతియగాక 'ఇఁక ముందెన్నఁడును నేను మేవాడ్ రాజ్యము మీఁదికిఁగాని యితరరాజపుత్రుల రాజ్యముమీఁదికిఁగాని దండెత్తి రాఁగలవాఁడనుగాను; ఇతరు లెవరయిన మీమీఁదికి దండెత్తి వచ్చినయెడల నేను మీకుఁ సాహాయ్యము చేయఁగలవాఁడను' అని యాతురుష్కునిచే హమీరుఁ డొప్పించుకొనియె.

మాలవరాజునకు రణధీర్, బనబీర్ అనుపుత్రు లిద్దఱుండిరి. వీరిద్దఱును హమీరునకు బావమఱఁదులు కానఁగా భార్యతోఁ బుట్టినవారు. వారిద్దఱును మహమూద్ ఖిల్‌జీతోఁ గలసి హమీరునితోఁ బోరాడిరి. అందు రణధీరుఁడు

హాతుండదయ్యెను; బనబీరుఁడు పట్టుపడియె. వానిని బంధముక్తునిఁజేసి వానికిఁ గొంత జాగీరొసంగి 'నీకునాకుఁ గలబంధుత్వ మటుంచినను, నేనునీవు ఒక్కమతము గలవారము, జాతిగలవారము. ఈజాత్యభిమానమును, మతాభిమానమును మఱవకుము. నీవు మహమ్మదీయులతోఁ గలిసి యపకీర్తిపడయకుము' అని బోధించెను.

ఇట్లు మహమ్మదీయరాజులకుఁ బ్రబలప్రతిస్పర్థియైనందున హమీరుఁడన నందఱు క్షత్రియరాజులకు నొకదివ్యపురుషుఁడుగ నుండెను. అతనితో స్నేహముచేయుటయు, నాతనికి మాండలికులుగా నుండుటయు భూషణాస్పదముగ నెంచఁబడియె. బుందీ, గ్వాలేర్, చందరీ, రాయ్‌సహాన్, సిక్రీ, కాల్పీ, అబూ మొదలయిన సంస్థానాధీశ్వరు లాతనిని నాయకునిగా గ్రహించిరి. జయపూర్, జోధ్‌పూర్, సంస్థానాధీశ్వరులు సంతోషముతో నాతనికి సామంతులయిరి. ఇట్లు హిందువులలోఁ గొంతవఱకు నైకమత్యముగలిగి వారు కొంచెము తలయెత్తసాగిరి.

మహమ్మదీయులు వచ్చుటకుఁ బూర్వము మేవాడ్ రాజ్యపుసీమ మిక్కిలి విస్తృతముగ నుండెను. కాని రెండువందల సంవత్సరములనుండి యది తగ్గుచుఁ బోయి మిక్కిలి చిన్నదియయ్యె. కావునఁ బూర్వరాజ్యమంతయు మరల సంపాదించుటకు హమీరుఁడు పూనుకొనెను. అతనికిఁ గాలముకూడ ననుకూలించెను. హిందువులందఱును ఆతనికి ననుకూలురుగా నుండిరి. ఢిల్లీరాజ్యమునకై ఖిల్‌జీ, లోదీ, సూర్ అనుముగ్గురు తురుష్కకుటుంబములవారు పరస్పర కలహములలో మునింగిరి. ఈసమయము తగినదిగదాయని హమీరుఁడు విజయయాత్రలకు వెడలుచుండెను. అతనిసైన్యములు ఢిల్లీసౌరాష్ట్రములవఱకును మార్‌వాడలోని నాగోరువఱకును బోయి జయము సంపాదించి యపార ధనమును దెచ్చెను. మేవాడ్‌లో నాకాలమందుఁ గట్టఁబడినభవ్యములైన సుందర మందిరములే, యిప్పుడు వారు తెచ్చిన యపారసంపత్తిని వెల్లడిచేయుచున్నవి.

ఇట్లు పోయినరాజ్యమంతయు సంపాదించి, కలాకాలములను రాజ్యము నభివృద్ధిచేసి, మేవాడ్ ప్రజలదివఱకుఁ దురుష్కులచేఁ బడిన బాధలకును, అనుభవించిన దారిద్ర్యమునకును రెట్టించినసుఖమును సంపత్తియుఁ బ్రజల కొసఁగి, వృద్ధుఁడగువఱకు రాజ్యముచేసి యీ మహాపరాక్రమవంతుఁడు తన కుమారునకు విపులైశ్వర్యమును ప్రబల రాజ్యమును అప్పగించి క్రీ.శ. ౧౩౬౪ లోఁ గీర్తి శేషుండయ్యెను. ఈతనినామ మిదివఱకును రాజపుత్రస్థానములో మిక్కిలి గౌరవింపఁ బడుచున్నది. హిందూదేశ చరిత్రలో నితఁడు శివాజీ, కృష్ణదేవరాయలు, ప్రతాప్‌సింగ్, రాజసింగ్ మొదలయిన మహాశూరులలోఁ బోల్పఁదగినవాఁడు.

## ఖేతసింగ్.

(క్రీ. శ. ౧౩౬౪ - ౧౩౮౩).

హామీరుని కుమారుఁడు ఖేతసింహుఁ డనఁబడు క్షేత్రసింహుఁడు. ఈతఁడును తండ్రివలెనే పరాక్రమవంతుఁ డనియుఁ బ్రజాహితచింతనుఁ డనియుఁ బేరువడసెను. ఈతఁడు శత్రువులనోడించి మాండల్‌గడము మొదలుగు ప్రాంతములను దనరాజ్యములోఁ గలుపుకొనెను; మఱియు బాకరోల్ వద్ద హుమాయూన్ బాదూషాహను ఓడించెను. ఈతఁడు పదునెనిమిది సంవత్సరములు రాజ్యముచేసి యొకానొక రాజపుత్రరాజువలన మోసముచేఁ జంపఁబడియెను.

## లాఖారాణా.

(౧౩౮౩ - ౧౩౯౭)

ఖేత్‌సింగుని తరువాత వాతని కొమారుఁడగు లాఖారాణా రాజయ్యెను. ఈతనికి లక్ష్మణసింహుఁడని నామాంతరము. ఈతఁడు తనతండ్రి తాతలవలెనే క్షాత్రతేజముకలవాఁడును, ఉత్కృష్టరాజ్యపద్ధతి నెఱిఁగినవాఁడును, ప్రజాక్షేమైకనిరతుండును అయి ఖ్యాతివహించెను. ఈతఁడు మేవాడలోని పర్వత

దుర్గములను స్వాధీనపఱుచుకొని, అనావశ్యక మగువానిని నాశముచేయించి, వలయువానిని బాగుగఁ గట్టించెను; మహమ్మదీయుఁడను ఢిల్లీశ్వరుని నోడించెను. కాని సంతత యుద్ధములవలనఁ బ్రజలకు మిక్కిలి నష్టమువిరలఁచి, తన దేశమును, ప్రజలును ధనవంతులయి సౌఖ్యపడునట్లు కలాకౌశల్యముల నభివృద్ధి చేసెను. అనఁగా స్వదేశి యనఁబడు ఉద్యమము వలన దేశమును బాగుపఱిచెను. దేశమునం దేమేమి గనులుకలవో కనుఁగొని దొరకిన వెండిగనులలోని ధనమంతయు రాజ్యరక్షణార్థమై కోటలు కట్టించుటలోను ప్రజలసౌకర్యార్థమై చెఱువులు, బావులు, మహాద్రులు నిర్మించుటలోను, అనేకకళల నభివృద్ధి చేయుటలోను వెచ్చించి 'దేశహిత చింతకుఁ'డను సార్థక బిరుదమువహించెను. ఈనృపతి వెనుక అల్లాఉద్దీనుచేఁ బాడుచేయఁబడిన, చిత్తోడ్ మిాఁది మందిరముల నన్నిటిని మరలఁగట్టించెను. ఈతఁడు కట్టించిన విశ్వకర్మ మందిరమును, రాజభవనములోని కొంతభాగమును నిప్పటికిని మంచిస్థితిలోనుండి, యాకాలపువైభవమునకు ద్యోతకములుగా నున్నవి.

## మోకల్ రాణా.

(౧౩౯౮ - ౧౪౧౯).

మార్వాడ్ దేశపురాజయిన రణమల్లునికన్యను లాఖారాణా కిచ్చియుండిరి. ఈ వివాహమునకుఁ బూర్వము లాఖారాణాకు మొదటి భార్యవలన చోండా యనిన వాఁడను పేరుగల చంద్రసింహుఁడను పెద్దకొడుకుండెను. జ్యేష్ఠపుత్రుఁడగుటచే రాజ్యమునకు నధిపతియైనను, ఈచోండాయను సత్పుత్రుఁడు, మహాభారతములోని భీష్మాచార్యులచరిత్ర ననుసరించి, తండ్రికోర్కెప్రకారము, తనకురాజ్యముపైఁ గల హక్కును వదలుకొని తన సవతి తల్లికుమారుఁడగు మోకల్ రాణాను రాజుగా నేర్పఱిచి యాతని బాల్యమునందు రాజ్యమును అతనిమంత్రిగఁ బాలించి, యాతఁడు పెద్దవాఁ డయినలోడనే యాతనికి నొప్పగించెను.

ఈమోకలరాణా క్రీ.శ. ౧౩౯౭లో రాజ్యపరిపాలనము చేయఁదొడఁగెను. ఈసంవత్సరము హిందూదేశచరిత్రము మఱియొక సంగతినిగుఱించి ప్రఖ్యాతిఁ జెందియున్నది. మొగల్ బాదుషాహయగు తైమూర్‌లంగ్ అనువాఁడు ఈ యేఁటనే హిందూదేశము పై దండెత్తివచ్చెను. కాని యాతఁడు మేవాడ్ జోలికిఁబోలేదు. ఢిల్లీశ్వరుఁ డీతనిరాజ్యముపై దండెత్తిరాఁగా నీతఁడెదురేగి రాయపూర్ అనుగ్రామమునొద్ద నాతని నోడించెను. అచ్చటినుండి తిరిగి వచ్చు నెడసాంభర్ ప్రాంతమును జయించెను. ఈప్రాంతములో సాంభర్ చెఱువు కలదు. అందు నుప్పుపండును. అందుచే నీతనికి నాదాయ మెక్కువయయ్యెను. లాఖారాణాచేఁ బ్రారంభింపఁబడిన రాజమందిరమును ఈతఁడు పూర్తిచేయించుటయేకాక చతుర్భుజునిదేవాలయ మొకటి కట్టించెను. ఇది మిక్కిలి చక్కని దేవాలయము. మోకల్‌రాణా తన పినతండ్రిచేఁ జంపఁబడియె. మోకల్‌రాణాకే ముకుల్‌రాణా యని మాఱుపేరు.

## కుంభరాణా.

(౧౪౧౯-౧౪౬౯).

మోకలుని కుమారుఁడు కుంభరాణా. ఈతఁడు రాజ్యమునకు రాఁగానే, తనతండ్రిని జంపినవారితోఁ బోరి వారికిఁ దగినశిక్ష విధించెను. ఈ రాజు అనన్య సామాన్యపౌరుషుఁ డనియు, రాజ్యకార్య ధురంధరుఁడనియుఁ జరిత్రకారులు వ్రాసియున్నారు. అదివఱకుఁ జితోడ్‌దుర్గముపై రాజ్యముచేసిన మాననీయరాజపుంగవులలోఁ గల సద్గుణములన్నియు నీతనియందు నేకీభవించి యుండెను. చుట్టుపట్టున నున్న మ్లేచ్ఛుల ననేకపర్యాయముల నోడించెను. మాళవా, గుజరాత్ దేశములలోని తురకసుల్తానులు తమ యసంఖ్యా సైన్యములతో క్రీ. శ. ౧౪౪౦లో నీతని మీఁదికి యుద్ధమునకువచ్చిరి. అప్పుడు కుంభరాణా తన యొక లక్షసిబ్బందితోడను, పదునాలుగువందల యేనుఁగులతోడను తనరాజ్యపు పొలిమేరయొద్ద మాళవదేశపు మైదానములో వారిని

నెదిరించి యోడించెను. మాళవరాజగు మహామూదను వానిని చెఱబట్టి చితోడ్‌గడముమీఁద నాఱునెలలుంచి, మిక్కిలి గౌరవించి వానికి వాని రాజ్యమును తిరిగి యిచ్చెను! ఈయనుపమేయమైన క్షాత్రధర్మానుపాలనమును



చితోడ్‌మీఁది జయస్తంభము.

గుఱించియు, ఔదార్యమును గుఱించియు మహమ్మదీయ చరిత్రకారుఁడగు అబూఫాజల్ అనువాఁడు కుంభరాణాను నెంతయో కొనియాడియున్నాఁడు!

ఈ విజయమును సూచించు జయస్తంభమొకటి మేడ్‌పాట్ నగరమందీ రాజు కట్టించెను.

ఈ యద్వితీయుండగు కుంభుఁడు తనరాజ్య సంరక్షణకై ముప్పదిరెండు దుర్గములఁ గ్రొత్తగ నిర్మించెను. అందు నీతనిపేరిటఁ గట్టఁబడిన కుంభేర్ దుర్గము శత్రువుల కభేద్యమై యుండెను. ఈతఁడు అబూపర్వతముమీఁద కుంభశ్యామ మనుహిందూదేవాలయమును ఋషభమందిర మనుజైనమందిర మును గట్టించెను.

ఈరాజు స్వయముగ విద్వాంసుఁడు. గీతగోవిందకావ్యమునకు నొకటీక వ్రాసెను. ఈతఁడు చక్కని కవిత్వశక్తికలవాఁడు.

ఈతని భార్యపేరు మీరాబాయి. ఈమె మిక్కిలి విఖ్యాతి చెందిన భగవద్భక్తురాలు. భక్తవిజయము, భక్తమాల, బాట్‌వారి కవిత్వములు మొదలయినవానిలో నీమె మహిమలు విశేషముగా వర్ణింపఁబడినవి. ఈమె గొప్ప కవయిత్రి.

కుంభరాణా యేఁబది సంవత్సరములవఱకు మహావైభవముతో రాజ్యము చేసి తుదకుఁ దనకుమారుఁడగు ఉదయసింగుచేఁ జంపఁబడియె.

## రాయమల్లుఁడు.

(౧౪౭౪-౧౫౦౯).

పితృహంతకుఁడగు ఉదయసింగు రాజ్యమునకు వచ్చెను. కాని యాతఁడు కులకలంకుఁడగుటచే రాజపుత్రులందఱును అతనిపైఁ దిరుగఁబడి యాతని తమ్ముని రాజుగ నంగీకరించి యాతనితోఁ బోరాడసాగిరి. ఉదయసింగుఁడయిదు సంవత్సరముల వఱకుండి యీ పోరాటలోనే పిడుగుపడి మృతుఁడయ్యెను. తరువాత రాయమల్లుఁడు చితోడ్ సింహాసనముపైఁ గూర్చుండెను.

రాయమల్లుఁడు మిక్కిలి శూరుఁడు. ఈతని యన్నయగు పితృహంతకుఁడును అగు ఉదయసింగునకు నిద్దఱుపుత్రు లుండిరి. వారిద్దఱును తమ తండ్రి

రాజ్యము తమ కిప్పింప వలసినదని ఢిల్లీశ్వరుని నాశ్రయించిరి. అందుపై గొంత సైన్యముతో ఢిల్లీశ్వరుఁడు యుద్ధమునకు వచ్చెను. కాని రాజపుత్రులందఱును రాయమల్లునకే సహాయులయిరి. ఈ యుభయసైన్యములకును నాథద్వారము



రాజపుత్రుల యుద్ధసాధనములు.

వొద్ద ఘాసా యనుచోటఁ బోరు ఘోరముగా జరిగెను. ఉదయసింహుని కుమారులిద్దఱును సింహములవలెఁ బోరాడి రాయమల్లుని సేనలోని యనేకవీరుల సంహరించిరి. కాని తుదకు వారును, వారికిసహాయుఁడైవచ్చిన ఢిల్లీశ్వరుఁడును ఓడిపోయి పలాయితులైరి. ఇట్లు తన యన్నకుమారులు రాజ్యమునకై తనతోఁ

జోశాడి పరాభూతులయినను, రాయమల్లుఁడు సజ్జనుఁ డగుటచే వారిని క్షమి
యించి బుద్ధిచెప్పి కొన్నిగ్రామము లిచ్చెను.

మాలవదేశపు సుల్తాన్ అగు ఘియాసుద్దీన్ ఖిల్జీ అనువానిని ఈరాజు
సంపూర్తిగ నోడించెను. ఈతని కుమారుఁడగు పృథ్వీరాజు గుజరాత్ దేశపు
సుల్తానగు ముజఫర్‌శాహ యనువానిని జెఱఁబెట్టి యప్పనంబులు పుచ్చుకొని
వదలిపెట్టెను.

ఈరాజు గొప్పవైభవ మనుభవించినను, ఇతని ముగ్గురుకుమారులలో ననేక
కలహములఁ కలిగినందునఁ జరమదశయం దితనికి సౌఖ్యము లేకపోయెను.
కోపముచే నితఁడు తన ముగ్గురుపుత్రులను ఇంటినుండి వెడలఁగొట్టెను.
అందు జయమల్లపృథ్వీరాయ లనువారిద్దఱు తండ్రి బ్రతికియుండఁగనే చని
పోయిరి. ఆ దుఃఖముతో రాయమల్లుఁడు క్రీ. శ. ౧౫౦౯ లోఁ గీర్తిశేషుఁ
డయ్యెను.

## సంగరాణా.

## (౧౫౦౯ - ౧౫౩౦).

తండ్రి జీవితకాలమున నీతఁ డజ్ఞాతవాసములోనుండి, తండ్రి మరణానంత
రము రాజ్యారూఢుఁడయ్యెను. ఈతనికాలములోనే మేవాడ్ రాజ్యము
యొక్క వైభవము పరమావధిఁ జెందెను. ఈతఁడు బహు శూరుఁడగుటచే
ఢిల్లీశ్వరునితోడను, మాళవదేశపు నవాబుతోడను పదునెనిమిది పర్యాయ
ములు యుద్ధములుచేసి వారిని నోడించెను. ఒకానొక యుద్ధములో నాతఁడు
ఢిల్లీశ్వరుని కుమారునిఁ జెఱపట్టుకొని చితోడ్‌కుఁ దీసికొనిపోయెను. ఈరాజు
సాజ్ఞలో నెనుబదివేలస్వారులును ఏడుగురు గొప్పరాజులును, తొమ్మిదిమంది
రావులును, నూటనలుగురు ఠాకుర్, రావత్ అనుసరదారులును, అయిదు
వందల యేనుఁగులును మెలంగుచుండెను! మేవాడ్‌రాజ్యపుసీమ మిక్కిలి
పెద్దదియై యిఁకఁ గొన్నిదినములకు సంగరాణా చక్రవర్తియై మరల హిందూ

సామ్రాజ్య ముదయించు చిహ్నములు గానఁబడుచుండెను. కాని యాచిహ్నెలు విఫలంబులయ్యె. ఆకాలమునఁ దార్తరీదేశమునుండి బాబరను వాఁడు హిందూ దేశమునకు వచ్చెను. ఈతఁడు డిల్లీని స్వాధీనపఱుచుకొనిన తరువాత సంగ రాణాపైకి దండువెడలెను. ఫత్తెపూర్ సిక్రీయనుచోట సంగరాణాను బాబర్ ఓడించెనని చరిత్రకారులు వ్రాయుదురేగాని యాపరాభవమునకుఁ గల కారణమునుచెప్పరు. ఆయుద్ధమునందును సంగరాణాకు జయము కలుగ వలసినదే. సంగరాణామీఁదికి బాబరు క్రీ. శ. ౧౫౨౭వ సంవత్సర మున శ్రావణమాసములో నాగ్రామీఁదుగా సిక్రీమార్గమున బయలుదేఱి ముందుఁ బదునైదువందలస్వారులను బంపెను. వారందఱిని రాజపుత్రులు చెండాడిరి. అందుపై ముందుకువచ్చుటకు భయపడి తానున్నచోటికి రాజ పుత్రులువచ్చి తన్ను నిబ్బంది పెట్టకుండఁ జుట్టు కందకముఁ ద్రవ్వుకొని, సంగ రాణాను గెలిచినయెడల నిది యిచ్చెదను, అది యిచ్చెదను అని దేవునికి మ్రొక్కులుమ్రొక్కుచు బాబర్ కాలము వేచియుండెను. ఈయంశములు బాబరు స్వయముగా వ్రాసియుంచినాఁడు. పిదప మిత్రభేదము, స్వామి ద్రోహములవలనఁ గార్యము సాధింపనిశ్చయించెను. ఇట్లుభయసైన్యములును యుద్ధమునకుఁ గాలుద్రవ్వుచున్నపుడు సంధినిమిత్తమై వీరిరాయబారులు వారి యొద్దకును, వారిరాయబారులు వీరియొద్దకునుదిరుగుచుండిరి. అందు సిసోదీయను తురవజాతీయ రాయసీన్ ప్రాంతపురాజు సంగరాణాయొద్దనుండి బాబరువద్దకు రాయబారిగఁ బంపఁబడెను. కాని యామ్లేచ్ఛుఁడీతని కేమేమియాశ యాశలు చూపి చీలఁ దీసెను. ఈదేశద్రోహి సంగరాణాకు నావలి సమాచార మేమి యుఁజెప్పక, యిచ్చటి గుట్టంతయుఁ దురుష్కులకుఁజెప్పి, బాబరు తమమీఁది కిప్పుడే రాఁడని కొంతవఱకు నశ్రద్ధతో రాజపుత్రు లున్నసమయమున, బాబరు వారిపైకి వచ్చునట్లుచేసెను. ఇంతియకాదు. క్రీ. శ. ౧౫౨౭లోని ౧౬వ మార్చిదినమున నుభయసైన్యములకుఁ బోరు ఘోరముకాఁగా నీదేశఘ్నుఁడును

మహోపాపి బహిరంగముగా మ్లేచ్ఛసైన్యములతోఁ గలిసి రాజపుత్రులతోఁ బోరెను. ఇట్లుయుద్ధసమయమునందు మోసమును, ద్రోహమును కలిగినందున రాజపుత్రులకుఁ బరాభవము కలిగె; మహమ్మదీయులకు రాజ్యమువచ్చెను. అనఁగా నీయుద్ధమునందును హిందువులే తమరాజ్యమును తాముగెలిచి పరరాజులకు నప్పగించిరి! ఈ యుద్ధములో ననేకక్షత్రియులు వెనుదీయక ఘోరముగఁ బోరాడి రణశయ్యపై శాశ్వతనిద్రఁ జెందిరి. డొంగర్ పురాధీశుఁడగు ఉదయసింగ్ రావళ్ తన రెండువందల సహచరులతో మడిసెను! సాళుంబ్రాధిపుఁడగు రత్నఠాకుర్ తనమూఁడువందల చోండావతులనఁబడు సరదారులతోఁ గూడి హతుఁడయ్యెను! మార్వాడ్ రాజపుత్రుఁడగు రాయమల్లరాఠోడ్, మేరట్వారగు ఖేతసీరత్నా యనువారును, సోన్గడ్ రాజగు రావ్ రామదాస్, ఝాల్వాడ్ రాజగు జోఝాగోకుల్ దాస్ ప్రమార్, ఛవాన్ వంశీయులయిన చంద్రబాన్ మాణికచందు లనువారును నశించిరి. ఈక్షత్రియ వీరాగ్రేసరుల పవిత్రనామములు మనకందఱికిని సంస్మరణీయములు!

సంగరాణాకు పెక్కుగాయములుతగిలి యాతఁడు వ్యాకులుఁడయ్యెను. అతఁడీపరాజయమువలన మిక్కిలి చింతాక్రాంతుఁడై మ్లేచ్ఛునిజయింపక చితోడ్ గడముమీఁదికిఁబోవని ప్రతిజ్ఞపట్టి మేవాడ్ దేశపు పర్వతప్రాంతములలోనే వాసముచేసెను. ఈతఁడు మఱికొన్ని సంవత్సరములు బ్రతికియుండిన యెడలఁ దనప్రతిజ్ఞపూర్తిచేసి యుండుననుటకు సందేహములేదు. కాని యితఁడు పై సిక్రీయుద్ధమైన రెండుసంవత్సరములలోఁ బరలోకగతుఁడయ్యెను. సిక్రీయుద్ధము ౧౫౨౭ లో జరిగెను. ఈతఁడు ౧౫౩౦ లో మృతుఁడయ్యెను. మరణసమయమందు నీతఁడు బాబరును గెలువకయే తాను దేహము విడువవలసివచ్చెనందులకుఁ జింతింపఁగా నొద్దనున్న మంత్రులు "మీకోర్కె నేముతీర్చెద" మని చెప్పిరి; అందుపై నీతఁడు శాంతచిత్తముతోఁ బ్రాణముల విడిచెను.

ఈ సంగరాజు మిక్కిలిబలము, గౌరవర్ణము, విశాలనేత్రములు కలవాఁడు.

తనయన్నతోఁ బోరాడుచుండ నీతనియొకకన్ను పోయెను; ఢిల్లీబాదుషా హాయగు లోడీతోఁ బోరాడునపు డీతనియొక చేయిపోయెను; మతియొక యుద్ధమునందు గుండుతగిలి యీతనికాళ్లకు నపాయముగలిగెను; ఇవిగాక యీతనికి యుద్ధములో నెనుబదిగాయములు తగిలిన మచ్చలుండెను. సచ్ఛూరున కివియన్నియు భూషణములుకదా!

## రత్నసింహుఁడు.

(౧౫౩౦ - ౧౫౩౫).

సంగరాణా మరణానంతర మాతని కుమారుఁడగు రత్నసింహుఁడు రాజయ్యెను. తండ్రివలెనే ఈతనియందును శౌర్యపరాక్రమాదిగుణములు వాసము చేయుచుండెను. సమరభూమియే తనకువాసస్థానమనియెంచి చితోడ్ మహాద్వారమెప్పుడును మూయకుండఁగ నాజ్ఞాపించెను. మ్లేచ్ఛుల గర్వమణఁపక కోటలలో సౌఖ్యమనుభవింపనని నిశ్చయించెను. అందువలననే సిక్రీయుద్ధములోఁ గలిగిన జయము బాబరునకు విశేషముగా లాభకరముకాదు. తండ్రి యొక్క సంపూర్ణరాజ్యము రత్నసింహుని స్వాధీనములోనె యుండెను. కాని యీరాజు అయిదు సంవత్సరములుమాత్రము రాజ్యముచేసి స్త్రీవిషయక మాత్సర్య దోషజన్యమైన ద్వంద్వయుద్ధములోఁ దనమిత్రుఁడగు బుందీరాజు చేతనె చంపఁబడియె.

## విక్రమాజితుఁడు.

(౧౫౩౫).

విక్రమాజితుఁడు రత్నసింహుని తమ్ముఁడు. ఈతఁడు మూర్ఖుఁడు; తెలివిలేనివాఁడు. రాజ్యవ్యవస్థయందు నెంతమాత్రము శ్రద్ధలేనివాఁడయి తనవైభవమును చెడఁగొట్టుకొనియె. ఈసమాచారమంతయుఁ దెలిసి గుజరాత్ దేశపు నవాబగు బహాదుర్ శాహ చితోడ్ గడము మీఁదికి దండెత్తివచ్చెను. వానిని ఈ రాజు చితోడ్ కుఁ గొంతదూరమున నెదిరించెను. కాని యీతని సైన్య

ములో వ్యవస్థలేదయ్యె; పదాతులుతప్ప విశేషముగా స్వారులులేరైరి. అటు తురుష్కులయొద్ద ఫిరంగులును, పోర్చుగీజ్ అధికారులును ఉండిరి; సైన్యమంతయు కవాత్ (drill) నేర్చియుండెను! మందోడ్ ఠాకుర్ అనఁగా, జోధ్‌పురము రాజధానిగాఁగల మార్‌వాడ్ దేశపురాజు మహమ్మదీయులకె సహాయము చేసెను. అందుచే మహమ్మదీయులకు జయముకలిగెను. రాజు చితోడ్ మీఁదికిఁ బోవలసిన వాఁడాయెను. మ్లేచ్ఛులు కోటను ముట్టడించిరి. ఈవార్త తెలియఁగనే యనేక రజపూత్ రాజులు చితోడ్ గడమును రక్షించుటకువచ్చిరి. మేవాడ్ రాజ్యమునందు నభిమానముగల క్షత్రియులందఱు మహాశౌర్యముతోఁ బోరాడిరి. విక్రమాజితుని తల్లియైన జవాహిర్‌బాయి యను వీరవనిత, పురుషవేషము వేసికొని, గుఱ్ఱముపైనెక్కి ఘోరముగాఁబోరి వీరస్వర్గమునకుఁ బోయెను. ఇట్లు రాజపుత్రులెంత పరాక్రమముఁ జూపినను వారికి జయము కలుగలేదు. మ్లేచ్ఛులయొద్దనున్న ఫిరంగులసహాయము వలనను, గోడకు సొరంగములుచేసి యందుఁ దుపాకిమందు నింపి దానికి నిప్పంటించి నందునను కోటగోడలు పడిపోయెను. ఇట్లిఁక తమకు జయముకలుగుట యబద్ధమని తెలిసినతోడనే రాజపుత్రులు చితోడ్ గడముపై రెండవజోహారుచేసిరి! పదుమూఁడువేల రాజపుత్రస్త్రీ లగ్నిఁబ్రవేశించిరి! పురుషులు శత్రువులపై నొక్కపెట్టున పడి హతులైరి. మొత్తముమీఁద నీజోహారులో ముప్పదిరెండువేల రాజపుత్రజనము మడిసెను!!! ఇది చితోడ్ గడముమీఁద రెండవజోహారు. ఈ మహాసత్రములో నుండి రాజయిన విక్రమాజితుఁడును, అతని తమ్ముఁడైన ఉదయసింగుఁడును తప్పించుకొని వెలువడిరి.

బహదురుషాహాకు నిర్మానుష్యమును, ప్రేతభూయిష్ఠమును అగు కోట స్వాధీనమాయెను. కాని యాకోట యతనికిఁ బెక్కుదినములు దక్కినదికాదు. సంగరాణాను ఓడించినప్పటికిని బాబరు గుణజ్ఞుఁడగుటచే సంగరాణాయెడ గౌరవము కలిగియుండెను. ఈయంశమును అతఁడు తన దినచర్యాగ్రంథములో

వ్రాసియుంచెను. ఆతని కుమారుండగు హుమాయూన్‌కును మేవాడ్ రాజుల యెడ వారిపౌరుషమునుబట్టి మిక్కిలి పూజ్యభావము కలిగి యుండెను. అందు పై నాతఁడు సైన్యమును దీసికొని చితోడుకు సహాయముచేయుటకై వచ్చెను. కాని యాతఁడు వచ్చువఱకే జోహార్ పూర్తియై, బహాదుర్‌శాహచేఁ గోట యాక్రమింపఁబడియె. బహాదురుశాహ కోటలోఁ బదునైదుదినములు మాత్ర ముండెను. ఇంతలో హుమాయూన్ వచ్చి వానిని తఱిమివేసి విక్రమాజితుని మరల సింహాసనాధిష్ఠితుఁజేసెను. అంతటతోనైన విక్రమాజితునకు బుద్ధిరా లేదు. వాని మౌర్ఖ్యమునకు విసివి, సరదారులు వానిపైఁ దిరుగఁబడి వానిని సంహరించిరి.

బనబీర్.

సంగరాణాయొక్క యన్నయైన పృథ్వీరాజు దాసీపుత్రుఁ డీబనబీరుఁడు. విక్రమాజితుని తమ్ముఁడగు ఉదయసింహుఁడు రాజ్యమునకుఁ గర్తయై యున్నం దున నాతఁడు పెద్దవాఁ డగువఱకు నీబనబీరుఁడు రాజ్యముచేయునట్లు సర దారు లేర్పాటుచేసిరి. కాని బనబీరునకు రాజ్యకాంక్ష యధికమై యాతఁడు శిశువైన యుదయసింహునిఁ జంపింప యత్నముచేసెను. కాని తలిదండ్రులు లేని యా పిల్లవానిని బెంచుచున్న పన్నాదాయి యను సాధ్వీలలామకు నీ వర్త మానము తెలిసి, యామె యాశిశువుస్థలములోఁ దన కుమారునిఁ బరుండఁబెట్టి యారాజును మఱియొకస్థలమునకుఁ గొంపోయి రక్షించెను. అచ్చట నాతఁడు పెద్దవాఁడయి యితర రాజుల సాహాయ్యముగొని క్రీ. శ. ౧౫౪౦ లో బనబీరుని వెడలఁగొట్టి తనరాజ్యమును సంపాదించెను.

ఉదయసింహుఁడు.

(౧౫౪౦ - ౧౫౭౨).

ఉదయసింహుఁడు రాజ్యారూఢుఁడయిన సంవత్సరముననే రాజకోటలో నొక మహాపురుషుఁ డుదయించెను. ఆతఁడు తరువాత హిందూదేశమునకుఁ

క్రవర్తియయ్యెను. ఈతఁడు విఖ్యాతుఁడగు అగ్బర్ చక్రవర్తియని వేఱుగఁ జెప్పవలయునా?

ఉదయసింహుఁడు దుర్బలుఁడు; విషయలంపటుఁడు. అక్బరు డిల్లీపట్టణమును స్వాధీనపఱుచుకొని రాజపుత్రులందఱిని జయింప బయలుదేఱి క్రీ. శ. ౧౫౬౭లోఁ జితోడుపై యుద్ధమునకువచ్చెను. ఈసమాచారము తెలిసినతోడనే పిఱికిపందయైన ఉదేసింగుఁడు పాఱిపోయెను. కాని యా తనితోఁ జితోడ్‌లోని శౌర్యమును, పరాక్రమమును పోయినదికాదు. అనేకరాజపుత్రరాజులు జీవితాశలఁ ద్యజించి ఘోరముగఁబోరిరి. బేద్‌నూరు జయమల్లుఁడును, కేళవాధీశుఁడగు పట్టాయనువాఁడును చేసిన యుద్ధమునుజూచి అక్బరుగూడ మిగుల నాశ్చర్యముఁజెంది వారికి 'మూర్తీభవించిన సంగ్రామదేవత'లని నామమిడెను. వీరు గుండుతగిలి హతులైరి. వీరియద్వితీయపౌరుషమునకై తనకు వారియెడఁ గలిగిన గౌరవమును సూచించుటకై యక్బరు వారిప్రతిమలను జేయించి తనరాజభవనమం దుంచెను! ఇందు జయమల్లునితోఁగలసి యనేక స్త్రీలు యుద్ధరంగమునఁ బోరాడుచుండిరని యక్బరు వ్రాసియున్నాఁడు.

'సూరజ్ దరవాజా' (సూర్యద్వారము) అను ద్వారమువద్ద సాహిదాస్ భోండాయనునాయకుఁడు ఘోరముగాఁబోరాడి వీరశయనముచేరెను. తరువాత న్యాయాధిపత్యము, పైఁ బేర్కొనఁబడిన పట్టాయనువానికి వచ్చెను. ఆతఁడు పదునాఱు సంవత్సరములవాఁడు; ఆతనితండ్రి యప్పుడే మృతుఁడయ్యెను. ఈ కారణములచే నాతఁడు గతధైర్యుఁడగు నేమోయని, శూరపత్నియు, శూరమాతయునగు నాతనితల్లి కుమారుని యొద్దకువచ్చి, 'నాయనా! చింతపడకుము. చితోడ్‌సంరక్షణార్థమై మనవంశము నిర్వంశమైనను చింతలేదు. ధైర్యముతో యుద్ధముచేయుము' అని ధైర్యముచెప్పి, యంతటితోఁ బోక తనకోడలును, దానును ఖడ్గపాణులై యుద్ధముచేయసాగిరి!

ఇట్లు రాజపుత్రు లెంత పట్టుదలతోఁబోరినను వారిని జయలక్ష్మి వరింపదయ్యె.

రాజపుత్రులు మూఁడవతడవ చితోడ్ గడముపై జోహార్ చేసి కోఁటతలుపులు తెఱచి శత్రువులపైఁబడిపోతులైరి. కోట యక్బరుస్వాధీనమయ్యెను. కాని యీతడవ యిందు ననేకజను లుండిరి. చితోడ్ లోఁ బ్రవేశించి యక్బరు అందఱి జనులను పశువులవలె నఱికించెను. అతనిరాజ్యకాంక్ష యను అఁకలికి ముప్పది వేలజనులు బలిరైరి. ఇంతియకాదు. రాజవంశజులయిన తొమ్మిదిమంది రాణులు, అయిదుగురు రాచకన్నియలు, ఇద్దఱు శిశువులు, సరదారుల భార్యలు రాణాయొక్క యితరాప్తబంధువులు అక్బరుచేఁ జంపఁబడిరి! హిందూ దేవాలయములు, మందిరములు పడఁగొట్టఁబడియె; ఆయాస్థలములందు మసీదులు కట్టఁబడియె. అచ్చటిదేవియొక్క దేవాలయములోని నగారాలు, నగలు, తలుపులు ఆగ్రాకుఁబంపఁబడియె. సజ్జనుఁడని విఖ్యాతిగల యక్బరు చక్రవర్తి యిట్టిరాక్షస కృత్యముచేయుట యెంతయు వింతగనున్నది. ఇది యితని చరిత్రలోని యొక గొప్పకలంకము. విక్రమశకము ౧౬౨౪-వ సంవత్సర చైత్రశుద్ధఏకాదశి యాదివారమునకు సరియైన క్రీ. శ. ౧౫౬౮వ సం నెలలోఁ బైనివర్ణింపఁబడిన యమానుషహింస చితోడ్ గడముపై జరిగెను.

కోటలోనుండి పాఱిపోయిన యుదయసింహుఁడు అరణ్యములోఁ గొంత కాలముండి, ఆరావలీపర్వతములలోఁ దనవాసస్థాన మేర్పఱుచుకొనెను. ఆ పర్వతప్రాంతమున నాతఁ డుదయసాగర మనుభవ్యతటాకమును నిర్మించెను. అచ్చటనే యాతఁడు ఉదయపుర మను గ్రామమును గట్టించెను. అది క్రమక్రమముగ నభివృద్ధిరై ప్రస్తుతము మేవాడ్ దేశపు రాజధానియగు ఉదేపూర్ పట్టణముగఁ బరిణమించెను. ఈయుదయసింహుఁడు పరాభవ దుఃఖముతో క్రీ. శ. ౧౫౭౨లో మృతుఁడయ్యెను.

మహమ్మదీయ చరిత్రకారు లక్బ రొక్కతడవయె చితోడ్ మీఁదికిఁ బోయినట్లును, పైనివర్ణించినట్లు దానిని ధ్వంసముచేసినట్లును వర్ణించియున్నారు. కాని యంతకుఁబూర్వ మెుక్కసారి యాతఁడు చితోడ్ ముట్టడించినట్లును,

ఉదయసింహునిభార్య యగు వీరాబాయిచే నోడింపఁబడినట్లును రాజపుత్ర చరిత్రలవలనఁ గానవచ్చుచున్నది. ఈవిషయమైన మూలగ్రంథములనుజూచి కీర్తిశేషురాలగు శ్రీమతి భండారు అచ్చమాంబయక్కగారు తమ 'అబలా సచ్చరిత్రరత్నమాల' యొక్క ప్రథమభాగములో 'వీరాబాయి' చరిత్ర సవిస్తరముగా నిచ్చినారు. దానిని ఇచ్చట నుదాహరించుచున్నాను.

వీరాబాయి.

సంగ్రామే సుభటేన్ద్రాణాం కవీనాం కవిమణ్డలే
దీప్తిర్వా దీప్తిహానిర్వా ముహూర్తాదేవ జాయతే.*

"వీరాబాయి స్వశౌర్యమువలన అక్బరునోడించి తనభర్తను విడిపించెను. అక్బరుబాదుషా చితూరుపై రెండుపర్యాయములు దండెత్తినను ఫెరిస్తా యను ఇతిహాసకారుఁడు వ్రాసినగ్రంథమునం దొకసారి దండు వెడలుటయే వర్ణింపఁబడియున్నది. స్వజాతీయుఁడగు బాదుషాయొక్క పరాభవము నాతఁడెట్లు వ్రాయఁగలఁడు? ఒకానొకరజపూతస్త్రీచే నోడింపఁబడి పలాయితుఁడైనందున బాదుషాకీర్తికి సంభవించిన కలంక మగపడకుండుటకై తురుష్కులైన యితిహాసకారు లెవ్వరును చరిత్రములలో నీసంగతి వ్రాయనే లేదు. కాని యీ సమయమునందు చితూరు దరబారునందున్నవా రప్పటి యుద్ధమును చక్కఁగా వర్ణించియున్నారు.

"అక్బరుబాదుషా తన యమితసైన్యముతో చితూరుపై దండువెడలి నప్పు డచట నుదయసింగనురాజు రాజ్యముఁ జేయుచుండెను. ఉదయసింగు రాణాయంతటి పిఱికిరాజపుత్రుఁడు మఱియొకఁ డుండఁడు. అక్బరుబాదుషా దండెత్తివచ్చినవార్త విని రాణాగారికి భయమువలన దేహకంపమెత్తెను.

* యుద్ధమునందు వీరుల శౌర్యాశౌర్యములును, కవిసంఘమునందు కవుల యొక్క చాతుర్యాచాతుర్యములును ఒక ముహూర్తములోనే వెల్లడియగును.

కాన అతని విజయులగు తురుష్క సేనలతోడఁ బోర సాహసింపలేఁడయ్యె. అందుపై నాతనికూరులగు సరదార్లందఱు కుంభరాణా మొదలగు నాతని పూర్వుల ప్రతాపమును దెలిపి యుద్ధమునకుఁ బురికొల్పసాగిరి. కాని యతఁడు యుద్ధమునకు వెడలఁ డయ్యెను. రాణా సంగ్రామమునకు వెఱచుటఁగని యాతని సరదార్లు మిగుల నాగ్రహించి “మీరు శత్రువుల నెదిరించి యుద్ధము చేయకుండినయెడల మిమ్ము రాజ్యభ్రష్టులను జేయుదుము” అనిరి.

“ఇట్లందఱు నేకరీతిగాఁ జెప్పినందువలన విధిలేక భయముచే దేహము వడఁక నా యధైర్యశిరోమణి వీరులగు తనసైనికులతో యుద్ధభూమిని సమీపించెను. కాని సాగరమువలె నలుగడల నిండియున్న యవన సైన్యములం గని భీతిచేఁ గొంతవడి నేమియుఁ దోఁపక నిలుచుండెను. తదనంతర మెటులో యా రాజు తనసైన్యములకుఁ యుద్ధమున కనుజ్ఞయిచ్చెను. రజపూత శూరసైనికులందఱు మిగుల శౌర్యముతోడఁ బెనఁగఁజొచ్చిరి. వారు జయకాంక్షవలన నెంత పోరినను ముఖ్యనాయకుని యధైర్యము వలనను, పర బలాధిక్యము వలనను వారికి జయము కలుగుమార్గము కానరాకుండెను. చితూరు కోట కాశూరు లెంతశౌర్యముఁ గనఁబఱచినను అదియంతయు నిష్ఫలమై ఉదయసింహునకుఁ బరాభవము కలిగెను. అక్బరుబాదుషా తత్క్షణమే యా పిఱికిరాజును బట్టి చెఱలోనుంచెను. అందుపైఁ జేయునదిలేక రజపూత వీరులు గ్రామమునకుఁ దిరిగిపోయిరి. వారిలో కొందఱు తమయిండ్ల కరుగఁగా వారి స్త్రీలు పరాభవమునొంది వచ్చిన భర్తలను, పుత్రులను, సోదరులను లోపలికి రాకుండ తలుపులుమూసి వారిని తిరస్కరించుచు నిట్లనిరి. “రజపూతకులమునందు మీరేల జన్మించితిరి? సిగ్గులేక మీ మొగములు మరల మాకుఁ జూపకుఁడు. సంగ్రామ మరణముగాని, జయముగాని వడసిననే మీకుకీర్తియు, యశమును కలుగును.”

“ఉదయసింహుని తురుష్కులు చెఱఁబెట్టిరని తెలియఁగా, రాజభవనము

వందంతట నెటుచూచినను దుఃఖముగానే యుండెను. అప్పుడు రజపూతవీరులందఱు సభచేసి "ఉదయసింహమహారాజుగారి నెటుల విడిపింపనగు? శత్రువుల నోడించుటయెట్లు" అని చింతింపసాగిరి. ఇట్లు వారనేక రీతుల విచారించి, తోఁచక చింతాక్రాంతులై కొంతవడి యూఱకుండిరి. ఆసమయమునందాపట్టణమంతయు మిగుల నుదాసీనముగానుండెను. కాని మరల క్షణకాలములో నొకయువతి వారి నానందసాగరమునం దోలలాడించెను. ఆస్త్రీ ఉదయసింహుని పత్నియగు వీరాబాయియే! 'నాభర్తను మ్లేచ్ఛులు కైదుచేసిరి. రజపూతు లోడిపోయిరి, చితూరిఁక తురకల యధీనమగును, మనమందఱమువారికి స్వాధీనులమగుదు" మనునట్టి విచారము లనేకము లామె మనంబున నుద్భవింపసాగెను. రాజభవనమునందు నిరుపయోగములై పడియున్న యనేకశస్త్రము లామెకంటఁబడఁగా నామెయందు నడఁగియున్న శౌర్యాగ్ని ప్రజ్వలింపసాగెను. అంత నామెనిలువక, యుద్ధమున కనుకూలమగు పురుషవేషముందాల్చి యనేకాస్త్రశస్త్రములను ధరియించి కాళికాదేవి ప్రత్యక్షమైనదో యనునట్టుగా రాజపుత్రులసభలోకిఁ బ్రవేశించెను.

"సుకుమారమగు మేనితోఁ బురుషవేషధారిణియు, శస్త్రధారిణియునైవచ్చిన వీరాబాయినిఁ గనినతోడనే యచటి రజపూతవీరు లాశ్చర్యమగ్నమానసులైరి. స్వాతంత్ర్యేచ్ఛయు, స్వమతాభిమానమును హృదయమునందుండుటవలన నామెకాంతి మిగులప్రజ్వరిల్లెను. ఆమె మిగులరోషముతో నచటఁ గూడియున్న రాజపుత్రులతో నిట్లనెను. "శూరాగ్రేసరులగు రజపూతులారా! మీ రిట్లధోముఖులై చింతిల్లుచు నెవరికొఱకు నిరీక్షించుచున్నారు? మీయందలి శౌర్యధైర్యాదిక్షత్రియగుణము లెటుపోయెను? చితూరుసంస్థాన మిపుడే పౌరుష హీనమయ్యెనా? అచటి రజపూతవీరులందఱు కేవలము శ్వాసోచ్ఛ్వాసములఁగల పురుగులైపోయిరా? వీరమాతయగు భారతవర్షము నేఁడే నిస్తేజమైపోయెనా? మీరు శూరులవంశములయం దేలజన్మించితిరి? అట్లు జన్మించినవారు

వైరులకు వెన్నిచ్చి యేలపాఱివచ్చితిరి? ఇప్పు డింద కేకీభవించి యేమి చింతించెదరు? చిత్తూరు నలంకరించువాఁడును, మన ప్రాణసమానుఁడు నగు మహారాజును శత్రువులు కారాగృహబద్ధునిఁ జేయఁగా స్త్రీలవలె చేతులకు గాజులు తొడుగుకొని యింట నుండుటకేల సిగ్గుపడకున్నారు? నేనిట్లు బాహాటముగా మిమ్ము నవమాన పఱుచుచుండఁగా మీరువిని యెట్లు సహించె దరు? ఇంతకంటె యుద్ధముచేసి వైరులచేఁ జంపఁబడుట సర్వోత్తమము కాదా? శూరాగ్రేసరులగు సరదారులారా! మీ రిట్లుపేక్ష చేయకుఁడు! మీకుఁగలిగిన పౌరుషహీనత యనుకళంకమును సంపూర్ణముగాఁ గడుగుఁడు. మీకుఁగల శౌర్యధైర్యాదిగుణముల నగపఱుప నిదియే సమయము. లెండు, నడువుఁడు. మఱియొకరి రాకకు నిరీక్షింప నేల? ఒరలనుండి మీమీఖడ్గ ములను తీయుఁడు. "జయహర! జయమహాదేవ," యనురణఘోష మొన ర్పుఁడు. తీవ్రగతినరిగి సంగ్రామరంగమునందు మీమీ ప్రతాపములను గనఁ బఱుపుఁడు! నేనిదేయుద్ధమునకుఁ బోవుచున్న దానను."

"ఇట్లని యామె యొకగుఱ్ఱము నెక్కెను. అప్పుడు రజపూతులందఱు తమ యౌదాసీన్యములనువదలి యుద్ధసన్నద్ధులైరి. మేఁకలుగానున్న యావీరులు వీరాబాయి ప్రోత్సాహముచే శార్దూలములుగా మాఱిరి! అందువలన నాభీమ పరాక్రములందఱును నేకవాక్యగా జయఘోష మొనర్చిరి. అపుడు వారందఱు "యుద్ధమునందు శత్రువులను జంపెదము, లేక వారిచేఁ జచ్చెదమేకాని పగ ఱకు వెన్నియ్య" మని ప్రమాణములుచేసిరి.

"వీరాబాయియు వారియావేశమును, దృఢనిశ్చయమును గని విశేష ప్రోత్సాహముగలదియై యుద్ధమునకువెడలెను. ఆమె తనసైన్యములతో నాకస్మి కముగా నాఁకొన్న యాఁడుసింగమువలె శత్రుసైన్యములపైఁబడెను. అందు వలన జయానందమునం దోలలాడుచుండిన యక్బరుసైన్య మిూత్రిభళయమున శౌర్యఁజాలక నలుదిక్కులను బాఱఁ దొడఁగెను. వారిని బోనియ్యాక పట్టు

కాని వీరాబాయి సైనికులు, కాలాంతరుద్రులభంగి వంతమునొందింపసాగిరి. వారికి నిరుత్సాహకరముగా వీరాబాయి తానును అనేకతురుష్కులను వీర స్వర్గమునకు నంపుచుండెను.

"ప్రళయాగ్నినిబోలిన యామెపరాక్రమముగని యక్బరత్యాశ్చర్యమును బొందెను. ఆయన జడునివలె నేమియుఁదోఁచక నిశ్చేష్టితుఁడై నిలువఁ బడెను. అప్పు డాక్షత్రియవీరు లుత్సాహంబు రెట్టింప మ్లేచ్ఛసైన్యముల ననేకరీతుల బాధింపఁదొడఁగిరి. బాదుషా తనకుజయముకలుగుటకు మాఱుగా నపజయమగుటఁగని చేయునదిలేక సంధినిఁ దెలుపుపతాకమెత్తెను. తత్క్షణమే ఉదయసింహుని సహితము బంధవిముక్తినిఁజేసెను. పరాక్రమవంతురాలైన వీరాబాయివలన మహాబలవంతుఁడైన అక్బరు నంతటితురుష్కప్రభువు సహితము జయకాంక్షనుమాని హతశేషులగు వారింగొనిమరల తనపురికేగవలసినవాఁడాయెను. తదనంతర మారజపూతులందఱును విజయానందముతో సింహనాదములుచేయుచు వీరాబాయి ననేకవిధములఁ గొనియాడుచు వీరాబాయితోడను, ఉదయసింహునితోడను పురప్రవేశముచేసిరి. అంతకుఁబూర్వము తేజోహీనమైన చితూరుపట్టణము రాణిగారి విజయవార్తవిని మరల తనదివ్య తేజమును బొందెను. జను లందఱును పరమానందభరితులైరి. వీరాబాయి జయమునుగాంచి విశేష తేజస్విని యయ్యెను. పురవాసులంద ఱావీరరజపూతులను, రాణాగారిని, రాణిగారిని, మంగళవాద్యములతో నెదుర్కొని వారిపై పుష్పవృష్టిగురిపించుచు రాజభవనములోఁ బ్రవేశపెట్టిరి! ఇట్లు జన్మమందెప్పుడును యుద్ధమెఱుంగనిదయ్యును ఒకక్షణములో తనశౌర్యముచే వీరాబాయి "గొప్పశూరస్త్రీ" యన్న బిరుదునుబొంది, ప్రస్తుతచరిత్రమునకు శిరోలేఖముగానున్నశ్లోకార్థమునే స్థిరపఱిచెను."

## ప్రతాపసింహుఁడు.

(౧౫౭౨-౧౫౯౭).

ఉదయసింహుని కుమారుఁడు ప్రతాపసింహుఁడు. ఇతఁడు సిసోదియవంశ

మునకు లలామభూతుఁడయిన మహాపురుషుఁడు. మేవాడ్ రాజ్య మత్యంత దీనావస్థలో నున్నకాలమునఁ బుట్టి, విపత్తులపై విపత్తులువచ్చినను అధైర్య పడక అక్బరువంటి మహాబలాఢ్యుఁడును, సంపన్నుఁడును, సార్వభౌముఁడును అగుశత్రుఁ డెన్నియాశలు చూపినను వానిని గడ్డిపోరకలవలెఁ దృణీకరించి, యిరువదియైదు సంవత్సరములవఱకు శత్రువుతో నేకాధ్వరముగఁ బోరి శత్రు జనులచేతఁ గూడ 'ధన్యుఁ' డని పేరొందినవాఁడు!

క్రీ. శ. ౧౫౭౨-లో నీతఁడు రాజ్యారూఢుఁడయినప్పు డెటుచూచినను కష్టములే కాన వచ్చుచుండెను. ఏలుటకు రాజ్యము లేదు. యుద్ధము చేయుటకు సైన్యము లేదు. సైన్యము సంపాదించుటకు బొక్కసములో ధనము లేదు. ఇఁక శత్రువును జూచిన నాతఁ డసంఖ్యాధనమును, అపరిమితసైన్యములును గల డిల్లీసార్వభౌముఁడు. ఇతరరాజపుత్రులు సాయమునకు వచ్చెదరని యాస పడకుండ రాజనీతినిపుణుఁడైన యక్బరు వారిలో భేదముకల్పించి యనేకులను జీలఁదీసెను. ఇదివఱకు మేవాడ్ రాజులకు ముఖ్యసహాయకులుగా నుండిన మార్వాడ్ (జోధ్‌పూర్), అంభేర్, బికానీర్, బుందీ మొదలయిన సంస్థానాధీశ్వరులందఱును అక్బరుపక్షమును అవలంబించిరి. ఇంతియకాదు. ప్రతాపుని తమ్ముఁడు సాగరజీ యనువాఁడు కూడ మొగలులలోఁ జేరెను! ఇట్లెటు చూచినను ప్రతాపునకుఁ బ్రతికూలదైవము తప్పమ టేమియుఁ గానరాదయ్యె. అయినను ఆపురుషుఁడు ధైర్యమును విడిచినవాఁడుకాఁడు. గ్రంథాదులలో వ్రాయఁబడియున్న తన పూర్వులయొక్క శౌర్యప్రధానములయిన యితిహాసములను చదువుటవలనను, భాట్ అనఁబడు భట్రాజులచేఁ జెప్పఁబడు తన పూర్వుల యశోగానమును వినుటవలనను, ఆతని మనస్సులోని మ్లేచ్ఛవిషయక ద్వేషమును స్వదేశవిషయకభక్తియు, స్వవంశవిషయకాభిమానమును దినదినము నధికాధికముగఁ బ్రజ్వరింపఁ దొడఁగెను.

ఆతఁ డరణ్యములలో వాసముచేయుచున్నందున ననేకకష్టముల నను

భవించెను. ఒక్కొక్కప్పుడరణ్యములోఁ బైన నేమియు నాచ్ఛాదనము లేక బయల బిడ్డలతోను భార్యతోను నిదురించుచుండె; ఒకప్పుడు భక్ష్యపదార్థము లేమియు దొరకనందున వన్యములయిన కొఱ్ఱలు రాగులు మొదలయిన క్షుద్ర ధాన్యములతోఁ జేయఁబడిన రొట్టెలు తినుచుండెను; ఇంకొక్కప్పుడు భోజనమునకుఁ గూర్చుండినతోడనే శత్రువులు వచ్చిరని తెలిసి దానిని అటులనే విడిచి యుద్ధమునకుఁ బోవును; మఱొకప్పుడు తనభార్యాపుత్రులు శత్రువులచేతఁ బడకుండ వారిని పర్వతగుహాలలోను, గనులలోను దాఁచవలసినవాఁడాయెను. ఇట్లొక్కటియా? లెక్కింపరాని సంకటముల ననుభవించెను! ఈతఁ డిట్టి కష్టములలో నున్నాఁడని తెలిసి యక్బరు 'నీవు నాకు శరణుచొచ్చిన నీరాజ్యమంతయు నీకిచ్చివేసెదను' అను వర్తమాన మంపెను. కాని యీశూరాగ్రేసరుఁడు 'బాప్పారావల్ వంశమునఁ బుట్టి శత్రువునకు లోఁబడి నావంశమునకు నప్రఖ్యాతి తెచ్చెడికార్యము నావలనఁ గాలత్రయమందును గాఁజాలదని' దానికిఁ బ్రత్యుత్తర మంపెను! శూరుని ధైర్యస్థైర్యాదికములపరీక్ష సంకట సమయమననే కదా తెలియును? ఎన్ని కష్టములనైనను, ఎన్ని విపత్తులనైనను ధైర్యముతో నెదిరించి భీతిఁజెందక, పర్వతమువలె స్థిరముగను, సముద్రునివలె గంభీరముగను వెలుంగుచున్న ప్రతాపునికీర్తిని ఆరావలిపర్వతములోని ప్రతిగుహాయు, ప్రతినదియు, ప్రతిస్థలమును గీర్తించి ప్రతిధ్వని చేయసాగెను. అందుచేఁ గొందఱు రాజపుత్రులు తాము ప్రతాపునికి సాయము చేయకుండుట తప్పుగా నెంచి, యాతనితోఁ గలిసి శత్రువులతోఁ బోరుటకు సంసిద్ధులైరి. అట్లువచ్చినవారిలోఁ బ్రతాపుని సవతి తమ్మునికుమారులును, సాళుంబ్రాధీశుఁడగు టోండావంశీయరాజున్ను, డెల్‌వాడాధీశుఁడగు చిన్నసంస్థానికుఁడును ముఖ్యులు. ఇంకను చిన్నచిన్నరాజు లనేకులుండిరి. ఇట్టిరాజులలో దూరదర్శులును, అనుభవము గలవారును అగు కొందఱిని నొకమంత్రిమండలముగాఁ జేర్చుకొని ప్రతాపుఁడు మేవాడ్ రాజ్యమును సాధించుటకు సమకట్టెను.

ప్రస్తుతము తనయొద్ద సైన్యము విశేషముగాలేనందున మొగలులసైన్యముతో నెదుటఁ బడి పోరాడుట లాభప్రదము కాదనితలఁచి, శత్రువులరాజ్యమునకు నుపద్రవము కలుగఁజేయఁజొచ్చెను. తానున్న కుమల్ నేర్ అనుస్థలమునను, గోగుండా అనుస్థలమునను, గట్టిదుర్గములను గట్టించి వానిపైదుర్గాధీశుల నేర్పఱిచెను. శత్రుదేశమునందలి ప్రజలందఱును గ్రామములువిడిచి పర్వతప్రాంతములలోనికిఁ బాఱిపోవునట్లుచేసెను. ఇట్లు చేసినందున ఆప్రదేశమంతయు నిర్మానుష్యమై, వ్యవసాయములన్నియు నడుగంటెను. పంటలు పండవలసిన పొలములలో నిలివెడు గడ్డిపెరిఁగెను! జనులతోడను, రథవాహనములతోడను క్రిక్కిఱిసి నడుచుండవలసిన త్రోవలన్నియుఁ దుమ్మచెట్లతోడ నిండిపోయెను; రాజమందిరములలోను ధనికగృహములలోను హింసకమృగములు వాసముచేయఁ దొడఁగెను! ఇట్లాప్రదేశమంతయుఁ జిట్టడవియైనందున మొగలులకు నచ్చటినుండివచ్చెడి పన్నులు మొదలయినవి నష్టమగుటయేగాక యా త్రోవను పోయెడిమొగలుల సైనికులను బాధపెట్టుటకును, దస్తుసామగ్రి యితర సరకులు మొదలయినవానిఁ గొల్లగొట్టుటకును మిక్కిలి వీలయ్యెను. సూరత్ పట్టణమునుండి డిల్లీకిఁ బోయెడిబాట మేవాడ్ యొక్క యీప్రాంతములో నుండియే పోవుచుండెను. ఆదినములలో డిల్లీశ్వరునికిఁ గావలసిన మిక్కిలి వెలగల సీమసరకులన్నియు సూరత్ నుండి యీమార్గముననే డిల్లీకిఁ గొంపోఁబడుచుండె. అందుచే నాసరకులలో నొక్కటియైనను డిల్లీశ్వరునకుఁ జిక్కకుండఁ బ్రతాపుఁడు త్రోవలోఁ గొల్లగొట్టును. ఈప్రకారము ప్రతాపుఁడు తన ప్రబలశత్రుని బాధపెట్టఁదొడఁగెను.

ఆకాలమందు ననేకరాజపుత్రులు మ్లేచ్ఛులతో స్నేహముచేసి హిందువులకు విరోధులగుటయేకాక తమయాఁడుబిడ్డలను అక్బరునకు నతనిబంధువులకు నిచ్చి యాతనివలన పదవులును, బహుమానములును, జాగీరులును బడయుచుండిరి. కొందఱు డిల్లీశ్వరునియనుగ్రహముఁ బడయుటకై స్వమతమును విడిచి మహమ్మ

మీయలైరి. ఈ సంగతులన్నియుఁ జూచి యట్లు తమ స్త్రీలపాతివ్రత్యమును, తమ కులపావిత్ర్యమును అమ్మి రాజ్యమును అనుభవింపఁదలఁచిన స్వదేశస్వజాతి స్వమతస్వ స్త్రీ గౌరవాభిమానశూన్యులయెడ మిక్కిలి తిరస్కారభావముకల వాఁడయి ప్రతాపుఁడు 'తురుష్కులకుఁ బిల్లనిచ్చిన వారితో నితరరాజపుత్రులు సంబంధబాంధవ్యములు చేసికొనఁగూడ' దని నిబంధన యేర్పఱిచెను. అందులకు రాజపుత్రులందఱును సమ్మతించిరి. అందువలన జయపూర్ జోధ్‌పూర్ రాజులు నూఱు సంవత్సరములవఱకు బహిష్కృతులయియుండి, తుదకు నుదయపుర రాజులను 'మమ్ము పవిత్రులను జేయుఁడు. మాకు మరల నుపనయనముచేసి జాతిలోఁ గలుపుకొండు'అని ప్రార్థించి వెలిఁబాపుకొనిరి.

ఇట్లు మతనిబంధన యేర్పఱచినందునఁ బ్రతాపునికి ననేక రాజపుత్రులే శత్రువులయిరి. శత్రువులయినవారిలో జయపురాధీశుఁడగు మానసింహుఁడు ముఖ్యుఁడు. ఈతని జనకస్థానపుచెల్లెలిని హుమాయూన్‌కు నిచ్చినందున నీతఁ డక్బరునకు మేనమామయు, ఈతని పాలకస్థలమందలి చెల్లెలిని అక్బరునకిచ్చి నందున ఈతఁ డక్బరునకు బావమఱఁదియునగును. ఈ మానసింహుఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడు. అక్బరునకుఁ గలిగినవైభవములో మిక్కిలిభాగ మీతనివలననే కలిగినదని అక్బరు చరిత్రలోఁ జదువరులు చూచియుందురు. ఈమానసింగు ఒక్కసారి దక్షిణములోని సోలాపూరు ప్రాంతమును అక్బరు నిమిత్తమై జయించి మరల దిల్లీకిఁ బోవుచు కుమళ్‌నేరుకు నాతిదూరమున విడిసెను. కుమళ్‌నేరులోఁ బ్రతాపసింహుఁ డున్నాఁడని విని మానసింహుఁ డాతనిని చూచుటకై వెళ్ళెను. ప్రతాపుఁ డాతనికిఁ జేయవలసిన మర్యాద లన్నియుఁజేసెను. కాని మానసింహుఁడు తురుష్కునికిఁ బిల్లనిచ్చినవాఁ డగుటచే నాతనిపంక్తిని బ్రతాపుఁడు భోజనమునకు రాలేదు. అందుపై మానసింహునికిఁ గోపమువచ్చి యాతఁడు భోజనముచేయకయే లేచి 'యిట్లు నన్ను అగౌరవపఱచినందులకు నీకుఁ దగినప్రాయశ్చిత్తముగును'అని గుఱ్ఱమెక్కెను.

అందులకుఁ బ్రతాపుఁడు నవ్వి 'నీవు యుద్ధమునకు వచ్చునపుడు నీ మేనల్లునిఁ గూడఁ దీసికొనిరమ్ము' అని యెత్తిపొడిచెను. అందుపై 'నీమానమును (గర్వమును) దింపి మానసింహుఁ డను పేరు సార్థకపఱిచెదను' అని మానసింహుఁడు వెడలిపోయెను. ఈసమాచార మాతఁడు అక్బరునకుఁ దెలిపెను. అందుపై నాతఁ డాగ్రహ పడి గొప్పసైన్యము నిచ్చి తన కుమారుఁడయిన సలీమును, మానసింహుని, ప్రతాపుని మీఁదికిఁ బంపెను. వీరికిని ప్రతాపునికిని కొన్ని సంవత్సరములవఱకు యుద్ధము జరుగుచుండెను. ఈ మహాయుద్ధములో ననేకాంతర్యుద్ధములుజరిగెను. వీనిలోని ప్రతియుద్ధములోను ప్రతాపునికే జయము కలిగినది కాదు. పెక్కుసారులు మొగలులోడిరి. పెక్కుసారులు ప్రతాపుఁడోడెను. కాని యీయుద్ధములోఁ బ్రతాపుఁడు గనఁబఱిచినట్టి వర్ణనీయములగు శౌర్యము, ధైర్యము, వీర్యము, సహనశీలత, యుద్ధకుశలత, ప్రసంగావధానము మొదలయిన సద్గుణములచే నాతనిఖ్యాతి యజరామరమైనది. ఆతని కష్టములను ప్రతాపములను వర్ణించెడి భట్రాజకృతములయిన యశోగీతములను ఇప్పటికి రాజపుత్రస్థానములో నింటింటఁ జదివి జను లశ్రుపులు రాల్చుచుందురు.

పైని చేర్కొనఁబడిన యుద్ధములో మొదటఁ బ్రతాపసింహునికిఁ గొంత జయము కలిగెను. అతఁడు యువరాజగు సలీమును అతని సైన్యములను ముప్పతిప్పలుపెట్టి మూడుచేరలనీళ్లు త్రాగించెను. కాని యాతనినుదినము లంతటితో వచ్చినవికావు. ప్రతాపునియొద్ద నిరువదివేలసైన్యమున్నను క్రీ. శ. ౧౫౭౬వ సంవత్సర శ్రావణశుద్ధ సప్తమినాఁడు హల్దీఘాట్ అనుచోట జరిగినయుద్ధములో నీతని యసంఖ్యాసైనికులును, సేనానాయకులును పడిరి. ఇరువదిరెండువేలలోఁ బదునెండువేల సైనికులు హతులయిరి. అందుచే నదివఱకుఁ బ్రతాపుని రాజధానిగానున్న కుమల్ మేర్ కోటయు శత్రువు లాక్రమించుకొనిరి. ఈ యుద్ధములో ఝాలుఁడను నొకభట్రాజా మృత్యుఁడయ్యెను.

ఈతని వీరరసప్రధానమైన కవిత యప్పటి రాజపుత్రులేగాక వారిశత్రువులు గూడ సాహ్లాదముతో వినుచుండిరఁట. ఇప్పటి కీతఁడు తన కవితామహిమచే రాజపుత్రస్థానమందు బ్రతికియే యున్నాఁడు!

ఇట్లు కొన్ని యేండ్లవఱకు యుద్ధము జరుగుచుండెను. ఉభయసైన్యములును ఎనిమిదినెలలు పోరాడి వర్షాకాలముమాత్రము విశ్రమించుచుండెను. కాని యారేటి కారేటికిని ప్రతాపుని కష్టములును, సైన్యబలలోపమును, దారిద్ర్యమును హెచ్చెను. తినుటకుఁ గంచమును, నిద్రించుటకు మంచమును లేని దురవస్థవచ్చెను. తనకుటుంబములో స్త్రీలును, శిశువులును శత్రువులచేతిలోఁ జిక్కకుండ నిచ్చటినుండి యచ్చటికిని, అచ్చటనుండి యిచ్చటికిని అరణ్యములోఁ బరుగెత్తవలసివచ్చెను. ఇన్నికష్టములకు నోర్చియు నాతఁడు శత్రువునకు శరణనక వానితోఁ బోరాడుచునేయుండెను. ఇట్టి ధైర్యమును సాహసమును చూచి ప్రతాపునిశత్రుఁడైన యక్బరును ఆతని మంత్రులును ప్రతాపుని ధన[illegible] మెచ్చుకొనసాగిరి! అక్బరుని ముఖ్యమంత్రియగు ఖానఖానన్ [illegible]డు సద్గుణగ్రాహి, గొప్పకవి. ఈతఁడు ప్రతాపుని శౌర్యసద్గుణములకుమెచ్చి కొన్నిపద్యములను రచించి ప్రతాపుని కంపెను. వానిభాషాంతర మిచ్చట నిచ్చుచున్నాను: 'మానవుని సంపత్తియు, అధికారమును నశ్వరములు; ఇది సృష్టిక్రమము. కాని మానవుని సద్గుణములయొక్కయు సత్కీర్తియొక్కయుఁ బ్రశంస లోకములోఁ జిరకాలముండును. కావున పుత్త్రా! నీవు ధన్యుఁడవు. ఏలయన నీవు సంకటావస్థలోనుండియు బాదుషాకు శరణు రాక నీకీర్తియు గౌరవమును రక్షించుకొనుటకు యోగ్యమైన ప్రయత్నములఁ జేయుచున్నావు. ఈగుణములు హిందూరాజులయెడ నసాధారణములు. కావున నీవు నిస్వజాతియొక్క యభిమానమును వర్ణనీయముగ రక్షించుచున్నావు. నీవు రాజ్యవైభవమును, సుఖప్రాప్తిని గడ్డిపరకలవలెఁజూచి నీవందనీయమగు వంశముయొక్క కీర్తి నాచంద్రార్కస్థాయిగఁ జేయు

చున్నావు!' ఇట్లు శత్రువుచేఁ బొగడ్తఁగన్న కూరుని వేయినోళ్లఁ గొని యాడినను అది యతిశయోక్తియగునా ?

ఇట్లు లోకముచేఁ బొగడ్తగన్నను దైవముమాత్ర మాతనికింకను ప్రతికూలముగానే యుండెను. ఏపనిచేసినను కలిసిరాదయ్యెను. అందుచేఁ బ్రతాపుఁడు విసివి, సైన్యాదికములఁ జేర్చుకొనుటకుఁ గాని మఱి యేమి చేయుటకుఁ గాని తోఁచక, యుద్ధమునకుఁ గొంతవ్యవధి యీయవలసినదని అక్బరునకు వర్తమానమంపెను. తన్ను నేఁటివఱకు నెంతమాత్రమును లక్ష్యముచే[యని] ప్రతాపునివద్దనుండి యింతమాత్రము వర్తమానమురాఁగానే యక్బరెంత[యు] నుప్పొంగి ప్రతాపుఁడు నాకు శరణురానేవచ్చెనని భ్రమపడి తనయుద్యోగస్థుల నందఱిని పిలిపించి ప్రతాపుఁడు నాకులొంగెనని యానందవార్త చెప్పెను. అందుఁ బృథ్వీరాజను నొక రాజపుత్రుఁడుండెను. ఈతఁడు బికానీర్ రాజుయొక్క తమ్ముఁడును, సేనాధిపతియు. ఈతఁ డక్బరు స్నేహితుఁడును, ఆతనియొద్ద నొకసరదారుఁడును అయినను, మనసులోఁ బ్రతాపుని యెడ మిక్కిలి పూజ్యభావము కలవాఁడుకావున, నావార్త యసత్యమనితలఁచి 'ప్రతాపుఁడు మీకు శరణు వచ్చెడిమాట యసత్యము. ప్రతాపసింగుయొక్క శత్రువుఁడెవఁడో యీవార్తమీకుఁ దెల్పియుండును. ప్రతాపునకు డిల్లీపట్టము కట్టినను ఇట్టిపనికి నొప్పుకొనఁడని నానమ్మకము. కావున నేను నావిశ్వాసపాత్రుఁడయిన సేవకునిఁబంపి నిజమైనవర్తమానముఁ గనుఁగొనియెద' నని చెప్పి, ప్రతాపునకు నీక్రింది కవితాబద్ధమైన యుత్తరముఁ వ్రాసెను. ఈయుత్తరములోని యంశములు పరాక్రమశీలునకు మిక్కిలి ప్రోత్సాహకరములు. ఈ కవితాబద్ధమైనయుత్తర మిప్పటికిని రాజస్థానములోని జనులు మిక్కిలి ప్రేమతోఁ బాడుచుండెదరు. ఘాత్మకనున్నయుత్తర మత్యంతశౌర్య ప్రోత్సాహకరము. అంతరఘ మీక్రింతి భాషాంతరమునందు లేని యెడల నది మాదోషమనియే తలంచవలసినది:

"రాణా ప్రతాపసింగజీ! హిందువులమగు మేమందఱమును మీవంటి పరాక్రమశాలులగు హిందూరాజపదధారులనే నమ్మియున్నాము. ఇతర రాజుల వలన మాయాశలు నిరాశలు చేయఁబడినను, ప్రతాపసింగు రాణావలన నట్టి పనిజరిగి యాతఁడు అక్బరునకు శరణువచ్చుట యత్యంత దుఃఖాస్పదము. మేమైతే దైవోపహతులమై మాపరాక్రమమును, మా స్త్రీలపావిత్ర్యమును గోలుపోయితిమి. మాయభిమానమును మా స్త్రీల పావిత్ర్యమును మేమక్బరున కమ్మితిమి; వానిని వాఁడు కొనెను. కాని యుదేసింగుపుత్రులయిన మీరుమాత్రము రాజపుత్రులలజ్జయు, స్త్రీల పావిత్ర్యమును మీవంశములో నిదివఱకు రక్షించినారు. వానిని నట్లే యిఁకముందుఁగూడ రక్షింపుఁడి. రాజా! ఏమిచెప్పుదు? నౌరోజాఉర్సు, అను తిరునాళ్లలో నేరాజపుత్ర స్త్రీయొక్క మర్యాద దక్కినది? ఎవరిమర్యాదయు దక్కలేదు. కావున సుప్రసిద్ధులును, మానధనులును అగుసిసోదియాకులము యొక్క మర్యాదను ఈ 'నౌరోజా' ఉర్సులో నమ్ముటకుఁ దేవలదని నాప్రార్థన. అంతయుఁ బోఁగొట్టుకొని దరిద్రుఁడనైతినని యనుకొనుచున్నారేమో. కాని యట్లనుకొనవలదు. మీరు పోఁగొట్టుకొన్నారమన్నదంతయు యశోభివృద్ధిచే మీకున్నట్లె యెంచుఁడి. నిరాశచే క్షత్రియకులోద్భవులనేకు లవమానజన్యదుఃఖముల ననుభవించిరి. కాని యట్టియవమానమును అపకీర్తియు హమీరవంశజులయిన మీపాలిట నిదివఱకుఁ బడలేదు. లోకమంతయు నాశతో మీవైపు చూచుచున్నది. హిందువుల పౌరుషము వెలువడుటయు, హిందువుల మర్యాదను గాపాడుటయు మీవలననే జరుగునని లోకులు నమ్మియున్నారు. మీకులమునకును, రాజవంశమునకును నేఁటివఱకుఁ గలుగని యపకీర్తి యెన్నటికిని గలుగఁగూడదని మాకోరిక. ఆత్మగౌరవపూరితమగు మీయంతరాత్మయు, జయశాలియగు మీఖడ్గమును మీకు ముఖ్యసహాయకర్తలు. వానిసాయముఁగొని మీరు క్షత్రియుల పౌరుషమును రక్షింపవలయును.........బాదుషాహకు శరణనినందున లాభమేమియు లేదు. మీ పౌరుషమునకును, యశస్సంపాదనకును ఈశ్వరుఁడు తోడ్పడునుగాక."

పైయుత్తరముఁ జూచి ప్రతాపునకుఁ బదివేల సైన్యముల బలము నిచ్చి యాతఁడు మరలఁ బోరాడసాగెను. కాని యాతనికి నిందును జయము కలిగి నదికాదు. అందులకు నాతఁ డత్యంత విషాదమగ్నుఁడై దేశత్యాగముచేసి సింధునది యొడ్డునకుఁ బోవలయునని తలఁచి యారావలిపర్వతము దాఁటి తన భార్యాపుత్రులతోను పరిమితసేవకులతోను నొక యరణ్యములో విడిసెను. కాని యచ్చట నాతనికి 'నాపూర్వుల రక్తధారలచే రక్షింపఁబడిన రాజ్యమును నాజన్మభూమినివదలి వెడలుటన్యాయముకాదు' అనితోఁచి యాతఁడు ప్రయాణము మానుకొనెను. ఇదియే యాతని యభ్యుదయమునకుఁ బ్రారంభకాలము. ఇంతలో నాతనిపూర్వమంత్రియగు భామాసా యనువానికిఁ దనయజమానుని దురవస్థ తెలిసి యాస్వామిభక్తపరాయణుఁడు తనయొద్దనున్న ధనమంతయుఁ బ్రతాపుని కర్పించెను. ప్రతాపుఁడు ఆధనమును తీసికొని ౨౫౦౦౦ సైనికులఁ జేర్చుకొని శత్రువులతో మరల యుద్ధము చేయనారంభించెను. ఆతఁడిన్ని సంవత్సరములు కష్టపడినందుకు నిప్పుడాతనిని జయలక్ష్మి వరింపఁ దొడగెను. ఈతడవ ప్రతాపుఁడు దయ యనుమాటమఱచి చేతఁజిక్కిన శత్రువుల నఱకఁజొచ్చెను. మొదట నక్బరుయొక్క సరదారుఁడగు శహాబాజ్ అనువానితోఁ బోరాడి వానిని వానిసైన్యమును రూపుమాపెను. ఈ పోరాటలోనుండి తప్పించుకొని పోయిన వారినిగూడ వెంబడించి నఱికివేసెను. ఇట్లు ప్రథమజయము సంపాదించి ప్రతాపుఁడు కుమళ్‌నేర్ కోటను స్వాధీనపఱుచుకొనెను. అచ్చటి కిల్లేదారుఁడగు అబ్దుల్లాయనువానిని సైన్యములతోఁ జెండాడెను. ఇట్లొకకోట తరువాత మఱియొక కోటను గొనుచు ముప్పదిరెండుదుర్గముల స్వాధీనపఱుచుకొనెను! కొద్దికాలములోనే చితోడ్, అజమీర్, మండల్‌గడ్ ఈ మూఁడు దుర్గములుతప్ప మేవాడ్ రాజ్యమంతయుఁ బ్రతాపుఁడు స్వపరాక్రమముచే సంపాదించెను. తన శత్రుఁడగు మానసింహుని రాజధానియైన జయపురమునకు సేనలంపి యందలి కొంతభాగమును దోపించెను. తురుష్కుల చేతిలో

నున్న యుదేపురమును గూడ సాధించెను. ఇట్లు జయశ్రీలచే రాజిల్లుచున్న ప్రతాపుఁడు అక్బరుమంత్రియగు ఖానఖానునిచే మరలఁ గొనియాడఁ బడియె. కాని చితోడ్‌గడమును స్వాధీనపఱుచుకొనినఁగాని తనపౌరుషము పౌరుషము కాదని ప్రతాపుఁడు తలఁచు చుండెను. కాని యాతనికి మరణసమయము సమీపించినందునఁ దనకోరికతీర్చుకొనకయే యాతఁడు కీర్తిశేషుఁడయ్యెను. మరణసమయమునఁ జితోడ్‌గడము గెలువలేదనిన చింతచే నాతనికి మిక్కిలి యావేదన కలుగఁగాఁ జుట్టునున్నవారు తామాకోటను జయింతుమని ధైర్యము చెప్పినమీఁదట నాతనిప్రాణము పోయినదఁట. ఇట్లు మేవాడ్ రాజ్యములోని ప్రచండ భాస్కరుఁడగు ప్రతాపుఁడు క్రీ.శ. ౧౫౯౭-వలో నస్తమించెను.

ప్రతాపుని చరిత్రమంతయుఁ జూడఁగా లోకములో నేఁటివఱకుఁ బుట్టిన శూరాగ్రేసరులలో నీతఁడొకఁడని చెప్పుటకు సందేహముండదు. దక్షిణ హిందూదేశచరిత్రలో నీతనితోఁ బోల్పఁదగినవారు కృష్ణరాయఁడు, శివాజి. ఈతనిని గుఱించిన స్వదేశాభిమాన పూరితములగు గీతములను రాజపుత్రస్థాన ములోనిప్పటికిని జనులాబాలగోపాలము చదివి యశ్రువులు రాల్చుచుందురు.

## అభయసింగ్.

(౧౫౯౭-౧౬౨౧).

ప్రతాపసింహునకుఁ బదునేడుగురు పుత్రులుండిరి. అందుఁ బెద్దవాఁడయిన యభయసింహుఁడు రాజ్యమున కధిపతియయ్యె. ఈతనికి ఉమరానని యను పేరుగలదు. ఈతఁడు చిన్ననాట నుండియు దండ్రితోఁ గొండలలోను గుహల లోను తిరిగి కష్టములన్నియుఁ జూచియుండెను. కాని తండ్రిపోయినతోడనే యీతఁడు తండ్రియుపదేశమును మఱచి యుదేపురములో నొక రాజమంది రముఁ గట్టించి యందు నొక సీమ నిలువుటద్దమును తెప్పించి పెట్టి విలాసముల ననుభవించుచుండెను. కాని యాతఁడిట్లుండుటకు నాతనిసరదారులు చింతించి "ప్రతాపసింగు మహారాజుగారు మరణసమయమున మాకు 'మొదట దుస్సాధ్య

మగు స్వాతంత్ర్యమును, చితోడ్‌గడమును సాధించి తరువాత రాజ్యసుఖము ననుభవింపవలసినది' యని చేసినబోధ మఱచుట మంచిదికాదు'' అని పెక్కుసారులు బోధించి, యాతనిని విలాసభోగములనుండి పరాఙ్ముఖునిఁజేసి శౌర్యపరాక్రమములఁ జూపుటకుఁ బురికొల్పిరి. కాని యాతఁడు విలాసముల వదలఁడయ్యె. ఇంతలో సాళుంబ్రాధిపతియగు ఠాకుర్ ఒకరోజు రాణా యొక్క మందిరములోనికి వచ్చి నిర్భయముగా నాతని నిలువుటద్దముమీఁద రాయివేసి దానిని పగులఁగొట్టి, సింహాసనముపైఁగూర్చున్న రాణాచేయి పట్టుకొని యాతని నీడ్చి క్రిందికిలాగి సరదారుల నందఱినిఁ జూచి "సరదారులారా! చూచెదరేల? గుఱ్ఱములపై నెక్కుఁడి. ప్రతాపసింహుని కుమారునకు లోకములోఁ గలుగుచున్న యపకీర్తినుండి యాతనినిరక్షింపుఁడి!'' అని బిగ్గరనఱచెను. తనస్వామియు మిత్రుఁడును నగుప్రతాపసింహునకు మరణ సమయమునఁ దానిచ్చిన యభయవచనమును బూర్తిచేయుటకై తనకేమి నష్టమువచ్చినను సరియేయని సాళుంబ్రాధిపతి యిట్టి సాహసకృత్యముఁ జేసెను. ఇందువలన నాతనిని రాణా యేమిచేయునోయని యందఱును భయపడిరి. అభయసింహరాణాకుఁ బ్రథమమునఁ గొంచెము కోపమువచ్చెను; కాని యాఠాకురుయొక్క సదుద్దేశము తెలియఁగనే యాతనికిఁ బశ్చాత్తాపముగల్గి మీసములు దువ్వుచు నాతఁ డిట్లనియె:—

"ఠాకూర్‌గారు! మీరుచేసినపనికి నాకు నెంతమాత్రమును కోపములేదు. తమబోధకు నేను బద్ధుఁడను. మీరు నా కుపకారగ మొనర్చితిరి. విలాసోదధిలోనుండియు, మోహజాలములో నుండియు, నన్నువిడిపించి సత్కృత్యమునకుఁ బ్రోత్సాహపఱిచితిరి. ఇందుకు నేను కృతజ్ఞుఁడను. మనమిట్లె దాడి వెడలుదము. మీప్రతాపసింగు మహారాజుల కోర్కెను గుఱించి మీరింక చింతచేయవలదు.''

అంత నావీరసమాజమట్లె గుఱ్ఱములపైనెక్కి దినేర్‌పఱకుఁ బోయి విడి

సెను. ఖానఖానన్ అను ఢిల్లీశ్వరుని మంత్రియొక్క తమ్ముఁడయిన అబ్దుల్లా యనువాఁడు ఢిల్లీశ్వరుని సైన్యములతో నచ్చటనుండెను. అచ్చట నుభయ సైన్యములకుఁ బోరుజరిగి యందుఁ దురుష్కులకుఁబూర్తిగఁబరాజయము ప్రాప్తించెను. ఈయుద్ధము క్రీ.శ. ౧౬౦౮లో జరిగెను. అప్పుడు జహంగీరుబాదుషాహ ఢిల్లీచక్రవర్తిగ నుండెను. ఈయుద్ధములో రాజుయొక్క పినతండ్రియగు కాణా యనుశూరుఁ డద్భుతశౌర్యముఁ గనఁబఱిచినట్లు భట్రాజులు వర్ణించి యున్నారు. ఈయుద్ధములో నోడిపోయినందునఁ బాదుషాహ రాణాతో కొన్ని దినములవఱకు నుండునట్టి సంధిచేసికొనెను.

కాని బాదుషాహ యాసంధిని బాటింపక సంధికాలము పూర్తియగుటకుఁ బూర్వమే మరల నొక బ్రహ్మాండమైన సైన్యమును మేవాడ్ మీఁదికిఁ బంపెను. ఈతడవఁగూడ నబ్దుల్లాఖానుఁడే సైన్యాధిపతిగనుండెను. ఈసైన్యమునకును, రాజపుత్రులకును క్రీ.శ. ౧౬౧౦వ సంవత్సరపు ఫాల్గుణ మాసములో రాన్‌పుర్ అను క్షేత్రమునొద్ద ఘోరమైన యుద్ధముజరిగి యందుఁ దురుష్కులే మరలఁ బరాభూతులయిరి. ఈయుద్ధమున వెనుకటి యుద్ధమునఁగంటెఁ బెద్దవి రక్తనదులు ప్రవహించి యసంఖ్యాజనులు హతులయిరి. ఇందురాజపుత్ర సరదారు లెందఱో మడిసిరి. వారిలో దేవగడ్ఠాకుర్ దుధోసాంగావత్, నారాయణదాస్, సురజ్ మల్, యశకర్, సిసోదియావంశములోని యనేక సరదారులు, భాణునికుమారుఁడు, సూక్తావతులలో ముఖ్యసరదారుఁడగు పూర్ణమల్, హరిదాస్‌రాఠోడ్, సాద్రీ వాఁడగుఝోపర్‌జాలో, కహార్ దాస్ కచ్ఛవాహ్, బేడలాధిపుఁడగు కేశవదాస్ చహ్వాణ్, ముకుందదాస్ రాఠోడ్, జయమల్లుని వంశములోని పురుషులు మొదలగువారు ముఖ్యులు. ఈదిగ్విజయము వలన మేవాడ్ కీర్తి హిందూదేశ మందంతటను బ్రసరించెను.

ఇట్లొక పరాజయము తరువాత మఱియొక పరాజయము కలిగినందున జహాంగీరు బాదుషాహో యస్వస్థచిత్తుఁడై మేవాడ్ రాజపుత్రులబలము తగ్గించు

టకు నొకయుక్తిపన్నెను. రాజపుత్రులకుఁ జితోడ్ గడమునుగుఱించిన యభిమానమువలన వారందఱును మేవాడ్ రాజునకు సాయముచేయుచున్నారు. కావున నొకరాజపుత్రునకు మనమే చితోడ్ మీఁద రాజ్యాభిషేకముచేసిన యెడల రాజపుత్రులందఱును వానికే సహాయులై అభయసింహుని సడలి వేయుదురు, అని నిశ్చయించెను. ప్రతాపసింహుని తమ్ముఁడగు సంగరాజితుఁ (సుగ్రాజి) డనువాఁడు భ్రాతృద్రోహియై యక్బరుపక్షముఁ జేరియుండెను. వానికి వేషమువేసి తురుష్కులు వానిని చితోడ్ సింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టిరి, కాని యొక రాజపుత్రుఁడును వానికి సాయముచేయుటకు రాలేదు. అందఱును అభయసింహునికే సాహాయ్యము చేయుచుండిరి. తురుష్కునికి నంకితుఁడగుటచే సంగరాజితుని నందఱును అసూయతోఁ జూడసాగిరి. అందువలనను, ప్రతిదినము నెచ్చటఁజూచినను చితోడ్ గడముమీఁదఁ దనపూర్వులు తురుష్కులతోఁ బోరాడి స్వశరీరము లర్పించిన చిహ్నములును, ఎటుచూచినను జయస్తంభములును, సమాధులును, వానిపైవ్రాయఁబడిన యశోవర్ణనలును జూచి, తన పూర్వుల కట్టివిపత్తుదెచ్చిన తురకలతో స్నేహముచేసి చితోడ్ కు నిజమైనరాజును నెదురించుటకు సిగ్గుపడి, యాసంగరాజితుఁ డొకనాఁ డభయసింహునిఁ బిలిపించి యాతనికిఁ జితోడ్ గడమొసంగి వెడలిపోయెను! మానవులందఱికిని స్వదేశాభిమాన మనునది సహజసద్గుణము. దేశద్రోహమనునది బలవంతముగాఁ దెచ్చిపెట్టుకొనిన దుర్గుణము.

ఇట్లు అభయసింహునకుఁ దనపూర్వులరాజధానియగు చితోడ్ గడము సులభముగఁ బ్రాప్తమయ్యెను. కాని యది మిక్కిలి జీర్ణావస్థలోనున్నందునఁ గోట్లకొలఁదిధనమయినఁగాని యాకోటబాగుచేయుటకు వీలులేకపోయెను. అందుచేనాకోటను త్వరలోఁబూర్తిగ బాగుచేయుటకు వీలులేదనితలఁచి, కోటనురక్షితముగాఁ దన చేతిలోనుండుటకుఁ గోటచుట్టునున్న ప్రాంతమంతయు జయింప నిశ్చయించెను. అంతట నాతఁడు విజయయాత్రకువెడలి, చితోడునకుఁ జుట్టు

పట్టుల నున్నట్టియు, నదివఱకుఁ దనస్వాధీనమునందు లేనట్టియు నెనుఁబది పట్టణములను, నలుబదిదుర్గములను గెలిచెను. ఇట్టిదుర్గములలో నొక్కటియగు అంతాల్ అనుదుర్గమును సాధించుటకు రాణాయొద్దిసూక్తావత్, బోండావత్ సరదారులు పోటీలువేసికొని యొకరిని మించియొకరు రౌద్రస్వరూపములను ధరించి శత్రువులతోఁ బోరాడి యాకోట సాధించిరి. ఈయుద్ధములో ననేక సూక్తావంతులును, బోండావంతులును కార్యసాధనమునకై వీరశయనముఁ బొందిరి. ఈయుభయవంశజుల యతులపరాక్రమములవర్ణనలు భట్రాజు లెంతయు వీరరస పరిప్లుతముగాఁ జేసియున్నారు. "వీరికీర్తియుండువఱకు వీరుబ్రతికియేయుండు వా"రని యాభట్టులుచెప్పినమాట యసత్యమని యెవరు చెప్పఁగలరు?

ఇట్లురాజపుత్రులకే యెడ తెగక జయముకలుగుచున్నందున వెఱచి బాదుషా తనసైన్యములనన్నిటిని రావించి అజమీరుపట్టణములో నందఱినిజేర్చి, తన కుమారుఁడగు పర్వాజ్ అనువానికి సైన్యాధిపత్యమొసఁగి క్రీ. శ. ౧౬౧౧లో మేవాడ్ మీఁదికిఁ బంపెను. సముద్రమువలె మితిలేకుండఁబ్రసరించిన యీమొగలుసైన్యములకును రాణాసైన్యములకును ఖామ్నోర్ వద్ద ఘోరసంగ్రామము జరిగి యందు మొగలులే యోడి పాఱిపోవలసినవారైరి. ఈయుద్ధములో రాజపుత్రులు చూపిన శౌర్యమును, అందువలన మేవాడ్కుఁగలిగిన యశోవైభవమును, మొగలులకుఁ గలిగినయగౌరవమును మహమ్మదీయచరిత్రకారులుగూడ కొంతవఱకు వర్ణించియున్నారు. ఈయుద్ధములో నసంఖ్యాతురుష్కులును, రాజపుత్రులును బడిరి. రాజకుమారుఁడగు పర్వాజ్, ఇతరసైనికులును పాఱిపోయిరి.

ఈప్రకార మీమేవాడ్ రాజపుత్రులకును, మొగలులకును పదునేడుపర్యాయములు యుద్ధములుగలిగి యన్నిసారులు రాజపుత్రవీరులు తమయద్వితీయశౌర్యమును గనఁబఱిచి, యసంఖ్యావీరులు మడిసి తురుష్కులను నోడించుచు

వచ్చిరి. కాన దినదినము వారిబలము తగ్గఁజొచ్చెను. మొగలులు ప్రతి యుద్ధములోను అసంఖ్యులుగ మడిసినను, రక్తబీజులవలె మరలఁ గ్రొత్తసైనికులు వచ్చి వారికి నెప్పటిబలము స్థిరముగనుండుటయు, రాజపుత్రుల సంఖ్య మొదటనే పరిమితముగానుండి, యందును ననేకులు మొగలుల పక్షముననేయుండుటయుఁ, బైని జెప్పిన పదునేడుయుద్ధములలో విఖ్యాతశూరులగు నాయకులును, వీరవరులును మడియుటయుఁ వటస్థించినందున సమరసింహుని సైన్యముల బలము తగ్గఁజొచ్చెను. ఇట్టిసమయమున జయపూర్, జోథ్‌పూరు రాజులు కులద్రోహులయి మొగలులకు సాయము చేయుటకుమాఱుగా సమరసింగునకు సహాయము చేసియుండురేని రాజపుత్రస్థానమంతయు నొక్కపెట్టున స్వతంత్రమైయుండును. కాని వారటుచేసినవారుకారు. సతతయుద్ధ పరిశ్రమచేతను, అసంఖ్యవీరవరనాశముచేతను మేవాడురాజు డస్సియున్నాఁడని తెలిసి కసి తీర్చుకొనఁదలఁచిన జహంగీర్‌బాదుషాహ మరలగొప్పసైన్యములనిచ్చి పరాక్రమవంతుఁడయిన కురమ్ అను తనకుమారుని రాణావిూఁదికిఁ బంపెను. రాణాయుఁ దనకుమారుఁడగు కర్ణుని సేనానిగానేర్పఱిచి మొగలులపైకిఁ బంపెను. కాని యాతడను పైని జెప్పఁబడిన కారణములచే సమరసింహుఁడు తనమర్యాదకు లోపములేని సంధిచేయుటయే మంచిదని తలఁచెను. ఇన్నిసారులు తనసైన్యమును వివిధబాధలఁ బెట్టిన యుదయపురాధీశుని యద్భుత శౌర్యపౌరుషముల నెఱింగినవాఁడు గావున దిల్లీశ్వరుఁడుగూడ, నెట్టులయిన మేవాడాధీశుఁడు మనకు లోఁబడెనని పేరునకైనను అనిపించుకొనినఁ జాలునని తలఁచెను. కావున మేవాడ్ రాజులు డిల్లీశ్వరుని సార్వభౌమునిగా నొప్పుకొనునట్లును, మేవాడ్ రాజులు డిల్లీకినేగ నక్కఱలేకుండునట్లును, మేవాడ్ రాజపుత్రునకు డిల్లీశ్వరుఁడు తనకుడివైపున నందఱు సరదారుల కంటె నగ్రస్థానమొసఁగునట్లును, ఒప్పిదములతో క్రీ.శ. ౧౬౧౬లో సంధిచేసికొనిరి. తరువాతఁ గర్ణుఁడు కురమ్(షాహజహాన్)తోఁ గలిసి డిల్లీశ్వరునిఁ జూడఁబోయెను.

అచ్చట నీతనికి డిల్లీశ్వరునిచేఁ జేయఁబడిన మర్యాదయు, నీయఁబడిన బహుమతులునుజూడఁగా డిల్లీశ్వరునితో సంధిచేయవలయునని మేవాడ్ రాజులకుఁ గల కోర్కెకంటె, మేవాడ్ రాజులతో నెట్లయిన సంధిచేయవలయు నని డిల్లీశ్వరునికోరికయే యధికముగా నుండెనని స్పష్టముగాఁ గానవచ్చును. ఈక్రింది యంశములు డిల్లీశ్వరుఁడగుజహాంగీరు స్వయముగా వ్రాసియుంచిన దినచర్య గ్రంథములోనుండి గ్రహింపఁబడినవి. కావున నివి మిక్కిలి విశ్వాసపాత్రములనుటకు సందేహములేదు:

“కర్ణుఁడు నాయొద్దకు వచ్చినరెండవనాఁడు రత్నఖచితమైనపిడిగల చిన్న కత్తియొకటి నాతనికి నిచ్చితిని. మూఁడవనాఁడు శ్రేష్ఠమైనయశ్వమును, దానిమీఁదనున్న వెలగలవస్తువులతో నిచ్చితిని. ఆదినమున నేను ఆతనిని మహారాణి నూర్ జహాన్ కడకుఁదీసికొనిపోయితి. ఆమెయు నాతనికి వెలగల దుస్తులు, గుఱ్ఱము, ఏనుఁగు, వానిమీఁది వెలగలవస్తువులు, ఖడ్గము, జవాహిరి మొదలయినవియిచ్చెను. ఆరోజుననే నేను మిక్కిలి తేజోవంతమును, మూల్యవంతమును నగుముత్యములహారము నొసఁగితిని. నాలుగవదినమున నొకయేనుఁగు నిచ్చితిని. మఱియు నాతనికి దుర్లభములును, అపూర్వములును అగుననేకవస్తువుల నీయవలయునని తలఁచితిని. ఒకకవచమును, రెండు పచ్చలయుంగరములును ఆతనికి బహుమతి యొసఁగితిని. నెలయొక్కచివరదినమున, వెలగల తివాసులును, రాజమందిరముల శోభింపఁజేయునట్టి జరీపనిచేయఁబడిన దిండ్లును, అత్తరుమొదలయిన సువాసనద్రవ్యముల కుప్పెలును, కొన్నిసువర్ణపాత్రములును, బలముగల గుజరాత్ దేశపు యెద్దులజతయుఁ బంపితిని.

“నారాజ్యముయొక్క పదియవసంవత్సరము ప్రారంభమయ్యెను. రాజపుత్రుఁడగు కర్ణునికిఁ దనజాగీరునకుఁబోవ సెలవొసంగితి. వెడలునపుడాతనికి నొకయేనుఁగు, ఒకగుఱ్ఱము, ఏఁబదివేలరూపాయలు వెలగల ముత్యాలహారము నొసఁగితి. యువరాజగుకర్ణుఁడు నాయొద్దకు వచ్చినప్పటినుండి తిరిగివెడలువఱ

కును సేనాతనికిఁబదిలక్షలు వెలగలవస్తువులు బహుమతిగా నొసఁగితిని. ఇవి గాక యాతనికి నాకుమారుఁడగు కురంవలన ౧౧౦ గుఱ్ఱములును, ౫ ఏనుఁగు లును మట్టియుండెను. కర్ణుఁడు వెడలునప్పు డాతనితో నాసరదారుఁడగు ముబారిక్ ఖానుని నేనుఁగులతోను గుఱ్ఱములతోను నిచ్చి యాతనిని మిక్కిలి గౌరవముతో సాగనంపితిని''

ఇట్లపరిమితగౌరవమును జూపుటయు వెలగలబహుమతుల నొసంగుటయుఁ గాక ఢిల్లీశ్వరుఁడు యువరాజయిన కర్ణునకు నైదువేలమన్ సబ్ దారియొసఁగి యిందుకై ఖైరార్, పూలియా, బేదనూర్, మాండల్ గడ్, జీరన్, నీమచ్, బాఇన్సోర్, దెవలా, డొంగర్ పూర్ మొదలయిన ప్రాంతముల నిచ్చెను. ఇంతియకాదు. మేవాడాధీశుఁడగు రాణాఉమరావ్ సింగ్ (అమరసింహున కిది మాఱుపేరు) ను గుఱించియు, నాతని కుమారుఁడగు కర్ణునిగుఱించియుఁ దనకు మిక్కిలియాదరబుద్ధి కలదని చూపుటకు వారివిగ్రహములఁజేయించి జహాంగీరు తనయుద్యానవనములోనుంచి యాయంశమును తనదినచర్యలో వ్రాసియుంచెను.

ఇట్లు దేవగఢపురాజు మనసు నొవ్వకుండుటకు ఢిల్లీశ్వరుఁ డెట్టియుపాయ ములను బన్నినను ఢిల్లీశ్వరునికి లోఁబడి యాతనిచే జాగీర్ దారుఁ డనిపించు కొనవలసివచ్చెనే యనిచింత యమరసింహుని వదలినదికాదు. సర్వకుటుంబ నాశమునకైనను ఒప్పుకొని యెనిమిదివందలసంవత్సరములనుండి తురుష్కులకు శరణనక నిలిచిన తనవంశపుకీర్తికి నీసంధిచేఁ గలంకము వచ్చెఁగనుక నిఁకమీఁద నిట్టిరాజ్యము తనకుఁవలదని తనకుమారునకుఁ బట్టముకట్టి తాను వానప్రస్థా శ్రమమును స్వీకరించి, యుదేపురమునువిడిచి వెడలెను. తరువాత నాతఁడైదు సంవత్సరములు బ్రతికి క్రీ. శ. ౧౬౨౧లోఁ బరలోకగతుఁడయ్యె.

ఉమరావ్ సింగ్ అను నామాంతరముగల యీ యమరసింహుఁడు తండ్రి యగు ప్రతాపసింహునివలెనే యద్భుతపరాక్రమశాలి, మేవాడరాజు లందఱి

లోను ఈతఁడుదీర్ఘకాయుఁడును విశాలవక్షుఁడును అయియుండెను. ఇతఁడు చిన్ననాఁటి నుండియుఁ బడిన కష్టముల వలనను, పెద్దయయిన తరువాతఁ జేసిన సంతతయుద్ధములవలనను నల్లపడి యుండెను. ఈతఁడు సరదారులకును, ప్రజలకును అత్యంత ప్రియుఁడు. ఇందుల కితని దయాళుత్వమును న్యాయప్రియతయు ముఖ్యకారణములు. ఈతఁడు తనరాజ్యములోఁ బన్నువసూలుచేయుటను గుఱించియు, న్యాయవిచారణ చేయుటను గుఱించియుఁ బెక్కుచట్టములుచేసి వానిని శాసనస్తంభములపైఁ జెక్కించెను. ఆశాసనములిప్పటికిని గానవచ్చుచున్నవి. అందువలన నీతని న్యాయప్రియత్వము బాగుగఁ దెలియును. ఈతఁడు తనసరదారులకుఁ దగినట్లు జాగీరులొసఁగి, వారు తన సభకువచ్చునపుడు ధరింపవలసిన దుస్తులపద్ధతియు వారు సభలోఁ గూర్చుండవలసిన క్రమమును నిర్ణయించెను. ఈతనిచే నేర్పఱుపఁబడిన శిరోవేష్టనమును ఇప్పటికిని 'ఉమరావ్ శాహిపగడీ' అని యాప్రాంతమున ననియెదరు.

## కర్ణుఁడు.

(౧౬౨౧ - ౧౬౨౮).

తండ్రి మరణానంతర మీతఁ డేడుసంవత్సరములు మాత్రము రాజ్యము చేసెను. ఈతఁడు ధైర్యసాహసములందుఁ దన పూర్వులకంటెఁ దక్కువవాఁడు కాఁడు. ఇదివఱకు జరిగిన యుద్ధములచే నితని బొక్కసములో నొకగవ్వయైనను లేదయ్యె. అందుచే నీరాజకస్మాత్తుగా సూరత్ పట్టణము మీఁదికి దండుపోయి, దానిని దోఁచుకొని యపారమైన సంపత్తినిఁదెచ్చి తనబొక్కసము నింపెను. ఢిల్లీశ్వరునితోను, ఆతని కుమారుఁడును యువరాజును అయిన కురంతోడను ఈరాణాకు మిగుల స్నేహమైనందున నీతని రాజ్యమునకు శాంతియు సౌఖ్యమును గలిగెను. ఇదివఱకుఁ జేసిన యుద్ధములలోఁ జెడిపోయిన కోటల

నన్నిటిని ఈరాణా బాగుచేయించెను. తనరాజధానిచుట్టు నొకకందకముఁ ద్రవ్వించెను. కొన్నితటాకములను, రాజభవనములను గట్టించెను.

కర్ణుఁడు రాణాయైన తరువాత నాతనితమ్ముఁడగు భీమసింగు జహాంగీరునొద్ద మన్సబుదారుగానుండెను. ఈతనికిని యువరాజగు ఖురం అనువానికిని మిక్కిలి స్నేహము. జహాంగీరుని కుమారుఁడయిన యీఖురం రాజపుత్ర క్షేత్రమందుఁ బుట్టినవాఁడు. జహాంగీరునకు నంబేర్ (జయపూర్) కచ్ఛవాహజాతి రాజపుత్ర స్త్రీ భార్యగ నుండెను. ఆమె యీఖురంయొక్క తల్లి. ఖుర మనుశబ్దము కూర్మ శబ్దభవము. ఇట్లీతనియందు హిందూరక్త మున్నందున నీతఁడు రాజపుత్రులతో మిక్కిలి స్నేహము చేయుచుండెను. ఇదియుఁగాక తనకంటెఁబెద్దవాఁడగు పర్వేజ్ అను అన్నకుఁ గాకుండఁ దానే రాజ్యమును సంపాదింప వలయునన్న కాంక్ష గలవాఁడగుటచే మేవాడ్ రాజును ఆతనితమ్ముఁడగు భీమసింగును ఆశ్రయించుచుండెను. భీమసింగు శూరుఁడును స్వాతంత్ర్య ప్రియుఁడును. అందుచే నాతఁడు ఖురముతో 'నీకు రాజ్యము వలయునేని లోలోపల రహస్యచర్యలు జరిపినందున లాభములేదు. బహిరంగముగా నీయన్నతోఁ బోరాడి యాతని గెలువవలయు' నని బోధచేసెను. ఇట్లు క్షత్రియబీజమునకుఁ దగినట్టి సలహావిని ఖురము తనయన్నమీఁదను, తండ్రిమీఁదను దిరుగఁబడి యన్నను జంపించెను. తండ్రితోఁ బోరాడసాగెను. ఈయుద్ధమునందు భీమసింగు తనస్నేహితునకై యసమానశౌర్యముఁ జూపి వీరస్వర్గమునకుఁ బోయెను. అందుచేఁ ఖురమునకుఁ బరాభవము కలిగె. అప్పుడాతఁడు మేవాడ్ కుఁ బారిపోయి కర్ణరాణాయెదుట మోకాళ్లపై వంగి తనతలగుడ్డతీసి కర్ణునియెదుట నుంచి 'ఇఁకనాకు నాశ్రయమిచ్చి నామానముఁ గాపాడుభారము మీది' యని చెప్పెను. ఖురమనువాఁడు మేవాడ్ యొక్క పారతంత్ర్యమునకుఁ గారకుఁడై నను తనకు మిత్రుఁడును, శరణాగతుఁడును అగుటచే వానిని రక్షింపకుండుట, స్వకులవ్రతమునకు హానియనితలఁచి యాక్షత్రియోత్తముఁడాతనికి నభయమిచ్చి,

అందుకుగుఱుతుగా నాతనిపాగా తననెత్తిపై నుంచుకొని, తనపాగా యా తనినెత్తిపై నుంచెను! ఆహా! ఇట్టి శరణాగతత్రాణబిరుద మీ లోకములో మిక్కిలి యరుదు గదా. అప్పుడు కర్ణునిచే స్వీకరింపఁబడిన ఖురముయొక్క పాగా, డాలు ఇప్పటివఱకును ఉదేపూర్ రాజుల సంగ్రహాలయములోనున్నవి! రాజపుత్రుఁడగు ఖుర ముదయపురములో ననేకసంవత్సరములు సుఖముగా నుండి, యచ్చట నొకమసీదు కట్టించెను. తరువాత నాతఁడు పారసీక దేశ మునకుఁ బోయి తండ్రి మరణమునకుఁ గొన్నిదినములు పూర్వము హిందూదేశ మునకు వచ్చెను. ఈతఁడు పారసీకమునకుఁ బోక గోలకొండకుఁ బోయెనని కొందఱు వ్రాసియున్నారు. కర్ణుఁడు క్రీ.శ. ౧౬౨౮లోఁ గీర్తిశేషుఁడయ్యెను.

జగత్ సింగ్

(౧౬౨౮ - ౧౬౫౪).

ఈతఁడు రాజ్యమునకువచ్చిన కొన్నిదినములలోనే డిల్లీశ్వరుఁడగు జహాంగీరు మృతిచెందెను. అప్పుడాతని కుమారుఁడగు ఖురము సూరతుపట్టణములో నుండఁగా జగత్ సింగు తనసైనికుల నచ్చటికిఁబంపి యాతని రావించి, యుదే పురములోని 'మేఘ ప్రాసాద'మునందు నాతనికి దిల్లీ పట్టాభిషేకముచేసి 'షాహజహా'నని నామమిడి దిల్లీకిఁబంపెను. ఇందుచేనాతఁడు జగత్ సింగునెడ మిక్కిలి కృతజ్ఞతతో మెలఁగుచుండెను. కావున జగత్ సింగుని రాజ్యకాలము కూడఁ బ్రజలకు మిక్కిలి సుఖప్రదమయ్యె. ఎచ్చటను యుద్ధములులేనందున నీరాజు ధనసంగ్రహముచేసి తన రాజధానిలో గొప్పగొప్ప రాజమందిరము లును, వినోద ప్రాసాదములును, భవ్య దేవాలయములును, శృంగారవనము లును, రమ్యకుంజములును, నిర్మించి రాజధానికెంతయు శోభ తెచ్చెను. వీని నన్నిటిని భట్రాజు లద్భుతముగ వర్ణించియున్నారు. అప్పుడు కట్టఁబడినకొన్ని మందిరము లిప్పటివఱకు నున్నవి; అవి శిల్పనైపుణ్యముచే నిప్పటివారికిఁ గూడ నెంతయు నానందము కలుగఁజేయుచున్నవి.

ఈజగత్సింగ్ రాణా తన సద్గుణములచే లోకప్రియుఁడును, సర్వమాన్యుఁడును అయ్యెను. ఆతనికిఁగల వైభవమును లోకపూజ్యతయు సార్వభౌముఁడగు డిల్లీశ్వరునికిఁగూడ లేకుండెను. ఆతని సద్వర్తనము, పరోపకారబుద్ధి, రాజ్యవ్యవస్థ మొదలగువానిని గుఱించి, యాతనినిఁజూచిన యప్పటి వారందఱును వేనోళ్లఁ బొగడియున్నారు.

చితోడ్‌గడమును పూర్తిగ బాగుచేయించి దానికిఁ బూర్వవైభవమును మరల నొసఁగిన శ్రేయ స్సీరాణాదియే యైయున్నది. ఈతఁడు ౧౬౫౪లో మృతుఁడయ్యెను. అంత నీతని పెద్దకొమారుఁడగు రాజసింహుఁడు రాజయ్యెను.

## రాజసింహుఁడు.

## (౧౬౫౪ - ౧౬౮౧).

ఈతఁడు సార్థకనామధేయుఁడు. ప్రతాపునితరువాత మేవాడ్‌లో నుదయించిన ప్రచండభాస్కరుఁడు. శౌర్యమున నెన్నఁడు నితరులకు లొంగని తనవంశమువారు కాలవైపరీత్యముచే నొకరికి మాండలికులుగా నుండుట తటస్థించెఁ గదాయని మిక్కిలి చింతించి, యీతఁడు నిజకులపరంపరాగతమైన క్షాత్రతేజమును గనఁబఱిచి పోయిన రాజపుత్ర వైభవమును మరల సంపాదింప యత్నించెను.

రాజసింహునకును, ఔరంగజేబునకును వైరమువచ్చుటకు ముఖ్యకారణములు మూఁడు. అందు నౌరంగజేబు వివాహమాడఁ దలఁచిన రూపనగరపు రాచకన్నియను రాజసింహుఁడు వివాహమాడుట మొదటికారణము. ఈరాజకన్య పేరు విమలాదేవి. ఈమె తురుష్కుని వివాహమాడుటకు నిష్టములేక, రాజసింహునిఖ్యాతి విన్నదియగుటచే నాతనియెడ బద్ధానురాగ యై యుండెను. ఈమెను గొంపోవుటకు నౌరంగజేబు రెండువేల గుఱ్ఱపురౌతులను, దాసదాసీ జనములను రూపనగరమునకుఁ బంపెను. వారువచ్చుచున్నారనిన వార్త విని యాకన్యక పూర్వపు రుక్మిణీచరితమును స్మరించి 'హంసిని కాకి వివాహమా

డుట తగునా? రాజపుత్రకుల ప్రసూతనైన నేను వీనికి భార్యనగుట న్యాయమా?......ఇట్లు నామీఁది సంకటమును నివారించి, నన్నుఁజేపట్టకయెడల నేను ప్రాణములఁద్యజింతు' నని రాజసింహునకు లేఖనంపెను. ఈసమాచారములు దెలిసినతోడనే యాతఁడు రాజపుత్రుల స్వాతంత్ర్యమును స్త్రీలపాతివ్రత్యమును గాపాడుటకు నొరలోనుండి దూసినకత్తి జీవితాంతము నఱకును మరల నొరలోఁబెట్టిన వాఁడుకాఁడు. తనసైన్యములతో రూపనగరమునకుఁ బోయి యౌరంగజేబుయొక్క సైనికుల వెడలఁగొట్టి యాకన్యను గొనివచ్చి వివాహమాడెను. ఈపని యాతఁడు చేసినతోడనే యాతనిపారతంత్ర్యము, అనఁగా నాతఁడు డిల్లీశ్వరునకు నంకితుఁడయినమాట, పోయి యాతఁడు స్వతంత్రుఁడయ్యెను

జోధ్‌పూర్ రాజధానిగాఁగల మార్‌వాడ్ దేశపురాజగు జస్వంత్ సింగ్ డిల్లీశ్వరునకు నంకితుఁడుగా నుండెనని చదువరులెఱింగియే యుందురు. ఈతఁడు డిల్లీశ్వరుపనిమీఁద సకుటుంబముగాఁ గాబూలునకు వెళ్లినపుడు దుష్టుఁడగు ఔరంగజేబీతనిని విషముపెట్టించి చంపించెను; ఇతనిభార్యను, అప్పుడే పుట్టిన శిశువును చెఱఁబెట్ట యత్నించెను. కాని యాశూరవనిత యామోగలులతోఁ బోరాడుచుఁ దప్పించుకొని తనరాజ్యమునకు వచ్చిచేరెను. ఆమెకుమారునిఁజంపి యారాజ్యమును స్వాధీనపఱుచుకొనవలెనని యౌరంగజేబు ప్రయత్నింపఁగా నారాణి మేవాడ్‌వంశములోని కన్యయైనందున రాజసింహుఁడామె కుమారునిపక్షము నవలంబించెను. ఇట్లు మేవాడ్ మార్వాడ్ రాజులును, సైన్యములను కలిపి ఔరంగజేబుతోఁ బోరాడసాగిరి. ఔరంగజేబు రాజసింహునియెడఁ గోపము కలుగుటకు నిది రెండవకారణము.

ఔరంగజేబు హిందూమతముపై మిక్కిలి ద్వేషముకలవాఁడై హిందువుల యొద్దనుండి జుట్టుపన్ను వసూలుచేయఁదొడఁగెను. ఇందుకు రాజసింహుఁ డౌరంగజేబునకు మిక్కిలి హితబోధప్రదమగు నొకయుత్తరము వ్రాసెను. ఉత్త

జోధపురవీరాగ్రేసరుఁడు.



ఠాకుర్ దుర్గాదాస్.

రములోని భాష, యుక్తులు, ఉపలక్షణములచేతను అన్యోక్తులచేతను ఎత్తి పొడిచెడు కౌశలము, నిర్భయముగఁ బ్రవహించు లేఖనపద్ధతి, కేవల లోకోపకారమునకే కనఁబఱిచినయుత్సుకత, అత్యంతవర్ణనీయములు. ఆయుత్తరమే దేశమునందును, ఏకాలమునందును, ఎట్టి విద్వాంసుఁడు చదివినను దానిని శ్రేష్ఠతరమైన వాఙ్మయ (Superior Literature) మని మెచ్చుకొనవలసియుండును. ఆ యుత్తరములోని ముఖ్యాంశముల నీ క్రిందఁ దెనుఁగున నిచ్చుచున్నాము.



జోధపురదుర్గము.

'......నేను మీరాజసభకు వచ్చుట మానివేసినను, రాజభక్తితో మీకు నెప్పుడును సాహాయ్యము చేయవలయుననియే యున్నది. కాని నేను మీకు నొనరించు సాయము, హిందూదేశములోని యండఱు రాజులకును, సరదారులకును, సంస్థానికులకును, నవాబులకును ఉపయోగకారియై వారియార్జితావస్థకుఁ గారణముకావలయును. ఇంతియకాదు. నేనుచేయుసాహాయ్యము ఈరాన్ (పర్శియా) తురాన్, రూమ్ (టర్కీఇన్‌యూరోప్), శామ్ (టర్కీ ఇన్ ఏశియా) మొదలయిన సప్తద్వీపములలోని జనులకును, జలస్థలమార్గములఁ

ప్రవాసముచేయు బాటసారులకును ఉపయోగించి, వారందఱికిని అభేద బుద్ధితో నావలని మేలు కలుగవలయునని నాయొక్క కోర్కె............మీ పూర్వజుఁడయిన మహమ్మద్ జలాలుద్దీను యొక్క కీర్తిడిండిమ మిదివఱకును లోకమునందంతటను ప్రతిధ్వనులీను చున్నది. ఇందుకుఁ గారణమేమి? ఆతఁడు సర్వజనులయెడ సమదృష్టియుంచి యేఁబది రెండుసంవత్సరములు రాజ్యముచేసి యక్షయసుఖస్థానమునకుఁ బోయెను. వీఁడు బ్రాహ్మణుఁడు, వీఁడు హిందువు వీఁడు మహమ్మదీయుఁడు, వీఁడు జైనుఁడు, వీఁడు క్రైస్తవుఁడు అను భేదము చేయక యన్నిమతములవారికిని, అన్నిజాతులవారికిని సౌఖ్యముకలుగునట్లు రాజ్యముచేసెను. ఆతనికిఁ బక్షపాతములేనందుననే 'జగద్గురు' వనుసార్థక నామమువచ్చెను. పక్షపాతరహితప్రవర్తనమును గుఱించినపాఠమును సకల లోక మాతనియొద్దనుండి నేర్చుకొనఁదగు............ఇఁక మీరాజ్యమును చూచిననో, మీప్రవర్తనవలన మీప్రజాజనులు, మీస్నేహితులును మీకుఁ బ్రతికూలులైరి. ప్రతిమనుజునికిని మీవలన నష్టముకలుగుచున్నది. ఎక్కడఁజూచినను దోఁచుకొనుట, దాఁచుకొనుట కానవచ్చుచున్నది. మీప్రజలందఱును అణఁగద్రొక్కఁ బడుచున్నారు; మీరాజ్యములోని ప్రతిప్రాంతమును దాద్ర్యమునందు మునిఁగియున్నది!...ఇఁకఁ బరాక్రమమున్ననోనున్న! కలాకౌశలములను గుఱించియు నర్తకమును గుఱించియుఁ జెప్పవలసినదిలేదు. మీ రెవ్వరిని గుఱించి మిక్కిలియభిమానముగా నుండెదరో యట్టి మహమ్మదీయులుకూడ సంతుష్టులయియున్నట్లు గానరాదు. మీరాజ్యమునందెటుచూచినను, హిందువులరోషము, మహమ్మదీయుల యసంతోషము, వర్తకులవినాశము, సరదారు దారిద్ర్యము, సైన్యముల శౌర్యహీనత యివితప్ప మ ఱేమియుఁగానరావు.. మీరాజ్యములోని హిందూప్రజలకెవ్వరికిని సాయంకాలము భోజనముచేయ నంత స్థిరతయు నుత్సాహంబునులేవు. రాజువలనఁ బ్రజలకుఁ గలుగుబాధల నింతకంటె నెక్కుడుబాధ మఱియేదికలదు? ఇట్టిప్రజాపీడనకరమైన స్వైరస

నముచే మీరాజ్యమును, సార్వభౌమపదవియు నెట్లునిలుచును? మీరు మీ దరిద్రప్రజలయొద్దనుండి బలవంతముగా ధనమును లాగుచున్నారు. అది మీకను కూలముగాఁ బరిణమించునా? బీదబ్రాహ్మణులు, సన్యాసులు, బైరాగులు, మొదలయిన యసంసారికులగు జోగులయొద్దనుండి పన్నుతీసికొని వారిని బాధపెట్టుచున్నాఁడని మీకీర్తి పూర్వపశ్చిమ దిఙ్మండలములంతయు వ్యాపించియున్నది. ఈమాట నిజమేయైనయెడల, శౌర్య పరాక్రమౌదార్యములకు విఖ్యాతిచెందిన తైమూర్ లంగ్ వంశమున జన్మించిన మీరు వనవాసులును, ఉదాసీనులును,



బరహాన్ పుర్.

నిరుపద్రవులును దరిద్రులును అగుజనులను దోఁచుకొనుటకంటె నధమమైనదియు నీచమైనదనియు నగు మఱియేపని తగలదు?

"మీ రేగ్రంథమును ఈశ్వరదత్తధర్మపుస్తకముగా నెంచెదరో యందుఁ జూచినయెడల నీశ్వరుఁడొకమహమ్మదీయులదేవుఁడే కాక సమస్తమానవుల దేవుఁడని మీకుఁదెలియఁగలదు. ఈశ్వరునకు మహమ్మదీయులును తదితరులును సమానులు. మానవుల శరీరవర్ణములలోను, స్వరూపములలోను, భేదముండుట

యీశ్వరునికి సృష్టినియమము. వానిసత్తామాత్రముననే మానవునికి అస్తిత్వము (ఉనికి) ప్రాప్తించును. మీశూన్యమందిరములలో (మసీదులలో) మీరుచేయు ప్రార్థనయాతఁడు వినును; విగ్రహములుకలగుళ్లలో గంటవాయించి చేయఁబడు పూజయు నాతఁడే గ్రహించును. ఇతరులధర్మమును గుఱించియు నాచారవ్యవహారములను గుఱించియు దురాగ్రహముఁ గల్పించుకొని వారినిబాధించుట యీశ్వరునకు నసమ్మతము. పటమునువ్రాసిన చిత్రకారునియెదుట నాపటమును ద్రొక్కి-చించివేసినయెడల నాతనికెట్లుకోపమువచ్చునో, యట్లె యితరమతములను ద్వేషించుట యీశ్వరక్షోభమునకుఁగారణము. ఈశ్వరుఁడొక యద్వితీయుండును అప్రతిముఁడును అగుచిత్రలేఖకుఁడు. అతఁడీవిశ్వ మనువిస్తీర్ణపటము (బట్ట) మీఁద నానామతాచారములు, వివిధమనుష్యజాతులు, మొదలగు చిత్రములఁ జిత్రించినాఁడు. అందలికొన్నిటియెడ ద్వేషముపూనుట యాసృష్టికర్తను ద్వేషించి యాతని కోపమునకుఁ బాత్రులగుటయే. న్యాయదృష్టిచే విచారించినయెడల మీరు హిందువులపైవేసిన పన్ను కేవల మన్యాయము. నిజమైన రాజ్యకర్తృత్వమును, నీతియు మీయందు లేనందునకు నిది నిదర్శనము......"

రాజసింహుఁడు తనకిట్టియుత్తరము వ్రాయుటయుఁ, దాను కోరిన స్త్రీని దీసికొనిపోయి వివాహమాడుటయు, మార్వాడ్ బాలరాజునకు నాశ్రయమిచ్చుటయుఁ జూచి ఔరంగజేబు మండిపడి యాతనితో యుద్ధము చేయుటకుఁ దనసైన్యములనన్నిటిని సిద్ధపఱిచెను. వేఱువేఱు ప్రాంతములలో నున్న తన ముగ్గురుకుమారులను రావించెను.

ఇట్లు ఔరంగజేబు యుద్ధసన్నాహముఁ జేయుచున్నాఁడని తెలియఁగనే రాజసింహుఁడును సైన్యములఁ జేర్చుకొని పోరాట ప్రారంభించెను. మొగలుల రాజ్యములోని మాల్‌పురాయను నగరమును దోఁచెను. అటుతరువాత జరిగిన యన్ని యుద్ధములలోను రాజసింహునకే జయము కలుగుచు వచ్చెను.

ఆయుద్ధములో శిశోదియావంశముయొక్క శౌర్యమును, శరణాగతరక్షణమను సద్గుణమును లోకమున కంతయు వెల్లడియై కాన్పించెను.

ఔరంగజేబు తన సైన్యములతోఁ గొంతవఱకు వచ్చి తాను ఉదేసాగరము నొద్దనే విడిసియుండి తన సైన్యములను మూఁడు భాగములుగా విభజించి వారిని వేఱువేఱుమార్గముల శత్రువులమీఁదికిఁ బంపెను. అందు నొక భాగమునకు నధిపతియైన యక్బరను రాజపుత్రుఁడు తన సైన్యములతో నుదయపురము మీఁదికిఁ బోయెను. అచ్చట నాతనిని ఎవరును ఎదిరింపరైరి. నిరాటంకముగా గ్రామము ప్రవేశింపఁ గలిగినందునఁ దమకు నా గ్రామము స్వాధీనపడినదని భ్రమపడి మోగలు లశ్రద్ధతో నుండిరి. 'వారు దోఁచుకొనవచ్చి నిదురపోయిరి' అని యీమోగలులను గుఱించి భట్రాజులు వ్రాసియున్నారు! ఇటు రాజపుత్రుల యువరాజగు జయసింగు, మోగలులు ఉదేపురమునుండి వెలుపడకుండఁ జుట్టునున్న మార్గముల నన్నిటిని నడ్డగించెను. అందుచే వారు బంధింపఁబడిరి. ఎటు పోవుటకును దోఁచక వా రొకమార్గమునఁబడి బయలుదేఱి యొకానొక పర్వతదరిలోఁ జిక్కిరి. రెండు వైపుల రెండు కొండలు; నడుమ నున్న సందులో నీమోగలులు! ఇంకేమి? రాజపుత్రులకు సహాయులయిన భిల్లసైనికులు రెండుకొండలమీఁద నెక్కి మ్లేచ్ఛులపై శిలావర్షముఁ గురిపింప సాగిరి. ఇట్లువేలకొలఁది మోగలసైనికులు చచ్చిరి. పాఱిపోయెదమనిన దరీద్వారమును రాజపుత్రులడ్డగించిరి. కావున నక్బరునకు శత్రువులకు లొంగుట తప్ప వేఱుమార్గము లేక, యాతఁడు రాణాకు శరణు చొచ్చి యిఁక యుద్ధము చేయనని యొప్పుకొని యాసంకటములోనుండి రాణాకృపవలనఁ దప్పించుకొనిపోయెను.

మోగలసైన్యముల రెండవభాగము దిలేర్ ఖానుఁ డనుశూర సరదారుని యాధిపత్యముక్రింద నుండెను. అతఁ డక్బరు దీనావస్థవిని యాతనికి సాయము చేయుటకై యొకకొండ త్రోవఁబడి వెళ్లుచుండెను. మేవాడ్ రాజు సాహాయ్య

కర్తలగు రూపనగరాధీశుఁడు విక్రమసోళంఖీ యనువాఁడును గనోర్ సంస్థానా ధీశుఁడు గోపీనాథ్ రాఠోడ్ అనువాఁడు ఈదిలేర్ ఖానుని ఎదిరించి యాతని సైన్యమును రూపుమాపిరి. ఈతడవ మోగలులయొద్ది ధనమును అనేక వస్తువులును రాజపుత్రులకు దొరకెను.

పైని వర్ణింపఁబడిన రాజపుత్రవీరులు దిలేర్ ఖానునితోఁ బోరాడు నపుడు రాణాస్వయముగ ఔరంగజేబును, ఆతని కుమారుఁడయిన యజీమును ఎదిరించి వారిని పరాభవించెను. ఎటుచూచినను రాజపుత్రులఖడ్గమునకు నెదురు లేదయ్యె. ఈయుద్ధములో మోగలులవెంట ఫిరంగులును వానిని గాల్ప నేర్చిన పోర్చుగీజ్ వారును నుండిరి. కాని దుర్గాదాస్ అను రణశూరుండు వారిని లక్ష్యపెట్టక వారిపైఁబడి యాబుడతకీచులనందఱిని (Portuguese) నఱికి వేసెను. ఈతడవ రాజపుత్రులు మోగలుల సైన్యములో నుండి యసంఖ్య ధనమును యుద్ధోపకరణములును దోఁచుకొనిరి. ఇట్లు శత్రుసైన్యమును దోఁచుకొనిన శ్రేయస్సంతయు మోఖిమ్, సూక్తావత్ అను సరదారులది యని భట్రాజుల గీతములు చెప్పుచున్నవి.

ఈ యుద్ధములలో నొకప్పుడౌరంగజేబు యొక్క భార్యయగు ఉదేపురి యనునామె రాజసింహుని చేతిలోఁ జిక్కెను. కాని సద్గుణ సంపన్నుఁడగు నాక్షత్రియపుంగవుఁ డామెకు నెంతమాత్రమును అపాయముగాని యగౌరవముగాని చేయక తన సేవకుల వెంటనిచ్చి మర్యాదతో నౌరంగజేబు నొద్దకుఁ బంపెను!

మఱియొకసారి ఔరంగజేబు తన పరిమిత సైన్యముతో నొకపర్వత దరిఁ జొచ్చెను. రాజపుత్రసైనికు లా గుహాముఖమును చెట్లతోను రాళ్లతోను మూసివేసిరి. లోనున్న ఢిల్లీశ్వరున కెటుఁ బోవుటకును దారిలేదయ్యె. తినుట కన్నము లేదయ్యెను. ఇటు లాసార్వభౌముఁడు రెండు దినముల వఱకును దన సేనతో నుపవాసము చేసెను! కాని ఈసమాచారము రాజసింహునకుఁ దెలిసి,

యుద్ధముచేసి శత్రునిఁ జంపవలసినదే కాని యన్నము పెట్టక చంపుట క్షాత్ర ధర్మము కాదని యాదరీముఖమును దెలిపించెను! అంత నాతఁడు తన్ను విడి పించుటకు వచ్చిన తనసేనను గలిసికొనెను.

ఇట్లు పరాజయము చెందిన మొగలసైన్యము లన్నియు జితోడ్ గడము క్రిందఁజేరెను. వారికిఁ దినుటకు నాహారపదార్థములు లేనందున రస్తుసామగ్రి పంపవలసినదిగా నౌరంగజేబు అజమీరునకు వర్తమానమంపెను. కాని యా సామగ్రిని త్రోవలోనే సావళదాసుఁడను రాజపుత్రుఁడు కొల్లగొట్టెను. అంతఁ బ్రాణములు విసివి యాయుద్ధమంతయుఁ గుమారులకు నప్పగించి యౌరంగజేబు అజమీరుకు వెడలిపోయెను. అచ్చటికిఁ బోయినతోడనే సైన్యముల నిమిత్తమై యెక్కుడు తినుబండారమును బంపుచుదాని సంరక్షణార్థమై ఖాన్ అను సర దారునకుఁ బండ్రెండువేల సైన్యమిచ్చిపంపెను. కాని శూరవరుఁడగు సావళ దాసుఁడును మార్వాడ్ దేశపు రాథోడ్ రాజపుత్రులును ఈతురుష్కులపైఁ బడి వారిని నోడించి యాసామగ్రియంతయుఁ దీసికొని పోయిరి.

ఈప్రకార మెటుచూచినను రాజపుత్రులకే జయము కలుగుటవలన మొగ లుల గౌరవము మిక్కిలి తగ్గెను. అందుచే నెటులయిన సంధిచేయవలయునని నౌరంగజేబు తలఁచెను. సంధినిగుఱించి యుభయులకును రాయబారములు జరుగు చుండెను. ఇంతలోఁ జిన్ననాఁటి నుండియు నెడతెగకుండ యుద్ధ ములుచేసిన శ్రమవలన రాజసింహుఁడు క్రీ. శ. ౧౬౮౧లోఁ గీర్తిశేషుఁ డయ్యెను. అందుచే రాజపుత్రులు తమకు నష్టములేనట్టి సంధి తురుష్కులతో వెంటనే చేసికొనిరి.

ఇచ్చట మన మీవీరపురుషుని యోగ్యతను గుఱించి కొంచెమాలోచింప వలయును. ఈతనికిని ఈతని ప్రతిస్పర్థియగు ఔరంగజేబునకునుగల గుణస్వ భావతారతమ్యములఁ గనుఁగొనవలయును. ఔరంగజేబు వంటి దుష్టుఁడును లోభియు, హింసకుఁడును, నిర్దయుఁడును, విచిత్రుఁడు నగురాజు మఱియొ

కఁడు లేఁడని చరిత్రకారులు వ్రాసియున్నారు. సర్వప్రాణులకు సాధారణమైన కృతజ్ఞతయను గుణముకూడ వానియందు లేదు! ఉపకారము చేసినవానికిఁ బ్రత్యుపకారము చేయుటయే యీతఁడు ధర్మమని తలఁచుచున్నట్లు గానవచ్చు చున్నది. ఇఁక రాజసింహునివైపు చూతము. గంభీరమైన మనస్సు, ఉదారాంతఃకరణము, సదసద్వివేకాను వర్తనము, సత్యనిష్ఠ, అనునవి యఖిలరాజపుత్రుల సాధారణధర్మములు. అవి యినుమడిగా నీరాణాయందు నుండినవనుటకు సందేహములేదు. యుద్ధవిషయమునఁదప్ప శత్రులయెడ నిర్మాత్సర్యము, సంకటములఁజిక్కిన శత్రులయెడ ననుకంపయను నత్యున్నతనీతితత్వము నీరాజు యొక్క చరిత్రలో విచ్చలవిడిగఁ గానవచ్చుచున్నవి. అసామాన్య శౌర్యపరాక్రమముతో జంటగానుండుటచే నీసద్గుణము లెక్కువగాఁ బ్రకాశించుచుండెను. శత్రుస్వాధీనములోనున్న గుజరాత్ దేశమును తన కుమారుఁడు చెండాడుచున్నాఁడనియు నందువలన నచ్చటిప్రజలకు మిక్కిలిబాధ కలుగుచున్నదనియు విన్నతోడనే యీదయామయుఁడగు నరేశ్వరుఁడీకఁ బరాక్రమము చాలించి యింటికిరమ్మని కుమారునకు వ్రాసెను. ఇట్టిభూతదయ మఱియేరాజునకుఁ గలదు? రాజపుత్రస్త్రీల పాతివ్రత్యమును చెఱుపుటయే వ్రతముగాఁగల శత్రునిభార్య చేఁ జిక్కినపుడామెను మాతృభావముతోఁజూచి గౌరవముతోఁ బంపివేసిన వానియొక్క దైవిక సుగుణసంపదను వేయినోళ్లఁ గొనియాడినను చాలునా? ఈతని శౌర్యపరాక్రమాదులకు నీతనివిజయములే సాక్షి. ఈతని పాండిత్యమునకును, భాషానైపుణ్యమునకును ఈతఁ డౌరంగజేబునకు వ్రాసిన యుత్తరమే సాక్షి. ఇట్లీతఁడు సకలసద్గుణసంపన్నుఁ డనుటకు సందేహములేదు. కాని యీతనియందు నొక దుర్గుణముండెను. ఔరంగజేబుయొక్క పొగరుపూర్తిగ నడఁచి రాజపుత్రస్థానమునకే కాక హిందూదేశమున కంతటికిని స్వాతంత్ర్యమొసఁగుయోగ్యత యీతనికుండియు, నపరిమితదయయను నొక దుర్గుణ మీతనియం దుండుటచే నీతనివలన నట్టిఘనకార్యము జరుగలేదు! తన

రాజ్యమును మాత్రము రక్షించుకొనఁ గలిగెను. దుర్మార్గులును, నీతిబంధనములు లేనివారును అగు శత్రువులు చేతఁ జిక్కినపుడు వారినిఁబూర్తిగ సంహరింపక, శరణనినమాత్రమున విడిచిపెట్టుట మరల తనమీఁదికి యుద్ధమునకు రమ్మని వారిని బిలుచుటయేగదా? కృతోపకారమును స్మరించెడి సజ్జనుఁడు శత్రుఁడయినపుడు క్షమించినను క్షమింపవచ్చును గాని దుర్మార్గుని వదలివేయుట రాజనీతిలో నొక గొప్పపొరపాటని యింగ్లీషు గ్రంథకారుఁడు టాడ్ వ్రాసియున్నాఁడు. ఇది యసత్యమని యెవరు చెప్పఁగలరు?

మహారాష్ట్ర రాజ్య సంస్థాపకుఁడగు శివాజి యీరాజసింహునితో సమకాలీనుఁడు. శివాజి ౧౬౮౦లోను, ఈతఁడు ౧౬౮౧లోను కీర్తిశేషులయిరి. వీరిద్దఱును నేకవంశజులు; హిందూమతమునం దభిమానము కలవారు. ఇద్దఱికిని ఔరంగజేబు శత్రుఁడు. వీరిద్దఱును గలిసి ఔరంగజేబుతోఁ బోరాడియుండిరేని యాతనిమచ్చ పూర్తిగమాపియుందురు. కాని వారేకారణము చేతనో వేఱువేఱుగనే ఔరంగజేబుతోఁ బోరాడిరి.

ఈరాజసింహుఁడు తనప్రజలను బిడ్డలవలెఁ గాపాడుచుండెను. ఈతని రాజ్యకాలమున క్రీ. శ. ౧౬౬౧లో గొప్పకఱవు తటస్థించెను. అప్పుడు బీద జనులను రక్షించుటకును, ముందట్టికఱవులు రాకుండుటకును, అత్యంత విశాలమైనదియు, సుందరమైనదియు నగు నొక్కతటాకము త్రవ్వించి దానికి రాజసముద్రమని పేరుపెట్టెను. రాజనగరమను నొక పట్టణమును కోటయుఁ గట్టించెను. ఈపనుల కన్నిటికిని తొంబదియాఱులక్షల రూపాయలు పట్టినవి. ఇంతచిన్న రాజ్యముగల రాజసింహుఁడు కఱవుకాలములోఁ బ్రజలను బోషించుటకు రమారమి కోటిరూపాయలు వెచ్చించుట వలననే యాతని యద్వితీయ ప్రజావాత్సల్యము వెల్లడియగుచున్నది.

## జయసింహుఁడు.

(౧౬౮౧ - ౧౭౦౦).

ఇతఁడు రాజసింహుని రెండవకుమారుఁడు. ఈతనికంటెఁ గొన్నిగడియలు

తొల్తఁ బుట్టినందున జ్యేష్ఠుఁడగు భీమసింహుఁ డొకఁడుండెను. తండ్రియాజ్ఞ ననుసరించి యాపితృవాక్యపరిపాలన నిరతుఁడు శ్రీరాముని వలెఁ దనకు రాజ్యము మీఁదఁగల హక్కంతయు వదలుకొని దేశాంతరగతుఁడయి తిరిగి వచ్చిన వాఁడుకాఁడు. దిలేర్ ఖానుఁడను వానిద్వారా ఔరంగజేబునకును రాజపుత్రులకును సంధికలిగెను. అయినను రాణా యనేకపర్యాయములు మొగలులతో యుద్ధముచేయవలసినవాఁ డాయెను. ఈరాజు జయసముద్ర మను బ్రహ్మాండ మయిన తటాకమును గట్టించెను. ఈతటాకముయొక్క వైశాల్యము పదునైదు చదరపు క్రోశములు. ఇది యెప్పుడును జలమయమైయుండి యారాజ్యము లోని వ్యవసాయమునకు గొప్పయాధారమై యున్నది. ఈతని చరమావస్థ యందు నీతఁడు స్త్రీలంపటుఁడగుట తటస్థించి గృహకలహము లధికమయ్యెను.

## అమరసింహుఁడు.

(౧౭౦౦ - ౧౭౧౬).

ఈతఁడు రెండవ యమరసింహుఁడు. ఈతనికి నుమరావ్ సింగని నామాంతరము. ఈతని సమయమున జరిగిన ముఖ్యవిశేషము రాజపుత్రుల యైక్యము. జయపూర్, జోధ్ పూర్, బూందీ మొదలయిన వారందఱును ఉదేపురరాజులతో నేకీభవించి యిఁకముందు మహమ్మదీయులకుఁ బిల్లల నీయఁగూడదనియు, రాజపుత్రులందఱును నైక్యభావముతో నుండవలయు ననియు నేర్పాటు చేసికొనిరి. కాని కొన్ని దినములలోనే జోధపురరాజయిన యజితసింహుఁడు దిల్లీశ్వరుఁడగు ఫరుఖ్ సేయర్ అనువానికిఁ బిల్ల నిచ్చినందున రాజపుత్రులలో మరలఁ గలహములు ముదిరెను. అమరసింహుఁడు ౧౭౧౬లో గతించెను. ఈతఁడు చాకచక్యముగలవాఁడు, స్వకార్యదక్షుఁడు, ఉదారాంతఃకరణము గలవాఁడు. తనరాజ్యములోని వ్యవసాయమును, కలాకౌశలములును, అభివృద్ధిచేయుటకై యీతఁడు మిక్కిలి శ్రద్ధవహించెను. మొత్తముమీఁద రాజ్య గౌరవముఁ జక్కఁగ రక్షించినవాఁడని కీర్తివహించెను.

## సంగ్రామ సింహుఁడు.
## (౧౭౧౬ - ౧౭౩౪).

ఈతఁడు శాంతిప్రియుఁడు. అప్పుడు మొగలుల రాజ్యముయొక్క యవసానకాల మయినందున నితరరాజపుత్రరాజులు జాగ్రతపడి వీ లయినప్పుడెల్ల మొగలరాజ్యములోని కొన్ని భాగములను స్వాధీనపఱుచు కొనుచుండిరి. కాని యీతఁడుమాత్ర మాజోలికిఁ బోక తనరాజ్యములోని ప్రజలకు హితప్రదములగు నేర్పాటులు చేయుచుండెను. న్యాయవిచారణ, పన్నువసూలు, అనురాజ్యాంగములలోఁ దగినసంస్కరణలుచేసి ప్రజలకు హితమొనరించెను. ఈతనిమంత్రి పేరు బిహారిదాస్ పంబోలి. ఈయమాత్యాగ్రణి బుద్ధికుశలుఁడనియు, రాజకార్య విశారదుఁడనియు, స్వామిహితైక చిత్తుఁడనియు, సజ్జనుఁడనియు ఖ్యాతివహించెను. సంగ్రామసింహుఁడు ౧౭౩౪లో మృతుఁడయ్యెను. ఈతని తరువాత ఉదేపుర వైభవలక్ష్మి తగ్గిన దనవచ్చును.

## జగత్ సింగ్.
## (౧౭౩౪ - ౧౭౫౨).

ఈతఁడు రెండవజగత్ సింగ్. రెండవ యమరసింహునికాలములో రాజపుత్రుల యైక్యమునుగుఱించి జరిగిన నిబంధనలు నడుమ శిథిలములైయుండె. కాని యీరాణారాజ్యములో మరల రాజపుత్రులొక్కటయిరి. ఈసమయమున్ననే మరాటావారు రాజపుత్రస్థానముమీఁదికి దండెత్తివచ్చి చౌధాయియను నాలవవంతుపన్ను వసూలు చేయందొడఁగిరి. రాజపుత్రులు హతవీర్యులయిరి. జగత్ సింగు విలాసమగ్నుఁడై ౧౭౫౨లో మరణముఁ జెందెను.

ఈ కాలమున మరాటావారు రాజపుత్రులతోఁ బోరాడుటచూడ మిక్కిలి యాశ్చర్యముగ నున్నది. రాజపుత్రులు హిందువులు; ఈదేశపువారు; మిక్కిలి శూరులు; అప్పటివఱకు మొగలులతోఁబోరాడి పోరాడి యలసియుండిరి. అట్టి సమయమున మరాటావారు తమదేశమతబంధువులకు సా

యము చేసి, వారును దాముకలిసి క్షీణించుచున్న డిల్లీమొగలులవెంటఁ దగిలి యుండిన యెడల నచిరకాలములోనే హిందూదేశమందంతటను హిందూ రాజ్యము, వ్యాపించి, దేశమునకు అప్పటికి నేఁడువందలయేండ్లక్రిందఁ బోయిన స్వాతంత్ర్య మబ్బియుండును. వార అట్లుచేయక తమ సోదరులయిన రాజ పుత్రులను పీడించి, వారిబలమును తమబలమును వ్యర్థపుచ్చుటయే మంచిదని తలఁచిరి!

## ప్రతాపసింహుని మొదలు హమీరునివఱకు.

(౧౭౫౨ - ౧౭౭౮).

ప్రతాపసింహుని కాలమున శిండే, హోల్కర్, రఘునాథ్‌రావ్ పేష వా యను మరాటావీరులు రాజపుత్రస్థానమును దోఁచుకొనిరి. ఈతఁడు ౧౭౫౫లోఁ జచ్చెను. తరువాత నీతనికుమారుఁడు రెండవరాజసింహుఁడు రాజయ్యెను. మరాటివారు మూఁడుసారులు రాజపుత్రస్థానము మీఁదికి దండెత్తిపోయి, యుద్ధవ్యయమంతయు నుదేపూరుబొక్కసములోనుండి తీసి కొనిరి. అందుచే రాజు మిక్కిలిదరిద్రుఁడయ్యెను. తనవివాహమునకు మరాటా వారిని బతిమాలుకొని వారియొద్దనుండి యప్పుతీసికొనవలసినవాఁడాయెను! ఈతఁడు ౧౭౬౨ లో మృతుఁడైనతరువాత నీతని పినతండ్రి ఉర్సింహుఁడు రాజ్యమునకువచ్చెను. ఈతఁడు దుర్మార్గుఁడై తనసరదారులను మిక్కిలి బాధ పెట్టెను. అందుచేనీతఁడు చంపఁబడియె. ఈతనిమూర్ఖతవలన మేవాడ్ రాజ్య మునకు ననేకకష్టములు సంభవించెను. అమరసింహుఁడను మంత్రిపుంగవుని బుద్ధివిశేషమునలనఁ గొంతవఱకు నీరాజ్యపుమర్యాద దక్కెను. ఉర్సింహుని తరువాత నాతనికుమారుఁడు హమీరుఁడు రాణాయయ్యెను. కాని 'రాణా' పదముయొక్క గౌరవము మలినమయ్యె. అంతర్ద్వేషములచే నెటుచూచినను రాజ్యమునకు శత్రువులే యుత్పన్నులైరి. ఈతఁడు చిన్నవాఁడగుటచేత నీతని

తల్లి రాజ్యముఁజూచుచుండెను. సజ్జనశ్రేష్ఠుఁడగు అమరచంద్రుఁడు మంత్రిగా నుండెను. కాని రాణియాతని విషయమై వైషమ్యముకలదియై యాతనికి విషము పెట్టి చంపించెననియెదరు. ఈమంత్రిపుంగవుఁడు రాజభక్తుఁడనియు, స్వదేశప్రీతిగలవాఁడనియు, సత్యసంధుఁడనియు విఖ్యాతిఁజెందెను. నేఁటివఱకును ఈతనినామమునకు రాజపుత్రస్థానములోని జనులు చేయియెత్తి నమస్కారము చేసెదరు. హమీరుఁడు ౧౭౭౮ లోఁ బరలోకగతుఁడయ్యెను. ఈతని తమ్ముఁడగు భీమసింగు రాజ్యాధిపతియయ్యెను. అప్పుడాతఁడెనిమిదేండ్లవాఁడు. కొంతకాలమువఱకు నీతనితల్లియే రాజ్యమును జూచుచుండెను. ఈపారతంత్ర్యమువలన నీతనియందు ననేకదుర్గుణము లంకురించెను. ఈతఁడేఁబది సంవత్సరములవఱకు రాజ్యముచేసెను. ఈతఁడు చూచినన్ని దైవదుర్విలాసములును, అనుభవించినన్ని సుఖదుఃఖములును మఱియొకరాజు పాలిటఁ బడియుండవు. మరాటావా రీతనిరాజ్యమును ఎన్నియో సారులు దోఁచుకొని పాడుచేసిరి. ఈతనికి నతిరూపవతియగు కృష్ణాకుమారియను కూఁతురుకలదు. ఆమెనుగుఱించి రాజపుత్రులలో ననేకకలహములు పుట్టినందున, నిజరాజ్యగౌరవరక్షణార్థమై యామెకు విషమిచ్చి చంపవలసిన వాఁడాయెను! ఈభీమసింహుఁ డత్యంత దరిద్రుఁడయినందునఁగొన్ని దినములవఱకుఁ గోటాసంస్థానాధీశ్వరుని యొద్దనుండి ధనముఁదీసికొని యుదరనిర్వాహము చేయవలసినవాఁడాయెను! ౧౮౧౭ లో నీతఁ డింగ్లీషువారి సార్వభౌమత్వమును నొప్పుకొనెను. భీమసింహుఁడు ౧౮౨౮ లో మృతుఁడయ్యె. ఆతనికుమారుఁడు జవాన్ సింహుఁడు ౧౮౩౮ వఱకు రాజ్యముచేసెను. ఈతని పెద్దకుమారుఁడగు సరదారసింహుఁడు ౧౮౪౨ వఱకును, చిన్నకొమారుఁడు సురూపసింహుఁడు ౧౮౬౧ వఱకును, ప్రభుత్వముఁ జేసిరి. రూపసింహుని దత్తకుమారుఁడగు శంభుసింహుఁడు ౧౮౭౪ వఱకును రాణాపదవి ననుభవించెను. ఈతఁడు మిక్కిలి లోకప్రియుఁడయినందునఁ బ్రజ లీతనిమరణమునకు మిగులఁ జింతించిరి. ఈతని దత్తకుమారుడఁగు

సజ్జనసింహరాణా పదిసంవత్సరములు రాజ్యముచేసి ౧౮౮౪ లో మృతుఁడయ్యెను. అప్పటినుండియు ఫత్తేసింహరాణాగారు రాజ్యము చేయుచున్నారు. మేవాడ్ రాజ్యముయొక్క ప్రస్తుతపు జనసంఖ్య పండ్రెండులక్షలు. నలువదిలక్షల రూపాయలు దానియాదాయము.



## ఆఱవ ప్రకరణము.

## విజయనగర సామ్రాజ్యము.

ఉత్తర హిందూదేశమునుండి మహాప్రవాహముతో వెడలి దక్షిణహిందూదేశమందలి హిందూమతమును హిందూరాజ్యములను రూపుమాపుటకు సిద్ధముగానున్న మహమ్మదీయులనఁబడు మహానదిని రెండువందల యేఁబది సంవత్సరములవఱకు నడ్డగించి హిందూమతమును హిందువుల ప్రాభవమును రక్షించిన విజయనగర సామ్రాజ్యమును వేయినోళ్లఁ గొనియాడినను తనివి తీఱదు. క్రీ. శ. ౧౩౦౭ లో మహమ్మదీయులు దేవగిరి రామరాజును చెఱపట్టిరి; ౧౩౧౦లో ద్వారసముద్రములోని బల్లాలరాజుల నంత మందించిరి; ౧౩౨౩లో నోరుగంటి ప్రతాపరుద్రుని డిల్లీకిఁ గొంపోయిరి. ఇట్లు దక్షిణ దేశములోని హిందూరాజ్యములన్నియు నడుగంటినందున హిందూమతమునకును తదుద్ధరణమునకును నాధారమేమియు లేకపోయెను. దక్షిణ హిందూదేశమున కట్టి విపన్నావస్థ ప్రాప్తించినపుడు దాని నుద్ధరించుటకు నవతరించిన రాజ్యమే విజయనగర సామ్రాజ్యము. ఈ ప్రభుత్వమప్పు డుదయించియుండని యెడలఁ బదునాల్గవశతాబ్దమునందే యనఁగా నేఁటికి నైదువందల సంవత్సరములకుఁ బూర్వమే దక్షిణదేశమంతయుఁ బూర్తిగఁ దురుష్కులపాలై, హిందూమతమంతయు నడుగంటి, నేఁటివఱకు మనమందఱమును మహమ్మదీయులమై యుందుమనుట యతిశయోక్తి కానేరదు.

విజయనగర పట్టణము తుంగభద్రా నదీతీరమునఁ బ్రస్తుతపు బళ్లారి మండలములోని హాస్పేటయొద్ద నుండెను. ఈపట్టణము నిర్మించుటకుఁ బూర్వము అనగొందియను పట్టణములో నీదేశపురాజులు రాజ్యము చేయుచుండిరి.

అచ్చట వారేడువందల సంవత్సరముల వఱకు రాజ్యము చేసిరంట. కాని వారి విషయమై మనకుఁ బేళ్లుతప్ప విశేషమేమియుఁ దెలియదు. రాయవంశావళి యను గ్రంథమునుబట్టి చూడఁగా నందుఁ డనురాజు కిష్కింధలోఁ అనఁగా ఆనగొందిలోఁ ౧౦౧౪ మొదలు ౧౦౭౬ వఱకు నఱువదిమూఁడు సంవత్సరములు రాజ్యముచేసినట్టు కానవచ్చెడిని. అతఁడు మిక్కిలిధనమును సంగ్రహించెను. అతనికుమారుఁడగు చాళుక్యరాజు ౧౦౭౬ మొదలు ౧౧౧౭ వఱకు రాజ్యము చేసెను. ఇతనికి ముగ్గురుపుత్రులు కలరు. అందగ్రజుండు బిజ్జలుఁడనువాఁడు కల్యాణపురమునకు రాజయ్యెను. విజయధ్వజుఁడను రెండవవాఁడు ౧౧౧౮ మొదలు ౧౧౫౬ వఱకు ఆనగొందిలో రాజ్యము చేసెను. విష్ణువర్ధనుఁడను మూఁడవవాని విషయమై మనకంతగాఁ దెలియదు. విజయధ్వజుఁడే తుంగభద్రా తీరమునఁ దనపేరిట విజయనగరమను పట్టణమును గట్టించెనని కొందఱు వ్రాసి యున్నారు. కాని యదిమిక్కిలి చిన్నపట్టణమై యుండనోపు. అతివిశాల పట్టణమని విఖ్యాతిఁజెందిన విజయనగరము ౧౩౩౬ లో మాధవ విద్యారణ్యుల వారి ప్రోత్సాహమువలన హరిహర రాయలచే నిర్మింపఁబడియె. విజయధ్వజుని తరువాత నతని కుమారుఁడగు అనమరాజు ౧౧౭౯ వఱకును, మునిమనుమఁడగు రామదేవరాయఁడు ౧౨౭౧వఱకును రామదేవరాయని కుమారుఁడగు ప్రతాప రాయఁడు ౧౨౯౭ వఱకును ప్రభుత్వము చేసిరి.

ప్రతాపరాయని కుమారుఁడు జంబుకేశ్వరుఁడు ౧౨౯౭ మొదలు ౧౩౩౪ వఱకు ముప్పదియేడు సంవత్సరములు రాజ్యమేలెను. ఆనగొందిరాజులలో నితఁడు కడసారివాఁడు. ౧౩౨౫ మొదలు ౧౩౫౧ వఱకు డిల్లీ పట్టణము నేలి మహాక్రూరుఁ డనిపించుకొనిన మహమ్మద్ తుఘ్లఖ్ కాలములో నాతనిని ధిక్కరించి యానగొందిలో ఈరాజు రాజ్యము చేయుచుండెను. ఢిల్లీశ్వరుఁ డీరాజుతోఁ బండ్రెండు సంవత్సరములవఱకుఁ బోరుచుండెను. ఇంతలో ఢిల్లీ శ్వరుని మేనల్లుఁడగు బాహుద్దీన్ అనువాఁడపరాధముచేసి మహమ్మద్ తుఘ్

లక్ యొక్క కోపమునకుఁ బాత్రుఁడై ఢిల్లీనుండి పాఱిపోయి యానగొంది రాజును నాశ్రయించెను. అందుచే ఢిల్లీశ్వరునకు మఱింత కోపమువచ్చి యాతఁడు ౧౩౩౮లో ఆనగొందిమీఁదికి దండెత్తివచ్చెను. తన్నులక్ష్యము చేయక పండ్రెండు సంవత్సరములనుండి ఘోరముగాఁ బోరుచున్న యానగొందిరాజును బూర్తిగ గెలుచుట కష్టసాధ్యమని తలఁచి 'నామేనల్లుని నాకు స్వాధీనపఱచినయెడల నేనువెడలిపోయెద' నని యాతడు వర్తమానమంపెను. శరణాగతత్రాణబిరుదుగల యారాజు అందుకు నొప్పుకొనక యుద్ధముచేసెను. కాని ఢిల్లీశ్వరుని సైన్యము లధికముగా నుండుటవలన ఆనగొందిరాజుకు విజయము కలిగినదికాదు. పరాభవము నిక్కమని తెలిసినతోడనే యారాజు తన భార్యాపుత్రాదులు తురుష్కులచేతులలోఁ జిక్కకుండ వారినిఁ దనఖడ్గముతో సంహరించి కోటలోనుండి వెడలి ఘోరముగాఁబోరి రణక్షేత్రమునందు వీరశయనము నొందెను. అతని సైనికులందఱును మడిసిరి. అర్గురినిమాత్రము మహమ్మద్ తుఘ్లక్ చెఱపట్టెను. అందు ఆనగొంది రాజుయొక్క మంత్రియొకఁడు; కోశాధ్యక్షుఁడు మఱియొకఁడు; మిగిలిన నలుగురు గొప్పసరదారులు. మంత్రిపేరు హరిహరుఁడు; కోశాధ్యక్షునిపేరు బుక్కరాయలు. వీరికోర్కెననుసరించి యానగొంది రాజుయొక్క శవము ఆనగొంది పట్టణమునకుఁ దీసికొనిపోఁబడి, యాతని యౌర్ధ్వదేహికక్రియలు మిక్కిలి గౌరవముతో జరుపఁబడెను. ఆరాజు నచ్చటిజనులు దేవునిగాఁ బూజించుచుండిరి. ఇట్లు ఢిల్లీశ్వరుఁడు ఆనగొంది రాజ్యమును వశపఱచుకొని అచ్చట మలిక్ నాయబ్ అను వానిని నధికారిగా నేర్పఱిచి చెఱఁబెట్టిన యార్గురిని వెంటఁదీసికొని ఢిల్లీకి వెడలిపోయెను.

*

ఇట్లు ఆనగొంది రాజ్యములోని ప్రజలందఱును పారతంత్ర్యములోనుండ నొల్లక ఢిల్లీశ్వరుని సేవకుఁడగు మలిక్ నాయబ్ మీఁదఁ దిరుగఁబడి పోరాడసాగిరి. వారి శౌర్యోత్సాహములును, స్వాతంత్ర్యప్రీతియుఁ, బట్టుదలయుఁ

జూచి యచ్చట రాజ్యముచేయుట దుర్లభమని తలఁచి మలిక్‌నాయబ్ ఈ సమాచారము తనయజమానునకుఁ దెలిపెను. ఇట్లు రాజ్యములోని ప్రజలందఱును దిరుగఁబడినందున నిఁకఁ దనరాజ్యము ఆనగొందిలో నుండుట దుర్లభమని తలఁచి చేయునది లేక, చెఱలోనున్న నాగ్గురినిఁ బిలిపించి, వారిలోనవిసఱకు ఆనగొందిరాజునకు మంత్రిగానున్న హరిహరరాయలకు ఆనగొంది రాజ్య మొసఁగి, ఆతఁడు తనకు సామంతుఁడుగా నుండునట్లొప్పించుకొని అతని తమ్ముఁడగు బుక్కరాయలకు మంత్రిత్వ మొసఁగి వారినిఁ బంపివేసెను.

## సామ్రాజ్యస్థాపనము.

౧౩౩౫లోనో ౧౩౩౬లోనో వచ్చి హరిహరరాయఁడు విజయనగరసింహాసన మెక్కెను; బుక్కరాయఁ డతనిమంత్రిగను యువరాజుగను నుండెను. ఇదియే విజయనగర సామ్రాజ్యమునకుఁ బ్రారంభకాలము. శూరాగ్రేసరులగు నీయన్నదమ్ముల పూర్వచరిత్రను గుఱించి యనేకు లనేకవిధముల వ్రాసియున్నారు. అందు నీక్రిందికథ సమ్మఁదగినదిగానున్నది. వీరిద్దఱు సంగముఁడను రాజవంశజుని పుత్రులు; ఓరుగంటి రాజులయొద్ద కోశాధ్యక్షులుగానుండిరి. ౧౩౨౩లో నోరుగంటి రాజ్యమును తురుష్కులు ధ్వంసముచేయఁగా వీరిద్దఱు నచ్చటనుండి ఆనగొంది సంస్థానాధీశ్వరుని యొద్దకుఁబోయి తమశౌర్య సాహస ప్రభావములచే మంత్రిత్వకోశాధ్యక్షత్వములను సంపాదించిరి. తరువాత వీరికా రాజ్యము వచ్చినవిధము పైని వర్ణింపఁబడినది.

హరిహరరాయఁడు మొదట ఢిల్లీశ్వరునకు సామంతుఁడుగానున్నను అపార తంత్ర్య మట్టిస్వదేశ స్వమతాభిమానము గలవానికి దుస్సహమై, యాతఁడు త్వరలోనే స్వతంత్రుఁడయ్యెను. అంతకుఁ బూర్వము ఓరుగల్లు, ద్వారసముద్రము, దేవగిరి, కొంకణదేశము మొదలయిన దేశపురాజుల యొద్దనుండి మహామ్మదీయులు తీసికొనిన రాజ్యములలో ననేక భాగములను హరిహరరా

జాక్రమించి తన రాజ్యవిస్తారము గావించెను. క్రమక్రమముగా మహీశూరు, కన్నడదేశము, వనవాసి (Banvasi), నాగర ఖండము మొదలయిన ప్రదేశములను జయించి రాజ్యమును అభివృద్ధిచేసెను. బాదమికోటను బాగు చేయించెను. కన్నడదేశమందలి జైనప్రభువుల వశపఱుచుకొనెను. పదునాల్గు సంవత్సరములు రాజ్యముచేసి, యీకాలములో విశాలరాజ్యమును, ప్రచండ సేనయు, నపరిమితధనమును సంపాదించెను. ౧౩౪౩లో ప్రతాపరుద్రుని కుమారుఁడగు కృష్ణనాయకుఁడును బల్లాళరాజునువచ్చి యీతని నాశ్రయింపఁగా నితఁడును బల్లాళ వంశజుఁడైన మఱియొక రాజును కృష్ణనాయకుఁడును గలిసి డిల్లీసుల్తాను సైన్యములతో ఘోరముగాఁబోరి దక్షిణ హిందూదేశమునుండి తురుష్కుల వంపఱినిఁ బాఱఁదోలిరి. ఒక్క దౌలతాబాదుదుర్గము దప్ప మహమ్మద్ తుఘ్లఖ్ సుల్తానుకు దక్షిణదేశములోనున్న రాజ్యమంతయు హిందువులు స్వాధీనపఱుచుకొనిరి. ఇట్లని ఫెరిస్తాయనువాఁడే వ్రాసియున్నాఁడు. ఇదియుఁగాక నెల్లూరుమండలములో నొక [1]తామ్రశాసనము కలదు. అది హరిహరరాయల తమ్మునికుమారుఁడగు సంగమరాయని కాలములోనిది; ౧౩౫౬లో చెక్కింపఁబడినది. అందు హరిహరరాయఁడు సుల్తానును పరాభవించినట్లు స్పష్టముగా నుదాహరింపఁబడినది. అందుచే నీతఁడద్వితీయ పరాక్రమశాలి యనియుఁ, గొలఁదికాలములోనే మహాబలవంతుఁడయ్యె ననియు స్పష్టముగాఁ దేలుచున్నది.

## హరిహరరాయలతమ్ములు.

శాసనములను బట్టిచూడఁగా హరిహరరాయలకు నలుగురు తమ్ములున్నట్లు కానవచ్చుచున్నది. పెద్దతమ్ముఁడు కంపభూపతి. ఇతఁడు తూర్పు రాజ్యమునకు నధికారిగానుండెను. ప్రస్తుతపు అనంతపుర నెల్లూరు మండలములుగల దేశ

1. Epig, Indica iii. 21.

మును అతఁడుగెల్చి యేలుచుండెను. రెండవవాఁడు బుక్కభూపాలుఁడు. ఇతఁడన్న ప్రభుత్వము చేయుకాలములో మంత్రిగను, యువరాజుగను, హొసల దేశమునకు మండలేశ్వరుఁడుగను ఉండెను. మూఁడవవాఁడు మారప్ప. ఇతఁడు కదంబదేశమును గెలిచి, చంద్రగుత్తి రాజధానిగా మహీసూరునకుఁ బశ్చిమమున నుండుదేశమును ఏలెను. నాల్గవవాఁడు ముద్దప్ప. ఇతనినిగురించి మన కేమియుఁ దెలియదు. ఇట్లు హరిహరునితో వీరైదుగు రన్నదమ్ములు; సంగముఁ డనువానికొమారులు. వీరు పంచపాండవులవలె నన్యోన్య ప్రేమ గలవారలై వర్తించుచుండిరని శాసనములు చెప్పుచున్నవి. శూరాగ్రేసరు లగుతమ్ములు రాజ్య విస్తారము చేయుటలో హరిహరరాజునకు నెంతయో సాహాయ్యము చేసిరను టకు సందేహములేదు. ఇతనియొద్ద బల్లప్ప దండనాయకుఁడను గొప్పసేనాని యొకఁడుండెను. ఒకశాసనములో నితనిని 'అళియబల్లప్ప' యన్నందున ఇతఁడు హరిహరుని అల్లుఁడేమోయని తోఁచెడిని. ఇట్టి తమ్ముల సాహాయ్యమువలనను సేనాధీశుని శౌర్యమువలనను హరిహరరాజు కొలఁది కాలములోనే బ్రహ్మాండ మైన సామ్రాజ్యమును స్థాపించెను. వీరందఱికంటె హరిహరునకు నెక్కుడు సాయముచేసిన మహానుభావుఁడు—

## మాధవవిద్యారణ్యులు.

సకలవిద్యలసారమును, రాజ్యనిర్మాణకర్తృత్వమును, లౌకికవైదిక వ్యవహార నిపుణతయు, స్వధర్మరక్తియు, స్వదేశస్వజనభక్తియు, అనుపమేయవైరాగ్య మును ఏకీభవించి మాధవవిద్యారణ్య స్వరూపమున నవతరించెనని చెప్పుటకు సందేహములేదు. సన్యాసమునకుఁ బూర్వ మీసత్పురుషునకు మాధవాచార్యు లనిపేరు. తురీయాశ్రమము స్వీకరించి శృంగేరిపీఠము నధిష్ఠించిన తరువాత నీజగద్వంద్యునకు విద్యారణ్యులనిపేరు. ఈమాధవులు బ్రాహ్మణులు. వీరిది యజుర్వేదము, బోధాయనసూత్రము, భారద్వాజగోత్రము. వీరియింటిపేరు

సాయణవారు. తల్లిపేరు శ్రీమతి. తండ్రిపేరు మాయణుఁడు. ఇతనికి సాయణ భోగనాథులను సోదరు లిద్ద ఱుండిరి. వీరాంధ్రులనియు, నియోగులనియుఁ గొందఱు వ్రాసియున్నారు. కాని యాంధ్రబ్రాహ్మణులలో బోధాయన సూత్రులు లేరు. కావున మాధవాచార్యులవా రాంధ్రులు కారని మానిశ్చయము. వీరధిష్ఠించిన శృంగగిరిపీఠముమీఁదఁ బ్రస్తుతమున ఆచార్యులుగా నున్న శ్రీ సచ్చిదానంద శివాభినవనృసింహభారతీ స్వాములవారు మాత్ర మాంధ్రులు, ములికి నాఁటివారు.

మాధవాచార్యులవారు ప్రథమ హరిహర, బుక్కరాయ, ద్వితీయ హరిహర రాజుల కాలములో వారికి మంత్రిగను హితబోధకుఁడుగను ఉండెను. ఇతని తమ్ముఁడగు సాయణాచార్యులవారు హరిహరరాజు యొక్కయన్నకుమారుఁడగు సంగమరాజునొద్ద మంత్రిగానుండెను. హరిహరబుక్కరాయలను నవ రాజ్య సంస్థాపనమునకుఁ బురికొల్పి యనన్యసామాన్య వైభవభూషితంబగు విజయనగరసామ్రాజ్యమును నూతనముగా నిర్మించిన శ్రేయస్సంతయు మాధవాచార్యులదియే యని నొక్కిచక్కాణింపనచ్చును. హరిహరబుక్కరాయలు పేరునకుమాత్రము రాజులుగా నుండిరనియు, రాజ్యభారమంతయు నాశ్రమ స్వీకారమునకుఁ బూర్వమును తరువాతను మాధవవిద్యారణ్యులే వహించిరనియు వైతిహ్యముకలదు. యత్యాశ్రమస్వీకారముచే వైహికసౌఖ్యములం గెంత మాత్రమును నిచ్ఛలేనివారయ్యును దేశమంతయు నరాజకమగుటయు శ్రౌతస్మార్తకర్మములన్నియు నశించుటయుఁజూచి స్వదేశస్వమతములను ఉద్ధరించుటకై కేవలనిరపేక్షబుద్ధితో నీమహానుభావుఁడు విజయనగరమను హిందూసామ్రాజ్యము నునిర్మించుటచూడ నితఁ డద్వితీయమహాపురుషుఁడని చెప్పవలసియున్నది.

మాధవసాయణులు సంస్కృతభాషలో నున్న యన్నిశాస్త్రములలోను అపారపాండిత్యము కలవారు. వీరిద్దఱును కలిసిరచించిన గ్రంథములసంఖ్య

నూఱును మించియున్నది. అందు శ్రౌతము, స్మార్తము, వేదాంతము, ధర్మశాస్త్రము, మీమాంస, జ్యోతిశ్శాస్త్రము, వైద్యము, వ్యాకరణము చరిత్ర మొదలయిన యన్నివిషయములమీఁద వీరు ఉద్గ్రంథములు వ్రాసిరి. అందు వేదభాష్యము ముఖ్యమైనది. దానికి సాయణభాష్యమని పేరు. నాలుగువేదముల యొక్క సంహితలకును బ్రాహ్మణములకును సంపూర్తిగ నీవిద్వద్వరులు భాష్యము వ్రాసిరి. ఈ ఘనకార్యముచేయుటలో వీరికి మఱికొందఱు విద్వాంసులును సాహాయ్యము చేసిరని యైతిహ్యముకలదు. ధర్మశాస్త్రమును గుఱించి మాధవాచార్యులవారిచే రచింపఁబడిన పరాశరమాధవీయ మనుగ్రంథము మనదేశములో మిక్కిలి ప్రఖ్యాతిని జెందియున్నది. వేదాంతవిషయమై విద్యారణ్యకృత పంచదశియు, చరిత్రవిషయమై శంకరదిగ్విజయమును, దర్శనవిషయమున జైమినీన్యాయమాల, సర్వదర్శనసంగ్రహము, అనుగ్రంథములును విద్వన్మాన్యములయి యున్నవి.

ఇట్లు జైనజంగమయవనాదిపరమతములవారిచే ఖండితమగుచున్న వైదిక మతమును ఉద్ధరించుటకు వేదభాష్యాదికములను, మతస్వాతంత్ర్యము రక్షించుటకు విజయనగర సామ్రాజ్యమును నిర్మించి, శృంగేరిలోని జగద్గురు పీఠము నలంకరించిన యీయతిశ్రేష్ఠుఁడు నూటొండ్లకంటె నెక్కుడుకాలము జీవించి ౧౩౮౬ లో సమాధిస్థుఁడయ్యెను.

## విద్యానగరనిర్మాణము.

విద్యారణ్యులు చేసినమహాకార్యములలో విద్యానగరమను మాఱుపేరుగల విజయనగరమును గట్టించుట యొకసుప్రసిద్ధమైన చరిత్రాంశమై యున్నది. దీనిని గుఱించి యనేకు లనేకగాథలు చెప్పెదరు. హరి హరబుక్కరాయలు రాజ్యముచేయుచుండఁగా వారొకనాఁడు వేఁటకై తుంగభద్రానదికి దక్షిణపు టొడ్డున నున్న యరణ్యమునకుఁబోయిరఁట. అచ్చట వేఁటకుక్కలు కుందేళ్లకు

జంకి పాఱిపోవుట చూచిరఁట. ఆసమాచారము వారు విద్యారణ్యా మునీశ్వ రులకుఁ దెలుపఁగా నచ్చోటఁబట్టణముకట్టిన నది జయప్రదమగునని చెప్పి వారు నూతననగరమును నిర్మించునట్లుచేసిరి. ఈ పట్టణము క్రీ. శ. ౧౩౩౬కు సరియైన శా. శ. ౧౨౫౮ ధాతృసంవత్సర వైశాఖశుద్ధ పంచమినాఁడు నిర్మింపఁబడియె. పట్టణనిర్మాణమునకై కనిపెట్టఁబడిన యభేద్యస్థలమును బట్టియే విద్యారణ్యుల బుద్ధివైభవము వెల్లడి యగుచున్నది. రామాయణీయ కాలములోఁ గిష్కింధయనఁబడు పర్వతప్రదేశమునందుఁ దుంగభద్రానదికి దక్షిణతీరమున నీ పట్టణము గట్టఁబడినది. ఆ ప్రదేశమునందుఁ దుంగభద్రానది రామాయణములో వర్ణింపఁబడిన అంజనపర్వతము, మాల్యవంతము, మతంగ పర్వతము, ఋష్యమూకము అనఁబడు పర్వతములనంటుకొని ప్రవహించు చుండెను. ప్రస్తుత మీప్రదేశమును హంపీవిరూపాక్షమనియెదరు. ఈపట్ట ణమునకు పూర్వపశ్చిమప్రదేశములందు కృష్ణశిలాపర్వతపంక్తులును, దక్షిణము నందు రామదుర్గమనుగుట్టలును, ఉత్తరమునఁ గొన్నిపర్వతమాలికలును తుంగ భద్రానదియు నుండుటవలన ఆపట్టణము నైసర్గికపర్వతదుర్గముగానుండెను. ఈ పట్టణమునకుఁజుట్టును ఏడుప్రాకారములుగలవు. అరువది డెబ్బది మొదలు ఆఱునందల మూరలెత్తుగల గుట్టలకు నడుమనున్నస్థలమును రాతిగోడలతోఁ బూడ్చి ఈప్రాకారములు నిర్మింపఁబడియె. ఈప్రాకారములు తుంగభద్రానది యొడ్డునంటుకొని యుండుటవలన నటువైపునుండి యది శత్రువుల కభేద్య మయ్యెను. దక్షిణనైరృతదిక్కులనుండి మాత్రము పట్టణములోఁ బ్రవేశించుటకు వీలుండెను. అందు నైరృతదిక్కున నొకగొప్పచెఱువు నిర్మింపఁబడియె. చెఱువు కట్ట యొకమైలు వైశాల్యముగలదియై రాతితోఁగట్టఁబడిన అభేద్యమైన దుర్గపు గోడవలెనేయుండెను. ఈ చెఱువుయొక్క వైశాల్యము నాలుగు చదరపు మైళ్లు. అందునెల్లప్పుడును నాలుగు నిలువులనీరుండును. దక్షిణదిక్కున నొక కోటఁగట్టి దానినిఁ బట్టణములోనున్న పర్వతములతోఁ గలిపిరి. ఆదుర్గమున

కచ్చటచ్చట బురుజులుండి యవి రక్షకభటులచేఁ గాపాడఁబడుచుండెను. ఏడవదుర్గప్రాకారములో కాఁపులు వ్యవసాయముచేసి ధాన్యముపండించుచుండిరి. చెఱువులో జలము సమృద్ధిగనుండుటచే వ్యవసాయమున కెన్నఁడును భంగము వచ్చినదికాదు. సప్తప్రాకారమునకు లోను ఒకచోట నొకగుట్టమీఁద రాజమందిరమును సేనాధిపనివాసమును టంకసాలయుఁగట్టఁబడెను. మొత్తముమీఁద నీయద్వితీయ పట్టణము పదునాలుగుమైళ్ల పొడవును, పదిమైళ్లవెడల్పును నూటనలువదిచదరపు మైళ్ల వైశాల్యమును గలిగియుండెను. ఈపట్టణము మహోన్నతదశయందున్నప్పుడు అందున్నజనుల సంఖ్య ముప్పది లక్షలకు మించియుండెనని యొకరూహించియున్నారు. ఇట్లువిద్యారణ్యులవారిచే నిర్మింపఁబడిన యీపట్టణము సకలవిద్యాసంపత్తులచే శోభితంబగుటచే విద్యానగరమనియు, యప్రతిమ శూరాగ్రేసరులకుఁ బుట్టినిల్లైనందున విజయనగరమనియు, విఖ్యాతివహించి తురుష్కరాజులగుండియ లవియునట్లు దినదినాభివృద్ధిఁజెంది, యైశ్వర్య, శౌర్య, విద్యాప్రాభవంబులఁ బ్రపంచమున నీడులేదని పశ్చిమఖండవాసులచేతను పూర్వఖండవాసులచేతను వేనోళ్లఁ బొగడ్తఁగని, మహమ్మదీయసుల్తానుల దౌర్జన్యమునకుఁ దాళలేక వచ్చిన హిందూముసల్మానుల కందఱికిని రక్షకస్థానమై యొప్పుచుండెను.

హరిహరరాయఁడు ౧౩౩౬ మొదలు ౧౩౫౦నఱకు రాజ్యము చేసినట్లు శాసనములవలనఁ గానవచ్చుచున్నది. ఇతఁడు ౧౩౪౩లోనే కీర్తిశేషుఁ డయ్యెనని సూయెల్ వ్రాసినయంశము నమ్మఁదగినదికాదు. ఈహరిహరునిపేరు శాసనాదులలో హరియప్ప, హరియప్పవడయర్ అనికూడ వ్రాయఁబడియున్నది.

హరిహరరాయునికాలమందే విజయనగరమునకు గర్భశత్రువైన యొకతురుష్కరాజ్యముదయించెను. ౧౩౪౭ లో కలుబరగీపట్టణమున సుల్తాన్ అల్లావుద్దీన్ హాసన్‌గంగో బహమనీ అనువాఁడు బహమనీరాజ్యమనఁబడు మహమ్మ

దీయరాజ్యమును దక్షిణహిందూదేశములో స్థాపించెను. ఈ రాజ్యమునకును విజయనగరరాజులకును ఎడతెగని యుద్ధములు జరుగుచుండెను.

## బుక్కరాయలు.

హరిహరరాయలకు సంతానములేనందున అతనిమరణానంతర మాతనితమ్ముఁడగు బుక్కరాయఁడు రాజ్యారూఢుఁడయ్యెను. హరిహరరాయని పెద్దతమ్ముఁడైన కంపభూపతి రాజుగాక రెండవతమ్ముఁడగు బుక్కభూపతి రాజగుటకుఁ గారణ మాతనియద్వితీయశౌర్యమే యని తోఁచెడిని. హరిహర రాయఁడుండఁగనే బుక్కభూపాలుని యువరాజుగఁ జేసినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. మొదటినుండియు హరిహరరాయలతోఁ గలిసి కష్టసుఖముల ననుభవించి విద్యానగర రాజ్యనిర్మాణము చేసినందున నితని కీయధికారము వచ్చె ననుటకు సందేహములేదు. నెల్లూరిమండలములో కంపభూపాలుని కుమారుఁడైన రెండవసంగమ భూపాలుని శాసనమొకటి కలదు. అందువలన కంప భూపాలునికి నెల్లూరి మండలముపై నధికారమొసఁగఁ బడెననియు, బుక్కభూపాలుఁడు సార్వభౌముఁడయ్యెననియు మనమూహింపవచ్చును. కంప భూపాలునకును బుక్కరాయనికిని రాజ్యమును గుఱించి పోరు జరిగి, బుక్కభూపాలుఁడు బలవంతుఁడగుటచే నాతఁడు రాజ్యము నాక్రమించుకొనెనని స్వూయెల్ దొరగారు చేసిన యూహకు నాధారమేమియులేదు.

బుక్కరాయలు శూరాగ్రేసరుఁడు, విద్వత్ప్రియుఁడు. ఈతనిప్రోత్సాహముకతననే సాయణమాధవులు వేదభాష్యములను రచించి హిందూమతము నుద్ధరించిరి. ప్రస్తుతము లోకములోని యందఱువిద్వాంసుల చేతను పొగడ్త గన్న సాయణభాష్యగ్రంథము లీమహారాజుపేరితో నంకితములై యున్నవి. అందుచే సంస్కృతవాఙ్మయాభివృద్ధి చేసినమహాపురుషులలో నితఁ డొకఁడని చెప్పవలసియున్నది.

ఇతఁడు రాజ్యమునకు వచ్చినతరువాత కొద్దికాలములోనే తుంగభద్రా నదికి దక్షిణముగానుండు రాజ్యమంతయుఁ దనపరాక్రమముచే నాక్రమించుకొనియె. తూర్పున కళింగ, ఓఢ్రదేశములనుగూడ జయించినట్లు గానవచ్చెడిని. ఇతని ప్రజలందఱును ఈతనియందు భక్తిగలవారలై యీతనియాజ్ఞను శిరసావహించుచుండిరి. ఇతనికాలములోని శాసనములను బట్టిచూచినను, ఇతని ప్రభుత్వ సమయమందు విజయనగరపట్టణమును విజయనగరరాజ్యమును బొందిన యభివృద్ధిని జూచినను, ఈరాజు అనేకపర్యాయములు తురుష్కుల నోడించి దిగ్విజయములఁ గన్నట్టు మనమూహింపవచ్చును.

బుక్కరాయలయొద్ద గొప్పసైన్యమును, ఘనతఁజెందిన దండనాయకులును ఉండినట్లు శాసనములవలనఁ గానవచ్చుచున్నది. ఈతనిసేనానాయకులలో మల్లినాథుఁడను వాఁడొకఁడు. ఈమల్లినాథుని శాసనము లనేకములుగలవు. ఇతఁడనేక దేవాలయములకు దానములిచ్చెను. ఇతనితండ్రిపేరు అళియ సాయన్న. అందువలన నీతఁడు విజయనగరరాజులకు అల్లుఁడని తోఁచెడిని. మల్లినాథుఁడు విఖ్యాతిఁజెందినసేనాని. ఇతనినే మహమ్మదీయ గ్రంథకారులు భోజమల్లుఁడని వాడియున్నారు. శాసనములను బట్టిచూడఁగా ఇతఁడు యవన, తురుష్క, పాండ్యాదిసైన్యముల నోడించి బహమనీసుల్తాన్ వలనఁ గూడ మెప్పొందినట్లు గానవచ్చెడిని.

౧౩౮౦ సంవత్సరములోని యొకశాసనమును బట్టి చూడఁగా బుక్కరాయ హరిహరరాయల కాలములలో బచ్చరాజు అనుమంత్రి యొకఁడుండినట్లు గానవచ్చుచున్నది. ఇతఁడు కీర్తిరాజ కుమారుఁడు; బుక్కరాయసముద్రము, కీర్తిసముద్రము, నాగన్నచెఱువు, బచ్చప్పచెఱువు, చౌడప్పకాలువ మొదలైన జనోపయోగకరములైన కార్యము లనేకములు చేసి రాజ్యములోఁ గఱవులు లేకుండఁజేసెను.

## మాధవమంత్రి.

బుక్కరాయని కాలములోఁ బ్రఖ్యాతిఁజెందిన మంత్రిపుంగవులలోను, దండనాయకులలోను మాధవమంత్రి ముఖ్యుఁడని చెప్పవలసియున్నది. ఇతఁడును మాధవ విద్యారణ్యులును ఒక్కరేయని ఇదివఱకు వ్రాసిన గ్రంథకారులందఱును భ్రమపడిరి. వారిద్దఱును భిన్నపురుషులు. మాధవ విద్యారణ్యుల వారి తండ్రిపేరు మాయణాఁడు; గోత్రము భారద్వాజగోత్రము. మంత్రిమాధవుని తండ్రిపేరు చౌండప్ప; గోత్రమాంగీరసగోత్రము. మంత్రిమాధవుఁడు గౌడబ్రాహ్మణుఁడు. మాధవ విద్యారణ్యులు ద్రావిడబ్రాహ్మణులు. ఈ మాధవమంత్రి యొక యగ్రహారము నిర్మించి కాశ్మీరబ్రాహ్మణులకు దాన మిచ్చెనని ౧౩౬౮వ సంవత్సరపు శాసనమొకటి చెప్పుచున్నది. ఆశాసనమువలన మన కీ క్రిందియంశములు తెలియుచున్నవి.

కాశీవిలాసుఁ డనుగురువుయొక్క బోధచే నితనికి శివభక్తి పట్టుపడెను. యోగాభ్యాసముచే నితఁ డిహపరముల సాధించెను; దుర్బోధలు చేయునాస్తికులనెడు దుష్టసర్పములను నాశమందించి యుపనిషన్మార్గమును చక్కఁబఱిచెను. అనేకవిద్వాంసులకు గురువై యుపనిషన్మార్గబోధకుఁడగుటచే దుస్సాధ్యమగు బ్రహ్మపదముఁ జూపువాఁడని ఖ్యాతివడసెను. బుక్కరాయల ప్రభుత్వకాలములో నాతనిరాజ్యముయొక్క పశ్చిమభాగమునకు నీతఁడు నాయకుఁడుగా నుండెను. తనప్రభుత్వము సుఖప్రదము గావలయునని యీతఁడు తనగురువగు కాశీవిలాసక్రియాశక్తి బోధవలన శైవామ్నాయ మనుసరించి లింగపూజయొనర్చెను. ఒక సంవత్సరమైనతరువాత తనయజమానుని యాజ్ఞవడసి, నాగరఖండములోని ముచ్చుండి యనుగ్రామమును దాని రెండుశివారులును కాశ్మీరబ్రాహ్మణులకు దానమిచ్చెను. నాగరఖండములోఁ బదునెనిమిదిమండలములుండెను. వాని కన్నిటికిఁ జంద్రకూటపుర మనునది రాజధాని. దానముచేసిన

బుగా వినిపింపఁగాఁ బరవశుఁడై మధుపానముచేసి యొడలెఱుంగని చిత్త ముతో విజయనగరధనాగారమునుండి ద్రవ్యమును గొని వారలకు బహుమానము చేయవలసినదని ముఖ్యమంత్రికి నాజ్ఞచేసెను. సారాయిమత్తువలనఁ గలిగిన యుద్రేకముతోఁ జెప్పిన మాట గదాయని గ్రహించి యాజ్ఞాపత్రికను వ్రాసెనుగాని విజయనగర రాజునకుఁ బంపలేదు. అయినను మహామ్మద్ శాహ యారాత్రి యావిషయమును గుఱించి యాలోచించుచుండెను. మఱునాఁడు మంత్రిని బిలిపించి యాజ్ఞాపత్రికను బంపితివా యని యడుగఁగానే, యాతఁడు లేదని ప్రత్యుత్తర మిచ్చెను. అంతట సుల్తాను 'ఏమీ! నా పెదవులనుండి మర్మములేని వ్యర్థపుమాట జాఱఁగలదా? సురాపానప్రమత్తుఁడనై నేనాజ్ఞ యిచ్చియుండలేదు. నాకట్టి సంకల్పము కలదు' అని హెచ్చరించెను. అంతట 'మల్లెక్ సయఫ్ ఉద్దీన్' అను నతని మంత్రి, యాయాజ్ఞాపత్రికపై రాజ ముద్రికను ముద్రించి, శీఘ్రగామియగు నొకదూత చేతికిచ్చి విజయనగరము నకుఁ బంపెను. కృష్ణరాయ లాపత్రికను వీక్షించి కోపోద్దీపితుండై, యా పత్రికందెచ్చిన దూతను నొక గార్దభముపై నెక్కించి విజయనగరవీథులం దూరేగించి పేడనీళ్లు గొట్టించి యవమానపఱిచి యాతనిం బంపించుటయే కాక భామినీరాజ్యముపై దండెత్తుటకై సంసిద్ధులరై యుండవలసినదని తన దండనాయకుల కెల్లరకు సమాచారములఁ పంపి యుద్ధమునకై యెదురుచూచు చుండెను. తన దండనాయకులెల్లరును స్వసైన్యములతో విజయనగరమునకు వచ్చినతరువాత కృష్ణరాయలు ముప్పదివేల గుఱ్ఱపుదళమును మూఁడువేల యేనుం గులును లక్షకాల్బలమును గల సైన్యముతోడ 'ఆదవాని' దుర్గము చెంతకుఁ బోయి, యచటినుండి కొంత సైన్యమును సుల్తానుదేశమును బాధుచేయుటకై భామినీరాష్ట్రమునకుఁ బంపెను. వర్షాకాల మాసన్నమగుటచేత రాయలు కృష్ణవేణీ తుంగభద్రా నదుల సంగమస్థానమునకుఁ బడమట త్రికోణాకార ముగా నుండి హిందూమహామ్మదీయులకు వివాదభూమియై యుండి తరువాత

రెండువందల సంవత్సరములవఱకు యుద్ధరంగముగానున్న రాయచూరు మండలములోని ముఖ్యనగరమగు ముద్గల్లునకుఁబోయి యాపట్టణము పట్టుకొని స్త్రీ పురుష లనుభేదములేకుండ నెల్లరను క్రూరఖడ్గాహతిపాలు చేసి విజృంభింపఁగా నొక్కఁడు మాత్రము ప్రాణమెట్లో తప్పించుకొని పోయి కలుబర్గ కేఁగి సుల్తానున కీసమాచార మంతయుఁ దెలియఁజేసెను......ఈ మారణకర్మ వృత్తాంతమును మహమ్మదుశాహ విని దుఃఖాక్రాంత చిత్తుఁడయ్యెను కోపోద్రేక మడంచుకొనలేక, యాదుఃఖసమాచారమును దెచ్చిన నిరపరాధియగు ఆ దౌర్భాగ్యుని తక్షణమే చంపించెనఁట! మహమ్మద్ శాహ దర్బారులో నిలువంబడి "మహమ్మదీయ మతావలంబకుల సంహారించినందుకు పరిహారముగా పాషండ మతాభిమానులగు విగ్రహారాధనపరులను లక్షహిందువులను మట్టుపెట్టినంగాని మతయుద్ధమును ప్రకటించు చంద్రాయుధమును మఱల నొరలోనికిఁ జేర్ప" ననియు "హత్యనుండి వెనుదీయ" ననియుఁ బ్రతిజ్ఞపట్టి యా దినముననే రణభేరి మ్రోఁగించి దండయాత్రకు బయలువెడలెను.

'మఱి యుద్ధమును బ్రకటించుచు మహమ్మదుశాహ కృష్ణానదీతటముఁ జేరి శత్రువుల రక్తముతో ముద్గల్లు పురమునందలి రాయలఖడ్గముపాలఁ బడిన వారియాత్మలకుఁ దర్పణము విడిచి సంతోషపెట్టుటకై, శత్రువుల కభిముఖముగా నానదినిదాఁటినంగాని భుజించుటయు నిద్రించుటయు నశాస్త్రీయమని నిశ్చయించి, నిద్రాహారముల మానెదనని ప్రమాణముచేసెనఁట! పిమ్మట తన కొడుకగు ముజాహీదుషాకుఁ బట్టముగట్టి మంత్రియగు 'మల్లెక్ సయఫ్ ఉద్దీనుని' పాలకునిగా నియమించి యిరువదియేనుఁగులనుమాత్ర ముంచుకొని తక్కిన యేనుఁగుల నన్నింటిని నతనికిచ్చి బుద్ధులుచెప్పి కలుబర్గ నగరమునకుఁ బంపివేసెనఁట! కాలవిలంబము చేయక తరువాత మహమ్మదుశాహ తొమ్మిదివేల గుఱ్ఱపు దళముతో నదినిదాఁటెనఁట! రాయ లీవార్తవిని దిగులుపడి ధనకనక వసువాహనాదులను విజయనగరమునకుఁ బంపివేసి మఱునాఁడు వీలుగానున్న

యుద్ధము చేయుటయో లేనియెడల వెనుదీయుటయో జరిగింపవచ్చునని నిశ్చయించెనఁట! ఆరాత్రి భయంకరముగ గాలివీఁచుచుఁ గుంభవృష్టిగా వర్షము గురియుచున్నందున నేనుఁగులు మొదలగు భారవాహకములగు జంతువులు బురదలోఁ జిక్కుకొని శ్రమపడుచు, సేనానివాసస్థానమును విడిచి నాలుగు మైళ్ల దూరమునకైన నడువశక్తికలవి కాకపోయినవి. మహమ్మదుశాహ యావృత్తాంతమును విని తనస్థానమును విడిచి తానే వారల కభిముఖుఁడయి నడువ నారంభించెను. మఱునాఁ డుదయమునకు రాయలసైన్యమును సంధింపఁగానే వారలు సామగ్రినంతయు వెనుకదిగవిడిచి భయపడి యాదవాని దుర్గమునకుఁ బాఱిపోయిరఁట! మహమ్మద్ శాహ సామగ్రినంతయుఁ గొల్లవెట్టి శిశుసహితముగా స్త్రీపురుషుల డెబ్బదివేల జనులను సంహరించెనఁట! సుల్తాను వేసవికాలము గడచుపర్యంతము ముద్గకల్లు పట్టణమున నుండి తరువాత సేనలంగూర్చుకొని ఆదవాని దుర్గము ముట్టడించెను. రాయలు తన మేనల్లుని దుర్గసంరక్షణార్థము కొంతసైన్యముతో నిలిపి తాను తుంగభద్రానదికి దక్షిణభాగమునందు నిలిచి విజయనగరమునుండి యింకను సేనలను రప్పించుకొని యుద్ధసన్నద్ధుఁడై నిలిచి యుండెను. మహమ్మదుశాహ శీఘ్రకాలములోనే తుంగభద్రానదినిఁ దాఁటి విజయనగర రాజ్యభూములలోఁ బ్రవేశించెను. విజయనగరముపయి మహమ్మదీయులు దండెత్తివచ్చిన వానిలో నిదియే ప్రథమదండయాత్ర యని చెప్పవలసి యున్నది. ఎందుకనిన నిదివఱకు ఢిల్లీసుల్తాను తుంగభద్రానదికి నుత్తరముననున్న యానగొందిని ముట్టడించెనేకాని తుంగభద్రానదిని దాఁటి యీవలకు వచ్చినవాఁడుకాఁడు. మహమ్మదుశాహ సిరుగప్పను గ్రామసమీపమున నదిని దాఁటి కౌతాళమువద్ద నున్నబయలులో రాయలసైన్యమును దాఁకెను. మహమ్మదుశాహ నదినిదాఁటి వచ్చుచున్నాఁడని చారులవలన విని కృష్ణరాయలు తనమంత్రులను సేనాధిపతులను రప్పించి సుల్తాను నేప్రకారమెదుర్కొనవలసి యుండునో యోజింపసాగెను.

'అప్పుడందఱునుజేరి రాయల ముఖ్యసేనాధిపతియగు భోజమల్లున కాధిపత్యమునిచ్చిరి. అతఁడు సంతసించి తురుష్క రాజకుమారుని జీవముతో ఖైదిగాఁ బట్టికొని తీసికొని రావలసియుండునో అతని శిరస్సు బల్లెమునకు గ్రుచ్చి చూపింపవలసియుండునో రాయలచిత్తమును వినఁగోరుచున్నానని మహాగర్వముతోఁ బలికెనఁట! బ్రతికియున్న శత్రు వేయవస్థలో నున్నను నిష్టుఁడు కాఁడు గనుకఁ జేతికందివచ్చినపుడు చక్కాడుటయె యుచితమార్గమని రాయలు ప్రత్యుత్తరమిచ్చెనఁట! రాయల యనుజ్ఞనుబొంది మల్లయదండనాథుఁడు నలుపదివేల గుఱ్ఱపుదళముతోడను, లక్ష కాల్బలముతోడను, మహమ్మద్ శాహ నెదుర్కొని హిందువులచేఁ బరమ పవిత్రములుగాఁ జూడఁబడు గోవులను మహమ్మదీయులు చంపుటను గూర్చియు, వారి దేవాలయములను నిర్మూలము చేయుటను గూర్చియు ననుదినమును వర్ణించుచు సైనికుల కుపన్యాసములిచ్చి చంద్రధ్వజులఁ జంపుటయే పరమార్థమని తోఁచునట్లుగాఁ బౌరుష మెక్కింపవలసినదిగా బ్రాహ్మణోత్తముల కెల్లరకు నానతి యిచ్చెను. మహమ్మదుశాహ భోజమల్లుని రాకవిని తనసైన్యమున కంతకు ఖానుమహమ్మదుని నధ్యక్షునిగా నేర్పఱచి పదునైదువేల గుఱ్ఱపుదళమును, ఏఁబదివేల కాల్బలమునిచ్చి తాను పదివేల గుఱ్ఱపుదళముతోను ముప్పదివేల కాల్బలముతోను సమరసన్నద్ధుఁడై యుండెను. ౧౩౬౬ వ సంవత్సరము జూలై ౨౩వ తేది గురువారమునాఁడు సూర్యోదయ సమయమున నుభయసైన్యములును గలిసికొని సంకుల సమరంబునకుఁ గడంగెను. ఉభయసైన్యములును సముద్రతరంగములవలె నిటునటు నూగులాడుచు నొండొరులతోఁ డీకొని సాయంకాలము నాలుగు గంటల వఱకు ఘోరయుద్ధము చేయఁగా నిరుప్రక్కలను వేలకొలఁది జనులు మృతినొందిరని చెప్పుట యతిశయోక్తిగాదు. ఖాన్ మహమ్మదు సేనయొక్క కుడి యెడమ భాగములకు రక్షకులుగానున్న శూరాగ్రేసరులగు మూషిఖానుఁడును, ఏషీఖానుఁడును వీరమరణమునొండఁగా వారిసేనలు హిందువుల ప్రతాపమునకుఁ

డాళ్ళఁజాలక పలాయనముచేసెను. ఈదురవస్థ నంతయు జూచి తురుష్కసైన్యములు దిగులుపడి ధైర్యమునువదలి చెల్లాచెదరగుచుండ, మహమ్మదుశాహ మూఁడువేల గుఱ్ఱపుదళముతో వచ్చి మల్లయదండనాథునిఁ దార్కొనఁగానే, పాఱిపోవుచున్న తురుష్కసైన్యములు వెనుకకు మఱలివచ్చుచుండెను. ముక్రీబు ఖానుఁడు ఫిరంగులను గాల్చుచు శత్రుసైన్యమును జీకాకు నొందించుచు ముందుకు సాగివచ్చి శత్రువులను బాఱఁదోలుట కనుజ్ఞ యిమ్మని ఖానుమహమ్మదు నడిగెను. అతనికి మూలబలము కొంతయిచ్చి సాగుమని యుత్తరువు చేసెను. ఫిరంగులను గాల్చుటకు హిందువులకు కాలముచాలక పోయినందున, వీరావేశముతోఁ గత్తులుఁ గటారులు దూసి తురుష్కుల కభిముఖులై పిఱికితనమానంతయు లేక శత్రువులు సహితము మెచ్చునట్లుగాఁ బోరాడుచుండిరి. ఇట్లు ఖానుమహమ్మదునియొక్క 'పులివేఁటకాఁడను' పేరుగల యేనుఁగొకటి మావటీని యాజ్ఞకు లోఁబడక శత్రుసేనా మధ్యభాగమునఁ జొఱంబడఁగా మల్లయదండనాథుని యేనుఁగులడ్డపడి నిలుపఁగా నాసందడి సమయములోఁ బులివేఁటకానిమావటీఁడు ప్రాణములను గోలుపోయెను. తదనంతరము ఖానుమహమ్మ దయిదువందల గుఱ్ఱపుదళమును దీసికొని సమరగజమును వెంబడించి పురికొల్పుచుండె. హిందూసేనలు క్రమముతప్పి చెల్లాచెదరగునట్లుగా నాయేనుఁగు ఘీంకృతులు పెట్టుచు ధ్వంసముచేయుచుండఁగా భోజమల్లుఁడు దెబ్బతిని గాయమును బొంది రణరంగమున నిలువలేక పరాఙ్ముఖుఁ డయ్యెను. తగనుచరులు సయితమునిలిచి యుద్ధము పడలేక పోయిరి. హిందువులు తమమధ్యభాగ మిట్లల్లకల్లోలమగుటఁ జూచి యధైర్యపడి నలుదిక్కులకుఁ బాఱి పోయిరి. ఇఁకఁ జెప్పవలసిన దేమున్నది? తురుష్కులు చెలరేఁగి తారసించిన యొల్లరను నఱికివైచుచుండిరి. గర్భిణీస్త్రీలను సయితము వదలిపెట్టక హతము చేయుచుండిరి. బిడ్డల ఱొమ్ములమీఁదనుంచుకొని పెనఁగులాడుచున్న తల్లులనుండి బిడ్డలనులాఁగి బిడ్డలను తల్లులనుగూడ నఱకుచుండిరి. మహమ్మదుశాహ

యిట్టి విజయవార్తలను తనరాజ్యమునకుఁ బంపియుఁ దృప్తినొందనివాఁడయి తన
ప్రతిజ్ఞఁ దీర్చుకొనుటకయి రాయలను వెంబడించి మహారణ్యములమధ్యమునఁ
దఱుము చుండెను. కృష్ణరాయలు వానికిఁ జిక్కక హతశేషులను గూర్చు
కొని సురక్షితముగా వచ్చి విజయనగరముఁ బ్రవేశించెను. మూఁడు నెలలు
మహమ్మదుశాహ రాయలను వెదకి నగరమును ముట్టడించెను. కాని ముప్పది
దినములెంతప్రయత్నము చేసినను రాయలులోఁబడలేదు. పట్టణమును స్వాధీనము
కాలేదు. తనప్రయత్నము వ్యర్థముకాఁగా నతఁడు పట్టణమును విడిచి
తుంగభద్రానది మీఁదుగాఁ బాఱిపోవుచు నడుగడుగునకు హిందువులచే నడ్డ
గింపఁ బడుచుండియుఁ బోయి పోయి యొక మైదానమున దండువిడిసి
యుండెను. రాయలును వారిని వెంబడించివచ్చి సమీపముననే దండువిడిసి
యుండెను. మహమ్మదుశాహ పాఱిపోయిన విధముఁజూడఁదురుష్కులికఁ దమ్ముఁ
దలపడఁజాలరనియు, తేఱిపాఱఁ జూడనైనఁ జాలరనియు, హిందువులకు
దృఢవిశ్వాసమును గలుగుచుండెను. ఆహేతువుచేత హిందువులు జాగ్రత్త
లేనివారలై పరాకుగలిగి యలక్ష్యభావముతో నుండిరి. రాయలొకనాఁడు
రాత్రి మధుపదార్థములను సేవించి వారకాంతా వినోదగోష్ఠిలోనుండి యానం
దాబ్ధి నోలలాడుచుండఁగా నకస్మాత్తుగాఁ దురుష్కులుపైఁబడి తమ కపట
తంత్రమును బయల్పఱుపఁగా కృష్ణరాయలు పశ్చాత్తాపమునొందుచు విజయ
నగరమునకు మఱలఁ బాఱిపోయెనఁట! పదివేల హిందువుల నుఱుమాడి మహ
మ్మదుశాహతిరిగి విజయనగరమునుముట్టడించెను.రాయలు సమాధాన పఱచుటకై
రాయబారులను సుల్తానుకడకుఁ బంపెనుగాని యాతఁ డంగీకరింపకుండె
నఁట! అదిచూచి వాని మిత్రుఁడొకఁడు 'మీరు లక్షహిందువులను మాత్రమే
సంహరించెదమని ప్రతిజ్ఞపట్టినారు కాని హిందూజాతినంతను జంపెదమని
ప్రతిజ్ఞపట్టలేదే' యని మందలించెనఁట! అందులకు సుల్తాను తాను ప్రతిజ్ఞ
పట్టిన మొత్తముకన్న నినుమడిగా హిందువులను జంపినను రాయలు లోఁబడి

తానాజ్ఞచేసిన ధనమొత్తమును సంగీతపాఠకులకు సమర్పించినఁగాని రాయల యెడలను నాతని ప్రజలయెడలను గరుణఁ జూపఁజాలనని బింకములు పలుకు చుండఁగా, రాయల రాయబారులు సర్వస్వాతంత్ర్యమును బొంది వచ్చిన వారు గావున నాధనమొత్తమును నాతనికిఁ దత్క్షణమే చెల్లించిరి. 'రాయల యందుఁ దప్పిదమున్నయెడల నిరాధారులును నిరపరాధులునగు ప్రజలును, స్త్రీలును, బిడ్డలును గూడ దండార్హులగుదురా' యని రాయబారులు మందలింపఁగా సుల్తాను భగవదనుజ్ఞ యట్లుండెననియు నద్దానిని మార్పఁదనకు శక్తి లేదనియు నుడివెనఁట! హిందూమహమ్మదీయు లిరుగుపొరుగువారగుటవలన ననవసరములగు క్రూర కృత్యములు మానుట యుచితమనియు, లేనియెడలఁ బరస్పరద్వేషములు ప్రబలము లగుననియు రాయబారులు వాదింపఁగా మహమ్మదుశాహ వారివాదములు సహేతుకముగా నుండుటచేతఁ దానొడంబడితిననియు, నిఁక నెన్నఁడును తనకు జయము లభించిన తరువాత శత్రువుని నొక్కనినైన నిష్కారణముగాఁ జంపింపననియుఁ నెదుటివారుగూడ నట్లెచేయ బద్ధులనియుఁ బలికి ప్రమాణముచేసెనఁట! ఆపద్ధతి కొంతకాలము వఱకు నవలంబింపఁబడెను. కాని తరువాత తురుష్క ప్రభువులామార్గమును మఱచి యథేచ్ఛగాఁ గ్రూర కృత్యములు చేయుచునే యుండిరి. ఈ మహాయుద్ధమునందు నైదులక్షల హిందువులనుజంపి కర్ణాటకభూములు నిర్జన ప్రదేశములుగాఁ జేసెనని మహమ్మదుశాహను, ఫెరిస్తాశ్లాఘించుచు నతిశయోక్తిగాఁ జెప్పుచున్నాఁడు. తరువాత కొన్ని సంవత్సరములవఱకుఁ బోరులేకుండ రెండురాజ్యములవారికి సఖ్యత గలిగి యుండెను.

పైని వర్ణింపఁబడిన యంశముల సత్యాసత్యతలను గుఱించి విచారింప వలసియున్నది. 'ప్రథమగ్రాసే మక్షికాపాతః', అనఁగా తొలిముద్దలోనే యీఁగపడిన దన్నట్లు మహమ్మద్ షాహతోఁ బోరాడినరాజు పేరు కృష్ణరాయఁడని ఫెరిస్తా పైనివర్ణనలో వ్రాసియున్నాఁడు. ౧౩౫౮ు మొదలు ౧౩౭౫

వఱకు రాజ్యముచేసిన మహమ్మద్ షాహాతో ౧౫౦౯ — మొదలు ౧౫౩౦ వఱకుఁ ప్రభుత్వముచేసిన కృష్ణరాయఁడు పోరాడుట యెట్లు తటస్థించును? కావున నిది ఫెరిస్తాచేఁ గల్పింపఁబడిన పిట్టకతయనియే మనము నిశ్చయింపనచ్చును. ఇట్టిఘోరమైన పొరపాటు చేసిన చరిత్రకారుఁ డేరి విశ్వాసమునకుఁ బాత్రుఁ డగును? పదునాల్గవశతాబ్దమధ్యమున జరిగిన యీ యుద్ధవృత్తాంతము పదునేడవ శతాబ్దారంభమునందుఁ బుట్టినఫెరిస్తా అహమ్మదనగరపట్టణములోఁ గూర్చుండి, తన యజమానులగు సుల్తానులచెవులకు నింపగునట్లుమార్చియు, నూతనాంశములు చేర్చియుఁ, గల్పిత చిత్రకథవలె వ్రాసినని స్పష్టమగుచున్నది. బుక్కరాయని కాలమునకును, కృష్ణరాయనికాలమునకును అంతర మెఱుంగని చరిత్రకారునకుఁ జరిత్రవ్రాయునధికారము కలదని యెవరు చెప్పఁగలరు?

పైనివర్ణనలో మఱికొన్ని విపరీతాంశము లున్నవి. మహమ్మదుషాహా నిజముగా నైదులక్షలజనులనే సంహరించి, విజయనగరరాజును నిజముగనే పూర్తిగఁబరాభవించి యుండినయెడల నాతఁడు సంగీతపాఠకుల కీయవలసిన పైకమును మాత్రము రాయలయొద్దనుండి తీసికొని యూరకుండుట యెట్లు తటస్థించును? విజయాంధులయిన తురుష్కులు అపారసంపత్తియు, నూతన రాజ్యమును తీసికొనకయే సంధిచేసికొందురా? చేసికొనరు. మహమ్మద్ షాహా యట్లు కొద్దిలోఁ దృప్తిచెందినందున నాతనికి విజయము ప్రాప్తముకాలేదనియే మనము చెప్పవచ్చును. గొప్పసైన్యముతో యుద్ధమునకుఁ బోయిన రాయలు, కొద్ది సైన్యముతో శత్రుఁడు వచ్చుచున్నాఁడని విన్నంతమాత్రముననే భయపడి పాఱిపోవుటకు యత్నించెననుటయు, ఆదవానిలోఁ దానును, దన మేనల్లుఁడును సైన్యములతోనుండి, భోజమల్లుఁడు పడి తనసైన్యములు చెదరుచున్నవని వినియు వారిసాయమునకు వచ్చియుండలేదని సూచించుటయుఁ జూడ నివి కుఱ్ఱవాండ్రు నమ్మఁదగిన విషయములుగాని సారాసారవిచారప్రజ్ఞ గలవారెవ్వరును నమ్మఁదగినవికావని స్పష్టపడఁగలదు.

మహమ్మదుశాహాయొక్క దూతను రాయలు మిక్కిలి యగౌరవపఱిచెను. గాడిదమీఁద నెక్కించి బలాదూరు త్రిప్పెను. తనదూత నగౌరవపఱిచిన వానిని నిజముగా నామహమ్మదీయుఁడుగెలిచి యున్నయెడల నగౌరవపఱుపక యూరకుండునా? అట్లేమియుఁజేయక సంగీతపాఠకుల కీయవలసిన నాలుగురూకలు తీసికొని యూరకయుండెనని వ్రాయఁబడినందున నీయుద్ధవార్తయే కల్లయైయుండనోపు; లేదా మహమ్మదునకు జయము కలిగిన సమాచారమైనను అసత్యమైయుండును. ఇఁకనీసంగతి యటుంచి మహమ్మదీయులచే వర్ణింపఁబడిన రెండవయుద్ధమును గుఱించి కనుఁగొందము.

మహమ్మదుశాహా ౧౩౭౫లో మృతుఁడయ్యెను. పందొమ్మిది సంవత్సరముల వయస్సుగల ముజాహిద్ అనునాతని కొమారుఁడు సుల్తానయ్యెను. ఇతఁడు రాజ్యమునకు వచ్చినతోడనే విజయనగరరాజుతోఁ బోరాటపెట్టుకొనెను. ఈ యుద్ధము ౧౩౭౫ మొదలు ౧౩౭౭వఱకు జరిగెనని కొందఱు వ్రాసియున్నారు. దీనిని గుఱించి ఫెరిస్తా యేమిచెప్పుచున్నాఁడో కనుఁగొందము.

"మహమ్మదుశాహా మరణానంతరము నతని కుమారుఁడు ముజాహీదుషాహా సింహాసనమునకు వచ్చెను. ఇతఁడు సింహాసనమెక్కినతోడనే కృష్ణాతుంగభద్రానదులకు మధ్యముననుండుదుర్గములును, మండలములును దమకుఁ జెందియున్నవనియు,వానినిగుఱించి యప్పుడప్పుడు తగవులాట గలుగుచున్నదనియు, నట్లు కలుగకుండఁ దుంగభద్రానది సరిహద్దుగాఁజేసికొనిఁ దానికిఁ మార్పుననుండు దేశమును వెంగాపుర (బంకాపురము) దుర్గమును గూడ విడిచిపెట్టవలసినదనియు, కృష్ణరాయలకువ్రాసెను. ఈవెంగాపురము ధార్వాడకు దక్షిణముననున్నది. సముద్రతీరమునకును, విజయనగరమునకును మధ్యముననుండుటచేతను, తురుష్కులు చిరకాలమునుండి యాకోటను స్వాధీనముచేసికోవలెనని తలంచి మోహదృష్టితోఁ జూచుచుండిరి. అందుకు కృష్ణరాయలు 'రాయచూరు ముద్గకల్లు దుర్గము లానెగొంది సంస్థానమునకుఁజెందిన వగుటచేత రాయలవారు

మండలమంతయు వదలిపెట్టవలసినదనియు, కృష్ణానదియే సరియైన సరిహద్దనియు, మహమ్మదుషాహ తనవద్దనుండి కైకొన్న యేనుఁగులను మఱలఁ దనకిచ్చి వేయవలసినదనియుఁ' బ్రత్యుత్తరమంపెను. సుల్తాను యుద్ధమును బ్రకటించెను. సుల్తాను రెండునదులను దాఁటి అదవానిదుర్గముకడకు వచ్చిచేరెను. కృష్ణరాయలు తుంగభద్రానదీతటమున దండుదిగియున్నాఁడని విని ముజాహిదుషాహ తనసైన్యమును రెండుభాగములుగా భాగించి, యొకబలము కోట ముట్టడించుటకును, రెండవబలముతోఁ దాను బోయి విజయనగరమును బట్టుకొనుటకును నిశ్చయించి, వాయవ్యమూలమార్గమున జాగరూకతఁగలిగి సేనలను నడిపించుకొని పోవుచుండెను. కృష్ణరాయలు మొట్టమొదట సుల్తానును సంధించి సమరముచేయుటయే యుక్తమని యోచించెనుగాని తరువాత నది మంచిపద్ధతికాదని తలఁచి తనరాజధానికి దక్షిణముననున్న సోండూరు కొండలలోని యడవులలోనికిఁ బోయియుండెను. ముజాహిదుషాహ వానిని వెంబడింపక, విజయనగరము సాగనైననగరమని బహుజనులు శ్లాఘించుచుండుట చేత నచటికిఁ బోవఁ జూచెను. కానియది నుసాధ్యముకాని హేతువుచేత తిన్నగా కృష్ణరాయలున్న యరణ్యమునకు దారితీసెను. సుల్తాను వచ్చుచున్నాఁడను సమాచారమునువిని రాయలాయరణ్యమార్గములు తురుష్కులకుఁ గ్రొత్తవియగుటఁ దలపోసి యాతని నా కాఱడవులలో నాయాసపెట్టఁ దలంచి యుండ, సుల్తాను మహారణ్యమును భేదించుకొని దారులేర్పఱుచుకొనుచు రాయలసైన్యమును వెంబడించుచుండ, నా రాయలాస్థానమునువిడిచి మఱియొకస్థానమునకుఁ బోవుచు నీరీతిగా నాఱుమాసములు సుల్తానుకందకయే చిక్కులు పెట్టుచుండెను. సుల్తానువజీరు లిది ప్రయాససాధ్యమనియు లాభములేని త్రిప్పటయనియు, సైన్యమునకు నధికకష్టము సంభవించుననియు, బహువిధముల బోధించి యతనిని మరలింపఁజూచుచుండిరి. కాని వారి యదృష్టవశమున రాయల కారోగ్యభంగము కలిగి, యా యడవులలోని విషవాయు

వుల నాక్రమించుటవలనఁ బ్రాణాపాయము కలుగవచ్చునుగావున, నాతని వైద్యు లడవిని విడిచి స్వరాజధానికి విజయముచేయవలసినదని వేడుకొనుట తటస్థించెను. కృష్ణరాయలు చేయునదిలేక వారి యుపదేశమును విశ్వసించి చాటుదారులను దప్పించుకొనిపోయి విజయనగరము ప్రవేశించెను. సుల్తా నాతనివెనుకను గొంతసైన్యమును బంపి తాను 'అమీరాల్ఉమ్రాబహదూరు ఖాను'తో నైదువేలసైనికులను దీసికొని, సేతుబంధరామేశ్వరమను ప్రదేశము సందర్శించుటకై పోయెను. ఈతఁ డాప్రదేశమున సుల్తాను 'అల్లాఉద్దీను కిల్జీ' కట్టించిన మసీదును బాగుచేయించుటయేగాక, హిందూదేవాలయములను బెక్కింటిని గూలఁద్రోయించి దేశమునంత పాడుచేసి, విజయనగరమునకుఁ దిరిగివచ్చెను. ముజాహిదుషా తరువాతనెట్లో కృష్ణరాయలకుఁ దెలియకుండఁ జాటుదారులగుండవచ్చి విజయనగరముపైఁబడె’’నని ఫెరిస్తా యాసందర్భపు వ్రాఁతలను వ్రాయుచున్నాఁడు.

'తురుష్కులు విజయనగరమును బ్రవేశించుటకు నద్భుతపడి కృష్ణరాయలు వీథులను గాపాడుటకు పెక్కండ్ర సైనికులను బంపెనఁట. కాని తురకలు హిందువులను పటిమి యెట్టకేలకుఁ గోటకును పట్టణమునకు నడుమనున్న చెఱువుకట్ట నాక్రమించుకొనిరఁట! ఆసమీపముననున్న కొండపైనెక్కి యచటి హిందూదేవాలయ మిడియఁగొట్టి యమూల్యములగు రత్నాభరణములతోడ నలంకరింపఁబడిన సువర్ణమయములగు విగ్రహములను జూఱఁగొనెనఁట!' పరుల కవిలంఘ్యము లగునట్టి సప్త ప్రాకారములు గలిగి విజయనగరము లక్షల కొలఁది శూరాగ్రేసరులచేఁ బరిరక్షితమైయున్న మహానగరమని కన్నులారఁ జూచిన విదేశీయచరిత్రకారులు పెక్కండ్రు వర్ణించియున్నారు. అట్టి సురక్షితస్థానముల నన్నిఁటిని దాఁటి యొడలుదుమ్ముగాకుండ, ననాయాసముగా సుల్తా నెట్లురాఁగలిగెనో వింతగానున్నయది. ఈవృత్తాంతము జరిగిన రెండు శతాబ్దముల కావలనున్న యీ చరిత్రకారుఁడగు ఫెరిస్తా స్వజాతివారిలోఁ

జెప్పుకొనెడు కల్పనాకథలనుబట్టి యీ చరిత్రమల్లెనుగాఁబోలు. “కట్టకడ ముజాహీదునకుఁ ‘జావు తప్పి కన్ను లొట్టపోయె’ ననుసామ్యము ననుసరించి ప్రాణగండము గలిగియుఁ దప్పించుకొని పోవుట తటస్థించెను. అత్యంతచింతాస్పదంబగు తురుష్కుల దౌర్జన్యమునకు నోర్వంజాలక హిందువు లెల్లరు లోని రోషానలంబు ప్రజ్వలింప శత్రు వినాశనమునకై కృష్ణరాయలను బ్రోత్సాహపఱిచి లక్షలకొలఁది హిందూ శూరాగ్రేసరులు ధ్వజమెత్తి వచ్చుచుండుటను జూచి, ముజాహీదుషాహ తనఛత్రము నావలఁబాఱవైచి, తనకై పండయొసఁగు వానిఁ గపిలదేశపుఁ దురుష్కుని మామూదనువానిని వెంటఁదీసికొని, శత్రువుల సంఖ్యను గనుఁగొనుటకై చిన్న సెలయేటినిదాఁటి యావలియొడ్డున నిలుసంబడి యుండెను.”

‘అప్పుడు పరాక్రమవంతుఁడగు నొక్క హిందువు సుల్తానుస్వారి వెడలు గుఱ్ఱమును గుర్తుపట్టి తనదేవతాస్థానముల నిర్మూలించిన పగదీర్చుకొని ప్రఖ్యాతి నొందుటకై సుల్తానుసంకకు నశ్వారూఢుఁడై యతివేగమున వచ్చుచుండెను. అతఁడు పొదలచాటుననుండియు, నొడ్డువిఱిగి పల్లముగానున్న సెలయేటి యొడ్డువెంబడి నేరికిఁ గానరాకుండవచ్చి బయలుపడి తనవంక నతివేగమున వచ్చుచుండుట నదృష్టవశమున సుల్తాను వీక్షించి, మామూదునకు సైగచేయఁగా నాతఁడు వెంటనే గుఱిపెట్టికాల్చెను. కాని తనగుఱ్ఱము బెదరినందున నతఁడు క్రిందఁబడెను. ఇంతలో శత్రువు మామూదును సంహరింప నుద్యుక్తుఁడుకాఁగా ముజాహీదుషాహ భుజబలాఢ్యుఁడుగాన నతనిరక్షణకై తత్క్షణమే పోవ నా హిందువు మామూదును జంపుటమాని సత్తువతో సుల్తాను నొక్కదెబ్బతీసెను. కాని యదృష్టవశమున సుల్తానడ్డపెట్టిన యినుపనుత్తివలన నతఁడు జీవింపఁగలిగెను. కాని లేనియెడల నాదెబ్బతో ముజాహీదు నామమాత్రావశిష్టుఁడగు ననుటకు సంశయములేదు. చూపఱులందఱు నాదెబ్బ సుల్తానుప్రాణముఁ గొనెనని నిశ్చయించిరి. కాని యట్లు జరగక సుల్తానునుత్తిపెట్టుతో శత్రువు

రెండు తుండములై క్రిందఁబడిపోయెను. తరువాత మామూదును గుఱ్ఱముపై నెక్కించి సుల్తాను సైన్యమును జేరుకొనెను. తదనంతరము ఘోరయుద్ధము జరిగినది; కాని హిందువులు పరాజితులయిరి. తురుష్కులు బడలిక దీర్చుకొనుచుండిరి. ఇంతలో కృష్ణరాయల సోదరులలో నొకరు (మారభూపతియో లేక ముద్దప్పయో) అఱువదివేల గుఱ్ఱపుదళముతోడను, నధిక కాల్బలముతోడను రాజధానికివచ్చి రాయలను గలిసికొనఁగా భయంకరమగు యుద్ధము మరల నారంభమయ్యెను. అప్పుడు సుల్తానునకు ఆపద కలుగునేమో యను భీతిచే నతనిబంధువు దాదుఖానుం డనువాఁడు తనస్థానమగు ధర్మసముద్రమును విడిచి యుద్ధము జరుగు ప్రదేశమునకు వచ్చెను. తురుష్కులు మఱల జయమును బొందిరి. కాని శత్రువులు దాదుఖానుఁడు విడిచివచ్చిన ధర్మసముద్రమును ముట్టడించి పట్టుకొని సుల్తాను సైన్యమునకు వెనుకనే హానిఁజేయుచు భీతికలిగించుచుండిరి.

'ముజాహీదుషాహ యుద్ధభూమిని విడిచిపెట్టి కొండలలోనుండి తనసైన్యమును సురక్షితముగా నాలుగుఁ దరలించుకొని, యరువదివేల హిందువులను ముఖ్యముగా స్త్రీలను ఖైదీలనుగాఁ దీసికొనిపోయి యాదవానిదుర్గమును తొమ్మిదిమాసములు ముట్టడించియు నయ్యది స్వాధీనము గాకపోవుటవలన నాప్రయత్నమును మానుకొని స్వదేశమునకుఁ బోయెను. అంతటితో యుద్ధము ముగిసినది'.

ఇఁక నీకథాభాగము మీమాంస్యము. మొత్తముమీఁదఁ జూడఁగా సుల్తానుకు నీదండయాత్రవలన నేమియులాభము గలుగక, యాతఁ డనేక సైన్యములను బోఁగొట్టుకొని వచ్చినత్రోవనే పాఱిపోవలసిన వాఁడాయెను. ఇది జయమో పరాజయమో చదువరులే యూహింపనోపు. బాగుగ విచారించినయెడల ముజాహీదునకు విజయనగరములోను, ఆదవానిలోను చక్కని పరాభవము కలిగినదనుటకు సందేహము లేదు.

విజయనగరము వద్దనుండి రామేశ్వరము వఱకును సుల్తాన్ అయిదువేల సైనికులతోఁబోయి రాయలను తఱుముకొని వచ్చెనని చెప్పఁబడియున్నది. విజయనగరమునుండి రామేశ్వరమువఱకు నైదువందలమైళ్లు. వెళ్లివచ్చుటకు వేయి మైళ్లగును. ఇంతదూరమువఱకు ననేకరాజ్యము లుండెను. అందుఁ గొన్ని బుక్కరాయలకు లోఁబడినవి. ఈ రాజ్యములన్నియు దాఁటి యైదు వేలసేనతో నీ సుల్తాను వెళ్లివచ్చెననియు, నడుమ నెవ్వరు నీతనిని అడ్డగింప లేదనియుఁ జెప్పుటకంటె హాస్యాస్పదమైన చరిత్రాంశము మఱియొకటి యుండదు.

ఈ కథాసందర్భమునందుఁగూడ విజయనగరపురాజు కృష్ణరాయలే యని ఫెరిస్తా చెప్పియున్నాఁడు! ఈకాలమునకుఁ దరువాత నూటేండ్లకుఁగాని కృష్ణరాయఁడు పుట్టలేదు! కంసునకు నెచ్చటఁజూచినను కృష్ణుఁడు కానవచ్చి నట్లు, యవనాంతకుఁడగు కృష్ణరాయఁడు ఫెరిస్తాకు సర్వకాల సర్వావస్థల యందును గానిపించుట సహజమకదా!!

అల్లాఉద్దీనుని కడగొట్టు కొడుకగు మహమ్మదనువాఁడు ౧౩౭౫ లో రాజ్యమునకువచ్చి ౧౩౯౭ వఱకు రాజ్యముచేసెను. ప్రజలందఱును అతని యెడ ననురాగమునుగలిగి ప్రవర్తించిరఁట. అతఁడు రాజ్యమునకు వచ్చినాఁడని వినఁగానే యదివఱకు రాచూరుదుర్గమును ముట్టడించియున్న రాయలవారు కూడ ముట్టడినిలేపి మహమ్మదుషాహావలన నేర్పఱుపఁబడిన కప్పము మొత్తము నిచ్చుటకు నొప్పుకొనెనని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. కాని యిందు రెండు అసత్యములున్నవి. ఇదివఱకు ముజాహీదుషాహను ఓడించి పాఱఁదోలిన బుక్కరాజు క్రొత్తసుల్తాను రాజ్యమునకు వచ్చెనని విన్నంతమాత్రమున రాచూరు ముట్టడినిలేపి కప్పమునిచ్చెదనని యొప్పుకొనుట యసంభవము. ఇదియుఁగాక ఫెరిస్తాగ్రంథమును బట్టిచూచినను మహమ్మదుసాహ సంగీత పాఠకుల కీయవలసిన పైకముతోనే సంతుష్టుఁడై వెడలిపోయెనేకాని బుక్క

రాయలకును, మహమ్మదుషాహకును కప్పమువిషయమై చర్చ జరుగనేలేదు. కావున బుక్కరాయలు పూర్వము మహమ్మదుసాహ కిచ్చెడనన్న కప్పమిచ్చుటకు నొప్పుకొనె నన్నమాట శశశృంగమువలె నత్యంతాభాసమే యని తలంప వలయును.

## బుక్కభూపతి యోగ్యత.

ఈ మహారాజు మిక్కిలి పరాక్రమవంతుఁడు. అన్నకాలము నుండియు విజయనగర సామ్రాజ్యాభివృద్ధికై పాటుపడి దాని వైశాల్యమును, గౌరవమును క్రమక్రమముగా నభివృద్ధిచేసి, తన ప్రభుత్వకాలములో దానిని మహోన్నత దశకుఁదెచ్చెను. సామర్థ్యమందును, సంపత్తియందును, రాజ్య విస్తారమందును విజయనగరరాజ్యము బహమనీ రాజ్యముకంటెను శ్రేష్టమైనదిగా నుండెననియు గోవా యను సముద్రపురేవును, మాల్గామను దుర్గమును తుళువ దేశములోని యనేకమండలములును విజయనగరరాజుయొక్క స్వాధీనములో నుండెననియు మలబార్ సింహళము మొదలయిన ద్వీపద్వీపాంతరరాజులు తమరాయబారు లను విజయనగర రాజునొద్దకుఁ బంపి ప్రతిసంవత్సరమును వెలగలకానుక లంపు చుండెడరనియు విజయనగరద్వేషి యగు ఫెరిస్తాయే వ్రాసియున్నాఁడు. ఈ రాజు విజయనగర పట్టణమును అభివృద్ధిచేసి యధిక విశాలముగను జక్కఁగను గట్టించెను. పట్టణమందు భవ్య మందిరములును, జనసందష్టమైన వర్తకస్థల ములును, కళాకౌశల్యములను నిర్మించు భవనములును అసంఖ్యమయ్యెను. దేశ దేశములనుండి వర్తకులువచ్చి యచ్చట నివసించుటఁజేసి యాపట్టణము దక్షిణ హిందూదేశమునందలి ముఖ్యవర్తకస్థల మయ్యెను. వీరులకును విద్వాం సులకును తమతమ సామర్థ్యముఁ జూపి బహుమతులు వడయుటకు వీలయిన పట్టణమై విజయనగర విద్యానగర నామములను సార్థకపఱుపఁ జొచ్చెను. ఇట్లీతనికాలమున విద్యానగర పట్టణమందు నెటుచూచినను లక్ష్మీ

సరస్వతులు తాండవమాడుచుండిరి. తురుష్కులచేఁ బరాభవింపఁబడిన రాజ్య మిట్లుండునా?

ఈ రాజు ప్రజారంజకుఁడుగను, ప్రజలు రాజున కనుకూలురుగను ఉండిరి. దేశము ప్రజావంతముగను, ప్రజలు సంతుష్టాంతరంగులుగను ఉండిరని ఫెరిస్తాయే యొప్పుకొన్నాఁడు. అయిదు లక్షల ప్రజలు నాశమంది దేశమంతయుఁ బ్రజారహితమై పాడుపడినదన్న దేశమిట్లుండు టెట్లుతటస్థించును? కావున అయిదులక్షల జనులను మహమ్మద్ షాహ సంహరించె నన్నమాట కల్ల; కలలోని వార్త. బుక్కరాయలు తన ప్రభుత్వకాలములో ననేకతటాకములను చెఱువులను, బావులను, కాల్వలను త్రవ్వించి సస్యసమృద్ధిచేసి ప్రజలకు సౌఖ్యము కలుగఁజేసెను. ఇందువలన నీరాజు వ్యవసాయవిషయమై మిక్కిలి శ్రద్ధవహించుచుండెనని తోఁచెడిని. భూమిశిస్తును గుఱించి తగిన నియమముల నేర్పఱచి, తన యధికారులవలన జనులకు బాధలేకుండఁ బ్రవర్తించునట్లు ఏర్పాటులు చేసెను.

ఇతఁడు వైదికమతమునం దెక్కుడభిమానము కలవాఁడయ్యును పరమత యెడ ద్వేషములేక సహిష్ణుత కలిగియుండెను. తన రాజ్యములోని హిందువులను, జైనులను, లింగాయతులను, మహమ్మదీయులను సమానముగాఁజూచును. ఈ విషయమును గుఱించి యీతఁడు బహమనీసగదారులకంటె వేయిమడుంగులు ఎక్కుడు సజ్జనుండని చెప్పవలసియున్నది. దయాదాక్షిణ్యములేక మహమ్మదీయులు కానివారిని నఱకుటయే పరమధర్మముగా నెంచిన బహమనీ రాజులెక్కడ? సర్వసమతగల యీనృపపుంగవుఁ డెక్కడ? తాను శైవమతావలంబకుఁ డయినను తనరాజ్యములోని శ్రవణబెల్గోలా యనుపట్టణమందు జైనులకును రామానుజులకును మహోత్సవముల విషయమై వివాదములు కలిగినపుడు వారి నిరువురిని గౌరవించి, వారికి సమాధానముచెప్పి తగవుతీర్చెను. ఈరాజు వైదికధర్మమునందు నధికభక్తి కలవాఁడనియు, నితని ప్రోత్సాహము

వలననే సాయణమాధవులు సాంహితభాష్యము చేసిరనియు నిదివఱకే వ్రాసి యున్నాము.

## రెండవ హరిహరరాయలు.

## (౧౩౭౭ - ౧౪౦౪).

బుక్కరాజు తరువాత నాతనికి గౌరాంబికవలనఁగలిగిన హరిహరరాయలు రాజయ్యెను. ఇతఁడు మిక్కిలి యదృష్టశాలి. ఇరువదియేడు సంవత్సరముల వఱకును మహావైభవముతోడను, శాంతతతోడను రాజ్యముచేసెను. ఇతనికాలము లోని శాసనము లనేకములుకలవు. మైసూరు, ధార్వాడ్, కాంచి, చంగల్ పేట, తిరుచినాపల్లి మొదలయిన స్థలములలోఁగూడ నీతనిశాసనములు గాన నచ్చుచున్నందున నీతని రాజ్యవిస్తారము విశేషముగా నుండినట్లును, ఇతనికిఁ బూర్వముండిన రాజులు ధరించినట్టి 'మండలేశ్వర' 'ఒడయర్' అను మాండ లిక రాజులకుఁ దగిన బిరుదులవదలి యీతఁడు 'మహారాజాధిరాజ' 'రాజపర మేశ్వర' మొదలయినబిరుదులు ధరించినందున నీతని చేతిక్రింద ననేకమాండ లిక రాజులుండి యీతనికిఁ జక్రవర్తిత్వము వచ్చినట్లును, విజయనగరమునకు సామ్రాజ్యవైభవము కలిగినట్లును మనము స్పష్టముగాఁ దెలిసికొనవచ్చును. ఈతనిప్రభుత్వకాలములో నీతని సేనాధిపతులచే మహమ్మదీయులు పూర్తిగఁ బరాభవింపఁ బడిరని శాసనములవలనఁ గానవచ్చుచున్నది. *

ఇతని తండ్రివలెనే యితనికిని మహాసామర్థ్యవంతులగు మంత్రిపుంగవుల సాహాయ్యము గలదు. అట్టివారిలో మాధవాచార్యులవారి తమ్ముఁడగు సాయణా చార్యులవారు ముఖ్యులు. రెండవవాఁడు గౌడబ్రాహ్మణుఁడగు మాధవమంత్రి. ఇతఁడు గోవాపట్టణమును జయించిన వివర మిదివఱకే బుక్కరాయల చరిత్రలో

* Journal : Bombay Branch, Royal Asiatic Society; IX, 227. "Mysore Inscriptions," page 226.

నుదాహరింపఁబడినది. ఈమహారాజు కాలములో విఖ్యాతిఁజెందిన మూఁడవ మంత్రి ముద్దప్ప. ఇతఁడు మొదటి హరిహరరాయల కడగొట్టు తమ్ముఁడైన ముద్దప్పయేయని సంశయము కలుగుచున్నది. కాని యిదమిత్థమ్మని స్పష్టముగాఁ జెప్పుటకు వీలులేదు. ఈముద్దప్పనుగుఱించి రెండు శాసనములుకలవు. అందు ౧౩౭౯ (సిద్ధార్థి)లోఁ జెక్కింపఁబడిన శాసనములో హరిహరరాయలు తన తండ్రియొద్దనుండి రాజ్యమును, యశస్సంపన్న మంత్రియగు ముద్ద దండాధిపతిని బడసెననియు, ఈమంత్రి తన రాజనీతిచే శత్రురాజులను బంధించెననియు, రాములవారు దశరథునియొద్దనుండి సుమంత్రుని బడసినట్లు ఈరాజు ముద్దమంత్రిని బడసి రాజ్యభారమంతయు నాతనియందుంచి విష్ణుమూర్తివలె సుఖాసనాసీనుఁడై యుండెననియు వ్రాయఁబడియున్నది. ఈమంత్రి తన పేరిట ముద్దదండనాయకపుర మను నగ్రహారమును గట్టించి బ్రాహ్మణుల కొసఁగెను. బేలూరులో దొరికిన తామ్రశాసనమొకటి యీమంత్రిపుంగవుని గుఱించియు, రాజ్యములోని యితరవిషయములనుగూర్చియు విశేషాంశములను దెలుపుచున్నది. ఇది దుందుభినామ శా. శ. ౧౩౦౪ వ సంవత్సరమునకు సరియైన క్రీ-శ-౧౩౮౨లో విజయనగరరాజ్యమందలి వివిధజనులచేఁ జెక్కింపఁబడినది. ఇందు ముద్దదండనాయకుని వైభవంబును, అతనికి వివిధజనంబు లీయవలసిన పన్నుయొక్క వివరంబును వర్ణింపఁబడి యున్నవి. ఈశాసనము వ్రాయించినవారిలోఁ గోమట్లును, వర్తకులును, వీరులును, మత్స్యద్రీలును, రాజవంశజులును, న్యాయవాదులును ఉండిరి. ఈశాసనములోని యంశము లిచ్చట సంగ్రహముగాఁ దెల్పెదను. సోమవంశములో ఖ్యాతయశుఁడగు బుక్కరాయఁడు జన్మించెను. నలనహుషాదిరాజులు రాజ్యముచేసిరికాని బుక్కరాయనివలెఁ బేరుపడసిన వారుకారు. అతని కుమారుఁడగు హరిహరరాయలు రాజ్యముచేయు నపుడు రాజ్యము శత్రువుల కభేద్యమయ్యెను. అతఁడనేక దానధర్మములఁజేసెను. చోళపాండ్యకేరళదేశ దిగ్విజయంబు కతన నాతఁ

డందినకీర్తి దక్షిణదిగ్భామినికి నద్దమువలె నుండెను. అతఁడెప్పుడును దిగ్విజయ యాత్రకు శరదృతువులో వెడలినను, అతనిచేఁ జంపఁబడిన యవనుల భార్యలు రాల్చుకన్నీటిచే దినములెప్పుడును మేఘాచ్ఛాదితములుగా నుండును. అతఁడు సర్వజనులకును భేదములేక దానమొసఁగినందునఁ గల్పద్రుమమని పేరుపడసెను. సర్వమతములవారియెడను, సర్వజాతులయందును సమానభావముతో నుండును. అతఁడు విశాలరాజ్యమును, ఘనతవహించిన ముద్దదండనాయకునిని బడసెను. తన రాజనీతిచే ననేకరత్నావళులను సంపాదించి యుదయనరాజు మంత్రియైన యౌగంధరాయనికి సిగ్గు వచ్చునట్టుచేసెను. తన పౌరుషబలమున నతఁడనేక రాజపుంగవులను బట్టుకొని చెఱఁబెట్టెను; బ్రాహ్మణుల కనేకాగ్రహారముల నిచ్చెను; నానాజాతులవారినిఁ దనపుత్రులవలెఁ బెంచెను. తన రాజ్యములో న్యాయపాలనము చక్కఁగఁజేయుచు బీదలఁ బ్రోచుచు నార్తుల రక్షించుచుండెను. అతని ధర్మప్రభుత్వమునకు సంతసించి, ఆతని రాజ్యములోఁ దమకుఁ గలుగుచున్న సౌఖ్యమునకును, సంరక్షణకును మాఱుగా నాతని రాజ్యములోని ప్రజలు రైతులు వర్తకులు ఇతరజనులు నామంత్రివర్యునకు, గొన్ని పన్నులిచ్చుటకు నొప్పుకొనిరి. ఏయేసరకులమీఁద నెవ్వరెవ్వ రెంతెంత పన్ను చెల్లింపవలసినదియు నీశాసనమునందు విపరముగా వర్ణింపఁబడినది. ఈశాసనమునందు బాటన నడుచు నేనుఁగులు, గుఱ్ఱములు, ఎడ్లు, బండ్లు, మొదలయిన వాహనములును, ఔషధద్రవ్యములు, ధాన్యములు, వస్త్రములు, తిరిబండాదులు, గుఱ్ఱములు, పశువులు, చేతిపనులు మొదలయిన వర్తకద్రవ్యములును ఉదాహరింపఁబడుటవలన నాకాలమందు విజయనగర రాజ్యములో ననన్యసామాన్యవర్తకముండెననియు వర్తకనియమముల నేర్పఱచుటకు వర్తకసంఘములు (Chambers of Commerce,) ఉండెననియు స్పష్టమగుచున్నది. ఈశాసనములో హస్తినావతి, విజయనగరి, ద్వారసముద్రము, పెనుగొండ, ఆదవని, ఉదయగిరి, చంద్రగిరి, మాలువాయి, కాంచి, పాదవీడు, చతురంగ

విద్యానగరములోని



ఏనుఁగుశాలలు.

విఠ్ఠలస్వామి దేవాలయము మధ్యభాగము.

పట్టణము, మంగళూరు, బారకూరు, హోన్నవర, చందవరు, ఆరగ, చంద్రగుత్తి, అన్నిగెరి, నిడుగల్లు, చిన్నతనకల్లు, తరికెల్లు, అనవిడ్డు, శరికల్లయు, తెలకలంబి, శింగపట్టణము మొదలయిన గ్రామాదుల పేళ్లుదాహరింపఁబడినందున ఈరాజ్యవిస్తారము విశేషముగా నుండెననియు, ఇన్నిపట్టణములవారును పైనుదాహరింపఁబడిన వర్తకసంఘమువారిచే నేర్పఱుపఁబడిననియమములను శిరసాసహించుచుండిరనియుఁ గానవచ్చుచున్నది. ఈ మంత్రిపుంగవుని విషయమై ప్రజలు తమ యభిప్రాయమును దెల్పుట చూడఁగా అప్పటి మహారాజములు మంత్రులుగూడఁ జనాభిప్రాయ (Public opinion) మునకు వెఱచి వారికి ననుకూలముగాఁ బ్రవర్తించుచుండిరని మన మూహింపవచ్చును.

హరిహరరాయలయొద్ద గుండప్ప యను దండనాథుఁడొకఁడుండెను. ఈతని శౌర్యాదికములవర్ణించు శాసనమొకటి బేలూరులోని కేశవస్వామిగుడిలోఁ గలదు. అది యీశ్వరనామసంవత్సరములోని దనఁగా ౧౩౯౭లో వ్రాయింపఁబడినది. ఈమంత్రిశేఖరుం డనేక దేశములను జయించెను; గజములవంటిపైపు పాణ్డేయ మొదలయిన తురుష్కవీరులను యుద్ధరంగమందు వారిగడ్డముపట్టి లాగి, తనగుఱ్ఱపుశాలలో వారినిఁ గోఁతులవలె బంధించియుంచెను; జ్యేష్ఠకనిష్ఠలను రెండు గొప్ప పులులను గొంతు పట్టుకొని చంపెను; అని యీ శాసనముపలనఁ దెలియుచున్నది. ఇతఁడు తాను జయించిన నానాదేశములలో శతకుంభాలంకృత జయస్తంభములఁ బాఁతించెను. ఈశాసనముల లోని కొన్ని యతిశయోక్తులను విడిచినను, దీనినిబట్టి యీఁతడు విజయనగర రాజ్యలక్ష్మిని మిక్కిలి యభివృద్ధిచేసె ననుటకు సందేహములేదు. ఈరాజుచే మండలేశ్వరులుగా నియమింపఁబడిన దండనాయకులనేకులు అనేకశాసనములు చెక్కించియున్నారు. వాని నన్నిటిని నిచ్చట నుదాహరించుట యనావశ్యకము.

## హరిహరరాయని యోగ్యత.

ఈ హరిహరరాయలు అదృష్టశాలియైన గొప్పరాజని చెప్పుటకు సందేహములేదు. ఇతఁడు మిక్కిలి పరాక్రమవంతుఁడనియు, సంగీత సాహిత్య విద్యలందుఁ బ్రవీణుఁడనియు, ప్రజానుశాసకనిరతుఁ డనియు, శాసనములవలనఁ గానవచ్చుచున్నది. ఇతని యాయురారోగ్యైశ్వర్యమునుగూర్చి యీతనిప్రజ లనేక దానములుచేసి శాసనములువేయించుటఁ జూడఁ బ్రజ లీతనిని తండ్రివలెఁ బ్రేమించుచుండిరని స్పష్టపడుచున్నది. శత్రురాజులను, విశేషముగాఁ దురుష్కులను పూర్తిగ నోడించెను. ఈతఁ డిరువదియొనిమిది సంవత్సరముల వఱకు రాజ్యముచేసి యన్నివిధములను తనరాజ్యమును అభివృద్ధిచేసెను. తండ్రివలెనే వేదాదివిద్యల పునర్జీవనమునకై పాటుపడెను. ఇట్లీచక్రవర్తి సర్వవంద్యుఁడును సర్వప్రియుఁడు నై జన్మసాఫల్యమునొందెను. ఈ యంశము లన్నియు నమ్మఁదగిన శిలాతామ్రశాసనములవలనఁ దెలిసినవిషయములు. ఇఁక మహమ్మదీయ చరిత్రకారుఁడగు ఫెరిస్తా యేమి వ్రాయుచున్నాఁడో కనుగొందము.

## ఫెరిస్తా కత.

క్రీ. శ. ౧౩౯౮ లో బహమనీసుల్తానునకును, విజయనగర రాయలకును యుద్ధముజరిగెను. ఈరాయలపేరు దేవరాయలని ఫెరిస్తా వ్రాయుచున్నాఁడు. కాని శాసనములనుబట్టి జూడఁగా నప్పుడు రెండవ హరిహరరాయలు రాజుగా నుండినట్లు కానవచ్చుచున్నది. కావున ఈయుద్ధవార్త నిజమైనయెడల నీరాజు కాలములోనే జరిగియుండును. ఫెరిస్తాయొక్క గ్రంథములోని కాలవిపర్యాసదోషములును (Anachronisms) పురుష విపర్యాసదోషములును సుప్రసిద్ధములు. అది యట్లుండె. ఇఁకనాయుద్ధవార్త వినుఁడి.

బహమనీరాజ్యము నిమిత్తమై కులబరుగి (గుల్బర్గా) పట్టణములో దాయాదులకు వివాదములు జరిగి కొందఱు సులానులు చంపఁబడి తుదకు

ఫెరోజ్ షాహ సుల్తానయ్యెను. ఇట్లు గుల్బర్గాలోఁ గల్లోలములు జరుగుట చూచి హరిహరరాయ లదియే మంచిసమయముగదా యని యెంచి రాచూరు ముద్గల్లు దుర్గములను స్వాధీనపఱుచుకొనుటకుఁ బుత్రసమేతుఁడై వెడలెను. అప్పుడు ఫెరోజ్ షాహకూడ నాతని నెదుర్కొనవచ్చెను. వర్షకాల మైనందునఁ గృష్ణానదినిండి ప్రవహించుచుండెను. దాని కుత్తరమునఁ దురుష్క సైన్యమును, దక్షిణమున రాయలసైన్యములును విడిసియుండెను. కాని రాయల సైన్యములఁ జూచి ఫెరోజ్ భయపడి చేయుకర్తవ్యంబెద్దియని చింతించి యాతఁడు తన సేనానాయకుల నందఱినిఁ బిలిపించి యాలోచించెను. కాని వారును తగిన యాలోచనయేమియుఁ జెప్పలేక పోయిరి. సుల్తాన్ చిన్నఁ బోయెను. అంత నాతని యొద్దనున్న యొక కాజీ * తాను మాయోపాయము చేసి రాయలనుగాని, యాతని కుమారునిఁగాని చంపివచ్చెదనని చెప్పి, కొందఱు జనులతో సన్యాసివేషముధరించి, నదిదాఁటి, పదిమైళ్లనిడుకు సముద్రమువలెఁ బ్రసరించియున్న సైన్యములోనున్న రాజపుత్రుని శిబిరము ప్రవేశించెను. అచ్చటనున్న బోగముదానిమీఁద వలపుపుట్టినట్టు నటించి, తన సంగీతమువలన దానిని మెప్పించియు, దానిపాదములకు మ్రొక్కి బ్రతిమాలుకొనియుఁ దన యుద్దేశముదానికిఁ దెలుపక దాని మేళములోఁజేరి, యది రాజపుత్రుని యొద్దకు నాట్యమునకుఁ బోయినపుడు మేళమువానివలెఁ దానును, మఱి యొకఁడును గలిసి వెంటఁగత్తులుతీసికొని చని నాట్యకాలమందు మోసముచే రాజపుత్రునిఁజంపిరి. అంత శిబిరమునందుఁ గల్లోలముకలిగి చీఁకటిరాత్రి యగుటచే శత్రువు వచ్చి మీఁదఁబడి యందఱిని నఱకుచున్నాఁడని తలఁచి, హిందూసైన్యమంతయుఁ జెల్లాచెదరయ్యెను. ఈసంధి కనిపెట్టి ఫెరోజ్ షాహ నదిదాఁటివచ్చి రాయలసైన్యముల వెంటఁ దఱిమెను. రాయలు విజయ నగరమునకుఁ బాఱిపోయెను. ఫెరోజ్ షాహకుఁ దమ్ముఁడును తరువాత సుల్తాన్

* కాజీ యనఁగా మతగురువు.

అయినవాఁడును అగు అహమ్మదనువాఁడు కొంతదేశమును బాడుచేసి కొందఱు జనులను చెఱఁబెట్టెను. కొంతధనమిచ్చి రాయలు వారిని విడిపించెను. పూర్వమువలెనే యెవరిరాజ్యపు పొలిమేరలు వారి కుండవలసినదని సంధిచేసి కొనిరి. ఇది ఫెరిస్తా వ్రాసినవృత్తాంతము. కావున భోగముదానికి సాష్టాంగ దండము పెట్టినను, నీచులకుఁ దగినట్టియు శూరులకుఁ దగనట్టియు మోస కృత్యము చేసినను, ఈయుద్ధమునలన ఫెరోజ్ సాహాకు విశేషలాభము కలిగి నట్లు కానరాదు. అతనికే తగినజయము కలిగినయెడల నెవరిరాజ్యము వారికే యని చేతులాడించుచు నాతఁడు వెడలిపోవుట యెట్లు తటస్థించును?

## రాయలకుటుంబము.

ఈ రాజుభార్యపేరు మల్లాంబిక. ఇతనికి రెండవ బుక్కరాయలు, విరూపాక్షరాయలు, చిక్కరాయలు అని ముగ్గురుకొమారులుండిరి. చిక్క రాయఁడు ఆరగ యను మండలమునకు నాయకుఁడుగానుండెను. ఒక శాసన మునుబట్టి చూడ నీరాజు క్రీ. శ. ౧౪౦౪ లో ౨ వ సెప్టెంబరుదినమునఁ గీర్తిశేషుఁడైనట్లు కానవచ్చెడిని * కావున ౧౩౯౯ వఱకే హరిహరరాయఁ డుండెనని స్యూయెల్ దొరగారు వ్రాసినయంశము విశ్వసనీయముకాదు.

## రెండవ బుక్కరాయలు.

## లేక మొదటి దేవరాయలు.

## (౧౪౦౪ - ౧౪౨౨).

ఈ కాలమందలి విజయనగరపు రాజులపేళ్లనుగుఱించి చరిత్రకారులు భిన్నాభిప్రాయులైయున్నారు. శాసనము లొకవిధముగను మహమ్మదీయ

* Epigraphia Carnatica, Vol III. Part II.

గ్రంథకారులు మఱియొకవిధముగను, ఇతరచరిత్రకారు లింకొకవిధముగను వ్రాసియున్నారు. మొత్తముమీఁద నన్ని సాధనములను సమన్వయించి చూడఁగా నీకాలమందు రెండవబుక్కరాయలు రాజుగానుండెననియు, నాతనికే దేవరాయ లనుమాఱుపే రుండెననియుఁ గానవచ్చుచున్నది. విరూపాక్ష సదాశివరాయ లనువారు కొలఁదికాలము రాజ్యముచేసినను జేసియుండవచ్చును.

ఈరాజు గోవా, దాభోల్, తూర్పుసముద్ర ప్రాంతమును జయించెను. ఇతఁడు పట్టణములో ననేకములయిన ప్రాకారములును, బురుజులును గట్టించెను. అన్నిటికంటె నితఁడు చేసినమహత్కార్యము పట్టణములోనికిఁ దుంగభద్రానదీతీర్థమును దెచ్చుట. అంతకుఁ బూర్వమునందు నాపట్టణములో మంచిజలము లేనందున జనులకు మిక్కిలి యిబ్బందిగా నుండెను. ఉన్న జలము పరిశుద్ధమైనదికానందునఁ దోటలు మొదలయినవి చక్కఁగఁ బెరుఁగక పోయెను. అందుచే విజయనగరపట్టణమునకుఁ బండ్రెండుమైళ్లమీఁదఁ దుంగభద్రకు అనకట్టకట్టి యొక కాలువను దీసికొనివచ్చెను. ఒక పెద్దగుండు పెక్కేనుఁగులచే నీడ్పించుకొనిపోయి దానిని నదికి నడ్డముగావేయఁగా నది యారాజువెంటఁ బట్టణములోనికి వచ్చెననిచెప్పెదరు! ఇట్లు పట్టణమందు జలసమృద్ధియైనందున నెచ్చటఁజూచినను లతాకుంజములును, పుష్పోద్యానములును, ద్రాక్షతాంబూలాదుల తోఁటలును సమృద్ధిగఁ బెరిఁగి, నగరశోభ హెచ్చి రాజునకుఁ బండ్రెండులక్షల యాదాయము నూతనముగాఁ గలిగెను. ఈ కాలువ యిప్పటికిని గానవచ్చుచున్నది. దాని నిర్మాణచాతుర్యమునుజూచి యిప్పటి యింజినీర్లును ఆశ్చర్య మగ్నమానసులగుచున్నారు! ఈ యనకట్టయుఁ గాల్వయు నిర్మించుటకు రాయల బొక్కసములోని ద్రవ్యమంతయు వెచ్చింపఁ బడెనఁట.

పైని వర్ణింపఁబడినకాల్వగాక తనరాజ్యములోని వ్యవసాయమును అభివృద్ధి చేయుటకై యీ రాజనేకములైన కాల్వలు త్రవ్వించినట్లు శాసనాదులవలనఁ గానవచ్చుచున్నది.

తురుష్కచరిత్రకారుఁడగు ఫెరిస్తాచే వ్రాయఁబడినచరిత్ర ననుసరించి చూచినయెడల ఈ రాజునకును బహమనీరాజులకును మూఁడుయుద్ధములు జరిగినట్లు గానవచ్చుచున్నది. అందు మొదటియుద్ధము ౧౪౦౬ లో జరిగెను. అందులకు నొక కాఁపుకన్నియ కారణమయ్యెను. ఆకథాక్రమం బెట్టిదనిన:

## ప్రథమయుద్ధము (౧౪౦౬).

బహమనీరాజ్యపు సుల్తానయిన ఫెరోజ్‌సాహాయొక్క రాజ్యములోని దగు ముద్గల్లుపట్టణములో నొక కాఁపువానికి మిక్కిలి చక్కనికూఁతురు కలదు. ఒక బ్రాహ్మణుఁడామెకు సంగీతసాహిత్యాదివిద్యలు నేర్పి, యామె రాజపత్నియగుటకుఁ దగినదియని తలఁచి, యాసమాచారము రాజునకుఁ దెల్పెను. కాని రాజపత్నియై రాణివాసములోఁ గైదుపడుటకంటె బీదవారి యింట నేయుండి స్వాతంత్ర్య మనుభవించుట మేలని చెప్పి యాకన్నియ రాజును వివాహమాడుటకు నొప్పుకొనలేదు! కాని మదాంధుఁడగు నారాజు బలవంతముగా నాకన్యను వశపఱుచుకొనఁ దలఁచి, కొంతసైన్యమును దీసికొని ముద్గల్లుకుఁ బోవవెడలెను. సైన్యమునకు వెఱచి ముద్గల్లుజనులందఱును బాఱి పోయిరి. వారితో నాపిల్లయును వెడలిపోయినందున రాజుకోర్కె సిద్ధించినది కాదు. అందుపై నాతనికిఁ గోపమువచ్చి యాతఁడు నవాబు దేశమును దోఁచుకొని పాడుచేసెను. ఈ సమాచారము తెలిసి ఫెరోజ్‌సాహ మిక్కిలి యాగ్రహపడి గొప్పసేనను దీసికొని రాయలతో యుద్ధముచేయుటకు వెడలి రాయలసైన్యముల నోడించెను. అంత రాయలవారు విజయనగరమును ప్రవే శించిరి. సుల్తానాతని వెంబడించి విజయనగరముయొక్క బహిఃప్రాకారమును

స్వాధీనపఱచుకొనెను. కాని యతనికిఁ జేతిమీఁద గొప్పగాయము తగిలి నందునను, అతని సైనికులు కర్ణాటవీరులశౌర్యమునకు నోర్వలేకపోయినందు నను, మహమ్మదీయు లచ్చటినుండి పాఱిపోయి, పట్టణమునకువెలుపల నాలుగు నెలలవఱకుండి, రాయలవారు పట్టణములోనుండి వెలుపడకుండఁ జేసిరి. తురుష్క సేనలలోఁ గొన్నిపోయి బంకాపురమును స్వాధీనపఱచుకొని యాఱువదివేల హిందువులఁ జెఱఁబట్టితెచ్చెను. అంత రాయలవారు విధిలేక ఫెరోజ్ షాహాతో సంధిచేసికొని, తనకొమార్తెను షాహకిచ్చి వివాహముచేసెను. వివాహము మిక్కిలి వైభవముతో జరిగెనఁట. కాని వివాహసమయమందుఁ గూడ వారుభయులు పోరాడుకొన్నందున వారివైర మభివృద్ధియే యయ్యె నఁట.

ఇఁక నీకథాంశ మెంతవఱకు నిజమో చూతము. నిజముగా విజయనగర రాజు తనయాడుబిడ్డను తురుష్కునకిచ్చియుండిన యెడల నది యందఱు చరిత్రకారులును వ్రాయఁదగిన విశేషాంశము. ఈ యంశము ముఖ్యమైనదియు, విశ్వవిఖ్యాతమైనదియుఁ గావున ఒక చరిత్రకారునికిఁ దెలియును, మఱియొకనికిఁ దెలియదు అని నుడువుటకు వీలులేదు. కాని యీవివాహవృత్తాంత మొక ఫెరిస్తాతప్ప నితరులెవరును వ్రాసియుంచలేదు. ౧౪౪౩ లో అబ్దుర్ రజాక్ అను పారసీదేశపు తురుష్కురాయబారి విజయనగరమునకు వచ్చి, యచ్చటివిశేషము లనేకములు వ్రాసియున్నాఁడు. అతఁ డీవివాహమును గుఱించి యేమియు వ్రాసియుండలేదు. ౧౪౦౬లో నీ వివాహము నిజముగానే జరిగియుండినపక్షమున, అబ్దుర్ రజాక్ విజయనగరమునకు ౧౪౪౩లో వచ్చునఱకు నీ వివాహము జరిగి ౩౭ సం॥ములు మాత్రమైయుండును. తురుష్కుఁడును హిందూద్వేష్టయు, విజయనగరమును గుఱించిన యన్ని యంశములను గనుఁగొనుటయే పనిగాఁగలవాఁడును అగు అబ్దుర్ రజాకునకు, కొలఁది కాలముక్రిందట నిజముగానే జరిగియున్నయెడల నీ వివాహముసంగతి తెలి

యకయుండదు; తెలిసియేని యితఁడు వ్రాయకయుండఁడు. అతఁడు దీనిని గుఱించి యేమియు వ్రాయలేదు. కావున ఫెరిస్తా వ్రాసినది కట్టుకతయనియే చెప్పవలయును. ఇంతియకాదు. ఈ కాలమునకు నూ ఱేండ్ల తరువాతఁబుట్టిన పెయిస్ (Paes), ననిస్ (Naniz) అనుపోర్చుగీసు చరిత్రకారు లీవిజయ నగర రాజ్యముయొక్క చరిత్ర చక్కఁగఁ గనుఁగొని, దానిని సవిస్తరముగా వ్రాసియున్నారు. వారును ఈ వివాహ వర్తమానము వ్రాసియుండలేదు. ఇట్లు ప్రస్తుత చరిత్రాత్మకకాలమునకు ముప్పదియాఱు సంవత్సరముల తరువాతను, నూ ఱేండ్లతరువాతను విజయనగరచరిత్రలు వ్రాసిన గ్రంథకర్తలకుఁ దెలియని యీ వింత వివాహవార్త రెండువందలయేండ్ల తరువాతఁ బుట్టిన ఫెరిస్తావ్రాయుటచూడ నాతని సత్యసంధత్వమునకు మన మెంతయు నచ్చెరు వందవలసి యున్నది.

## రెండవయుద్ధము (౧౪౧౬ - ౧౪౧౯).

క్రీ.శ. ౧౪౧౭న సంవత్సరములో ఫెరోజ్ షాహ ఓరుగంటిరాజులతోఁ బోరాడఁ దొడఁగెను. ఆదవనికి నీశాన్యమున డెబ్బదిమైళ్లమీఁదనున్న పానగల్లు దుర్గమును ఆతఁడు ముట్టడించెను. కాని యాదుర్గములోని శూరవీరులు స్వాతంత్ర్యరక్షణార్థమై తెగించి పోరినందున, రెండుసంవత్సరములవఱకు నాతురుష్కుఁడు ముట్టడివేసి నిలిచియున్నను వానికి జయము కలిగినదికాదు; పానగల్లాతనికి స్వాధీనముకాలేదు. తుదకుఁ దురుష్కసేనలో మహామారి పుట్టినందున వారెచ్చటివా రచ్చటికిఁ బాఱిపోయిరి! అంత విజయనగరాధీశుఁ డగు దేవరాయలు సైన్యములఁ జేర్చుకొని ౧౪౧౯లో ఫెరోజ్ సాహమీఁదికి దండెత్తిపోయెను. ఉభయులకు యుద్ధములు జరిగి యందు హిందువులత్యంత పౌరుషముఁజూపి సంపూర్తిగ విజయులైరి! మహామ్మదీయుల తలలన్నియుఁ దెచ్చి యొకగుట్టగాఁ బేర్చిరి. ఫెరోజ్ షాహ తప్పించుకొని పోవుటయే

దుస్తరమయ్యెను. హిందువులు సుల్తానును వెంబడించి యతనిరాజ్యములోనికిఁ జొరఁబడి యనేకపట్టణముల గెలిచి యగ్నిచేతను, ఖడ్గముచేతను అసంఖ్యజనులను జంపి, మసీదులు పడఁగొట్టి, దేశమంతయు విధ్వంసముచేసి, తమకుఁ దురుష్కులపైఁ గలకసియంతయుఁ దీర్చుకొనిరి. ఇట్టి విపత్తువచ్చినందులకుఁ జింతాక్రాంతుఁడై ఫెరోజ్‌షాహ ౧౪౨౨లోఁ బరలోకగతుఁడయ్యెను.

## మూఁడవ యుద్ధము.

(౧౪౨౩).

ఈయుద్ధము దేవరాయమహారాజు కాలముననో లేక యతని కుమారుని కాలముననో జరిగెను. ఫెరోజ్‌షాహ పోయినతరువాత అతని తమ్ముఁడగు అహమద్‌షాహ సుల్తానయ్యెను. అతఁడు రాజ్యమునకు వచ్చినతోడనే సైన్యములను జేర్చుకొని రాయలతో యుద్ధముచేయసాగెను. ఈయుద్ధములో నొకప్పుడు రాయలు శత్రువులచేతిలోఁ జిక్కఁగా నతఁడొక సామాన్యజనుఁడని తలఁచి, యాతనినెత్తిమీఁద కట్టెలమోపుపెట్టి కొంతదూరము తీసికొనిపోయి, తురుష్కులు వదలిపెట్టిరఁట! ఒకప్పుడు సుల్తానొంటరిగా నుండుటఁజూచి కొందఱు హిందూసైనికు లాతనివెంటఁదగిలి, చంపఁబోఁగా నతఁడు తప్పించుకొని తన సైనికులతోఁ జేరెనఁట. తుదకు రాయలవారే యోడిపోయి సుల్తానునకే కొంత ధనమిచ్చి సంధిచేసికొనెనఁట. ఈధనమాతనికుమారుఁడు తీసికొనిపోయి అహమ్మదుషాహకు సమర్పించెనఁట. ఈ యంశములన్నియు వ్రాసినవాఁడు ఫెరిస్తా మహానుభావుఁడు. కావున నిందుఁ బదునైదువీసము లబద్ధమని మనము నిశ్చయింపవచ్చును. విజయనగరపు మహారాజును సామాన్యజనుఁడని తలఁచి వానినెత్తిమీఁద కట్టెలమోపులు పెట్టుట సంభవమని సారాసార విచారముగలవాఁ డెవ్వఁడు నమ్మఁగలఁడు?

## భాషాభివృద్ధి.

ఈ రాజుకాలములో సంస్కృతాంధ్రకర్నాటకభాష లభివృద్ధియయ్యెను. జక్కయకవిచే రచియింపఁబడిన విక్రమార్కచరిత్రమను కావ్యమును గృతి నొందిన సిద్దన్నమంత్రియు, నతని తండ్రియగు జన్నయమంత్రియు నీరాజు నొద్ద మంత్రులుగానుండి నట్లీక్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

"సీ॥ విమలవర్తనమున - వేదశాస్త్రపురాణ
వాక్యార్థసరణికి - వన్నెపెట్టెఁ।
బరమహృద్యంబైన - పద్య శతంబున।
దేవకీ తనయు వి - ధేయుఁజేసె।
రసికత్వమున దేవ - రాయమహారాజ।
కరుణాకటాక్ష వీ-క్షణముఁగాంచె।
కర్ణాటకటకము - కలయంగ మెచ్చంగఁ।
గడఁకవిద్యాప్రౌఢి - ఘనతకెక్కెఁ॥

గీ॥ గురులఁ బోషించె సత్కవీ - శ్వరుల మంచెఁ।
బ్రజలఁ బాలించె భాగ్య సం-పద వహించె।
హారితమునిముఖ్యవంశర-త్నాకరేంద్ర।
చంద్రుఁడై యొప్పుసిద్దయ-జన్నమంత్రి॥

* * * *

గీ॥ దేవరాయ మహారాయ - ధీవిధేయ।
మంత్రివల్ల భచామానా - మాత్యదత్త।
చామరచ్ఛత్ర భూషాది - సకలభాగ్య।
చిహ్నములనొప్పి జన్నయ - సిద్ధమంత్రి॥"

దేవరాయ మహారాయలుంగారు ౧౪౨౨ లోనో, ౧౪౨౩ వ సంవత్సరపు ప్రారంభమందో కాలధర్మమునొందిరి. అతనికి హరిహర, విజయ, మల్లన్న లను ముగ్గురు పుత్రులుండిరి. అందు విజయుఁడనువాఁడు తండ్రి జీవితకాలమందే యువరాజుగానుండి, తరువాత రాజై యొక సంవత్సరముమాత్రము రాజ్యముచేసి, కాలధర్మమునొందినట్లు గానవచ్చుచున్నది. ఇతనికి రెండవ దేవరాయఁడు, పర్వతరాయఁడు అను నిద్దరుకుమారులును హరమ్మయను కూఁతురును నుండిరి. అందు పర్వతరాయఁడు ౧౪౨౫ లో మృతుఁడయ్యెను. హరమ్మను సాళువ తిప్పరాజునకిచ్చి వివాహముచేసిరి. రెండవ దేవరాయలు రాజయ్యెను.

## రెండవ దేవరాయలు.

### (౧౪౨౩ - ౧౪౪౭).

ఈ రాజునకు ఇమ్మడి దేవరాయలనియు, నితఁ డేనుఁగువేఁటయందు నిపుణుఁడగుటచే 'గజబెంటె దేవరాయ'లనియు మాఱుపేళ్లుండెను.

ఈ రాజుకాలములో నితనిమంత్రులు హరిహర దేవునిదియగు హరిద్రాయన్న పేరుగల యనకట్టను మరలఁగట్టించిరి. ఈ యంశ మొకశాసనములో వర్ణింపఁబడినది. ఇందువలన నితఁడు వ్యవసాయవిషయమై మిక్కిలి దక్షతకలిగి యుండినట్లు కానవచ్చుచున్నది.

ఒక శాసనములో నీరాజుయొక్క దిగ్విజయములు వర్ణింపఁబడినవి. అందు కనౌజకాంభోజ నేపాళరాజు లీతనిసేవ చేయుచుండినట్లు వ్రాయఁబడినది. ఇది కొంతయతిశయోక్తి అయినను 'ననిజ్'అను పోర్చుగీజు చరిత్రకారుఁ డీరాజునుగుఱించి యిట్లు వ్రాసియున్నాఁడు. "అతఁడు విశేషధనమును సంగ్రహింపఁదలఁచెను. కాని యనేకములయిన యుద్ధములు జరుగుచున్నందున నాతఁడు ౮౫,౦౦,౦౦,౦౦౦, వరహాలుమాత్రము సంగ్రహింపఁగలిగెను. ఇది

గాక రత్నాదులు విశేషముగానుండెను. ఆరాజునొద్ద నింతధనముండుట యొకగొప్పకాదు. ఏలయన క్విలన్, సిలోన్, పిలికట్, పేగు, టెనెసెరిం మొద లయిన యనేక దేశములరాజు లాతనికి సామంతులై కప్పముకట్టుచుండిరి." విదేశీయుఁడయిన పోర్చుగీజువానిచే నిట్లు వ్రాయఁబడినందున ఆ రాజునకు దూరదూర దేశపు సామంతులుండిరని మనము నిశ్చయింపవచ్చును. వరహా యొక్కంటికిని ౩రూపాయలు లెక్కవేసి చూచినను ౨౭౫కోట్లరూపాయి లారాజునొద్ద నిలువయుండినట్లు కానవచ్చుచున్నది. ఇదిగాదు. రత్నాదుల జవాహిరి వేలుగనుండెను. ఇదియంతయు దేశము స్వస్థతగానున్న దినములలో సంగ్రహించినదికాదు. ప్రబలశత్రువులతో ఘోరముగాఁ బోరుచు, మూఁడు నాలుగులక్షలకుఁ దక్కువలేకుండఁగను, ఒకప్పు డేడులక్షలవఱకును సైన్య ములఁ దమయొద్దనుంచుచు, మిగిల్చిన ధనమిది! ఇంతధన మిప్పటి యేచక్రవర్తి యొద్దను నిల్వయుండుటలేదు. కావున నీ దేవరాయలకాలములో విజయనగర రాజ్యవిస్తార మెక్కుడుగానుండెననియు, ద్వీపాంతరములోని రాజులుగూడ ఈ సామ్రాజ్యమునకు లోఁబడియుండిరనియు మనము నిశ్చయింపవచ్చును.

పారసీకదేశపు చక్రవర్తియగు షాహరుఖ్ అనునాతఁడు అబ్దుర్ రజాక్ అనువానిని ఈ చక్రవర్తియొద్దకు ౧౪౪౩లోఁ దన రాయబారిగాఁబంపెను. ఇందువలనఁగూడ నీసామ్రాజ్యవైభవము వెల్లడి యగుచున్నది. ఇట్టి సంతతాభి వృద్ధిఁజెంది సామ్రాజ్యపదవినిపొందిన రాజు గుల్బర్గాసుల్తానులతోఁ బోరా డుచు నోడుచుండెనని ఫెరిస్తా వ్రాసినవ్రాఁతలకంటె నసత్యము మఱియొకటి యుండదు. ఇఁకఁ దురుష్కులువ్రాసిన వృత్తాంతమును జూచెదము.

## తురకలవ్రాఁతలు.

రెండవ అల్లాఉద్దీన్ అనువాఁడు బహమనీరాజ్యమునకు ౧౪౩౫లో రా జయ్యెను. రాజ్యమునకురాఁగానే యాతఁడు గొప్పసైన్యము నిచ్చి తనతమ్ముఁ డగు మహమ్మద్ ఖాన్ అనువానిని విజయనగరరాజుమీఁదికి, నాతఁ డైదుసంవ

త్సరములనుండి చెల్లింపఁవలసిన పైకము చెల్లింపనందునఁ బంపెను. ఆ మహా మ్మద్ ఖానుఁడు విజయనగరరాజ్యమునకు మిక్కిలి బాధ కలిగించినందున రాయలవారాతనికి గొప్ప బహుమతులును, సుల్తానునకు ధనమును, ఇరువది యేనుఁగులును, నాట్యసంగీతవిద్యల నేర్చిన రెండువందల దాసీజనంబులును నొసఁగి సంధిచేసికొనెనఁట.

పైనివర్ణింపఁబడినవిజయముచే గర్వాంధుఁడై మహమ్మదుఖానుఁడు తన యన్నయగు అల్లాఉద్దీన్ సుల్తాన్ మీఁదఁ దిరుగఁబడి దేవరాయల సహాయము నడసి యదివఱకు సుల్తాను స్వాధీనతలోనున్న ముద్గల్లు, రాయచూర్, సోలా పూర్, బిజాపూర్, నిల్దుర్గ్ అనుస్థలముల నాక్రమించుకొనెను. కాని త్వర లోనే యాతఁడు సుల్తానుబలములచే నోడింపఁబడెను. కాని సుల్తాను ఆతనిని క్షమించి రాయచూర్ పర్గణాకు నధికారిఁజేసెను.

౧౪౪౩వ సంవత్సరప్రాంతమున దేవరాయలు తనసైన్యమును బాగుపఱి చెను. తనసరదారులను, నాయకులను, సేనాధీశులను బిలిపించి సభచేసి, రాజ్యవిస్తారమునందును, ధనసంపత్తియందును, విజయనగరరాజ్యము బహామనీ రాజ్యముకంటె నెక్కుడైనను, ఏయుద్ధమందుఁజూచినను విజయనగరము వారే యోడుటయు, మసల్మానులే దిగ్విజయము నొందుటయు నేల సంభ వించుచున్నదని ప్రశ్నించెను. మసల్మానుల గుఱ్ఱములు మంచిజాతివనియు, విజయనగరమువారి గుఱ్ఱములు దేశవాళివైనందున నవి మ్లేచ్ఛసైంధవముల నెదిరింప లేవనియు, అదియే పరాజయమునకుఁ గారణమనియుఁ గొందఱు చెప్పిరి. తురుష్కసైన్యములో నెల్లప్పుడును పేరొందిన విలుకాండ్రసంఖ్య యధికముగ నుండుటఁజేసి వారికి జయము కలుగుచున్నదని కొందఱు నుడివిరి. అందుమీఁద నారాజు తనసైన్యములోఁ గ్రొత్తయుత్తమాశ్వంబులను, విలు కాండ్రను, తురుష్కులను జేర్చియుఁ, దన హిందూసైనికుల కందఱికిని విలు విద్య నేర్పియుఁ దనయుద్ధసామర్థ్యంబును హెచ్చించెను. కొలఁదికాలములోనే

యాతనియొద్ద ౨౦౦౦ మహమ్మదీయులగు విలుకాండ్రును, ౬౦,౦౦౦ హిందూ విలుకాండ్రును, ౮౦,౦౦౦ అశ్వసైన్యంబును, ఖడ్గములు, బల్లెములును ధరించి పోరాడు కాలిబంట్లు ౨౦౦౦౦౦ లునుజేరి విజయనగరసైన్యమును అలంకరించిరి.

౧౪౪౨వ సంవత్సరపు నవంబరునెలకును, ౧౪౪౩వ సంవత్సరపు ఏప్రిల్ నెలకును మధ్యకాలములో నొకప్పుడు దేవరాయలవారిని మోసముచేసి చంపుటకు నతనితమ్ముఁడొకఁడు యత్నించెను. కాని మోసకాఁడే హతుఁడయ్యెను.

౧౪౪౩లో నీరాజునకును బహమనీసుల్తానునకును యుద్ధముజరిగెను. దీనిని గుఱించి అబ్దుర్‌రజక్ ఇట్లు వ్రాసియున్నాఁడు. 'దేవరాయలవారినిఁ జంపుటకు యత్నముజరుగుటయు, విజయనగరములోనున్న యంతఃకలహంబును నెఱిఁగి, దేవరాయలను జయించుటకది యుత్తమసమయమని తలఁచి, సుల్తాన్ అల్లాఉద్దీన్ ఏడులక్షలవరహాలు తనకిమ్మని దేవరాయలకు వర్తమానమంపెను. దేవరాయలవారు దానికిఁదగిన ప్రత్యుత్తరమంపి యుద్ధమునకు సిద్ధుఁడై యుండెను. ఉభయసైన్యములును పొలిమేరయొద్దఁగలిసి పోరాడి దేశమును బాడుచేసినవి. దేవరాయల దండనాయకుఁడు గుల్బర్గాపొలిమేరమీఁదికి దండు వెడలిపోయి కొందఱు కైదీలను తీసికొని తిరిగివచ్చెను' ఇందువలన విజయనగరరాజులకు జయముకలిగినట్లే కానవచ్చుచున్నది; పరాజయముగలిగినట్లు లేదు. ఇఁక నీయుద్ధమును గుఱించియే ఫెరిస్తా వ్రాసినవ్రాఁతలఁ జూతము.

దేవరాయలు కారణము లేకయే బహమనీరాజులమీఁదికి దండువెడలి, తుంగభద్రానదిదాఁటి, ముద్గల్లు దుర్గమును స్వాధీనపఱుచుకొనెను. తాను కృష్ణానదియొద్దనవిడిసి రాయచూరు బంకాపురముల ముట్టడించుటకుఁ దన కొమారులను బంపెను. కొన్ని సైన్యములువెడలి సాగర్, బిజాపుర్, పట్టణములవఱకుఁ బోయి దేశమునంతను దోఁచుకొనెను. అందుమీఁద అల్లాఉద్దీన్ ఏఁబదివేల గుఱ్ఱములతోను, అఱువదివేల కాల్బలముతోను, కొన్ని ఫిరంగుల

తోను యుద్ధమునకు వెడలెను. అంత దేవరాయలు కృష్ణానది యొడ్డునుండి తొలఁగి ముద్గల్లు దుర్గమును ఆశ్రయించివిడిసెను; తురుష్కులను బాధ పెట్టుటకై కొందఱు సైనికులఁ బంపెను. సుల్తాన్ ముద్గల్లుకుఁ బంౘెండు మైళ్లదూరమునవిడిసి, దౌలతాబాదునుండి వచ్చిన సైన్యముల నిచ్చి మల్లిక్ అల్ తిజార్ అనువానిని దేవరాయల కుమారుని మీఁదికి, బిజాపురమునకు గవర్నరగు ఖాన్ జమ్మాన్ అనువానిని, వరాడ్ తెలింగాన్ సైన్యములకు నధిపతియగు ఖాన్ జుమ్మాన్ అనువానిని దేవరాయల ముఖ్య సైన్యముల మీఁదికిఁబంపెను. మల్లిక్ మొదట రాయచూరునకుఁ బోయి దేవరాయని పెద్దకుమారునితోఁబోరాడి యాతని నోడించెను. అంత నతఁడు బంకాపురము వైపునకుఁ బాఱిపోయెను. బంకాపురమును ముట్టడించియున్న యాతని తమ్ముఁడును ముట్టడిలేపి యన్నను గలిసికొనెను.

ముద్గల్లునొద్ద నున్న రాయల ముఖ్యసైన్యమునకును మసల్మాను సైన్యమునకును రెండునెలలలో మూఁడుయుద్ధములు జరిగెను. అందు మొదటియుద్ధములో హిందువులు విజయులై మసల్మానులను జెండాడిరి. మిగిలిన రెండుయుద్ధములలో సుల్తానునకే జయముకలిగెను. మూఁడవయుద్ధములో ఖాన్ జుమ్మానుని బల్లెముతగిలి దేవరాయని పెద్దకుమారుఁడు హతుఁడయ్యెను. అంత హిందువులందఱును మిగుల భీతిఁజెంది ముద్గల్లు దుర్గములోనికిఁ బోయిరి. మసల్మానుల ముఖ్యనాయకులిద్దఱు వారిని వెంబడింపఁబోయి హిందువులచేతఁ జిక్కిరి. అంత దేవరాయలిట్లు సుల్తానునకు వర్తమానమంపెను: 'మీరిఁకముందెన్నఁడును మా రాజ్యమునకు బాధకలుగఁజేయమని యొప్పినయెడల మీకప్పము మీఁకుఁ జెల్లించెదము; మాచేతఁ జిక్కినమీసరదారులను విడిచిపెట్టెదము.' అందుకు సుల్తానొప్పుకొన్నందున ఆషరతులననుసరించి సంధిజరిగెను. రాయలు కప్పమిచ్చెనఁట. దేవరాయలు రాజ్యముచేసినంతవఱకును మరలయుద్ధము జరుగలేదు.

# మల్లికార్జునరాయలు, విరూపాక్షరాయలు.

(౧౪౪౬ - ౧౪౬౫; ౧౪౬౫ - ౧౪౮౫).

దేవరాయలకు సింహాలదేవివలనఁ గల్గినవాఁడు మల్లికార్జునుఁడు. ఇతని ఇమ్మడి దేవరాయలనియుఁ జెప్పుదురు. ఇతఁడు యుద్ధములేమియు లేకుండ నిరువది సంవత్సరములవఱకు రాజ్యము చేసెను. తిమ్మనదండనాయకుఁడితని మంత్రిగానుండెను. ఈరాజు గోకర్ణ క్షేత్రమునందలి మతగురువులయెడల నాదరబుద్ధిగలవాఁడై వారికనేక దానములు చేసినట్లు గానవచ్చుచున్నది. ౧౪౬౪ లో నితనికి నొకపుత్రుఁడు గలిగెను. ఈపుత్రునిగతి యేమైనది మనకుఁ జరిత్రవలనఁ దెలియుటలేదు.

మల్లికార్జునరాయలతరువాత నాతనికుమారుఁడు రాజ్యమునకు రాలేదు; తమ్ముఁడగు విరూపాక్షుఁడు రాజయ్యెను. ఇతఁడు స్త్రీలంపటుఁడు; సురాపానమత్తుఁడు; ఎప్పుడును విషయాసక్తుఁడై యంతఃపురములోనేయుండి ప్రజలకెన్నఁడును కనఁబడువాఁడుకాఁడు. ఇట్లు ప్రజలకుఁగాని, తన దండనాయకులకుఁ గాని రాజదర్శనమగుట దుర్లభమయ్యెను. అందుచేఁ బ్రజలందఱు నసంతుష్టులైరి. ఇతఁడు తనమూర్ఖతచేఁ బెక్కుండ్రు దండనాయకులను జంపించెను. ఇట్లు సేనాధీశుల యవకృపకుఁ బాత్రుఁడయినందున ననేక దుర్గములను దురుష్కులకుఁ గోలుపోయెను.

పశ్చిమతీరమందున్న గోవాపట్టణములోనుండు తురుష్కులు అరబ్బీపారసీ దేశపు గుఱ్ఱములను దెచ్చి అటు బహమనీ సుల్తానులకును, ఇటు విజయనగర రాయలకును అమ్ముచుండిరి. కాని వారు బహమనీ సుల్తానుల ప్రోత్సాహముకతన గుఱ్ఱములన్నియు వారికే యమ్మి విజయనగరము వారికి నమ్ముట మానిరి. అందువలన రాయలుకోపించి, తన దండనాయకునిఁ బంపి గోవాపట్టణమందలి పదివేల తురుష్కులఁ జంపించెను. అంత బహమనీ సుల్తానుల మంత్రియగు ఖాజాఖాన్ గవాను వచ్చి మరల గోవాపట్టణమును స్వాధీనపఱుచుకొనెను.

## ప్రథమవంశావసానము.

విషయాసక్తుఁడగు విరూపాక్షరాయనిని ఆతని పెద్దకొమారుఁ డగు రాజశేఖరరాయలు చంపించెను. (౧౪౮౫) ఇతనిని ఈతనితమ్ముఁడగు రెండవ విరూపాక్షరాయలు చంపించెను. కాని యీభ్రాతృహంతకుని పరిపాలన ప్రజల కిష్టమైనదికాదు. అతని దండనాయకుఁడగు సాళువ నరసింహరాజు సర్వజనులు తనకు ననుకూలురు కాఁగా రాజును వెడలఁగొట్టి రాజ్యమును ఆక్రమించుకొనెను. అంత నీప్రథమవంశ మంతరించెను. (౧౪౮౬)

## సాళ్వ నరసింహరాజు.

### (౧౪౮౬ - ౧౪౯౦.)

ఈసాళ్వ నరసింహరా జెవరని మనము కనుఁగొనవలసియున్నది. ఈసాళ్వ వంశమువారు బుక్కరాయ వంశజులకు బంధువులుకానోపు. విజయనగరములోఁ బ్రథమవంశపురాజులు రాజ్యము చేయునపుడును ద్వితీయవంశజులు రాజ్యము చేయునపుడును ఈసాళ్వవంశజులు గొప్ప సరదారులుగానుండి రాజులకు యుద్ధములలోఁ గుడిభుజముగా నుండిరి. ద్వితీయహరిహరరాయల కాలములో సాళువగుండ రాజుమంత్రిగా నుండెను. ఇతఁడు సాళ్వ నరసింహ రాజుయొక్క తండ్రి. వీరివంశము వరాహపురాణమందు వర్ణింపఁబడియున్నది. గుండరాజు కొమారుఁడు మంగరాజు. ఇతఁడసామాన్య పరాక్రమవంతుఁడు; తురుష్కులను, ఇతరశత్రువులను అనేకపర్యాయము లోడించెను. విజయనగర రాజ్యమునకు ముఖ్యాధారముగనుండెను. ఇతనిని గుఱించి వరాహపురాణములో నిట్లు వ్రాయఁబడియున్నది:—

సీ. దురములో దక్షిణ-సురతాను నెదిరించి, కొనివచ్చి సాంపరా-యనికినిచ్చి
సాంమ్రాజ్యముననిల్పి-సాంపరాయస్థాప,నాచార్యబిరుదని - ఖ్యాతిఁగాంచె

శ్రీరంగవిభుఁ బ్రతి-ష్ఠించియర్వదివేల,మాడ లద్దవుసు-మ్మడికి నొసఁగె
మధురాసురత్రాణు-మడియించిపరపక్షి, సాళువబిరుదంబు-జగతి నెఱపె
గీ. గబ్బితనమునఁ దేజి మొ-గంబుగట్టి, తటిమి నగరంపుగవకులు-విఱుఁగఁ ద్రోలి
తానువ్రేసినగౌరును-ద్దవిడిఁ దెచ్చె, సాహసంబున నుప్పొంగు- సాళ్వమంగు.

ఇందు వర్ణింపఁబడిన సాంపరాయఁడు తెలుంగాధీశునితండ్రి. ఈ తెలుఁగు రాయనిసభకుఁబోయి శ్రీనాథుఁడు కస్తూరివేఁడెనని కథకలదు. ఈమంగరాజు పుత్రుఁడు గౌతరాజు; అతనిపుత్రుఁడు గుండరాజు. ఇతఁడు ద్వితీయ హరిహర రాయలయొద్ద మంత్రిగను, దండనాయకుఁడుగను నుండెను. అతనికొమారు లిద్దఱు తిమ్మరాజు, నరసింహరాజు. ఈనరసింహరాజే ప్రస్తుతకథానాయకుఁడు. ఇతనితండ్రియగు గుండమరాజు విజయనగర రాజునొద్ద దండనాయకుఁడుగా నుండి కొంతరాజ్యము సంపాదించెను. సాళువ నరసింహరాజు విజయనగర రాజ్యముయొక్క తూర్పుభాగమున కంతటికిని అధిపతిగానుండి, యనేక యుద్ధములలోఁ దనపరాక్రమముఁజూపి సర్వజనులచే నాయకుఁడుగాఁ బరిగ ణింపఁబడుచుండెను. విరూపాక్ష రాజశేఖర రాయలకాలములో నితఁడు ప్రబలెను. విరూపాక్షరాయల ప్రభుత్వకాలములో నుత్కల దేశాధీశుఁడగు పురుషోత్తము దేవగజపతి విజయనగరము మీఁదికి దండెత్తిరాఁగా, ఈనరసింహ రాజు వాని నోడించెను. ఇట్లీతనిబలము దినదినాభివృద్ధిఁ జెందుకాలములో విజయనగరరాజులు విషయలంపటులై, తమబలమును, గౌరవమును పోఁగొట్టు కొనుచుండిరి. కడపటిరాజగు విరూపాక్షరాయలయెడఁ బ్రజలందఱికిని ద్వేషముకలిగెను. శత్రువులను జయింపలేనట్టియుఁ బ్రజల రంజింపలేనట్టియు రాజును పదభ్రష్టునిఁ జేయుటయే మంచిదనితలఁచి, సాళువనరసింహరాజు రాజుయొక్క దుశ్చేష్టితములు ప్రజలకుఁదెలిపియు, దండనాయకుల కెల్లరకు బహుమతు లొసఁగియుఁ సంపదిని వశపఱుచుకొని, విషయానందములో నిమగ్నుఁడైయున్న రాజును పట్టుకొనుటకుఁ దనసేనానాయకుని ముందు

పంపెను. ఈ వార్త రాజునకుఁ దెలిసినను ఆవిషయాంధుఁడు దానిని నమ్మక వర్తమానము తెచ్చినవానినే చంపించెను. సాళువ నరసింహరాజుయొక్క సేనానివచ్చి, కోట నాక్రమించుకొని, తన్నెదిరించువా రెవ్వరును లేక లోనఁ బ్రవేశించెను. అప్పు డారాజు మేల్కొని తనకు సహాయము చేయువారెవ్వరును లేరనిచూచి, దిడ్డిత్రోవను బాఱిపోయెను. సాళువ నరసింహరాజు రాజ్యారూఢుఁడై విజయనగర సామ్రాజ్యమునకుఁ బ్రభువయ్యెను. ఈ రాజు పరాక్రమశాలి యగుటచే నంతకుఁ బూర్వమన్యరాజులచే నాక్రమింపఁబడిన దేశమంతయుఁ దిరిగి సంపాదించెను. కాని యంత్యకాలము సమీపించుటచే ఉదయగిరి, రాయచూర్, కొండవీడు అను మూఁడు దుర్గములను మాత్రము సాధింపలేకపోయెను. అందుచే నతఁడు మరణ సమయమున నీదుర్గములను మీరు తప్పక సాధింపవలయునని తనమంత్రికి నాజ్ఞాపించెను.

సాళువనరసింహరాజు కాలమునందు నుదయగిరి కటకరాజునకు స్వాధీనమయ్యెనని న్యూనిజ్ వ్రాసినమాట 'ఆంధ్రప్రబోధ చంద్రోదయము' వలన దృఢపడుచున్నది. ఈకావ్యము రచించినకవులు నందిమల్లయ ఘంటసింగయ. వీరు సాళ్వనరసింహరాజు కాలమువారు. కృతిపతి గంగయామాత్యుఁడు. ఇతఁడు వీరబసవరాజను రాజునొద్ద మంత్రిగానుండెను. ఈ బసవరాజు గజపతి సేనాధీశుఁడనియు నతఁ డుదయాద్రిని సాధించెననియుఁ బ్రబోధచంద్రోదయము యొక్క ప్రథమాశ్వాసములోని యీక్రింది పదియైదవ పద్యమువలనఁ దెలియుచున్నది:—

సీ. మాధవవర్మభూ-మండలేశ్వరవంశ
జలధికి నేరాజు-చందమామ।
యేరా జుదయశైల-మెలమిని భేదించెఁ
గపటాహితమదాంధ-కారమడఁగ।

గజపతిసురధాణి-గడిమర్గములకెల్ల
నేరాజు వజ్రంపు-బోరుతల్పు ।
మహిమచే నేరాజు-మతిపించె నల భగీ
రథపృథు శ్రీరామ-రఘురమణుల ।
గీ. నట్టిగుణశాలి తమ్మరా-యనికుమార
వీరబసవక్ష్మాచక్ర-విభునిచేత
మన్ననలుగాంచి మించిన-మహితుఁ డితఁడు
మనుజమాత్రుండె గంగయా-మాత్యమౌళి ॥

ఈగంగయ్యామంత్రి కశ్యపగోత్రుఁడు (౧వ ఆశ్వాసము ౬౯ పద్యము); పెసరువాయ యను శాఖాబ్రాహ్మణుఁడు (౨-౮౧.) ఈతనిని సంబోధించిన పద్యాదులను బట్టిచూడఁగా లింగధారి యని తోఁచుచున్నది.

ఈరాజు తనగుఱ్ఱపుసేనను మిగుల నభివృద్ధిపఱుచుటకై పారసీకదేశము నుండియు, అరబ్బీదేశము నుండియు నుత్తమాశ్వంబులఁ దెప్పించుచుండెను. బ్రతికినవైనను చచ్చినవైనను మూఁడుగుఱ్ఱములకు వేయిపరహాలచొప్పున వెల యిచ్చుచుండెను. తనకొఱకై తెచ్చిన గుఱ్ఱములలోఁ గొన్ని సముద్రముమీఁదఁ జచ్చినను, వానితోఁకలు తెచ్చినఁజాలును; రాజు వానివెలనిచ్చును. ఇట్లగుటచే ననేకప్రదేశవర్తకు లసంఖ్యములగు నుత్తమాశ్వములఁదెచ్చుచుండిరి. అందుచే నతని యశ్వసైన్యము శత్రుభయంకరమయ్యెను.

ఈరాజు పేరు నరసింగరాజగుటచేతను, ఈతనితరువాత రాజ్యమునకు వచ్చిన ముగ్గురురాజుల పేళ్లును నరసింగరాజులే యగుట చేతను పోర్చుగీసుమొద లయిన పరదేశీయు లీరాజ్యమును నరసింగరాజ్యమని వ్యవహరించుచువచ్చిరి.

ఈరాజు న్యాయప్రవర్తనముగలవాఁడై ప్రజలను పుత్రులవలె రక్షించుచు, విద్వాంసులను మిగుల గౌరవించుచు నుత్తమప్రభువని వన్నె కెక్కెను. ఈ

సాళువవారు తెలుఁగువారుగాఁ గానవచ్చుచున్నారు. ఎందుకనఁగా వీరికిఁ బూర్వపు రాజులు కన్నడపువారయినను ఈ వంశపువారు రాజ్యారూఢులయినప్పటినుండియుఁ దెలుఁగువారికి మంత్రిత్వ మొసఁగుటయుఁ దెలుఁగు కవులకు నాశ్రయ మిచ్చుటయుఁ దటస్థించెను. సాళువనరసింహరాజు నొద్ద నాదెళ్ల చిట్టిగంగనామాత్యుఁడను నియోగిబ్రాహ్మణుఁడు మంత్రిగానుండెను. ఈతనికాలమునఁ బిల్లల మఱ్ఱి పినవీరభద్రుఁడను విఖ్యాతకవి యీతని యాస్థానకవిగానుండి జైమిని భారత మనుగ్రంథమును రచించి యీతనికి నంకిత మిచ్చెను.

ఈ రాజు ౧౪౯౦ వ సంవత్సరములోనో, ఆ ప్రాంతముననో మరణమొందెను. మరణసమయము సమీపించినదని తెలిసికొని రాయలు తుళువ నరసరాయలను బిలిపించెను. ఈ నరసరాజు సాళువనరసరాజునకు అన్నమను మఁడు; ఈశ్వరరాజు పుత్రుఁడు, సేనాధిపతి. అతనిని బిలిపించి సాళువనరసరాజు తనయిద్దఱు కొమారులను ఆతనికప్పగించి, తనబొక్కసమును సైన్యమును ఆతని స్వాధీనముచేసి, తనకొమారులు పెద్దవాండ్రగునంతకుఁ దాను రాజ్యము నేలి వారియిరువురిలో నెవఁడు రాజ్యమున కర్హుఁడో వానికి రాజ్యమీయవలయునని చెప్పెను.

సాళువనరసరాజు మృతినొందిన తరువాత నాతని పెద్దకొమారుఁడగు నరసరాజును రాజ్యారూఢునిఁజేసి, వాఁడు చిన్నవాఁడగుటచేఁ దుళువవంశజుఁడగు నరసరాజు రాజ్యముచేయఁదొడఁగెను. ఈ బాలరాజు నెవఁడో చంపెను. అంత నాతనితమ్ముఁడు రాజయ్యెను. ఈబాలరాజును జంపించి నరసరాజు రాజ్యారూఢుఁడై, విజయనగరరాజ్యమును మహోన్నతదశకుఁ దెచ్చిన ద్వితీయరాజవంశమునకు మూలపురుషుఁడయ్యెను. ఈ కథాభాగమంతయు ద్వితీయవంశవర్ణనములో వర్ణింపఁబడును. అంతకుఁ బూర్వము ప్రథమవంశపురాజులు రాజ్యముచేయునప్పుడు ఈ దేశమునకు వచ్చి విజయ

నగరరాజ్యమును గుఱించి పరదేశీయులు వ్రాసియుంచిన యంశము లిచ్చట నుదహరించుచున్నాను.

## విజయనగర వైభవము.

"నికోలోకోంటియను ఇటాలీదేశస్థుఁడొకఁడు ౧౪౨౦ వ సంవత్సరమున నీ దేశమునకు వచ్చి విజయనగరమును జూచి ల్యాటిన్ భాషలో నీ నగర వైభవములను వర్ణించియున్నాఁడు. తొలుదొల్త నికోలోకోంటి హిందూదేశమును జేరఁగానే ఘూర్జర దేశమునకు రాజధానియగు కాంచియానగరమును దర్శించి యిరువదిదినముల యనంతరము బర్కూరు మొదలగు పట్టణములను జూచి మార్గ మధ్యముననుండు వింతలను వీక్షించుచు క్రమముగా రాయల రాజధానియగు విజయనగరమునకు వచ్చినవాఁడు. అతఁ డీనగరమును నిట్లు వర్ణించుచున్నాఁడు:

"విజయనగర మనుమహానగరము మిక్కిలి నిట్రముగానున్న పర్వతముల సమీపమునఁ గట్టఁబడినది. ఆనగరముయొక్క చుట్టుకొలఁత యిరువది మైళ్లుండెను. ఆనగరమున నాయుధములనుధరింప సమర్థులగువారు తొంబది వేల భటులున్నారు." ఇతఁడు పర్వతములని యుదహరించెనేకాని ప్రాళ్ల గుట్టలును కొండలునేగాని గొప్పపర్వతములులేవు. రక్షకపంక్తులయొక్క వైశాల్యమసమానమై యాశ్చర్యకరమై యున్నది. మిక్కిలి పొడవును మందమును గలప్రాతిగోడలు కనుమల కడ్డముగా కొండల కొనలవఱకుఁ గట్టఁబడినవి. వెలుపలిపంక్తులు చెక్కుచెదరకుండునట్లు పెక్కుమైళ్లవఱకు సమభూమిలో నిర్మింపఁబడినవి. కొండలమధ్యముననున్న పల్లపు ప్రదేశములలో జనులు నివసించు గృహములును మిద్దెలును మేడలును, నగరులును, ఉద్యానవనములు, ఫలవృక్షములు, పంటకాలువలు మొదలగునవి పెక్కులు కలవు. అచ్చటచ్చట ప్రసిద్ధములగు దేవళములును, గోపురంబులును గన్నులకుఁ బండువు సేయుచుండు

వట్లుగా నుండెను. అట్టి నగరులయొక్కయు, దేవాలయముల యొక్కయు, ద్వారముల యొక్కయు, శిథిలములైన భాగము లనేకములు నేఁటికిని గన్పించు చున్నవి. ఇచ్చట మాత్రమేకాక విజయనగరమున కుత్తరముగాఁ బ్రవహించు చున్న తుంగభద్రానది కావలనున్న ఆనగొంది పురములోని కట్టడములయొక్క శిథిలములైన భాగములుకూడ ననేకములు నేఁటికిని గన్పించుచున్నవి. రెండు పెద్దభాగములుగా నేర్పడిన యీ మహానగరముయొక్క వైశాల్యమును, జనబాహుళ్యము నత్యధికమై యుండినవి. పురమునకు దక్షిణమునకున్న రక్షకస్థానము మొదలుకొని యానగొంది పట్టణము యొక్క యుత్తరపు కొన నఱకుఁ గలదూరము పండ్రెండు మైళ్లుండెను. అటులే పడమరనుండి తూర్పు నకుఁ గల దూరము పది మైళ్లుండెను. ఆకాలమునందు త్రవ్వింపఁబడిన పంట కాలువలు నేఁటివఱకును శిథిలములుగాక బహుభూములను సారవంతములగు పంటలను బండించునవిగాఁ జేయుచున్నవి. ఆప్రదేశము లిపుడు పచ్చని పైరులతోను నానావిధములగు ఫలవృక్షములతోను నిండియున్నవి. కొండల పైభాగములందు శిథిలములైన దేవళముల యొక్కయు, గృహములయొ క్కయు, గోడలయొక్కయు, భాగములు గనిపించుచున్నయవి. ఒక కాల మునందు మిక్కిలి సొగసుందనమును ఔన్నత్యమును గనఁబఱచిన చిత్రం పుంబనులయొక్క శిథిలములైన భాగములు నేఁటికిని మధ్యభాగమునందుఁ గనిపించుచున్నయవి.

మఱియు నికోలోడెయికొంటి యను నాతఁడు "ఈప్రాంతములందు నివ సించు జనులు తమ యిష్టము ననుసరించి బహు భార్యలఁ బరిగ్రహింపు చుందురు. వారలు జీవయాత్ర ముగించిన భర్తల శవములతోఁ గూడ దహింపఁ బడుచుందురు. వారి ప్రభువు హిందూదేశములోని ప్రభువులకన్న మిక్కిలి శక్తి గలవాఁడు. అతనికిఁ బండ్రెండువేలభార్యలు గలరు. అందు నాల్గువేలు రాజెచ టికిఁ బోవునోయచ్చటికిఁ గాలినడక నడచివచ్చెదరు. మఱినాలుగువేల స్త్రీలు

సుందరాలంకారభూషితలై యశ్వారూఢలై వెంటనంటి వచ్చెదరు. రెండు మూఁడువేల భార్యలాతఁడు చనిపోయినపుడు శవముతోఁ గూడ నగ్నిప్రవేశము చేయ నిశ్చయించుకొన్న వారైయుండిరి. సంవత్సరములో నొకానొక కాలమునందు తమయిలువేల్పుగాఁ బూజించెడు విగ్రహమును రెండురథముల మధ్య నుంచి నగరవీథులం దూరేగింతురు. చిన్నపడుచులు సుందరవస్త్రాలంకార భూషితలై దేవుని గుఱించి పాటలు పాడుచు వెంబడించివచ్చెదరు. అనేకులు భక్త్యావేశపరవశులై స్వామివారిరథచక్రముల క్రిందఁబడి మరణము నొందిన భగవంతుఁడు ముక్తిని గరుణించు ననునమ్మకముతో నాప్రకారము చేసి ప్రాణములను గోలుపోవుచుందురు. మఱికొందఱు ప్రజలురిపెట్టుకొని రథమునకుఁ గట్టుకొని బాధనొందుచు బ్రాణములను విడిచెదరు. సంవత్సరమునకు మూఁడు గొప్పపండుగలను గావించెదరు. అందొకపండుగ దినములలో స్త్రీపురుషాదు లాబాలవృద్ధులు నదులలోను సముద్రములలోను స్నానము లాచరించి నూతన వస్త్రముల ధరియించి శుచివ్రతులై భజనలు, నృత్యములు, విందులు సల్పుచు త్రిరాత్రములు నడపుదురు. మఱొకపండుగనాఁడు దేవాలయముల లోపలను వెలుపలను దీపారాధనలను జేయుచుందురు. మూఁడవపండుగ నవరాత్రములు జరుపఁబడును. ఆదినములలో వీథులయందు దూలములను బాఁతించి వానికొనలకు వివిధములగు రంగులగుడ్డలను జరీగుడ్డలను గట్టుదురు. మఱియు నొక్కొక్క దినమున సమస్త భూతములను సమదృష్టితోఁ జూచు నొక్కొక్క భక్తిపరుని నాదూలముల చివరనుంచి నానావిధములైన పండ్లతోఁ గొట్టుచుందురు. వారలంతయు నోపికతో నోర్చుకొని యుందురు. ఈ మూఁడుపండుగలును గాక మఱియొకపండుగ త్రిరాత్రములు జరుపఁబడును. ఆదినములలో వసంత మనుపేరితోఁ బసుపునీళ్లను రాజమార్గమున నడచువారలపైఁ జల్లుచుందురు. రాజులపైనిని రాణులపైనిని గూడఁ జల్లుచుందురు. ప్రజలీయది చూచి కేరింతములు గొట్టుచుందురు.'' అని వ్రాసి

యున్నాఁడు. ఈ నికోలోకోంటి విదేశీయుఁడగుటవలన రాణులయొక్క పరిచారకులను గూడ రాజుభార్యలని యూహించి పొరపడి పండ్రెండువేల భార్య లుండిరని వ్రాసియుండవచ్చును. అతఁడు దెలిపిన పండుగలు నాలుగును వరుసగా సంవత్సరాదిపండుగనియు, దీపావళిపండుగనియు, మూఁడవది మహానవమి పండుగనియు, నాలుగవది కామునిపండుగనియు మనము సులభముగాఁ దెలిసి కొనవచ్చును. విజయనగరము వజ్రములకు ప్రసిద్ధి కెక్కియుండెనని యాతఁడు దెలిపియున్నాఁడు.

తరువాత ౧౪౪౩ వ సంవత్సరమున "అబ్దుల్ రజాక్" అనునతఁడు విజయనగరమును జూడవచ్చి యానగరమును వర్ణించియున్నాఁడు. ఇతఁడు పారసీకదేశరాజునొద్దనుండి కల్లికోటరాజగు జామొరిన్ కడకు రాయబారిగా వచ్చెను. ఇచటనుండి దేవరాయలచేఁ బిలిపింపఁబడినట్లుగాఁ దెలుపుచున్నాఁడు. ఇతఁడు మంగళూరు, బెద్నూరు మొదలగు పట్టణములగుండ ప్రయాణముచేసి విజయనగరమునకు వచ్చినవాఁడు గావున దారిపొడుగునను తాఁజూచిన దేశములయొక్కయు, ప్రజలయొక్కయు, వర్ణనలనుజేసి విజయనగరమును గుఱించి యిట్లువ్రాసియున్నాఁడు.

"౧౪౪౩ వ సంవత్సరము, ఏప్రియలు నెలచివరకు విజయనగరము ప్రవేశించితిమి. మమ్ముఁదోడ్కొనిపోవుటకై మాకెదురుగాఁ బరివారజనమును బుత్తెంచి మేము బసచేయుటకై మాకొకసుందరమైన గృహము రాయ లిప్పించెను. అతనిరాష్ట్రము కృష్ణానది మొదలుకొని కన్యాకుమారివఱకు వ్యాపించియుండెను. ఆనగరమున వికృతాకారములుగలిగి పర్వతములనుబోలిన వేయియేనుఁగులుగలవు. పదునొకొండులక్షలసైన్యము గలదు. హిందూస్థానమునందాకాలమున నిరంకుశాధికారము గలమఱియొకరాయలు గానరాఁడు. విజయనగరమువంటి మహానగరమునెన్నఁడును మేముగన్నులతోఁ జూచియుండలేదు. ఆ నగరమును బోలిన మఱియొక నగరము ప్రపంచమున నెచ్చోటనైననున్నట్టు

వినియుండలేదు. సప్తప్రాకారముల చేతఁ జుట్టఁబడిన యేడుదుర్గములచే సుర క్షితమై యీనగర మొప్పుచున్నయది. మొదటిదుర్గము చుట్టును నిలువెఁడెత్తు గలరాళ్లు గుట్టములుగాని భటులుగాని నడచుటకు వీలులేనియట్లు భూమిలో సగమువఱకు పాదుకొని యున్నవి. ఉత్తరముగానున్న యేడవదుర్గమే రాజు నివసించు నంతఃపురమందిరముగా నున్నయది. మొదటిదుర్గముయొక్క దక్షిణపు కొన మొదలుకొని యుత్తరపుకొనవఱకు మూర మెనిమిది మైళ్లుగానుండెను. మొదటిదుర్గము మొదలుకొని మూఁడవదుర్గమువఱకుఁ గల ప్రదేశమంతయు సాగుబడి చేయఁబడిన పొలములతోను గృహములతోను ఉద్యానవనములతోను ఫలవృక్షములతోను నిండియుండెను. మూఁడవదుర్గము మొదలుకొని యేడవ దుర్గమువఱకుఁ గల ప్రదేశమంతయు నసంఖ్యాకములగు జనసంఘములచేత నిండి బజారులతోనొప్పుచుండెను. రాజమందిరమునకు సమీపముగా నాలుగు బజారు లొకదారి కొకటెదురుగా బారులు దీర్చియుండినవి. ఉత్తరమున రాయలుమందిరముయొక్క ద్వారమండపముకలదు.

"ప్రతిబజారునకుపైని సొగసైన తాళ్వారముతోఁ గూడిన యున్నతము లైన కమానులు నిర్మింపఁబడినవి. అన్నిటికంటె రాయలాస్థానమంటపము మిక్కిలి యెత్తుగానున్నది. బజారులు విశాలములును పొడువులును గలిగి రమణీయములై యుండినవి. గులాబిపూవు లంతటఁ నమ్మఁబడుచున్నవి. ఆ ప్రజలు గులాబిపూలను నాహారముకంటె నావశ్యకము లయినవిగా భావించు చుండిరి. ముత్యములు, కెంపులు, నీలములు, వజ్రములు మొదలగునవి బహిరంగ ముగా బజారులలో విక్రయింపఁబడుచున్నవి. ఈప్రదేశములందును రాజాంతఃపుర ప్రదేశములందును నున్నగా పాలగచ్చు చేయఁబడిన రాతిగొట్టములగుండ కాలువలు పెక్కులు జలపూర్ణములై ప్రవహించుచున్నవి. రాయల సౌధద్వార మండపమున కెడమభాగమున రాచనగరునకెనున్న దివానుఖానా యను మందిరముగలదు. దానికెదురుగా నొక్క సభామండపముగలదు. సభామండప

మునకు చివర చోపుదారులు నిలువంబడియుందురు. ఆసభామండపము మధ్యమున దివానుగూరుచుండు పీఠముగలదు. అచట దివాను లేక దండనాయకుఁడు ప్రజల విజ్ఞాపనములను విమర్శించుచుండును. ఆతనితీర్పునకు పైతీర్పులేదు. పని ముగించినతరువాత దండనాయకుఁడు సప్తద్వారములను దాఁటి యంతఃపురముసొచ్చి సమస్తమును రాజునకు నివేదించును. రాజమందిరమునకు వెనుక దండనాయకునిగృహము కలదు. ఆ మందిరమున కెడమపార్శ్వమున నాణెములముద్రించు టంకసాలగలదు. దివానుఖానాకు నెదురుగా యేనుఁగులుండు కట్టడముగలదు. ఏనుఁగున కొక్కొక్కగది చొప్పున నేర్పాటు చేయఁబడెను. నాణెములుముద్రించు టంకసాల కెదురుగా నగరపాలకుని గృహముకలదు. అతనిక్రిందఁ బండ్రెడువేల భటులుండిరి. టంకసాలకు వెనుక ప్రక్క పదునైదుగజములవెడల్పును రెండువందలగజముల పొడవునుగల యొక చిన్నబజారు కలదు. బజారుల కిరుపార్శ్వములయందు నిండ్లును ముఖమండపములును గట్టఁబడియున్నవి. వాని కెదుట సొగసైనరాళ్లచేఁ గట్టఁబడిన యున్నతాసనములుగలవు. ఆయా గదులయొక్క గోడలమీద సింహములు, పెద్దపులులు, చిఱుతపులులు మొదలగు క్రూరమృగములయొక్క యాకారములు చిత్రింపఁబడినవి. అక్కడి యున్నతాసనములు రత్నాభరణాలంకృతులగు వేశ్యాంగనామణులచే నధిష్ఠింపఁబడి యుండినవి. ఒకనాఁడు నన్నుఁ జూచుటకై రాయల యంతఃపురమునుండి పంపఁబడిన కొందఱుదూతలు వచ్చి యాదినముననే నన్ను రాయల యాస్థానమునకుఁ గొనిపోయిరి. రాజకుమారుఁడు (ప్రౌఢదేవరాయలు) సభామండపమున రాజకార్యధురంధరులగు మంత్రిశిఖామణులు మొదలుగాఁగలవారు తన్నుబలసి కొలువ సింహాసనాధిష్ఠితుండైయుండెను. వాని కిరుపార్శ్వముల జనసంఘము వృత్తాకారముగా నిలువంబడియుండెను. రాయలు పట్టుపీతాంబరమును ధరించియుండెను. సొగసగునీటిచేఁ జేయఁబడిన ముత్యాలపతకమును నమూల్యములగు రత్నా

భరణములను ధరించియుండెను. పలుచనైనట్టియు పొడవైనట్టియు దేహము గలిగి నలుపును దెలుపునుగాక చామనచాయంబోలు రూపమును గలిగియుండెను. చెక్కులు మెత్తనివై పలుచగనున్నవి.

"అతనికి గడ్డమున వెంట్రుకలులేవు. చూపు మనోహరముగానుండెను. అతనికి నేడునూఱుండలభార్యలును ఉంపుడుఁగత్తెలును గలరని తెలియవచ్చినది. మహానవమి పండుగనాఁడు రాయలు (ప్రౌఢదేవరాయలు) తనరాష్ట్రములోనుండి తనకుఁ గప్పము గట్టుచున్న సేనాధిపతులను ప్రభువులను దన యాస్థానమునకు రప్పించి దర్బారు తీర్చెను. వారలు మిగుల రమణీయములగు హౌదాలతో నలంకరింపఁబడిన యేనుఁగులను వేయింటిని తమతోఁగూడఁ దెచ్చిరి.

"ఆనాఁడు నగరమంతయు శృంగారముగా నలంకరింపఁబడెను. ఏనుఁగు లొకచోటునకుఁజేరి సముద్రతరంగములంబోలి కనుపట్టుచుండెను. అచటచట నాలుగైదంతరువులుగల పందిరులు నిర్మింపఁబడినవి. ఈ పందిరులు గిఱ్ఱుమని చుట్టుఁదిరుగుటకు ననుకూలము లగునట్లుగా నిర్మింపఁబడినవి. ఈమైదానమున కెదుట తొమ్మిదిపందిరులతోఁ గూడిన రాజభవనమొకటి నిర్మింపఁబడినది. తొమ్మిదవయంతరువులోని పందిరిలో రాయలకు సింహాసన మమర్పఁబడినది. అంతఃపురమునకును పందిళ్లకును మధ్య నాటకులును పాటకులును కథకులును నుండిరి. రాజున కెదుటనున్న తెర కావలఁబడుచులు సుందరవస్త్రాలంకారభూషితలై నృత్యములు సలుపుచుండిరి! గారడివాండ్రు మిక్కిలి యానంద ముప్పొంగునట్లుగా నేనుఁగులచే నాటలాడించు చుండిరి. మూఁడుదినము లీవిధముగా నాటలతోను, పాటలతోను, వినోదములతోను గడపఁబడినవి. మూఁడవనాఁడు నాకు నరలరాజుదర్శనము లభించెను. మిక్కిలి వైశాల్యముగల సింహాసనము సువర్ణముతోఁ జేయఁబడి యమూల్యములగు మణులచేఁ దొడుగఁబడియున్నది. సింహాసనమునకెదుటఁ జదరముగానున్న మెత్తయొకటి గలదు.

దాని కొనలయందు మూఁడువరుసల ముత్యములతోఁ గుట్టఁబడియుండెను. రాజామూఁడుదినము లామెత్తపైఁ గూరుచుండియుండెను. ఆమందిరము యొక్క గోడలును పైకప్పును మణులచేఁ బొదుగఁబడిన బంగారు పలకలచేఁ గూర్పఁబడియున్నవి. అవియును బంగారపు మేకులతో బిగింపఁబడి యున్నవి.'' ఈరీతిగా విదేశీయులచే వర్ణింపఁబడిన విజయనగరము పదు నాఱవ పదునేడవ శతాబ్దములయందు మిక్కిలి యౌన్నత్యమును బొంది యుండెనని చెప్పుటకు లేశమాత్రము సంశయింపవచ్చునా? *

## తుళువవంశము.

సాళువ నరసింహరాజుయొక్క ద్వితీయ కుమారునిఁ జంపి రాజ్యా ర్హుఁడై విజయనగరమునునేలిన ద్వితీయరాజవంశమునకు మూలపురుషుఁడైన నరసరాజు తుళువవంశజుఁడు. ఈ తుళువవంశము సాళువవంశాంతర్గతము. సాళువ నరసింగరాజుతండ్రి గుండరాజు. అతని కిద్దఱుకొమారులు. మొదటి వాఁడు తిమ్మరాజు; రెండవవాఁడు సాళువనరసరాజు. తిమ్మరాజునకు నీశ్వర రాజును నా యీశ్వరరాజునకు నీతుళువ నరసరాజును ఫుట్టిరి. కావున తుళువ నరసరాజు సాళువ నరసరాజునకు అన్నమనుమఁడు.

ఈ తుళువవంశపువారు తాము చంద్రవంశపు క్షత్రియులమని చెప్పకొను చుండిరి. వీరు శూరాగ్రేసరులు. నరసరాజును అతని తండ్రియైన యీశ్వర రాజును విజయనగరరాజులనొద్ద విఖ్యాతసేనాధిపులుగా నుండి, శూరులని ప్రఖ్యాతిఁబడసి, దేశము లనేకములు జయించిరి. ఈశ్వరరాజును గుఱించి వరాహపురాణములో నిట్లు వ్రాయఁబడియున్నది.

సీ. ఉదయాద్రి భేదించె - హుత్తరి నిర్జించె
గండికోటపురంబుఁ - గదలఁద్రవ్వెఁ ।

* 'జీర్ణకర్ణాట చరిత్రము.'

పెనుగొండ సాధించె - బెగ్గలూరు హరించె
గోవెలనెల్లూరు - గుంటుపతిచేc ।
గుండాణి విదలించె - గొడుగుచింత జయించె
బాగూరుపంచము - పాడుచేసి ।
వరుగొండ వికలించె - నామూరు మర్దించె
శ్రీరంగపురమును - బారిసమరె ।
గీ. రాయచౌహత్తమల్లధ - రావరాహ ।
మోహనమురారిబర్బరి - బాహుసాళ్వ ।
నారసింహప్రతాప సన్నహనుc డగుచు ।
విశ్వహితకారి తిమ్మయ - యీశ్వరుండు ॥

## నరసరాజు.

ఈశ్వరరాజుకుమారుcడు నరసరాజు. ఇతcడు తండ్రికంటెc బరాక్రమ వంతుcడు. సాళ్వ నరసరాజునొద్ద నితcడు సేనాధీశుcడుగను, ముఖ్యమంత్రి గను నుండెను. అందువలననే యీతనికార్యఖడ్గచాతురి యసామాన్యమైనది యని మన మెఱుంగవచ్చును. సాళ్వనరసింహరాజు మరణసమయమున నితనిc బిల్చి తన యిద్దఱుకొమారులను, రాజ్యమును నితనికి స్వాధీనపఱిచెను. మొదట నరసరాజు స్వామిభక్తిపరాయణుcడై యజమానునిc బెద్దకొమారుని రాజ్యా రూఢునిcజేసి వాcడు చిన్నవాcడగుటచే దాను రాజ్యముచేయcదొడcగెను. కాని యాబాలరాజును నెవ్వcడో దుష్టుcడుచంపి, యానెపమును నరస రాజుపై మోcపెను. కాని నరసరాజా నెపమును బాపుకొనుటకై సాళువ నరసరాజుయొక్క రెండవకొమారునిని రాజుచేసెను. కాని యాబాలరాజు తనయన్నను జంపినద్రోహిని గౌరవించుచుండినందున నాతనిని నరసరాజు పెనుగొండదుర్గములోc జెఱపెట్టించి యాతనిమనోవర్తికిc గట్టుపాటేర్పఱి

చెను. కాని యాబాలరాజు స్వల్పకాలములోనే కానరాకుండఁబోయెను. నరసరాజే యొకయుక్తిపన్ని తనమీఁదికి రాకుండ బాలరాజును జంపించెనని నదంతికలదు. పిదప నరసరాజే రాజ్యారూఢుఁడయ్యెను.

నరసరాజు బహుశూరుఁడును లోకప్రియుఁడును అగుటవలన రాజ్యములోని సరదారులెల్లరు నతనిని ఎదిరింపక యాతనికి లోఁబడిరి. ఇతఁడు స్వపరాక్రమముచే దేశము లనేకములు జయించెను. ఈతఁడు విజయనగరరాజ్యమాక్రమించినసంగతియు, నీతని యితర దిగ్విజయములును, పారిజాతాపహరణములోని యీ క్రిందిపద్యములో వర్ణింపఁబడినవి:—

సీ. కుంతలేశ్వరుఁడు చిక్కుపడంగ విద్యాపు
రంబుగైకొని నిజ - ప్రౌఢిమెఱపెఁ।
బారసీకునకు దు-ర్భరమానవత్వంబుఁ
దొలఁగించె మానవ - దుర్గసీమఁ।
జోళవల్లభునకు - సురనమ్మునుధురాధ
రములిచ్చి మధురాపు - రంబుగొనియె।
శ్రీరంగపట్టణ - సీమ ఖడ్గనటీవి
నోదంబు హాసనేం - ద్రునకుఁ జూపె।

గీ. నతఁడు నుతికెక్కు రామనే-త్వంతరాళ।
కలితషోడశదానవి-ఖ్యాతయశుఁడు।
మండలీకరమేఘమా - ర్తాండబిరుదుఁ।
డీశ్వరాధిప నరసప్ప-క్ష్మాశ్వరుండు॥

ఈనరసరాజు దండయాత్రలవలన విఖ్యాతిఁ జెందుటయేగాక, యాంధ్రకవీశ్వరుల నాదరించి కృతులనందుకొని యజరామరుఁ డయ్యెను. ఇతని యాస్థానమునందు నందిమల్లయ్య, ఘంటసింగయ్య అనుకవు లిద్దఱుండిరి. ప్రస్తు

తపు 'తిరుపతి వెంకటేశ్వర' కవులవలె వీరిద్దఱును గలిసి కావ్యరచన చేయు చుండిరి. నందిమల్లయ్యకు ఘంటసింగయ్య మేనల్లుడు. వీరాఱువేల నియోగులు. సింగయ్యకు మలయమారుతకవి యని బిరుదునామముండెను. వీరిరువురునుగలిసి వరాహపురాణము, ప్రబోధచంద్రోదయము, అను తెలుఁగుకబ్బములు వ్రాసిరి. అందు వరాహపురాణము నరసరాజునకుఁ గృతి యీయఁబడినది. ప్రబోధచంద్రోదయమునకు గంగయ్య మంత్రియనువాఁడు నాయకుఁడు చేయఁబడెను. ఇందలి ఘంటసింగయ్య యనుకవికిఁ బారిజాతాపహరణకావ్యము వ్రాసిన నందితిమ్మన్న మేనల్లుఁడు.

నరసరాజునకు ముగ్గురుభార్యలు; తిప్పాజీ, నాగలాంబిక, ఓబాంబిక. తిప్పాజీవలన వీరనృసింహరాయఁడు, నాగలాంబికవలనఁ గృష్ణరాయఁడు, ఓబాంబికవలన అచ్యుతరాయఁడు పుట్టిరి. నరసరాజునకు రంగరాజని మఱియొక పుత్రుఁడున్నట్లు శాసనాదులవలనఁ దెలియుచున్నది. నరసరాజు పోయినతరువాత నాతని పెద్దకొమారుఁడగు వీరనరసింహరాయలు రాజ్యమునకు వచ్చి కొలఁదికాలములోనే మరణమునొందెను (౧౫౦౯). అతని కొమారుని జెఱలోనుంచి యాతని తమ్ముఁడగు కృష్ణరాయలు రాజయ్యెను. ఫెరిస్తాచే వ్రాయఁబడినచరిత్ర యెంతవఱకు నమ్మఁదగినదో చూడఁగోరువారు సాళువనరసింహ, తుళువనరసింహ, వీరనరసింహరాయలనుగుఱించి యాతఁడు వ్రాసియుంచిన యంశములనుజూచినఁ జాలును. ఆతఁడు ఈముగ్గురును ఒక పురుషుఁడనియే భావించుటయేకాక కృష్ణరాయని మంత్రియగు తిమ్మరుసును గూడ నీముగ్గురిలో నొక్కనిగా భావించెను!*

---

* 'Firistah seems to have confused Narsa's and Krishna Deva Raya's powerful minister, Saluva, Timma with Narasimha and Narsa, and made all three one person'.—Sewell's Forgotten Empire, p. 113.

# విద్యానగరము.



ఆనెగొందివైపు దుర్గద్వారము.



ఉగ్రనరసింహ విగ్రహము.



హంపిదేవాలయము.

## కృష్ణదేవరాయలు.

(౧౫౦౯ - ౧౫౩౦.)

ఇతఁడు విజయనగరరాజులలో సర్వశ్రేష్ఠుఁడని చెప్పుట యొకవింత కాదు. దక్షిణహిందూదేశములో నింతటివైభవపరాక్రమశాలియగు చక్రవర్తి మఱియొక్కఁడు పుట్టలేదనుటకు సందేహములేదు. విజయనగరసైన్యము లీతని ప్రభుత్వకాలమందు నపజయమన్నమాట యెఱుఁగక మహాబలాఢ్యులగు యవనాదివీరులనెల్లఁ జెండాడి విజయలక్ష్మిచే వరింపఁబడుచుండెను. ఈతనికాలములో విజయనగరవిభవమార్తాండుఁ డాకాశమధ్యంబుననుండి ప్రచండంబుగ వెలుఁగుచుండెను. కావుననే యీతఁడు దాక్షిణాత్యులకు దేవసమానుఁడు; ప్రాతస్స్మరణీయుఁడు. ఇతనిచరిత్ర యవశ్యముగాఁ దెలిసికొనఁదగినది.

### జననము.

కృష్ణరాయలు ౧౪౬౫లో జన్మించెనని యొకరును, ౧౪౮౭లో జన్మించెనని యొకరును వ్రాసియున్నారు. కాని యీ మహారాజు జన్మించిన మితియే యని నిశ్చయముగాఁ జెప్పుట కేమియు నాధారములేదు. ఇతఁడు ఈశ్వరరాజకుమారుఁడైన నరసరాజునకు నాగాంబికవలనఁ గలిగినపుత్రుఁడు. ఈ నాగాంబిక భార్యగాదనియు భోగకాంతయనియు నొకవాడుకకలదు. కాని యీవార్త నిజమనిచెప్పుటకు గ్రంథాదులలో నేమియుఁ బ్రమాణములు లేవు; కులకాంతయనియే వ్రాయఁబడియున్నది. కావున మన మదియే నమ్మవల యును. ఘనతచెందిన పురుషులనుగుఱించి వారిశత్రువులు మఱేమియుఁజేయ లేక యిట్టి యుపవాదములఁ బుట్టించుచుందురు. అవియే పరంపరగా వచ్చుచుండును. గ్రీకువారిని నీదేశమునుండి వెడలఁగొట్టి యీదేశమున ప్రస్తుతప్రభుత్వముకంటె నెక్కుడు సామ్రాజ్యమును స్థాపించిన మౌర్యచంద్రగుప్తుని గుఱించియు, ఢిల్లీబాదుషాను తనచేతిలో నుంచుకొనిన మహారాష్ట్రవీరుఁడని

ఖ్యాతిచెందిన మహాదజీశిందేను గుఱించియు, నిట్టియపవాదమేకలదు. కావున వీనిని నమ్మఁదగదు. ఒకవేళ నీ వార్తయే నిజమైనను, నిజసద్గుణపుంజములచే వెలుఁగుచున్న యీ మహనీయుల కందఱకు నేమియు లోపము రాఁజాలదు. వారి తల్లులు కులకాంతలు గాకపోయినను వారుమాత్రము మనకు వంద్యులే, సంస్మరణీయులే.

## కర్ణాటకుఁడా? తెలుఁగువాఁడా?

తుళువవంశజుఁడగుటచేఁ గృష్ణరాయలు 'తులు' అనఁబడు దేశములోని కర్ణాటకుఁడని కొందఱి యభిప్రాయము. కాని యీతని తండ్రికిఁ బినతాత యగు సాళువనరసింహరాజు ఆంధ్రజైమిని భారతమును గృతినందెను. ఈతని తండ్రియగు నరసింగరాజు తెలుఁగు వరాహపురాణమునకుఁ గృతికర్త యయ్యెను. ఈతఁడు మనుచరిత్ర పారిజాతాపహరణ మనుకావ్యములకు భర్త యయ్యె; ఈతని యల్లుఁడగు రామరాజాంధ్రకవులను మన్నించెను. ఇంకొక యల్లుఁడగు తిరుమలరాయఁడు వసుచరిత్రకు భర్తయయ్యెను; రాయలబంధువులును మధుర తంజావూరు మొదలైనస్థలముల పాలకులును అగు నాయకులును తెనుఁగునందు నభిమానముగలిగి యభివృద్ధిచేసిరి; కృష్ణరాయఁడు స్వయముగా నాముక్తమాల్యద యనెడి యాంధ్రకావ్యమును రచించుటయేగాక యందు 'దేశ భాషలందుఁ దెనుఁగులెస్స' యని తెలుఁగును బొగడియున్నాఁడు. ఇట్లు వంశపరంపరగాఁ దెనుఁగునందు, నభిమానముంచి తెలుఁగు కవులను తెలుఁగు బాసను పోషించిన వంశము తెలుఁగుదిగాక కన్నడ మెట్లగును?

## రాజ్యాభిషేకము.

(౧౫౦౯).

కృష్ణరాయలకుఁ దిప్పాంబికయను సవతితల్లియు, నామె కొమారుఁడగు వీరనరసింహరాయఁడను సవతియన్నయుఁగలరు. నరసరాజునకు వీరనరసిం

హుని మీఁదికంటెఁ గృష్ణరాయనిమీఁదనే యెక్కుడు ప్రేమయుండెను. అందుచే సనతితల్లి కృష్ణరాయనిఁ జంపింపయత్నించెననియు, మంత్రితిమ్మరు సాతనిఁగాచెననియుఁ జెప్పెదరు. వీరనరసింహరాయని కంత్యకాలము సమీపించినప్పు డాతనికిఁ దిమ్మరాజను నెనిమిదేండ్లకొమారుఁ డుండెను. తాను పోయిన తరువాతఁ దన పుత్రునకు రాజ్యమీయక కృష్ణరాయలు తానాక్రమించుకొనునని తలఁచి, తన మంత్రియగు తిమ్మరుసును బిలిపించి, కృష్ణరాయని కనులు తీసి తనకుఁదెచ్చి చూపుమని యాజ్ఞాపించెనఁట. కాని యా మంత్రి పుంగవుఁడు కృష్ణరాయని డాఁచియుంచి మేఁకకనులు రాజునకుఁ జూపెనఁట. వీరనరసింహరాయలు మరణమునొందిన తరువాతఁ గృష్ణరాయఁడు తన తమ్ముఁడగు అచ్యుతరంగరాయలను, అన్నకొమారుఁడగు తిమ్మరాజును చంద్రగిరి దుర్గముమీఁది కంపి, తాను పట్టాభిషిక్తుఁడయ్యెను.

శా. శ. ౧౪౩౦ కి సరియైన శుక్లనామసంవత్సర మాఘశుద్ధ చతుర్దశియగు ౪ వ ఫిబ్రవరీ ౧౫౦౯-వ దినమునఁ గృష్ణరాయఁడు పట్టాభిషిక్తుఁడైనట్లు హంపీలోని పంపావతి దేవాలయములోనున్న యొక శాసనమువలనఁ దేలుచున్నది. * కావున నీదిన మాంధ్రకర్ణాటకుల కందఱికిని శుభదినంబని యెన్నఁదగియున్నది. ఈచక్రవర్తి పట్టాభిషిక్తుఁ డైనప్పు డీతనియొద్దనున్న కొండఱు సరదారులపేళ్లు కుమారధూర్జటి తన కృష్ణరాజవిజయములో నిట్లు వ్రాసియున్నాఁడు:-

సీ. చక్కఁరవిలుకాని - చక్కఁదనముగల్గి
చొక్కమానార్యుఁటి - బుక్కరాజు।
సాకల్యముగఁ గీర్తి - సర్వది క్తటులందుఁ
బ్రాకటస్థితిమించు - నాకువారు।

* Epig. Ind., i., 366.

కంటకరాజన్య - గర్వంబు లడఁగించి
లీలచేమించు నం-ద్యాలవారు।
ఘాటీనిరాఘాట - ఘోటీహతవిరోధి
కోటులై వెలయు వె-ల్గోటివారు।
గీ. చండతరశౌర్యు లగుపెమ్మ-సానివారు।
బొదవాళివారు మొదలైన - భూమిపతులు।
గొలుచఁ బట్టాభిషిక్తుఁడై - చెలువుమీఱె।
రమ్యగుణశాలి శ్రీకృష్ణ - రాయమౌళి॥

మనవాంధ్రుడు చరిత్రలు వ్రాయనందునఁ బైఁజేర్కొనఁబడిన యార్వీటివారు, నంద్యాలవారు మొదలగు శూరాగ్రేసరులనుగుఱించి మనకు నధికముగా నేమియుఁదెలియదు. కాని వీరప్పటికాలపు అడ్మిరల్ టోగో, జనరల్ జీయమాలని చెప్పుటకు సంశయములేదు. కావున వీరు కర్ణాటాంధ్రులకుఁ బూజ్యులు. వీరి సహాయమువలననే కృష్ణరాయ లెడతెగనిగెలుపులఁ గాంచెను.

## మంత్రి తిమ్మరుసు.

ఇఁకఁ గృష్ణరాయని దిగ్విజయముల వర్ణింపవలయును. కాని యంతకుఁ బూర్వ మాదిగ్విజయములకుఁ గారకుఁడును రాయలకుఁ గుడిభుజమును, పితృతుల్యుఁడును అగు మంత్రిపుంగవునిగుఱించి కొంచెము వ్రాయవలసియున్నది. తెలుఁగుదేశమున నితనికీర్తి యింతవఱకును వెలుఁగుచున్నది. ఇతని బుద్ధివైభవముఁజూపు కథలనేకము తెలుఁగువారు చెప్పుకొనియెదరు. ఇతఁడు క్షత్రియుఁడా లేక బ్రాహ్మణుఁడాయని తెలియక యింగ్లీషుచరిత్రకారులు కొందఱు త్రొక్కులాడిరి. కాని యీతని యల్లుఁడగు నాదెండ్ల యప్పామాత్యుఁడాఱువేల నియోగి బ్రాహ్మణుఁడని మాదయ్యగారి మల్లనకృతమైన రాజశేఖర చరిత్రలోఁ జెప్పబడినందున నితఁ డాఱువేల కులుఁడని నిస్సంశయముగాఁ

దెలిసినది. ఇతని యింటిపేరు సాళువవారు; తండ్రిపేరు రాచయ్య; భార్య లచ్చమ్మ. ఈ యమాత్యశేఖరుఁడు చిన్ననాఁడు కడుబీదగానుండి కొన్ని దినములు పశువులఁగాచి, గుత్తి, చంద్రగిరి, పెనుగొండ మొదలయిన స్థలములలో మాధుకరవృత్తిచే జీవనముచేసి చదువుకొని, అచ్చటి దుర్గాధీశుల నాశ్రయించి తనబుద్ధి మహిమచేఁ గ్రమక్రమముగా నభివృద్ధిఁజెంది సామ్రాజ్యమునకు మంత్రియయ్యెను. ఈ మంత్రిశిఖామణి నరసరాజునొద్దను, వీరనరసింహరాజునొద్దను, కృష్ణదేవరాయలయొద్దను ముఖ్యమంత్రిగానుండి రాజ్యభారమంతయు వహించి రాజుల గౌరవమునకును బ్రజలయాదరమునకును బాత్రుఁడయ్యెను. ఇతనికి విశేషముగా ఖ్యాతి కృష్ణరాయల కాలములో వచ్చినది. ఈతని బుద్ధిబలముచేతను మంత్రశక్తిచేతను కృష్ణరాయనికి నసంఖ్య విజయములును అధిక విఖ్యాతియుఁ గలిగెననుటకు సందేహములేదు. కావుననే కృష్ణరాయ లీతనిని 'అప్పాజీ' (నాయనగారు) అని పిలుచుచుండెను. ఈ మంత్రిపుంగవుని దానశాసనము లనేకములుకలవు. ఇతఁడు స్వయముగా సైన్యాధిపత్యము వహించి కొండవీడు మొదలయిన దుర్గములను సాధించెను. ఇతఁడు ౧౫౨౭లోఁ గీర్తిశేషుఁడయ్యెను.

## రాయలవారి దక్షిణదిగ్విజయయాత్ర.

(౧౫౧౨ - ౧౫౧౩.)

రాజ్యమునకు వచ్చిన యొక రెండుసంవత్సరముల వఱకుఁ గృష్ణదేవరాయ లూరక తన రాజధానిలోనే యుండి రాజ్యవ్యవస్థ చేయుచుండెను. ఈ లోపల యుద్ధమునకుఁ దగినసైన్యమును జేర్చుకొని ౧౫౧౨లో దక్షిణ దిగ్విజయమునకు బయలుదేఱెను. కర్ణాటదేశములోఁ గావేరీతీరమున బలాఢ్యమైన దుర్గమొకటి కలదు. దానిపేరు శివసముద్రము. అచ్చటిరాజులు విజయనగర చక్రవర్తులకు సామంతులు. కాని కృష్ణరాయలకాలపు రాజగు గంగ

రాజు తిరుగఁబడి కప్పమిచ్చుట మానెను. అందుచేఁ గృష్ణరాయఁడు శతఘ్నులతోను ప్రబలసైన్యములతోను వానిని సాధించుటకు వెడలెను. శ్రీరంగపట్టణపురాజగు చిక్కరాయనికిని గంగరాజునకును వైరమగుటచే వానిని గలుపుకొని కృష్ణరాయలు కొండత్రోవనుబోయి శివసముద్రపుకోటను ముట్టడించి శౌర్యముతోఁ బోరాడి వశపఱుచుకొనెను. గంగరాజు కావేరిలోఁ బ్రాణములను ద్యజించెను. అంత నుమ్మటూరు జయించెను. శ్రీరంగపట్టణపు రాజగు చిక్కరాయని వశపఱుచుకొని యాతఁడు తనకుఁ గప్పము కట్టునట్లు చేసెను. తరువాత మహీసూరు దేశమంతయుఁ గర్ణాటకంబంతయుఁ గృష్ణరాజునకు లోఁబడెను. తాను జయించిన కర్ణాటదేశమున కంతటికిని శ్రీరంగపట్టణము రాజధానిగా నేర్పఱిచి, కృష్ణరాయధ్వజ మనుపేర నొక విజయధ్వజము నెత్తించి అచ్చట చిక్కరాజును తన ప్రతినిధిగా నేర్పఱిచెను. ఆ సమీపమందలి పాళెములజయించి 'కాంబగౌడఁడు వీరప్పగౌడఁడు' అను పాలెగాండ్రవశమున నుంచెను.

ఇట్లు కర్ణాటకము జయించినపిదప కొడగు (Coorg), మళయాళము అను దేశములగెలిచి యచ్చటిరాజు లిచ్చుకప్పముల నిర్ణయించుకొని పాండ్యాది దక్షిణదేశములను జయించుటకై లక్ష సేననిచ్చి 'విజయప్పనాయకుఁడు వెంకటప్పనాయకుఁడు' అనువారినిఁ బంపెను. విజయప్పనాయకుఁడు వేలూరు ప్రాంతమును జయించి వేలూరుముఖ్యస్థానము చేసికొని యచ్చటనుండి పన్నులు వసూలుచేయుచుండెను. చిత్తూరు పాలెగాండ్రను, తొండమండలములోని పాలెగాండ్రను, జింజీదుర్గమును, చోళమండలములోని పాలెగాండ్రను, వశపఱుచుకొని వారీయవలసినపన్నుల నిర్ధారణచేసి, జింజీలోఁ గాఁపురముండి కృష్ణరాయలకై పన్నులు రాఁబట్టుకొనుచుండెను. తంజావూరు, తిరుచనాపల్లి, మధుర, తిరునగరు, రాజులు విజయప్పనాయకునికి వశులై కప్పములొప్పుకొనిరి. ఇట్లు పూర్వకర్ణాట ద్రవిడదేశమంతయుఁ గృష్ణరాయలకు వశమై

మూఁడుకోట్లరూకలిచ్చుచుండెను. కృష్ణరాయలీదక్షిణదేశమునంతను మూఁడుభాగములుగా విభజించి వానిపై ముగ్గురునాయకుల నేర్పఱిచెను. జింజీలోనుండు కృష్ణప్పనాయకుఁడు నెల్లూరు మొదలు కొల్లడమునది (Coleroon) వఱకును, విజయరాఘవనాయకుఁడు తంజావూరిలోనుండి కావేరినది ప్రవహించు ఫలవంతదేశమునకును, వెంకప్పనాయకుఁడు దక్షిణమునందలి తిరునల్వేలి ప్రాంతమునకును పాలకులుగానుండిరి. ఇట్లు కర్ణాటద్రావిడ మళయాళదేశము లాంధ్రుల స్వాధీనమయ్యెను. ప్రస్తుతమాదేశములలోఁ గానవచ్చు తెలుఁగు బ్రాహ్మణులు, రెడ్లు మొదలయినవా రాకాలమందుఁ దెలుఁగుదేశమునుండి వెళ్లినవారే.

## పూర్వ దిగ్విజయయాత్ర.

నెల్లూరు మండలములో ఉదయగిరి యనుదుర్గము గలదు. అది మొదట విజయనగరరాజులదియే యైనను కటకపురికి రాజులయిన గజపతులు దానిని స్వాధీనపఱుచుకొనిరి. ఆకాలమందుఁ గటకపురి మొదలు నెల్లూరు మండలము వఱకును గల తూర్పు తెలుఁగుదేశమంతయు, ప్రతాపరుద్రగజపతి ప్రభుత్వములోనిదియై యుండెను. కావున నాభాగమును జయింపవలయునని కృష్ణరాయఁడు ౧౫౧౩లోఁ బూర్వదిగ్విజయయాత్రకు వెడలి యుదయగిరిని సమీపించెను. ఆ దుర్గము శత్రువులకభేద్యమై, పదివేల కాల్బలముతోను, నాలుగువందల గుఱ్ఱములతోను సురక్షితమై యుండెను. అప్పటియధికారి వీరభద్రపాత్రుఁడు. కృష్ణరాయలవెంట ముప్పదివేల కాల్బలమును, ఎనిమిదివేల యేనుఁగులును నుండెను. దుర్గమును సమీపించుటకు నొకచిన్న దారితప్ప వేఱు త్రోవలేనందున లోనివారికి తినుబండార మందకుండఁజేసి వారిని నశపఱుచుకొనఁ గృష్ణరాయఁడు నిశ్చయించి పదునెనిమిది నెలలవఱకును కోటను ముట్టడించి విడిసియుండెను. తుదకుఁ గొండలను బగులఁగొట్టించి విశాలమార్గములఁ

జేయించి రాయలు దుర్గమునుసమీపించి దానిని వశపఱుచుకొనెను. ఆ దుర్గాధ్యక్షుని పినతండ్రియైన ప్రహరేశ్వరపాత్రునిఁ జెఱపట్టి విజయనగరమునకుఁ దీసికొనిపోయెను. దుర్గాధీశుని మేనత్తను చెఱపట్టెనని న్యూనిజ్ వ్రాసి యున్నాఁడు. ఆమె నాతఁడు మిక్కిలి గౌరవముతోఁ జూచెనఁట.

అటుతరువాత రాయలు నెల్లూరిమండలమునకు రాజయిన వీరరుద్రగజపతిని జయించి, యాతనిని సకుటుంబముగా నరణ్యములలోనికిఁ బాఱఁదోలి యాతనికూఁతురగు చిన్నాదేవిని వివాహమాడెననియు, ఈ వీరరుద్రగజపతి రాజు ప్రతాపరుద్రునివంశములోని కడపటిరాజనియుఁ గథలుకలవు. కాని యిది నిశ్చయాత్మకమైన చరిత్రాంశముకాదు.

ఉదయగిరి జయించినపిదపఁ బ్రస్తుతపు గుంటూరుమండలములో నున్న కొండవీడుదుర్గమును జయించుటకు రాయలవారు తిమ్మరుసుతోఁగూడ వెడలిరి. ఈ కొండవీడుదుర్గము దక్షిణ హిందూదేశమందలి గొప్పపర్వత దుర్గములలో నొకటి; మహాబలాఢ్యమైనది. అది ప్రస్తుతమందు శిథిలమైపడిపోయినను చూచుటకు బహురమ్యముగానుండును. ఓరుగంటిరాజ్యము పోయినతరువాత నచ్చటనున్న రెడ్డిసరదారులు స్వతంత్రులై యీదుర్గమునుగట్టి యిచ్చటనుండి రాజ్యముచేయుచుండిరి. ౧౪౫౪లో నుత్కళదేశాధీశులగు కటకరాజు లీదుర్గమును స్వాధీనపఱుచుకొనిరి. అప్పటినుండి ౧౫౧౫వఱకు నది వారి స్వాధీనములోనే యుండెను. ప్రస్తుతకథాభాగకాలమందు నీదుర్గ ముత్కళ దేశపు రాజయిన ప్రతాపరుద్రగజపతియొక్క కుమారుఁడగు వీరభద్రగజపతి పాలనలోనుండెను. ఇంతియగాక కుమారహంవీరపాత్రుని కుమారుఁడు నరహరిదేవుఁడు, శ్రీనాథరాజు రామరాజుకుమారుఁడు లక్ష్మీపతిరాజు, జన్యామలక సవాపాత్రుఁడు, సుప్రపాల చంద్రమహాపాత్రుఁడు, పూసపాటిరాచరాజు, రాచూరి యల్లయఖానుఁడు, ఉద్దండఖానుఁడు మొదలగు నుద్దండ సేనానులనేకులు సేనాసమేతులై కొండవీటిసీమను రక్షించుచుండిరి.

కృష్ణదేవరాయ లుదయగిరిఁదీసికొని కొండవీటిమీఁదికి దండెత్తివెడలు చున్నాఁడని విని కటకాధీశ్వరుండగు ప్రతాపరుద్రదేవుఁడు పదుమూఁడు వందల యేనుఁగులును, ఇరువదివేల గుఱ్ఱములును, అయిదులక్షల కాల్బలమును వెంటఁదీసికొని యోఢ్రదేశమునుండి బయలుదేఱి కృష్ణరాయలతోఁ బోరాడుటకుఁ గృష్ణానదిని సమీపించెను. ఈ వర్తమానమువిని కృష్ణరాయలు కొండ వీడువిడిచి తన సైన్యములతో గజపతిసైన్యముల సమీపించెను. కృష్ణకుత్తరమున గజపతిసైన్యములును, కృష్ణకుదక్షిణమున రాయలసైన్యములును విడిసి యుద్ధమునకు వేచియుండెను. ఏఱుదాఁటునప్పుడు పోరాడుటవలన అనావశ్యకముగా సైనికులు మడియుదురుకావున 'మీరుకృష్ణదాఁటి యిటువచ్చెడి యెడల మేము రెండుమైళ్లు వెనుకకుఁబోయెదము; లేదా మీరు క్రోసెడు దూరము వెనుకకుంబోయి మమ్ము నాఁలకు రానిం'డని రాయలు గజపతికి వర్తమానమంపెను. కాని యందులకుఁ బ్రత్యుత్తరము రానందున రాయలు శత్రువులతోఁ బోరాడుచు కృష్ణానదిని స్వసైనికులతోదాఁటి, గజపతితో ఘోరముగాఁబోరి యాతనిఁ బాఱఁదోలి యెన్నియోయేనుంగులును, గుఱ్ఱంబులును ధనంబును కొల్లగొట్టెను!

ఇట్లాడంబరముతో వచ్చినగజపతిని బాఱఁదోలి రాయలును తిమ్మరుసును కొండవీటి దుర్గమును మరల ముట్టడించి, రెండుమాసములవఱకుఁబోరి దుర్గమును వశపఱుచుకొనిరి. శా. శ. ౧౪౩౭లో ఆషాఢ శుక్ల ఏకాదశి శనివారము (౨౩వ జూన్ ౧౫౧౫) నాఁడీదుర్గమును తిమ్మరుసు జయించినట్లు ఈ దుర్గముమీఁద నొకశాసనముకలదు. ఈదుర్గాధిపతియు గజపతిపుత్రుఁడును అగు వీరభద్రగజపతిని రాయలు చెఱపట్టి విడిచినట్లు 'పారిజాతాపహరణము' వలనఁ దెలియుచున్నది. ఈదుర్గ సంరక్షణార్థమై తిమ్మరుసు తన మేనల్లుఁడగు నాదిండ్లగోపనమంత్రిని దుర్గాధీశునిగా నేర్పఱిచెను. కృష్ణరాయఁడీసమయము

నందేకొండవీటికి సమీపమునందున్న బెల్లముకొండ, నాగార్జునకొండ, అద్దంకి, అమ్మనబ్రోలు, తంగేడు, కేతవరము మొదలగు దుర్గముల సాధించెను.

ఈ దండయాత్రలో రాయలభార్యలు వెంటనుండిరి. అమరావతిపట్టణము లోని యమరేశ్వరునకును, బెజవాడలోని శివుని దేవాలయమునకు మఱియు ననేక దేవాలయములకు దానముల నేకములు రాయలును పట్టమహిషులును కలిసిచేసిరి; పెక్కు శాసనములు వేయించిరి.

రాయలవారు బెజవాడలోఁ గొన్నిదినములుండి కృష్ణయొడ్డున నున్న శ్రీకాకుళ మను క్షేత్రము దర్శింపఁబోయి యచ్చటనే 'ఆముక్తమాల్యద' యను కావ్యమును రచింప నిశ్చయించిరి.

కొండవీటినుండి రాయలు కొండపల్లి యను దుర్గమునకుఁబోయి దానిని రెండు నెలలవఱకు ముట్టడించి స్వాధీనపఱచుకొని యందుఁ గటకేశ్వరుని భార్యను, పుత్రుని, నేడ్గురు ముఖ్యసైన్యాధీశులను జెఱపట్టి విజయనగరమునకుఁ బంపెను.

తరువాతఁ గృష్ణరాయలు ప్రతాపరుద్రగజపతిని వెంబడించి తఱుముచు నుత్తరమునకుఁ బోనఁజొచ్చెను. అతఁడు కృష్ణాగోదావరీనదుల ముఖమునకు నడుమనుండు వేఁగిదేశముపైదండెత్తి జమ్మిలోయ, కోనసీమ, కొరాము మొదలగు మన్యసీమలజయించుచు రాజమహేంద్రవరము స్వాధీనపఱచుకొనెను. తరువాత విశాఖపట్టణమండలములోని బాహుబలేంద్రవంశస్థులకు రాజధాని యగు పొట్టునూరికడ జయస్తంభమునునాఁటి మాడుగులు మొదలగు మన్య సంస్థానములను వడ్డాదిని వశపఱచుకొని సింహాద్రిచేరెను. అచ్చట స్వామిని సేవించి జయస్తంభములువేయించి కటకమునకుఁబోయి యాపట్టణమును కాల్చి పూర్వ దిగ్విజయముఁ బూర్తిచేసి యాశూరాగ్రేసరుఁడు ౧౫౧౫లోఁ దిరిగి తన విజయంబులచే సార్థకనామమైన విజయనగరముఁ జేరెను.

రాయలు నిజపురమునకు వచ్చిన తరువాత నొకనాఁడు చెఱసాలలోనున్న గజపతిపుత్రుని ఖడ్గకౌశలముఁ జూడ నాతనిఁ బిలిపించి వినోదము చూపు మనఁగా నతఁ డాయగౌరవమునకు నోర్వలేక పొడుచుకొని చచ్చెను. తరువాత రాయలకును గజపతికిని సంధి జరిగి గజపతి తనకూఁతును రాయలకిచ్చి వివాహముచేసెను. అంత రాయలవారు కృష్ణానది కుత్తరమునఁ గ్రొత్తగా సంపాదించిన రాజ్యమంతయు గజపతి కిచ్చివైచెను.

౧౫౧౫లోఁ గృష్ణరాయలు కాటూరు పాళెగారును జయించెను. తరువాత నాలుగైదు సంవత్సరముల వఱకు యుద్ధములు చేసినట్టు కనఁబడదు. విద్వచ్చక్రవర్తి కావ్యముల రచించుటయందును, కావ్యముల నందుకొనుటయందును, ఏష్యయుద్ధసామగ్రి సేకరించుటయందును నీయైదు సంవత్సరములును గడపినట్లు కానవచ్చుచున్నది.

## రాయచూరు దండయాత్ర.

(౧౫౨౦)

రాచూరు లేక రాయచూరు అనఁబడు దుర్గము ఆదిల్ షాహయొక్క స్వాధీనమందుండెను. ఇది కృష్ణా తుంగభద్రా నదులకు నడుమనున్నది. ఈ దుర్గము మొదట విజయనగరరాజులదై యుండెను. దీనికై వీనికి మహమ్మదీయులకును నెన్నియోసారులు ఘోరములైన యుద్ధములు జరిగెను. తుదకాదుర్గమును తురుష్కు లాక్రమించుకొనిరి. కావున విజయనగరసింహాసనాసీనులగు రాజు లాబలాఢ్యదుర్గమును స్వాధీనపఱుచుకొన వలసినదని సాళ్వనరసింహరాజు తన మరణశాసనమునందు వ్రాసియుంచెను. ఈ యంశములన్నియు మనస్సులోనుంచుకొని రాచూరును గెలిచినఁగాని తన పౌరుషమునకు వన్నెలేదని తలఁచి కృష్ణరాయలు యుద్ధముచేయ నిశ్చయించెను.

కాని యాదిల్‌షాహాకును రాయలకును స్నేహమున్నందున యుద్ధమున కెద్దియైనఁ గారణముదొరకునా యని రాయ లెదురుచూచుచుండెను.

అంత సయ్యద్‌మర్కార్ అనుతురుష్కుఁ డొకఁడు రాయల యొద్దనుండి గుఱ్ఱములు తెచ్చుటకై కొంతధనముఁదీసికొని పాఱిపోయి ఆదిల్‌షాహ యొక్క రాజ్యములో డాఁగియుండెను. వానిని తనకు స్వాధీన పఱుపవలసినదిగా రాయలడిగినను వాఁడు తురకవాఁడగుటచే వాని నెక్కడికో పంపివేసి యాదిల్‌షాహ వాఁడు లేఁడని ప్రత్యుత్తర మంపెను. అదియే కారణముగాఁ గృష్ణరాయలు యుద్ధమునకు సమకట్టెను. యుద్ధముచేయఁ దలఁచినవారికిఁ గారణము దొరకకపోవునా?

ఈ యుద్ధముకొఱకుఁ గృష్ణరాయలవారు చేసిన సన్నాహ మత్యద్భుతకరము. తన సామ్రాజ్యములోనున్న యన్ని విషయముల సైనికులను బాగుచేసెను. ప్రత్యక్షముగాను యుద్ధమును చూచినవాఁడనఁదగు న్యూనీజ్ అను పోర్చుగీజు చరిత్రకారుఁడు వ్రాసినయంశములనుబట్టి చూడఁగా నీ యుద్ధయాత్రలో రాయలవారివెంట ౭,౦౩,౦౦౦ (ఏడు లక్షల మూడువేలు) కాల్బలమును, ౩౨౬౦౦ గుఱ్ఱములును, ౫౫౧ ఏనుఁగులును ఉండెను. వీరుగాక సైన్యసేవకు లెందఱో యుండిరి! జనసంఖ్యయంతయుఁ బదిలక్షలను మించియుండెను. ప్రస్తుతపుబొంబాయి చెన్నపట్టణములఁ గలిపినయెడల నింత జనసంఖ్యయుండును.

దేశమంతటను సముద్రమువలెఁ బ్రసరించియున్న యీ మహాసేనతో రాయ లొకశుభముహూర్తమున విజయనగరమునుండి యుద్ధమునకు బయలుదేఱెను. అప్పు డాసేనలోని రథులును మహారథులును ఏ యేక్రమమునను, ఏ యేడంబముతోను బయలుదేఱినది 'న్యూనీజ్' కడు వింతగా వర్ణించియున్నాఁడు.

"విలుకాండ్రును, కత్తులు మూసికొనియున్నవారును, తుపాకులు చేతఁ బట్టిన సిపాయీలును ఈరీతిఁ గైకొన్నవారును గలిసి ముప్పదివేల కాల్బలమును, వేయితురంగములును పదునాలుగేనుంగులును గల సేనతో సేనారక్షకులలో ముఖ్యుఁడగు ఖాన్ఖానాయకుఁడు ముందునడుచుచుండెను. అతని వెనుక త్ర్యంబకరావను నతఁ డేఁబదివేల కాల్బలమును, రెండువేల తేజీలను, ఇరువదేనుంగులనుగల సేనతోఁ బోవుచుండెను. తిమ్మప్పనాయకుఁ డనువాఁ డరువదివేల కాల్బలమును మూఁడువేలయైదువందల గుఱ్ఱములును, ముప్పదేనుంగులును కల సైన్యముతో త్ర్యంబకరావును వెంబడించి పోవుచుండెను. అతని తరువాత ఆదెప్పనాయకుఁ డనువాఁడు లక్షకాల్బలమును, అయిదువేల గుఱ్ఱములును, ఏఁబదేనుంగులును గల సైన్యముతోఁ బోవుచుండెను. అతనివెనుక లక్షయు నిరువదివేల కాల్బలమును, ఆఱువేల తురంగములును, అఱువ దేనుఁగులును గల సైన్యముతోఁ గొండమరెడ్డి (కొండారెడ్డి) పోవుచుండెను. ఎనుబదివేల కాల్బలమును, రెండువేలయేఁబది గుఱ్ఱములును, నలువ దేనుంగులును గల సైన్యముతో నతని కుమారుఁ డాతని వెంబడించి పోవుచుండెను. విజయనగరపుర పాలకుఁడుగా నియమింపఁబడిన సాళువ గోవిందరాజు (తిమ్మరుసు తమ్ముఁడు) ముప్పదివేల కాల్బలమును, వేయి తేజీలను, పది యేనుఁగులును గల సైన్యమును గలిగి వారల వెనుకను బోవుచుండెను. అతనివెనుక రాయలకుఁ దమలం బందిచ్చు మఘురనాయకుఁ డొకఁడు పదునైదువేల కాల్బలమును, రెండు వందల గుఱ్ఱములును గల సేనతోఁ బోవుచుండెను. కృష్ణరాయలకుఁ గూఁతునిచ్చినఁవాఁడును, మయినూరు మండలాధిపతియునగు కుమార వీరయ్య (కుమార వీర శ్యామరాయలు) ఎనిమిదివేల కాల్బలమును నాలుగువందల గుఱ్ఱములను, ఇరువదేనుంగులును గల సైన్యముతో నాతని వెనుకఁ బోవుచుండెను. తరువాత వెంగాపుర దుర్గాధ్యక్షుఁడును నరపతి వంశమ్ములోని యుత్తమ క్షత్రియులు

మొదలగువారు బహుసేనలతోఁ బోవుచుండిరి. రాయలు ప్రేమించు మూవురుఖోజ్జాలు నలువదివేల కాల్బలమును, వేయి తురంగములును, పదునై దేనుంగులును గల సైన్యమును తీసికొని సాళ్వ గోవిందరాజు సైన్యమును వెన్నంటి పోవుచుండిరి. నలువది వేల కాల్బలమును, ఆఱువేల తురంగ ములును మూఁడువందల యేనుంగులును తనకు రక్షకసైన్యముగా నుంచుకొని శ్రీకృష్ణదేవరాయలు పైనుదాహరించిన సేనలకన్నిఁటికిని నాయకుడై నడపించు కొని రాచూరు దుర్గము వైపునకుఁ బోవుచుండెను''*.

ఇట్టి సైన్యసముద్ర మచ్చటచ్చట మార్గములో దిగుటకును, సైనికులకు గుఱ్ఱాదులకుఁ గావలసిన యాహారద్రవ్యములు, జలము, గడ్డి, కట్టెలు మొదలయి నవి దొరకుటకును, రాయలవారు తగిన యేర్పాటులు చేయించిరి. అందుచే సైన్య మెచ్చట విడిసినను ఏమియుఁ గొఱఁతలేక యాస్థల మొక గొప్పపట్టణ మువలెఁ గాన్పించు చుండెను. సైన్యమువిడిసినచోట రాజుయొక్క శిబిరము వేఱుగను, సేనానులయొక్క శిబిరములు వేర్వేఱుగను, బాజారులుతీర్చి యంగడులు వినోద గృహములు వేర్వేఱుగను, అమర్పఁబడుచుండెను. ఇట్లచ్చటచ్చట విడియుచు నా సైన్యమహాపట్టణము రాచూరు దుర్గమును సమీపించి ముట్టడించెను.

కోటలోనివారిసంఖ్య మిక్కిలి తక్కువయైనను వారు దుర్గద్వారములన్నియు మూసి బురుజులమీఁద ఫిరంగులు సిద్ధపఱిచి ధైర్యముతోఁ బోరసాగిరి.

కృష్ణరాయఁడు రాచూరుదుర్గమును ముట్టడించెనని విని ఆదిల్‌షాహ గొప్పసైన్యమును దీసికొని కృష్ణానదివఱకు వచ్చెను. కృష్ణకు నుత్తరమున ఆదిల్ షాహ సైన్యమును, కృష్ణకు దక్షిణమున రాచూరునొద్ద రాయలసైన్యమును విడిసి కయ్యమునకుఁ గాల్దువ్వుచుండెను. ఏఱు దాఁటివచ్చినతరువాతఁ

---

* జీర్ణకర్ణాటక రాజ్య చరిత్రము.

తురుష్క సైన్యముతోఁ బోరాడవచ్చినని రాయ లూరకుండెను. కృష్ణరాయలు భయపడి తనమీఁదికి యుద్ధమునకు రాలేదని తలఁచి నవాబు తన సైన్యములతో నేఱు దాఁటి రాయల సైన్యములకుఁ దొమ్మిది మైళ్లదూరమున నుండెను. రాయలు తన సైన్యములతో వచ్చి శత్రువులమీదఁ బడి పోరాడఁజొచ్చెను.

ఈ యుద్ధము భారత రామాయణీయ యుద్ధములవలె ఘోరముగా జరిగెను. ఉభయ సైన్యములును తమ యద్భుతపరాక్రమముఁ జూపెను. ఒకప్పుడు రాయల సైనికులలోఁ గొందఱు తురుష్కులకోర్వఁజాలక పాఱిపోవఁగాఁ జూచి రాయలవా రట్లు పాఱిపోవు వారల నఱికింపఁ దొడఁగెను. అంతఁ బాఱిపోవు వారందఱు మరలి శత్రువులమీదఁ బడిరి. తుదకుఁ దురుష్కసేన పూర్తిగాఁ బరాభవము నొంది రాయల సైన్యమునకుఁ బరిపూర్ణమైన దిగ్విజయము కలిగెను. రాయల సైనికులు తురుష్కసేనలను తఱిమితఱిమి చెండాడిరి. సుల్తాను సెట్టకేలకు నేనుఁగ నెక్కి యేఱు దాఁటి పాఱిపోయెను. ఇతని ముఖ్య సేనాధిపుఁడు రాయలచేఁ జెఱఁబెట్టఁబడియె. శత్రుసైనికు లెందఱో రాయల శౌర్యమున కాఁగలేక నదిలోకుఱికి ప్రాణములు పోఁగొట్టుకొనిరి. నవాబు తప్పించుకొని పాఱిపోయెనని తెలిసిన తరువాత దీనాలాపములు పెట్టుచున్న యాతని సైనికులను సంహరించుట మానవలసినదని దయానిధియగు రాయలవా రాజ్ఞాపించిరి. రాయలవారికి శత్రుశిబిరమునందు నసంఖ్యమైనధనమును, ధాన్యమును, గుఱ్ఱమును, ఏనుఁగులును దొరకెను. ఈ యుద్ధము క్రీ. శ. ౧౫౨౦వ సంవత్సరము, మే నెల ౧౯వ తేది శనివారమునాఁడు జరిగెను.

రాచూరు దుర్గమునకు సాహాయ్యము చేయవచ్చిన ఆదిల్ షాహ నిట్లు పాఱఁదోలి రాయలు మరల నాదుర్గమును ముట్టడించెను. కోటలోనివా రిరువదిదినములవఱకుఁ బోరాడిరి. రాయల సైన్యములును మిగులనుత్సాహముతో యుద్ధము చేసెను. రాయల సైన్యములో పోర్చుగీసు సైనికులు కొందఱుండిరి.

వారినాయకుఁడు క్రిస్తోవిడిఫిగరీడో యనువాఁడు. ఈతఁడును ఈతనిసైనికులును ఈయుద్ధములోఁ దమయుద్ధనైపుణ్యమును విశేషముగాఁ జూపి కోటను స్వాధీనము చేసికొనుటకు మిగుల సహాయభూతులయిరి. వేఱువిధ లేక కోటలోనివారు ద్వారములను తెఱచి రాయలకు వశులైరి. రాయలవారు జయజయధ్వనులతోఁ బురప్రవేశము చేసెను! పురములో వారిని మిక్కిలి గౌరవముతోఁ జూచెను; వెడలి పోయెదమన్నవారిని వారిసొత్తుతోఁగూడ వెడలిపోనిచ్చెను. తనసైనికులు కొందఱిని దోఁచుకొనఁగా వారిని శిక్షించి యొవరిధనము వారికి నిప్పించెను. ఇట్టి దైవికగుణములు చూచి శత్రుజనులు కూడ రాయలను కొనియాడఁ జొచ్చిరి. ఇట్లు జయలక్ష్మినిఁగైకొని రాయలవారు రాచూరురక్షణార్థమై కొంతసైన్యమునుంచి, మిగిలిన సైన్యముతోఁ దాను విజయనగరమునకుఁ బోయి జయోత్సవము చేసి, సేనాధిపతులకును, సైనికులకును తగినబహుమతు లిప్పించెను.

ఆదిల్‌షాహాంటి బలాఢ్యుఁడైన నవాబుగూడ నోడిపోయెనని తెలిసి హిందూదేశమం దంతటను కృష్ణరాయలవారికీర్తి ప్రసరించెను. ఇతరతురుష్కరాజులందఱును రాయలవారితో మైత్రిచేసి యాతనియనుగ్రహమును కోరుచుండిరి. శత్రువులకీతని పేరనఁగానే గుండె జల్లను చుండెను.

అట్టుపరాభవముఁజెందిన ఆదిల్‌షాహా తనసేనాధీశుని నొక్కని రాయలవారి యొద్దికిఁ బంపి ఇట్లు మనవి చేసికొనెను.

“ప్రభూ! నాయజమానుఁడగు ఆదిల్‌షాహా నన్ను మీయొద్దకుఁ బంపినాఁడు. ‘న్యాయముదయచేయుఁ’డని తన ప్రార్థనగా నన్ను మీకు మనవి చేయు మని చెప్పెను. ఇంక నిట్లు చెప్పుమనెను: ప్రపంచములోని సత్యసంధులలోను, న్యాయప్రియులలోను, పరాక్రమవంతులలోను మీరు సర్వశ్రేష్ఠులని మీయెడ నేను సద్భావము కలిగియున్నాఁడను. ఎన్నియోతరముల

నుండి మీకును మాకును గలస్నేహమునకును, సంధికిని మీరు నిష్కారణముగ భంగము కలిగించితిరి. మీ రేల మీరాజ్యమునువిడిచి మారాజ్యముమీఁదికి యుద్ధమునకు వచ్చితిరో తెలియకున్నది. మీరు రాయచూరును ముట్టడించితిరనియు, చుట్టువనున్న దేశమును బాడుచేసితిరనియుఁ దెలియునంతకు నట్లగునని మే మెన్నఁడును తలంపలేదు. అంతట మేము రాయచూరుదుర్గరక్షణార్థమై కదలి వచ్చితిమి. నాసరదారులందఱును మీచేఁ జంపఁబడిరి; మాశిబిరమంతయుఁ దోచుకొనఁబడెను, నాశముచేయఁబడెను; అచ్చటజరిగిన యనన్వితకృత్యముల కన్నిఁటికిని మీరె సాక్షి. కావున మీరు మాగుఱ్ఱములను, ఏనుఁగులను, గుడారములను మాకీయవలసినది. రాయచూరుదుర్గము మాస్వాధీనము చేయవలసినది. అట్లయిన నేను మీకు నవ్యాజస్నేహితుఁడుగ నుండఁగలను. అట్లీయనియెడల మీపని మీ కెంతబాగున్నను అది దుష్కృత్యమని యెంచఁబడును''

అందుకు 'ఆదిల్ సాహావచ్చి మాకాళ్లు పట్టుకొన్నయెడల మీరు కోరినవన్నియు మీ కిచ్చివేయుదు' మని రాయలు ప్రత్యుత్తర మిచ్చెను. వేఱువిధి లేక యాదిల్ సాహ యందులకు నొప్పుకొనియెను. ఇద్దఱురాజులును తమ రాజ్యములపొలిమేరయొద్దఁ గలియునట్లొప్పందము చేసికొని రాయలు సైన్యముతోఁ గదలి ముద్గలునకువెళ్లెను. కాని యాదిల్ సాహాకు ధైర్యములేనందున నాతఁడు వచ్చి రాయలనుగలియఁడయ్యెను. అంత రాయలవారు ఆదిల్ సాహా యొక్క రాజధానియగు బిజాపురమునంతకుఁ బోయి యాపట్టణమును రాజధానిని ధ్వంసముచేసి, మంత్రులాపైని పోవలదన్నందునఁ జెడిరి.

ఈదాడిలోనే రాయలు కలబరిగి దుర్గమును ధ్వంసముచేసి, వశపఱుచుకొనెను. ఇందు ఆదిల్ సాహ బహమనీవంశజులయిన ముగ్గురు రాజపుత్రులను చెఱలోనుంచెను. కృష్ణరాయలు వారిచెఱవిడిపించి, యందుఁ బెద్దవానికి రాజ్యముకట్టెను. రాయలభయముచే నంపఱును అతనిని బహమనీరాజని

యొప్పుకొనిరి. మిగిలిన యిద్దఱు రాజపుత్రులఁ దనవెంటఁదీసికొనిపోయి వారికిఁ దనయొద్ద ఘనమైన యుద్యోగము లొసఁగెను. రాయలు కలబర్గి గెల్చిన సంగతి ఆముక్తమాల్యదలోని యీక్రిందిపద్యమునందుఁ జెప్పఁబడి యున్నది.

గీ. తిరుగుహారిపురి నురతరు - నురలమరిగి ।
బహుళహాళహాళిభరితక - ల్బరగినగర ।
సగరపురవరపరివృఢ - జవనయవన ।
పృతన భవదసి ననిఁ దెగి - కృష్ణరాయ ॥

ఈ యంశమే మనుచరిత్రలోని యీ క్రిందిపద్యార్థములో వర్ణింపఁబడినది.

కవిరాజవిరాజితము.

ప్రళయఘనాఘన ఘోషజయానక
ఘాంకృతిభీమ చపేటలుఠత్ ।
కలుబరగీకటకక్షితిరక్షక!
కన్నడరాజ్యరమారమణా! ॥

కృష్ణరాయలకు శాసనాదులలో 'యవనరాజ్యస్థాపనాచార్య' యను బిరుదు కలదు. కలుబరిగిలోని బహమనీరాజ్యమదివఱకు నంతమందెను. ఆనశంజుల లోనివాఁడగు నొక్కనిఁ దిరిగి రాజ్యముమీఁద రాయలు కూర్చుండఁ బెట్టె నని వ్రాసియున్నాము. ఆకారణముచేతనే రాయలవారి కా బిరుదువచ్చెను.

## మహమ్మదీయ వృత్తాంతము.

ఇదివఱకు వ్రాయఁబడిన విజయవర్ణనలన్నియు (కృష్ణరాయలతో సమకాలీనుఁడగు న్యూనీజు గ్రంథములోనుండి కైకొనఁబడినది. ఇతఁడు సమకాలీనుఁ డగుటచేతను, పక్షపాతమునకుఁ గారణములేని పరదేశీయుఁ డగుటచేతను

ఇతని గ్రంథ మితరగ్రంథములకంటె నెక్కుడుగా నమ్మఁదగియున్నది. ఇఁకఁ బరువాతికాలపువారగు మహమ్మదీయ చరిత్రకారు లేమివ్రాసిరో చూతము.

కృష్ణరాయల యప్రతిమపరాక్రమముఁ జూచి భయపడి కాఁబోలును ఫెరిస్తా యీ ప్రకరణములోఁ గృష్ణరాయని పేరైనను ఉచ్చరించినవాఁడు కాఁడు. అట్టిచరిత్రకారునితోఁ బోరాడిన నేమిలాభము? ఇఁక నింకొక మహమ్మదీయ చరిత్రకారుఁడు వ్రాసెనని 'బ్రిగ్స్ ఫెరిస్తా' యను గ్రంథమునుండి స్యూయేల్ న్యూయలగారు కొన్నియంశములను ఉదాహరించియున్నారు. *అందు రెండుసమాచారములుమాత్రము రాయలనుగుఱించినవి కలవు. గోలకొండకు మొదటి నవాబయిన కులీకుతుబ్ షాహ కృష్ణదేవరాయలను పానగల్లు దుర్గము నొద్ద నోడించి దానిని తీసికొనెనఁట; రాయలసైన్యములను కొండవీడువద్ద నోడించి యా దుర్గమునుగూడ వశపఱుచుకొనెనఁట. ఈ రెండంశములును నసత్యము లనుటకు నాకు నాధారములు దొరకినవి.

కుతుబ్ షాహ పానగల్లుదుర్గమును రాయలయొద్దనుండి తీసికొనియె నని గదా యీ చరిత్రకారుఁడు వ్రాయుట. ఇబ్రాహీమ రామునకు నంకితము చేయఁబడిన 'తపతీసంవరణ' మనుకావ్యములో అద్దంకి గంగాధరకవి కులీకుతుబ్ షాహను వర్ణించుచు నతఁడు పానగల్లుదుర్గమును దమిదిమిల్లాఖానుఁడను తురుష్కునియొద్దనుండి తీసికొనెనని స్పష్టముగా వ్రాయఁబడియున్నది.

సీ. పడమటను సవాయి - బసవనిగాఁజేసి
యచట గొయ్యాలకొండ - నావరించె।
దమదిమిల్లాఖాను - దక్షిణంబునఁగొట్టి
హరియించెఁ బానుగ - ల్లాదిగిరుల।
నుత్తరంబున బరీ - దోడిపాఱఁగఁదోలి
మెతుకుదుర్గం బాక్ర - మించి మించెఁ।

* Sewell's Forgotten Empire, pp. 132-134.

ప్రథమదిక్కునన్ గ్రుడ్డి - పాత్రసామంతుల
దట్టించి కంబము - మెట్టుకొనియె ।

గీ. సతనిఁ బొగడంగఁదగదె యా - చతురసీతి ।
మూఢగిరిదుర్గలుంఠన - ప్రౌఢతేజు ।
వాహశిఖరాధిరోహరే - వంతమూర్తి ।
కుతుబుశాహీనిత్యాపాలు - గుణవిశాలు ॥

చమిదిమిల్లాఖానుఁ డెవ్వఁడో తెలియదు. కాని యాతఁడు తురుష్కుఁడనుటకు సందేహములేదు. ఆదిల్ షాహాయొక్క సేనానియైయుండనోపు. కావునఁ గుతుబ్ షాహ పానగల్లును రాయలయొద్దనుండి తీసికొనియె నన్న వార్త కల్ల.

ఇఁకఁ గొండవీటికడ రాయలసైన్య మోడెనన్నమాట యబద్ధమనుటకు సమకాలీనుఁడగు న్యూనీజే సాక్షి. కొండవీడు గెల్చినతరువాత నది మంత్రియగు తిమ్మరుసునకు జాగి రొసఁగఁబడెను. రాయలతో నాతఁడు విజయనగరమునకుఁబోయి కొన్నిదినములకు నాతఁడు కొండవీటికి గొప్పసైన్యముతో వెడలెను. అతనిని కొండవీటికడఁ గుతుబ్ షాహాయొక్క సేనాధిపుఁడగు మదాన్ మేల్ ఖానుఁడనువాఁ డిరువదివేల సైన్యముతో నెదిరించెను. ఆయుద్ధములోఁ దిమ్మరుసు మంత్రీశ్వరుఁడే విజయుఁడై తురుష్కసేనానిని, ఆతని భార్యను, పుత్రునిఁ జెఱఁబెట్టెను. అసంఖ్యాధనమును రత్నాదులును, గుఱ్ఱములును, ఏనుఁగులును గొల్లగొట్టి విజయనగరమునకుఁ బంపెను. సేనాధిపతి మొదలగు వారందఱును విజయనగరములోని చెఱసాలలోనే మరణముఁ జెందిరి. తిమ్మరుసు తనజాగీరులోని పనులన్నియుఁ దీర్చుకొని రాయచూరుయుద్ధమునకుఁ గొంతకాలము పూర్వము విజయనగరమునకుఁ బోయి రాజుచే మిక్కిలి మన్ననపడసెను. ఇది సమకాలీనుఁడును, పరదేశీయుఁడును గావు

నసే నిష్పక్షపాతుఁడును, అగు చరిత్రకారుఁడు వ్రాసినయంశము. దీని ముందటఁ దురుష్కులవ్రాఁత లేమి పనికివచ్చును?

ఇదియుఁ గాక కొండవీటికడ నోడిపోయినది కుతుబ్‌సాహాయేగాని హిందువులుగారనియు, ఆయుద్ధములోఁ గుతుబ్‌సాహాతో స్వయముగాఁ బోరాడి యాతని నోడించినవాఁడు అర్వీటి నారపరాజనియుఁ గళాపూర్ణోదయములోని యీ క్రిందిపద్యమువలన స్పష్టపడఁగలదు.

గ. ఁదలక యుత్కలేంద్రుని స - వాయిబరీదు నడంచుదుర్గయుం
గుదుపనమల్కుఁ దల్లడిలఁ - గొట్టె మహాద్భుతసంగరంబులో
నెదిరిచి కొండవీటికడ - నెవ్వరుసాటి విచిత్రశౌర్యసం
పదపస నారసింహవిభు - పట్టికి నారనృపాలమౌళికిన్.

ఇంతవఱకుఁ గృష్ణరాయల దిగ్విజయములు వర్ణింపఁబడినవి. ఇఁక నాతని విద్యావైభవమును, రాజ్యావస్థయు నెట్టివియో చూపెదము.

## రాయల విద్యామహిమ.

ఈ రాజు సంస్కృతాంధ్రములందు నసామాన్యపాండిత్యము గలవాఁడు. విష్ణుచిత్తీయమను నామాంతరముగల 'ఆముక్తమాల్యద'యను ఆంధ్రకావ్య మొకటి యీతఁడు రచించెను. ఈకావ్యముయొక్క శైలి కష్టతరమైనను న్యాయన వర్ణనాంశములచే శోభిల్లుచు నుద్గ్రంథమని పేరు వడసినది. ఈ కావ్యమువలన నితనికి నాంధ్రగీర్వాణములలోఁగల ప్రజ్ఞ వెల్లడియగుచున్నది. మదాలసచరిత్ర, సత్యభామాప్రీణనము మొదలయిన సంస్కృతప్రబంధము లీచక్రవర్తి రచించినట్లు విష్ణుచిత్తీయమునుబట్టి తెలియుచున్నది.

ఇట్లు తాను కవియుఁ బండితుండును అగుటయేగాక యీనృపపుంగవుఁడు సంస్కృతాంధ్రకర్ణాటకవుల నాదరించి దిగంతవిశ్రాంతయశుఁ డయ్యెను. ప్రతిసంవత్సరమును వసంతోత్సవకాలమందు నానాదేశములనుండి

కవులనురావించి వారిని వారియోగ్యతానుసారముగా మన్నించుచుండెనని పారిజాతాపహరణములోని, యీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది:

క. ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగతసుకవినికర - గుంభితవాక్య
స్తుతిరోమాంచవిశంకిత
చతురాంతఃపురవధూప్ర - సాదనరసికా.

ముఖ్యముగా నీ రాజపుంగవుని కారుణ్యావశంబున మహోన్నతపదవిని జెందినది మన తెలుఁగుబాస. అందువలన నితనికి 'ఆంధ్రభోజుఁ' డన్న సార్థక నామమువచ్చెను. ఈతని యాస్థానమునందు 'అష్టదిగ్గజము' లను పేరిట నెన మండ్రు తెలుఁగుకవు లుండిరనినమాట పరంపరగా వచ్చుచున్నది. అల్లసాని పెద్దన్న, నంది తిమ్మన్న, అయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి, మాదయ గారిమల్లన్న, పింగళిసూరన్న, రామరాజభూషణుఁడు, తెనాలి రామ కృష్ణుఁడు అనెడి యెనమండ్రును అష్టదిగ్గజములని వాడుకకలదు. ఇందు మొదటి యేవురును రాయల సమకాలీనులనుటకు సందేహములేదు. పింగళి సూరన్నయు, రామరాజ భూషణుఁడును కృష్ణరాయల యల్లుఁడగు రామ రాజు కాలములో నున్నట్టు మనకు స్పష్టముగాఁ దెలియును గావున వారు రాయలవారికి సమకాలీనులయినను గావచ్చును. అట్లగుట యసంభవమనియు వారు రాయల కాలములో లేరనియు బ్రహ్మశ్రీ వీరేశలింగము పంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్రలోను, బ్రహ్మశ్రీ చిలుకూరు వీరభద్రరావుగారు తమ కృష్ణరాయచరిత్రలోను చర్చించిరి. కాని రాయలమంత్రియైన తిమ్మరుసు నకు నల్లుఁడైన నాదిండ్ల యప్పామాత్యునకుఁ దనకావ్య మంకితముచేసిన మాదయ్యగారిమల్లన రాయలవారి యాస్థానములోని వాఁడుకాఁగా, రాయల యల్లుఁడగు రామరాజుయొక్క సభలోను కాలములోను ఉన్న రామరాజ భూషణ పింగళి సూరన్నలు రాయలయాస్థానములో నేలయుండఁగూడదో

తెలియకున్నది. తెనాలి రామలింగకవియొక్క కాలనిర్ణయము చేయుటకుఁ దగినసాధనము లేవియు దొరకలేదు. కావున నాతఁడు రాయలకాలములో నుండెనో లేదో చెప్పఁజాలము.

సంస్కృతభాషకు భోజవిక్రమ ప్రభుత్వములును, ల్యాటిన్ భాషకు అగస్టస్ చక్రవర్తి పాలనయు, ఇంగ్లీషునకు ఎలిజాబెథ్ రాణియొక్క రాచరికపు దినములును, ఎట్టు శుభప్రదములో తెలుఁగునకుఁ గృష్ణరాయనికాలమట్టిదియే. అప్పుడు తెలుఁగులో స్వతంత్రప్రబంధరచన ప్రారంభింపఁబడెను. అంతకుఁ బూర్వపు తెలుఁగుకవులు సంస్కృతగ్రంథములను తెలిఁగించుటయే తమపని యని తలఁచిరి. ఈ కాలపుకవులు సంస్కృత గ్రంథములోనుండి కొంచెము కథగ్రహించి దానిపై స్వతంత్రకావ్యరచన చేయసాగిరి. రసపోషణమే యీ కాలపు కావ్యముల ముఖ్యలక్షణము. ఈ కాలపు కవులలో నొక్కఁడగు మాదయగారిమల్లన కావ్య ముండవలసిన విధము నిట్లు వర్ణించి యున్నాఁడు.

క. చెప్పఁదగుఁ గవిత రసము
లుప్పొంగ నప్పప్ప బళిబళి - యనఁ లేదా
యెప్పుడు చెప్పక యుండుట
యొప్పు సుమీ సుకవి యెంత - యుచితజ్ఞుఁడో కో.

ఇదియే యీ కాలపు కవిత్వముయొక్క సామాన్యలక్షణము. రాయల యాస్థానమందలి కవులను సంగ్రహముగా వర్ణించెదను. రాయల యాస్థానములోని కవీశ్వరులలో నగ్రగణ్యుఁ డల్లసాని పెద్దన. ఇతనికి “ఆంధ్రకవితాపితామహుఁ” డన్నబిరుదు కలదు. ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; చొక్కనామాత్యుని పుత్రుఁడు; బళ్లారి ప్రాంతములయందున్న దోపాడు పరగణాలోని దోరాలగ్రామ మీతనిజన్మస్థలము. ఇతనిని రాయలవారు మిగుల గౌరవించుచుండిరి. ఇతఁడు ‘మనుచరిత్ర’ మనుకావ్యమును

రచించి కృష్ణరాయలకు సంకితము చేసెను. ఈ కావ్య మందుకొను వేళ రాయలు కవీశ్వరునిఁ బల్లకిలోఁ గూర్చుండఁబెట్టి తనచేతఁ బల్లకి యెత్తెను. కవిగండ పెండెర మీతనికాలికి రాయలు స్వయముగాఁదొడిగెను. ప్రబంధములలో మనుచరిత్రము మొదటిది. శైలి మధుర మైనదియు సులభ మైనదియుఁగా నున్నది. ద్రాక్షాపాకమున కిది మార్గదర్శి. రాయలవా రీకవికి కోకట గ్రామ మగ్రహారముగ నిచ్చిరి. ఇతఁడు రాయల తరువాత ౧౫౩౫ ప్రాంతమునఁ గాలధర్మము నొంది యుండును.

నందితిమ్మన్న.—ఇతనినే ముక్కు తిమ్మన్న యనియెదరు. రాయల కీతనియందును మిక్కిలి గౌరవముకలదు. ఇతఁడు 'పారిజాతాపహరణ' మను కావ్యము రచించి రాయల కంకితమిచ్చెను. ఇతఁ డారువేల నియోగి బ్రాహ్మణుఁడు; కౌశిక గోత్రుఁడు; నంది సింగన్నకును తిమ్మాంబకును పుత్రుఁడు. 'ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు' అను వాక్యములో నీతనికవిత్వ లక్షణము చక్కఁగఁ జెప్పఁబడియున్నది. ముఖ్యముగా నితనికావ్యములోని ప్రథమాశ్వాసము ముద్దులు గుల్కెడిమాట లనెడు తేనియతో నిండియున్న రసమంజరి.

అయ్యలరాజు రామభద్రుఁడు.—ఇతఁడు కృష్ణరాయలవారి యనుజ్ఞ ననుసరించి సకలకథాసారసంగ్రహమను తెలుఁగుకావ్యము రచించెను. రాయల మరణానంతర మితఁడు నలువది యేఁబది సంవత్సరములవఱకు బ్రతికి యుండెను. రామాభ్యుదయ మనుకావ్యమును రచించి రామరాజు నల్లుఁడగు గొబ్బూరు నరసరాజున కంకిత మిచ్చెను. * మొదటికావ్య మంతరసవంత

* కృష్ణరాయని యల్లుని యల్లునకుఁ గావ్యమిచ్చిన రామభద్రుఁడు రాయల కాలములోనుండుట స్పష్టముగాఁ గానవచ్చుచుండఁగా రాయల యల్లుని కాలపువారగు రామభూషణుఁడును పింగళి సూరన్నయు రాయల కాలములో లేనే లేరని కొంద ఱెట్లువాదించెదరో తెలియకున్నది.

ముగా లేదు. కాని యీరెండవకావ్యమగు రామాభ్యుదయము మిక్కిలి ప్రౌఢకావ్యము; శబ్దార్థాలంకారములచే శోభితమైయున్నది. ఇతఁడాఱు వేల నియోగి బ్రాహ్మణుఁడు.

ధూర్జటి.—ఇతఁడు పాకనాటి యాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. ఇతనిది కాళహస్తి కాఁపురము. ఇతఁడు కాళహస్తిమాహాత్మ్యమను నాలుగాశ్వాసములుగల కావ్యమొకటి రచించి కాళహస్తీశున కంకితము చేసెను. ఇతని కావ్యముయొక్క చక్కఁదనమున కాశ్చర్యపడి రాయలవారు

చ. స్తుతమతియైన యాంధ్రకవి - ధూర్జటిపల్కులకేల గల్గెనో
యతులిత మాధురీ మహిమ?

అని యడిగిరని చెప్పెదరు.

మాదయగారిమల్లన.—ఇతఁడు శైవబ్రాహ్మణుఁడు; కొండవీటిపురవాసుఁడు; రాజశేఖరచరిత్రమను మూఁడాశ్వాసముల కావ్యముఁ రచించి తిమ్మరుసు నల్లుఁడగు నాదిండ్ల యప్పామాత్యున కంకితము చేసెను. సుకవి యగువాఁడు కవిత్వముఁ జెప్పినచో రసము లుప్పతిల్లునట్లుగాఁ జెప్పవలయును, లేదా యూరకుండవలయు నని యీకవి ప్రతిజ్ఞ చేసి యాలాగుననే కావ్యమంతయు నల్లెను. కావ్యము చిన్నదైనను ఇదియొక యద్వితీయగ్రంథము. * జాతీయపదములఁ జక్కఁగ యోగ్యమైనచోట నుపయోగించి రసభావము లాలోకించు శక్తి యితనికున్నట్లితరులకు లేదనవచ్చు. ఇందుల కిచ్చట నొక

* ఈకావ్యము మొన్న మొన్నటి వఱకుఁ దెనుఁగువారికి లభించినది కాదు. బ్రహ్మశ్రీ వీరేశలింగము పంతులవారు కొలఁదికాలముక్రిందట తంజావూరు పుస్తకాలయములోనుండి దీనిప్రతియొకటి సంపాదించి యచ్చువేయించిరి. కావునఁ దెనుఁగువారు దీనిని జక్కఁగాఁ జదివినట్టు కానరాదు.

చిన్న పద్య ముదాహరించుచున్నాను. ఇది యత్తవారియింటికిఁ బోవు మానినికిఁ జేసినబోధ:—

క. మూసినముత్యము వైకడు
వాసియు వన్నెయును గలిగి - వరుఁ డౌ ననఁగా
నీసకలబంధుకోటికి
బూసలలో దారమగుచుఁ - బొసఁగి మెలఁగుమీ.

పింగళిసూరన్న.—ఇతఁడు రాఘవపాండవీయాది మహాకావ్యములను రచించిన మహాకవి. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. ఇతనిది మొదటఁ గృష్ణా మండలములోని పింగళిగ్రామమైనను ఇతఁడు దక్షిణమునకుఁ బోయి కందనూలు (కర్నూలు) మండలములోని నంద్యాల, ఆకువీడు మొదలగు సంస్థానముల నాశ్రయించియుండెను. ఈ మహాకవిచే రచింపఁబడిన కావ్యములు ప్రస్తుతము మూఁడు గానవచ్చుచున్నవి: రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము. రాఘవపాండవీయములో రామాయణ భారత కథలు నిర్మింపఁబడినవి. క్లిష్టార్థములు లేకుండ సులభపదములతో నింతటి సులభశైలిని సంపూర్ణ శ్లేషగల యిట్టి ద్వ్యర్థికావ్యమును రచించుట యొక యలౌకికసామర్థ్యమని చెప్పవలసి యున్నది. కళాపూర్ణోదయ మను కావ్యమందు విచిత్రమయిన కల్పితకథకలదు. తెలుఁగులో నిట్టి నూతనకథా చమత్కారమును మఱియేకవియుఁ గల్పించినవాఁడుకాఁడు. కథానకవైచిత్ర్యమునందు దీనిని బాణభట్టకృతకాదంబరితోఁ బోల్పవచ్చును. ప్రభావతీప్రద్యుమ్నము 'చక్కని స్వభావోక్తులను గలదయి లలితపదఘటితమై కథాచమత్కృతి గలిగి చదువువారికిఁ గర్ణరసాయనముగా నుండెడు ప్రౌఢకావ్య'మని విద్వాంసులయభిప్రాయము. తిక్కన సోమయాజికిఁ దరువాత నింతప్రౌఢకావ్య రచనయందు సర్వతోముఖపాండిత్యముకల కవి యితఁడుతప్ప మఱి యొకఁడు లేఁడు.

రామరాజభూషణుఁడు.—ఇతఁడు వసుచరిత్ర మహాకావ్యకర్త. భట్టుమూర్తియనునది యితనికిఁ బేరనియు రామరాజభూషణుఁడన్నది రామరాజు సభలోనున్నందున వచ్చినబిరుదనియుఁ జెప్పెదరు. ఇతఁడు హరిశ్చంద్రనలోపాఖ్యానము నరసభూపాలీయము అనుగ్రంథములఁ గూడ రచించెను. ఇతఁడు కృష్ణరాయలకాలములో నుండిన నుండవచ్చును. రాయల యల్లుఁడగు రామరాజుకాలములోఁ బ్రసిద్ధుఁడయ్యెను. ఈ తనిచే రచింపఁబడిన వసుచరిత్ర యను కావ్యము కృష్ణరాయల రెండవ యల్లుఁడగు తిరుమలరాయలకు నంకితము చేయఁబడినది. ఇది ౧౫౭౦వ సంవత్సరమునకుఁ దరువాత రచింపఁబడెను. ఇయ్యది శబ్దార్థాలంకారశోభితంబగు నద్వితీయమహాప్రబంధము. యమకచ్ఛేకానుప్రాసాంత్యనియమాదులను బోనీయకుండ గ్రంథమునం దంతటను శ్లేషసాధింపఁబడినది. పాకము నారికేళపాకమైనను పద్యములు చెవులకెంతయు నింపుగను అర్థము తెలిసినతరువాత నాత్మకెంతయు సొంపుగను నుండును. అందుచేతనే యీ కావ్య మద్వితీయమని మూఁడువందలసంవత్సరములనుండి తెలుఁగుదేశములోఁ బొగడ్తఁగన్నయది. తరువాతి కవులందఱును తమకావ్యములను 'పిల్లవసుచరిత్రము' లనిపించుకొనుట ఘనతగా నెంచుకొనిరి. హరిశ్చంద్రనలోపాఖ్యానము ద్వ్యర్థికావ్యము. నరసభూపాలీయ మలంకారగ్రంథము.

తెనాలి రామలింగకవి.—ఇతఁడు ప్రథమశాఖాబ్రాహ్మణుఁడు. ఇతఁడు పాండురంగమాహాత్మ్యమను కావ్యమును రచించెను. ఇతఁడు రాయలయొద్ద నష్టదిగ్గజములలోనివాఁడె యని కథలున్నను ఇతనికాల మిదియని చెప్పుటకు వీలులేదు. ఈ కవి కృష్ణరాయల యాస్థానములో లేఁడని బ్రహ్మశ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. ఆవిషయ మింకను చింత్యము.

పైని వర్ణింపఁబడిన తెలుఁగుకవులుగాక తిమ్మణార్యుఁ డనుకర్ణాటకవి కన్నడములో భాగవతమును రచించి రాయల కంకితము చేసెను.

## శిల్పకళాభివృద్ధి.

రాయలవారు తనరాజ్యములో నూతన దేవాలయములను, నూతనమందిరములను, పట్టణములను, కాలువలను నిర్మించి శిల్పకళను మిక్కిలి యభివృద్ధి చేసిరి. రాయలు రాజ్యమునకు వచ్చినతోడనే యాతఁడు హంపెవిరూపాక్షములోని పంపాపతి దేవాలయమునకు గోపురముకట్టించెను. ఈ దేవాలయము మాధవాచార్యులకాలమందుఁ గట్టింపఁబడెనఁట. పూర్వ దిగ్విజయయాత్రకుఁ బోయి వచ్చిన తరువాత నీరాజుచే కృష్ణస్వామిదేవాలయమను గొప్పగుడి యొకటి కట్టింపఁబడెను (౧౫౧౩). ఆ సంవత్సరముననే రాయలు తనప్రాసాదపురటాంగణములో హజారారామస్వామివారి యాలయమును గట్టించెను. ఈ రాయలు విష్ణుభక్తి పరాయణుఁడై విఠలస్వామి దేవాలయమొకటి ప్రారంభించెను. ఇవి యన్నిదేవాలయములకంటెను చక్కని చెక్కడపుపనితో శోభితంబై యుండెను. విజాపురరాజ్యములో నున్న పంఢరిపురమునుండి కృష్ణరాయలు విఠలేశ్వరుని నెత్తుకొని వచ్చెననియు, మఱియొక భక్తుఁడు దానిని మరల దొంగతనముగా నెత్తుకొనిపోయెననియు, మహారాష్ట్ర భక్తవిజయములో నొకకథ కలదు. రాయల తరువాతిరాజులును ఈ యాలయమును నభివృద్ధి చేసిరి. ౧౫౨౮లోఁ గృష్ణరాయఁ డొకయుగ్రనరసింహమూర్తినిఁ జెక్కించెను. ఆ విగ్రహము మిక్కిలి పెద్దది; భయంకరముగా నుండును. తురుష్కులచే నెన్ని వేట్లనో పగులఁగొట్టఁబడినను ఈ విగ్రహమిప్పటికిని దర్శనీయమై యొప్పుచున్నది.

సస్యసమృద్ధికొఱకుఁ గృష్ణరాయలు ౧౫౨౧లో కొఱ్ఱగల్లునొద్ద నొకగొప్ప యానకట్ట కట్టించి యందుండి యొక కాలువయును మఱియొక కాల్వయుఁ

త్రవ్వించెను. అవి యిప్పటివఱకును జనులకు మిక్కిలి యుపయోగకరము లుగా నున్నవి. ఈ రాజు తన రాజధానిలోఁ బెద్దచెఱువొకటి త్రవ్వించెను. దాని నిమిత్తమై పోర్చుగీస్ ఇంజినియరొకఁడు గోవానుండి రప్పింపఁబడెను. ఈ చెఱువు త్రవ్వుటకు నిరువదివేల జనులు పనిచేయుచుండిరి. ఈ చెఱువు లోని నీరు సస్యసమృద్ధికి నుపయోగించుచుండిరి. మొదటఁ దొమ్మిదిసంవత్సర ముల వఱకును చెఱువు క్రిందిభూములు రైతులకు శిస్తులేకుండ నీయఁబడెను. తరువాత నాచెఱువువలన నిరువదివేల పరడావుల యాదాయము వచ్చు చుండెను. ఈ రాజు ప్రియురాలగు తన భార్యపేర 'నాగలాపుర'మనుచక్కని పట్టణ మొక్కటి కట్టించెను. ఇది విజయనగరమునకు సమీపమునఁ బ్రస్తు తము హాస్పేటయున్న స్థలమందుండెను. ఈ నగరములోఁ జక్కని సౌధములఁ గట్టుకొనవలసినదిగా రాజాజ్ఞాపించినందున రాజ్యములో ఘనతఁజెందిన సర దారులును, వర్తకులును ఆపురములోఁ జక్కనిమందిరముల నిర్మించిరి. కావున నది సౌందర్యమునకుఁ బుట్టినిల్లయ్యెను.

## రాజధానివర్ణన.

౧౫౨౦లో ఫిగరిడో యను పోర్చుగీసు రాయబారి విజయనగరమునకు వచ్చెను. అతనివెంట పెయిస్ అనువాఁడొకఁడుకలఁడు. ఇతఁడు తాను విజయ నగరములోఁ జూచిన యంశములన్నియు వ్రాసి యుంచినాఁడు. అందుండి యీ క్రిందియంశములు గ్రహింపఁబడుచున్నవి. అందువలన నాకాలమందలి విజయనగర వైభవము తెలియఁగలదు:—

'...ఆరాజ్యమునకు విజయనగరము రాజధాని. అందు రాజెపుడు నివ సించుచుండును. నగరమున కాఱుమైళ్లు కీవలనే యడ్డముగాఁ గొండలవరుస గలదు. దానిలోనుండి మార్గములుగలవు. వానికే ద్వారములనిపేరు. ఆ ద్వారములగుండ పోవలయునేగాని నగరములోనికిఁ బోవుటకు వేఱుమార్గ

ములులేవు. ఈ కొండల వరుస డెబ్బదిరెండు మైళ్ల పొడవుగలిగి యీ మహానగరమును జుట్టి యున్నది. ఈ పర్వతపంక్తికి లోపలనంటి చుట్టుకొనియున్న యితర పంక్తులనేకములు గలవు. ఈ పంక్తులలో నెచటనయిన సమభూమి యున్న యెడల నచట బలాఢ్యమగు గోడ కట్టఁబడియున్నది. ఈ రీతిగాఁ గొండలన్నియు మూసి వేయఁబడియున్నవి. జనులు నడుచుటకు బాటలేర్పఱుపఁబడి యీబాట లీ ద్వారములగుండ పోవును. ఈ ద్వారములకడఁ జిన్న గుహలు కలవు. అందుఁగూర్చుండి రక్షకభటులు ద్వారములను రక్షించుచుందురు. ఈ యావరణముల లోపల వరిమొదలగు ధాన్యములు పండునట్టి బయళ్లును, నిమ్మలు నారింజలు పనసలు మామిళ్లు మొదలగు ఫలవృక్షములతో నున్న తోటలును గల సారవంతములయిన భూములును గలవు. ఈ కొండల వరుసలకు మధ్యమున జలాశయములు పెక్కులు గలవు. వాని యాధారముల వలననే పై నుదాహరించినభూములు సాగుబడి చేయఁబడుచున్నవి ..... గోవా నగరమునుండి వచ్చిన బాటయొకటి మొదటికొండ వరుసలోఁ గల ద్వారములలో నొకద్వారముగుండ నగరములోఁ బ్రవేశించుచున్నది. పడమటి ప్రక్క నిదియే ప్రధానమైన ద్వారమగుటచేత గోడలచేతను బురుజులచేతను సురక్షితమై యొప్పెడు పట్టణమొకటి (నాగలాపురము) రాజుచే మొదటి పంక్తిలోపలఁ గట్టఁబడినది. ఈ ద్వారమున కుండుతలుపులును బురుజులును మిక్కిలి బలాఢ్యములయినవి. ఇతర నగరములలోని గోడలవంటివిగాక యీ గోడలు పాలగచ్చుచేయఁబడి వేఱెచటను గానరానట్టివిగా నున్నవి. లోపల మిద్దెటిండ్లవలె బల్లపఱుపుగానున్న కప్పులుగల సొగసయిన కట్టడములచే నిరుపార్శ్వములయం దలంకరింపఁబడి వీథులపంక్తులు రమ్యముగా నున్నవి.

'......నాగలాపురమునుండి విజయనగరమునకు నొకవీథి పోవుచున్నది. ఆవీథికి నిరుప్రక్కలను ఇండ్లవరుసలు చక్కఁగాఁ దీర్చియున్నవి. బాటసారు

లకు నీడనిచ్చుటకై వృక్షములు రెండుప్రక్కలను నాఁటింపఁబడి యున్నవి. ఈ వీధిలో సమస్తవస్తువులను విక్రయించు సంగడులు గలవు. ఈ వీధిలో రాజు సుందరమైన యనంతశయన దేవాలయమును గట్టించెను. ప్రభువులును సేనానులునుగట్టించిన దేవళములుఁగూడ గలవు. ఈ నగరముచుట్టును బరువు గల పెద్దరాళ్లతోఁ గట్టఁబడిన గోడ గలదు. అది మిక్కిలి బలాఢ్యమైనదిగాని ప్రస్తుతము కొన్నిచోట్ల శిథిలమైయున్నది. అందు సురక్షితములైయున్న దుర్గములు గలవు. ఈ గోడకు ప్రక్కను నచ్చటచ్చట పల్లపుప్రదేశములందు నీటిచే నిండింపఁబడిన కందకములుగలవు. దానికి వేఱుగా నట్టిదే మఱియొక గోడ గలదు. మనుష్యునిఱొమ్ముఁ దాఁకునంతయెత్తు గలిగి మొనలు తేలియున్నఱాళ్లు పాఁతిఁబడియున్నవి. ఈ గోడ కొండలకు మధ్యనున్న పల్లపు ప్రదేశములం దెత్తుగాఁ బెట్టఁబడి కొండలవఱకు వ్యాపించి యున్నది. ఈ గోడ మొదలు కొని నగరము ప్రవేశించుటకు మధ్యమున నెక్కువదూరముగలదు గనుక నా ప్రదేశములయందు వరిపొలములును తోటలును దొడ్లును నీళ్లకాలువలును గలవు. ఈ గోడయొక్క మొదటిపంక్తిగుండ నీరు ప్రవహించుచున్నయవి. ఏళ్లు పాఱుచుండుటవలనఁ జెఱువులు జలపూర్ణములైయున్నవి. ఇచట ఫల వృక్షములతోఁ గూడిన తోటలును, ఒక చిన్న తాళ్లగుంపును, అనేక గృహంబులును గలవు. నగరముయొక్క మొదటిద్వారముకడకు వచ్చుటకుముందు మీరొక నీటికాల్వనుదాఁటి మలుపుతిరిగిన బలాఢ్యమగు నొకఱాతిగోడవద్దకు వచ్చెదరు. ఈ ద్వారమున కిరుప్రక్కలనుండు రెండు బురుజులును దానిని గాపాడు చున్నవి. ఆద్వారము మిక్కిలి సొగసయినట్టియు, పెద్దదగు నట్టిదియునై యున్నది. ద్వారమునుదాఁటి లోపలకుఁ బోవఁగానే రెండుచిన్న దేవళములు గానిపించును. ఒక దేవాలయపు ప్రాకారములోపల వృక్షములును మఱియొక దేవాలయపు ప్రాకారములోపల నిండ్లును గలవు. ఈ మొదటిద్వారమునఁ గల కుడ్యము నగరమునంతను జుట్టి వచ్చుచున్నది. మఱి కొంత దూరము

పోయిన తోడనే మఱియొక ద్వారమును గోడయుఁ గానుపించును. ఈ గోడయును నగరమునంతను జుట్టివచ్చుచున్నది. ఇచటనుండి రాజభవనాంతఃపురమువఱకుఁ గల మధ్యభూమియందు వీధులును, ఇండ్లవరుసలు, సేనానులయొక్కయు ప్రభువరులయొక్కయు నందములగు మందిరములును గలవు. చూచుటకు వినోదకరములగు విగ్రహములతో నలంకరింపఁబడిన యిండ్లవరుసలు మనోజ్ఞములై యొప్పుచున్నవి. ముఖ్యమయినదగునట్టి పెద్దవీధిగుండ వెళ్లునపుడు రాయల యంతఃపురభవనమున కెదుటనున్న గొప్ప మైదానమునకుఁ గొనిపోవు ద్వారముగల ప్రధానమైనట్టి మార్గ మొకటి కలదు. దీని కెదురుగా మఱియొక మార్గము నగరముయొక్క రెండవ భాగమునకుఁ బోవుచున్నది. నగర మధ్యమున నుండి మిక్కిలి యుపయోగముగలది యగుటచేత నా మైదానముగుండ సరకులు మొదలగు వానినెక్కించుకొని బండ్లు నడపఁబడుచుండును. లిస్బాను (Lisbon) నగరదుర్గము [పోర్చుగల్ దేశపు రాజధాని] ఎంతస్థల మాక్రమించుకొనెనో యంతకంటె నెక్కువస్థల మాక్రమించుకొని రాయల మందిరము బలాఢ్యమై సురక్షితమైయున్న ప్రాకారము గలిగి యున్నది.

'ఇంకను గొంతదనుక నడచి యానకీ ద్వారముకడకుఁ బోయిన దానితో సంబంధించిన యిరుపార్శ్వముల రెండు దేవళములు గలవు. ఈ రెంటిలో నొకదానిద్వారముకడఁ బ్రతిదినమును గొఱ్ఱెలను జెక్కిఁ౦టని జంపుచుందురు. ఈ దేవళములకు దాపునఁ జిత్తరువులు చెక్కఁబడినట్టియు విగ్రహములతో నలంకరింపఁబడినట్టియు జయసూచకమయిన రథ మొకటి గలదు. సంవత్సరమున కొకసారి దేవతోత్సవమునాఁడు నగర వీథులగుండ రథము నూరేగింతురు. అది మిక్కిలి పెద్దదగుటవలన మూలలఁ దిరుగనేరదు. ఇంకను ముందు నడవ విశాలతయు సొగసునుగలదై, యిరుపార్శ్వములందు సుందరములగు గృహములవరుసలను గలిగియున్నదై, నే నిదివఱకు పైనుదహరించి వర్ణించిన వీధులం

బోలిన యొక వీధిగలదు. ఆ వీధులలోని గృహములు భాగ్యవంతులకు నివాసములయి యొప్పుచున్నవి. ఈ వీధిలో పణిజులు పెక్కుండ్రు నివసించుచున్నారు. ఇందు పెక్కురకముల కెంపులు, వజ్రములు, నీలములు, పచ్చలు, ముత్యములు, మొదలగు రత్నములును, వస్త్రములును, ఇంకను బ్రపంచములో దొరకునట్టి ప్రతివస్తువును విక్రయింపఁబడుచుండును. ప్రతి సాయంకాలము నొక సంతజరుగును. అచట సామాన్యములయిన గుడ్డములు, గుడ్డపుతట్టులు మొదలగు జంతువులు మాత్రమేకాక దబ్బపండ్లు, నిమ్మపండ్లు, నారింజపండ్లు ద్రాక్షపండ్లు మొదలగు ఫల వర్గమును విక్రయింపఁబడుచుండును.

ఆవీధికొనయందు మఱల నొకద్వారమును గోడయును గానిపించును. ఆద్వారములోనుండి పోయినయెడల నాకల నొకవీధి గానుపించును. అచట కర్షకరులు (పంచాణులు) పెక్కుండ్రు నివసించుచున్నారు. వార లనేకవస్తువులను విక్రయించెదరు. ఇచట రెండు చిన్నదేవళములు గలవు. ప్రతివీధియందును దేవాలయములు గలవు గాని ప్రధానములయినవియు గొప్పవియునగు దేవాలయములు నగరమునకు వెలుపలిప్రక్కనే కలవు.

వజ్రములు మొదలగు నమూల్యమణులయొక్కయు నితరవస్తువులయొక్కయు వర్తకము విరివిగా జరుగుచుండుటచేత నామహానగరమున నన్ని జాతుల మనుష్యులును గలరు. ఈ నగరవిస్తీర్ణతను గుఱించి నేనువ్రాయను. ఏలన నయ్యది యొక ప్రదేశమున నుండి చూచుటకుఁ గానరాదు. నే నొక కొండనెక్కి యెక్కువ భాగమును జూడఁగలిగితిని గాని పెక్కుకొండల పంక్తులకు మధ్యమున నగరమంతయు నిమిడియుండుటచేతఁ గొంతభాగము గానుపింప లేదు. అచటి నుండి చూడఁగా నాకుఁ గనుపట్టిన భాగము రోమకపురి (Rome, the Capital of Italy in Europe) యంతపెద్దదిగానుండి చూపునకు మిక్కిలి సుందరముగాఁ గానుపించినది. దానిలోపలఁ జెట్లగుంపులనేకములు గలవు. ఇండ్లకుఁ జేరినతోటలలో నీళ్లకాలువలును నచటచటఁ

చెఱువులును గలవు. రాజు తన యంతఃపురమందిరమునకు సమీపమునఁ ద్రాక్షవనమును, నానావిధ ఫలవృక్షములతోఁ గూడిన తోఁపులను గలిగి యుండెను. తురుష్కుల నివాసభూమికి దిగువ నొకచిన్ననదియును, మామిడి తోఁటలు, పోఁకతోఁటలు, పనసతోఁటలు, జామితోఁటలు, నిమ్మతోఁటలు, నారింజతోఁటలు మొదలగు తోఁటలు దట్టముగానుండి పెఱుగుచు, మహారణ్యమువలె నల్లుకొనియున్నవి. తెల్లద్రాక్షలుకూడ విశేషముగాఁ గలవు. నగరములోనికివచ్చునీరంతయు మొదటిప్రాకారమునకు వెలుపలనున్న, పయి నే నుదాహరించిన, చెఱువులనుండి తేఁబడుచున్నది. ఈ నగరములోని జనసంఖ్య లెక్కించుట కలవిగానిదిగా నుండుటచేతను నే నుదాహరించినఁ గల్పితముగాను నతిశయోక్తిగాను నుండుననుభీతిచేతను నుదాహరింప మానినాఁడను.

"ఇయ్యది (విజయనగరము) ప్రపంచములో సమస్త వస్తుసముదాయముచేతను నిండియున్న మంచినగరముగా నున్నయది. గోధుమలు, వడ్లు, అనుములు, పెసలు, కందులు, ఉలవలు మొదలగు ధాన్యములును, ప్రజలకాహారమై యీ దేశములో ఫలించు నితర ధాన్యములును సమృద్ధిగాఁ జేర్పఁబడి మిక్కిలి చౌకగా విక్రయింపఁబడుచున్నవి. ఇతర ధాన్యములవలె గోధుమలు మూరులచేఁ దక్క తదితరులచే నంతగా భుజింపఁబడుచుండలేదు. అందువలనఁ దక్కువగా నుండును. తప్పించుకొని పోవుటకు వీలులేనంత పట్టముగా బరువులు వేయఁబడిన యెడ్లు వీధులలోను బాజారులలోను లెక్కింప శక్యముగాక క్రిక్కిరిసి యుండును. కోళ్లు మొదలగుజంతువులు పెక్కులుగలవు.

"ఉత్తరమున నగరప్రాకారములకు వెలుపల సుందరతమంబులగు మూఁడు గొప్ప దేవళములుగలవు. అందొకటి విఠలస్వామి యాలయము. ఆనెగొంది పురమున కెదురుగాఁ గట్టబడియున్నయది. రెండవది హంపిదేవాలయ

మని సుప్రసిద్ధిఁగాంచిన విరూపాక్షాలయము. యాత్రికులచేనిది మిక్కిలి మహిమ గలిగినదిగాఁ జూడఁబడుచున్నది. ఈ దేవాలయములలోఁ దూర్పు గానున్న ముఖద్వారమున కెదురుగా మిక్కిలి సుందరమై యింపుగాఁ గట్టఁబడిన యిండ్లును వసారాలును గలిగి రమ్యమైనట్టివీధి యొకటి కలదు.

'ప్రధానపర్వదినము రాఁ దటస్థించిన కాలమున రాయలీ క్రొత్తనగరము నుండి (నాగలాపురము) విజయనగరమునకు వచ్చి యయ్యది రాజ్యమున కంతకు రాజధాని గావున నచట సమావేశమై యెల్లరతోఁ గలసి యాచార విధుల ననుసరించి విందులు మొదలగు వినోదములను జరిగించును. ఈ యుత్స వదినములకు రాజ్యములోనుండెడు నాటకత్తియలెల్లరను రప్పించెదరు. మఱియు రాజులను, మహాప్రభువులను, సేనానులను వారలరాణువలతోడను, పరివారముతోఁగూడను రప్పించెదరు. యుద్ధముచేయుటకై పంపఁబడి నట్టియు, రాజ్యములో దూరముగా నున్నట్టియు, ఉత్కలరాజ్యము యొక్కయు బీజపురరాజ్యముయొక్కయు సరి హద్దులకడ నున్నట్టియు సేనానులుమాత్రము రప్పింపఁబడరు. ఆ యుత్సవములలోఁ జేరిన నవరా త్రోత్సవములు (దశరాపండుగ) సేనానగరమున నుండినపుడు రాజభవన మున మిక్కిలి వైభవముతో జరుపఁబడినవి. రాజభవన మీాతీరున నున్నది. రాజభవనమునకు సేనిదివఱకుఁ బై నుదాహరించిన బయలునకుఁ బోవుటకై ద్వారమొకటి తెఱవఁబడియున్నది. ఈ ద్వారముపై నితరగోపురములకు వలెనే వసారాలు కలిగి కొంచెమెత్తుగల గోపురము గలదు.'

## రాజ్యవిస్తారము; రాజ్యవైభవము.

కృష్ణానదికి దక్షిణముననున్న దక్షిణ హిందూదేశమంతయు నీ రాజేక చ్ఛత్రాధిపత్యముతో నేలెను. ఇదిగాక తూర్పున కటకమువఱకును పశ్చి మోత్తరదిక్కుల విజాపురాది పట్టణములవఱకును దాడిపోయి ప్రబలశత్రుల

నందఱిని గెలిచెను. ఇతఁ డపజయమన్నమాట యెఱుఁగఁడు. ఈ విషయములో నితనిని 'క్రాంవెల్'తోఁ బోల్పవచ్చును. అందుచే నితనిజీవిత కాలమునఱకుఁ దురుష్కరాజు లెవరును తలయెత్తిన వారుకారు. ఇతనిరాజ్యమునందుఁ దొమ్మిదివందల మైళ్లు సముద్రతీరము గలదు.

ఈ రాజుయొక్క సైన్యాది వైభవములను గుఱించి పెయిస్ ఇట్లు వ్రాయుచున్నాఁడు:— "ఈ రాజునకు యుద్ధము చేయుటకుగాను పదిలక్షల సైన్యములు గలవు. వానిలోఁ గవచధారణము గలిగియున్న ముప్పదియైదువేల గుఱ్ఱపుదళము గలదు. ఈ సేనలకన్నిటికి రాజు జీతములిచ్చుచుండును. అగత్య మైనప్పుడు తా నేప్రదేశమునకుఁ బంపఁదలఁచినను పంపుట కే సమయమందయినను సిద్ధముగానుండును. అతనివద్ద సామజము లనేకములు గలవు. తనరాజ్యము చుట్టునుండు శత్రురాజులకుఁ దనపరాక్రమమును జూపవలసి వచ్చినప్పు డిరువదిలక్షల సైన్యమునయినను యుద్ధభూమికి రప్పింపఁగల సామర్థ్యముగలవాఁడని చెప్పుదురు. ఆ కారణమువలననే యీ రాజును జూచి శత్రురాజులును నెల్లవారును భయపడు చుందురు. ఇంత సైన్యమును రాజు దీసికొని పోయినపుడు దేశమునఁ బ్రజలు లేరని తలఁపరాదు. దేశము జనభూయిష్ఠమై యుండుటచేత నే వ్యాపారములకును భంగము కలుగ నేరదు. వృత్తులకు భంగము లేకుండఁ జేయువార నేకులు గలరు. ఇంకను నీ రాజ్యమున బ్రాహ్మణు లనేకులుగలరు. వారలు ఛావును గలిగించెదు నే పనికిని దూరముగానుందురు. వార లాయుధములను ధరించి యుద్ధముచేయరు. "ఈ రాజునకు వచ్చునాదాయ మెంత? ఇంతసైన్యమునకు జీతమిచ్చుటకీతని ధనాగార మెంతటిది?" అనియే రయిన నడుగవచ్చును. అధికముగా నాదాయములు వచ్చెడు ప్రభువు లనేకు లీతనికి లోఁబడిన వారలయి కప్పముగట్టుచున్న వారలు పెక్కండ్రు గలరు.

"ఈ ప్రభువులకు నగరములు పట్టణములు పల్లెలు మొదలగునవి పెక్కులు గలవు. పది పదునైదులక్షల పర్దావుల యాదాయముగాఁగల సేనాధిపతు లున్నారు. నూఱువేల పర్దావుల యాదాయము గలవారు కొందఱును, రెండు, మూఁడు, నాలుగు, అయిదు నూర్లవేల పర్దావుల వచ్చుబడికల వారు కొందఱును గలరు. రాజు నియమించిన ప్రకారము కాల్బలమును, గుఱ్ఱపుదళమును, సామజములను బోషించుచు రాజునకుఁ బన్నులుగూడఁ గట్టుచుందురు. ఈ సేనలెప్పుడును సిద్ధముగానుండి యెట్టికాలమునం దెక్కడకుఁ బంపినను బోవలయును. ఈ రీతిగా రాజు పదిలక్షల సైన్యము యుద్ధము చేయుటకు నెల్లప్పుడును సిద్ధముగా నుండునటులఁ జేసికొనెను. ప్రతి సేనాధిపతియుఁ దనక్రిందనుండు సైనికులకుఁ దానే జీతములిచ్చును గావున మంచివారిని ధైర్యశాలులను జేర్చుచుండును. ఈ సేనలలో నాకెక్కడను నొక్క పిఱికివాఁడయినను గానిపించలేదు. ఈ సేనలను బోషించుటయే కాక ప్రతిసంవత్సరము రాజునకు సేనాధిపతులగు ప్రభువులు కప్పము గట్టుచుండవలయును. ఇవిగాక రాజు సొంతసైన్యము నుంచుకొని వారలకు జీతబత్తెములు దానే యిచ్చుచుండును. ఎనిమిదివందల యేనుఁగులను, అయిదువందల గుఱ్ఱములను సొంతముగా నుంచుకొని వానికొఱకు నగరములోని వారిచేఁ గైకొనఁబడు పన్నులను వెచ్చపెట్టుచుండును. ఈ జంతువులకును వీనినౌకరులకును నెంత సొమ్ము వ్యయమగునో మీకుఁ దెలియును. దీనిని బట్టియే యీ మహానగరము చెల్లించెడు పన్నెంతయుండునో సులభముగా నూహించుకొనవచ్చును. ఈ రాజునకుఁ గొడుకుగాని కొమార్తగాని జన్మించుట తటస్థించినపుడు రాజునకులోఁబడిన ప్రభువులు విశేషద్రవ్యమును, ఆభరణములను కానుకలుగా సమర్పింతురు. ఈ యుత్సవదినములు ముగిసినతరువాత ననఁగాఁ బదునొకొండుదినములు గడచినతరువాతఁ బ్రజలును ప్రభువులును విందులుచేసికొని నూతన వస్త్రములను ధరించుకొని వినోదించుచుందురు. సేనాధిపతులు తమ

సైనికులకు మంచిబట్టలు బహుమానముఁజేసెదరు. ఆరోజుననే యీ ప్రభువులు రాజునకు విశేషద్రవ్యదానమును జేయుదురు. ఆరోజున రాజునకుఁ జెల్లింపఁబడు మొత్తము పదునయిదు లక్షల బంగారు పర్దావులుండునని చెప్పుదురు.”

## రాయలమనశ్శరీరంబులు.

కృష్ణరాయలు మిక్కిలి పొట్టివాఁడు గాఁడు, పొడువు వాఁడును గాఁడు. సామాన్యమైన యెత్తు గలవాఁడై చక్కని ముఖవర్చస్సును, సుందరాకారమును దృఢశరీరమును గలిగియుండెను. రాయలముఖముమీఁద స్ఫోటకపుమచ్చలు కలవు. పూర్ణసూచకమగు ముఖవికాసము చూచినవారికి నాతని యెడఁ బూజ్యభావము పుట్టించును. శరీరమును గట్టిపఱచి యుద్ధమునకుఁ దగినంతసుదృఢముగ నుంచుటకునై యాతఁడు ప్రతిదినమును శరీరసాధనముచేయుచుండెను. అన్నివిధముల సాములును, కుస్తీపట్లును రా జెఱుంగుటయేకాక దినదినమును అభ్యసించుచుండెను. విలువిద్యలోను ఖడ్గవిద్యలోను నాతఁ డారితేఱియుండెను. ఈతని విజయ కథలు పైనివర్ణించిన తరువాత నితఁడు శూరాగ్రేసరుఁడని మేము వేఱుగఁ జెప్పవలయునా? ఇతఁడు పవిత్రాచరణమునందుఁ బరమనిపుణుఁడని చెప్పవలయును. ‘గొల్లయిల్లాండ్రతో గోడగించుటఁ జేసి, పరకామినీ సహోదరతఁ జూప’నని ‘పారిజాతాపహరణమ్ము’ లోఁ జెప్పఁబడుటచే నీ రాజు పరస్త్రీయెడ సోదరీభావము కలవాఁడని చెప్పవచ్చును. ఇతఁడును ఇతనివంశమువారును వైష్ణవులు. ఇతఁడు విష్ణుభక్తాగ్రేసరుఁడని యితనిచే రచింపఁబడిన విష్ణుచిత్తీయము చెప్పుచున్నది. విష్ణువునందు భక్తిగలవాఁడయినను శివద్వేషి కాఁడు. శైవవైష్ణవుల నందఱిని సమానముగాఁ జూచెను. ఇతఁడు దయామయుఁడని రాయచూరుయుద్ధమే చెప్పుచున్నది. ఈతనికప్పుడప్పుడు కోపము విశేషముగా వచ్చుచుండెనఁట.

## రాయలకుటుంబము.

ఆంధ్రగ్రంథాదులనుబట్టి చూచినను పోర్చుగీసు గ్రంథములను బట్టి చూచినను రాయలకు ముగ్గురు పత్నులున్నట్లు కానవచ్చుచున్నది. చిన్నాదేవి, అన్న పూర్ణాదేవి, తిరుమలదేవి అని వారినామములు. ఇందు చిన్నాదేవికే యన్నపూర్ణాదేవి యని నామాంతరమని కొందఱు వ్రాసిరికాని యందు కేమియు నాధారములేదు. చిన్నాదేవి యొక వేశ్యాంగనయనియుఁ, గృష్ణ రాయలు రాజగుటకుఁ బూర్వమీమెయెడ ననురాగము గలవాఁడై 'నేను రాజ నగుదు నేని నిన్ను వివాహమాడి పట్టపురాణిని జేయుదు' నని మాట యిచ్చి తాను రాజ్యమునకు రాఁగానే యామెను వివాహమాడెననియు నన్నిజ్ వ్రాసియున్నాఁడు. అన్నపూర్ణాదేవి కటకరాజుకూఁతురు. తిరుమలదేవి శ్రీరంగపట్టణపురాజు కూఁతురై యుండును. రాయల కొకపుత్రుఁడు కలిగి యతఁడా రేండ్లుమాత్రము బ్రతికి మృతినొందెను. రాయలకు స్త్రీసంతానము కలదు. తిరుమలాంబిక యను రాయలకూఁతురు నరపతి వంశజుఁడగు రామరాజు వివాహమాడె. ఆతని తమ్ముఁడగు తిరుమలరాజు (వసుచరిత్ర కృతిభర్త) కృష్ణరాయల పుత్రిక యగు వెంగళాంబను ఉద్వాహమయ్యెను. రాయలకింకను బిడ్డ లున్నట్లు గానవచ్చుచున్నది. కాని వారిపేళ్లు తెలిసికొను నుపాయములేదు.

## చరమదశ.

కృష్ణరాయలు చరమదశయందు నా రేండ్లవాఁడగు తనకుమారునికిఁ బట్టాభిషేకముచేసి, తానుమంత్రిగాను, తిమ్మరుసు కార్యదర్శిగాను, తిమ్మరుసు పుత్రుఁడు సేనాధిపతిగను నుండి రాజ్యము చేయుచుండెను. కాని యెనిమిది నెలల తరువాత నాకుమారుఁ డేదోకారణమువలన మృతుఁడయ్యెను. తిమ్మరుసుకొమారుఁడు విషముపెట్టి తనకుమారునిఁ జంపెననితలఁచి రాజు తన్నుఁ

బుత్రునివలె గాఁచిన తిమ్మరుసును, అతనితమ్ముని, పుత్రునిఁ జెఱఁబెట్టించెను. తిమ్మరుసు పుత్రుఁడు తప్పించుకొనిపోయి రాయలమీఁద ధ్వజమెత్తెను. రాయలబలము లాతనితోఁ బోరాడి యాతనిని పట్టుకొనివచ్చెను. అంతఁ దిమ్మరుసుయొక్కయు, నతని కుమారుని యొక్కయు, తమ్మునియొక్కయు నేత్రము లతిక్రూరుఁడై రాయలు తీయించెను. తిమ్మరుసు చెఱసాలలోనే మృతుఁడయ్యెను.

ఇట్లు విజయనగరములో నంతఃకలహము గలిగినందున నిదిమంచిసమయమని తలఁచి విజాపురసుల్తానగు ఆదిల్ షాహ రాచూరు దుర్గమును తీసికొనవలయు నని దండెత్తి రాచూరు సమీపించెను. ఈ వార్త తెలిసినతోడనే రాయలు గుఱ్ఱము నెక్కి మహాకోపముతో రాచూరుమార్గమునఁ బోసాగెను. సైన్యములు వెనుకనుండిపోయెను. రాయలు వచ్చుచున్నాఁడనిన వార్త వినిన తోడనే యంతకుఁ బూర్వము దెబ్బతిన్నవాఁడు గనుక ఆదిల్ షాహ యదరి పడిలేచి పాఱిపోయెను. అంత రాయ లాసుల్తానునకిట్లు వర్తమానమంపెను; 'రెండుసారులు మాట తప్పితివి. ఇంకను నీవు 'నాకాళ్లుపట్టుకొనియెద ననిన' నీవాగ్దత్తమును నెఱవేర్పనందున నీతోయుద్ధముచేసి నిన్ను చెఱపట్టి నీయొద్ద నుండి బెల్గాముదుర్గమును స్వాధీనపఱుచుకొనియెద.' ఇట్లు మరల దాడివెడలుటకుఁ గృతనిశ్చయుఁడై యుద్ధసన్నాహము చేయుచుండెను. కాని యింత లోనాతనికిఁ గాలము సమీపించి యారాజమార్తాండుఁడు ౧౫౩౦ లోఁ గీర్తిశేషుఁ డయ్యెను. అదివఱ కితఁడు చెఱలోనుంచిన యాతని తమ్ముఁడగు అచ్యుతరాయలు విజయనగర సింహాసనమునకు అధిపుఁడయ్యెను.

## అచ్యుతదేవరాయలు.

(౧౫౩౦ - ౧౫౪౨.)

ఇతఁడు కృష్ణరాయలకు సవతి తమ్ముఁడు. ఇతఁడు పరాక్రమశాలి కాఁడు. పూర్వార్జిత రాజ్యమును గూర్చుండి యనుభవించిన వైభవశాలి.

ఈ రాజు తిన్నెవెల్లివఱకుఁ గలదక్షిణదేశమును గెలిచెనని కాంచీపట్టణము లోని రెండుశాసనములు చెప్పుచున్నను ఈ తని ప్రవర్తన మంతయుఁ జూడ నితఁడు పిఱికివాఁడనియు, దూరదృష్టి లేనివాఁడనియుఁ జెప్పవలసి యున్నది. రాజ్యమునకు రాఁగానే యీతఁడు మంత్రులమాట వినక తనబావ మఱఁదుల మాటలు విని స్వేచ్ఛాచారపరుఁడై వర్తింపఁజొచ్చెను. ఇట్లు రాజులకును మంత్రులకును మనస్తాపముకలిగెనని తెలిసికొని విజాపుర నవాబు మఱికొంద ఱిని వెంటఁబెట్టుకొని విజయనగరము మీఁదికి దండెత్తివచ్చెను. ఈ నవాబు కొలఁదిసైన్యముతో వచ్చినందున ఆతనిని పరాభవించుట యచ్యుతరాయలకు సులభమైయుండెను. సేనాధీశులుగూడ యుద్ధమున కనుజ్ఞ యిమ్మనివేఁడిరి. కాని తురుష్కులు నాగలాపురమును ధ్వంసముచేసినను రాయలు తన సైన్య ములకు యుద్ధమునకు సెలవిచ్చినవాఁడు కాఁడు. ఇంతియకాదు. సైనికులు వలదు వల దనుచుండఁగా నవాబునకుఁ గొంతధనమును, రాయచూరు ముద్గల్లు దుర్గములు నిచ్చి సంధిచేసికొనెను. రాచూరుదుర్గమును మూఁడు నెలలవఱకు ముట్టడించి యాదిల్ షాహ దానిని స్వాధీన పఱుచుకొనెనని ఫెరిస్తా వ్రాసి నాఁడు.

అచ్యుతరాయలు తాను నవాబున కిచ్చిన ధనమంతయుఁ దనప్రజలను బాధపెట్టి వారియొద్దనుండి రాఁబట్టెను. అందుచే లోకు లీతని మిగుల ద్వేషింపసాగిరి.

ఈ రాయలు గుళ్లు గోపురములకు దానములు విశేషముగాఁ జేసి శాసన ములు వేయించెను. ఈ రాయలు తంజావూరుపాలకుఁ డగు చెవ్వరాజునకుఁ దోడియల్లుఁడని విజయవిలాసములోని యీ క్రిందిపద్యమువలనఁ దేటపడు చున్నది.

తీవి నచ్యుతరాయల - దేవియైన
తిరుమలాంబకుఁ జెలియలై - తేజరిల్లు

మూర్తిమాంబను బెండ్లియై - కీర్తివెలసెఁ
జెవ్వవిభుఁడు మహోన్నత - శ్రీచెలంగ.

ఈ రాయలకాలమందుఁ గొండవీటిలో రామయామాత్య భాస్కరుఁడను మంత్రిపుంగవుఁడు అధికారిగా నుండెను. తిమ్మరుసువలెనే యితఁడు నియోగి బ్రాహ్మణుఁడు. :అసంఖ్య యవనవీరుల గెలిచిన వీరుఁడనియుఁ గర్ణునివంటి దాతయనియు నితఁడు విఖ్యాతిఁ జెందెను. కొండవీటిలోని గోపీనాథస్వామి వారిదేవాలయ ద్వారముమీఁద నీ మంత్రిపుంగవుని గుఱించిన యీ పద్య మున్నది:—

సీ. నిర్మించె నేమంత్రి - నిరుపమప్రాకార
నవకంబుగా గోపి - నాథపురము ।
గెలిచినాఁడేమంత్రి - లలితవిక్రమమునఁ
బ్రబలుఁడై యవనుల - బలమునెల్ల ।
నిలిపినాఁడేమంత్రి - నియతవైభవమున
గోపికావల్లభుఁ - గూర్మివెలయఁ ।
బాలించెనేమంత్రి - ప్రకటధర్మఖ్యాతి
మహిమమీఱఁగ నాంధ్ర - మండలంబు ।

గీ. నతఁడు భూపాలమంత్రీంద్ర - సతతవినుత ।
ధీవిశారదుఁడచ్యుత - దేవరాయ ।
మాన్యహితవర్తనుఁడు శౌర్య - మహితయశుఁడు ।
భానుతేజుండు రామయ - భాస్కరుండు ॥

ఈ మంత్రిపుంగవుని దానగుణమును వర్ణించుచాటుధార యొకటి కలదు.

మ. సరిచేసైరిపుఁడేల భాస్కరులు భా - షానాథపుత్రావనుం
ధరయందొక్కఁడు మంత్రి యయ్యెవినుకొం-డన్ రామయామాత్యభా

స్కారుఁడా? యా నతఁడే సహస్రకరశాఖల్ లేవవే యున్నవే
తిరమైదానముఁ జేయుచోరిపులహేతిక్ ద్రేయుచో వ్రాయుచోన్.

ఈ యచ్యుతదేవరాయలు మహారాజ్యవైభవమును అనుభవించెను. ఈతని యంతఃపురములో వాడఁబడు పాత్రలన్నియు బంగారముతోఁ జేయఁబడెను. పరుపులు పట్టుతోను దోమతెరలు వెండితీగెతోను చేయఁబడినవి. ఈతని యంతఃపురసంబంధమైన సేవకు లేఁబదివేలనుఱకుండిరి. ఇతని కైదువందల భార్యలుండిరఁట! అంతఃపురమునుగూర్చి నన్నిస్ ఇట్లు వ్రాసియున్నాఁడు:— ‘అంతఃపురములోని యాదాయవ్యయములను గూర్చినలెక్కలు వ్రాయుస్త్రీలు గలరు. రాచరికపువ్యవహారములను గూర్చిన చరిత్రములను వ్రాయుస్త్రీలు కొందఱుగలరు. సంగీతము నేర్చిన స్త్రీలును పెక్కండ్రుగలరు. రాయల భార్యలగు రాణులుసైతము సంగీతవిద్యయందుఁ బ్రవీణురాండ్రైయుండిరి.’ “ఇతని కాలమున రాజ్యమంతయు రెండువందల సామంతప్రభువులకు భాగింపఁబడి వారల యధికారమునకు లోఁబఱుపఁబడి వారలచేఁ గప్పములు గైకొనఁబడుచుండెను. వారిలోఁ బ్రధానులగువారిని గొందఱిని న్యూనీజు పేర్కొనియున్నాఁడు. వారిలోముఖ్యుఁడును ప్రధానియునగువాఁడు సలకము తిమ్మయ. ఇతఁడు చోళమండలము, నాగపట్టణము, తంజాపురి, దేవిపట్టణము, తిరుకోవెలూరు మొదలగు ప్రదేశములకు ప్రభువుగా నుండెను. ఈ పట్టణము లన్నియు సింహళద్వీపమునకు సమీపమునన్నవి. వీనివలన నాతనికిఁ బదు నొకొండులక్షల బంగారపు పర్దావులరాబడి వచ్చుచుండెను. ఇందులో మూఁడవభాగము రాయలకుఁ గప్పము గట్టుచుండును. ఇతఁడు రాయలకొఱకు ముప్పదివేల కాల్బలమును, మూఁడువేల గుఱ్ఱపుదళమును, ముప్పదియేనుఁగు లును బోషింపవలసియుండును. తనరాబడిలోఁ గప్పముపోఁగా రెండు వంతులలో నీ సైన్యమునకగు వ్యయమంతయును బోఁగా మిగిలినది మాత్రమే యాతని యాదాయముగాఁ బరిగణింపఁబడును. రాయలకు నాగ్రహాము

వచ్చినయెడల నీ యాస్తినంతయును స్వాధీనముఁ జేసికొనఁగలఁడు. ఉదయగిరి, కొండవీడు, పెన్నకొండ, కనిగిరి, సిద్ధవటము మొదలగు ప్రదేశముల కధికారియగు తిమ్మప్పనాయకునకు నెనిమిదిలక్షల పర్దావులయాదాయము వచ్చుచుండెను. ఇరువదియైదువేల కాల్బలమును, పదునైదువేల గుఱ్ఱపు దళమును, నలువదియేనుంగులును బోషించుచు రాయలకు మూఁడులక్షల పర్దావులపన్ను గట్టుచుండును. బీజపురసరిహద్దు భూముల కధికారిగానున్న గోపనాయకునకు నాలుగులక్షల పర్దావులరాబడి కలిగియుండెను. ఇరువదివేల కాల్బలమును రెండువేల యేనూఱు గుఱ్ఱపుదళమును, ఇరువదియేనుఁగులును బోషించుచు రాయలకు లక్షయునేఁబదివేల పర్దావులు గప్పముగట్టుచుండెను. వెంగాపుర దుర్గమున కధికారియగు లేపప్పనాయకునకు మూఁడులక్షల పర్దావుల యాదాయము వచ్చుచుండెను. ఇరువదివేల కాల్బలమును పంద్రెండువందల గుఱ్ఱపుదళమును, ఇరువదియెనిమిది యేనుఁగులను బోషించుచు రాయలకు నెనుబదివేల పర్దావులు గప్పముగట్టుచుండెను. విజయనగర సమీపదేశమున కధికారిగానున్న నరపరనాయకునకు నాలుగులక్షల పర్దావుల యాదాయము రాఁగాఁ బంద్రెండువేల కాల్బలమును, ఆఱువందల గుఱ్ఱపుదళమును, ఇరువదియేనుఁగులను బోషించుచు రాయలకు రెండులక్షల పర్దావులు గప్పముచెల్లించుచుండును. కొచ్చి మొదలగు దేశముల కధికారిగానున్న చిన్నప్పనాయకునకు మూఁడులక్షల పర్దావుల యాదాయము వచ్చుచుండెను. పదివేల కాల్బలమును ఎనిమిదివందల గుఱ్ఱపుదళమును బోషించుచు రాయలకు లక్షపర్దావులు గప్పముగట్టుచుండును. కృష్ణప్పనాయకుఁ డనువానికి నిరువదివేల పర్దావులు రాబడి కలిగియుండెను. ఏడువందల కాల్బలమును, అయిదువందల గుఱ్ఱపుదళమును బోషించుచు రాయలకు నేడువేల పర్దావులు పన్ను చెల్లించుచుండును. మళయాళదేశమున కధికారిగానున్న వాజప్పనాయకునకు మూఁడులక్షల పర్దావుల యాదాయము వచ్చుచుండెను. పదివేల కాల్బలమును, ఎనిమిది

వందల గుఱ్ఱపుదళమును, పదునైదేనుంగులను బోషించుచు పదివేల వర్హావులు రాయలకుఁ గప్పము గట్టుచుండును. కోలారుమండలములోని ఆనతిదుర్గమున కధికారిగానున్న మల్లప్పనాయకుఁ డనువానికి పదునైదువేలవర్హావుల యాదాయము వచ్చుచుండెను. ఆఱువేల కాల్బలమును, నాలుగువందల గుఱ్ఱపుదళమును బోషించుచు రాయలకు నయిదువేల వర్హావులు గప్పము చెల్లించుచుండెను. గుత్తిమండలమున కధికారిగానున్న ఆ దెప్పనాయకుఁ డనువానికి మూఁడులక్షలవర్హావు లాదాయము వచ్చుచుండెను. ఎనిమిదివేల కాల్బలమును, ఎనిమిది వందల గుఱ్ఱపుదళమును, ముప్పదియేనుఁగులను బోషించుచు నలువదివేలవర్హావులు రాయలకుఁ గప్పము గట్టుచుండెను. ముద్గల్లుదుర్గమున కధికారిగానున్న మఱియొక వాజప్పనాయకునకు నాలుగులక్షలవర్హావు లాదాయము వచ్చుచుండెను. పదివేల కాల్బలమును, వేయిగుఱ్ఱపుదళములు, ఏఁబదియేనుఁగులను బోషించుచు లక్షయు నేఁబదివేల వర్హావులను రాయలకుఁ గప్పము గట్టుచుండును.

"ఈ రీతిగా రెండువందల ప్రభువులకు దేశము పంచిపెట్టఁబడి వారల క్రిందనుండు భూములయొక్క వైశాల్యమునుబట్టియు, ఫలస్థితినిబట్టియుఁ గప్పములును వారలు పోషింపవలసిన సైన్యములయొక్క సంఖ్యయు నిశ్చయింపఁబడి యీ బలముయొక్క యౌన్నత్యమువలన విజయనగరరాష్ట్రము రాయలనెడు నీ హిందూచక్రవర్తులచేఁ బరిపాలింపఁబడుచు వచ్చినది. ఈ నిర్ణయప్రకారము ప్రభువులు గప్పములుగట్టక యుపేక్షించినయెడల వారల యాస్తులు గైకొనఁబడును. ఈ రాయలకు నిరువదివేల తర్జూలును పల్లకులును గలవు."*

* జీర్ణకర్ణాటరాజ్య చరిత్రము.

## సదాశివరాయలు.

(౧౫౪౨ - ౧౫౬౫.)

అచ్యుతరాయలు ౧౫౪౨ లో మరణమునొందెను. అతని కుమారుఁడు వెంకటరాయలనువాఁడు రాజయ్యెను. ఇతఁడు బాలుఁడు. మంత్రులలో రెండుకక్షలు పుట్టెను. ముఖ్యమంత్రియైన సలకముతిమ్మయది యొకకక్ష. అళియరామరాజుది యొకకక్ష. రాజ్యములోని ముఖ్యమంత్రులందఱును సలకము తిమ్మయకు ననుకూలులయినందున రామరాజు చేయునదిలేక విజయనగరమునువిడిచి తన జాగీరునకుఁబోయెను. సలకము తిమ్మయ బాలరాజునుజంపి తానే రాజయ్యెను. అంతఁ దక్కినసరదారు లాతనిపైఁ దిరుగఁబడి రామరాజును రప్పించిరి. అంత సలకము తిమ్మయ భయపడి యాదిల్‌షాహాకు నంకితుఁడ నయ్యెదనని తెలిపి యాతనిని రప్పించి, రాయల సింహాసనముమీఁదఁ గూర్చుండఁబెట్టెను. అంతఁ గార్యముచెడెనని రామరాజాదులు సలకము తిమ్మయయొద్దకుఁబోయి 'నీవు నవాబును ఎట్లైనను పంపివేసినయెడల మే మందఱము నీకు లోఁబడియుండెదము' అని బాసలుచేసిరి. ఆ మాటలునమ్మి సలకము తిమ్మయ నవాబునకుఁ గొంతధనమిచ్చి బతిమాలుకొని పంపివేసెను. నవాబు పోయినతోడనే రామరాజును ఇతరులయిన సరదారులును తిరుగఁబడిరి. ఇఁకఁ దాను బ్రతుకుట దుర్లభమని తెలిసికొని సలకము తిమ్మయ రాజభవనములోని గుఱ్ఱముల తోఁకలుకోయించియు, చెవులుకోయించియు, రత్నములను వినుత్త్రాళ్లలో వేయించి విసరించియు సొత్తును తనచేతనైనంతవఱకుఁ బాడుచేయించి, తానును పొడుచుకొని చచ్చిపోయెను. అంతఁ గృష్ణరాయల తమ్ముఁడగు సదాశివరాయలను రాజ్యముమీఁదఁ గూర్చుండఁబెట్టి రామరాజాతనికై రాజ్యముచేయఁజొచ్చెను. ఈ సదాశివరాయలును నింతకుఁబూర్వ రాజైన అచ్యుతరాయలును నరసరాజునకు ఓమాంబికవలనఁ గలిగిన పుత్రులు.

## నరపతివంశము.

సదాశివరాయలకాలములో నిజముగా రాజ్యముచేసినవాఁడు రామరాజు. ఇక మీఁద విజయనగరచరిత్ర యనఁగా నితనియొక్కయు నితనితమ్ములగు తిరుమలరాయ వెంకటాద్రులయొక్కయుఁ జరిత్రయే గావున వీరి పూర్వవృత్తాంతము కొంచెమిచ్చటఁ దెల్పవలయును. వీరు చంద్రవంశ పుత్రక్షత్రియులమనియుఁ బాండవులు తమ పూర్వులనియుఁ జెప్పుకొనుచుండిరి. చాళుక్యవంశజుఁడను కల్యాణపురాధీశుఁడును బసవనిచేఁ జంపఁబడినవాఁడును అగు బిజ్జలుఁడు వీరి పూర్వపురుషుఁడఁట. ఈ వంశమునకు మొదట నరపతివారని పేరున్నను వీరు ఆర్వీటిలోఁ బ్రభుత్వముచేయుచున్నందున వీరికి నార్వీటివారని గృహనామము కలిగెను. వీరి పూర్వులలో నార్వీటి బుక్కరాజు శూరాగ్రేసరుఁ డను ఖ్యాతి వడసెను. ఇతఁడు విజయనగరరాజులయొద్ద ముఖ్యసేనాధీశుఁడుగానుండి యనేకవిజయముల సంపాదించెను. సాళువనరసింహరాయలకు నీతఁడు కుడిభుజముగానుండెనని రామరాజీయములో నితనికీయఁబడిన 'సాళువ నరసింహరాయరాజ్య ప్రతిష్ఠాపనాచార్య' అను బిరుదువలనఁ దేలుచున్నది. ఈ బుక్కరాజునకు నిద్దఱుభార్యలు. బల్లాదేవి; అబ్బళదేవి. బల్లాదేవివలన నితనికి సింగరాజు మొదలయిన పుత్రులు పుట్టిరి. వారి కీతఁడు నంద్యాల (Nandyal) రాజ్యమిచ్చినందున వారిచ్చట నేయుండి 'నందేలవా' రైరి. కళాపూర్ణోదయమును కృతినందిన కృష్ణరాజీవంశములోనివాఁడే. బుక్కరాజు రెండవభార్యయగు బల్లాదేవివలన రామరాజనుపుత్రునివడసెను. ఇతఁడు మన రామరాజునకుఁ దాత. ఈ రాజు కందనోలు పట్టణమును గెలిచి దానిని తన రాజధానిఁ జేసికొనినట్లు రామరాజీయములోని యీ క్రిందిపద్యమువలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. మదకరికోకటి కిర్వది గుఱ్ఱములు గుఱ్ఱ
మునకును విలుకాండ్రు - ముగురు విచ్చు ।
కత్తులవా రీటి - కాండ్రట్ల వర్తిల్ల
నిట్టి యేనుఁగులును - జుట్టు మూఁడు ।
వేలయేనూఱు సుద్వృత్తితో నడవంగఁ
గందనోల్ సాధింపఁ - గాఁదలంచి ;
మొనఁద్రుంచి గట్టిగా - ముట్టడి దిగి సవా
బిబ్బని మిక్కిలి - యుబ్బణంచి ।
గీ. ప్రకటసప్తాంగములఁ గొని - రామవిభుఁడు ।
కందనోల్ రాజధానియుఁ - గాఁగ పనుమ ।
తియును సేలి మహాహవ - దీక్షఁ బూనె ।
బలిమి కలిమి నాశావనీ - పకులఁ బెనుప ॥

రామరాజీయమునందు నీ రాజునకు 'హల్లిసనే నోల్లాసిత సప్తశతసైంధవ గ్రహణపరాయణ, దుర్వారతరసవ్వాయి సైనికహరణ, సవాబిబ్బిరాజ సప్తాంగ హరణ మార్గచరణ, నిరవపాదవనీ దుర్గనివాసికాసపుడేయ దుర్మదఖులని ర్మథన' అను బిరుదులుకలవు. ఈ రాజుభార్యపేరు లక్కమాంబ. ఈ దంపతులకు తిమ్మరాజు, కొండరాజు, శ్రీరంగరాజు లని ముగ్గురుపుత్రులు కలిగిరి. అందుఁ దిమ్మరాజు అవుకు అనుగ్రామమునకు నధిపతియై, 'అవుకువారి'కిఁ బూర్వుఁడయ్యెను. కొండరాజు ఆదవానికిఁ బతిగానుండెను. మూఁడవవాఁడగు శ్రీరంగరాజు మన రామరాజునకుఁ దండ్రి. ఈతనిభార్యపేరు తిమ్మాంబ. ఈ దంపతులకు నైదుగురుపుత్రులు పుట్టిరి. కోనరాజు, తిమ్మరాజు, కృష్ణరాయల యల్లుఁడగు అళియ రామరాజు, వసుచరిత్ర కృతినందిన తిరుమలరాజు, వేంకటాద్రి. ప్రస్తుతకథానాయకుఁడగు రామరాజు శ్రీరంగరాజునకు మూఁడవకొమారుఁడు. ఈతనియన్నలగు కోనరాజు తిమ్మరాజులను గుఱించి మనకంతగా నేమియుఁ

తెలియదు. ఇతఁడు విజయనగరరాజ్యమును ఆక్రమించుకొనుటకుఁ బూర్వమే వారు మృతినొందియుందురు. రామరాజీకమీఁద దక్షిణములోని నవాబులను దిద్దిమ్మని జంత్రపుబొమ్మలవలె నాడించిన మహానుభావుఁడు. అతనివలన విజయనగర వైభవలక్ష్మి మహోన్నతదశకెక్కి యతనితో నశించెను. ఇఁక ముందు ముందు మేము వ్రాయఁబోవు విజయనగరచరిత్ర యంతయు నాతనిదె. కావున నిచ్చట నెక్కుడు వ్రాయనక్కఱలేదు. అతనిజన్మాదికములను గుఱించి వ్రాసినఁ జాలును. ఇతఁడు ౧౫౬౫ లో తొంబదియేండ్లవాఁడని కౌటో యను చరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. ఈ మాటయే నిజమైన యెడల నితఁడు ౧౪౮౯ లో జన్మించియుండును. ఇతనికి నలుగురు భార్యలున్నట్టు రామరాజీయమువలనఁ దెలియుచున్నది. కృష్ణరాయల పుత్రికయగు తిరుమలాంబ, జిల్లేళ్ల పెదనందిరాజు కూఁతురగు అప్పలాంబ, పోచిరాజు తిమ్మరాజు సుతలగు కొండలమ్మ లక్ష్మమ్మలు. రామరాజునకు వీరిలోఁ దిరుమలాంబికవలనఁ గృష్ణుఁడు, పెదతిమ్మరాజు అను కొమారులును, కొండమాంబవలన కొండరాజు. రాచూరుదుర్గాధ్యక్షుఁడగు చినతిమ్మరాజు అనుపుత్రులను, లక్ష్మాంబవలన శ్రీరంగరాజును గడసెను. వీరందఱును తండ్రివలెనే రణశూరులయి తండ్రికి యుద్ధములలోఁ దోడ్పడుచుండిరి.

## రామరాజుప్రభుత్వము.

(౧౫౪౨ - ౧౫౬౫.)

ఇట్లు సదాశివరాయలను పేరునకు రాజునుజేసి రామరాజు ప్రభుత్వము చేయఁదొడఁగెను. శూరాగ్రేసరులగు తమ్ములును పుత్రులును తనకుఁ దోడై యుండ నిరుపద్రవముగా సంవత్సరములవఱకును నేకాధ్వరముగఁ బరాజయమన్న మాట యెఱుఁగక విజాపురాదినవాబులందఱును గజగజవడఁకునట్లు ప్రతాపమును గనఁబఱచెను. ఇతఁడు నవాబులలో నొక్కొక్కప్పు డొక్కొక్కని వశపఱుచుకొని యితరులను సాధించుచుండెను. ఆకథాభాగమును వర్ణించు

టకుఁ బూర్వము చదువరుల సౌకర్యార్థమై యప్పటి తురుష్కనవాబుల వివ రము తెల్పెదను.

విజయనగరరాజ్యమునకు నుత్తరమున నాలుగు తురకరాజ్యములుండెను. మొదటిది ఆదిల్ శాహీ యనఁబడు విజాపురరాజ్యము. దీనికి ఇబ్రాహీం ఆదిల్ శాహ యనువాఁడు సుల్తానుగానుండెను. రెండవది నిజాంశాహీ యను పేరుగల అహమ్మదనగర రాజ్యము. ఈ రాజ్యముయొక్క యప్పటియధిపతి పేరు బుర్హాన్ నిజాంశాహ. మూఁడవది కుతుబ్ శాహీ యనిపేరుగల గోల కొండరాజ్యము. జమ్షీద్ కుతుబ్ శాహ దీని కధిపుఁడు. నాల్గవది బరీద్ శాహీ యనఁబడు బేదర్ రాజ్యము. దీని నప్పుడు అలీబరీద్ పాలించుచుండెను. ఫెరిస్తాచరిత్రమును బట్టి చూచినను మొదటి ముగ్గురు నవాబులను, రామరాజు నతని తమ్ములును ఓడించినట్లును తమచేతులలో నుంచుకొన్నట్లును గానవచ్చు చున్నది. బరీదుశాహనుగూడ రామరాజు తమ్ముఁడైన వేంకటాద్రి యోడించెనని వసుచరిత్రలోని యీ క్రిందిపద్యములనఁ గానవచ్చుచున్నవి.

తే. అనుమఁగడు మెచ్చి జయలక్ష్మి - యాజిరంగ
కాతరబరీదుకేతన - ఘటితసౌధ
కలశమెదురుగఁ బూనియే - ఘనునిఁజెండె
నతఁడు సామాన్యుఁడే వేంక - టాద్రివిభుఁడు..

రామరాజు రాజ్యమునకు వచ్చినతోడనే తమ్ములును తానునుబోయి ఆధ వాని దుర్గమును సాధించినట్లు వసుచరిత్రవలనఁ గానవచ్చుచున్నది (౧౫౪౮-౯). ఇది మొదట వీరిక్రిందనేయున్నను నడుమ తురకలు వశపఱుచుకొనిరి కాఁబోలును.

## ఆదిల్ షాహతో వైరము.

౧౫౪౩ లో బురహాన్ నిజాంషాహ రామరాజుతోను జమ్షీద్ కుతుబ్ శాహతోను స్నేహముచేసి యాదిల్ శాహమీఁదికి యుద్ధమునకుఁబోయెను.

రామరాయలు తనతమ్ముఁడగు వేంకటాద్రిని విజాపురరాజ్యము మీఁదికిఁబంపి రాయచూరుదుర్గమును, కృష్ణాతుంగభద్రా నదులనడుమ నున్న యంతర్వేదిని సాధింపుమని యాజ్ఞాపించెను. కుతుబ్‌శాహాయును విజాపురము వానితోఁ బోరఁజొచ్చెను. ఇట్లు విజాపురరాజ్యమును ముగ్గురు రాజులు మూఁడుదిక్కుల నుండి, దోఁచుకొనసాగిరి. విజాపురనవాబంతభయపడి నిజాంశాహాతోను రామరాజుతోను సంధిచేసికొనెను.

౧౫౪౪ లో రామరాజు ప్రేరేపణవలన నిజాంశాహా మరల విజాపురము మీఁదికిఁబోయెను. కాని పరాభూతుఁడయ్యెను.

## పోర్చుగీసువారితో సంధి.

౧౫౪౭ లో సదాశివరాయలకును పోర్చుగీసువారికిని సంధిజరిగెను. ఈ సంధివిషయికమైన కాగితములో సదాశివరాయల పేరున్నను నిజముగా నిది యంతయు రామరాయలపనియె యనుటకు సందేహము లేదు. ఈ సంధిలోని యంశము లిట్లుండెను. (౧) ఈ యుభయులలో నొకరి మిత్రులు మఱియొకరికి మిత్రులుగను, ఒకరిశత్రులు మఱియొకరి శత్రువులుగను నెంచవలయును. హిందూదేశములోని యేరాజుతోఁ బోరాడవలసివచ్చినప్పుడును ఒకరికొకరు సైన్యమునంగియుఁ బంపి సహాయము చేయవలయును. (౨) గోవాపట్టణమునకు వచ్చెడి యరబ్బీ పారసీకదేశముల గుఱ్ఱములన్నియు విజయనగర రాజునకే యీయవలయును. విజాపురమునకు ఒకటైనను బంపఁగూడదు. విజాపుర రాజు తగినవెల యీయవలయును. (౩) విజాపురవర్తకులందఱును పోర్చుగీసువారి రేవులలో పోవునట్లును, విజాపురమువారి రేవులకుఁ బోకుండఁగను విజయనగరరాజు ఏర్పాటుచేయవలయును. (౪) ఇనుముసురాకారములు విజయనగరరాజ్యములోనివారు విజాపురరాజ్యములోనుండి తేఁగూడదు. పోర్చుగీసువారియొద్దనే కొనవలయును. (౫) బట్టలు, రాగి, పట్టు మొదలగునవియు

పోర్చుగీసువారియొద్దనుండియే కొనవలయును. (౬) ఇద్దఱునుగలిసి యాదిల్ శాహాతోఁ బోరాడి వచ్చినరాజ్యమంతయు విజయనగరరాజులు తీసికొనవలయును. సముద్రపుటొడ్డు రేవులు మాత్రము పోర్చుగీసువారి కీయవలయును. విజయనగరరాజ్యములోని రేవులలోనికిఁ దురకలయోడలు వచ్చినేని వానిని పట్టుకొని పోర్చుగీసువారికి నొప్పగింపవలయును.

## తురుష్కుల కాశ్రయమిచ్చుట.

తురకరాజ్యములలోనుండి పాఱిపోయివచ్చిన యవనులకు నభయమును నాశ్రయమును నిచ్చి రామరాజు తన రాజధానిలో నుంచుచుండెను. అట్టివారి కొక వీథి కట్టించి దానికి 'తుర్కీమొహల్లా' అనఁగాఁ 'దురకలవీథి' యని పేరుపెట్టెను. వారికి మసీదు కట్టించియిచ్చెను. జమ్‌షీద్ కుతుబ్‌షాహ యొక్క తమ్ముఁడగు ఇబ్రాహీం అనువాఁడు అన్న తన్నుఁ జంపునేమోయని భయపడి పాఱివచ్చి విజయనగరములోనుండెను. రామరాజాతనికి నొకజాగీరిచ్చి గౌరవముతోఁ జూచుచుండెను. ఇతఁడె తరువాత ౧౫౫౦ లో 'ఇబ్రాహింకుతుబ్‌శాహ' (మల్కిబరాం) అనుబిరుదుతో గోలకొండకు రాజయ్యెను.

## ఆదిల్‌శాహాతో మరలఁ బోరుట.

నిజాంశాహ రామరాయలకుఁ గట్నములును గానుకలును బంపఁగా వానిని తీసికొని యతఁడందుకొనెను. ఈసమాచారము తెలిసి యాదిల్‌శాహ కోపోద్దీపితుఁడై తన సభలోనున్న విజయనగరపు రాయబారులను నగౌరవపఱిచెను. అందుమీఁదఁ రామరాజునకు మిక్కిలి కోపమువచ్చి యతఁడు నిజామశాహను విజాపుర సుల్తానయిన ఆదిల్‌శాహమీఁదికిఁ బ్రేరేపించెను. వాఁడు రాయలసైన్యసహాయమునుబొంది కల్యాణదుర్గమును వశపఱచుకొనెను. అంత నాదిల్‌షాహ నిజామషాహయొక్క యొక దుర్గమును వశపఱచుకొనఁగా ౧౫౫౧ లో నిజాము

శాహయును రామరాజులునుగలిసి రాయచూరుదుర్గమును ముట్టడించి సాధించుటయెగాక ముద్గల్లును కైవసముచేసి కృష్ణాతుంగభద్రలనడుమ నున్నయంతర్వేది యంతయు గెలిచిరి. ఇట్లుమరల నీయంతర్వేది హిందువుల స్వాధీనమాయెను. ఈతడవ రాయచూరుయుద్ధములో రామరాజునకు నాల్గవకుమారుఁడయ్యిన చినతిమ్మరాజు మిక్కిలి పరాక్రమముఁజూపినట్లును, అతఁడు తరువాత నాదుర్గమునకు నధిపతిగా నేర్పఱుపఁబడినట్టును రామరాజీయములో నీ క్రింది పద్యములవలనఁ గానవచ్చుచున్నది.

క. రామారి విభుఁడు తనదుక
రాచూరిని రిపులఁ దునుమ - రంజిలు శుభసం
సూచకములు దోడ్తోడను
రీచయమునకును బ్రమోద-స్ఫూర్తి పలిర్పెన్.

ఉ. నారదవింటె చిత్రమిది - నారకవాసులు గాక దేవతా
వారిజగంధులం గలిసి - పత్తురు నగ్గొలువంగ ధేనుసం
హారులు మ్లేచ్ఛులన్న విను - మా సురవల్లభ యాజిభూమి రా
చూరి పురీశు తిమ్మవిభు - నుగ్రకరాసిని మగ్గఁగాఁజుమా.

## తమ్ములు తిరుగఁబడుట.

ఈ కాలమందనఁగాఁ ౧౫౫౧ వసంవత్సర ప్రాంతమున రామరాజు రాజధానిలోలేనప్పు డతని తమ్ములగు తిరుమలరాయవేంకటాద్రులు తిరుగఁబడి యాదవానీదుర్గమును వశపఱుచుకొనిరనియు నంత రామరాజు ఇబ్రాహీం కుతుబ్ శాహాయొక్క సాహాయ్యమును దీసికొని యాఱునెల లాదుర్గమును ముట్టడించి సాధించెననియుఁ, దమ్ములు శరణువేఁడఁగా వారిని రామరాజు క్షమించెననియు మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియున్నారు.

## నిజాముతో వైరము ; ఆదిల్ శాహాతో స్నేహము.

బుర్ హాన్ నిజాంశాహ ౧౫౫౩ లోఁ గాలధర్మమునొందెను. హుసేన్ నిజాంశాహ యనువాఁడు నవాబయ్యెను. కొంతకాలమువఱకు నహమ్మదునగర విజాపురనవాబులు స్నేహితులుగా నుండిరి. కాని విజాపురనవాబు రామరాయలతో స్నేహముచేసి నిజాముమీఁదికి దండెత్తిపోయి షోలాపురమునొద్దఁ బరాభవముచెందెను.

విజాపురనవాబు రాజ్యములోని సరదారుఁడగు సైఫ్అయిన్ ఉల్ ముల్క్ అనువాఁడు తిరుగఁబడి నవాబునోడించెను. అంత నవాబు రాజధానికిఁ బాఱిపోయి రామరాజుసాహాయ్యముఁగొని యేడులక్షల పరడావులు బహుమతిగా నిచ్చెను. ఆ దుష్టునిశిక్షించి నవాబును గాపాడుటకు రామరాజు తనతమ్ముఁడైన వేంకటాద్రినిఁబంపెను. ఆతనినిమోసపుచ్చి యొకాయికి మీఁదఁబడవలెనని ద్రోహియగు ఐన్ ఉల్ ముల్క్ యత్నించెను. కాని వేంకటాద్రి జాగరూకతతోనుండి యాతనినోడించి నైజామురాజ్యములోనికిఁ దఱిమెను. అచ్చట నతఁడు చంపఁబడియెను (౧౫౫౫).

విజాపురనవాబుతో వైరమున్నందున పోర్చుగీసువారు అబ్దుల్లాయను రాజపుత్రునికి గోండాయనుచోట విజాపురరాజ్యమునకు నవాబుగాఁ బట్టాభిషిక్తునిఁజేసి యా రాజ్యములో నతనికై పన్నులు రాఁబట్టఁదొడఁగిరి. కాని యాదిల్ శాహ విజయనగరపువారి సాహాయ్యమువడసి పోర్చుగీసువారితోఁ బోరాడి యబ్దుల్లాను స్వాధీనపఱుచుకొనెను (౧౫౫౫-౧౫౫౬).

౧౫౫౭ లో విజాపురనవాబగు ఇబ్రాహీం ఆదిల్ శాహ మరణమునొందెను. అతని జ్యేష్ఠకుమారుఁడగు అలీఆదిల్ శాహ నవాబయ్యెను. ఈ నవాబు రాజ్యమునకురాఁగానే తనతండ్రివలెనే రామరాజుతో మైత్రిచేసి తనతండ్రి కాలములోఁబోయిన రాజ్యమును మరల సంపాదింప నిశ్చయించెను. రామ

రాయల కుమారుఁడొకఁడు మరణమునొందఁగా నీ యాదిల్ శాహ యదియే స్నేహము దృఢపఱుచుకొనుటకుఁ దగిన సమయమని తలఁచి రాయలదుఃఖోపశమనముఁ జేయుటకై నూఱుగుఱ్ఱములనుమాత్రము వెంటఁదీసికొని విజయనగరమునకుఁబోయి దుఃఖోపశమనవాక్యములు పలికి నన్ను మీపుత్రునిఁగాఁ జూచుకొమ్మనియెను. రామరాజుభార్య ఆదిల్ శాహను పుత్రభావమునఁ బెంచుకొనెను. అప్పటినుండియు రామరాజును ఆదిల్ శాహయును పితృపుత్రులవరుసతో నొకరినొకరు పిలుచుకొనుచుండిరి. ఈ పుత్రుఁడే తుదకుఁ దాళికోటలోఁ దండ్రిని మోసపుచ్చిచంపించెను. ఆ కథాభాగమటుండనిండు. రామరాయలును నవాబును మిక్కిలి గౌరవించి మూఁడుదినములవఱకు విందులు వినోదములు సల్పిపంపెను. రామరాజు నవాబునుబంపునపుడు పట్టణము వెలుపలవఱకును వెంటఁబోనందున నవాబునకుఁ గోపమువచ్చెను గాని యది వెలుపలికిఁ జూపఁడయ్యెనని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు.

౧౫౫౮ లో రామరాజు ప్రస్తుతము చెన్నపట్టణమునొద్దనున్న మైలాపురి మీఁదికి దాడివెడలెను. అప్పుడా రాజ్యమంతయు విజయనగరపురాజుల ప్రభుత్వములోనిది. అచ్చటఁ బోర్చుగీసువారు 'సెంట్ థోం' అనుగోవాకేథలిక్ దేవాలయముకట్టి, నాగపట్టణము మొదలు మైలాపూరువఱకుఁ దమతమబోధనుజేయుచుండిరి. అప్పటికింకను ఇంగ్లీషువారు రాలేదు. అప్పుడు ప్రస్తుతపు చెన్నపట్టణము పుట్టనేలేదు. మైలాపురిలోనున్న క్రైస్తవగురువుల యొద్ద మిక్కిలి ధనముకలదనియు, వారు హిందూదేవాలయములను బాధ చేయుచున్నారనియు బ్రాహ్మణులు చెప్పినందున రామరాజు మైలాపురి మీఁదికిఁబోయెను. కాని యచ్చటికిఁ బోయినతరువాత నచ్చటి పాద్రీలందఱును తనకులోఁబడి వినయవిధేయతతోనున్న రాజభక్తులని తెలిసినందున నాతఁడు వారిని బాధపెట్టకయె తిరిగివెళ్లెను. ఈ సమాచారము కౌటోయను ఇతిహాసలేఖకుని గ్రంథమునుండి కైకొనఁబడినది.

విజాపురనవాబు విజయనగరమునుండి తిరిగి రాఁగానే, తనపూర్వులయొద్ద నుండి తీసికొనిన 'కల్యాణీ' 'షోలాపుర్' పట్టణములు తనకిచ్చివేయవలసిన దని, నిజాంశాహాకు వర్తమాన మంపెను. ఆ వర్తమానము తీసికొనిపోయిన దూతను నిజాంశాహ యగౌరవించి చెప్పుటకువీలులేనట్టి యశ్లీలపు ప్రత్యుత్తరమంపెను. అంత రామరాజును విజాపురి నవాబునుగలిసి అహమ్మదనగర రాజ్యముమీఁదికి దండెత్తిపోయి దేశమునంతను ధ్వంసముచేసిరి. అహమ్మద్ నగరము మొదలు దౌలతాబాదువఱకును, పరెండె మొదలు ఖిబర్ వఱకును, నొక్కగ్రామమైనను లేకుండఁ బాడుచేసిరి. ఈ యుద్ధములో హిందువులు తమకు ముసల్మానులయెడఁగల కోపమంతయుఁ దీర్చుకొనిరి. తురుష్కస్త్రీలను నగౌరవపఱచిరి. మసీదులనుఁబడఁగొట్టిరి. కురాన్ ధర్మగ్రంథములనుఁజించివేసిరి. ఇట్టివర్తనమే హిందువులకుఁ దరువాతఁగల్గిన పరాభవమునకు బీజారోపణము నుమీ. ఇట్లు రామరాజును ఆదిల్‌శాహాయుఁ దనరాజ్యమును గాల్చివేయఁగా విధిలేక నిజాముశరణుచొచ్చి సంధివేఁడెను. నిజాము స్వయముగా రామరాయల శిబిరమునకు వచ్చి కల్యాణదుర్గముయొక్క తాళపుచెవి యిచ్చునట్లొడఁబడి, యదేప్రకారము చేసెను. ఇట్లు రామరాజు విజాపురనవాబుసైన్యములు తన్నుఁగొల్వ నిజాము నొద్దనుండి కల్యాణపట్టణమును బడసెను. ఈ చరిత్రాంశములు తెలిసికొని వసుచరిత్రలోని రామరాజును గుఱించిన యీ క్రింది పద్యమును చదువరులు చూతురేని యిందు స్వభావోక్తితప్ప మఱేమియు లేదని తెలిసికొనఁగలరు.

శా. విశ్వామిత్రుని గొల్చి రాముఁ డతఁ డుర్వీం జెందెఁ గల్యాణమున్
విశ్వామిత్రులు గొల్వ రాముఁ డితఁ డుర్వీం జెందెఁ గల్యాణమున్
శశ్వత్కీర్తులు రాము లయ్యిరువురున్ - సాధించుకల్యాణలా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథనధర్మాలంబనవ్యక్తముల్.

ఇట్లు కల్యాణదుర్గమును తనదత్తపుత్రుఁడైన యాదిల్ శాహాకొఱకు సాధించి రామరాజు విజయనగరమునకు వెడలెను. కాని నిజాముఁడు కల్యాణ దుర్గమును వదలలేక వెంటనే ఇబ్రాహీంకుతుబ్ శాహాతో సంధిచేసికొనెను. ఇద్దఱునుబయలుదేఱి కల్యాణదుర్గము మీఁదికిఁ బోయిరి. కాని రామరాజును ఆదిల్ శాహాయుఁ దమసైన్యములతోఁ బోయి వారిని నెదిరించిరి. ఈ తడవ రామరాజువెంట నేఁబదివేలగుఱ్ఱములును, నసంఖ్య కాల్బలమునుగలదు. దీనినిఁ జూచి భయపడి ఇబ్రాహీం (ఇభరాం) కుతుబ్ శాహా తనస్నేహితుఁడగు నిజామునువిడిచి రామరాజుతోఁ జేరెను. ఇట్లు వీరుముగ్గురునుజేరి తఱుమఁగాఁ బాఱిపోయి నిజాము తనరాజధానిఁజేరెను. ఈ కథాభాగమును మనస్సులో నుంచుకొనియె రామరాజభూషణుఁడు రామరాజునువర్ణించుచు నిజామును గూర్చి యిట్లు వ్రాసినాఁడు.

సీ. ప్రబలాగ్రలేపవి-గ్రహజాయమానాగ్ర

హము డించి బహుభావ-నాప్తిఁగాంచు ।

* * *

రతినిభరామాను-గతమైత్రిపై రోసి

కలనైనఁ గల్యాణ - కాంక్షయిడఁడు ।

మానక నిజాముఁ డపసర్గ - మార్గస్ఫూర్తి

బెరయు పరబుద్ధి నెవ్వాని - పేరుతలఁచి ।

యతఁడు శ్రీరాముఁ డఖిలస-న్నుతికిఁ దగఁడె

సేతుకాశీతలాంతర-ఖ్యాతయశుఁడు.॥

శ్లేషసాధించి చరిత్రాంశములింత చక్కఁగాఁ జెప్పుట దుర్లభముకదా!

# మహమ్మదీయ మహాయుగము.

నిజాము తనరాజధానియగు అహమ్మదునగరములో డాఁగెను. ముగ్గురురాజులును ఆ నగరమునకు ముట్టడివేసిరి. లోనికి వస్తుసామగ్రులు పోనందున లోనివారికి నిబ్బందికలుగఁజొచ్చెను. కాని గోలకొండనవాబు కొంతవఱకు లోపాయికారిగా నిజామునకు ధాన్యముపంపినందున వర్షాకాలమునాఁటికు లోనివారు వశులుగాకపోయిరి. అంతముట్టడివారులేచి తమతమతావులకుఁ జనిరి. ఈ తడవయు రామరాజుసైనికులు తురుష్కులకుఁ గోపమువచ్చునట్లుగాఁ బ్రవర్తించిరి. మసీదు లనేకములు పడఁగొట్టి దేవాలయములు చేసిరి. అందువలన మిక్కిలి శత్రువైన నిజాముకేగాక మిత్రులైన విజాపురమువారికిని హిందువులయెడ ద్వేషముకలిగెను.

నిజాముతో జరిగిన యుద్ధములలో రామరాయలవెంట నాతనికొమారులగు పెదతిమ్మరాజు కొండరాజులనువా రుండి పరాక్రమముఁజూపినట్లు రామరాజీయములోని యీ క్రిందిపద్యములవలన మనమూహింపవచ్చును.

ఉ. ధ్యేయుఁడు రామరాజ పెద-తిమ్మవిభుం డని వాజిఁదోలి లోఁ
బాయని భీతిచేత మొన - భగ్నముగా యవనుల్ దొలంగ నా
చాయ నిజాముఁ డడ్డపడ - సామజయూథముఁ ద్రుంచెఁ జూపఱుల్
వాయఁజుఁడంచు నెంచఁగ న-వార్యసముజ్జ్వలబాహుశౌర్యుఁడై.

క. పెదతిమ్మనృపతి మఱియును
మదకరిహరివీరభటస - మాజముతోడం
గదనమునఁ గదియు తురకల
నదమదముగఁ దునిమెబాహు-సంరంభమునన్.

ఉ. మావులు నేనుఁగుల్ భటస-మాజము పీనుఁగుపెంట గాఁగ నం
గానలినుండి కృష్ణదను - కానొనరించి నిజాముఁ దోలిరా
మావనినాథుకొండవిభుఁ - డాహవకేళిఁ జరించెఁ జూచి యా
దేవత లెల్ల నీఘనుఁడు - దేవవరాత్మజుఁ డంచు నెంచఁగన్.

## తురుష్క రాజుల నగౌరవించుట.

ఇట్లెటుచూచినను తనకు దిగ్విజయములే కలుగుచున్నందునను తురకరాజులు తన సాహాయ్యమునే యెప్పుడును కోరుచున్నందునను రామరాజునకు గర్వము హెచ్చి తురుష్కరాజు లన నొక లెక్కయా యని యనుకొనఁజొచ్చెను. క్రమముగా అహమ్మదనగర విజాపురరాజ్యములలోనుండి కొంతదేశమును తీసికొనెను. గోలకొండ రాజ్యములోని ఘూన్‌పుర, పానగల్లు లనుదుర్గములను స్వాధీనపఱుచుకొనెను. క్రమముగాఁ దురుష్కరాజ్యములనన్నిటిని మ్రింగివేయ నిశ్చయించెను. ఇంతియకాదు. ఆనవాబులయొద్దనుండి వచ్చెడి రాయబారులను పూర్వమువలె మన్నించుటమాని తన యెదుట వారు నిలిచియుండు నట్లును తనతోఁ బ్రయాణము చేయునపుడు తనయాజ్ఞలేనిది గుఱ్ఱ మెక్కఁగూడదనియు నాజ్ఞాపించెను. తమ రాయబారుల నగౌరవించుటయు దమరాజ్యమును నాక్రమించు కొనుటయుఁ జూచి తురుష్క నవాబులు మేల్కాంచి తమప్రక్కనున్న యీ హిందూరాజ్యమును శల్యమును పెఱికివేయ నిశ్చయించిరి.

### నవాబులందఱును నేకమగుట

మొదట నాదిల్‌శాహ రామరాజుతోఁ బోరనెంచెను కాని యందఱు తురుష్కరాజు లేకమైనఁగాని విజయనగరరాజును సాధించుట దుర్లభమని యెంచి యాతఁడు గోలకొండ నవాబునకు వర్తమాన మంపెను. అతఁడందులకు సమ్మతించుటయేగాక నిజామునకును ఆదిల్‌శాహకును తరతరములనుండిగల వైరముమాన్పి వారికి మైత్రికల్పించెను. వారిస్నేహము దృఢముగా నుండుటకై నిజాము తనకూఁతురైన చాంద్‌బీబీని అలిఆదిల్‌శాహకిచ్చి వివాహముచేసెను. ఆమెకు షోలాపురదుర్గ మరణముగానిచ్చెను. ఆదిల్‌శాహయొక్క చెల్లెలిని నిజాము పెద్దకొమారుఁడైన ముర్తిజాయనువాఁడు వివాహ మాడెను. ఇట్లు

బంధువులై అహమ్మదనగర విజాపుర నవాబులు గోలకొండ నవాబుతోఁ జేరి యుద్ధసన్నాహము చేయఁదొడఁగిరి. బెదర్ నవాబయిన బరీద్ శాహాగూడ వీరిలోఁజేరెను.

ఆదిల్ శాహా యిట్లు రామరాజు వినాశమునకై యత్నముచేసి పైకి మాత్రము 'నేను మీ కుమారుఁడను తండ్రికిద్రోహము చేయుదునా? నేను మీఁదికి వారిలోఁ గలిసియుండెదను. యుద్ధసమయమున వారికి ద్రోహముచేసి మీలోఁగలిసెదను' అని రామరాజు పత్రమానమంపినప్పుడు ప్రత్యుత్తర మంపుచుండెను! ఈ యంశము పెరిస్తా వ్రాయలేదు. ఒక మరాటీబఖరులో నున్నది.

పైని వర్ణించినట్లు నలుగురు నవాబులు సైన్యసమేతులై యుద్ధమునకుఁ గాల్దువ్వుచు విజాపురమునొద్ద మైదానములో విడిసిరి. యుద్ధమునకుఁ గారణము వలయును గాన నాదిల్ శాహా 'నారాజ్యములోనుండి మీరుతీసికొన్న దుర్గముల నిండు'అని రామరాజునకు వార్తఁబంపెను. రామరాజా వార్తఁ దెచ్చిన దూతను నగౌరవించి పంపివేసెను. అంత నా నలుగురు నవాబులును తమసైన్యములతో దక్షిణదిక్కునకు బయలుదేఱిరి (౨౫వ డిసెంబరు ౧౫౬౪). ఈ సముద్రమువంటి సైన్యసమూహము, గుఱ్ఱముల కేనుఁగులకును మేఁతదొరకు నట్టి దక్షిణదేశపు మైదానములు దాఁటుచుఁ దాళికోటదుర్గమును సమీపించెను. తాళికోట ద్రోణనది యొడ్డున నున్నది. ద్రోణనది కృష్ణలోఁ గలిసిన చోటికిఁ బదునాలు మైళ్లమీఁదను ప్రస్తుతము చెన్నపట్టణమునుండి బొంబాయికిఁబోవు నినుపదారికిఁ గృష్ణానది యెచ్చట నడ్డమువచ్చునో యచ్చోటినుండి పశ్చిమమున నరువదియైదు మైళ్లమీఁదను నీ తాళికోటదుర్గము కలదు.

అచ్చోట నీమహమ్మదీయ సైన్యములు కొన్నిదినములు నివసించి యది యాదిల్ శాహారాజ్య మగుటఁజేసి యాతని యాదరాధిక్యమును బొందుచు

యుద్ధమునకుఁదగిన వ్యూహములను గుదుర్చుకొనుచుండెను. కృష్ణానది దాఁటుట కిచ్చట వీలయిన రేవు కలదో చూచివచ్చుటకు వేగులవారినిఁ బంపిరి.

## హిందూసైన్యముల రాక.

అట్లు రామరాయల కీనర్తమానమంతయుఁ దెలిసినందున నతఁడును యుద్ధమునకుఁ దగినప్రయత్నము చేసియుండెను. రాజ్యములోని యన్నిభాగములనుండియు సైన్యముల రావించి యేఁబదిలక్షలకాల్బలమును లక్షగుఱ్ఱములును చేర్చెను. తన చిన్నతమ్ముఁడగు తిరుమలరాయనికి లక్షకాల్బలము నిరువదివేల గుఱ్ఱములు నైదువందల యేనుంగులును నిచ్చి ముందుఁబంపి శత్రువులు కృష్ణానదిని దాఁటకుండ నన్నిరేవులను గాపాడుమని యాజ్ఞాపించెను. తిరుమలరాజు వెనువెంట రామరాజు తనయింకొక తమ్ముండగు వేంకటాద్రిని గొప్పసైన్యముతోఁ బంపెను. తుదకు రామరాజును మిగిలిన సైన్యముతో యుద్ధభూమికి నెడలెను. అప్పుడు రామరాజు తొంబదియేఁడు సంవత్సరములవాఁడని చరిత్రకారులు వ్రాసియున్నారు.

## తాళికోట మహాయుద్ధము.

(౧౫౬౫.)

వేగులవాండ్రు వచ్చి కృష్ణానది పొడుగున నున్న రేవులన్నియు హిందువులచే రక్షింపఁబడుచున్నవనియు నప్పుడు నవాబుసైన్యము లున్నస్థలమునకు నెదుట నుండు రేవునకే పోవుట మంచిదనియు నవాబులతోఁ జెప్పిరి. వారట్లుచేయ నిశ్చయించిరి. కాని యా రేవునకు నెదుటను హిందువుల సైన్యములు ఫిరంగులతోఁ గాచియుండెను. కావున వారిని మోసపుచ్చుటకై నవాబు సైన్యము లచ్చటినుండి కదలి కొంతదూరము నడచి పోయెను. తురుష్క సైన్యములు నదికి నావల నెట్లెట్లు నడిచెనో హిందూసైన్యములు నదికి నీవల నట్లట్లె నడిచి

వారెచ్చట నేఁడుదిగ యత్నించిన నచ్చట నెదిరించుటకు సిద్ధముగానుండెను. కాని నవాబుసేనలు మరల వచ్చి శిబిరముచేరెను. ఇట్లు రెండుమూఁడు దినములు శిబిరమును విడిచి నది పొడుపునఁ బోయినట్లు నటించి యా రేవునొద్ద నున్న హిందూసైన్యము లింకొక కోటికిఁ బోవునట్లుచేసి మూఁడవదిన మెకా రొంకి వెనుకకుఁ బోయి యా రేవుననే తురుష్క సైన్యములు, నదిని దాఁటెను.

ఇట్లు వారుదాఁటిన మఱునాఁడు అనఁగా క్రీ.శ. ౧౫౬౫ వ సంవత్సర మందు జనేవరి నెల ౨౩ వ తేది మంగళవారమునాఁ డుభయ సైన్యములకును ఘోరమైన యుద్ధముజరిగెను. దానికి తాళికోటయుద్ధమని పేరు. తాళికోటఁ గృష్ణానదికి నుత్తరమున నున్నది. ఈ యుద్ధమానదికి దక్షిణమునజరిగెను. అయినను తొలిదినమువఱకు నవాబుసైన్యములు తాళికోటసమీపమున నుండి నందునఁ దురుష్కచరిత్రకారు లీ యుద్ధమునకు తాళికోటయుద్ధమని పేరు పెట్టిరి. ఈ యుద్ధము రాక్షసతేఁగ్ అనుచోట జరిగెనని మరాటి బఖరీలో వ్రాయఁబడి యున్నది.

మహమ్మదీయుల సైన్యము దక్షిణపువైపు ముఖముచేసి నిలువఁబడెను. హిందువు లుత్తరపు వైపుముఖముచేసి యుండిరి. తురక సైన్యములోఁ గుడి వైపున అలీ ఆదిల్ శాహాయును, నడుమ హుసేన్ నిజాంశాహాయును, ఎడమవైపు అలీ బరీద్ శాహాయు, ఇబ్రాహిం కుతుబ్ శాహాయును తమతమ సైన్యములతో యుద్ధసన్నద్ధులై యుండిరి. వీరికి నెదుట హిందూసైన్యములలోఁ గుడివైపున ననఁగా మహమ్మదీయ సైన్యములో నెడమ వైపునున్న బెదర్ గోలకొండల నవాబులకు నెదురుగా వేంకటాద్రియు, నడుమ రామరాజును ఎడమవైపున ననఁగాఁ దురుష్క సైన్యములోఁ గుడివైపుననున్న విజాపురనవాబునకు నెదురుగాఁ దిరుమలరాయఁడును తమతమ సేనలతోఁ గయ్యమునకు సంసిద్ధులై యుండిరి. తురకసైన్యమునకు వెనుకవైపున కృష్ణానదియు హిందువులకు వెను

కవైపు దక్షిణ దిక్కనియు ఆదెల్‌శాహ తిరుమలరాయ లెదురెదురుగానున్న వైపు పశ్చిమ మనియు, కుతుబ్‌శాహ బెరీద్‌శాహాలను వేంకటాద్రి యెదిరించినవైపు పూర్వనియు చదువరులు దిశలు జ్ఞప్తి నుంచుకొనియెదరుగాక. తురుష్క సైన్యముయొక్క మధ్యభాగమందు ఫిరంగులుండెను. మధ్యనున్న నిజాంశాహాకు నెదుట మూఁడు వరుసలుగా నాలుగువందల ఫిరంగులును జజాయీలును అమర్పఁబడెను. ముందు వరుసలోఁ బెద్దఫిరంగులుండెను. రెండవ వరుసలోఁ జిన్నఫిరంగులుండెను; వాని వెనుక జంబాయి లనఁబడు పెద్దతుపాకులుండెను. ఫిరంగు లిట్లమర్చినసంగతి శత్రువులకుఁ దెలియకుండ వాని యెదుట రెండువేల పరదేశీయులగు విలుకాండ్రను నిలుపఁ బెట్టిరి.

విలుకాండ్రు మొదట యుద్ధము ప్రారంభించిరి. హిందూసైన్యముయొక్క మధ్యభాగముమీఁద నీ విలుకాండ్రు శరవృష్టి కురిపించిరి. అంత హిందువులు వారితోఁ బోరుచు వారిని సమీపింపఁగా నావిలుకాండ్రు తొలఁగిరి. శతఘ్నులు హిందువులపై నగ్నివర్షమును గురిపింపసాగెను. అంత హిందువు లాఁగలేక యెక్కువ జనమును గోలుపోయి వెనుకకుఁ బోయిరి. కాని కుడియెడమ వైపులనున్న హిందూసైనికులు మిక్కిలి పరాక్రమముఁజూపి ముసల్మానులను వెనుకకు ద్రోల్చిరి. ఇట్లుభయపార్శ్వములను హిందువులే విజయులైనందున మధ్యభాగమును కొంచెము శ్రమపడి సాధించిన జయలక్ష్మి మనదేయని యెంచి హిందువు లపూర్వశౌర్యముతోఁ బోరసాగిరి. తనసైనికులకుఁ బ్రోత్సాహము కలిగించుటకై రామరాజు మేనాలోనుండి దిగి యెత్తుగ రత్నమయమైన యొక గద్దియపైఁ గూర్చుండెను. ఈ సింహాసనము మీఁద బంగారపు జరీతోను ముత్యపుజాలరులతోను నలంకరింపఁబడి కెంపురన్నె మకములుబట్టుకోఁ జేయఁబడిన ఛత్రముండెను. అచ్చటికిఁ బళ్లెరములతో రత్నములు వజ్రములు ముత్యములు వరహాలు రూపాయలు మొదలయిన ధనమెంతయో తెప్పించి తన చుట్టును పళ్లెరములలోఁ బెట్టుకొని యుద్ధములోఁ బౌరుషము కనఁబఱచిన

శూరులకు వారివారి శౌర్యముయొక్క యోగ్యతనుబట్టి బహుమతు లొసంగెను. హిందువులు తురుష్కుల మధ్యభాగములోని ఫిరంగుల మీఁదికిఁ బోయిరి. కాని వారు సమీపింపఁగనే ఫిరంగులలో రాగి డబ్బులువేసి తురుష్కులు కొట్టిరి. అంత నైదువేలహిందువులు ఫిరంగుల యెదుటఁబడి మరణమొందిరి. మిగిలినవారు చిందరవందరైరి. ఇంతలో నిజాము సైన్యములోనుండి యైదువేల గుఱ్ఱపురౌతులు హిందూసైన్యములోనికిఁ జొరఁబడిరి.

ఇట్లుభయపార్శ్వముల హిందూసైనికులు విజయులగుటయు నడిమి వారు మాత్రము ఫిరంగుల నెదిరింపలేక మరలుచుండుటయుఁ జూచి రామరాజు తాను స్వయముగా వెళ్లి సైనికులఁ బ్రోత్సాహపఱుపవలయునని మేనాయెక్కి బయలుదేఱెను. కాని యతని దురదృష్టదేవత యెదురుపడెనో యన నొక యేనుఁగు బెదరివచ్చి రామరాజెక్కిన మేనాఁమీఁదఁబడెను. బోయీలు భయముచే మేనాను విడిచివేసిరి. క్రిందఁబడిన రామరాజు లేచి గుఱ్ఱమెక్కఁ బోవఁగా నిజాముశాహా సైనికులు వచ్చి యాతనిఁ జెఱపట్టి నిజాముశాహా యొద్దకుఁ గొంపోయిరి. అతఁడు రామరాజు మస్తకము వెంటనే తునిమి దానిని బల్లెమునకుఁ దగిలించి యెత్తి హిందూసైన్యమునకుఁ జూపెను. రామరాజు పడినతోడనే హిందువులు గతధైర్యులై యెచ్చటివారచ్చటఁ బాఱిపోసాగిరి. తురుష్కులు వెంటఁదగిలి హిందువులను వారిమనసు వచ్చినట్లు సంహరించిరి. నఱకఁబడిన హిందువులసంఖ్య లక్షకుఁ దక్కువయుండదు. ఇంతటితో ఆంధ్రుల వైభవమంతయు నంతరించెను. వారెన్నడును మరల గొప్పరాజ్యము సంపాదింపలేదు. అది యట్లుండెను.

మీఁదివర్ణనమంతయు ఫెరిస్తాగ్రంథములోనుండి గ్రహింపఁబడినది. ఆదిల్ శాహా తుదవఱకు రామరాజునకు సహాయమువచ్చి కలిసెదనని చెప్పుచు యుద్ధములో నాలాగుననె వచ్చుచున్నానని తెలిపి మోసముచేసి వచ్చి రామరాజును

అనఁగాఁ దాను తండ్రి యని పిలిచిన వానినిఁ జంపెననియు, నందుమీఁద హిందువులకుఁ బరాజయము కలిగెననియు నొక మరాటీ బఖైరులో వ్రాయఁబడి యున్నది. ఇం దేదినిజమో మనము నేఁడెట్లు చెప్పఁగలము?

## విజయనగర వినాశము.

ఇట్లోడిపోయిన హిందువులు మరల గుమిగూడి తురుష్కుల నెదిరింప యత్నించినవారైననుగారు. వెంటనే విజయనగరమునకుఁ బోయి తమకుటుంబమును ధనధాన్యములను వీలయినంతవఱకుఁ దీసికొని పాఱిపోయిరి. రామరాజు తమ్ములలో వేంకటాద్రి యుద్ధమునందుఁ బడెను. తిరుమలరాజుమాత్రము బ్రతికి వెంటనే రాజధానికి వచ్చి పేరునకు రాజుగానున్న సదాశివరాయలను రాజభవనములోని సంపత్తిని దీసికొని పెనుగొండకుఁ బాఱిపోయెను. ఇతఁడైదు వందల యేఁబదియేనుఁగులమీఁదఁగట్టి బంగారు రత్నములు మాణిక్యములు మొదలైన యపారసంపత్తినిఁ దీసికొని పోయెనఁట. ఇట్లు రాజును సైనికులును లేని యాపట్టణము నిరాధారమై యుండెను. అదివఱకు భయమన్నమాట యెఱుఁగని యచ్చటి జనులు దిక్కుమాలిన వారైరి. పాఱిపోయెదమనినను ధనధాన్యములు తీసికొని పోయెదమనినను వాహనములు లేవు. ఎడ్లు గుఱ్ఱములు మొదలైనవి యుద్ధమునకుఁ బోయి యచ్చటనే మడిసెను. అందుచే జనులు చేయునదిలేక ధనాదుల విడిచి పాఱిపోయిరి. బలాఢ్యులకును సాధ్యముకాని విజయనగరము దొంగల పాలయ్యెను. యుద్ధము జరిగిన రెండవదినము చుట్టుపట్టుననున్న లంబాడి యానాది మొదలగువారు పట్టణమును ఆఱుసారులుదోఁచుకొనిరి. మూఁడవదినమునకుఁ దురుష్క సైన్యములన్నియు వచ్చిచేరెను. ఆఱు నెలలవఱకు నీసైన్యము లాపట్టణమందుఁజేసిన ఘోరకృత్యము లింతంతయని వర్ణించుటకు వీలుకాదు. నిరపరాధులగు నసంఖ్యజనులను సంహరించిరి. రాజప్రాసాదములను భవ్యదేవాలయములను సుందరమందిరములను గాల్చి కూల్చి

పడఁగొట్టి ధ్వంసము చేసిరి. సులభముగాఁ బట్టణమంతయు శ్మశానముగా మార్చి తురుష్కులు వెడలిపోయిరి. ఒక్కొక్క సైనికుఁ డపరిమితమైన ధనమును దోఁచుకొనిపోయెను. బీదసైనికుఁడు గూడ లక్షాధీశుఁడయ్యెనని ముసల్మానులె వ్రాసియున్నారు. విజయనగరరాజ్యభాస్కరుఁ డింతటితో నస్తమించెను.

## తరువాతి రాజులు.

తిరుమలరాజు సదాశివరాయలను దీసికొని పెనుగొండకుఁ బోయెనని పైని వ్రాసియున్నారము. అచ్చట నాతఁడు ౧౫౬౭లో సదాశివరాయలను జంపి తానే రాజయ్యెను. ఇతఁడు విజయనగరమునందు మరల జనులుండునట్లు చేయుటకు యత్నించెను గాని యాతనికోర్కె సిద్ధించినదిగాదు. ఇతని కాలములో విజయనగరమునకు సామంతులుగానున్న రాజులందఱును స్వతంత్రులగుటకు యత్నింపసాగి క్రమక్రమముగా స్వతంత్రులైరి. బెదనూర్ మైసూర్ మధుర తంజావూరు మొదలైన రాజ్యములన్నియు నిందుండి పుట్టినవే.

తిరుమలదేవరాయని వంశజులు కొన్నియేండ్లవఱకుఁ జంద్రగిరిలో రాజ్యము చేయుచుండిరి. ఈ వంశములోనివాఁడగు నాలవ శ్రీరంగరాయల క్రిందఁ జెన్న పట్టణప్రదేశముండెను. అతఁడె ౧౬౩౯వ సంవత్సరమందు మార్చి నెలలో ఈస్టుఇండియాకంపెనివారికిఁ జెన్నపట్టణపు కోట కట్టుకొనుటకుస్థలము కౌలున కిచ్చెను. ప్రస్తుతమునందు ఆనగొంది సంస్థానాధీశ్వరులగు రాజా శ్రీరంగ దేవరాయలవారీవంశమునందు జన్మించినవారే. ఆనగొంది నైజాము రాజ్యములోనున్నది.

## పరిశిష్టము.

గ్రంథమంతయుఁ బూర్తియైన తరువాత 'అచ్యుతరాయాభ్యుదయమ్' అను సంస్కృత కావ్యము నేను చూచుట తటస్థించినది. ఈ కావ్యము పండ్రెండుసర్గములు గలదియైనను నా కాఱుసర్గలు మాత్రము లభించినవి. ఇందుఁ గృష్ణరాయని సవతితమ్ముఁడును, అతనికిఁ దరువాత విజయనగరరాజును అయిన అచ్యుతరాయల శౌర్యాదికములు వర్ణింపఁబడినవి. ఈ కావ్యము రాయలకు సమకాలీనుఁడగు శ్రీ రాజనాథ మహాకవిచే రచింపఁబడినది. కావున నమ్మఁదగిన చరిత్రాత్మకగ్రంథ మైయున్నది. ఇది కావ్యమగుటచే నిందు వర్ణనాత్మకభాగ మెక్కుడుగా నున్నను కష్టపడి వెతకినయెడలఁ జరిత్రాంశములను దొరకఁగలవు. నేను చూచినంతవఱకు దొరకిన చరిత్రాంశముల నిందుఁ బొందుపఱుచుచున్నాఁడను.

### కృష్ణరాయలతల్లి కులకాంతయే:
### భోగకాంత కాదు.

ఈ విషయమై కృష్ణరాయ చరిత్రలో మేము వ్రాసియున్నాము. ఆయంశమే యీ గ్రంథమువలన స్పష్టపడుచున్నది. ఇందు నరసరాజు భార్యలలో ముగ్గురు పట్టమహిషులుండిరనియు, వీరందఱును రాచకన్నియలనియు, వీరిలోఁ దిప్పాంబకు వీరనృసింహరాయఁడును, నాగాంబికకుఁ గృష్ణరాయఁడును, ఓబాంబికకు నచ్యుతరాయఁడును బుట్టిరనియు స్పష్టముగా వ్రాయఁబడియున్నది. ఆశ్లోకములను ఇచ్చట నుదాహరించుచున్నాను. ఈ శ్లోకములు ప్రథమసర్గములోనివి.

ఆద్యైరపి క్షోణిపతిప్రకాణ్డై
రాకాఙ్క్షణీయస్సమయో ఽవతారః ।

వసన్నతస్యాం వసుధాపతీనాం
కన్యామణీః కాఞ్చన పర్యణైషీత్ ॥ ౫౧

అర్థము—పూర్వపు రాజశ్రేష్ఠులుగూడ మనసుపడునట్టి నిజకీర్తి ప్రసారముకలిగి యా నరసరాజు నగరములో వసించుచు, వనేక వసుధాధిపతుల కన్యారత్నములను వివాహమాడినవాఁడాయెను.

తిస్రోన్నృప స్యై త్యభవ న్నభీష్టా
స్తిప్పాంబికా తాసుచ నాగమాంబా।
పట్టాభిషిక్తాః పతిదేవతానా
ముత్తంసభూషామణి రోబమాంబా॥ ౫౨

అర్థము—ఆభార్యలలోఁ దిప్పాంబిక, నాగాంబిక, పతివ్రతలకు శిరోభూషణమగు ఓబమాంబ లను ముగ్గురు రాజునకుఁ బ్రియలుగను పట్టపు రాణులుగను నుండిరి.

తిప్పాంబికాయాం ద్విజసంప దేఽభూ
ద్విఖ్యాతిమా న్వీరనృసింహరాయః॥
నాగాంబికాయాం నరసావనీన్ద్రోః
కీర్త్యాకరోఽజాయత కృష్ణరాయః॥ ౫౩

అర్థము—ఆ నరసరాజు నకుఁ దిప్పాంబ వలన బ్రాహ్మణుల సంపద కొఱకుఁ గీర్తిమంతుఁడగు వీరనృసింహరాయ లును, నాగాంబిక యందు యశోనిధియగు కృష్ణరాయ లును జన్మించిరి.

ఇవి యన్నియుఁ గృష్ణరాయఁడు పోయిన పదునేను సంవత్సరములలో వ్రాయఁబడిన యంశములు. వీనిముందర పుక్కిటిపురాణము లేమి పనికివచ్చును?

కావున నాగమాంబ రాజపుత్రియనియుఁ బట్టమహిషియనియుఁ గృష్ణ రాయలు సద్వంశజాతుఁడనియు నిశ్చయింపవలయును. రాయలు దాసీపుత్రుఁడనువార్త కలలోని వార్తగా నిశ్చయింపవలయును.

## సలకము తిమ్మయ.

ఈ గ్రంథమువలన సలకము తిమ్మయ యచ్యుతరాయల బావమఱఁది యని కానవచ్చుచున్నది. ఇందుఁ 'దిమ్మయ' యను పేరులేదు. కాని సలకరాజ పుత్రుఁడని యున్నది. అచ్యుతరాయల భార్యయగు వరదాంబిక, సలకరాజునకుఁ గూతురయినట్లు ఈ క్రిందిశ్లోకములో వర్ణింపఁబడినది.

## మూఁడవసర్గము.

మహాత్మరే మానవలోకశాసితు
ర్యనోఽనుకూలా మహిషీపదేతదా।
కృతాభిషేకా సలకక్షితీశితు
ర్వరాత్మజాసీద్వరదాంబికావధూః॥ ౪౮

ఈ సలకముతిమ్మరాజు రాయలయొద్ద సైన్యాధిపతిగా నుండెను.

## అచ్యుతరాయచరిత్రలోని కొన్నివిశేషాంశములు.

అచ్యుతరాయలకుఁ జిన్నవేంకటాద్రి యని కుమారుఁడుండెను. పెదవెంకటాద్రి యని రామరాజు తమ్మునికిఁ బేరుండినందునఁ గాఁబోలును ఇతనికిఁ జినవెంకటాద్రి యని పేరువచ్చెను. ఇతఁడు యువరాజ పట్టాభిషిక్తుఁడయ్యెను.

కేరళదేశపురాజయిన తిరువడీశ్వరుఁడు విజయనగరపు రాజుల కంకితుఁడగు పాండ్యరాజుయొక్క రాజ్యమును హరించి, విజయనగర

రాజుల శత్రుడగు చోళరాజునకు నాశ్రయమిచ్చెను. అందువలనఁ గోపము వచ్చి యచ్యుతరాయ లు యుద్ధయాత్రకు వెడలెను. దక్షిణ మార్గమున బయలుదేఱి చంద్రగిరి, తిరుపతి, కాళహస్తి, కాంచి, తిరువన్నమలై అనుస్థలములదాఁటి శ్రీరంగము చేరెను. అచ్చటఁ దానుండి, సలకము తిమ్మయను తిరువటేశ్వరునిమీఁదికిఁ బంపెను. త్రావన్కూరు రాజులకు తిరువటేశ్వరులని బిరుదు నామము. సలకముతిమ్మయ మధుర మీఁదుగాఁ బోయెను. తిరువటేశ్వరునకును, సలకముతిమ్మయ సైన్యములకుఁ దామ్రపర్ణి నదియొడ్డున ఘోరమైన యుద్ధముజరిగి విజయనగర సైన్యమునకే జయముకలిగెను. తిరువటేశ్వరుఁడు శరణుచొచ్చెను. తిమ్మయ యాతనిఁ గాచి యతనికి నాతని రాజ్యమును, పాండ్య చోళ రాజులకు వారివారి రాజ్యములు నిచ్చెను.

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల.

## బహుమానములు.

౧. శాశ్వతపు చందాదారులఁ జేర్చువారికి రాఁబోవు గ్రంథపు వెలలోనుండి చందాదారు 1-కి 0-4-0 లు చొప్పున తగ్గించఁబడును.

౨. అయిదుగురు శాశ్వతపు చందాదారులఁ జేర్చువారికి మా గ్రంథమాలలో రాఁబోవు గ్రంథముగాని మరియే గ్రంథముగాని యుచితముగా నీయఁబడును.

౩. ఇరువది యైదుగురు శాశ్వతపు చందాదారులఁ జేర్చువారిని మా గ్రంథమాలలో చందాదారులుగాఁ జేర్చుకొని మా గ్రంథములన్నియు నుచితముగా నిచ్చుచుందుము.

౪. మా శాశ్వతపు చందాదారులకు [illegible] మేమప్పుడప్పుడు ప్రచురించుచుండెడి 'అనుబంధ' గ్రంథములు ఉచితముగా నీయఁబడును.

క్రొత్తచందాదారులు మా గ్రంథములను కొనువారుగా నుండవలెను. వి. పి. లు త్రిప్పివేసి మమ్ముల నష్టపరచు వారుగా నుండగూడదు. ఈ యంశమును మా ప్రాత చందాదారులు బాగుగా గమనించవలెను.

మేనేజరు, విజ్ఞానచంద్రిక.
చింతాద్రిపేట, మద్రాసు.

# విజ్ఞానచంద్రికా బుక్కుడిపో.

మా చందాదారులలో ననేకులును, చందాదా కానివారలలో పెక్కుమందియు తమకే గ్రంథము కావలె మాగ్రంథములతో పాటు పంపవలసినదిగా గోరుచు ఉ ములు వ్రాయుచున్నారు. మావద్ద 'లేవు' 'లేవు' అని వ్రా టకు విసుగుగానున్నది. కాబట్టి ఆంధ్రభాషా సేవకు సమక మావిధి మేము నెరవేర్పవలెనని యెంచి ఇతరగ్రంథ లేవయినను మేము పంపుటకు పూనుకొని "విజ్ఞాన చంద్రి బుక్కుడిపో" యను పేరుతో నొక పుస్తకాలయమును, వి చంద్రికా గ్రంథమాలకు ఉపాంగముగా స్థాపించినావ సంస్కృతములోని స్మృతులు, పురాణములు, నాటకము కావ్యములు, ఆంధ్రములోని ప్రబంధములు, నాటకములు, లలు, వచనకావ్యములు చరిత్రలు మున్నగు ఎట్టి గ్రంథ కావలసినను మాకు వ్రాయునెడల మేము సప్లయిచేయుదు. మంచి పుస్తకములు నిజమైన వెలలకే ఇయ్యబడును. గ్ర ములపేర్లు, చిరునామాలు పూర్తిగా విశదముగా తెలి లాగున వ్రాయవలెను. ఉత్తరములు ఇంగ్లీషునగాని తెలుగు గాని వ్రాయవచ్చును. మా క్యాటలాగులు చూడకోరెదవ

చింతాద్రిపేట, మద్రాసు. } ఆ. లక్ష్మీపతి, బి. ఏ, ఎం. బి, సి. ఎం., మేనేజ